శిష్య : అంగీకరింప కేమి, వ్రాసేవి అంతో యింతో అసత్యంగా కన పడుతూన్నప్పుడు అట్టిమాటలు అపహాస్యాస్పదంగా వుంటా యని నేను జంకుతాను.

గురు : నీవు జంకు టట్లుంచు, ఇతరులు జంకినట్టుకూడ ప్రకటింప సాహ సించెదవు "ఆత్మవత్సర్వభూతాని" కదా?

శిష్య : (తనలో) యిదేమిటిచెప్మా? (ప్రకా) యిదా? శృంఖలాన్ని ప్రకటించడానికి తాము జంకా రని నేను వ్రాశా నని యెత్తి పొడుస్తూ వున్నారు గురువుగారు.

గురు : బాగుగా గ్రహించినావు. అలాటి జంకులు, గింకులు నాకు లేవు సుమా? ఏమనుకొన్నావో? నీవు. నేఁట రేపట దానిని ప్రకటించె దను చూడు.

శిష్య : తమచిత్తానికి నే నెవణ్ణి గాని దాన్నిమాత్రం ప్రకటించకండి.

గురు : కాశీపండితులు లోనగువారు పలువురు దానిమీఁద సదభిప్రాయా లిచ్చిన దెఱుఁగ వనుకొందును.

శిష్య : చెరలాటంలో, తమరు, నవద్వీపం, కలకత్తా, వగయిరాగ్రామాలు చాలా యేకరువు పెట్టేరు. చూచే వున్నాను. నాకు దొరికినప్రతిని బట్టి చూస్తే అది తెలుఁగులో వుంది. అభిప్రాయా లిచ్చినపండితు లుండే మావూళ్ళల్లో చాలాచోట్ల తెలుఁ గున్నట్లే లేదు.

గురు : తెలుఁగే యున్నదో? సంస్కృతమే యున్నదో? అంతయుఁ దెలియ నయ్యెడిని. ప్రకటించుచున్నాఁడను గదా?

శిష్య : ప్రకటించకండని మనవి చేసుకున్నాను. అందులో నామా టల్లా వుండఁగా మీకంటె విద్యావయోవృద్ధులైన చాలామంది పెద్దల్ని చాలా నీచంగా "తద్దినం బెట్టే వాఁడితమ్ముఁడు" వగయిరా పరిహాసోక్తులతో తిరస్కరించి వున్నారు. వారందఱికంటేకూడా

మీరు గొప్పవా రయితే కండి గాని యెంతగొప్పవా రైనా వార్త ఆలా వుండకూడదు. వారు మీవార్తను లక్షించరే అనుకోండి, చదువరులు హేయంగా భావిస్తారు గదా ! ధార్ష్టికపంతులు, లొడారి బుచ్చిగాఁడు, వగయిరాలతో పాటిదే అనుకోండి శృంఖలాన్ని, పయిఁగా పద్యాలు తగలఁబెట్టుకోమనడం వకటాయె, దా న్నే పండితుఁడు సమర్థిస్తాఁడు. మీరేదో కార్యం కోసం యేరాజునో దర్శించడానికెడితే ఆయన యేమని యెత్తిపొడిచారో? జ్ఞాపకం తెచ్చుకోండి. (లొడారి బుచ్చిగాఁడు)

గురు : (తమలో) వీఁడు తన శనిగ్రహము, కామేశ్వరి, గీరతము, లోనైనవానిని మఱచినట్లున్నాఁడు (ప్రకా) దానిలో "కాలీన" లోనైన శబ్దముల విషయ మున్నది గదా? దానిలోనేనా జయము వచ్చితీరును.

శిష్యు : దానిలోనూ జయం రాదు, విద్యారణ్యులు, శంకరులు, వీరుకాక యావత్తర్కశాస్త్ర గ్రంధనిర్మాతలు, మహాకవిదండి, యిందఱు ప్రయోగించా రని నాకు తెలుసును. తక్కిన రామానుజ మాధ్వ భాష్యకర్తలు కూడా వాడే వుంటారు. యిందులో విద్యారణ్యులు వ్యాకరణంలో కూడా గ్రంధకర్త. తరువాత తమచిత్తం.

గురు : ఏమైనను కౌముదిలో భట్టోజీదీక్షితులు త్రోసివేసినది బ్రదుకదు. ఇదినిశ్చయము.

శిష్యు : దీక్షితులు తోసివేసినా బతికేవిన్నీ క్వాచిత్కంగా వున్నాయి. పని పడ్డప్పుడు మనవిచేసుకుంటాను. యిప్పుడు గ్రంధవిస్తర మెందుకు?

గురు : నీవాదమంతయు ప్రతివిషయమునందును నిష్ప్రయోజనమని యుండెడిని. వెనుక వైకర్తన వాదములో నాకనుభూతమైనది. పైఁగా నాభారతమును కూడ "చింత్య" మన్న ప్రబుద్ధుడవు.

శిష్య : అదుగో! మళ్ళాదీన్ని జ్ఞాపకం చేస్తూన్నారూ గురువుగారు. వైకర్తన శబ్దానికి వకచోట మీరు సూర్యపుత్రుఁడని పుటనోటు వ్రాస్తిరి. గ్రంథభాగంలో "సహజ కవచకుండల కర్తనాత్కార్ణః" అనే అర్థాన్ని అవలంబిస్తిరి. చింత్యమనక యేమనేది? సెలవియ్యండి.

గురు : నీతో నేనేమేని వాదించితినా! కార్డుమాత్రమొకటి వ్రాసి విరమించినాను.

శిష్య : ఆ కార్డుకూడా నేను దాఁచేవుంచాను. దానిలో వున్న మాటలుకూడ గర్వస్ఫోరకములు. నేనుగర్విష్ఠినే కనుక నాబోటివాళ్ళు వ్రాస్తే నేమోతప్ప మీవంటివారు వ్రాస్తే బాగుండేవి కావు.

గురు : దానిలో గర్వమెక్కడ స్ఫురించు చున్నదో చూపించు.

శిష్య : యిదుగో చిత్తగించండి. 91 అన్నాపిళ్ళవీధి 2—4—23 మద్రాసు. ఆశీర్వచనములు.........ఇదినేను వ్రాయుచున్నాననే మీయభిప్రాయమైనట్లు సూచింపఁబడుచున్నది. నేనువ్రాసిన మీకును మీకును చోటుంచి వ్రాయనెంచను. నాభారతములో వ్రాసినయంతకును నే సమాధానము చెప్పఁగలను. అది తప్పనికాని, ప్రమాదమనికాని, చింత్యమని, తెలివిలేమియని కాని వ్రాసిన వ్రాఁతలు నిరస్తములు కాఁగలవు.........చేవ్రాలు. చూచితిరా? దీనిశైలియెట్లున్నదో? శిష్యుఁడిపేర వ్రాసే వ్రాఁతకనక చిక్కులేదనుకోండి. వేఱొకరిపేరనే అయితేనో?

గురు : ( తమలో ) నిజమే యితఁడన్నమాట. పరస్పర విరోధము కనవచ్చుచున్నపుడు నేనా ప్రగల్భోక్తులు వ్రాయుట బిభీషికామాత్రమే ( ప్రకా ) అంత పెద్దగ్రంథము వ్రాయునపు డామాత్రము విరోధముండుట సహ్యముకాదా?

శిష్య : అట్లనడాని కెవఁడికి నోరొస్తుంది. అయితే "చింత్య" మని యెందుకు వ్రాయాలంటారేమో ? నావాదంలో దాన్ని సమన్వ యించవలసి వచ్చింది. యెదటివాళ్ళు మీ గురువుగారే వ్రాశారు చూడండి, అనడానికి సిద్ధపడ్డారు. అప్పుడు నాయొక్క శాయశక్తులా యత్నించి తుదకు "చింత్యం" అనక తప్పిందికాదు. యథార్థ మైనా అదికూడా మీకు కోపకారణమయింది.

గురు : ఏమైనను గురుశిష్యభావమున్నపుడు నావాదమునకు తోడ్పడుటయే యుక్తముకాని వ్యతిరేకోక్తులు వ్రాయఁగూడదు.

శిష్య : అవకాశ మున్నంతవఱకు ఆలాగే కాలంగడిపాను. శిష్టావారున్నూ మీరున్నూ మేఘసందేశ విషయంలో వాదోపవాదాలు చేసుకుంటూ వున్నప్పుడు అభిప్రాయానికని నావద్ద కుత్తరాలొచ్చాయి. మెల్లిగా తప్పుకున్నాను. అవి వుదాహరిస్తే గ్రంథం పెరిఁగిపోతుంది. ఆవిమర్శనంలో మఱీ అనాలోచితంగా తమకలం పరుగెత్తింది. కణప, ఫణిప, యీ రెండుశబ్దాలనీ మీరు పరిశీలింపక ఆక్షేపించారు. "కణపయితాహే.... ఫణిపయితాహే" అనే పెద్దమహా మహుని ప్రయోగాన్ని ఆశాస్త్రుల్లుగా రుదాహరించారు వాగ్బంధంలో. ఆమహామహుఁడు "కోశస్నాచార్యః" తెగలోవాఁడు. మాబోట్లకు దానితో వాగ్బంధం కాకతప్పుతుందా ? వారుంచినపేరు సార్థకమయిందనుకొన్నాను. వూరుకున్నాను. యీలాటివెన్నో చూపఁ గలను తమరు తొందరపడ్డవి.

గురు : నీవు తొందరపడ వనుకొందును.

శిష్య : పడననే మనవి చేసుకుంటాను. పైఁగా అంత అనాలోచితంగానూ పేలవంగానూ విమర్శించడమే కాకుండా "చాకలిచే జవాబు చెప్పించడమంటే, ఆ విమర్శించేపుస్తకం పెంటమీఁద దొరికిందంటే, చచ్చుతర్కమంటే, పుచ్చుతర్కమంటే యెన్నో అప్రగ

శ్లోకక్తులు కూడా వాడివున్నారు. అవిచూచినప్పుడు నేనెంతో నొచ్చుకునేవాణ్ణి. శాంతివ్యాసంలో యీ అంశాన్ని సూచించే వున్నాను. చిత్తగించే వున్నారుకదా?

గురు : అట్టిమాటలన్నియు, అవసరమునుబట్టియే వాడియుందును. నీవు నొచ్చుకొనుటకేమిలే. పరోపదేశవేళయం దందఱును మిన్నలే.

శిష్యు : యీమాట యిదివఱలో "శృంఖలం"లో నన్నుగూర్చి వాడించే. పైఁగా దానిలో కామేశ్వరీశతకాన్ని కూడా తమరు యేదోవిధపు కవిత్వంగా నిర్ణయించారు. యిట్టిహోకడ యిదివఱకు కవితా ప్రపంచంలో లేనేలేదని శ్రీజయంతివారు లోనైనప్రాజ్ఞులు మెచ్చుకొన్న గీరతాన్నిన్నీ తమరు యెట్లో యీసడించి వున్నారు. ఆయీవిషయాలు "ముక్త్యాల" వ్యాసంలో కొద్దిగా వ్యాఖ్యానం చేసే వున్నాను. కాని "శృంఖలంలో" నన్ను తాము యింకా యెంతనికృష్టంగా అనుగ్రహించారో దాన్ని యీవత్తూ మాత్రం కనపఱచలేదు. దాన్ని మళ్ళా ప్రకటించుతామని గురువుగారు "చెఱలాటం" లో వక్కాణించడంచేత నేనుమానిన విషయం కూడా తమద్వారాగానే లోకానికి తెలుస్తుందిగదా? అని సంబర పడుతున్నాను.

గురు : నీ సంబరమున కేమిలే, శృంఖలమును ప్రకటించి తీరుదును.

శిష్యు : యెందుకు మనవిచేస్తూ వున్నానో బాగాఆలోచించండి. శృంఖలాన్ని మాత్రం ప్రకటించకండి. లోకంకేసి దృష్టిప్రసరింపఁ జేయండి.

గురు : నాకు లోకముతోడను, నీకముతోడను పనిలేదు. ప్రకటింతును.

శిష్యు : యిటుచిత్తగించండి. లోకమంటే మనవి చేస్తూన్నాను. శ్రీకాంచన పల్లె కనకమ్మగారు మనవుభయులకును మాననీయురాలేకదా? ఆపె "యీతని పాదమ్ములు గొల్తు రేన్గుపై నెక్కకవుల్" అని వక్కాణించింది. యెన్నాళ్ళనుంచో మీచే సంశయింపఁబడు

తూవున్న నా గురుభక్తి ఆబిడ కెందుకు నచ్చిందో విచారించండి. ఆసభలోనే శ్రీ దేశోద్ధారకు లేమంటూ వున్నారో? తిలకించండి. "సుగృహీత నాములగు శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిల వారికి గురువులగుటచేతను అగ్రిపూజ కర్హులు" అన్నారు. తాము నాశిష్యత్వంవల్ల వచ్చేగౌరవం లేశమున్నా లేదన్నారు "శృంఖలం" లో. పైవారు మీయెడల వకభావమున్నా నాయెడల వక భావమున్నా కలవారు కారని లోకంతోపాటు తామున్నా అంగీకరిస్తారని నావిశ్వాసం. మనమూ మనమూ యేంవ్రాసు కున్నా లోకాన్ని చూస్తూవుండాలని నామనవి. లోకానికా శృంఖలం బొత్తిగా రుచించేది కాదు. కాఁబట్టి ప్రకటించవద్దని మనవి చేసుకుంటూవున్నాను. మీకు పదివేల నమస్కారాలు. నామనవి చిత్తగించండి.

గురు : (తొందరగా) నీకు పదికోట్ల ఆశీర్వచనాలు. దానిని ప్రకటించి తీరుదును.

శిష్య : యింక యితరధోరణిలోకి వెళ్ళకండి. ఆ ఆశీర్వచనాలు ప్రసాదించండి. యింతటితో మన వాదోపవాదాలు ముగించుకుందాము. లోకంయొక్క అభిప్రాయం అలా వున్నట్టు వుత్తరాలు వస్తూవున్నాయి.

గురు : (తనలో) ఓహో? యిది తుట్టతుదకు "ముద్రారాక్షస" నాటకమువలె పరిణమించుచున్నదే, నిజానకు వీఁడు అంతఃకరణశుద్ధికల శిష్యుఁడు. నేను వీనియెడల నపోహ పడినట్లు విస్పష్టమగుచున్నది. కావున నాశీర్వదించెదఁగాక. (ప్రకాశము) నిరోగశతాయుష్యమస్తు. వంశాభివృద్ధి రస్తు. సర్వశ్రేయస్సమృద్ధిరస్తు........"

శిష్య : (వినయముతో దోసిలియొగ్గి) పరిగృహీతం శిరసా తీర్థపాదాశీర్వచనమ్.

(షరా) అయ్యా గురువుగారు ఆయాయి సందర్భాలు సంజికి బారెడు హెచ్చుతగ్గుగా వ్రాస్తూవున్నారే కాని సప్రమాణంగా వ్రాయడం లేదని తమకు పైని ప్రశ్నోత్తరాల్లో చూపిన ఆధారాలవల్ల స్పష్టపడి నట్లయితే దీన్ని ప్రకటించండి. నేను చూపిన ఆధారాలు సరియైనవి కావని మీహృదయానికి తోస్తే ఆపివేయండి. నేను వారియెడల కృతజ్ఞుఁడనా? కృతఘ్నుఁడనా, అనే అంశం తేల్చుకోవడమే నాపనిగాని జయేచ్ఛ వగైరాలుకాదు. అవి యిదివఱకే తేలివున్నప్పటికీ, శ్రీవారికౌమార్త కవిత్వ విషయం వగైరా కొన్ని సందర్భాలు లోకులకు అపోహను కలిగిస్తాయేమో అని దీన్నివ్రాశాను కాని లేకపోతే వ్రాయను. కాఁబట్టి సర్వాధికారాలు మీ మీఁదపెట్టినాను. విక్రమ చెళ్ళపిళ్ళ, అనేవ్యాసం ఈ వివాదకి సందర్భించింది కాదుకనుక మొదలుపెడితే బాగుండునేమో? చెరలాటంలో వక మాటకూడా ప్రస్తుతానికి సంబంధించినట్టు నాకుతోఁచడం లేదు. మీకేలా తోస్తూవుందో. అన్యబుద్ధి యప్రత్యక్షము గదా? మీ యభిప్రాయానుసారము చేయఁగోరెదను.

---

# మ హా నై వే ద్యం

( 29—8—1936 సం॥ర కృష్ణాపత్రిక నుండి )

శ్రీగురువులవారు "చెరలాటం" మొదటిభాగంలో చూపిన తప్పుల పట్టికలో కొన్నింటికి "వట్టి అమాయికులు" అనే వ్యాసంలో సమాధానం కనపఱచి వున్నాను. అందులో కొన్నిటికి శ్రీవారి భారతాన్నుంచే ప్రయోగాలు చూపి వున్నాను. కొన్నిటికి మాత్రమే చూపడంవల్ల ఆ వ్యాసం "అవసర నైవేద్యం" అనుకోవలసి వచ్చింది. యిప్పుడు తక్కిన వాటికి యావత్తుకూ, అనఁగా "చెరలాటం" మొదటి భాగంలో గురువుల వారు యెత్తుకొన్న వాటికి అన్నిటికీ "సున్నకు సున్నా, హళ్ళికి హళ్ళి"

గా జవాబులు వ్రాయడంచేత దీనికి "మహానైవేద్యం" అనే పేరు యుక్తమని అట్లా వుంచడమయింది. నేను చూపిన సమాధానాలనుగూర్చి గురువులు 'హరీ లేదు అచ్చుత లే' దన్నట్లు తూష్ణీంభావాన్ని వహించి మళ్ళా ప్రజాసేవలో తప్పులంటూ చూపడానికి ఆరంభించారు. అవిన్నీ మిక్కిలి శోచనీయావస్థలోనే వున్నాయి. మచ్చుకు కొంచెం చూపుతాను.

బొబ్బిలి పట్టాభిషేకానికి ప్రారంభం—"శా. చేసెన్ దీనిని వేంకటేశుఁడనుచున్" అనేదికాదు, "క. సిరియును సంపద" అనే కందపద్యం. అచ్చులో గ్రంథారంభ పద్యం వున్న భాగానికి పూర్వమందు కృతిసమర్పణ పద్యాలున్నాయి. వున్నప్పటికీ యేమాత్రం పరిశీలన వున్నవారేనా గురువులు అయితే ఆరంభం యెక్కడినుంచో గుఱితించవచ్చును. అట్టి పరిశీలన లేనికారణంచేత, గ్రంథారంభం యెక్కడనుంచో తెలిసికొనలేక వెక్కిరించడానికి మొదలు పెట్టారు. యీ అంశం షష్టిపూర్తి ముద్రణం చూచినవారి కందఱికీ విస్పష్టం అవుతుంది. ఆ ముద్రణంలో "క. సిరియును సంపదయును దామర తంపరగా నొసంగి" అనే పద్యంతోనే గ్రంథం ఆరంభమయి వుంటుంది. వక "విమర్శకబుధుఁడు" యీమధ్య మా 'ప్రభావతీప్రద్యుమ్నా'న్ని యిట్టి రీతిగానే విమర్శించి పరిహాసాస్పదుఁడై 'క్షమాపణ'కు అగ్గమైనాఁడు. ఆ విషయం అన్యత్ర తెలుస్తుంది. బొబ్బిలి పట్టాభిషేకం శ్రీ మహారాజావారు చెన్నపురిలో అచ్చువేయించినారు. అందువలన, వేఱుగా వ్రాసివున్న కృతిసమర్పణ పద్యాలను చివర వేయవలసి వున్ననూ మొదటవేసినారు. వేసినప్పటికీ గ్రంథారంభం యెక్కడనుంచో తెలియక పోవడంలేదు. షష్టిపూర్తిముద్రణంలో ఆ పద్యాలు అసలే గ్రంథాన్నుంచి తొలఁగించి నానారాజసందర్శనంలో చేర్చివున్నారు. గురువులవారు అవిమృశ్యకారు లనుకోవడానికివున్న వందలకొలఁది సాక్ష్యలలో యిది మొదటికి వస్తుంది. యిట్టిపరిశీలనతో విమర్శించేగురువుల విమర్శన యెంత యుక్తంగా వుంటుదో నేను వ్రాయడం అవసరంలేదు. మొదటిముద్రణంలో వక కందపద్యంలో గణములు వ్యత్యాసంగా వున్నాయి.

ఒక పద్యంలో, "ఆధరణీభర్త" అనడానికి "భూధరణీభర్త" అని పడ్డది. రెండవ ముద్రణంలో యీ అచ్చులోపాన్నిన్నీ మఱికొన్నిటినిన్నీ సవరించి వున్నాము. కాని యేదో వక పద్యంలో వక చరణంలో మాకు అంగీకారంగాని విశ్రమం పడ్డది. అది సవరించివుండలేదు. గురువుగారు పాపం వట్టి అమాయికులు. ఆ యీ విషయాలు గమనించక మొదటిముద్రణాన్నే పట్టుకు వేళ్ళాడతారేమో! యిప్పటికే అపహాస్యత్వం దుర్నివారంగా వుంది. అప్పుడు మఱీ దుర్నివారం అవుతుందని యింతగా మనవిచేసుకోవడం. గ్రంథానికి మొదలేదో, తుదియేదో గమనించనివారు విమర్శించే విమర్శన బాగుండ దని వేఱే వ్రాయనక్కఱలేదుకదా! అయినా యిప్పుడు మళ్ళా ప్రారంభించిన అమాయికపు తప్పుల జాబితాలోన్నుంచి వక్క యితరాక్షేపణకూడా చూపి ప్రధానాంశానికి వుపక్రమిస్తాను.

"ఎందయినను మొదటిసృష్టికంటె తరువాతసృష్టియే చక్కఁగానుండును" అంటూ కొంత వ్రాసి "ప్రతిప్రభవాబ్దము" అన్నపద్యాన్ని వెక్కిరించారు. ఆ వెక్కిరింపులో "చిత్తువ్రాయడం - సాపువ్రాయడం" వగయిరా తమకుఁగల అనుభవాన్ని ప్రకటించారు. సమ్మతమేకాని గురువులవారు మేఘసందేశంలోవున్న "సృష్టి రాద్యేవ ధాతుః" అనే కాళిదాసోక్తిని యేమిచేయఁదలఁచినారోకదా? తాము వ్రాసిన రీతిన్నీ అనుభూతమే. నేనువ్రాసిన రీతిన్నీ అనుభూతమే. కాఁబట్టి "ఉదితానుదితహోమము" వలె ఉభయాన్నీ స్వీకరించ వలసివుండఁగా యెందుకో ఆక్షేపించడం? అపహాస్యత్వంకోసమే. పైఁగా "దగ్గఱ నున్న భర్తనిది" అనే పద్యంలో "భర్త" అంటే "మొగుఁడే" అర్థంకాని, "రాజు" అని లేదంటూ ఆక్షేపించారు. నిఘంటు చూచుకోవలసిందని హెచ్చరిస్తూ, "చెరలాటం" రెండోభాగమంతా యీలాగే వుంటుందని చదువరులకు మనవిచేస్తూ మొదటిభాగంలోవున్న ఆక్షేపణలకు జవాబులు వ్రాసి "గురువు శిష్యుఁడయ్యె, శిష్యుఁడు గురువయ్యె" అన్న లోకోక్తికి వుదాహరణం అవుతాను. యిది తప్పేఅయినా గురువులే తెచ్చి

పెట్టింది కనక వుపేక్షించడానికి వీలులేదు. గురువులది పిడివాదం అన్నందుకు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు నిరసించిన నిరసింపును గమనించిన్నీ దానికి తమకనుకూలించేటట్టు అర్థంవ్రాసుకోవడమే సాక్ష్యమిస్తుంది. యిట్టి పిడివాదంవారిశంకలకు కొంచెంగా గాని విస్తరించిగాని బాగా ఆలోచిస్తే అంతకాని కొంతగాని అవసరమని ప్రాజ్ఞలోకం అనుకోదనిన్నీ యెఱుఁగుదును. కాని యీ మిషమీఁద నా అనుభవాన్ని నన్ను ప్రేమించే నవకవులకు తెలియపఱచాలనే వూహతో వ్రాస్తూవున్నాను.

(1) " 'బలవశులు' గ్రామ్యోక్తి, 'బలవంతు' లనందగు" అనిశంక. "బలవంతు" లనేపదం "బలవశులు" అనేదాన్ని గ్రామ్యంగా చేయనేరదనిన్నీ, ఆ పదం యెట్టిసంస్కృతమో యిదిన్నీ అట్టిసంస్కృతమేననిన్నీ, రూపభేదమేగాని అర్థభేదం అంతగా లేదనిన్నీ, తాత్పర్యంలో అసలే భేదం లేదనిన్నీ, ఆ పదం బలవచ్ఛబ్దానికి తత్సమంలో బహువచనరూపమనిన్నీ, ప్రస్తుతరూపం బలవశ శబ్దానికి తత్సమంలో బహువచనరూపమనిన్నీ సమాధానం. యింకా కావలస్తే, పరవశః, పరవశుఁడు, పరవశులు, అనే రూపాలుకూడా చిత్తగించవలసి వుంటుంది. లోకంలో, అతఁడు బలవశి, అనికూడా వుంది. అదిన్నీ రైటేకాని, దాని బహువచనం మాత్రం "బలవశులు" అని వుండదు. సకారఘటితంగా "బలవసులు" అని వుంటుంది.

(2) "మధ్యమధ్య, పోవుచు—మువర్ణకము లేకప్రయోగములు మృగ్యములు" అని శంక. మృగ్యము లవడంలోనే వెదికితే ప్రయోగాలు దొరుకుతా యనే మాట స్ఫురిస్తూవుంది. వెదకడమూ అయింది. దొరకడమూ అయింది.

(౧) 'ఈ మధ్యమాతో' (౨) 'వర్ణంబుల మధ్యను' (౩) 'కర్తల మధ్యను.' యింకా బోలెఁడున్నాయి. యివన్నీ ఆక్షేపకులు గురువులని వ్రాసికొన్న శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారి గుప్తార్థప్రకాశికలోవి. వ్యాకరణ విషయానికి వ్యాకరణంలోవి యివ్వడమే మంచిదిగదా?

(3) "అందున—ఇందున—సప్తమీప్రత్యయమగు నంపైని నకారము తప్పుకాకపోదు" అని ఆక్షేపణ. నకారము తప్పైనా కాకపోయినా, ప్రశ్నలో "ఇందున" అన్నది చేర్చడం పూర్తిగా తప్పు. 'ఇంపు' అధికరణార్థకావ్యయమే కదా? దానిమీఁద నకార మెందుకు చేరకూడదు? యిఁక 'అందు' మీఁద నకారానికి ప్రయోగాలు. "సీ.... చపలత్వ ముడిగి భాద్రపదంబునందున జపమొనర్చితి" అని జైమిని భారతం. అందాఁకా యెందుకు? "శా. తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చేతంబూనితి న్నీవు నా యుల్లమ్మందున నిల్చి" అని శ్రీమద్భాగవతపీఠిక. ప్రపంచకములో ప్రతి అక్షరాన్యునికిన్నీ పైపద్యం వచ్చును. దిద్దుతామంటారా? దిద్దండి చూదాము. "సీ.....జతుగృహమ్మందునఁ జావకుండ" శ్రీమద్భాగవతం ప్రథమస్కంధం. యింకా యింకా బోలెఁడున్నాయి. యిప్పటికివి చాలును.

(4) "అందుకు, యిందుకు ఇవి శబ్దదోషములు" అని శంక. యే వకటిరెండోతప్ప గురువుల జాపితా యావత్తున్నూ శబ్దదోషాలమీఁదే నడిచింది. అందుచేత యిక్కడ "శబ్దదోషములు" అని వక్కాణించడం వ్యర్థం. యిఁక సమాధానం.

(౧) "మ.....ఇందుకు సుద్వృగ్జాలంబు రాఁజెల్లునే" వసుచరిత్ర.
(౨) "ఎందుకు" గురుగురువుల గుప్తార్థప్రకాశిక.
(౩) పన్నుకు — నిజాముకు — యివి గురువులవే.

(5) "చేతురు, కోతురు— ఇట్టివి వేనవేలు" అని ఆక్షేపణ. యిందులో వేనవేలు అనడం అతిశయోక్తి. వేలుకాదు లక్షలు ప్రయోగించినా తప్పులేదుకదా? చిన్నయ్యసూరిగారు అసాధువులన్నారంటారా? అది ఆయన ప్రమాదము. "గచ్ఛతస్స్ఖలనం న దోషాయ" కదా? తన వ్యాకరణరచననాఁటికివున్న ప్రయోగాలనే, అందులో యెవరివోకాదు, తిక్కన కవిబ్రహ్మగారి ప్రయోగాలనే చూడకుండా అసాధువులనడం

ప్రమాదంకాక మఱేమి ? గుప్తార్థప్రకాశికలో "మ.....సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టలుకన్. భార - విరా—" అన్నది యిచ్చివున్నారు. నేను దీన్నే కాక మరికొన్నిటిని భారతాన్నుంచే యిచ్చి, శ్రీనాథాదులవిన్నీ యిచ్చి "పాశుపతం" లో చర్చించి వున్నాను. అందులో కూచిమంచిసార్వభౌముని, "మ. తనరార న్నుతిసేతు సేతుహిమవత్" అన్నది మఱీ కంఠం ముడి పట్టుకొనే తెగలోది. యింకా దీనిమీఁద ఆత్మవంచనకు కొంకని పద్ధతిని వాదానికి వుపక్రమించవచ్చును. కాని నిలవదు.

(6) "అందచందములు — ఇది తప్పు" తప్పుగాదు. ప్రౌఢ వ్యాకరణం ౫౫-వ పుట చూస్తే తేలుతుంది. అందాఁకా యెందుకు? బాలవ్యాకరణ వ్యాఖ్యానం గుప్తార్థప్రకాశిక చూచినా తేలుతుంది. ఆ వ్యాఖ్యానంలో యేమన్నారంటే: "తెలుఁగులో నీ ద్వంద్వసమాసము తఱచు స్త్రీసమంబై (ప్రథమైక వచనము లోపించు పదమై) యుండవలెను...." అని కొంత వ్రాసి "అందచందములు" అని వుదాహరించారు. ఆక్షేపించేటప్పుడు వోపికపెట్టి ఆయా గ్రంథాలు తిరగేసి చూడాలి. లేదా? వృథాగా ఆక్షేపకులకేకాక యితరులకుకూడా శ్రమకదా! అదిన్నీకాక విమర్శనమంటే పైపైని లేదు. కట్టూరి మహాశయు లేమన్నారు? "విమర్శకులకు గ్రంథకర్తనుమించిన పాండిత్య ముండవలె" అన్నారు. తుట్టతుదరోజుల్లో ఆయనకూడా నాలాగే కొంత వ్యర్థపరిశ్రమ చేయవలసి వచ్చిందికాని, ఆయనది యింత వ్యర్థంకాదు.

(7) "రాజితప్రేమ— ఇత్యాదులెన్నో సంయుక్తపూర్వము గురువు కాకుండ తేల్చివేసిన తప్పులు కుప్పలు" అని ఆక్షేపణ. సంయుక్త పూర్వం గురువయితీరేమాట సత్యమేకాని, రేఫసంయుక్తపూర్వం అయితే గురుత్వం వైకల్పికం అన్నది ప్రాచీనుల తీర్పు. వృత్తరత్నాకరంలో చూస్తే యీసంగతి కొంత తేలుతుంది. అందే శ్లో. "అల్పవ్యయేన సుందరి। గ్రామ్యజనః" అని ప్రయోగం. పైఁగా మృచ్ఛకటికప్రకర

ణంలో శ్లో. "దారిద్ర్యా ద్ధ్రియమేతి హ్రీపరిచితః" అని ప్రయోగం. భారతంలో నన్నయగారివి చాలా వున్నాయి. శ్లో. "క్షితిం ప్రాప్తా త్యర్కిదేక్కాణసంస్థే" అని వరాహమిహిరాచార్యులు. యీ మన జ్యోతిష్కులనటానికి వల్లకాదు. మహావైయాకరణుఁ డని కల్లూరిమహా శయులు. వీరూవారూ యెందుకు? ఆక్షేపకులు యెవరికె యేకలవ్య శిష్యుల మనే అభిప్రాయం కలవారో అట్టి శ్రీనాథుఁడు తా నేమహాంథలో నిరాటంకంగా కవిసార్వభౌమ బిరుదాన్ని పొందివున్నాఁడో ఆ అంశాన్ని తెల్పిన సీసపాదంలోనే వుంది. చిత్తగించాలి—

సీ. ... చంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
బొదుకొల్పితి సార్వభౌమబిరుదము.

(8) "ఒకరా? యిద్దఱా— నిత్యైకవచనాంతముగాన, 'ఒకఁడా' అనఁదగు" అని సవరణను ప్రతిపాదిస్తారు. యీ మాత్రంకూడా వెం॥ శా॥ యెఱుగఁడని వారి తాత్పర్యం. కాని అనేకచోట్ల 'ఒకరా' అంటేనే అందంగావుంటుంది. యీమాట సహృదయైకవేద్యం. వెం॥ రా॥ లు "గురువెవరు" అన్నవాక్యాన్ని ఆక్షేపించిన సందర్భములో, యీలాగే "గురువెవఁడు" అనవలసిందని సవరణను ఉపపాదించినట్లు జ్ఞాపకం. భారతప్రయోగం చూపి వారికి వాకట్టు కల్పించాము. యీ 'ఒకరా' అన్నదానికిన్నీ బోలెఁడు ప్రయోగా లివ్వడం జరిగింది. వెం॥ రా॥ లు మళ్ళా తిరగఁబడడమున్నూ దానిమీఁద ఆ తిరుగుఁబాటును పురశ్చర ణంలో వారించడమున్నూ జరిగింది. ఆయీ సందర్భాలు చూడక గురు వులు మళ్ళా ప్రశ్నించారనుకోవాలి. సమర్థనంమట్టుకు గురువులకు తెలియ దేమోకాని ప్రయోగించుకోవడం మట్టుకు వారున్నూ ప్రయోగించు కున్నారు. "వట్టి అమాయికులు" అనే వ్యాసంలో యీవిషయం స్పష్టం కాఁబట్టి విస్తరించనక్కఱలేదు. కాని నిన్నమొన్న దొరికిన ప్రయోగాలు కొన్ని వుదాహరిస్తాను. యివన్నీ గౌరవార్థకాలే.

(౧) "చ శబ్దపర్యాయ శబ్దార్థసంబంధ మొకరికే యుండఁగా. (౨) శాస్త్రి సూరు లిద్దఱిలో నెవ్వరోయొకరు, (౩) చేకొను క్రియకును, పురోహితుం డగుటకును నొకరు కర్తగానందున, (౪) ఒక్కొకరివే వేర్వేఱుగా"

చాలును. యింకా బోలెఁ డున్నాయి. ఇవన్నీ గుప్తార్థప్రకాశిక లోవి — చ. "తెలుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది." కాఁబట్టి ప్రయోగాధారంమీఁదే తఱుచుగా ఆధారపడాలి. ఆయీ యంశం అన్యత్ర విస్తరించఁబడి వుంది. ఆయీచోట్ల ఏకత్వం చెప్పమనేవాదంకూడా నిలవదు.

(౯) "చంపీచంపనిరీతి—నింద్యగ్రామ్యము." భారతమహాకవి ప్రయోగానికి సజాతీయమైన యిదే నింద్య గ్రామ్యమయితే యిఁక కాని దేది ? "నమ్మీ నమ్మక" అనే కవిబ్రహ్మగారి ప్రయోగాన్ని నిన్న మొన్నటివారు దిద్దడమున్నా ఆ దిద్దుబాటు శుద్ధతెలివితక్కువ యనిమేము సుమారు ముప్పయియేండ్లనాఁడు సిద్ధాంతం చేయడమున్నూ గురువులు యెన్నడున్నూ చూడలేదనుకుంటాను. ఆ కవిబ్రహ్మగారినిబట్టేకదా శ్రీనాథుఁడు గారు 'వినీవినక' అనిన్నీ, ధూర్జటిగారు 'రోసీరోయక' అనిన్నీ ప్రయోగించివున్నారు. యీ విషయం అన్యత్ర విస్తరింపఁబడ్డదే కనక మళ్ళారాయడం చర్వితచర్వణమే కదా ! పోనీ దీర్ఘంతోకూడిన 'చంపీ చంపని' గురువుల దృష్టికి క్రొత్తగాకనపడి తప్పనిపించిందేమో అనుకుంటే దీర్ఘంలేని "ఉడికి యుడుకక" అన్నదికూడ అపప్రయోగమే అన్నారుగదా ? అందుచేత యేదో తోఁచినట్లల్లా గీట్లు పెట్టడంతప్ప ఆపెట్టడానికి అర్థంవున్నట్లు కనపడదు. మఱిన్నీ శ్రవణానందంలో 'నా కళ్ల యెదుట' అన్నదాన్ని సీసపద్యంలో నాలుగు చరణాలలోనున్నూ వాడి, గీతంలో మఱికొన్నిమాటలు వాడి, వీటికన్నిటికీ అనుకరణాన్ని తెల్పే "అనుచు నాతనిచర్యలే యభినుతింత్రు" అని స్పష్టంగా కనపరుస్తూవుంటే గురువులు "కళ్ల" అని ప్రయోగించడం తప్పంటారే ! లోకంలో "నాకళ్ళయెదుట" అంటారేకాని "నాకన్ను లెదుట" అని అనరుగదా !

దాన్ని అనుకరించవ మని తెలుసుకోకపోతే యెలాగ? కవికి శాస్త్రజ్ఞానా దులు అవసరమని చెపుతూ దానిలో ముఖ్యమైనది లోకజ్ఞానమునుమా అని తెల్పడానికేకదా! "లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్" అనే శ్లోకంలో శాస్త్రకావ్యాద్యపేక్షయా లోకశబ్దాన్ని ముందు ప్రయోగించివున్నాఁడు. యింతకన్న పెద్దలవిషయంలో యేమివ్రాసేది? పూరికే తొందరపవడ మున్నూ కనపడ్డదానిమీఁదల్లా గీట్లు పెట్టడమున్నూ తప్ప గురువులకు మొదటినుంచిన్నీ నిదానించడం అన్నది లేనేలేదు. యీకారణంచేతనే వీరు యెవరెవరిని యిదివఱలో తప్పులు పట్టివున్నారో వారు "వీరితో మనకెందు" కని వూరుకున్నారేకాని తిరగఁబడడమేవస్తే అవన్నీ యీ తరగతిలోకి వచ్చేవే అని ఋజువు చేయడం మిక్కిలీ సుకరం. వీరు బొత్తిగా పరిశీలించరన్నందుకు వక చిన్న వుదాహరణాన్ని చూపుతాను. గుంటూరి ఆచార్లగారు ఆయనకి అర్థంకాక మా పద్యంలోవున్న "అభణ పుగాంఢ్లు" అనే పదాన్ని నిరర్థకం అంటూ వకమాట వ్రాశారుపాపం! ఆయనకి అర్థం తెలియ నప్పుడు తెలియదనివ్రాస్తే "శిరోమణి" త్వానికి భంగంగా వుంటుందికనక ఆలా వ్రాయడం యుక్తమే అనుకొందాం. గురువుగారు వెం॥ శా॥ కవిత్వంలో చాలాతప్పులు చూపినట్లు లోకానికి కనపఱచడానిక్కాఁబోలు. వారివీ వారివీ చేర్చుకుంటూ ఆచార్లవారితాలూకు ఆక్షేపణలు యెరువుతీసుకొనే సందర్భంలో పైపద్యాన్ని కొంత మార్పుచేసి "ఆభరణపుగాంఢ్లు" అని ప్రకటించారు. యీ పదం యేపద్యం తాలూకో అసలాయనికి ఆచార్లగారికి తెలుసునుగాని వీరు అంతదాఁకా విచారించి నట్లు తోఁచదు. గురువుగారు ప్రకటించిన పదం ఆ పద్యంలో యిముడదు.- పద్యం చూపుతాను.

చ. అభినవరామలింగ బిరుదాంకుఁడ నా కవనమ్మునందు నీ
  యభణపుగాంఢ్లు తప్పులిడ నర్హులె ॥

అనే పద్యంలో "ఆభరణపుగాంఢ్లు" అనే పదం పాదాదిని యిము డదన్నమాట గురువులు క్రమంగా పరిశీలిస్తే గోచరించదా? యిఁక

యిప్పుడు రాఁబోయేవాదం 'నేను ఆచార్లగారి వాక్యాన్ని దిద్దలేదు. ముద్ర ణంలో పొరపడ్డ' దనేది. ఒక చోటఁగాదు రెండుచోట్ల వుందని దాని మీఁద ప్రతివాదం. యింతలో వచ్చేదీ పోయేదీ లేశఁకూడా లేదుగాని గురువుగారు తమకు బొత్తిగా తెలియని విషయములమాట యేలావున్నా వారికి తెలిసే విషయాలలోకూడా బుద్ధి లోతుగాపోనిచ్చి పరిశీలించరనేదే సారాంశం. సరే. యిది అచ్చుపొరపా టనే వప్పుకుందాం.

(10) "కొమిరెలు - కూఁతుల కర్థములేదు" అంటూ ఆక్షేపిస్తారు గదా! దీన్ని కూడా ముద్రాప్రమాదంకిందే జమ కట్టుకో మంటారా? పరిశీ లన లోపం కిఁదకు వస్తుందఁటారా. వసుచరిత్రలో "చ. కొమిరె మనోవ్య థంగుఱిచి గ్రుచ్చి కవుంగిటఁజేర్చి తల్లి శుక్తిమతి" అన్న పద్యంలో వుందాయె. కూఁతురు అని అర్థంచెప్పి తీరాలాయె. అందుకు తల్లి పదం బోధకమాయె. వ్యాఖ్యాత అందుచేతే స్పష్టంగా కూఁతురు అనే వ్రాసివున్నాఁ డాయె. పరిశీలించే యెడల వారికి దీనిలో తెలియని విషయ మేముంది? శబ్ద రత్నాకరంలో "కూఁతురు" అని వ్రాయలేదుగదా అనుకోవడమేనా? పోనీ ఆ శబ్దం యేశబ్దంలోన్నుంచి పుట్టింది? కుమారీ శబ్దంనుంచి కదా? ఆ కుమారీ శబ్దాన్ని కూఁతురుపరంగా తాము భారతంనిండా వాడేవున్నారుకదా? కుమార శబ్దంనుండి 'కొమరుఁడు' అని పుట్టినట్లె కుమారీ శబ్దమునుంచి 'కొమిరె' అని పుట్టిందనుకుంటేకూడా యే వసుచరిత్రదాఁకానో పోకుం డానే తేలిపోయేదే. ఆయీ సందర్భాలవల్ల ఆక్షేపకులకు బుద్ధి శాస్త్ర చర్చమీఁదా అంతగా నడవదనిన్నీ, పోనీ లక్ష్యప్రపంచంమీఁదనేనా ప్రస రిస్తుందేమో అంటే దానిమీఁద అంతకుముందే ప్రసరించదనిన్నీ విజ్ఞులు గుఱితించడానికి పూర్తిగా అవకాశం కలిగిందనుకోవాలో యేమనుకోవాలో సహృదయులే నిర్ణయించాలి.

(11) "చూచుక, పట్టుక, కొట్టుక, - అత్మార్థమందు 'కొని' కి బదులు 'క' ప్రయోగము సరిగాదు." యీ ఆక్షేపించడంలో కొన్ని

నెరసులు వెదికే యెడల కొంత గ్రంథం పెరుగుతుంది. యింతకూ యిది వారి ఆక్షేపణలు సరియైనవికావని తెలపడానికే కాని వారిని వెక్కిరించడానికి కాదు. కాఁబట్టి ప్రధానాంశాన్నే వ్రాస్తాను.

" ఉత్తరస్యకౌనోర్ధాతోః కం బుధాః కేచి దూచిరే "

అను ప్రయుక్తమైన " కౌను " ధాతువునకు "క" అనే ఆదేశాన్ని కొందఱుపండితులు (పామరులు కాదు శ్రీనాథులు) చెప్పుచున్నారు. అని పై కారికకు అర్థం. దీనికి ప్రయోగా లెన్ని వున్నాయో, ఆప్రయోగా లేలాటి కవులవో ఆ యీ సందర్భం సర్వమున్నూ గుప్తార్థప్రకాశికలో కొన్ని పేజీలు తెలుపుతాయి. దానికి ఆక్షేపకులే పీఠిక వ్రాసివున్నారు. కాని గ్రంథంచూచి వ్రాయలేదని మాత్రం వ్రాయవలసి వచ్చినందులకు విచారించవలసివున్నది.

(12) " క్షమియింపుటల్ - ఇట్టివి పెక్కులు " అంటే యేమన్న మాట? ఆ ప్రయోగాలన్నీ తప్పులన్నమాటకదా! యివన్నీ పాశుపతంలో సమాధానం చెప్పఁబడిందే,

క. కావించుట కావింపుట
భావించుట మఱియు దీని భావింపుటనం
గా వెలయుఁ గృతుల"

అని కూచిమంచి సార్వభౌములు.

(13) "తెల్వి - తెలివియగుఁగాని సంయుక్తము కూడదు." యెందు చేతోకదా? 'పొలఁతి' లో వున్న అర్ధానుస్వార సహితమైన అకారం కన్నా యిది తీసిపోయింది కాఁబోలును. " పొల్తి " అని మహాభారత ప్రయోగం. దీనికి ప్రయోగమే అక్కఱలేదు, అయినా యిస్తాను.

" నా తెల్వికిం దగిన శ్లోక లఘుటీక రచియించి " అని పురాణపండ మల్లయ్యశాస్త్రిలవారు ప్రభావతీప్రద్యుమ్న పీఠికలో వ్రాసివున్నారు. మధ్యశబ్దము ముపర్ణకవిరహితంగా ప్రయోగించడంకూడా వీరికి సమ్మతమే.

" అనురక్తులై మధ్యనొక్కొక్క విషయంబున " అని ప్రయోగించారు. వీరిపాండిత్యం గణనీయంకాదని వాదానికి దిగుతారనుకుంటాను. చూదాం. అంతవఱకువస్తే," భావవిశేషములొప్పఁ దెల్పులకా " అనే నన్నెచోడుణ్ణి యేం చేస్తారందాం ?

(14) " గ్రింథార్జనచేసి—ఆర్జనముచేసి యననొప్పు " యిప్పుడున్నూ వొప్పే. మధ్యశబ్దవిచారంతోనే యిది గతార్థం. చరితాదిగణంలో దీన్ని పఠింపవచ్చును. లోకంలో శ్రవణపేయంగావున్న మువర్ణకవిరహితాలన్నీ దానిలో చేరుటకు యేవిధమైన అభ్యంతరం లేమకాని, 'వర్త్మన్' 'అధ్యాత్మన్' అన్న అపప్రయోగాలకు మాత్రం అది జీవకంకాదు. యెందుచేత అంటారేమో ! అన్నప్పుడు మనవిచేసుకుంటాను. చరితాదుల వల్ల సాధు కాఁదగ్గవి కొన్ని చూపుతాను :

(౧) లఘూచ్చారణతో, (౨) బోధలో భాసిల్లి, (౩) హేత్వాభాసలు, (౪) ఆరోపణవలన, (౫) సమీక్షణ చేసిరి రాజహంసమున్.

యిందులో తుట్టతుదది వినాగా అన్నిన్నీ గుప్తార్థ ప్రకాశికవారివి. తుట్టతుదది శ్రీనాథుఁడిది. యిదివఱలో ఆక్షేపకులు " ప్రయాగ " అని తాము ప్రయోగించివుండినీ " ప్రయాగమునకేగి అని యుండఁదగు " అంటూ సవరణను వుపపాదించివున్నారు. పనిపడ్డప్పుడు శ్రీవారి " ప్రయాగ " ప్రయోగం కూడా సమర్థించడానికి యిదేమార్గం అని నా మనవి. యింకా కావలిస్తే పింగళివారు " గయలోఁ గాశిఁ బ్రియాగ శ్రీగిరిని " అని ప్రభావతీప్రద్యుమ్నములో ప్రయోగించి వున్నారు. "....పూర్వకవిప్రయోగదక్షుఁడు కవియనఁబరఁగున్ " అని వెం॥ శా॥ కవి గాఁడు అని సమర్థించే సందర్భంలో చెరలాటంలో వ్రాసివున్నారు. జ్ఞాపకం తెచ్చుకోవలసిందని విజ్ఞప్తి. " ఆర్జన " శబ్దానికేంగాని యిది వఱలో చూపిన నకారాంత అకారాంత శబ్దాలు రెండిటితో పాటుగా

"జన్మ సార్థకము" అనేచోటవున్న "జన్మ" కూడా యీ సూత్రంవల్ల గాని వేఱొకసూత్రంవల్లగాని సమర్థింపఁబడదు.

(15) "కింకవిగజసింహబిరుదు — సింహ శబ్దము సంస్కృతము, బిరుదు తెలుఁగు, సమసింపదు. సింహబిరుద మనఁవసు" అంటారు గురువులు.

నేఁ జెప్పే సమాసం వారికి మనవిచేసుకుంటాను. సింహ ఇతి బిరుదః, సింహబిరుదః, అని చెప్పి, దాని తత్సమరూపములే బిరుదు, బిరుదము, అవుతాయంటాను, కావంటారు వారు. కాకపోతే, వర్గము- వర్గు, రసాభాసము - రసాభాసు, యీ రూపద్వయం యెట్లాగంటాను. అవి యెక్కడ వున్నాయంటారు ప్రతివాదులు. గుప్తార్థప్రకాశికలోనే వున్నాయి చిత్తగించమంటాను.

"క్షత్రియవర్గునందు, వైశ్యవర్గునందు" లోకవాడుకలో వున్న ప్రయోగాలకు వ్రయోగంతో కూడా పనిలేదు. సజాతీయాల కేర్పడ్డ శాస్త్రమే వీట్లకు జీవకం అవుతుందని నా విజ్ఞాపన. నిజమైన శక్తిగలకవి యీలాటి ప్రయోగాలని ప్రయోగించడమున్నూ సమర్థించడమున్నూ కలిగి వుంటాఁడు. "క్షమాపణ" నింద్యగ్రామ్యం, "బలవతులు" గ్రామ్యం, అనేవారు కవులు కాకపోరుగాని ప్రయోగ రహస్యా లెఱిఁగిన కవులు మాత్రం కాఁజాలరు.

(16) "తాతలప్పటివి—కలిసి ఇవి శబ్దదోషములు" యీ ప్రశ్న లోకూడా కొంత శంక కవకాశంవుంది. దాన్ని ఆలావుంచి సమాధానం మాత్రమే వ్రాస్తాను. "మ. పెనుఁగొండంతటి యిధ్మభారమును" అని గురువుల భారతం. "పెనుగొండ + అంతటి" అన్నస్థలంలో సంధియె ట్టిదో "తాతల + అప్పటి" అన్న స్థలంలోనున్నూ సంధి అట్టిదే. నిజా నికి శంకాలేదు, సమాధానమున్నూ అక్కఱలేదు. అసలు మహాభారతంలో వున్న "రాజులొద్ద," వగయిరా ప్రయోగాలు "గుప్తార్థ" లో వుదాహ

రింపఁ బడినవి బోలెఁ డున్నప్పటికీ ఆక్షేపకులదే యివ్వడం మంచిదని దాన్ని యిచ్చాను. మఱిన్నీ, 'తిలలంతలు' 'ఒకైదు' లోనైన ప్రయోగాలు ఆక్షేపకుల భారతంలో కర్ణపర్వంలో అసకృదావృత్తిగా వున్నాయి. యెందుకు వుండకూడదు? అవేమైనా తప్పుప్రయోగాలు గనకనా? యిఁకతప్పేమిటంటే? పరిశుద్ధప్రయోగాలను ఆక్షేపించడ మనేదే. 'కలిసి' అనేదాన్నిగూర్చి కూడా వ్రాస్తాను. 'కలసి' అని అకారమధ్యంగా వుండాలని ఆక్షేపకుల తాత్పర్యం. రెండున్నూ వున్నట్లు శబ్దరత్నాకరంలో స్పష్టంగా వుంది. చంద్రాంగద చరిత్రనుంచిన్నీ రామాభ్యుదయంనుంచిన్నీ ప్రయోగాలు కూడా శ-ర-లో చూపఁబడ్డాయి. చిన్నయ్యసూరి మతంలో 'కలిసి' లేనేలేదు. అందుచేతే ఆయన "కలియున కత్వంబు నగు" అని క్రొత్తగా ఇకారస్థానమందు అకారాన్ని ఆదేశంచేసి "కలపము" అనే రూపాన్ని సాధించవలసివచ్చింది. గుప్తార్థప్రకాశికలో కూడా దీన్నిగూర్చి కొంత వ్రాశారు. దయచేసి ఆ యీ గ్రంథాలు యిప్పుడేనా చిత్తగించి శిష్యుఁడి పరిశ్రమానికి సార్థక్యం కలిగించాలి కాని ఆగ్రంథమంతా దీనిలో వ్రాయడం యేలాగ చెప్పండి సహృదయులు. ఆ యీ గ్రంథాలవల్ల మేము ప్రయోగించిన, 'కలిసి' అనేదే బహుసమ్మతమనిన్నీ, గురువులవారు చూపిన, 'కలసి' చిన్నయ్యసూరిగారు తప్ప తదితరులకు మాత్రమే సమ్మతమనిన్నీ స్పష్టపడుతుంది. ఆత్మపక్షాన్ని భంగించే యీ ప్రశ్న అడగడం యెందుకో సహృదయులే నిర్ణయించాలి.

(17) "జటప్రోలిందిర—ఈ సమాసము తప్పు" విద్వత్కవుల మతంలో తప్పుకాదని విజ్ఞప్తి. "జటప్రోలః + ఇందిరా," అని విగ్రహము. దీనిమీఁద విజ్ఞులయితే యింక శంకించరుకాని యితరులు యింకా పెనుగులాడతారు. 'జటప్రోల్' అన్నది సంస్కృతం కాదంటారు. సంజ్ఞావాచకాలవిషయంలో ఆ ప్రశ్న రాకూడదు. గురువుగారి ప్రయోగాన్నే చూపుతాను. "నాయుఁడమాహ్వయవేంకటాద్రికిన్" యిక్కడ

సవర్ణదీర్ఘసంధి యేలా వస్తుంది? 'నాయుఁడమ' పదము సంస్కృతం కాదుగదా? వ్రాస్తే బోలెఁడు వ్రాయాలి. పనిపడితే వ్రాస్తాను. వ్రాసే వుంచానుగాని మళ్ళా దానిలోన్నుంచి సారంతీసి లఘువుగా ప్రచురిస్తూ న్నాను. తిరగఁబడి ప్రశ్నించడమంటూ వుండాలిగాని అట్టి భాగ్యమే తటస్థిస్తే ఆయీ స్థలాల్లో సర్వత్రా గ్రంథం బళ్ళను తోలవలసివస్తుంది. యిదే కుదరకపోతే "తిరుమలేంద్ర శ్రీమహారాయనిన్" (వసుచరిత్ర) వగయిరా ప్రయోగా లేలా కుదురుతాయి? పెద్ద లడగడాన్నిబట్టి వ్రాయవలసిన కొన్నిమాటలు వ్రాయలేదని చదువరులు గమనించాలి.

(18) "చెవులూఱుచు — ఇది నోరూరు వంటిది కాదు, ఓము గారునప్పు డిట్లు తగును" అని ఆక్షేపణ.

శంకలో కొంత దొసఁగువుంది. దాన్ని వుపేక్షించి సమాధానం మనవిచేసుకుంటాను. 'ఊరు' అనే ధాతువుకున్నూ నోటికీ మాత్రమే సంబంధం దురర్థాన్ని యివ్వదనిన్నీ, మఱివకదానితో కలిపితే దురర్థం యిస్తుందనిన్నీ గురువులవారి తాత్పర్యం. అయితే, నోరూరు, అన్నప్పుడున్నూ దురర్థంతీస్తే యేంచెపుతారో? యిక్కడ "చీముగారుట" అని చెప్పినట్లే, అక్కడ—కారుట చెపితేనో? కాఁబట్టి శంక ఆలోచించి చేసిందికాదు. వూరికే కోపంమీఁద కలాన్ని నడిపివున్నారు. చ. "అని మనసూర నూఁడిలనాడి" (వసుచరిత్ర ४ ఆ) అన్నచోట, ఊరు ధాతువుకున్నూ మనస్సుకున్నూ సంబంధం కనపడుతూవుంది. కాఁబట్టి ఆక్షేపకుల వూహ అనాలోచిత మనక తప్పదు. పోనీ యేవిధంగానున్నూ అశ్లీలార్థం రాకుండా కవిత్వం రచించే వుద్దేశంతో శంకించారనుకుందామా? అట్టి పట్టుదల వారికి లేనేలేదు. యిక్కడ చెవులూరు అనేచోట వచ్చే అశ్లీలార్థం యెంతటిది. శ్రీవారి భారతంలో "వివాహకరణం" అనేదానివల్ల వచ్చే దురర్థం వర్ణనాతీతం. పనిపడితే దాన్ని వివరిస్తాను. వివాహపదానికిన్నీ కరణపదానికిన్నీ సంబంధం హృదయంగమం కాదు. పైపెచ్చు అమంగళరూపమైన అశ్లీలాన్ని కలిగిస్తుంది.

యీ కరణపదంవల్ల ససంబంధికపదం యేది స్మృతికివస్తుందో కవిచౌడప్ప శతకం వివరిస్తుంది. కాఁబట్టి విస్తరించేదిలేదు. శాంతం పాపం, ప్రతిహత మమంగళం. "అవసరనైవేద్య" వ్యాసంలో "శుభగ స్నిగ్ధము" అని చూపివున్నాను. అదిప్నీ అశ్లీల స్ఫోరకమే కాని అందు అమంగళం లేదు. ఇట్టిదోషాలు చూపడం నాకిష్టంలేదు. నా మతమున్నూ కాదు. అవతలివారి ప్రవృత్తివిఁబట్టి చూపవలసివచ్చినందుకు విచారిస్తూవున్నాను. నన్ను రేఁగఁగొట్టి ఆ యీ దోషాలు నాచేత చూపించుకొని, పైఁగా గురువులు "దివాంధ" గ్రంథకర్తగారిచేత "నా కవిత్వంలో తప్పులు పడుతూవున్నాఁడు. వెం॥ శా॥ మహా దుర్మార్గుఁడు" అనే అర్థంయిచ్చే మాటలు వ్రాయిస్తారు. "యుగవాణి" పత్రికలో వున్న బహిరంగలేఖవల్ల యీవిషయం స్పష్టపడుతుంది. వచ్చిన వివాదవిషయాన్ని వదలుకొని, వెం॥ శా॥ కవిత్వాన్ని విమర్శించడ మెందుకు? దానిమీఁద మళ్ళా యీ వ్రాయించడా లెందుకు? చూపిన దోషాలకు తగిన సమాధానం వుంటే, వెం॥ శా॥ మోస్తరుగానే వ్రాస్తే లోకం యుక్తాయుక్తాలు విమర్శించుకొని యుక్తమైతే సంతోషిస్తుంది. అయుక్తమైతే, 'అయ్యో!' అని నొచ్చుకుంటుంది. పైఁగా "కృష్ణ" వెం॥ శా॥ వ్యాసాన్ని ప్రచురించడాన్నిగుఱించి యుగవాణిలో కొంత వ్రాయించారు. అదిన్నీ అనాలోచితమే. వ్యక్తిదూషణ లేకుండావుంటే, తమదిన్నీ "కృష్ణ" యిప్పుడున్నూ ప్రచురిస్తుంది. ఆ దూషణ వుంటే "కృష్ణే" కాదు, గోదావరిన్నీ యీసడించి బుట్టదాఖలు చేస్తుంది. ఈ విషయం బాగా గమనించాలి.

(19) "చూపఱులు" పైశబ్దం తప్పంటూ వ్రాయడమున్నూ, ప్రౌఢవ్యాకరణం చూడవలసిందని మనవిచేసుకోవడమున్నూ యిదివఱకే జరిగింది. ప్రయోగాలు యిక్కడ చూపుతున్నాను. (౧) చూపఱులకు నద్భుతమొదవన్, (౨) చూపఱులకు వెక్కసంబై, (౩) చూపఱుల యందు బొరయుట చోద్యమొక్కొ? (౪) అనుచుఁ జూపఱులకు విస్మయంబు గొలుపు, (౫) చూపఱులకెల్ల వేఁకపుఁ జోద్యమొదవ.

అటు ప్రయోగాలు దొరికినట్లు వెనకటి వ్యాసంలో వ్రాసివున్నాను. ఇప్పు డిచ్చిన అయిదున్నూ కవికర్ణరసాయనంలోవి. ఆఅవది పింగ? వారిది యిస్తున్నాను. (ఒ) 'చూపఱులచూడ్కి కొక వింత సొబగొనర్చె' (కళాపూర్ణోదయం) యింకా కావలిస్తే వ్యాకరణాధారమున్నూ వుంది. "దేశ్యంబునం గొన్నియెడల.... మరల బహువచనప్రత్యయంబులు చూప బ్టెడి" అని ప్రౌఢవ్యాకరణంలో సూత్రం వ్రాసి కళాపూర్ణోదయ ప్రయోగాన్నే వుదాహరించి వున్నాఁడు.

(20) "పినాసి - ఇది అపశబ్దము" కాదు సుశబ్దమే. కృష్ణా, గుంటూరు డిస్ట్రిక్టులలో యీ పదాన్ని లుబ్ధుఁడికి పర్యాయపదంగా వాడ తారు. నిఘంటులలో లేదంటారా? అనండి, అంతమాత్రంచేతే అప శబ్దా లయేయెడల యెన్నోసుశబ్దాలు అపశబ్దాలు కావలసివస్తుంది. తక్కిన వాటి మాటల్లా వుంచి "గోణిబిళ్ల, తూర, జివ, గోడి, లోనైన పదాలు ఆక్షేపకులు ప్రయోగించుకొని గోదావరీతీరాన్ని గతిగా చూపిస్నీ, దీన్ని ఆక్షేపిస్తే చెప్పేదేమిటి? అందులో "జివ" శబ్దాన్ని గూర్చి గోదావరి కూడా జీవకంకాదు. అయినా యిప్పు డది ప్రస్తుతం కాదుకనక విస్తరించే దేది లేదు. పాశుపతఁకూడా చూడఁదగు. "వట్టి పినాసి వీఁ డనెడి వాడు" అని అనుకరణంలో వున్నదాన్ని గూర్చి ప్రశ్నించడం కేవలం మున్నూ పొరపాటుకూడాను.

(21) "తేలప్రోల్వీభుఁడు శ్రీసింహాద్రిరాట్పుత్రికన్" యీస్థలంలో యేకదేశాన్వయం వుందంటారు. వున్నమాట సత్యమే. అది భారతసమ్మతం. యీ విషయం ప్రౌఢవ్యాకరణంలో స్పష్టంగావ్రాసి వుందికూడాను. అవసర నైవేద్యంలో ఆక్షేపకుల భారతంలోన్నుంచే కొన్ని ప్రయోగాలు చూపఁబడ్డాయి. గుప్తార్థప్రకాశికలోనున్నూ యీ విషయంవుంది. మా "భారతవిశేషాల" లో కూడా "వధగా వచ్చిన విప్రార్థమున" అని భారతాన్నుంచి వుదాహరింపఁబడివుంది. అవన్నీ యిక్కడ వ్రాయడ

మెందుకు ? శ్రీరామాభ్యుదయాన్నుంచి వక దురుద్ధరమైన ప్రయోగాన్ని చూపి విరమిస్తాను. క॥ ....నాకుం బరమ గురువైన ముమ్మడి వరదా చార్యాంఘ్రివనజవందారుఁడనై " యిందాఁకా యెందుకు ? మహాభాష్యంలోనే యీ విషయం గ్రంథప్రారంభంలోనే సూచింపఁబడివుంది. — "అథశబ్దానుశాసనమ్ " కేషాం శబ్దానాం ? అని ఆకాంక్షించు కోవడంలో నే క్వాచిత్కంగా సమ్మతమని తేలుతుంది. భాష్యం చదివి మఱచినప్పటికీ యీ కాస్త జ్ఞాపకం వుంది.

(22) " చంద్రిద్యుతుల్ యామినుల్ — వసంతరాత్రుల నిట్లు వర్ణింపరు. ఈ రాత్రులు శరద్రాత్రులు కావు " అంటారు.

యిది అర్థానికి సంబంధించిన దోషమేమో ? కాదు కాదు. కవి సమయం. వెం॥ శా॥ తెలియనివాఁ డనడానికి పనికివచ్చే దనుకుంటాను. వసుచరిత్రిలో ౪ ఆశ్వాసంలో వున్నవర్ణనలో అంతాకాకపోతే పోనీ యండి — " సీ. మిత్రాధికారంబు మీఱరాదని కాక వెసఁ బట్టపగలు. గావింప లేదె ? " అన్న పద్యాన్నైనా గమనించలేదేమో. ౧౨౮ మొదలు ౧౩౨ వ పుటవఱకున్నూ వసంతఋతువులో వున్న వెన్నెలవర్ణనేకదా. యింతప్రమాదం యెందుకు కలగాలో ఆక్షేపకులకు ! ఆ వసంత ఋతువులో వెన్నెలబాధ పడలేకేకదా, పాపం, గిరికాదేవి "కాంభోజిరాగం"తో యేడ్చి నిక్షేపంవంటి భట్టును, " బావురుమని " యేడిచాఁడని రామలింగం చేత ఆక్షేపింపఁజేసింది. ఆ యీ అంశాన్ని తెలిపే — " శా. ఆజాబిల్లి వెలుంగువెల్లికల " అనేపద్యం అక్షరాస్యుల కందఱికీ " రోళ్ళా రోకళ్ళా " పాడే పాటగదా. యింత సుప్రసిద్ధ విషయాన్నికూడా ఆక్షేపకులు పరిశీలింపకపోవడం యెందుచేతో తెలుసుకోవా లనేవారు " పుణ్యైర్యశో లభ్యతే " అన్న మా వ్యాసం చదవవలసిందే కాని ఉపాయాంతరం లేదు. వసంతరాత్రిలలో వుండే వెన్నెల శరద్రాత్రులలో వుండే వెన్నెలవలె చిక్కగా వుండకపోవచ్చునుగాని అసలు వర్ణనీయమే కాదనడాని కెవరికి తరమవుతుందో !

(23) "పంచభూజత్వచములు — పంచపల్లవముల కిటుతగను, త్వచము పల్లవముకాదు" అని ఆక్షేపణ.

త్వచములు అనేమాట మేము పల్లవములు అనుటకు బదులుగా వాడినట్లు గురువు లభిప్రాయపడ్డారు. పాపం, త్వచములు వేఱు, పల్లవములు వేఱూ అన్నసంగతి మాపద్యం పూర్తిగా చదివితే స్పష్టంగా తెలిసేదే గాని అంతవఱకు వారు శ్రద్ధ పుచ్చుకోలేదు. చూడండి.

క. ....పంచవిధములౌ – సదమల పల్లవములునఱ
పది భూజత్వచము లచట భద్రపఱచియున్.

పల్లవములు 5న్నూ, త్వచములు అనఁగా చెట్టుపట్టలు 5న్నూ పురోహితులు జాగ్రత్తపెట్టినట్లు స్పష్టంగా కనపడుతూవుంటే, త్వచము పల్లవముకాదు, అనే ఆక్షేపణ కవకాశం లేశమేనా వుందా? యిక్కడ పెద్ద చిక్కు వక్కటిమాత్రం వుంది. యేమిటంటే: యీలాటి శంక లేమిటి? కవిసార్వభౌము లేమిటి? చేయడమేమిటి? అంటూ ప్రతి వారున్నూ నమ్మక యిదంతా వెం॥ శా॥ కల్పించి సమాధానాలు వ్రాసివుండవచ్చునని భవిష్యత్కాలంలో అపోహపడవచ్చును. ఆకారణం చేతనే మా యిరువురమూ జీవించివున్నరోజుల్లోనే తేలితే విశేషించి చిక్కుండదని నేనీ శంకలను నిరాకరించక జవాబు వ్రాస్తూవున్నాను. పైఁగా పట్టాభిషేకానికి కావలసినవి పల్లవాలేకాని త్వచములు కావంటూ వక ఆక్షేపణ. రెండున్నూ అవసరమైనట్టున్నూ, అందుచేత రెండున్నూ జాగ్రత్తపెట్టివుంచినట్టున్నూ శ్రీరాజావారు పురోహితుల ద్వారా మాకు అందచేసిన జాబితాలో విస్పష్టంగా వుంది. దాన్నిబట్టే రెండున్నూ వున్నట్లు మేము వ్రాసింది. గురువుగారు పల్లవాలేకాని, త్వచములు పట్టాభిషేకానికి అవసరం లేదంటూ వ్రాశారు. అదే నిజమైతే ఆలోపం ఆ సంస్థానపురోహితులదికాని మాదికాదు. వస్తుతస్తు, గురువుగారి విమర్శనం యితరవిషయంలో బొత్తిగా అనాలోచితంగా వుండడం

చేత యీ శంకకూడా అనాలోచితమే అనుకుంటేకూడా అనుకోవచ్చును. ఆయీ కార్యాలలో వక్క సంస్థానానికి వకలాగున్నూ యింకొక సంస్థానానికి యింకోలాగున్నూ ఆచారాలు వుండడం నాకు బాగా తెలుసును. పనిపడ్డప్పుడు ఆ విషయం చర్చిస్తాను.

(24) "ధౌమ్యులు ప్రవేశించును."

పైవాక్యంలో పూజార్థక బహువచనానికి క్రియ యేకవచనంలో వుండవచ్చునని యెన్నో అభియుక్త ప్రయోగాలు చూపి, పాశుపతంలో సమాధానం వ్రాయఁబడింది. అది చూడక కాఁబోలును మళ్ళా గురువుగారు దాన్ని యెత్తుకున్నారు. ఇదివరలో అవసరమైన వేద్యంలో గురువుగారి భారతాన్నుంచి — "వ్యాసులు," అనేదాన్ని చూపివున్నాను. యిప్పుడింకొకటి వసుచరిత్ర నుండి పద్యంలోది చూపుతున్నాను.

"మ. ....నెయ్యంపుటొజ్జలు పైపై నెనయింప సాఁగె" 3 ఆ. ప్రాసస్థానంలో వుండడంచేత దిద్దుతామనే పిడివాదం కూడా యిచ్చో వీలుకాదు.

(25) "బృందారణ్యము — ఇదితీర్థముకాదు, క్షేత్రము"

అంటారు గురువరులు. తీర్థమన్నా, క్షేత్రమన్నా వకటే అని నేను వ్రాస్తే నీవు నాకు బోధించేపాటివాఁడవా? అంటా రనుకుంటాను. శంకించేటప్పుడు శబ్దరత్నాకరాన్నైనా శ్రద్ధగా చూచి శంకిస్తే కొంతబాగుండేదేమో. దానిలో - తీర్థము : పుణ్యక్షేత్రము అని స్పష్టంగా వ్రాయఁబడివుంది. పుణ్యపదం యెక్కువవుంది, మాకు కావలసింది కేవల క్షేత్రమే అంటారనుకుంటాను. ఆలాయితే — శ్లో. తీర్థం శాస్త్రాధ్వరక్షేత్ర. అనే విశ్వనిఘంటువు చిత్తగించవలసిందంటాను. నా జన్మమధ్యంలో యింత నీరసమైన శంకలకు జవాబు వ్రాసి యెఱుఁగను. నేఁటికి యీ యోగంపట్టింది.

(26) "ఊరుకొనును" — ఇది ప్రకృతిప్రత్యయ జ్ఞానములేక వ్రాసినది.

పైమాట చూస్తే పట్టరాని నవ్వువస్తుంది. "ఊరకుంఘను" అని వ్రాయడానికి బదులు, "ఊరకొను" అని వ్రాయడం గ్రామ్య మని శంకిస్తే యుక్తంగా వుండేది. ప్రకృతిప్రత్యయజ్ఞాన మంటూ అసంప్రదాయపు మాట వ్రాసివున్నారు గురువులు. వారివుద్దేశంలో— "ఊరక" అన్నంతవఱకు ప్రకృతియనియు, "ఉండును" అనేది ప్రత్యయమనియు వుండకతప్పదుగదా? వెం॥ రా॥ లయితే దీన్ని గురించి యెత్తుకున్నారుగాని ప్రశ్న అడగడంలో యింత అసంప్రదా యంగా అడగలేదు. వేరొకచోట మాత్రం యింత అసంప్రదాయంగా వాళ్ళున్నూ ప్రశ్నించారు. ఆస్థలం— "అదుగో— యిదుగో" అనేది. ప్రస్తుతం గురువులడిగినదాన్ని గూర్చి "పాశుపతం" లోనున్నూ, "పురశ్చరణం" లోనున్నూ అభియుక్తుల ప్రయోగాలు చూపఁబడ్డాయి. మళ్ళా అవి యిక్కడెందుకు చూపడం? వెం॥ రా॥ లు అడిగి యిప్ప టికి 24 యేండ్లయింది. అసలు శ్రవణానందంలో ఫుటునోటులో "ఇది గ్రామ్యం" అని మేము స్వయంగా వ్రాసి 36 యేండ్లయింది. గ్రామ్య మైనా ప్రయోగించడానికి వున్న వుపపత్తి పాశుపతపురశ్చరణాలలో పూర్తిగా చూపఁబడింది. అయితే గ్రామ్యమే అవుగాక; తి॥ వెం॥ కవులు పొరపాటువల్లనో, శ్రీనాథాదుల ప్రయోగాలుండడంచేతఅనింద్య గ్రామ్యంగా భావించుకొనో ప్రయోగింతురుగాక. దాని సమర్థనానికి గత్యంతరం వుంటే వుందేమోకాని గురువుగారి "ప్రకృతిప్రత్యయజ్ఞాన" ప్రయోగం నిరాధారం, నిస్సారం. పైపెచ్చు నవ్వులచేటు. తాము స్వంతంగా ఆక్షే పించినవాట్లతో తృప్తిచాలక, యెన్నాళ్ళ నాఁడో పాశుపతాదులలో ఉత్త రింపఁబడి ఉన్న వెం॥ రా॥ ల తాలూకు ఆక్షేపణలను— (1) "జరిగిన పట్టు, (2) అట్లనే, (3) తాపసి, (4) దేవునై గురువునునైయనుంగతి, (5) నిగుడ్చి, (6) పిల్చినావు" లోనైనవి గురువులు స్వీకరించివున్నారు. యీ నెంబర్లలో 6 వ నెంబరు ప్రయోగానికి వెం॥ రా॥ లు "నిక్కినాము జాతిలోనిది" అంటూ భవిష్యత్కాలసూచకంగా వక నీచపుమాటకూడా

వాడివున్నారు. ఆ మాటనుకూడా గురువులు అనుకరించడం వారి హృదయసౌభాగ్యాన్ని వెల్లడిస్తూవుంది. దానికేమి? గురువులు తమ భారత కర్ణపర్వంలో యెన్నో ప్రయోగాలు— "పిల్చినావు" వంటివిప్రయోగించుకొనికూడా ఆక్షేపించడం చిత్రం. విస్తరం యెందుకు? యీ గురువుల ఆక్షేపణలను గణించి వీడు జవాబు వ్రాయడమనేదే తప్పు. గాని యిట్టి తప్పు లోకంలో మరివకటి వుండదు. వెం॥ శా॥ పిచ్చిసోమయాజులమాదిరివా డవడంచేత యిట్టిపని చేస్తూవున్నాడుగాని యీ వెఱ్ఱిపని యెవ్వరున్నూ చేయరు. చేసేవారిని మన్నింపరుకూడాను. పిచ్చిసోమయాజులంటే: వకాయన అమలాపురంలో వుండేవాఁడు. యెవరిజోలికీ వెళ్ళేవాడు కాఁడు. ఆయన్ని యోగిఅనికూడా కొందఱు అనుకునేవారు. ఆయనకు వక నియమం వుండేది. యెవరేనా ఆయన్ని ముట్టుకుంటేసరి: ఆపట్లాన్ని వెంటఁబడి పరుగెత్తి మళ్ళా ఆముట్టుకున్నవాళ్ళని ముట్టుకుతీరేవాఁడు, అట్లాగే వెం॥ శా॥ కూడా, వ్రాయతగ్గదేనాసరే— కాకపోయినాసరే, యెవరేనా యేదేనా వ్రాస్తేసరి, జవాబు వ్రాయడం వ్రాసితీరతాఁడు. యీ అంశం యిదివరలో లోకానికి బాగా తెలుసునో తెలియదోకాని, యీ జవాబులతో పూర్తిగా తెలిసిపోతుంది.

యిప్పటికి గురువులవారి శంకలకు జవాబులివ్వడ మయింది. "ఏనిని" అన్నదానికి గూఢంగా భారతంలో ప్రాసస్థానమందువున్నదని మాత్రం వ్రాసివున్నాను. ఆప్రయోగం సౌప్తికపర్వంలో చూస్తే దొరుకుతుందని కూడా యిక్కడ సూచిస్తూవున్నాను. నేను తిరగఁబడి వారిని విమర్శించేయెడల లోకం సహించదుకనక అందుకు పూనుకోలేదు. పూర్తిగా అచ్చుపొరపాట్లు కానివి గణాలే చెడ్డవికూడా వున్నాయి వారి పద్యాలు. పెద్దగ్రంథం వ్రాసేటప్పుడు అట్టి లోపాలు యెవరికేనా వస్తాయి కనక నేను వాట్లని యెత్తుకోలేదు. లోపం వున్నా నేనెత్తుకోక విడుస్తూవున్నాను. లోపంలేనిదే లోపమంటూ గురువులు లోకవంచనం చేయడానికి వుపక్రమిస్తూవున్నారు.

యిదివఱలో "స్త్రీలనుగూడ" అనేపద్యంలో సప్తమ్యర్థకప్రతీపు తప్పన్నందుకు భారతప్రయోగాన్ని యిచ్చివున్నాను. యిప్పుడు గురువుల భారతాన్నే "ఆర్యవర్యుల రెడ్డయ్య యశముగాంచె" అన్నదాన్ని వుదాహరిస్తూవున్నాను. నేను శ్రీవారి శంకలలో అన్నీ ఖుష్కెంఛనాలే అని గత వ్యాసంలో వ్రాసినమాట యేమాత్రం సారంకలదో విజ్ఞులు యిప్పటికే తెలుసుకుంటారుగదా? ఆసందర్భంలోనే అడగఁదగ్గవి రెండున్నట్లున్నూ అందొకటి షష్టిపూర్తి ముద్రణంలో యిదివఱలో చాల కాలంనాఁడే సవరింపఁబడడం జరిగినట్లున్నూ వ్రాసి వున్నాను. అదే "జితకాశి" పదమునుగూర్చిన తెలిఁగింపులో జరిగిన ప్రమాదం. దానికి సంబంధించిన విషయమే నెల్లూరుపత్రికలలో యెవరికోయెవరికో కొంత జరిగివుంది. నిన్నమొన్న వక రెడ్డిగారు — "చెళ్ళపిళ్ళ వెంకటయ్యా దేవాదేవేషు" అంటూ యేవో కొన్ని అప్రగల్భోక్తులు వ్రాయడమున్నూ, అదిచూచి, వెలమకన్ని సీతారామశాస్త్రిశతావధానిగారు ఆ రెడ్డిగారిని యెంతగాఢంగా మందలించాలో అంతగాఢంగానున్నూ మందలించడమున్నూ జరిగింది. యింకా ఆ వాదం నెల్లూరి పత్రికలలో జరుగుతూనేవుంది. ఆ సీతారామశాస్త్రిగా రెవరో నాకు లేశమున్నూ తెలియదు. ఆయన నాకేమో శిష్యుఁడుగా వ్రాసివున్నారఁట. యీ అంశాన్ని కొందఱు నన్ను యీమధ్య నెల్లూరువెళ్ళినప్పుడు ప్రశ్నించారుకూడాను. నేను యెఱిఁగినవాణ్ణికాననే వారికి వుత్తరమిచ్చివున్నాను. అసలే కల్పితపు పేరంటూ కొందఱంటూ వున్నారు. యేమయినా ఆయనవ్రాఁత బహు యుక్తియుక్తముగా వుంది. అది ఖండించడానికి బ్రహ్మకుకూడా తరంగాదు. నల్లులువున్న కారణాన్ని మంచానికి దెబ్బలుతగిలినట్లు, అనాలోచన పరులైన శిష్యులు వుండడంవల్ల గురువులకు దూషణాలు తగులుతాయి అంటూ వక వాక్యం వ్రాశాఁడు. అది చూచేటప్పటికి నాకు ఆయనతెల్వికి అత్యాశ్చర్యం కలిగింది ఆయన నాకు శిష్యుఁడనని యెందుకు వ్రాసుకున్నాఁడోకాని, నేను ఆయన్ని గురువుగా అంగీకరిస్తాను. ఆయన ధోరణికి నా ధోరణి చాలదు.

అది యటులుండె. యిఁక మిగిలిందల్లా గురువుగారికి "అయ్యాల ఘుని యాజ్ఞ గైకొని మృతాయితుఁడౌ సుతుతోడ" అన్నచోట విశ్రమం చెడ్డది అన్న ఆక్షేపణ. "కుమారాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు" అన్న చోటంబలెనే హల్లుతో యతి పెట్టవలసిన క్యజ్ ప్రత్యయాంతానికి అచ్చుతో యతిపెట్టడం మా ప్రమాదమే. కాని దీన్ని అన్యథాగా సమర్థించి నే నిది వరలో అన్న "మీ వంటి కవినికాను" అన్న వాక్యాన్ని దృఢీకరిస్తాను. "మృతశ్చాసౌ, అయితశ్చ" అని విశేషణ సమాసం చెప్పుకుంటే యతి భంగం నివర్తిస్తుంది. వెనుకటి అర్థమున్నూ వస్తుంది. అయశబ్దము కన్న తారకాదిత్వాత్ ఇతచ్‌ప్రత్యయః. అయమంటే శుభము. "అయ శ్శుభావహో విధిః" అని అమరము. పైరీతిని మృతుఁడున్నూ శుభం కలవాఁడున్నూ అని అర్థం తేలుతుంది. కాని మృత్యునికి శుభంయేమిటి? అని తాత్పర్యంలో అనుపపత్తివస్తుంది. అట్టి అనుపపత్తి లక్షణకు బీజం అయి తీరుతుంది. యీ కర్మాలన్నీ శాస్త్రజ్ఞులైన గురువుల సన్నిధానంలో శుశ్రూష చేస్తేకాని గోచరించవు. కాఁబట్టి విస్తరించేది లేదు. "గంగా యాం ఘోషః" అనే స్థలంలో గంగాతీరే ఘోషః అంటే పనికిరాదు. అత్యంత సమీపరూపమైన అర్థం లాక్షణిక ప్రయోగంలో వచ్చినంత సుల భంగా అన్యథాగా రాదు. యిక్కడకూడా మృతశబ్దానికి, మృతుఁడుకాలేదు కాని అంతదాకా వచ్చిన జబ్బు చేసిందనే అర్థం ఆ వుభయపద సామానా ధికరణ్యంవల్ల గాని సొగసుగా రాదు. శాస్త్రజ్ఞు లెవరున్నూ దీన్ని కాద నరు. సమాసంలో సంహిత నిత్యంగనక, మృతపదానికి అనుపదమందే ఉచ్చరింపఁబడ్డ అయిత పదము పైని చూపిన అర్థాన్ని కడు సుళువుగా సంపాదిస్తుంది. 'సంహిత' అంటే అర్థమాత్రోచ్చారణాధికరణీభూత కాలసదృశకాలవిలంబేనోచ్చారణం. శ్లో. సంహితైకపదే నిత్యా....నిత్యా సమాసే" యిఁక మృతుఁడైనవాఁడికి ఆపైని శుభంకలగడం యేమిటి? అనేదే తాత్పర్యంలో అనుపపత్తి. యీ స్థలంలో వెనుక నారదులవారు యేదో కపాలంమీఁదవున్న — శ్లో. జన్మప్రభృతి దారిద్ర్యం, దశవర్షాణి

బంధనం, సముద్రతీరే మరణం. కించిద్భోగం భవిష్యతి" అనే అపభ్రంశ శ్లోకానికి తాత్పర్యం బోధపడక తత్సహితంగా బ్రహ్మలోకానికి వెళ్ళ మున్నా, యింకా దీనికి కలిగే "భోగం" యేమిటని అడగడమున్నా, దానిమీఁద బ్రహ్మగారు "నాయనా! యింతకన్న భోగం యేమికావాలి? నీవంటి మహాఋషి స్వహస్తంతో చిరతపస్సాధ్యమైన యీసత్యలోకానికి తీసుకురావడమే" అని సమాధానం చెప్పడం వగయిరా యితిహాసాన్ని జోడించుకోవాలి.

యతిభ్రంశమయిందని గురువులవారు ఆక్షేపించిన పద్యం నాజాతక చర్యలో మొట్టమొదటి దశను చెప్పేది. అప్పటికి నా వయస్సు సుమారు ఒక సంవత్సరం ఆఱుమాసాలు. ఆ రోజులలో మాతల్లిగారి మేనమామ గారివూరు ఆలమూరు గ్రామానికి నన్ను తీసుకొని మా తల్లిదండ్రులు పెండ్లికి వెళ్ళినారఁట. అప్పుడు నాకక్కడ జబ్బుచేసి "మృతాయితుఁడు" అనేపదాన్ని ప్రయోగించడానికి తగ్గ దురవస్థ తటస్థించిందఁట? అట్టి దుస్థితిలో బందుగులు ఆకాస్తా అక్కడే జరుగుతుందేమోనని ముక్కులూ మూతులు విఱుచుకుంటూ వుండడంగ్రహించి మా తల్లిదండ్రులు నా సహితంగా బయలుదేరి మా స్వగ్రామం కడియానికి వస్తూవున్నారఁట. నన్ను 'పుల్లటీ'లో పెట్టుకుని ఒకరొకకొమ్ము వేరొకరు వేరొకకొమ్ము బుజాన్న ధరించి కాలినడకనే ప్రయాణంసాగిస్తూ ఆలమూరుగ్రామానికి సుమారు క్రోసులోవున్న జన్నాడ గ్రామం వచ్చేటప్పటికి సూర్యాస్తమయం కావచ్చిందఁట. వెడితే యింకా ఒకక్రోసు ప్రయాణము జరిగేదేమోకాని అక్కడికింకా బలువుగా నాలుగు క్రోసులలోవున్న మా స్వగ్రామానికి ఆ పూట యేలాగా ప్రయాణం సాగదు. జన్నాడలో నా జాతకాన్నే కాక మా తండ్రిగారిజాతకాన్నికూడా వ్రాసినటువంటిన్నీ, మా తల్లిదండ్రులు సంతానం ఆలస్యమవడంచేత దత్తు తీసుకోవాలనుకుంటూవుంటే, "మీకుతప్పకుండా సంతానం కలిగే యోగంవుంది" అని ఆటంక పరచినట్టిన్నీ శ్రీ ద్విభాష్యం వెంకన్నగారు అనే దైవజ్ఞుఁడు యీ యవస్థలో వున్న నన్ను చూచి మా

తల్లిదండ్రులను ఆదరించి యీ కుర్రవాని జాతకం నాకు బాగా తెలుసును. వీడు మంచి యోగజాతకుఁడు అవుతాఁడు, ఆయుర్దాయం "కలాషష్టికి" తక్కువ పట్టదు అంటూ ధైర్యంచెప్పి ఆ రాత్రి తమగృహంలో నిల్పుకొన్నారఁట. ఆ యీ సందర్భాలన్నీ యిటీవల నాకు కొంచెం జ్ఞానం వచ్చాక మా అమ్మగారే కాక మా అమ్మగారి మేనత్త లక్ష్మీనరసమ్మ గారుకూడా చెపుతూ వుండేవారు. పైపద్యం యీ ఘట్టంలోది. అనాదిగా నాజాతకం "దినదిన గండం వేయేళ్ళాయుష్యం" అన్న లోకోక్తికి ప్రథమోదాహరణఁగానే యిందాకా నడుస్తూవుంది.

తారకాదిత్వాత్ ఇతచ్ ప్రత్యయం చేసిన మార్గం వకటి చూపడం అయింది. యింకొక మార్గఁకూడావుంది. అయతీతి, యద్వా అయతఇతి అయితః. వర్తమానేక్తః అయినప్పటికీ వర్తమానసామీప్యే వర్తమానవద్వా కనక భవిష్యత్తే అర్థం కాఁబట్టి పొందఁబోయేవాఁడు అని అర్థం వస్తుంది. అట్టి అర్థంవచ్చే అయిత పదంతోటి 'మృత' పదానికి సమాసం, తథాచ — మృతాయితుఁడు అని సిద్ధిస్తుంది. మృతులను పొందగలవాఁడు, అనఁగా చచ్చుటకు సిద్ధంగావున్నవాఁడని యావదర్థం. యిప్పుడున్నూ స్వరం విరుగుతుందికనక యతి చెడదు. మొట్టమొదటి అర్థానికి లేశమున్నూ లోటుండదు. యింకా కొన్ని మార్గాలున్నాయి. యీరెండున్నూ పనికిరావని గురువులన్నప్పుడుకదా వాట్ల అవసరం? కవికి శాస్త్రప్రవేశంవల్ల వచ్చే స్వారస్య మేమీ వుండదుగాని యీలాటి పని యేదేనా తగిలితే శాస్త్రంలో చేసిన కృషి కొంత సహాయపడుతుంది. వెం. శా. భాష్యం చదివి మఱిచాఁడనిన్నీ, తాము అసలే చదవలే దనిన్నీ గురువులవారు వ్రాసి, రెండూ సమానమే అని సరి పెట్టుకున్నారు దానికి నాకున్నూ అంగీకారమే కాని యేలాగేనా "బెల్లం వండిన పొయ్యి" అనేమాట వూరికే పోదని మనవి చేసుకుంటాను.

వేదశ్రౌతాలలో వెం॥ శా॥ ప్రవేశం లేనివాఁడంటూ కొంత వ్రాశారు. వేదంలో అంతో యింతో శ్రీగోరుగంతు శ్రీరామావధానిఘనా

పాఠీగారివద్ద నాలుగో అర్థం వగయిరా వెం॥ శా॥ చెప్పుకున్నారుసు. సుస్వరంగా స్వస్తికూడా చెప్పడం వుండేది. కాని పదక్రమాలు చెప్పలేక పోవడంవల్లనైతేనేమి, యిటీవల ఆవృత్తిఅనగా, వల్లన బొత్తిగా లేక పోవడం చేతనేమి, అవి మెల్లగా వెనకబట్టినమాట వాస్తవం. శ్రౌతంలో ప్రవేశం వుండడానికి ప్రసక్తి లేదుకనక, గురువుగారి మాదిరిగా శ్రౌతం రాదు. కాక కవిత్వానికి వేదశాస్త్రాలుచేసే సహాయం యేమిటి? యీమాట నేనువ్రాసేదిమాత్రమేకాదు — " శ్లో. ....దూరా త్సంకుచితేవ గచ్ఛతి పున శ్చండాలవచ్ఛాందసమ్ " అన్నారుకదా అభియుక్తులు. యిక్కడ కొందఱు అనాలోచితంగా " ఖండాలవత్ " అంటూ దిద్దుతారు. అది సహృదయు లొప్పే దిద్దుబాటుకాదు. " చండాలవత్ " అనేదే సరియైన పాఠం. యింతకున్నూ మనవిచేసుకొనేదేమంటే: కవికి వేదశాస్త్రాలు అంతో యింతో రావడంవల్ల వచ్చే పుష్టికాని, అది రాక పోవడంవల్ల వచ్చే నష్టికాని, అంతగా గాని కొంతగా కాని వుండదనడమే. యీ మాట " చండాలవత్ " అన్నదానివల్లనే తెలుస్తూవుంది. కవికి స్వరూప లక్షణాన్ని చెప్పినవారుకూడా " ఛందోవ్యాకరణాదివిత్ " అన్నారు. అక్కడి ఛంద శ్శబ్దమునకు వేదమే అర్థమంటా రేమో! కాదు. గణములు లోనైనవి తెల్పే వృత్తరత్నాకరాదులు. " నసశబ్దోనతద్వాచ్యం " కనుక, అంతగా ప్రధాన ములు కాని మఱికొన్నిటితోపాటుగా వేదశాస్త్రాలుకూడా చేరితే చేర వచ్చును. అంతేకాని వాట్లకు ప్రాముఖ్యం మాత్రం లేదు. ముఖ్యంగా కవికి వ్యాకరణశాస్త్రం రావాలి. అదిరాకుండాకూడా కవిత్వం చెప్పి మెప్పించుకో వచ్చును కానీ, లేనిపోని బిరుదులు ధరించడానికికాని, వకరిది విమర్శించ డానికి కాని, వకరు విమర్శిస్తే జవాబు చెప్పటానికి కాని, సభలలో నిరాఘాటంగా " ఆడిందిఆటా పాడిందిపాటా " అన్నట్లు విజృంభించడా నికికాని అవకాశం వుండదు. ప్రతీపండితునికిన్నీ వంగివంగి సలాములు చేసుకుంటూ కాలం గడపవలసివస్తుంది. వెనక శ్రీ శిష్టు కృష్ణమూర్తి గారు ఆశుధారలో పురాణం చెపుతూ " దధంతం " అని ప్రయోగించడ

మున్నూ, యెవరో "నాఒభ్యస్తాచ్చతుః అని శంకించడమున్నూ, 'దధం — తం' అని విడఁదీసి సమర్థించడమున్నూ శ్రీ వుప్పులూరి జోగన్నసిద్ధాన్తిగారు చెప్పఁగా విన్నాను. మా 'మరుద్భూపా' లాది ప్రయోగసమర్థనాలన్నీ యిట్టివే. వెనుక చూపిన "మృతాయిత" శబ్ద సమర్థనమున్నూ యిట్టిదే.

అల్లంరాజు సోమకవిగారి ప్రయోగాన్ని నేను ఆక్షేపించినట్టున్నూ, ఆ ఆక్షేపణకున్నూ కొల్లాపురప్పండితుణ్ణి వుభయపదులవిషయంలో గురువులు ఆక్షేపించినదానికిన్నీ సంబంధం వున్నట్టున్నూ "శృంఖలం" లో గురువులు వ్రాశారు. ఆ వ్రాఁత చూస్తే నవ్వువస్తుంది. వారి ననవలసింది లేశమున్నూ లేదు. "అనభ్యాసే విషం శాస్త్రం" కదా. గురువుగారి సార్వభౌమత్వానికి లోకం అంగీకరించక "వీరభద్రివళ్ళెనికి హనుమత్పళ్ళెం" అన్నట్టు "నిక్కపు సార్వభౌముణ్ణి" బయలుదేరదీయడానికి కారణం పైకారణమే అనుకోక తప్పదు. శ్రీనాథుఁడు—

"పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క"

అని వ్రాసుకోఁగలిగింది శాస్త్రవిషయంలో సమర్థుఁడై వుండడం వల్లనే. యే మిడిమిడిజ్ఞానమో శాస్త్రిదులలో వుండి తెలుఁగులో కవిత్వం చెప్పడంవల్ల ఆ పని జరిగివుండదు.

యిక్కడికి గురువులు చెరలాటంలో మొదటిభాగంలో చూపిన ఆక్షేపణలు— "సున్నకు సున్నా, హళ్ళికి హళ్ళీ" అయినాయి. నా జీవిత చరిత్రలో "మృతాయితుఁడు" అని వ్రాయడంవల్ల మృతితరవాయిగా వున్నట్టు తేలుతూవుందిగాని, గురువుగారు స్వయంగా సంస్కరించిన బ్రహ్మంగారి కవిత్వంలో ఆ కాస్తాకూడా తరవాయి లేనట్టే చిత్రింపఁ బడివుంది. చదువరుల వినోదానికోసం ఆ హరికథలోవున్న మాటలు కొంచెం వుదాహరిస్తాను.

"అట్లు విషూచిచే విగతజీవుండైనవానిం గాంచి తల్లి గొల్లుమని దుఃఖించుచు... ....అట్లు ప్రేతభూమికిం గొనిపోవువాని బుజంబుపై స్థాణుభూతుండై యున్న బాలుండు ఇంతలో నించుక చలించినట్లగుటయు"

"కుఱ్ఱాఁడేమో కదలెను చూడండఱ్ఱా యనె నొక్కండు-వెఱ్ఱిచూపు చూచుచు నొక వెక్కువెక్కె నంత బాలుండు"

యీ గ్రంథకర్తగారినే నాకన్న, తమకన్న, యింతా లోకంలో వున్న పెద్దపెద్దలకన్న, గొప్పవారని గురువులు వ్రాసివున్నారు. యీయన గారికి గురువులయందు యెంతఅభిమానంవుందో నా యందున్నూ అంత అనుగ్రహం వుంది. నా చరిత్రాన్నికూడా హరికథగా వ్రాస్తానంటూ నా సమ్మతికోసం నా దగ్గిఱకిన్నీ వచ్చి అడిగారు. నేను వప్పుకోలేదుగాని వప్పుకుంటే వ్రాసేవారే. యింతకూ ప్రస్తుతం కావలసిందేమిటంటే: గురుశిష్యుల జాతకాలకు రెంటికిన్నీ పసిబాల్యంలో పెద్ద గండం గడచే వుందికనక నేను ప్రస్తుతం చెప్పిన అర్థాన్ని అంగీకరించడానికి అభ్యంతరం వుండదు. మా జాతకాలు రెండున్నూ మిధునలగ్నజాతకాలే. వకరికి మూడుగ్రహాలకు నీచపట్టి తద్ద్వారాగా నీచభంగ రాజయోగం పట్టి తద్ద్వారాగా లోకంలో పదిమంది నోళ్ళల్లో పడడం తటస్థించింది. వేఱొకరికో: శతమంజరీయోగాలలోవున్న కుసుమయోగం వగయిరా కొన్ని యోగాలు పట్టి తద్ద్వారాగా పదిమందినోళ్ళల్లో పడడం తటస్థించింది. ప్రస్తుతం వకరికి పంచమమందు నీచపట్టిన రవిమహాదశ, వేరొకరికి షష్ఠమందువున్న శనిమహాదశ. ఆయా దశల ఫలితాలే యీ వాదోపవాదాలంటే జాతకశాస్త్రజ్ఞులు విశ్వసిస్తారు. లేకపోతే "ముదిమువ్పున బాలపాపచిన్నె" అన్న ట్లీవయస్సులో యీ వాదోపవాదాలేమిటి? యిందులో రాఁబోయే జయాపజయాలుకూడా జాతకానుభవం యెఱిఁగినవారు అతితేలికగా నిర్ణయిస్తారు. దాన్ని ఆలా వుంచుదాం.

ఇంతవఱకున్నూ వ్రాసిన సమాధానాలు మా స్వతంత్రకవిత్వంలో గురువులవారు ఆక్షేపించిన ఆక్షేపణలకు సంబంధించినవి. ఇఁకకొంచెంగా

వ్రాసి దీన్ని ముగిస్తాను. ఈ వ్రాయఁబోయేది కొల్లాపురపు తర్కపండితుఁడు గారు ఆ సంస్థాన ప్రభువును వివాహసమయంలో ఆశీర్వదించిన శ్లోకాల లోవున్న ప్రయోగాలకు సంబంధిస్తుంది. ఆ బ్రాహ్మణ్ణి ఆడరాని దుర్భాష లాడడమే కాకుండా, అయొచ్చేదీ పయొచ్చేదీ విచారించక గురువులవారు "ఓ సీతారామశాస్త్రీ! నీకవిత్వం అశుద్ధం, అమంగళం, గ్రీష్మఋతువు వెళ్ళకుండానే తగలఁబెట్టుకోవలసింది" అని దూషించివున్నారు. ఆదూషణపుస్తకంపేరే "శ్లోకపంచక నిరాకరణం." దాన్నే పుల్లెల శ్రీరామ శాస్త్రిగారిపేరుతో ప్రకటించిందిన్నీ. ఆ నిరాకరణాన్ని ఆ బ్రాహ్మఁడు చేతనైనంతలో ఖండించి, ఆ ఖండనంమీఁద మా గోదావరిజిల్లాలోవుండే పండితులవల్లను కవులవల్లనూ సదభిప్రాయాలు పుచ్చుకొనివున్నాఁడు. అభిప్రాయాలిచ్చినవారిలో నేనుకూడా చేరడమే ఆయీ కలహానికి ముఖ్య కారణం. వస్తే నాకు దీనిలో గురువుతో వాదోపవాదాలు చేశాఁడు వెం॥ శా॥ అని అప్రతిష్ఠవస్తుందిగాక, వోడిపోయాఁడు అన్న అప్రతిష్ఠ రాదుగదా! వారు అయుక్తపువని చేసి పలువురిచే గర్హింపఁబడి, ఆ గర్హించినవారిలో వెం॥ శా॥ కూడా వొకఁడు కావడ మేమీ అనేగదా వెం॥ శా॥ మీఁదికి దండెత్తడం. ఆత్మవంచన వెం॥ శా॥ బొత్తిగా చేతకానివాఁడు కాఁబట్టిగాని, అట్లేకాకపోతే "అయ్యా! ఆ నిరాకరణం మీపేరుతో లేదు కాఁబట్టి నేను అభిప్రాయంయిచ్చా" నంటే సమస్తమున్నూ తేలిపోయేదేకదా? యిది యథార్థానకి కాలం గాదు - ఆత్మవంచనకేగాని - అన్న సంగతి యిటీవల గురువుల వ్రాఁతలవల్ల నాకు స్పష్టపడింది. నేనెంత జాగ్రత్తగా వ్రాసినప్పంటికీ వారి దురుసువ్రాఁతతోపాటుగా నా వ్రాఁతను కూడా జమకట్టి శాంతిని బోధించినవా రిప్పటికి యిద్దరు కనపడ్డారు. వారినిగుఱించి నేను "అట్లువ్రాయడం, - అనఁగా గురువుల అయుక్తపు వ్రాఁతతో నావ్రాఁతకూడా సమంచేసివ్రాయడం న్యాయంకా" దంటూ పత్రికలో వ్రాసివున్నాను. యేమైనా గురువులకు వారువారు సమంచేసి

వ్రాసే వ్రాతలలో కొంతలాభం కలక్కపోవడం లేదు. పనిపడితే వాన్ని వివరిస్తాను. యిఁక వక్తవ్యాంశాన్ని వుపక్రమిస్తాను.

(1) "కాలీన" శబ్దం బొత్తిగా వాడుకోవడానికే పనికిరాదా? అని ప్రశ్నించుకుందాం? కౌముదిలో భట్టోజీదీక్షితులు అపభ్రంశమని వ్రాసినమాట సత్యమే కాని, భారతంలోనున్నూ విద్యారణ్యంలోనున్నూ శంకరభాష్యంలోనున్నూ యావత్తర్కశాస్త్రగ్రంథాలలోనున్నూ దండికృత దశకుమారచరిత్రలోనున్నూ యిన్నిచోట్ల యిందఱు మహామహులు వాడిన "కాలీన" పదాన్ని కొల్లాపురపు తర్కపండితుఁడు, ఆశీర్వచన శ్లోకాల శీర్షికలో — "వివాహ కాలీన పంచరత్నములు" అని వాడడంలో లేశమున్నూ తప్పులేదని నే నంటాను. యీ "కాలీన" పదాన్ని పాణినీయం సమర్థించకపోయినప్పటికీ, సారస్వతం సమర్థించిందని నిన్న మొన్న బ్ర॥ శ్రీ॥ గాజులపల్లె హనుమచ్ఛాస్త్రులు (నెల్లూరు సంస్కృత పాఠశాలలో ప్రిన్సిపాల్) గారు నుడివినారు. అట్టి పదమును యేమీ ఆలోచించక గురువులు ఆక్షేపించడం యేలాటిన్యాయం? పోనీ యీలాటివి యేవిన్నీ తాము ప్రయోగించుకోరేమో అంటే, బోలెఁడు ప్రయోగించి వున్నారాయె. జివ, తూర, యింకాయేమేమిటో ప్రయోగించుకొని గోదావరీతీరాన్ని వీట్లకు ఆధారంగా భారతంలో పుట్టునోటులో చూపివున్నారు. అవి తెలుఁగుపదాలు. వాట్లను ఆలా ఉంచుదాం. "పునీత" పదాన్ని గురువులు భారతంలో వాడివున్నారు. పెండ్యాలవారు ఆక్షేపించారు. ఆక్షేపించి పుష్కరకాలం కావచ్చిందనుకుంటాను యింతవఱకు గురువుల ప్రత్యుత్తరం గురోస్తు మౌనం వ్యాఖ్యానమే. పునీతపదం శబ్దరత్నాకరంలో వుందిగాని అంతమాత్రంచేత అది సమర్థింపఁబడదు. అది సంస్కృతపదము. "సర్వం ధాతుజ మాహ" కనుక వ్యుత్పత్తి చూపించాలి. డిద్ధబిద్ధాదులకుంబలె అవ్యుత్పత్తి పక్షాశ్రయణమునకు అవకాశం లేదు. డిద్ధబిద్ధాది పదములకు వ్యుత్పత్తి స్ఫురణం కనఁబడదు. ఇది వ్యుత్పత్త్యర్థ స్ఫురణం కలది. 'పూ' ధాతువువల్ల రూప నిష్పత్తి కుదురుటలేదు.

వకచోట పురాణంలో — "పునీతా తనుభిః పదైస్తవ" అని వుండఁగా యీమధ్య నేను చూచినాను. యిది గురువు లెఱిఁగినది కాదని నా నమ్మిక. యెఱిఁగివుంటే ఆక్షేపకులకు దీన్నిబట్టి జవాబీవలెకే యిచ్చేవారు. యిది నా కిదివఱకే తెలుసునని "పిడి వాదానికి" వుపక్రమిస్తారని ఆలోచించి ఫలానా చోట వుంది అని నే నిక్కడ వ్రాయనైతిని. చదువర్లు క్షమించాలి. యిప్పుడు యుద్ధమధ్యంలోకదా యీ ముదుసలి వీరుఁడున్నాఁడు. అక్కడ వ్యాఖ్యాత "పునీతా పవిత్రీకృతా" అని వివరణంవ్రాసి వూరుకున్నాఁడేకాని, ఆర్షత్వాత్, గీర్షత్వాత్, అని మాత్రం అనలేదు. కాని నా మట్టుకు ఆర్షమనే తోస్తుంది. దీన్నిగూర్చిన విచారణాన్ని యిప్పుడు వుండే మహావైయాకరణులకు వదులుతూ వున్నాను. యీ పదం గురువులు తెలిసి ప్రయోగించినది కాదన్నది ముఖ్యాంశం. యిట్టి గురువులు 'కాలీన' పదాన్ని హెడ్డింగులో వాడుకొన్న తర్కపండితకవిని ఆక్షేపించడమేకాకుండా నానాదుర్భాషలూ ఆడడానికి - పండితుల మాటల్లా వుంచుదాం పామరులే అనుకుందాం - యేవ్యక్తి ఆమోదిస్తుందో చూడాలనివుంది నాకు. వ్యాకరణంలో గ్రంథకర్త కావడమేకాక మాధవమతం అంటూ ఆ యా వ్యాకర్తలచేత పేర్కో(బడేటి మాధవుఁడు — సర్వజ్ఞస్సహిమాధవః అనేటి మాధవుఁడు, పైఁగా — "కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ నసంశయః" అని సరస్వతిచే సర్టిఫిక్కట్టుపుచ్చుకొన్న దండీ, నిరాఘాటంగా వాడిన కాలీనపదం, వ్యాకరణాంతరంచేత సాధ్యమని కొందఱుపండితులు అంటూవున్న కాలీనపదం హెడ్డింగులో వాడుకోకూడదేమి ఆ తార్కికపండితకవి? యెందఱు భట్టోజీదీక్షితులు అన్యథాగా వ్రాసినప్పటికీ తార్కికులు "కాలీన" పదాన్ని వదులుకొనేటట్టుతోఁచదు. "పీలవః పీలవః" అనే యితిహాసం విజ్ఞు లెఱుఁగనిది కాదని స్పృశించివిడిచాను. వారిలో యేకొందఱో తప్ప చాలామంది వైయాకరణులు కూడాను. కాలీనపదాన్ని వాడిన వారిలో మా మాత్రమున్నూ వ్యాకరణజ్ఞానం లేనివారున్నారనే వాదం కేవలం సాహసం. భట్టోజీకి పూర్వం "కాలీన" పదం పాణి

నీయంవల్ల సమర్థింపఁబడదనే విషయం తెలనేలేదేమో అని కూడా అను కుంటాను. దుర్ణయశబ్దగతణత్వం శేఖరకారకునికి పూర్వం నిశ్చితమే కదా ? యింతెందుకు — "మృణ్మయ" శబ్దం ఆంధ్రలిపిలో వున్న యావత్తు మహాగ్రంథాలలోనున్నూ ణకారంతోనే కనపడుతూవుంది. అక్కడ ణత్వం రాదని సుమారుపదిపండ్రెండేండ్లనాఁడు శ్రీచిలుకూరి సోమనాథ శాస్త్రుల్లుగారు సోపపత్తికంగా నాతో వాక్రుచ్చి వున్నారు. నేను అప్పటినుండి నకార ఘటితంగానే వ్రాస్తూవున్నాను. కాని యీ రహస్యం తెలియక షష్టిపూర్తి ముద్రణంలో ప్రూపుదిద్దినవారు మాదేవీభాగవతంలో ణ కారాన్నే చేర్చారు. గురువుగారి భారతంలో ణకారమే కనపడుతూ వుంది. నాకు చిన్నతనంలో రఘువంశంలో– "స మృణ్మయే వీతహిర ణ్మయత్వాత్" అని చదువుకున్నట్లే యిప్పటికిన్నీ జ్ఞాపకం. అంపఱూ తప్పని యెఱిఁగిన్నీ "యాచ్న" వగయిరాలు రాస్తూనేవుంటారు. ప్రకృత "కాలీన" పదం యీతరగతిలోకి చేరేది కాదు. కాలికపదంతోపాటుగానో అంతకన్న అధికంగానో నైయాయికులు దీన్ని వాడుతూవున్నారు. ఆ వాడే వారిముందు మేముకాదుగదా, సాక్షాద్భగవంతుఁడు కూడా నిల్వనేలేఁడు. "మయి జల్పతి కల్పనాధినాథే రఘునాథే మనుతాం తదన్యథైవ" తరగతిలో రిజస్టరుకాఁబడ్డమహాపండితులు సెనగపప్పువలె వాడుకొనే "కాలీన" పదాన్ని హెడ్డింగులో వాడుకొన్న కొల్లాపురప్పండితుణ్ణి దూషిస్తే ఆదూషణం అన్యాయమన్న వెం॥ శా॥ గురువుల ఆగ్రహానికి పాత్రుఁడైనాఁడు. ముస్సోలినీ అబిసీనియాని కబళిస్తూవుంటే ఆపలేక పోయినా అన్యాయమనికూడా అనడం దోషమే అవుతుందా ? చదువరులు విచారించవలసివుంటుంది.

కాలీనశబ్దవిషయంలో దీనిని గమనింపఁగోరుచున్నాను :–

కౌముద్యాం, సమానకాలీనం, ప్రాక్కాలీనం
ఇత్యాదిచ అపభ్రంశాఏవైతే ఇతి ప్రామాణికాః.
అత్ర బాలమనోరమా వ్యాఖ్యాయాం

కేచిత్తు। అముకః । పురతః । ఏతేఽపిశబ్దాః
అవ్యుత్పన్నాః. పృషోదరాదయోవాసాధవః " ఇత్యాహుః.

ఇంక వుభయపదులైన ధాతువులను ప్రయోగించడంలో ఆత్మగా మిత్వపరగామిత్వ విషయాన్ని యితరుల మాటట్టులుండఁగా కాళిదాసువంటి వారే గమనించడం లేదన్నదాన్నిగూర్చి నా అనుభవాన్ని యిక్కడ చూపుతాను—కుమారసంభవంలో 5 వ సర్గలో " తపశ్శరీరైః కఠినై రుపార్జితం తపస్వినాం దూర మధశ్చకార సా " అని కాళిదాసు. యిక్కడ ఆత్మగా మిత్వం స్పష్టం కాఁబట్టి, అధశ్చక్రే అనవలసి వుఁటుంది. మఱిన్నీ వ్యాఖ్యాతలుకూడా యీ సందర్భాన్ని బొత్తిగా గమనించడం లేనేలేదు. చూడండి చతుర్థసర్గలో- " శ్లో. కురు సంప్రతి తావదాసుమే " అన్న శ్లోకంలో పెద్దిభొట్లుగారు — " కురు = కురుష్వ " అని అభేదోపపత్తికంగా వ్యాఖ్యానించివున్నారు. మఱిన్నీ మురారినాటకంలో— " శ్లో. ఇహతు కిం కరవై " అనే శ్లోకవ్యాఖ్యలో - " కిం కరవై కింకరవాణి, కిం కరిష్యా మీతి భావః " అని అభేదోపపత్తికంగా వ్యాఖ్యానించి వున్నాఁడు వ్యాఖ్యాత. కొన్ని వందలేనా వేలేనా యీలాటి ఆధారాలు యీ సందర్భంలో చూపఁగలను. యిట్టి కష్టసుఖాలు లేశమున్నూ పరిశీలించే వోపిక లేని గురువులు, అనాలోచితంగా ఉభయపదులైన ధాతువుల ప్రయోగం విషయంలో ఆ కొల్లాపుర పండితుని " కొఱవితో తలగోఁకికొన్నట్లు " ఆక్షేపించడ మెందుకు ? అంతటితో తృప్తిపడక, పెండ్లిపీఁటలమీఁదవున్న రాజదంపతులను ఆశీర్వచించిన శ్లోకాలు అనేనా ఆలోచించక ఆశ్లోకాలను " తగలఁబెట్టుకో " మనడం యెందుకు ? మంగళార్థం ఆశీర్వచించిన శ్లోకాలను " అమంగళం " అనడమే కాకుండా, దిక్కుమాలిన అసహ్యమైన దురర్థాన్ని హృదయంలో వివక్షించి "అశుద్ధం" అనడం యెందుకు? అని నాకుపట్టుకున్న విచారాన్ని నేను లోకులకు మనవి చేసుకుంటాను. యింకా ఆబ్రాహ్మడి కవిత్వంలో, " అశ్లీలం " వుందంటూ కొంత వ్రాశారు. అది న్యాయం కాదన్న నన్ను చాలా దూషించారు. దాన్ని

గూర్చి "అన్నీ నమ్మవలసిందేనా" అనే వ్యాసంలో విస్తరించి వ్రాసి కృష్ణవారికి యిదివఱకే పంపివున్నాను. యింకా వారు ప్రచురించలేదు. ప్రచురిస్తారు. అప్పుడు చదువరులు తెలుసుకుంటారు.

ఇఁక "వైకర్తన" శబ్దాన్నిగూర్చి కొంత వ్రాస్తాను. యీ "వైకర్తన" వాదంలోనే "జలతాడనం" అని నేనొక వ్యాసానికి పేరుపెట్టివున్నాను. ఆ పదానికి సంప్రదాయార్థం గమనింపక దానిలో తమకు దూషణమేమో వున్నట్టు గురువరులు తఱుచు వ్రాస్తూవుంటారు. అదిచూస్తే నవ్వువస్తుంది. యీ 'వైకర్తన' విచారం శ్రీకట్టమంచివారు నన్నయ్యగారిని ఆక్షేపించడానికి అర్జునుఁడుచేత కర్ణుణ్ణి 'కానీన' పదంచేత సంబోధింప చేశాఁడంటూ రాజమండ్రిసభలో వుపన్యసించడానికి సంబంధించిన వాదంలోది. "కానీన" అని సంబోధించినట్లు వ్రాయడం యుక్తంగా లేదని శ్రీయుతులు రెడ్డిగారు వుపన్యసిస్తే నేను అన్నానుగదా, యీలాటిప్రసంగం వ్యాసులవారున్నూ చేసివున్నారు పలుచోట్లను, కాఁబట్టి యీ లోపాన్ని నన్నయ్యగారికి అంటఁగట్టడంకంటె అసలుసంస్కృత భారత కర్తకే అంటఁగడితే యుక్తంగా వుంటుందన్నాను. కానీనపదానికి అర్థం "కానీనః కన్యకాజాతః" కనక, కన్యయొక్క- అనఁగా కన్యకావస్థలో వున్న కుంతికొడుకు అనే అర్థంగదా వస్తుంది. ఆలావస్తే యేంచిక్కు-వస్తుందంటే : ఆ మాట పలికినవాఁడు అర్జునుఁడవడంచేత అర్జునుఁడికి కర్ణుని జన్మరహస్యం తెలిసినట్లయిపోయింది కనక, భవిష్యద్భారతకథకు ప్రసక్తి లేకపోవడం తటస్థించడంచేత "మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అవుతుందని రెడ్డిగారి ఆక్షేపణకదా? అట్టి ఆక్షేపణ మఱికొన్ని పదాలవల్ల కూడా కలుగుతుంది అనే అర్థం యిచ్చేటట్టు సూత్రప్రాయంగా మాటలాడివున్నాను. నేను మాట్లాడే సందర్భంలో దొర్లిన "వైకర్తన" పదానికి సూర్యపుత్రుఁడని అర్థం కాదనిన్నీ, దానికి — సహజకవచకుండలాలు కత్తిరించి బ్రాహ్మణవేషంతోవున్న దేవేంద్రునికి దానంచేసినవాఁడు—అని అర్థమనిన్నీ, వక విశ్వబ్రాహ్మణాచార్లగారి పేరుతో వక దీర్ఘవ్యాసం న్యాయ

దీపికలో నన్ను మిక్కిలి తూలనాడుతూ గురువులను కొంత భూషిస్తూ వెలువడింది. పల్లెటూరవడంచేత మాగ్రామం, నాకు ఆ వ్యాసం చూడవలసిన ప్రసక్తి కలగనేలేదు. కాని తరువాత 5, 6 మాసాలలో చిత్రాడలో శ్రీ చెలికాని లచ్చారావుగారు ఆంధ్రభాషా విషయంలో చేయించిన వాకానాక సభకు నేనుకూడా వెళ్ళడం తటస్థించి అక్కడ యెవరో చెప్పడంచేత ఆ వ్యాసం సంపాదించి చదవడం సంఘటించింది. ఆ వ్యాసం యెంత అనుచితంగా వుండాలో అంత అనుచితంగానూ వుంది. ఆ పట్లాన్ని దాన్ని ఖండిస్తూ కృష్ణాపత్రికలో వ్రాఁతకు వుపక్రమించాను. ఆవలిపార్టీ వోడిపోవడమైతే జరిగిందిగాని, ఆ వోడేలోగా గురువుగారిభారతాన్ని నేను వకచోట "చింత్యం" అనివ్రాయవలసి వచ్చింది. ఎందుకుఅట్లా వ్రాయవలసివచ్చిందంటే : ప్రతివాదులు గురువుగారి భారతాన్ని వైకర్తన శబ్దానికి తాము చెప్పే అర్థానికి ఆధారముగా వుపయోగించుకుంటారని తెలిసింది. అప్పుడు గురువుగారి భారతం పరిశీలిస్తిని కదా, పరిశీలిస్తే యెటామొటీగా కనపడ్డది వకచోట. "వైకర్తనుఁడు" అనే పదానికి సూర్యునికొడుకు అని వ్రాయఁబడివుంది. యీ మాట సరియైనదిన్నీ అవును, నా వాదానికి అనుకూలించేదిన్నీ అవును. యింకొకచోట దీనికి విరుద్ధంగా వుంది. అది నా వాదానికీ వ్యతిరేకమే. గురువుల రచనకున్నూ వ్యతిరేకమే. యెందుచేత ? పరస్పరవిరుద్ధముగా వుండడంచేత. అప్పుడు నేనేంచేసేది ? యేమీ చేయడానికి అవకాశంలేక —— "చింత్యము" అని వ్రాశాను. వ్యాఖ్యాతలు మహాకవుల గ్రంథాలలో యెక్కడేనా అనుచితస్థలం కనపడితే "చింత్యం" అని అనడం ఆచారం. ఆ మాటకు పర్యవసానంలో అర్థం మాత్రం తప్పు అనేకాని మఱివకటి కాదు. దానిమీఁద గురువుగారికి కోపంవచ్చింది. వచ్చి నాపేర ఒక కార్డుకూడా వ్రాసియున్నారు. దానిలో ముఖ్యాంశం యిక్కడ వుదాహరిస్తాను.

"..... .. నా భారతములో వ్రాసినయంతకును నేను సమాధానము చెప్పగలను. అది తప్పనిగాని ప్రమాదమనికాని చింత్యమని తెలివిలేమి

యని కాని వ్రాసిన వ్రాంతలు నిరర్థకములు కాఁగలవు "......................

వేంకటరావు.

91 అన్నాపిళ్ళవీధి,
మదాసు. } 2—4—23

పైపత్త్రరములో వ్రాసిన మాటలు వారుకాదుగదా సాక్షాద్బ్రహ్మ వంతుఁడవతరించినను సమర్థింపఁజాలనివే అయినప్పటికీ, వారి అమాయకత్వాన్ని నేను పూర్తిగా యెఱిఁగివుండడంచేత, అయ్యో నేను "చింత్యం" అన్న వ్రాఁత యేలా నిరస్తం అవుతుందో కనపఱచవలసిందని గతించిన పదమూడేళ్ళనుండిన్నీ ప్రశ్నించలేదు సరికదా, యిఁకముందుకూడా ప్రశ్నింపఁదలఁచుకోలేదు. ఎందుచేత? అది ప్రమాదంవల్ల కలిగిన తప్పుకదా? వారికిన్నీ కలుగుతుంది అట్టిప్రమాదం, మఱియొకరికిన్నీ కలుగుతుంది. "తలవున్నవాళ్ళ కందఱికిన్నీ పేలుంటాయి" కదా? ఆ వుత్తరంలో గురువుగారు యింకొకమాట వ్రాసివున్నారు. "నేను వ్రాసిన మీకును మీకును చోటుంచి వ్రాయనెంచను" అని. పైమాటవల్లనేమి, వుత్తరంలో వ్రాసిన మఱికొన్నిమాటలవల్లనేమి యెంతో సర్వజ్ఞత్వం వెల్లడి అవుతూవున్నప్పటికిన్నీ, మా యిద్దఱికిన్నీవుండే సంబంధంలో నాస్థానం బొత్తిగా క్రిందిది కావడంచేత నేను కిక్కురుమనక "కుక్కిన పేనులాగ" వూరుకున్నాను.

ఈలాగ వంగివంగి సలాములుచేసుకుంటూ "అత్తా నీకొంగు చొసిలిందంటే యేమితప్పో, వసలలేదంటే యేమితప్పో" అన్నట్లు నేను కాలక్షేపం చేసుకువస్తూ వుంటే, నేనేమో వారిభారతాన్ని విమర్శించి దూషించానంటూ గురువులు వ్రాస్తారు. గీరతాన్ని శృంఖలంలో "మహాగ్రంథం" అంటూ వెక్కిరిస్తే కూడా నేను కిక్కురుమనలేదు. యెన్నో అపరిగల్భపు మాటలతో ఆ శృంఖలంలో నన్ను దూషిస్తే వాటిని నేను గణింపక, "శాంతివ్యాసం" లో కొంచెం సూచించి వూరుకోవడమే కాకుండా పెండేరాన్నికూడా నాస్వంతచేతులతో మహాసభలో తొడిగి

వున్నాను. వీరు "శృంఖలం" లో నన్ను దూషించినఅనంతరమందే నేను "శాంతివ్యాసం" వ్రాసినాను. లేకపోతే నేను వ్రాసేవాణ్ణికాను. దానిపోకడ యెంతయుక్తంగా వుంటుందో గురువుల కేంతెలుస్తుంది? వారిమనస్సు కోపఘూర్ణితంకదా? చదువరులకు తెలుస్తుంది. అది తమకు చాలా బాధకంగావుంది అంటూ వ్రాస్తారు గురువులు. వుంటే తప్పేమి? మహాపండితుఁడికి "చాకలివానిచే జవాబిప్పిస్తా" మని తాము వ్రాయడాన్ని నేను ఖండించక సమర్థించఁగలనాయేమి? ఆ మహాపండితుఁడి పుస్తకాన్ని విమర్శిస్తారు సరే; ఆపుస్తకం "పెంటమీఁద దొరికిం" దంటూ వ్రాసేమాటను నేను సమర్థించఁగలనాయేమి? గురువులయితేమాత్రం అయొచ్చేదీ పయొచ్చేదీ ఆలోచించక కొన్ని అప్రగల్భపు వ్రాఁతలు వ్రాస్తే వాట్లను శిష్యుఁడు సమర్థించఁగలఁడా! యీవిషయం నేను వ్రాయడం యెందుకు! యిప్పుడు నెల్లూరులో పత్రికలకు పనిచెపుతూవున్న వేటూరి విషయం వల్ల లోకానికి స్పష్టమే.

"అల తాళ్ళపాకచిన్నన్నరోమములైతే తంబురుదండెకు తంతులౌనె" అన్నట్లు వెం॥ శా॥ యం దభిమానముంటే శిష్యులు వెం॥ శా॥ కవిత్వాన్ని మెచ్చుకొని సంతోషించవలసిందేకాని, వెం॥ శా॥ బాల్యంలో కాని యౌవనంలో గాని చేసిన కృత్యాలనన్నిటినీ సమర్థించడానికి పూనడం వెం॥ శా॥ కి లేశమున్నూ వుపకారంగాదు. పైగా అది అపకారం అయితీరుతుంది. వాళ్ళు సమర్థించడానికి పూనుకోకపోతే కొంతవీలు గాని, పూనుకుంటే మఱింత కంపుకొట్టించడానికి హేతువవుతుంది. అట్టిశిష్యులు అంతరంగికభక్తులేఅయినప్పటికీ బాహ్యానికి ఆలోచిస్తే మహాశత్రువులుగా పరిణమిస్తారు. ఆమధ్య యెవరో వకాయన శ్రీనాథుణ్ణి యేకపత్నీవ్రతుఁడని సమర్థించడానికి ఆరంభించాఁడు. వద్దుమహారాజా అని ఆయన్ని తణుకులో కాఁబోలును నేను బతిమాలుకున్నాను. యెందుచేత? దానితో శ్రీనాథుఁడి బ్రతుకు ఆ విషయంలో మఱీ చెడుగుగా యెవరో సమర్థించడానికి మొదలు పెడతారనే భయంచేతనే. పనిలోపని నాశిష్యులను నేనిట్లు

కోరుతాను. నాయనలారా! మమ్మును గూర్చి, లేదా నన్ను గూర్చి మీరు అపవాదవిషయానికైతే యెవరితోనైనా వివాదపడవలసివచ్చేగాని యథార్థానికి వివాద పడవద్దు. నిజం వకలాగువుంటే, అది నా యశస్సుకేమో బాధకమని దాన్ని సమర్థించడానికి పూనుకోవద్దు. దానివల్ల మరింత చెడుతుంది.

గురువుగారు ప్రస్తుతం వ్రాస్తూవున్న వ్రాఁత బాగా లేదనిన్నీ, అపరిగల్ప్యంగా అనాలోచితంగా అయుక్తంగా వుందనిన్నీ తమనోటితో తాము చెపుతూకూడా పైకి మఱొకలాగు అపలాపించే రెండువ్యక్తులు మొన్న చెన్నపట్టణప్రయాణంలో నాదగ్గిరికి వచ్చారు. వారు నేనేమో తమరిని బుద్ధిలేనివారని అన్నట్లు పుట్టించారు. అక్కడ చి॥ నా రెండో కుమారుఁడు దుర్గయ్యమాత్రం వున్నాఁడు. యితరసాక్ష్యం లేదు. వారిద్దరున్నూ "గూడుపుఠాణా" మాదిరివారు. నావద్దకు వారు రావడం, నేను వారిని అవమానించడం అన్నది నా చరిత్రకు కళంకం కాదా? అప్పుడు నేనేంచేశానంటే: చట్టన నా శిరస్సు వారిపాదాలకు వప్పగించి క్షమాపణ వేడుకొన్నాను. వారైతే సంశయించారుకాని నేను యేలాగో నా శిరస్సు వారి పాదాలకి తగిల్చి కృతకృత్యుణ్ణిఅయినాను. ఆమధ్య గురువులవారిని కూడా—యెందుకు, మీకీవాదంలో జయంకలగదు విరమించండి, రాజీపడదామని యిట్లే వేడుకున్నానుగాని, దానిమీఁద వారు కోపంవచ్చి ఆకాశాన్ని అందుకొని, "హార్టు" జబ్బువున్నవారవడంచేత నాకొంపకు చిక్కువచ్చేపద్ధతిదాఁకా వచ్చారు. యీ విషయం కృష్ణలో యిదివఱలో కొంచెం సూచించేవున్నాను.

"సుధర్మ" అనే పత్రికలో "అశుద్ధం, అమంగళఁ, తగలఁబెట్టుకో" అనేదాన్ని సమర్థించడాన్ని గూర్చి ప్రయత్నించండి అని గురువులను ప్రార్థించి వున్నాను. దాన్నిగూర్చి లేశమున్నూ గురువులు ప్రయత్నించడంలేదు కాని, నా కవిత్వం "తప్పులతడక" అంటూ

యేమో వ్రాస్తారు. తప్పులతడకే అనుకుందాం. అంతలో తమకు వాలికే దేమిటి? తమ భారతాన్ని నేను విమర్శించానంటారు. విమర్శించలేదు. అసారమని అనేవారికి కొన్నిచోట్లు ఆధారంగా వున్నాయనిమాత్రం వ్రాశాను. ఆమాత్రంకూడా నేను వ్రాసేవాణ్ణి కానుగాని - పుణ్యపాపాలు దేవుఁడెఱుఁగును. అపారధారలో ప్రవహించడమే కాకుండా అనితరసాధ్య మని అనేక విజ్ఞులచే పొగడఁబడే గీరతాన్ని పనిలేనిపాటగా గురువులు "శృంఖలం" లో తృణీకరించారు. దానిమీఁద ఆ కాస్తమాటా నేను వ్రాయవలసివచ్చింది. నేను అసారం అన్న "స్త్రీస్వాతంత్ర్యము........" అన్న పద్యాన్ని మాత్రం విమర్శించి దాఁచివుంచాను. నేఁడో రేపో దాన్ని ప్రచురిస్తాను. గురువుగారి విమర్శనలాగే వుంటుందో మఱొకలాగ వుంటుందో చదువరులే నిర్ణయిస్తారు.

చెట్టు చెడే కాలానికి కుక్కమూతిపిందెలంటూ యీ మధ్య గురువులు నన్నుగూర్చి వ్రాస్తారు. అవి నా వినాశనాన్ని కోరుతూవున్నట్లు స్పష్ట పరుస్తూవుందికదా? అగుఁగాక, దానికిన్నీ నాకు అంగీకారమే. కాని నేను చేయవలసినపని కాస్తా జరిగించడం యిప్పటికి పూర్తికనక, వారి కోరిక సిద్ధించినా శ్రీవారికి లాభం కనపడదనుకుంటాను. అలాటి కడు పుబ్బుమాటలు విమర్శనమని గురువులనుకుంటారు. శాంతం పాపం. అది అటులుండుఁగాక. నా గీరతరచనకు కారణం శిష్యుల తిరుగుబాటే కదా? భవతు. బోలెఁడు భేదం ఆ తిరగఁబాటుకున్నూ ప్రస్తుతపు తిరగఁ బాటుకున్నూ వున్నప్పటికిన్నీ గురువులు వెం. రా. ల కలహంతో దీన్ని సమంచేయడానికి యత్నిస్తూన్నారు. యిది లేశమున్నూ అట్టిది కాకపోయి నప్పంటికీ అభ్యుపగమ్యవాదంగా క్షణకాలం వప్పుకుంటూ గురువులను వక మాట అడుగుతాను. అయ్యా! నేను శిష్యుల తిరుగుబాటునుగూర్చి వ్రాసిన కవిత్వాన్ని గీరతాన్ని మీరుచిత్తగించే వున్నారు కదా. యిదిన్నీ శిష్యుని తిరుగుబాటేకదా. మీరుకూడా అట్టి కవిత్వాన్ని రచించి లోకాన్ని మెప్పించండి చూస్తాను. లేదా? లోకమేచూచి మీ రచనకున్నూ

నా రచనకున్నూ వున్న తారతమ్యాన్ని నిర్ణయిస్తుంది. యింతే నా మనవి. నాది బొమ్మలాట కవిత్వమో పగటివేష కవిత్వమో లోకం అప్పుడు నిర్ణయిస్తుంది. పూరికే మనవి చేసుకున్నానుగాని ఆ ధార మీకుకాని సరికదా యిప్పుడు నాకున్నూ నడవదు అని నేను పూర్తిగా యెఱుఁగుదును. యిప్పుడు తాము సెలవిచ్చినట్లు " కుక్కమూతి పిందెలు " అనే మాటకు వుదాహరణంగా " రాజు వచ్చిన – రాకళ్లకూ పాపయ్యేంటేనా " అనే బొబ్బిలికథలో చరణాన్నిబట్టి మన వివాదాన్ని గూర్చి యిన్నాసే మీ అయుక్త ప్రసంగాన్ని " ప్రజాసేవ " లో చూచిన ఆవేశంలో

* " కృష్ణమూర్తిగారీ చర్యలకు తిరపయ్యేంటేనా – తందాన తానా – వుంటేమాత్రం యేమవుతుంది చెల్లపిల్లగారూ ; తందానతాన. "

అనే శైలిలో పదకొండు వందల చరణాలు వ్రాసివున్నాను. నెల్లూరులో మనయుభయుల్నీ ప్రేమించేవారు కొందఱు వినివున్నారు. నేఁట రేపట అది అచ్చుకాఁబోతుంది.

నేను యీ మహానైవేద్యంలో చూపిన సమాధానాలు మీ కెంత వఱకు నచ్చాయో యెంతవఱకు నచ్చలేదో తెలుపకుండా యిటుమీఁద మీరు నా కవిత్వాన్ని యెంత దూషించినా దాన్ని నేను బాలభాషితంగా భావించి వూరుకుంటానేకాని వ్రాఁతకు దిగేది లేదు. సమర్థతవుంటే యింతవఱకు యిచ్చినదాన్ని ఖండించి పైకి కలాన్ని నడపవలసింది. యింతేకాదు. విజ్ఞులు పలువురున్నారు. వారిద్వారాగా మీ విమర్శనము నందలి సారాన్ని నేను తేల్చితీరుతాను. యింతే నా సమస్కృతులు. దివ్యచిత్తమునకు తేఁగోరినాను.

గురువులు నేను భారతాన్నుంచి – ' మనుజుల విప్పిండు ' అనే ప్రయోగాన్ని చూపితే దాన్ని లేఖక దోషమని అపవదించి ' కాంచనమును జనులందు విప్పిండు ' అనికాని ' నరులందు విప్పిండు ' అనికాని సవ

* " దివ్యతిరుపతి " అనే లఘుకావ్యం చూడుడు.

రింప వచ్చును అంటూ కొన్నిమాటలు వ్రాశారు. "లేఖక ప్రమాదము లున్న నవి నింద్యములే" అనడానికి మొదలుపెట్టినారు. "మనుజుల" అనేదాని విషయంలో గుప్తార్థప్రకాశిక వారుగాని, త్రిలింగలక్షణశేషం వారు గాని యీ తోపతొక్కలేదు. గురువులు తుదకీ తోవ తొక్కవలసి వచ్చింది. వెనుక ఆత్మకూరు సంస్థానంలో "దేవతలు ధర్మవర్తులు" అనే ప్రయోగం యిస్తే ప్రతివాదులు "ధర్మవృత్తులు" అని దిద్దడానికి వుపక్రమించే మాకు గజారోహణోత్సవాన్ని సంఘటించి యిప్పటికికూడా మా అభివందనాలకు వారు పాత్రులుగా వున్నారు. యిది రాజసభ కాదు గదా? అడిగే దిక్కేలేదు, తోఁచినట్లల్లా వ్రాదామని గురువులు సాహసిస్తూవున్నారు. "శ్లో. స్వాధీనో రసనాంచలః పరిచితా శ్శబ్దాః కియంతః క్వచి। త్క్షోణీంద్రో న నియామకః పరిషద శ్శాంతా స్స్వతంత్రం జగత్" అనే శ్లోకాన్ని గుంటూరుసీమ పీఠికలో వుదాహరించినట్లు జ్ఞాపకం. "వీరి వాదం యుక్తం వీరిది యుక్తంకాదు." అని శాసించేవారు లేకున్నప్పుడు యేవాదాలేనా సరే "ముఖమస్తీతివక్తవ్యం" గా నడచిపోతాయి. ప్రస్తుతం మావాదానిక్కూడా అదేగతిపట్టిన దనుకోవాలి. లేకపోతే, తిక్కన్న గారి 'జనులందు' 'నరులందు' అనేపాఠాన్ని 'మనుజుల' అని లేఖకులు మార్చడానికి యేమంత వచ్చిందో ఆలోచించుకోవలసి వుంటుంది. తిక్కన్నగారి ప్రయోగం వుందికదా అని యిటీవల పుట్టినవ్యాకరణాలు సవరించవలసివుంటుందిగాని, యిటీవల పుట్టిన వ్యాకరణాలవల్ల కవిబ్రహ్మ గారి ప్రయోగాన్ని సవరించవలసి వుండదు. గురువుగారు "మనుజుల విప్రుండు" అనేప్రయోగాన్ని లేఖకకల్పిత మనడం అతిసాహసం. పోనీ దానికే వప్పకుండా మన్నప్పటికీ గురువులవారి వాదం నెగ్గదు — "భక్షితేఽపి లశునే న రోగ శాంతిః." యెందుకు నెగ్గదంటే: గురువులు తమ భారతములో — "ఆర్యవర్యుల రెడ్డియ్య యశముగాంచె" అని ప్రయోగించి వున్నారు కదా! 'ఆర్యవర్యులయందు' అని అర్థం అక్కడచెప్పి తీరాలి. షష్ఠీసమాసమనికాని వేరొకవిధమనికాని చెప్పితే నెగ్గదు. యెందుకు

నెగ్గవో పనిపడ్డప్పుడు మనవి చేసుకుంటాను. నేను యే మహాకవి ప్రయోగాన్నైనా యిస్తే సమాధానాంతరం కనపడక - "బుడబుడక్కల" వాని ప్రయోగం అంటూ అపహసిస్తున్నారు. తమ భారతాన్నుంచి యిచ్చిన 'ఆర్యవర్యుల' ప్రయోగాన్ని కాని 'నడిపించు' 'పురమేగి' వగయిరా ప్రయోగాలనుకాని యేమనఁదలఁచి వున్నారో కదా? యిది యిలా వుండఁగా గురువులు ఆ యీ ప్రయోగాలని గుఱించి యెవరి మతాన్నిపట్టి ప్రవర్తిస్తారో మనకు ముందు తెలియాలి. భారతాన్ని పట్టి వెళ్లేయెడల అది మంచిమార్గమే. ఆ విషయం తమ భారతంలో వ్యక్తం కావాలి. వ్యక్తం కావడం లేదు అని నేను ఋజువు చేస్తాను. లేదా, కవిత్రయేతరులను కూడా వప్పుకుంటే, ఆ యితరులలో యెవరెవరిని వప్పుకుంటారు? ఆ సంగతి తెలియాలి. యెవరిని వప్పుకోమని అంటారో వారిపేళ్లు చెప్పి. వప్పుకోకపోవడానికి వుండే ప్రబలకారణం కూడా చెప్పాలి. అప్పుడు వాదించే వారికి మార్గం దొరుకుతుంది. అంతేనేకాని స్వవచోవ్యాఘాతంగా వ్రాసే వ్రాఁతలవల్ల అపహాస్యత్వంతప్ప ప్రయోజనం ఉండదని మనవి చేసుకుంటాను. గురువుగారు ప్రస్తుతం భారతాది ప్రయోగాలనుగూర్చి తొక్కే త్రోవలు యేలాటివో నిర్ణయించి తమ అభిప్రాయాన్ని వెల్లడి చేయక తప్పదని శ్రీజయంతి రామయ్య పంతులువారిని ప్రార్థిస్తూవున్నాను. వారు మా యిద్దఱి కన్నా పెద్దలు, కవులు. యింకా భాషావ్యాసంగాన్నుంచి విరమించలేదు. యిట్టి విషయంలో వుపేక్షించరని నా నమ్మకం. కాఁబట్టి వారి నింతగా ప్రార్థించడం. పంతులవా రింకాకూడా కలిగించుకోకపోతే అమధ్య జబ్బు చేసినప్పుడు "మృత్యుంజయుణ్ణి" పట్టుకు పీడించి నట్లే పట్టుకు పీడిస్తాను. వదిలేది లేదు. పద్యాలతో కూడా యాచన ప్రారంభించాను. కాఁబట్టి వారు కలిగించుకోవాలి.



# కోపోద్రేక మహత్త్వము

( వ్రాఁత ప్రతినుండి )

కోప మతిశయిస్తే దాన్ని కోపోద్రేక మంటారు. యిది త్రిగుణాలలోనున్నూ, తమోగుణానికి సంబంధించింది. అంతో యింతో ప్రతి వ్యక్తికిన్నీ యీ తమోగుణం తక్కిన సత్త్వరజోగుణాలతో పాటు వాత పిత్తశ్లేష్మాలవలెనే వుండి తీరుతుంది. కాని కొన్ని వ్యక్తులయందు తమోగుణమే ప్రధానంగా వుంటుంది. వారి కోపం బొత్తిగా అయెుచ్చేదీ పయెుచ్చేదీ తెలియనీయక యేమాటనేనా పలికిస్తుంది. యే మాట నేనా వ్రాయిస్తుంది. యిఁక ప్రస్తుతానికి వస్తాను. శ్రీ మా గురువులలో నొకరగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు తమ ప్రతిపక్షి కొల్లాపురం పండితునికి నేను తమకు వ్యతిరేకించే సదభిప్రాయం యిచ్చినాననే హేతువుచే వారి "శృంఖలం" గ్రంథంలో నన్నుఁగూర్చి యేమేమో దూషిస్తూ వ్రాస్తూ ఆ సందర్భంలో సుమారు నే నిప్పటికి నలభైయేదేండ్లనాఁడు రచించిన "కామేశ్వరీ శతకాన్ని" గూర్చి యెట్లా వ్రాశారో చూపి పిమ్మట దాని తత్వాన్ని తేలుస్తాను. ఆ తత్త్వం తేల్చడంలోనే నేను వుంచిన హెడ్డింగు సార్థక మైనదా? నిరర్థక మైనదా? అన్న సందర్భం తేలుతుంది.

"కామేశ్వరీశతక మంతయు పరదూషణమేకదా"

పై వాక్యం గురువుగారి "శృంఖల" గ్రంథంలోనిది. యీ మాటను నే న్నిడివజలో ముక్త్యాలవ్యాసంలో వుటంకించి యీ క్రింది మాటలు వ్రాసి విరమించి వున్నాను.

"దీని కేం వ్రాయను! నేను వ్రాయడ మెందుకు? గ్రంథం పెరగడానికే కదా? అది అలాటి దేయేమో?"

యితర ప్రసక్తిలో పై మాటలు మాత్రం వ్రాసి విరమించి నప్పటికీ ఆ కామేశ్వరి మాత్రం నన్ను రోజూ పీడిస్తూనే వుంది. యేమని?

నన్నుగూర్చి నీవు వ్రాసిన శతకంలో యెక్కడో వకటి రెండు పద్యాలేనా కాక అంతా పరదూషణమే అంటే నోరు మూసుకు పూరుకుంటా వేమిరా! అని. యితరులు దాన్ని గుఱించి యెవరేనా యీలాటి మాటలు వ్రాశారా? యెందుకు వ్రాస్తారు? వ్రాస్తే సమర్థించుకోవద్దూ? గురువుగారు రెండుకు వ్రాయాలీ? సమర్థించుకోఁగలవారు కనుకనున్నూ, వారి మఱివక వ్రాఁతను నేను సరియైనది కాదని వ్రాశాను కనుకనున్నూ, ఆలా వ్రాయవలసి వచ్చింది కనక వ్రాశా రనుకోవాలి. యితరులు వ్రాసిన దాన్ని కొంచెం చూపుతాను.

"వీరి కృతులలో నీ కామేశ్వరీశతక మొకటి. రచనా కౌశలమును విషయసందర్భమును బట్టి యీ శతకము వేంకటశాస్త్రిగారు రచించినటులఁ దోఁచుచున్నది..........లోనగు పద్యముల వలన కవి వ్యాధి పీడితుఁడై శతకమున నందందు బాధానివృత్తికిఁ గొన్ని పద్యములు రచించి రని తోఁచును. కొన్ని పద్యములు కవికిఁ గల యాత్మ గౌరవాభిమానములు స్వతంత్రభావములు, పూర్వాచారప్రీతిని, వెల్లడించు చున్నవి. ఈ కవుల గ్రంథముల వలెనే యీ శతకముగూడ నూతన భావసమన్వితమై వాఙ్మయమున నొక గౌరవస్థానము నొందఁదగియున్నది..................."

తండయార్పేట, చెన్నపట్టణం.
10—1—26

ఇట్లు
(ద) వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు.

పై వాక్యములు శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారు తమ శతక సంపుటములలో రెండవదానిలో చేర్చుకోవడానికి మా సమ్మతిని కోరి ముద్రించేటప్పుడు శతక పీఠికలో వ్రాసినవి. గురువుగారి యుద్దేశంవంటి వుద్దేశాన్ని ఆ వేంకటేశ్వరశాస్త్రిగారు పొందినట్లులేదు. గురువుగారి అభిప్రాయం చొప్పున యీ శతకంలో యే వకటి రెండో కూడా కాక అంతా పరదూషణమయమే అయితే ఆ యా మహాకవుల శతకాల్లో వారంతటవారు చేర్చుకోరు సరికదా? మా అంతటమేము వారిని ప్రార్థించి

నప్పటికీ చేర్చుకోవడానికి అంగీకరించరుగదా ? దీన్ని వారు చేర్చు కొన్న సంపుటంలో యిది కాక మఱిపందొమ్మిది శతకము లున్నవి. దీనితో పెరశి యిరవై. వాట్లిపే ర్లుదాహరించడం అవసరమే అనుకుంటాను. సూర్యనారాయణ, రాజలింగ, రఘుకులతిలక, మహిషాసురమర్దని, ఉద్దండ రాయ, గొట్టుముక్కలరాజ, గోపాల, రుక్మిణీపతి, జ్ఞానప్రసూనాంబిక, ముకుంద, శివ, రమానాయక, భక్తచింతామణి, సీతాపతి, మహిజామ నోహర, పార్థసారధి, రాజశేఖర, రంగేశ, మాధవ, విశ్వనాథ, అనే మకుటాలు గల శతకాలతో మా కామేశ్వరీశతకాన్ని చేర్చి ముద్రించు కొన్నారు. శ్రీయుత రెంటాల సుబ్బారావుపంతులుగారు వారి శతకాల సంపుటాలలోనే అని జ్ఞాపకం మా కామేశ్వరినుండి కొన్నిపద్యాలు "తత్రిశ్లోకచతుష్టయం" అన్నట్టుగా యేరి తీసుకొని చేర్చుకున్నారు. శ్రీ చెలికాని లచ్చారావుగారు కూడా మమ్మి కోరి వారి శతక సంపుటాలలో మా శతకాన్ని సంపూర్తిగా పుచ్చుకున్నారు. వీరెవ్వరున్నూ అప్రాజ్ఞులుకారు, గురువుగారికి తోఁచిన విపరీతాభిప్రాయం వీరి కేల తోఁచలేదో? యింతవఱకే కాని శిష్యస్థానంలోవాణ్ణికావడంచేత యీ ఘట్టంలో అధికంగా వ్రాయడానికి నాకు అధికారం లేదు. గురువుగారు మఱికొన్ని సందర్భాలలో యిదేరీతిని పరిశీలించకుండా అనడంకూడా నేను స్వానుభవంచేత యెఱుఁగుదును. మచ్చుకు వకటి వుదాహరిస్తాను. శ్రీ మోతే నారాయణ రావుగారి కంపెనీ రాజమండ్రీ వచ్చి సుమారు పందొండేండ్లనాఁడు మా మృచ్ఛకటిక నాటకాన్ని ప్రదర్శిస్తూవుంది. ఆ సభకు గ్రంథకర్తృత్వ ముండడంచేత నన్ను మా గ్రామాన్నుంచి తీసుకు వెళ్ళారు. స్వగ్రామ మే కనక వారికోరిక ననుసరించి గురువుగారున్నూ దయచేశారు. నాటకా రంభమైన తరవాత వక గంటలోగా కాఁబోలును కూర్చొని నాతో అన్నారు. యేమిటి యీనాటకం యింత పాడుగావుంది అని అసహ్యాపడడానికి మొద లెట్టారు. యే మనుకొనేది ? మేము తెలిఁగించడంలో పాడుచేశా మంటే ఆ మాట కొందఱికి కాకపోతే మఱికొందఱికేనా రుచిస్తుంది. నటకులను

గూర్చి అన్నారేమో అంటే వారినిగూర్చి కాదు. గురువుగారికి అసలు ఆ నాటకంయొక్క కథాసంవిధానమే నచ్చబడి కాలేదని శ్రీవారి ధోరణి వ్యక్తం చేసింది. అప్పుడు మెల్లిగా నేను, దీనిసందర్భం యిట్టిది. కాళిదాసు నాటకరచనకన్నను యీ షోడశికమహాకవిరచనకు విమర్శకుల హృదయంలో అగ్రస్థానం వున్నట్లు పూర్ణభాషావేత్త లనఁగా విన్నాను. తాము కొంత శ్రద్ధగా చిత్తగించండి, యీ అంశము తమకే క్రమంగా విశద మవుతుంది అని మనవిచేసుకున్నాను. దానిమీఁద కొంతసేపు చిత్తగించి మొదటిఅభిప్రాయాన్ని మార్చుకున్నట్లు కనపడినట్లు నాకు తోఁచింది. అలాగే యిప్పుడుకూడా కామేశ్వరీశతకాన్ని సవిమర్శంగా చదివితే అభిప్రాయం మాఱుతుం దేమో నని నా యాశ. శతకంలో కొన్ని నేఁటిఅనాచారాలనుగూర్చిన్నీ, పండితులకొడుకులకు పండితులు స్కూలులో చితవిద్యలను చెప్పించకపోవడాన్ని గూర్చిన్నీ కొన్నిపద్యాలు నడిచాయి. ఆ పద్యాలలో జనరలుగా దురాచారనింద కనపడుతుంది. అంతమాత్రం చేత ఆ శతక మంతా "పరదూషణమే" అని శాస్త్రులవా రెట్లు సాధిస్తారో చూడా లని నా మనస్సులో పుట్టిం దాశ వుంది. పోనీ గ్రంథంలో అధమం నాలుగోభాగమేనా ఆ విషయమైనపద్యాలుంటే గురువుగారువద్ద అభిప్రాయం కొంతేనా సమర్థనీయ మవుతుం దేమో అనుకుంటే, అబ్బే, నూటయెనిమిదిపద్యాలలో 14 పద్యాలు కాఁబోలును కనపడతాయి. 18 మొదలు, 32 వఱకున్నూ చూస్తే చదువరులకు ఆ పద్యాలధోరణి స్పష్టపడుతుంది. అన్నీ కాదు గాని ఆ బాపతులోవి కొన్ని పద్యాలు చదువరుల వినోదార్థం యిక్కడ వుదాహరిస్తాను.

మ. తమపుత్రుల్ స్వమతేతరమ్ములగువిద్యల్ నేర్చి పోషింతు రం
చు మతభ్రష్టులఁ జేయుపండితులు నీచుల్ గారె? ఏ రింక ద్ర
వ్యముకై కూఁతుల రోపెలందులుగఁ జేయన్ లేరె? యెవ్వారి దూ
ఱ మతేమాఁ గలికాలపున్మహిమ వార్యం బౌనె? కామేశ్వరీ! ౧

మ. సకలమ్మున్ గొరిగించుకొందు రకటా? సన్న్యాసులా? కారు, బ్రా
ట్టాకకొంతేనియు ఫాలమం దిడ రదేమో? ముండలా? కారు, వి
ప్రకులోత్తంసుల కిట్టిపాటు గలిగెన్ బై వారిమా ఛేల? యెం
దుకు లోకం బిటు మాఱె నీ కెఱుఁగరాదో? దేవి? కామేశ్వరీ. ౨

మ. పెఱవారిన్ గికురించి విత్తముఁ గొనన్ బ్రేరేపణల్ సేయుట
క్కఱుల న్నిక్కము న్యాయవాదు లనుకొంటల్ తప్పు వేశ్యాగుణ
స్ఫురణం బెల్లను వీరియందుఁ గనవచ్చున్ వీరలున్ వారలున్
ధర గేస్తున్ జెడఁదీయఁ గారకులు సత్యం బింత కామేశ్వరీ. ౩

విస్తర మెందులకు? గురువుగారు "పరదూషణమే కదా? అన్నే తమమాటను సమర్థించుకోవలసివస్తే పైపద్యాలను ఆధారంగా పెట్టుకోవాలి. ఆపద్ధతిని ధర్మశాస్త్రాలలో రజస్వల యగువఱకు కూఁతురికి పెండ్లి చేయనితండ్రులనుగూర్చి వ్రాసినధర్మశాస్త్రశ్లోకాలేమి, కలియుగధర్మాల ప్రస్తావనలో పురాణాలలో వ్రాసిన విషయాలేమి, పరదూషణములే కావలసివస్తుంది? పనిపడ్డప్పుడు ఆయాసందర్భాలు వుదాహరిస్తాను, యిప్పుడెందుకు? అయినా నాశతకంలోవుండేదోషాలు నా కేం తెలుస్తాయి. గురువుగారు వూరికే వ్రాసివుంటారా "అంతయు పరదూషణమే కదా" అని. బహుశః అన్నిపద్యాలలోనూ వారు అభిమతార్థాన్ని సాధిస్తా రేమో? వారు చూపించినపిమ్మట యేదేనా వ్రాయవలసినదుంటే వ్రాస్తాను లేకపోతే ఆ పద్యాలు వచ్చేముద్రణంలో తీసివేశేస్తాను. అన్నట్టు ఆ పద్యాలు అంటే యేలా కుదురుతుంది, "అంతయు" అని వ్రాశారు కదా? గురువుగారు. భవతు, వారు "చెరలాటం" లో వ్రాస్తూవున్న మఱికొన్ని సంగతులతోపాటుగా యిదికూడా కోపంమీఁద వ్రాసినట్టే భావించుకొని యిప్పటిమట్టుకు సమాధానపడడం మంచి దని ఆలా చేస్తూవున్నాను. గురువుగారిని విరోధించి అడగడానికి నాకు అధికారం లేదు గాని వారికి న్యాయ్య మని తోఁచినయెడల "కామేశ్వరీశతక మంతయు" అనే వాక్య

ముసు గూర్చిన సమర్థనము సభాముఖమునకూడా విందామని కోరెడు కుతూహలం వుంది. పత్రికలో యేవో వ్రాయకపోవుగాని ఆ గ్రాంత గపద గాయ్యగా వుండడంచేత నామట్టుకు యేలాగో తత్త్వం బోధపడ్డప్పటికీ యితరుల కెవరికో గాని అనఁగా యిదే పనిపెట్టుకొని పూర్వోత్తరసంద ర్భాలు జ్ఞాపకం పెట్టుకొని పాటుపడేవారికి తప్ప తక్కినవారికి సులువుగా బోధపడదు. యీ పద్ధతి అయితేనో? పుస్తక మంతా నూటెన్మిదిపద్యాలే కనుక ఆయాసభ్యులలో తలకొకశతకం చొప్పున ముఖ్యులైనవారి కిచ్చి గురువుగారిని వుపన్యసించమంటే వారు ఫలానా సంఖ్య. ఫలానా సంఖ్య. అని చెప్పవలసిన ఆవశ్యకత లేశమున్నూ లేదు కనుక ప్రారంభపుపద్యం మొదలుకొని తుట్టతుదిపద్యందాఁకా పరదూషణాన్ని సమర్థిస్తూ వుంటే విని యేకీభవించేవారు, యేకీభవిస్తారనిన్నీ వ్యతిరేకించేవారు వ్యతిరేకిస్తారనిన్నీ దానితో తత్త్వం బాగా తేలుతుం దనిన్నీ నా ఆశ. యింతే కాదు. తాము శ్రీకొల్లాపురంయువరాజుగారు పెండ్లికొడుకుగా వున్నప్పుడు వనం శాస్త్రుల్లుగారు ఆశీర్వచించిన శ్లోకాలను విమర్శిస్తూ తుట్టతుదను — "అశుద్ధం అమంగళం, తగలబెట్టుకొమ్ము, బూడిద దొరుకుతుంది" అని వ్రాసిన వ్రాఁతకున్నూ, కామేశ్వరీశతకంలో వున్న పద్యాలకున్నూ యెందులో యేమాత్రం పోలిక వుంటుందోకూడా సులువుగా సభ్యులే తెలుసుకుంటారని కూడా నా ఆశ. అందుకోసం యీ వ్యాసం వ్రాశాను. యేది వ్రాసినా నామీఁదనున్నూ, నా కవిత్వంమీఁదనున్నూ గురువుగారు ఆరోపించిన అపవాదలను తొలఁగించుకోవడానికి చేసేప్రయత్నమే కాని వారిని తిరస్కరించడానికి కాని వారికవిత్వాన్ని తిరస్కరించడానికి కాని చేస్తేప్రయత్నం మాత్రం కాదు. "సర్వస్స్వార్థం సమీహతే" కదా?



# "మహదైశ్వర్యాభివృద్ధిరస్తు"

( 30—12—1936 సం॥ర ఆంధ్రపత్రిక వీక్లీ నుండి )

"మహదైశ్వర్యాభివృద్ధి రస్తు" అంటూ పెద్దలు అనాదిగా శుభ శోభనాలలో ఆశీర్వచిస్తూ వుంటారు. యెవ్వరూకూడా — "మహైశ్వర్యాభివృద్ధి" అని ఆశీర్వచించినట్లే లేదు. అథవా అదిన్నీ యెక్కడేనా వుంటే వుందేమో ? మొదటిదానికే ప్రాచుర్యం కనఁబడుతుంది. యీ పదాన్ని గుఱించి ప్రధానంగా యీ వ్యాసం ముచ్చటించటంచేత దీని కీలాటి నామకరణం చేశాను. దీనితోపాటు చాలా విషయాలు గ్రాంథికకవులకు పనికివచ్చేవి దీనిలో చర్చిస్తాను.

"ప్రథమకబళే మక్షికాపాతః" అన్నట్లు వున్న "మహదైశ్వర్యాన్ని" నాకు తోఁచినట్లు సమర్థిస్తాను. దిద్దడాని కేమి ? ప్రతీదీ దిద్దవచ్చు. అది వక ప్రయోజకత్వం అనిపించుకోదు. శాయశక్తులా ప్రయత్నించి పెద్దలను కనుక్కొని గ్రంథావలోడన చేసి అప్పుడుకూడా సమర్థింపఁబడకపోతే దిద్దడం యేలాగా తప్పదు. కొందఱు చూచీచూడడం తోనే తమకు వున్న పాండిత్యానికి లొంగకపోతే చేతగానివైద్యుఁడు రోగాన్ని పిశాచబాధకింద అపలపించునట్లు సుశబ్దాన్ని అపశబ్దం అనడం ధారాళంగా జరుగుతూ వుంది. అంతో యింతో నేను కవిని. కవికి— పూర్వకవి ప్రయోగదక్షత్వం చాలా అవసరం. యాజ్ఞికులు కవులు కాకపోయినప్పటికీ వారిలో చాలా మంది షడ్దర్శనీవేత్తలుగా వుండడం కలదు. యీ కాలంయాజ్ఞికు లేలాటివారైనా ప్రాచీనులు సామాన్యులు కారు. అట్టి మహానుభావులందఱూ వాడే "మహదైశ్వర్యం" చట్టన తొందరపడి తప్పనడానికి నాకు అంగీకారం లేదు. కవి, లోకవాడుకలో వున్న ప్రయోగాలను పరిశీలించి వాడుకుంటూవుంటేనే లోకాదరణానికి పాత్రుఁ డవుతాఁడు గాని లోకాన్ని పూర్తిగా వుల్లఘించి రచనకు ప్రారంభిస్తే ఆరచన మొల్ల చెప్పినట్టు — "మూగచెవిటివారి ముచ్చట" గా పరిణమిస్తుంది.

వ్యాకరణాదులు చదువుకొన్నవాఁడైనప్పటికీ కవి — కుమ్మరి కుండలు నిర్మించుకున్నట్టు కొత్తకొత్తశబ్దాలు సృష్టించుకొని రచన చేస్తాడనుకోవడం కంటె ప్రమాదం వుండదు. అట్లని శాస్త్రజ్ఞానం లేకుండా కేవలమున్నూ ప్రయోగాధారంమీఁదనే రచనకు వుపక్రమించేయెడల — "అక్షిభ్రువ" వుందిగదా? అని "చక్షుర్భ్రువ" ప్రయోగించినకవికి పట్టినగతి పడుతుంది. కాఁబట్టి కవికి లక్ష్యలక్షణజ్ఞానాలు రెండున్నూ వుండాలన్నమాట. శిష్టవ్యవహారంలోవున్న శబ్దమేనాసరే, మాలమాదిగలువాడేదేనా సరే, ఆ పదం లక్షణానికి అనుకూలిస్తే కవి స్వీకరించడానికి అభ్యంతరం వుండదు. యీ మాత్రం లక్షణంలో విశేషణం తగిలించకపోతే—"ధారుణి తల్లక్రిందయిన నేనై యాశ్రయింపం జూమీ" మాదిరి కేవలగ్రామ్య పదాలుకూడా స్వీకరించవలసి వస్తుది. తల + క్రిందు, అనేశబ్దాలు రెండున్నూ కలిస్తే "తలక్రిందు" అని అవుతుందిగాని ద్విత్వం యెక్కడ నుంచి వస్తుంది తలకు? యిది ఆధునికులలోఁ గాని ప్రాచీనకవులలోఁ గాని పరిశీలకులు వాడరు. నన్నయ్యగారు "తలక్రిందు" అనే వాడిరి. "ఊరకొను — కూర్చొను" యీలాటివి వ్యావహారికములే అయినా శ్రీనాథాదులు వాడడం చేత అవి మనకు గౌరవించితీరవలసినవే. తల్లక్రిందుపదమో? యే "గ్రామ్యకవి" కాని, యే "కైతగాఁడు" గాని వాడితే వాడవచ్చునేమో కాని నియమనిష్ఠలు కల్గి శుద్ధశ్రోత్రియులుగా వుండి శుద్ధశ్రోత్రియంగా కవిత్వం చెప్పేవారు బొత్తిగా ముట్టుకోఁగూడదని నేను నొక్కి వక్కాణిస్తాను. సరే? శుద్ధ అపశబ్దం "తల్లక్రిందు" మాటకేంకాని మహదైశ్వర్యప్రదమైన — "మహదైశ్వర్య" సమర్థనం చూపుతాను. యీశబ్దము "కో కాలః కో ధర్మః" అనే ప్రయోగంలాగు అంధపరంపరాప్రాప్తంగా తోసివేయఁదగింది కాదని నాకు తోఁచింది.

"మహతాం, దేవేంద్రాదిదిక్పాలానాం, యదైశ్వర్యం, తత్తుల్యైశ్వర్యం" అని వ్యధికరణసమాసతాత్పర్యంతో అభియుక్తులు వాడివుంటా

రని నా నిశ్చయం. యిప్పుడు తకారానికి ఆకారాదేశం యేలావస్తుంది? కర్మధారయసమాసంలోనే దానికి ప్రవృత్తి. అలా అయితే "అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ" అన్నట్టు మీరు ప్రతీదాన్నీ సాధిస్తారు కనక యీ క్రిందిప్రయోగాలుకూడా సాధించమంటారా? చూచి మనవి చేస్తాను.

(1) క. ...బీతిడు నీ, మహదాకృతిఁ గాంచి జగము మఱిమఱి వణఁకున్.
(2) ఉ. ....శ్రీగల భాగ్యశాలి.... అలంతికేమహ,ద్యోగ మెసంగఁజేయున్.
(3) క. ....అల్పప్రాణము లియ్యవి మహద, ధ్వానం బెటు నడవనోపున్.
(4) మహదాశ్చర్యకరంబైన యద్దివ్యరూపంబు
(5) ఈషత్కార్యంబు గాని మహత్కార్యంబు గాదు
(6) కూడుగుడ్డలకుఁ దప్పి మహద్వ్యసనంబు నొందుటల్
(7) పురుషోత్తముఁడు మహద్భూతంబు
(8) అమ్మహదాశ్చర్యం బెల్లఁ గని

ఈ "మహత్తు" లలో యేవకటిరెండో తప్ప తక్కినవి నేను తొక్కినమార్గానికి అంకవు. ప్రయోక్తలుమాత్రం సుళువుగా సమర్థిస్తారని నే ననుకుంటాను. యేలాగంటారా? "పాపాలకల్లా భైరవుఁడు" కంఫోజిటరుమీఁద తోసివేస్తే కొన్ని సవరణ అవుతాయి. కొన్ని ఆలాగా సమర్థింపఁబడవు. మొత్తం వీట్లనికూడా—

(1) బృహస్పత్యోపదేశంబునన్ (2) శకున్యానుజుల్ (3) కేశ్యాసురున్ వీట్లతోపాటు జమకట్టుకోవలసిందే గాని గత్యంతరం సున్న. అయితే ఆ "మహ" చ్ఛబ్దఘటిత సమాసాలకంటే కూడా యివి అర్ధాన్నంగాక నఁబడుతూవున్నాయి. యింతఅయుక్తంగా యెట్టి ప్రమాదవంతులకూ ప్రయోగింపవలసివుండదంటారా? వుండకేమి వకవృద్ధబ్రాహ్మణుఁడు కడు శిష్టు- అధ్యాత్మరామాయణంలో మొదటిసర్గలు కంఠపాఠంగా

పారాయణచేస్తూ — "పార్వతోవాచ" అంటూ వుండడం నేను విన్నాను. పార్వతీ + ఉవాచ యీ రెండున్నూ కలిపితే పార్వత్యువాచ, అని కావలసినప్పటికీ పార్వతోవాచ, అని యేలా అయింది? అపశబ్దమవడానికేనా యేదో ప్రయోగపు ఆధారం వుండాలికదా? చూచానుకాను! యెవరో తార్కికులను హేళనచేస్తూ చమత్కరిస్తారు. వకతార్కికుఁడు - "అస్మాకూణాం తార్కికేషాం" అన్నాఁడనిన్నీ, వాట్లకు ఉదాహరణంగా "ఇక్షుకూణాం, కేషాం" అనే శబ్దాలను చూపినాఁడనిన్నీ అంటూ వుండడం. ఆలాగే "పార్వత్యువాచ పార్వతోవాచ"గా మాఱడముకు కూడా అవృద్ధబ్రాహ్మడికి యేదో ఆధారం వుండాలి అనుకొని విచారించఁగా భారతంలో సత్యాద్రౌపదుల సల్లాపఘట్టంలో "సత్యోవాచ" అనేమాట జ్ఞాపకం వచ్చింది. కేవలలక్ష్యజ్ఞానంమీఁద వెళ్ళవలసివస్తే యీలాటి చిక్కులు కలుగుతాయిగదా? అనుకున్నాను. యెవరో ప్రాజ్ఞులు తప్ప యాజ్ఞికులలో నూటికి తొంభైతొమ్మండుగురు "అధ్యాయామి, ఆవాహయామి" అంటూనే వాడుతూవుంటారు. ఆంధ్రంతో అంత అవసరం లేని వారే కాక వున్నవారు కూడా ప్రథమస్సర్గ, తృతీయస్సర్గ, అనియ్యేవే వాడుతూవుంటారు. చిట్టచివర మువర్ణం లేకపోవడం అంత తప్పు కాదు గాని సకార ద్విత్వం అట్టిది కాదుగదా? ఆలాగే దశమాధ్యాయ మనడానికి దశమోధ్యాయ మనడమున్నూ వుంది. ఇవన్నీ వ్యవహారబలీయస్త్వాన్ని పురస్కరించుకొని బయలుదేఱినవే. చిన్నప్పటినుంచీ వ్యవహారంలో నలిగినమాటలు, చదువుకొన్నాక సవరించుకోవాలంటే భగవంతుఁడు వేఱే జ్ఞానాన్ని కొంత యివ్వాలి. ఆలాటి జ్ఞానం కలవారే గ్రాంథిక కవులు. వారిలో ముఖ్యులే నన్నయాదులు. ఆలాటివారిక్కూడా చిరపరిచయవశాత్తున్నూ అలవాటైన కొన్ని శబ్దాలు, "ప్రాణగొడ్డం" వగైరాలు దొర్లుతూవచ్చాయి. వాట్లనే — "అనింద్యగ్రామ్యాలు" గా యిటీవలి లక్షణవేత్తలు గౌరవిస్తూ వచ్చారు. ఇటీవల శ్రీనాథాదులు "దినవెచ్చం" వగయిరా మఱికొన్ని వాడుతూవచ్చారు. వాట్లనుకూడా తరువాత కవులు

శిరసావహించారు. పెద్దన్నగారు—"చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదన మ్మున" అని వాడడంవల్ల పంచమీవిభక్తిప్రత్యయాలలో - వలన, వల్ల, కంటె, అంటూ వ్యాకర్తలు "వలన" కు పాఠాంతరంగా లేక పర్యాయంగా వల్లను చేర్చుకున్నారు. అదేమాదిరిగా చేరినరూపాంతరా లెన్నో వున్నాయి. "కావలయున్" అనేరూపం వుందనుకోండి. తిక్కన్నగారు ఉద్యోగపర్వంలో—

ఉ. కావున శాంతిఁ బొందుటయె కర్జము....(శ్రీ), గావలె నంచు.... ...

అని ప్రయోగించారు. దానితో నిఘంటులో - "కావలయున్" అన్నదానికి, "కావలెన్" అన్నది రూపాంతరంగా గ్రహించారు. దాన్ని నాబోటి గ్రామ్యకవి లెక్కేమిటి, నన్ను గ్రామ్యకవినిగా సమర్థించేవారు కూడా శరపరంపరగా ప్రయోగించి వున్నారు. కొన్ని చూపుతాను.

(1) ఎప్పు డెట్లు వచ్చి యేమి గావలెనన్న (2) రాజపుత్రినిన్ దేవలెనంచు లోకము (3) రెండిటన్ గావలెఁగాని (4) నేర్పితో? కావలె నంచు (5) ధర్మమనుచుఁ బలుకఁగ వలెనే ? (6) పెట్టనికోఁటవు గావలె ? పొగడఁగ వలెనె ? నినున్ (7) తీరెను మన క్షాత్రి మెల్లఁ దెలుపఁగ వలెనే ? (8) మనకేగెడి దివికి నింక మాటలు వలెనే? (9) సారథి లేమి నింత పని సాఁగ దనన్వలెనయ్య ? నీవు (10) తనకుఁ గావలె నని మది (11) కామమున న్నాకె కావలె నన్న (12) ఎల్లి దండు గావలెన్.

యింకా కొన్ని దొరికాయి కాని చేవస్తంగా వుంటుందని విరమించినాను. 'వలయున్' అన్నదానికి రూపాంతరంగా "వలెన్" అనేది వుండవచ్చు నని తేలింది. నేను వ్రాసే వేమిన్ని పెద్దవిషయాలు కావు గాని యెవరో కొందఱు శంకించడంచేత వ్రాయవలసివచ్చింది. 'వలయున్' అన్నదానికి "వలెన్" అని వుండవచ్చునా ? అన్న ప్రశ్న యిప్పటికి 40 ఏండ్లనాఁడు వచ్చింది. అప్పుడే తిక్కనగారి ప్రయోగం సంపాదించి

యిచ్చాను. ఆ ప్రయోగాన్ని యిప్పుడు మళ్ళా మరికొన్నిటితో జతపేసి చూడవలసి వచ్చింది. యింక —

ఉదారశబ్దంలో వున్న " ఉత్ " అనేదాన్ని విడదీసి అచ్చునకు యతి పెట్టవచ్చునా ? అన్నదాన్ని గూర్చివ్రాస్తాను.

క. పేరు వరూథిని... ఉ, దారగుణాఢ్యలు మదీయ లగు ప్రాణసఖుల్.

అవి మను చరిత్రలో వున్నప్పటికీ యిప్పటికి 35 ఏండ్లనాడు వక మహాపండితులు శంకించి వున్నారు. శంకించి వూరుకోలేదు. — " యతి భ్రష్టమయింది " అని కూడా అన్నారు. మేమున్నూ సమాధానం చెప్పి అంతతో వూరుకోక " యతి భ్రష్టం కాలేదు దేవరవారిమతి భ్రష్ట మయిందన్నాము "

పెద్ద లెందుకు సంశయిస్తూన్నారో కాని యీ ఉదారశబ్దముకు సంబంధించిన స్వరయతి లేశమున్నూ సంశయింపదగ్గదే కాదు. దాన్ని అలా వుంచుదాము. పదచ్ఛేదం చేసుకొనేటప్పుడు కూడా కొంతశ్రద్ధతీసుకోకపోతే కొన్ని చోట్ల అపార్థాలు బయలు దేరతాయి. వక ఉదాహరణాన్ని చూపుతాను.

శా. మాపూర్వుల్ భవదీయపాదము లసామాన్యాస్థమై గొల్చుటన్ ?

అనే పద్యంలో కొందఱు ప్రమాదపడియ్యేవే అనుకుందాము — " భవదీయ పాదములన్, సామాన్యాస్థ "అని ఛేదించుకొని చాలాచర్చించినారు. అక్కడ పదచ్ఛేదము—" భవదీయ పాదములు, అసామాన్యాస్థ " అని కాని అన్యథాగాకాదు. ద్వితీయార్థమునప్రథమ. " నచ శంకా నచోత్తరమ్ " మఱీన్నీ శిశిరర్తువర్ణనలో — " కంజముఖీకబరీభరోత్కరానందదమై " అనే విశేషణానికి అర్థం సుళువుగా అవుతూవున్నప్పటికీ అన్యథాగా చేసుకుంటూ వున్నారు. వా రెల్లా చేసుకుంటే యేంగాని మా అర్థాన్ని తెలుపుతాను.

కంజముఖీ = స్త్రీలయొక్క, కబరీభరోత్కర = అతిశయమైన కొప్పుల సముదాయమునకు, ఆనందదము = సంతోషమునుకలిగించునదియై.

ముంజేతికంకణానికి అద్ద మక్కఅలేనట్లే దీనికిన్నీ గ్రంథాంతర సహాయం అక్కఅలేదు. శిశిరర్తువు మాఘ ఫాల్గునమాసాలుకదా — "మాఘ్యం కుందం" అని వుండడం చేత ఆ రోజులలో మల్లెమొగ్గలు విశేషించి లభిస్తాయనిన్నీ, వాట్లను స్త్రీలు కొప్పులలో ధరిస్తారనిన్నీ గ్రంథకర్త తాత్పర్యం. యీ స్థలంలో అర్థంతిన్నగా చేసుకోక గ్రంథ కర్తను వెక్కిరించేవారిని యేమీ అనేదిలేదు. మేఘసందేశంలో — "హస్తే లీలాకమల మలకే బాలకుందానువిద్ధమ్" అనే శ్లోకవ్యాఖ్యానంలో యీమల్లె మొగ్గలప్రసక్తి కొంత వుంది. విస్తరభయంచేత దాన్ని యిక్కడ నే నుదాహరించలేదు.

యిఁక — "కుసి" అనేపదాన్నిగూర్చి వ్రాస్తాను. యిది ప్రయోగించుకోవడం కవులకు తప్పు గాదు. శ్రీనాథుఁడు—"మ. కుసి మీఁఅన్ సురతాణి నిండుకొలువై కూర్చున్నచో నీకరా" వ్యసనంబున్ నుతియించురా! అవచితిప్పా!" అంటూ హరవిలాసంలో ప్రాస స్థానంలో ప్రయోగించి యున్నాఁడు. మఱిన్నీ — "సింహాసన" మనడానికి పర్యాయంగా "సింహాసము" అని నకార విరహితంగా వాడకూడ దంటూ కొందఱు వాదిస్తూ వున్నారు. "ఆస" ఉపవేశనే, అన్న ధాతువునుంచే, "ఆసనం, ఆసః" అన్నరూపద్వయమున్నూ నిష్పన్నమయింది. ఆక్షేపకులు "అస" ధాతువునుండి నిష్పన్నమయి నట్లు వ్రాస్తూకూడా "ఆస" అన్నరూపాన్ని వొప్పకున్నారు కారు. "అస" అనుట అచ్చుపొరపాటు కాక తప్పదు. తక్కినది వారిప్రమాదమే అనుకోకతప్పదు. వారివే ప్రయోగాలు చూపుతాను.

(1) అజగవనామాంచన్మహేష్వాసమున్ (2) భీషణేష్వాస మౌర్వీ (3) శరాసముక్తశరవారము (4) అట్టి వైకర్తనుఁడు మహే

ష్వాసుఁడు (5) ఇష్వాసమును దెగనేసె నపుడు (6) ఉగ్రమహేష్వాసుఁడు (7) ఈ సేనఁ గలరు మహేష్వాసులున్ (8) ఆతని మహేష్వాసంబు ద్రుంచెన్ ద్రుటిన్ (9) పరమేష్వాసులు వారు (10) మహేష్వాసుండు (11) కరమం దిష్వాసముం గూర్చుచో (12) మారపాతి మహేష్వాసుఁ డారయన్ (13) అయ్యిష్వాసమే పోలు (14) సింహాంస నిష్వాస మది (15) కూర్రేష్వాసముతోడ (16) గాంగేయునిష్వాసము (17) అగ్గాండివేష్వాసంబుం గొని. యింకా యెన్ని చూపుదును ? యిందు సర్వత్రా " ఆసన " శబ్దానికి పర్యాయ పదంగా " ఆస " శబ్దమే వాడఁబడ్డది. ఊరికే పనిలేనిపాటగా ఆయా ప్రయోగాలు చూపినాను కాని, " మహేష్వాసో గూఢజత్రుః " అన్న వాల్మీకిప్రయోగమే ఆ "సింహాస" ప్రయోగాన్ని సమర్థిస్తుంది. అది ఆర్ష మంటారేమో అని యితరుల వివ్వడం. ఆక్షేపకు లిన్ని ప్రయోగించుకొని యేలా ఆక్షేపించారో కదా ? ఇక్కడ ఆ యీ విషయం ఆక్షేపించినందుకు వ్రాస్తే చాలా వ్రాయాలి. ముఖ్యం, ఆస, ఆసన శబ్దాలు పర్యాయము లని జిజ్ఞాసువులకు తెల్పితే చాలును. యిఁక రేఫద్విత్వానికి పూర్వమందున్న అక్షరం వికల్పంగా లఘువుకావడాన్ని గుఱించి వ్రాస్తాను. దీన్ని గూర్చి వృత్తరత్నాకరంలో లాక్షణికులు వ్రాసిన ఉదాహరణం యివ్వడ మయింది. మృచ్ఛకటికలో వున్న మహాకవిప్రయోగం చూపడం అయింది. శ్రీనాథుఁడి ప్రయోగం యివ్వడం అయింది. యేవో మాటలతో ప్రతివాదులు వాట్లని ఖండించడం జరిగింది. యిప్పుడు ఆక్షేపకులవే ప్రయోగాలు చూపుదును.

(1) " అధ్రువ మయ్యును నవ్యయం బైనదేహ, మనురథంబున "

ఈ గీతంలో మొదటి అకారం లఘువుకాకపోతే ఛందోభంగ దోషాన్ని పొందితీరుతుంది. ధ్రువ, ధాతువునుండి పుట్టిన ధ్రువశబ్దములో ఋకార మున్నదనుటకు వలను పడదు. ఋకారఘటితంగా అచ్చులో నున్నప్పటికీ అది ప్రమాద మనకతప్పదు. కాఁబట్టి రేఫద్విత్వానికి పూర్వ

మందున్న దానికి లఘుత్వం వొప్పక తప్పదు. వీరి కిది సమ్మతమే అన్నందు కింకొకటికూడా చూపుతాను.

"వివిధవీ, తిప్రకృతి, వినయాదులను నెల్ల నెఱిఁగియుంటిని గడు దెలుఁగులుగను"

యీ సీసచరణంలో కూడా పైని చెప్పిన లఘుత్వాన్ని అంగీకరించాలి. సాధ్యసమాసం అని వాదిస్తే, వివిధవీతిదగ్గిఱకు విడుతుంది గాని, గుర్వుము వకటే కావలసివస్తుంది. అప్పుడు వివిధశబ్దం వ్యర్థం కావలసివస్తుంది. కాఁబట్టి ఆ తోవ పనికిరాదు. లఘుత్వం వొప్పకపోతే ఛందోభంగం తప్పదు. "అపి మాషం మషం కుర్యా చ్ఛందోభంగం తు న" అని కదా? లాక్షణికుల ఆదేశము. ఇదే కాదు—"అఖిలాండకోటిబ్రహ్మాండంబులెల్ల నక్కొండ విచ్చెను బచ్చికుండ లనఁగ" అనేది కూడా యీ రీతినే సమర్థనీయం. ఇక్కడ వ్యస్త మంటూ వాదం వస్తే రావచ్చును హృదయంగమం కాక పోయినప్పటికిన్నీ. అంతదాఁకా యెందుకు? సంస్కృతమహాకవు లందఱున్నూ వొప్పుకొన్న ప్రయోగంకదా యిది. చూడండీ యీ మహాభారతప్రయోగాలు.

(1) "శశిప్రకాశజయోన్నత మైనయష్టమిఁ" (2) రేణుకక్రథన (3) సంశిత వ్రతులును విప్రవరులు (4) శిఖండిప్రభద్రకుల్.

ఆ యీ ప్రయోగాలు చూపి సంస్కర్త తేవప్పెరుమాళ్ళయ్యగారు నేను వుదాహరించిన సంప్రదాయం అనఁగా లఘువు అగునేది యెఱుఁగక సంశయించి మిన్నకుఁడుటచేత ఆక్షేపకులు ఆ ప్రయోగములు సమర్థనీయములు కావనుకొన్నా రనుట నిక్కం. "నహి సర్వ స్సర్వం విజానాతి" కనుక యింతమాత్రంచేత పెరుమాళ్ళయ్యగారికిఁగాని, ఆక్షేపకులకుఁగాని లోటు లేకుండుఁగాక! ఆ ప్రయోగము లన్నియు లాక్షణిక సమ్మతములే నని అన్యత్ర వ్రాసిన యంశములవల్ల విస్పష్టం కాఁబట్టి విస్తరించేది లేదు.

యింక — " తెలివి " అనేదానికి, " తెల్వి " అనే సంయుక్త మున్నూ వుంటుందని బుజువుచేయుచున్నాను. రలడలకేదనున్నూ అకారము పోవడానికే వ్యాకరణం వప్పుతుంది, ఇకారోకారాలు పోవడానికేంసందేహం ? నన్నెచోడుఁడు వగయిరాలను వుదాహరించివున్నాను గతంలో. యిప్పుడు ఆక్షేపకుల ప్రశ్నా గాన్నే చూపుతూవున్నాను. " ఉ. భూతలమందుఁ బ్రాణములఁ బొల్చెదుసయ్యావి అందుఁ దెల్వితో, నై తనరారునట్టివి " యేదో శంకించడం జరిగింపిగదా ? అని ప్రయోగం చూపడమే కాని వస్తుతస్తు " నచ శంకా నచోత్తరం " తెగలోవే ఆ యీ సందర్భాలు. అయితే యెవరోశంకిస్తే పూరకున్నట్టయితే జిజ్ఞాసువులలో కొందఱు చిక్కుపడడం తటస్థిస్తుందేమో ? అని యీ పరిశ్రమ.

యింక — " పేదకు సాదకున్ " అనేదాన్నిగూర్చి కొంత విస్తరించి వ్రాస్తాను. ఈ పదద్వయంలో వున్న " సాద " పదానికి వేఱే అర్థంలేదని నా అభిప్రాయం. ఇది " కాగితంగట్ర " అన్నమాదిరిది. యీ మాటలో వున్న కాగితానికే అర్థముందిగాని " గట్ర " కు లేదు. ఒకప్పుడు వకబ్రాహ్మణకుఱ్ఱవాణ్ణి పిల్చి శ్రీ పోలవరపు జమీందారుగారు " అక్కడ కాగితం గట్రి, వుంటుంది చూచి యీలాతే " అన్నారు. ఆ కుఱ్ఱవాఁడు ఆపనికి చాలాసేపు ఆలస్యం చేశాఁడు. అంతట్లో జమీందారుగారు " యేమి యెంతసేపటికిన్నీ వచ్చినావుకావు " అన్నారు. దాని మీఁద ఆ కుఱ్ఱవాఁడన్నాఁడుకదా ? " అయ్యా ' గట్ర ' కనపడిందికాదు " అన్నాఁడు. జమీందారుగారు నవ్వుకొన్నారు. అదిమొదలుకుని ఆకుఱ్ఱవాణ్ణి " గట్రి " అని పిలిచేవారు. యీసంగతి యెఱిఁగినవారిలో శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారొకరు వృద్ధు లిప్పటికిన్నీ వున్నారు. అందులో " గట్రి " యేలాటిదో యిందులో " సాద " కూడా ఆలాటిదే. యీలాటి తోవాసప్పదాలు మఱికొన్ని వున్నాయి. ఆతోవాసప్పదాలలో కొన్నిటికి అర్థమైతే శబ్దరత్నాకరంవ్రాసిందిగాని అది అంత తృప్తికరంగా లేదు. మచ్చుకు వక్కటిచూపుతాను—

"యేండ్లు — పూండ్లు" అనేదానిలో వున్న "పూండ్లు" అనేదానికి, అనేకములు అని అర్థం వ్రాయఁబడివుంది. ఆ అర్థం 'యేండ్లు' అనేదానితో చేర్చినప్పుడే దానికి వస్తుందేమో కాని ప్రత్యేకించి రాదనినే నభిప్రాయపడతాను. ప్రత్యేకించికూడా వచ్చేయెడల "పూండ్లు గ్రామాలు, పూండ్లు పుస్తకాలు" లోనయిన ప్రయోగాలు వుండవలసివస్తుంది. అట్టిది గ్రాంథికంగా కాని, వ్యావహారికంగా కాని వున్నట్టు లేదు. ఇట్టి తోవాసప్పదాలు వున్నవి మఱికొన్ని చూపుతాను— "దిక్కూ-మొక్కూ, అభమూ - శుభమూ, అంటూ - సంటూ, అప్పూ - సప్పూ, ఋణమూ - ఖణమూ, కూలీ - నాలీ, పిల్లా - జెల్లా, భూమీ - పుట్రా, దారీ-తెన్నూ" ఇత్యాదులలో కొన్నిటికి వ్రాయకపోయినా కొన్నిటికి నిఘంటులో అర్థం వుంది. పూండ్లమాటకేఁగాని, నాలిపదానికి ప్రత్యేకించి హృదయంగమమైన ప్రయోగమున్నూ వుంది. అట్లే మఱికొన్నింటికిన్నీ. అంతమాత్రంచేత తోవాసప్పదాలన్నిటికిన్నీ స్వతంత్రంగా అర్థం వుందనుకోకూడదు - పిల్లశబ్దంతో వున్న "జెల్ల" శబ్దానికి అర్థం స్వతంత్రమైనది వుందంటే సహృదయు లొప్పరు. ఆ శబ్దసాన్నిధ్యమందే అలాటి అర్థం వచ్చేవి మఱికొన్ని వున్నాయి.

"నిద్రపోయెను" యీ వాక్యంలో పోవుధాతువు "పొందు" ేక, "అనుభవించు" అనే అర్థాన్ని యివ్వడంచేత సకర్మకంకూడా ఒవుతుంది. నిద్రాశబ్దసాన్నిధ్యం లేనప్పుడు దీని కీ అర్థం రాదు. "వాఁడు న్నంపోయెను" అనేప్రయోగం కర్ణకటువు. ఆ యీ విషయాలన్నీ చిర లంనాఁడు "భారతవిశేషాలు" మొదలయిన వాట్లలో చర్చింపఁబడే న్నాయి. "కా దన్నవాఁడు కరణం" అన్నట్టు తెలిసో తెలియకో ఎవరో దేన్నో ఆక్షేపిస్తే మళ్ళా వ్రాయవలసివస్తూవుంటుంది. యీలా ్రియడంకన్న వాచా బోధించడం చాలా సుళువు. వకనిమిషంలో ధించేసఁగతికి వ్రాయవలసివస్తే వకఫారం మేటరు పెరుఁగుతుంది.

పనిలోపని యింకొక సంగతి వ్రాస్తాను - తద్భవశబ్దాలకు అసలు ప్రకృతికివున్న అర్థంకన్న విలక్షణమైన అర్థంకూడా రావడం తఱుచుగా అనుభవంలోవుంది. ఉదాహరణ చూపుతాను - " శ్రీవిన్నాణపు గుబ్బ చన్నుఁగవ " విజ్ఞానశబ్దతద్భవమైన విన్నాణపదము యిక్కడ " సొగసు " అనే అర్థమందు వాడఁబడ్డది. పైఁగా అసలువున్న అర్థాన్ని యీశబ్దం యెక్కడోకాని యివ్వడమేలేదు. " మొదటవచ్చిన చెవులకన్న తరువాత వచ్చిన కొమ్ములు వాఁడి " అన్నట్లయింది దీని బ్రతుకు. అయినప్పటికీ మొదటవున్న అర్థం అసలే పోయిందనుకోకూడదు. యిది బాగా గమనించవలసిన విషయం. దీన్నిగుఱించి యింతగా యెందుకు వ్రాస్తానంటే వకరు - ' దర్శన ' శబ్దతద్భవమైన ' దరిసెన ' శబ్దానికి, జనకస్థానాపన్నమైన " దర్శన " శబ్దానికి వున్న అర్థం వుండదని వాదిస్తూవున్నారు. యిటీవల తెలుఁగుకవులు వాడుతూవున్న " కానుక " అనే అర్థమే వస్తుందంటారు. యెవరేనా పూజ్యులైన వారిని సందర్శించడానికి వెళ్ళినప్పుడు యిచ్చే "కానుక" కు అభేదాధ్యవసాయంచేత, అనఁగా దర్శన సమయమందిచ్చిందికూడా, దర్శనమే అవుతుంది. లేక, దరిసెనపువేళ యిచ్చింది కూడ దరిసెనమే అవుతుందనే అభిప్రాయంతో ఆలా ప్రయోగిస్తే అది లాక్షణికార్థం అని కనిపెట్టక, అసలర్థం రాదంటూ వున్నారు. ఇది పెద్దప్రమాదము. అసలు అర్థం క్రొత్త అర్థంవల్ల యెన్నటికీ పోదు.

ప్రస్తుతం వ్రాస్తూవున్నది - " పేదకు సాదకున్ " అనేదాన్ని గూర్చి. 'పేదసాదులనుగొట్టి' అనే ప్రయోగంలో వున్న ' సాదు ' శబ్దము వేఱు, ' పేదకు సాదకు౯ ' అనే తోవాసప్పదం వేఱు. యీ విషయం బాగా గమనించాలి. పోనీయండి విమర్శకుల అభిప్రాయాన్ని బట్టి - " పేదకు సాదుకున్ " అని దిద్దుతామే అనుకోండి. అది యెంత శ్రవణకటువుగా వుంటుందో పరిశీలించండి. సమాసంగా వున్నప్పుడు ' పేదసాదులు ' కొంత యుక్తంగా వున్నట్లు తోఁచినప్పటికీ విడిగా తోవాసంగా ప్రయోగించే టప్పుడు ' పిల్లాజెల్లా ' లోనగు శబ్దముల వలెనే సాదకు

అర్థం లేదన్నదే సహృదయ సమ్మతం. వూరికే ఆక్షేపించేరేకాని వారు నామాదిరిగానే "బీదసాదలపాలిటి పెన్నిధి యయి" అనే ప్రయోగిం చుకున్నారు. యీ ప్రయోగం సమాసంగా వుంది కనక సాదులు అని వారు దిద్దుకొని "సాధు" శబ్దార్థకంగా చేసుకోవచ్చునుగాని వ్యస్తపదంగా వున్న నా 'సాద' సాదగానే వుండ వచ్చును. యీ "బీదసాదల" పద్యములోనే – "ఆర్యవర్యులరెడ్డయ్య" గారు వున్నారు. దీన్ని నా ప్రయోగాన్ని ఆక్షేపించడంచేత చిక్కువచ్చి, ఆర్యవర్యుఁడు, అని దిద్దు కొన్నట్లు వ్రాస్తూవున్నారు. యీ దిద్దుబాటు నిష్ప్రయోజనం. యెన్నని దిద్దుకుంటారు పాపం? చాలా చోట్ల వాడివున్నారు. ప్రౌఢ వ్యాకరణంలో వున్న సమర్థనాన్ని అంగీకరించక యేలాగా తప్పదు. తప్పన్నాంగదా! అంటే, పొరఁబాటుగా తప్పంటే మాత్రం తెలిసిన తరువాత అంగీకరించ కూడదా?

"నాదుచిత్త మెప్డున్ భయభక్తియుక్తులను సంధానించెడి న్విప్రులన్"

పై వాక్యంలోవున్న 'విప్రులన్' అనేదానికి సప్తమ్యర్థమే చెప్పుకొంటే యుక్తంగా వుంటుంది. వాదం కోసం అది సప్తమ్యర్థకద్వితీయ కాదు. ఆత్మార్థక ద్వితీయమే అన్నప్పటికీ యింకా వున్నాయి ప్రయోగాలు. చూడండి. "ధేనువులం గామధేనువుగను" ధేనువులు జడవాచకములు గావు, చేతనములే కద? యిట్టి ప్రయోగాలు "ఆర్యవర్యుల రెడ్డెయ్య" ప్రయోగంతోపాటు వున్నప్పుడు కొన్నిటిని దిద్దితే యేం లాభం? కాఁబట్టి దిద్ద నక్కఱ లేదని నా సలహా. యిది యీలా వుంచుదాం, యిందాఁకా తద్భవంలో అసలు అర్థం పోదని వ్రాసే సందర్భంలో వకమాట వ్రాయ డం మఱచాను. కుమారీ శబ్దానికి కూఁతురు, అనే అర్థం కాక, యౌవన వంతురాలు అనే అర్థకూడా వుంది. అది యెక్కడనుంచి వచ్చింది? కుమార శబ్దాన్నిబట్టే వచ్చింది. తద్భవంలో 'కుమారుఁడు–కొమారుఁడు, కొమరుఁడు" అని రెండు రూపాలుగా మాఱినాఁడు. అర్థం మాఱలేదు. ఆలాగే "కుమారి" "కొమిరె" గా మాఱింది. మఱి కొన్ని రూపాలు

కూడా పొందిం డనుకోండి. అవి యిక్కడ మనకు విచారణీయాలు కావు. "కొమిరె" మాత్రమే విచారణీయం. దీనికి కూఁతురు అనే అర్థం శబ్ద రత్నాకరంలో వ్రాయలేదన్న మాత్రంచేత పోతుందా? శబ్దరత్నాకరంలో అసలే వ్రాయని వెన్నో వున్నాయి. "పరవశ్య" శబ్దరత్నాకరంలో వుందా? 'కొమిరె' అనే దానికి కొమార్త అనే అర్థం లేకపోతేనే వ్యాఖ్యాత వ్రాసివున్నాఁడా? వసుచరిత్రలో-అక్కడ కూఁతుప అని వ్రాస్తే చే శాంతాకాంక్ష మగుచుండఁగా కష్టించి యౌవనవంతురాలు, అని చెప్ప డం యెందుకు? వాదం నిల్పుకోవడానికే కదా? నాకు వాదంతో పని లేదు. శాస్త్రంవల్ల కాని, అనుభవం వల్లకాని తద్భవరూపానికి అసలు ప్రకృతికివున్న అర్థం అంతరించి పోదనేమాట సర్వసమ్మత మని జిజ్ఞాసు వులకు తెల్పుతూ శుకసప్తతినుండి యింకొక ప్రయోగాన్ని చూపుతున్నాను. "కోమటికొమిరె వాని యప్పన గొనుచున్". ప్రయోగములే అక్కఱ లేదు, పరులను సంతుష్టిపఱచడానికి తప్ప ఆ యీ శబ్దానికి ప్రయోగ మెందుకు? కొమిరె అనేది కుమారీశబ్దతద్భవం కాదనేవారికి తప్ప. ఆశబ్దానికి కూఁతురు అనే అర్థం లేదనడం పొసఁగదు.

యిఁక "గ్రామ్యాగ్రామ్య విచారణ" కొంత వ్రాస్తాను. చాలా మంది దీని తత్త్వం తెలుసుకోకుండానే చట్టన గ్రామ్యం అనడం కలదు. దీన్ని గూర్చి 'జయంతి' లో కొంత సంగ్రహంగా వ్రాసే వున్నాను. మనం దేన్ని గ్రామ్యం అనవలసి వస్తుందో? ఆ పదానికి, అదే అర్థం వున్న నిర్దుష్టపదాన్ని మఱివకదాన్ని చూపించవలసి వుంటుంది. గ్రామ్యం అనేదానియందు వ్యాకరణ దోషం యేకొంచెమో ఉండి తీరాలి. 'అల్ప దండు, అనేకమాఱులు' ఇవి గ్రామ్యా లెందుకయినవి? వీని సరి యైన రూపాలేవి? 'అల్పపుదండు, అనేకపుమాఱులు' ఇవియేకదా! ఇట్టి స్థితిలో "కనిపెట్టు" గ్రామ్యమనిన్నీ, "కనిపట్టు" దాని శుద్ధరూపమనిన్నీ, అనడం ప్రమాదం కాదా? "కనిపెట్టు"లో వ్యాకరణదోషం లేశమున్నూ లేదే. "కనిపట్టు" యెట్టిదో "కనిపెట్టు"న్నూ అట్టిదేకదా? అదిన్నీ యిదిన్నీ

కూడ రెండుధాతువులకూడికవల్ల నిష్పన్న మయిన రూపాలే. 'చందస్సులన్ కనిపెట్టినట్టిఋషు' లన్నచోట,కని = చూచి, పెట్టినట్టి = ధరించినట్టి,ఋషులు అని అర్థం విడిగా చెప్పుకొన్నను సరసముగా నుండునుగదా ! కని,కను ధాతువుకు క్త్వార్థకరూపం, పెట్టిన అన్నది పెట్టుధాతువు యొక్క భూతార్థక విశేషణం. "నచశంకా నచోత్తరం". తీర్థక్షేత్రపదాలకు అర్థం వకటే అయినా తొందరపడి ఆక్షేపించడం వల్ల యేంతలాభించిందో ? ఇదిన్నీ అట్టిదే. యీ స్థలాలలో జిజ్ఞాసువులు తెలిసికో దగ్గవంత విశేషాలు లేవుకాని యిక్కడ వకపదాన్ని వుదాహరించి చర్చిస్తాను చూడండి –

మ. ఋజుమార్గంబున వారితోఁ బెనఁగ నే నేగన్ దలంపెట్టినన్.

యింమలో తలంపు - ఎట్టినన్ అని పదచ్ఛేదం కాదు. ఎందుచేతంటే ఎట్టు అనే ధాతువులేదు. పోనీ పెట్టు ధాతువే అనుకొని. తలన్ + పెట్టినన్, అనుకుందామా ? అప్పుడు - తలంబెట్టినన్ అనికావలసివస్తుంది. యెగఁదీస్తే బ్రహ్మహత్య, దిగఁదీస్తే గోహత్య. తలపెట్టు అనే శబ్ద పల్లవానికి యీ రూపమనుకుందామా ? ఆ శబ్ద పల్లవము, తల + పెట్టు కాని మఱొకటికాదు. దానిలో అర్ధానుస్వార మెక్కడనుంచి వస్తుంది ? కాఁబట్టి జిజ్ఞాసువులిట్టి స్థలాలలో జాగ్రత్తగా ప్రయోగించుకోవాలి. అనఁగా తలపెట్టినన్ అనేకాని తలం పెట్టినన్ అనికాదని తెలుసుకోవాలని తాత్పర్యం. ఈ "తలపెట్టుతో" పాటు తలపోయు, తలచూపు, లోనైన ధాతువులలో గూడా అరసున్నలేదని జిజ్ఞాసువులు తెలిసికోఁగోరెదను. ఇట్లే సర్వకాల సర్వావస్థలయందున్నూ యావజ్జీవమున్నూ, ఆ యా శబ్దాల సాధుత్వాసాధుత్వాన్ని గూర్చి విచారణచేసుకుంటూవుంటే తప్ప యేది తప్పో యేది వొప్పో తెలియదు. పరిశుద్ధమైన 'క్షమాపణ' శబ్దం నింద్య గ్రామ్యంగా భావించి పరిత్యజించిన మహాపండితులనుగూర్చి మా పాశుపతం వగయిరాలు తెలుపుతాయి. ఆ శబ్దం తప్పనుకొనియ్యేవే కొందఱు 'క్షమార్పణ' అని వ్రాస్తూవుంటారు. యీ 'క్షమార్పణ' పదం తప్పయితే కాదుగాని ఆ శబ్దం యిచ్చే అర్థాన్ని అంత చక్కగా

యివ్వాఁజాలను. క్షమాపణ చెప్పడమంటే యితరులను తనతప్పులను సహింపక తనయందు వోర్పును అనుగ్రహించవలసిందని వేడుకోవడంగదా? ఆ అర్థం 'క్షమార్పణ' పదానికి చక్కఁగా రాదు. తనయొక్క ఓర్పును యితరులకు అర్పించడం అని అర్థం వస్తుంది. అంతేకాని వారివోర్పుతాను సంపాదించుకోవడం అనే అర్థంరాదు. యెట్లో లక్షణయా తంటాలుపడాలి. చక్కని పదం శ్రీ వేదవ్యాసులవారి నాఁటినుంచీ భాషలోవుంటూవుంటే దాన్ని వదలుకొని యీ కృతక పదాన్ని వాడుకోవడం యెందుకు? యీ విషయం అన్యత్ర విస్తరించి వుండడంచేత యిచ్చట సంక్షేపింపఁబడ్డది.— యివి పండితులు యెఱక్క పొరబడేవి. యెఱిఁగికూడా పొరబడేవికొన్ని చూపుతాను. (1) మృణ్మయము (2) పరేతరాజ్ఞాలయము (3) సురరాజ్ఞందను (4) యమరాజ్ఞందను (5) పరేతరాజ్ఞగరము (6) ప్రావృజ్ఞీరదమట్లు (7) కాశీరాజ్ఞందిని (8) కురురాజ్ఞియోగము యీలాటి వెన్నో అందఱున్నూ యెఱిఁగి వుపేక్షించి వ్రాస్తూవున్నవున్నాయి. వారికి ఆ తప్పుతెలియదని మాత్రం అనుకోకూడదు. కొందఱు మాత్రం ఆలాటివారున్నూ వుంటారు. యిందు మొదటిపదంలో ణకారం తప్పు. దీన్నిగుఱించి అన్యత్ర విస్తరించి వున్నాను. నాగర లిపిలో తప్ప తెలుఁగులో సర్వత్రా ణ కారఘటితంగానే యీ శబ్దం కనపడుతుంది. తక్కిన శబ్దాలలో "జ్ఞ" అనే ద్విత్వం తప్పు, ణ్ణ అని వుండాలి. యీ రూపాలెన్నో ఆక్షేపకులు వాడి వున్నారు. దీనికి పెద్ద వ్యాకరణపాండిత్యంతో పనిలేదు గాని కొంత విచారణశక్తిమాత్రం వుండాలి. "యాచ్న" అనే దాన్నిగూర్చి యితరత్ర వ్రాసే వున్నాను. యిఁక 'పూర్ణానుస్వారంతో వ్రాసే చాలా శబ్దాలు పండితు లెఱిఁగినిన్నీ పొరబడుతూవున్నవే. వక వత్సరం, బి. యే. పరీక్ష కిచ్చిన పేపరులో అట్టి వాక్యాన్ని యిచ్చి దిద్దవలసిందంటే చాలామంది ఆప్రశ్న ఆన్సర్ చేయలేకపోయినారు. యీ విషయంలో లక్షణ గ్రంథాలలో ప్రధానంగా పరిగణింపఁబడుతూవున్న అప్పకవీయం కూడా ప్రమాద పడ్డట్టే కనపడుతుంది. "నవ్యపలాశదండంబుతోడ"

అని బిందు యతికి వుదాహరించడాన్కి అర్థం కనపడదు. "మంచు కొండకు" అన్నచోట, సున్న వున్నట్లు దండ శబ్దంలో లేదు. "దణ్డ" అనికదా దాని నిజమైనరూపం. అయితే తెలుఁగులిపిలో యీ విపక్షత లేకుండా పండిత పామరులు వ్రాస్తూవుండడం వల్లనో, యేఁదుచేతనో? అప్పకవి యెన్నో యీలాటివి వుదాహరించి వున్నాఁడు. అవి బిందు యతులుగా కాక అన్యథాగా సమర్థింపఁబడతాయి. దీన్ని యింతతో విడిచియిప్పటి వారు కొందఱు "ఏకదేశపతితాలుమనంగ్రహించరాదు" అనే మాటలను గూర్చి కొంత వ్రాస్తాను. ఏకదేశపతితమంటే, నన్నయాది మహాకవులు యెక్కడనో అపురూపంగా వాడిన ప్రయోగం అన్నమాట. దాన్నిబట్టి మనం ప్రయోగించడానికి వల్లకాదని వక ఆభాసవాదం కొందఱు చేస్తారు. కాని వారు దాన్ని పాటించినట్లు లేశమున్నూ కనఁబడదు. చూడండీ? నన్నయ్యగారు — "బలిమినీయని భూమివలయపతులన్" అని వకచోట కాఁబోలును, ఇచ్చు ధాతువునకు వ్యతిరేకార్థకరూపాన్ని, "ఈయని" అని యకారఘటితంగా వాడినారు. ఇతర స్థలాలలో — ఈని, అని యకార విరహితంగానే వాడివున్నారు. ఆక్షేపకులో? యకారఘటితరూపాలు కొన్నివందలు వాడివున్నారు. విస్తరభీతిచే చూపలేదు నన్నయ్యగారు అనుధాతువునకు (అగుట) అనేదేకాక, "కావుట" అనే విశేషరూపాన్ని కూడా వక్కచోట వాడినారు అంతేకాని వచ్చుధాతువుకు రావుట అన్నది వాడనే లేదు. ఇతరకవులు కూడ వాడినట్లు నేనింతవఱు కెఱుఁగను. ఆక్షేపకులు వాడినట్లు చూచినాను. విశేషవళినిగూర్చి అప్పకవి, తిక్కన సోమయాజి ప్రయోగాన్ని వక్కదాన్నే చూపివున్నాఁడు— ప్రయోగాంతరం చేసేలేదు. కొందఱు సాహసులు దాన్నికూడా 'ప్రకాశము ప్రజనితము'గా దిద్దుతూవున్నారు. యీదిద్దడం చాలాఅనాలోచితపు పని అని సుమారు ముప్పఁది యేండ్లకు పూర్వం భారతసంస్కర్తలకు మేము మొఱపెట్టుకొని వున్నాము. అది "కలగూరగంప" లో అచ్చయింది. తిక్కన్నగారి "నమ్మినమ్మక" అనే ప్రయోగాన్ని దిద్దడంవల్ల మూలంలోవున్న అర్థం

చెడిపోయిందని కూడా ఋజువుచేసి వున్నాము. అప్పు డంత కష్టించి నప్పంటికీ ప్రయోజనం లేకే పోయినట్లు యిప్పుడు తెలిసింది. అప్రయోగం లేఖక ప్రమాదమే అనిన్నీ, దాన్నిబట్టి ప్రయోగించుకొన్న శ్రీనాథ ధూర్జటి మహాకవులవిన్నీ దిద్దవలసినవే అనిన్నీ, యిప్పుడు కొందరు సాహసిస్తూ వున్నారు. మూలార్థం చెడడాన్ని గురించి యీసాహసించే వారు యేమిన్నీ సమాధానం చెప్పరు. భారతంలో దిద్ది చాలాకాలమయింది గాని ప్రాచీనప్రతులలో మాత్రం యింకా అప్రయోగం కనపడుతూనే వుంది. ఆత్మవంచకులు వ్రాసే వ్రాఁతకు అర్థంవుండదు. యేదో విధంగా తమ వాదం నెగ్గించుకోవడమే వారికి కావలసింది. సత్యాసత్యములతో వారికి పనివుండదు. అట్టి సందర్భంలో అపసిద్ధాంతాలు బయలుదేఱక మానవు. నిజంగా పొఱబాటు వున్నట్టయితే దాన్ని పాండిత్య పాటవంచేత సమర్థించి నప్పటికీ యథార్థం వప్పుకోవడం న్యాయమైనవాదానికి లక్షణం అని నేను అనుకొంటాను. నేను యింతవరకు యీ లక్షణానికి కట్టుపడి య్యేవే యెవరితోనేనా వివదిస్తా నన్నమాట మా వాదగ్రంథాల వల్ల తెలియకపోదు గనుక వి_స్తరించేది లేదు.

ఇప్పుడు వాదాలపద్ధతి చాలా శోచ్యస్థితిలోవుంది. " తిరుపతి వేంకటీయం " అనే పేరుకూడా తప్పే అంటున్నారు కొందరు. " వేంకట " శబ్దమే వారిమతంలో లేదని స్పష్టంగా వారి వాదం తెలుపుతూ వుంది. శ్రీవైష్ణవులు " వేంకటేశ్వరాచార్యులు " అని పేరుపెట్టుకోవలసిందే కాని " వేంకటాచార్యులు " అని పేరు పెట్టుకోవడానికి కూడా వారు అంగీకరించరని తోస్తుంది. యెవ రంగీకరించకపోయినా వైష్ణవులుమాత్రం ఈశ్వరపదఘటితంగా " వేంకటేశ్వరాచార్యులు " అని పేరుపెట్టుకోరన్నది పరమసిద్ధాంతం. వారు " వెంకట పెరుమాళ్ళు శ్రీనివాసులు " అంటారు కాని " వేంకటేశ్వరుఁ " డనికూడా అనరు.

ఇంతకూ " వేంకట " పదం పనికిరాదనడం యేమీతోఁచక అనే మాట కాని వేఱు కాదు. " తిరునామాంకితఫాలభాగుఁడు " అనేసమాసం

వంటిదైతే సాధింపఁబడదు గాని శుద్ధ సంస్కృతపదం వేంకటపదాని కేమి చిక్కు? ప్రోక్తార్థమందు "ఛపశ్రిత్యయం" యెందుకు రాదు? "నచ శంకా నచోత్తరం". తిరునామశబ్దం దేశ్యంకనక సమాసంరాదు. అది యే గ్రామనామమో యే రాజనామమో అయితే మహారాజులాగ సంస్కృత సంధిసి సంపాదించుకొంటుంది.

(1) వాసిరెడ్డ్యన్వవాయ (2) మందపాట్యన్వయ. వీట్ల నెవరేనా తప్పనఁగలరా? అంటారే అనుకుందాం. ప్రయోజన మేముంటుంది?

(1) "భూమీనాథ! శహాబదీన (2) ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా (3) ఢిల్లీవల్లభహస్త పల్లవతలే."

ఇవన్నీ పండితరాయలవారి ప్రయోగాలు. ఆక్షేపకులవాదంలో క్రొత్తవిషయం వకటి వుంది. అది యేమిటంటే? బొత్తిగా పరిశీలించకుండానే తప్పనడమున్నూ, మిక్కిలిగా తిరస్కరించడమున్నూ. అంత మాత్రంచేత జయసంపాదన కాదు. నేను ప్రాసస్థానంలో — "క. విని నైఁపక యిది యెంతే, నిని గ్లిష్టము" అని 'ఏనిని' ప్రయోగాన్ని భారతంలో సౌప్తికపర్వంలో 'తేజనే' ఏని బటు శోకవేగమున అనే తిక్కన ప్రయోగాన్ని నలభై యేండ్లకు పూర్వం చూచి ప్రయోగించి వున్నాను. ఆయీ సందర్భం మొదట గూఢంగానున్నూ తర్వాత, "సౌప్తికపర్వంలో" అని స్పష్టంగానున్నూ తెల్పివున్నాను. దానిమీఁద బాగా పరిశీలించి చూచినట్టున్నూ 21 పద్యాలుమాత్రమే నకార ప్రాసకలవి ఆ పర్వంలో వున్నట్టున్నూ యెక్కడా "ఏనిని" అనేపదం లేనే లేనట్టున్నూ వ్రాసి నన్ను తిట్టడానికి పనికివచ్చే వకపద్యాన్ని అవసరంలేనిదాన్ని వుదాహరించి కొంత దూషించి అంతటితో శాంతించినారు — పరిశీలిస్తేకూడా యెందుకు కనపడిందికాదో అని నాకు ఆశ్చర్యం తోఁచి నేను వకబుద్ధిమదగ్రేసరుఁడికి ఆయీ విషయాన్నిగూర్చి—యీ సందర్భం రాస్తూ యీప్రయోగాన్ని కూడా వుటంకించాను. ఆయన కవి. మంచివిమర్శన జ్ఞానం కలవాఁడు, మొదటినుంచీ ఆవలివా రాక్షేపించే ఆక్షేపణలున్నూ నాసమాధానాలున్నూ దానిమీఁద వారు

ఖండించే ఖండనలంటే, భారతాది మహాకవుల ప్రయోగాలు దేనికు స్ఫూర్తి రేకించడంతోటే దిద్ది పాఱవేయడం వగైరా లెఖఁగిపుంచడంచేత నన్ను యీవాదాన్నుంచి విరమించవలసిందని కోరుతూ వున్న సత్స్వభావుఁడు. చెప్పేదేమిటంటే, అసలు పామాణ్యజ్ఞానం అంటూ వకటి వుండాలిగాని అది లేనప్పుడు మీరు యెందఱు తిక్కనల ప్రయోగా లిస్తే యేం లాభి స్తుంది ? మీ రిచ్చిన ప్రయోగాన్ని, "తేజెనే, ని నిబిడశోకవేగమునన్" అని దిద్దితే యేంచేస్తారని వ్రాస్తూ దీన్నుఁడి విరమించవలసింది, లోకా నికి తత్త్వం బోధపడడం యిది వఱకే జరిగిందని జవాబు వ్రాసినాఁడు. అయితే అంత తేలికగా దిద్దరానిది యింకొకటికూడా నాకు నిన్న మొన్న శల్య పర్వంలో

క. "తనకై కాదే మది నె
ల్లను గోరుట, వినుము దాఁ బ్రిశయ మొందెనయే
నిని వారనియుద్యోగం
బునకు ఫలం బేమి రాజపుంగవ!"

అన్నది ప్రాసస్థానంలో దొరికింది. యెన్నని దిద్ది లోకాన్ని సంతుష్టిపరచఁగలరో చూతామని యిక్కడ దీన్ని వుదాహరించాను. దీని కెంత పరిశ్రమతో అవసరమే లేదు. నాగావళి, అనే వక నది తూర్పున వుంది. దాన్నిగూర్చి వ్రాస్తూ విమర్శకులు వకచోట ద్వితీయా విభక్తిలో "నాగావళిని" అని వాడివున్నారు. యిట్లాంచిద్భేదం యితర విషయంలో వున్నా ఆ రూపం కుదిరితే యిదిన్నీ కుదురుతుఁది. 'శకునినిన్' అన్న దికూడా యీ మాదిరిదే. ప్రక్రియ వ్రాస్తేమాత్రం యేమాత్రం వని చేస్తుందనే నిరాశచేత వ్రాయక, విమర్శకులు ఇతరకవుల ప్రయోగాలమా టట్లా వుండఁగా సొంత ప్రయోగాలని కూడా యితరులు వాడితే తప్పని తీరతా రనే అంశాన్ని ధ్రువపఱుస్తూ వున్నాను. వకచోట విమర్శకులు - "'నడచు' ధాతువుకు ప్రేరణలో రూపం, 'నడపు' అని మాత్రమే, కాని 'నడపించు' అని యించుక్కు చేరదు" అని ఖండించినారు.

మొట్ట మొదట వారివే మూఁడు చూపించాను. యిప్పటికి ముప్పయి మూఁడుకంటే అవి యెక్కువే దొరికాయి. యిదివఱలో ' ఆస-వలెన్ ' అనే వాట్లకంటే కూడా యివి మితిమీఱి పోయాయి. ప్రత్యక్షంగా చూపితేనేకాని జిజ్ఞాసువులకు తృప్తిగావుండదు. కనుక కొన్నిటిని కనపఱుస్తాను. (1) దం, డమ నడిపించుటొప్పు (2) చిత్రగతి న్నడపించెఁ దేరొగిన్ (3) నడపింపు రథము వానిఁ, బొడిచి (4) కృపాంతికంబునకుఁ దేర్నడపించె (5) రథంబు....నడపించుచు (6) బ్రదుకు పద్ధతిమై నడపింపు కార్యమున్ (7) సంధికార్యము నడపింప స్వాంతమందు (8) రణక్రమ మెల్లన్నడపించువాఁడటే (9) దేవకీసుత ...నడపింపుమా ? (10) తేర్నడపించితి యుద్ధభూమికిన్ (11) ముంగలిగా నడపింపఁ బెంపునన్ (12) నడపింపఁ గల నేర్పరి (13) క్రన్ననఁ దేర్నడపించె (14) నడపించుకొని పోదున్ (15) ఏది సూర్యుని నడపించు (16) రథ్యములన్ న్నడపింపుము (17) నడపింపు తేజులన్ (18) నడపింపు మని వేగిరించుటయు (19) కులస్త్రీల నడపించుకొని (20) మావుల నడపించి (21) స్యందనంబు నడపించుటయు—యిక్కడికి యిదివఱలో వేఱొక వ్యాసంలో యిచ్చిన మూఁడింటితోనున్నూ వెరశి 24 దాఁకా లెక్క తేలిఁది. యిన్ని ప్రయోగాలు కాక మఱి పదికూడా కల్పితే 34 అవుతాయిగదా ? ఇన్ని ప్రయోగించికూడ యితరులు ప్రయోగిస్తే తప్పనడానికి హేతువు జిజ్ఞాసువులే అడిగి చూడాలి. యిఁక సప్తమీ విభక్తి- 'అందు' అనే దానిమీఁద ' న ' అన్నది చేరుతుందనుటకు వ్రాస్తాను. యితరుల ప్రయోగా లివ్వడమున్నూ వాట్లనుదిద్దడమున్నూ యిదివఱకే జరిగింది. కనక ఆక్షేపకులవే చూపుతాను. —— (1) వప్రమందుననుండి తోఁచిన ప్రస్తర ప్రకరంబనన్ (2) ఇంతనరానికస్తి వనమే వనమందున జీవనంబుగా (3) అవి సహజంబులై యమృతమందుననుండి సముత్థితంబులై

పై ప్రయోగాలు మూఁడున్నూ ముద్రాప్రమాదా లనడానికిఁ గాని అన్యథాగా సమర్థనానికిఁగాని చోటియ్యవు. మఱియుం గొన్నైనతే

వున్నాయి కాని అవి నిర్ధారణార్థకమైన అకారంలో కూడుకొన్నవి అను కొన్ననూ అనుకోవడానికి వీలుగా వుండడంచేత యెత్తుకోలేను.

ఇఁక — "తాపసి" అనేరూపం తాపసుఁడు అనే అర్థమందు వాడ వచ్చునా? అన్నందుకు వ్రాస్తాను. పాశుపతంలోనున్నూ పురశ్చరణంలో నున్నూ ప్రమాణప్రమితములైన ప్రయోగా లివ్వడంఅయిందని వెనుకటి వ్యాసంలో చూపడం అయింది. దానికి తృప్తిపడ్డట్టులేదు. అందుచేత ఆక్షేపకు లవే చూపుతాను- "తన గృహమందఁ యుండియును దాపసినాఁబడు విప్ర వర్యుఁడు" దిద్ది తప్పుకోవడానికి వీలుగా వుండేవి మఱి రెండు మూఁడు వున్నాయి. అట్టి వివ్వడ మెందు కని యివ్వలేదు. యిది మాత్రం దిద్దడా నికి వీలుపడదా? అంటారేమో? వీలుపడకేంగాని చాలా దిద్దాలి. అందు చేత అందుకు వుపక్రమించరేమో అని నా ఆశ.

యిఁక — "అటులన్, ఇటులన్" అనేద్రుతాంతాలకు ఆక్షేపించినం దుకు, వారివే చూపుతాను. ఇతరుల ప్రామాణిక ప్రయోగాలు యివ్వడ మైతే జరిగింది గాని "బుడబుడక్కల" కవులక్రింద తీసివేసినట్లు జ్ఞాపకం —— "క... ద్రుపదపుత్రి....అవ్విరటునగరమం దెప్పటియట్లన యుండె" ప్రాస్థానంలో వుంది యీ ప్రయోగం. అట్లన్ + అ, ఉండె, అని విడఁదీసుకోవాలి. యింకా కొన్ని ప్రయోగాలు — "చ. విడు మెడఁ గిన్క నీ విటుల వీడ్వడు చుండుట" లోనైనవైతే వున్నాయిగాని అవి తేలికగా దిద్దఁబడతాయి. యేదో పెద్దలప్రయోగాలయందు కొంత విశ్వాస మంటూ వుండాలి గాని వుండక దిద్దడానికి పూనుకుంటే దిద్దఁబడని దేది? వన్నయ్యగారు — (1) "కమ్మని లతాంతములకు మ్మొనసి" అని వకచోట నున్నూ (2) "వృష్టిచే, సె మ్మహానది దీర్ఘికా" అని వకచోటనున్నూ, వాడివున్నా రని కదా? ప్రాసస్థలంలో మకార పూర్వకనకారమునకు మకారా దేశం వస్తుం దని సూత్రం పుట్టింది. కొంచెం ప్రయత్నం చేస్తే వీట్లని మాత్రం దిద్దలేకపోతామా? మొట్టమొదట తొందరపడి సుప్రయోగాలు అప్రయోగా లనడంవల్ల యెవ్వరికేనా చిక్కురాక మానదు. అందులో

అన్నవారుకూడా కవులయితే వచ్చే చిక్కులకు పరిమితి వుండదని జిజ్ఞాసువులు తెలిసికోఁగలరు. ప్రౌఢవ్యాకరణమంటే విమర్శకులకు బొత్తిగా సరిపడదు. అట్టిస్థితిలో వారి యీ ప్రయోగానికి రక్షకం కనఁబడదు.

క. "....పాండురాజసుతబలం
బాసమయ మందు నార్చుచు
నాసింధురనాథు నేసి రస్త్రచయములన్."

ఈప్రయోగం భారతసమ్మతమైనది, బంగారం వంటిది. అయితే యేంలాభం? యితరులను ఆక్షేపించి వుండడంచేత స్వోక్తివిరోధం వస్తుంది కదా! అని దిద్దుకోవలసి వస్తుంది. దిద్దఁబడనిదిమాత్రం కాదు. వృథాగా దిద్దుకోవడ మెందుకు? బలము, అంటే సేన, అది యేకవచన మైనప్పటికీ దానివల్ల వాచ్య మయ్యే మనుష్యులు చాలా మంది వుండడంచేత బహువచనక్రియ వుండవచ్చును. "మునినికాయముల్ పూజించిరి" వంటిదే యిదిన్నీ, లింగవిషయంలో కూడా ఆక్షేపించకూడదు. "వికలహృదయులైన సఖీజనంబులు" అని నన్నయ్యగారి ప్రయోగము జనశబ్దము అహుహత్తయినప్పటికీ యిక్కడ స్త్రీలను చెపుతూవుంది. గనక, దానికి— "హృదయలైన" అని మహత్వర్థకవిశేషణం వాగనుశాసనులు వాడినారు. యీ రహస్యం గోచరించనిపట్టున చేయవలసినపనియేమి? దిద్దడమే. "వికలహృదయంబులైన సఖీజనంబులు" అని దిద్దుతామనుకోండి, ఇది యెంత శోచ్యంగా వుంటుందో జిజ్ఞాసువులు పరిశీలించండి. అందుకే అప్పకవి "ఒప్పు తప్పని, చెప్పకుఁడీ కవులుపాసిచేసెద మిమ్మున్" అని ప్రార్థించాఁడు. కేవల సంస్కృతకవిత్వం చెప్పేవారికన్న తెలుఁగు కవిత్వం చెప్పేవాళ్ళకు చిక్కులెక్కువ వున్నాయి. యీ మాట మేము పూర్వమే వ్రాసివున్నాము. యింకొక అవాంతరపుచిక్కు, నేనక్కడక్కడ "మేము" అని బహువచనంగా వాడుతూవుంటే దానికి యీ బహువచనం యెందుకంటూ ఆక్షేపిస్తూ వున్నారు. మే మిద్దఱంగాని వకరమే కామన్నది జగద్విదితం. యిప్పుడు వకణ్ణే అయినా పూర్వపు అలవాటు పోవడంలేదు.

వున్నాయి కాని అవి నిర్ధారణార్థకమైన అకారంతో కూడుకొన్నవి అను కొన్ననూ అనుకోవడానికి వీలుగా వుండడంచేత మెత్తుకోలేదు.

ఇఁక — "తాపసి" అనేరూపం తాపసుఁడు అనే అర్థమందు వాడ వచ్చునా ? అన్నందుకు వ్రాస్తాను. పాశుపతంలోనున్నూ పురశ్చరణంలో నున్నూ ప్రమాణపరిమితములైన ప్రయోగా లివ్వడంఅయిందని వెనుకటి వ్యాసంలో చూపడం అయింది. దానికి తృప్తిపడ్డట్టులేదు. అందుచేత ఆక్షేపకు లవే చూపుతాను- "తన గృహమందు యుండియును దాపసినాఁబడు విప్ర వర్యుఁడు" దిద్ది తప్పుకోవడానికి వీలుగా వుండేవి మఱి రెండు మూఁడు వున్నాయి. అట్టి విివ్వడ మెందు కని యివ్వలేదు. యిది మాత్రం దిద్దడా నికి వీలుపడదా ? అంటారేమో ? వీలుపడకేంగాని చాలా దిద్దాలి. అందు చేత అందుకు వుపక్రమించరేమో అని నా ఆశ.

యిఁక —"అటులన్, ఇటులన్" అనేద్రుతాంతాలకు ఆక్షేపించినం దుకు, వారివే చూపుతాను. ఇతరుల ప్రామాణిక ప్రయోగాలు యివ్వడ మైతే జరిగింది గాని "బుడబుడక్కల" కవులక్రింద తీసివేసినట్లు జ్ఞాపకం —— "క... ద్రుపదపుత్రి....అవ్విరటునగరమం దెప్పటియట్లన యుండె" ప్రాసస్థానంలో వుంది యీ ప్రయోగం. అట్లన్ + అ, ఉండె, అని విడఁదీసుకోవాలి. యింకా కొన్ని ప్రయోగాలు — "చ. విడు మెడఁ గిన్క నీ విటుల వీడ్వడు చుండుట" లోనైనవైతే వున్నాయిగాని అవి తేలికగా దిద్దఁబడతాయి. యేదో పెద్దలప్రయోగాలయందు కొంత విశ్వాస మంటూ వుండాలి గాని వుండక దిద్దడానికి పూనుకుంటే దిద్దఁబడని దేది ? వన్నయ్యగారు — (1) "కమ్మని లతాంతములకు మ్మొనసి" అని వకచోట నున్నూ (2) "వృష్టిచే, నె మ్మహానది దీర్ఘికా" అని వకచోటనున్నూ, వాడివున్నా రని కదా ? ప్రాసస్థలంలో మకార పూర్వకనకారమునకు మకారా దేశం వస్తుం దని సూత్రం పుట్టింది. కొంచెం ప్రయత్నం చేస్తే వీట్లని మాత్రం దిద్దలేకపోతామా ? మొట్టమొదట తొందరపడి సుప్రయోగాలు అప్రయోగా లనడంవల్ల యెవ్వరికేనా చిక్కురాక మానదు. అందులో

అందుచేత యీకారాంత స్త్రీలింగరూపం వాడితే తప్పంటారు -అని పూరు కుంటే అంత చిక్కుండదు. స్త్రీలింగమైతే - "ఝరిణులు" అని వుండా లంటారు. వున్నప్రమాద మంతా యీమాటలోనే వుంది. "ఝర" శబ్దము స్త్రీలింగ మైనంతలోనే ఝరిణులుగా మాఱుతుందా? తట శబ్దం స్త్రీలింగమైనం తలోనే తటినులుగా మాఱిందా? తటిగామాఱిందా? ఆలాగే ఝర ఝరిగామారు తుందనుకోవాలి. అయితే ఝరిణిగా యెప్పుడు మాఱుతుందంటే, వినండి.

ఝరశబ్దము కంటె మత్వర్థీయ ప్రత్యయాన్ని చేస్తే "ఝరిన్" అని అయి అప్పుడు నాంతత్వాత్ జీప్సు వస్తే ఝరిణీ రూపం తేలుతుంది. అంతే కాని మొట్టమొదటేకాదు. తీర్థక్షేత్రవిచారంలాగే యిదికూడా తుదకి పరిణమిస్తుందేమో? యింకొకటి ఆక్షేపకులు, మా ఆక్షేపణ "నిర్ఝరి" కి సంబంధించిందంటారేమో? అప్పుడు మఱీచిక్కు. నిరుపసర్గ సోపసర్గలకు చుట్టరికాన్ని చెప్పే పరిభాష తెలియదనుకోవలసివస్తుంది. ఝరీశబ్ద విచారం తోటి నిర్ఝరీశబ్దవిచారం గతార్థ మవుతుంది. ఆ యీ విషయం యెంతో అప్రిగల్భంగా కనఁబడుతుంది కొంచెం తెలిసినవాళ్ళకు. యిట్టి ప్రమాదం స్వంతకవిత్వంలో వస్తే అందఱూ సహిస్తారు. యెవరినో ఆక్షేపించి విష్ణు చక్రించేసే వుద్దేశంతో- "కవిత్వమే తెలియనివాళ్లనుగా నున్నూ, గ్రామ్య కవులనుగానున్నూ, బొత్తిగాచేతగాని దద్దమ్మలనుగానున్నూ" యితరులను సమర్థించే తాత్పర్యంతో చేసే పరిశ్రమలో వృథాపరిశ్రమలో యిట్టి అసం ప్రదాయపుమాట వ్రాస్తే ఆవ్రాయడం యెవరిని గుఱించో వాఁడు వూరుకు న్నప్పంటికీ లోకం యేమనుకుంటుందో ఆలోచించండీ. ఆ యీ సందర్భాలు యెన్నో వ్యత్యాసంగా వున్నాయి. వాటిని చూచి నేను యేమీ వ్రాయడానికి కలమాడక, వకచోట కాఁబోలును "నవ్వు వస్తుంది" అని వ్రాశాను. దానికి జవాబు వ్రాస్తారుగదా! ఆవలి పూర్వపక్షం వారు - "నవ్వువస్తే నవ్వవచ్చు. యేడుపు వస్తే యేడవవచ్చు" అని వ్రాస్తారు. రెండోమాట వ్యంగ్యంగా వచ్చేటట్టు వ్రాయడమేకాని సాక్షాత్తుగా కాదనుకోండి. అసలు దాన్ని విడిచి యిట్టిమాటలు వ్రాస్తూ వుంటే పత్రికాపాఠకులకు ఆలాంటి

వ్యాసాలు రచిస్తాయా? అందుచేత నామరూపాలు గల ప్రతి పత్రికా కూడా ఆ యీ వాదాన్ని బుట్టదాఖలు చేయడానికి ప్రారంభించింది. దానితో ఆ పత్రికలు పక్షపాతానికి దిగినట్లు కొందఱు అపలపించడానికి మొదలుపెట్టినారు. మనం కవిత్వం చెప్పుకొనేటప్పుడు తప్పులు వచ్చినా అది లోకం సహిస్తుంది గాని వకరిని వెక్కిరించేటప్పుడు తప్పులతో వెక్కిరిస్తే చట్టన మూతి విఱుస్తుందని నేను అనుకుంటాను. నేను యీ విషయం "కవి, విమర్శకుఁడు" అనే వ్యాసంలో విస్తరించి వ్రాసి వున్నాను కనక యిక్కడ విస్తరించేది లేదు. నా మట్టుకు నేను నామీఁదికి వస్తే తప్ప యెవరినిన్నీ ఆక్షేపణలు వున్నవారినేనా సరే ఆక్షేపించడానికి పూనుకోను, ఆక్షేపించినవారినేనాసరే — "కృతేతు ప్రతి కర్తవ్యం" అనే న్యాయాన్నిబట్టి ఆక్షేపించవలసి వచ్చినప్పటికీ యెంతో తటపటాయిస్తాను. చూడండీ నన్ను మిక్కిలిగా తూలనాడి ఆక్షేపించిన వారికవిత్వంలో వకచోట — "శకాణి" అనిన్నీ, వేఱొక్కచోట, "అయస్మయములు" అనిన్నీ వుంది. ఇంద్రాణి, శర్వాణి, రుద్రాణి, భవాని వగైరా రూపాలు. ఇంద్ర, వగయిరా శబ్దాలనుండి వారి భార్యలు, అనే అర్థంలో రావడానికి ఆధారం వుంది, కాని, 'శకాణి' అని కావడానికి సుతరామున్నూ ఆధారంలేదు. అలాగే, వేదంలో తప్ప — "అయస్మయ" శబ్దమున్నూ, కాదు, "అయస్మయాదీని చ్ఛందసి" కదా? ఇంత ఆధారం వున్నవిషయంలో ఆయీ శబ్దాలను నేను ఆక్షేపించడానికి యింకా సంశయిస్తూవున్నాను. (వీట్లతోపాటుగా అస్వులు (ప్రాణములు) అనేదాన్ని కూడా చూచుకోవలెను.) ఎందుచేత? యేమో? యేవ్యాకరణంలో వీటికి ఆధారాలు వున్నాయో అనేసంశయంచేతనే! కొందఱు నిస్సందేహంగా తప్పంటూ వ్రాస్తూవుంటారు. దేవీభాగవతంపీఠికలో నేమి, పాణిగృహీతా పీఠికలోనేమి, యెంతో ఆయీవిషయం చర్చించి వుటంకించి వున్నాము. భారతం దిద్దేవారినిగూర్చికూడా యితరత్ర ప్రార్థించి వున్నాము. అయితే యేంలాభం? మళ్ళా మామూలుచిక్కు తప్పనేలేదు. తప్పులు కానివి

తప్పు లనడమూ, దానికి జవాబులు వ్రాయడమూ యిప్పటికిన్నీ తప్పనే లేదు. తప్పులు కానివి తప్పులని వూహకుంటే అంత అపహాస్యంగా వుండదు. కొందఱు అనాలోచితంగా — (1) "నీకవిత్వంమీఁద వినేవాళ్లు నిష్ఠీవనం (ఉమియుట) చేస్తా రనిన్నీ, (2) నీకు తాఁపులు (తన్నులు) తగలడం యిష్టమనిన్నీ, అర్థం వచ్చేమాటలు వ్రాస్తారు. యీలాటి మాటలు వ్రాస్తే యితరులకు కోపం రాకమానదు గాని నాకు శబ్దతప్పులూ అర్థతప్పులూ లేనివి పట్టినవారిమీఁద అంతో యింతో కోపం వస్తే వస్తుందిగాని పైమోస్తరు తిట్లకు కోపం రాదు. జనరలుగా — "నీకవిత్వం పనికిమాలినకవిత్వం" అని యెవరో అన్నారనుకోండి. దానికి కోపం వచ్చిమాత్రం మనం చేసే నిర్వాహకం యేముంటుంది? తప్పంటే వొప్పని సమర్థించుకోవడానికి చదువుకున్న చదువు ఆస్కారం అవుతుంది గాని "నీకవిత్వం అందమైనది కాదు. నీవు కురూపివి" అని అంటే సాధింపడానికి చదువుకున్న చదు వేం పనిచేస్తుంది? ఆయీవిషయాలు కొంత సంగ్రహంగా "జయంతి" అనే పుస్తకంలో పద్యాలలో విచారింపఁబడి వున్నాయి. అందులోనుంచి మచ్చుకు వకపద్యం వుదాహరిస్తాను.

శా. "నీయంద మ్మది నాకు నచ్చ దనెఁ దన్వీరత్న మొక్కర్తు 'సీ!
సీ!' యన్లే లనె దెందతో చెలులు నాచెల్వున్ గడున్ మెచ్చినా
రే! యీ "సర్టిఫికట్లు" చూడు మనువాఁ డేమంత కాంతాకళా
వ్యాయామాధ్యయన ప్రవీణుఁడొ? నినున్ వ్రాక్రుచ్చు మఁదున్ గవీ!

ముఖ్యతాత్పర్యం, కవిత్వంబాగుండదనడానికిఁ గాని, మనిషి అందగాఁ డనడానికిఁ గాని సర్టిఫిక్కట్లు పనిచేయ వన్నమాట. కాఁబట్టి "నిష్ఠీవనం చేస్తూన్నా రంటే" కాఁబోలు ననుకోవడమే యుక్తం. యేమో నా కవిత్వాన్ని గుఱించి నాకేం తెలుస్తుంది? తప్పొప్పులంటే కొంతతెలియడానికి ఆధారం వుంది. "దైవీమాయ" అని ప్రయోగించా ననుకోండి. యెవరో సంస్కృతవ్యాకరణజ్ఞులు, "దైవీ చాసౌ మాయాచ,

దైవమాయ " అని అవుతుంది గాని, దైవీమాయ అని కాదు. యెందు చేతంటే ? " స్త్రియాః పుంవద్భాషితపుంస్కాత్ " అనేసూత్రంచేత పుంవద్భావం రావలసివుంటుంది, అంటే యేమిటి నే చెప్పేజవాబు ? చదువుకున్నంప్పటికే యీలాటితప్పులకు అంగీకరించవలసిందే. యీ ప్రయోగం నీదేనా అంటారా ? ఆప్రశ్నతో అవసరంలేదు. " అడరు కురు ప్రవీరుల వరాన్వయసంభవు " ఇక్కడ యేకదేశాన్వయంలేదా ? అంటే లేదనఁ గలమా ? ఉన్నప్పటికీ సహ్యాం అనడానికి కొన్ని ఆధారాలు చూపవచ్చును. యెందుచేత ? ఆప్రయోగం అంత కర్ణకటువుగా లేదు కాఁబట్టి. యీ క్రింది ప్రయోగాలు చూడండి.

(1) " చెడిన చిత్తాంభోజుఁడై ధర్మజుండు " ఇక్కడ యెన్ని చిక్కులుండాలో అన్నీవున్నాయి. ముందు — చిత్తం, అంభోజమివ, యస్య, అని చేసుకోవాలిగదా ? పిమ్మట ఆ చెడిన అన్నవిశేషణాన్ని చిత్తంలోకి అన్వయించుకోవాలి. ఏకదేశాన్వయం సర్వత్రా యిట్టి చిక్కులతోటే చేరివుంటుంది గాని దీనిలాగ శ్రవణకటువుగా వుండనివి కొన్ని వున్నాయి. " అథ శబ్దానుశాసనమ్ " అని వుపక్రమించి, " కేషాం శబ్దానామ్ " అని ఆకాంక్షించారనుకోండి. యిక్కడ శ్రవణకటుత్వం లేదు. సహజంగానే కనపడుతుంది. " చెడిన చిత్తాంభోజుఁడో " ఓనమాలుకున్ణ వాఁడిదగ్గఱనుంచీ యిదేమిటాళ్రి ? అనిపిస్తుంది. యింకొక్కచోట "చలింపని చిత్తవృత్తియై" అనేదిన్నీ స్థూలదృష్టిని చూస్తే యీలాంటిదిగానే కనఁబడుతుంది గాని, " ఆ. వె. తెల్లహరులరథము వెల్లనిగొడుగునై " అన్నమాదిరిగా దాన్నిసమర్థించడానికి అవకాశం కొంతవుంది. చూడండి— " ఓడికలు కట్టుట " అన్నపదం యేవిషయంలో వాడితే బాగుంటుందోను ? దీన్ని కన్నీళ్ళు అనే పదంతో కల్పితే, లేక మరొకద్రవపదార్థ వాచకం దేనితోనేనా కల్పి వాడితే చక్కఁగా వుంటుంది. వకరు " వేడుకలోడికలు కట్టినవి " అని వాడివున్నారు. శబ్దాలపొందిక మాత్రం చక్కఁగానే వుం దనుకుందాం, లక్షణ చెప్పి అర్థంకూడా సమన్వయింపచేస్తామే

అనుకుందాం, అయితేమాత్రం అది సహృదయసమ్మతం అవుతుందా? "విచిత్రపరికారా హి పదానాం ప్రవృత్తిః, వామవయనా, వామోరురితి భవతి, నతువామచరణా వామవదనేతి" అన్న వామనుఁడికేం పిచ్చియెత్తి అట్లా వ్రాశాఁడా? యీలాటి కర్మాలు యెన్నో కవికి తెలియాలి, ధర్మ ధర్మి భావం సరేకదా? అది తెలియకపోతే "క. తనజన్మము సార్థ క్యము, నొనరించుకొనంగన్" అనేమాదిరి రచన తటస్థమవుతుంది. జన్మమునకు సార్థక్యం అంటే చిక్కులేదు. జన్మము సార్థకము అన్నా చిక్కులేదు. యిఁక సమాసం అంటూ వాదానికి దిగాలి. అది హృదయం గమంకాదు. తెలుఁగుకవిత్వమంటే చాలాచిక్కు అని వ్రాసేవున్నాను. ఆంజనేయులనుగూర్చిన కొన్ని విడివిడిపద్యాలలో — "అంజనీపుత్ర" అని ప్రయోగాలు సామాన్యులవి వినఁబడతాయి. అక్కడ "అంజనా" అని సవరించుకొంటే సరిపోతుంది. వకరు యెన్నోచోట్ల — "అంజనీ" అంటూనే వాడివున్నారు. వాల్మీకంలో — అంజన, అనేపేరే కనఁబడు తుంది. ఆంజనేయు లన్నది ఢక్ప్రత్యయాంతం గనక యీకారాంతాకా రాంతాలు రెండిటినుంచీకూడా సవరణ అవుతుంది. ప్రయోగాలుమాత్రం ప్రసిద్ధంగా — "అంజనానందనం వీరం" యీలాగే వున్నాయి. ఈకా రాంతం ప్రయోగించినవారికి లోకంలోవున్న చిల్లరపద్యాల ప్రయోగమే ఆధారమనుకోవాలి. లోకంలో పుట్టిపెరిఁగినకవి లోకాన్నివిడిచి కవిత్వం చెప్పలేఁడు, ఎక్కడేనా కొన్ని లోకానుభూతాలు దొర్లుతూ వుంటాయి. యింకొకటి — "ష్ట, ష్ఠ" ఈ అక్షరాలున్నమాటలు వాడడంలో కొంత చిక్కు వుంటుంది. చాలా మంది — "వసిష్ఠుఁడు" అనడానికి, "వసి ష్టుఁడు" అనిన్నీ "జ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడు" అనడానికి వత్తు లేకుండా నున్నూ పలకడం కలదు. "లోష్ట" శబ్దాన్ని "లోష్ఠ" అని పలుచోట్ల విమర్శకులే వాడివున్నారు. ఒకకవి ప్రాసస్థానంలో ఓష్ఠశబ్దాన్ని "ఓష్ట" అని వాడింది కనపడింది. "శా. ఇష్టిందుష్టి....దష్టోష్టుండై" దష్ట= కొఱకబడిన, ఓష్ఠ=అధరోష్ఠము కలవాఁడై, అని సమాసము. ఓష్ఠ

శబ్దము, ఓష్ఠ, అని యేలాఅయిందో నాకుమట్టుకు తెలియదు. ఎక్కడేనా వుందేమో ? ఒకపేశబ్దానికి వ్యాఖ్యాతలు భిన్న భిన్నముగా వ్యుత్పత్తు లున్నూ రూపాంతరాలున్నూ వ్రాసి వున్నారు — " మహాఋషీణాం మత యశ్చ భిన్నాః " కదా ! ఇతరులమాటాలా వుండఁగా పరబ్రహ్మ స్వరూపుఁడు శ్రీకృష్ణభగవానుఁడుకూడా గీతలలో కొన్నిచోట్ల — " కేచి దేవం వదంతి. కేచి దేవం వదంతి " అనే అర్థంవచ్చే వాక్యాలు వుపన్యసించడం చూస్తే, సర్వజ్ఞత్వ మంటూ యెక్కడా కూడా లేనేలే దని తోస్తుంది. అందులో యితర విషయాలకన్న శబ్దబ్రహ్మోపాసన యెంతకాలంచేసినా తనివి తీరేటట్టు కనపడదు—" న శబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయచ జనః కవీనాం గంభీరేవచసి గుణదోషారచయతు " అంటూ భట్టుమురారి మహాకవి భరతవాక్యంలో శాసించివున్నాఁడు. దాని తాత్పర్యం, " నాయన లారా ! మీరెన్నఁడుగాని శబ్దసారస్యంచక్కఁగా తెలుసుకోకుండా వంకలు మాత్రం పెట్టవ " ద్దనియ్యేవే. " సారస్వతం సారం జానీతే " అంటే పక్క అతనికే వర్తిస్తుంది అని యెల్లరూవప్పుకున్నారు. అతణ్ణిమెందణ్ణో వేపుకు తింటే అది అనుభవించి భరతవాక్యంలో యీ క్రొత్తపోకడ కనపఱిచినాఁడని నేననుకుంటూ వుంటాను. నేను సర్వకాల సర్వావస్థలయందున్నూ శబ్దబ్రహ్మోపాసనమే చేస్తూవుంటాను. ఆకారణంచేత నాకు యేలేశమోయిప్పటికి తెలిసినట్లు నన్ను ప్రేమించేవారు అభిప్రాయపడతారుగాని నాకు మాత్రం యింకా బాగా తెలియలేదనిన్నీ మఱికొన్ని జన్మాలు యెత్తి దీనివిషయంలో కృషిచేయవలసి వుంటుందనిన్నీ గాఢమైన కోరికవుంది. నన్ను గ్రామ్యకవినిగా లోకానికి సమర్పిద్దామని కొందఱికి ఉత్సాహం. అది అలా వుండనియ్యండి. కుపర్ణకానికి నకారాగమం చేయడం దృశ్యాదృశ్యంగా మహాకవులవాడుకలో వుంది. తత్సమవిషయం కాదని కొందఱివాదం. కొందఱు తత్సమానిక్కూడా అంతే అంటారు. నేను తత్సమానికి ఆగమం తీసివేయడానికి వప్పుకోను - దేశ్యపదాలలో అంగీకరిస్తాను. నన్ను ఆక్షేపించి గ్రామ్యకవినిగా సమర్థించే పెద్దలుకూడా నామతంలోవారే - (1) " చొక్క

కునై (2) వంతుకు" ( మజీమూఁడు యిదివఱలో చూపఁబడ్డాయి ) అంటూ దిద్దరానిచోట్ల వాడివున్నారు. అట్లు వాడీకూడా నన్ను ఆక్షేపించి వున్నారు. ఆ విషయం సర్వత్రా వారి ఆక్షేపణలో వుండడంచేత యిక్కడ ప్రత్యేకించి యెత్తుకోవడం అనవసరం. యింకొక విశేషం - "సంతోష శబ్దానికి వికృతి సంతోసము" అన్నంతవఱకు నిఘంటులో కనపడుతుంది. నేను "తోసము" అని వాడితే దాన్ని అనాలోచితంగా కొందఱు తప్పన్నారు. అసలు సంతోషశబ్దంలో వుండే 'సమ్' అనేది ఉపసర్గ. ఆ వుపసర్గలేనిరూపము తోషము. రెండిటికిన్నీ అర్థం వకటే. సిద్ధాంతంలో ఉపసర్గలకు ద్యోతకత్వమే కాని, "వాచకత్వం లేదు" కాఁబట్టి సంస్కృతంలో "తోష సంతోష," శబ్దాలు సమానార్థకాలు. "సం" పూర్వకత్వం ఐచ్ఛికంగాని నియతంకాదు. నియతం అనుకొనేవారికి — "తుష్యతు దుర్జనః" అనే ప్రయోగం వగయిరాలు కుదరవు. యీలాగే — "మానించి సమ్మానించి" అనేవి రెండున్నూ సమానార్థకా లని తెలుసుకోవాలి. "మానించి" అంటే మానిపించి అని అర్థం వస్తుంది కాని "సమ్మానించి" అనే అర్థం రాదనకూడదు. తత్సమధాతువుకాక తెలుఁగుధాతువే అయితే "మానిపించి" అనే అర్థమున్నూ రావచ్చును. అయీ సందర్భాలన్నీ అ_స్తమానమూ తదేకనిష్ఠతో తనలో తాను కిందా మీఁదా పడుతూ అప్పు డప్పుడు పెద్దలను అడిగి తెలుసుకుంటూ కొందఱితో "డీడిక్కీలు" కొట్టుకుంటూ వోడుతూ జయిస్తూ పాట్లుపడేవాళ్ళకిఁగాని గోచరింపవు.

కొందఱు కవిత అనేదానికి వికృతిలో "కయిత" అయినట్లు "కవిత్వము" అనేదానికి "కయితము" కాదంటారు. "అమవసనిసి" అన్న రామలింగం తాలూకు వెక్కిరింపుపద్యాన్ని గూర్చి కొంత వ్రాయవలసి వున్ననూ వి_స్తరభీతిచేత వ్రాయలేదు.

చూడండీ వక్క చిన్నవిషయాని కెన్ని పాట్లఁ బడవలసి వచ్చిందోను? తెలుఁగులో నాలుఁగు చరణాలకిన్నీ సంస్కృతసమాసం కలిపి పెట్టినపద్యాలు—

చ "అటఁ జని కాంచెభూమిసురుఁ డంబరచుంబి

........ పరిఫుల్లకలాపకలాపిజాలమున్ "

వగయిరాలు చాలా దొరుకుతాయి. దీన్నిబట్టి తెలుఁగుకవిత్వం చెప్పేకవులు యెప్పుడేనా సంస్కృతకవిత్వం క్వాచిత్కంగా చెప్పవలసివస్తే అదేరీతిని నాల్గుచరణాలున్నూ కలుపుతూవుంటారు. ఉదాహరణంచూపుతాను-

శ్లో. అపరాధ....భవదంఘ్రినతి, ప్రవణానవసి.

ఇందులో 'నతి' అనేపదానికిన్నీ 'ప్రవణాన్' అనేదానికిన్నీ సమాసం చేయఁబడివుంది. అసలు ఇది సంస్కృతకావ్యం కాకపోయినను ప్రస్తుత తోటకంలో యతిప్రాసలు కొంతమట్టుకు వున్ననూ మూఁడవ చరణంలో — "ప్రవణాన్" అని వకారం ప్రాసస్థానంలో పెట్టడంచేత సంస్కృత మర్యాదనే మనం ప్రధానం చేసుకోక తప్పదు. వ - పలకు యతిమైత్రి వుంది గాని ప్రాసమైత్రి లేదు. ఆ విచారణ ఆలా వుంచుదాం. సంస్కృతములో ద్వితీయచరణాంతానికిన్నీ తృతీయ చరణానికిన్నీ సమాసం కల్పడానికి విజ్ఞు లొప్పరు. సంస్కృతకావ్యాలలో యీలాకల్పిన కవిత్వం దొరకదు. యీ సంగతి యెక్కడ శాసించఁబడి వుందో నా కిప్పటికిన్నీ తెలియదుకాని, బ్రహ్మశ్రీ గోవిందవఝ్ఝల రాజన్న శాస్త్రుల్లుగారు యీ రహస్యం నాకు యిప్పటికి నలభై యేండ్లకు పూర్వం ఉపదేశించినారు. నేనున్నూ మాతిరుపతిశాస్త్రిన్నీ కవిత్వారంభదశలో నాల్గుచరణాలకున్నూ యేకసమాసం పెట్టి చింతామణిగణపతి మీఁద కవిత్వాన్ని చెప్పి వున్నాము. ఆశ్లోకాలు వకవూళ్లో వకసభలో వినిపిస్తూ వుండఁగా వక వృద్ధకవి సంప్రదాయజ్ఞుఁడు తప్పుపట్టడమున్నూ అప్పటికి యేదో విధంగా ఆయన్ని బుకాయించడమున్నూ జరిగిందిగాని ఆపిమ్మట ఉదాహరణం యెక్కడేనా దొరుకుతుందేమోనని సంస్కృతకావ్యాలలో ముఖ్యంగా లక్షణగ్రంథాలలో వెతకడానికి ఆరంభించాను. ఎంతవెదికినా దొరకనే లేదు. దానితో మనది తప్పే కాఁబోలు ననుకొని నేను చిన్నప్పుడు కావ్యాలు చదువుకొన్న గురువులు కొందఱు మాగ్రామసమీపస్థులే అవడంచేత వారిని సందర్శించి

ఈసందేహాన్ని మనవిచేసుకోఁగా వారు సభలో నే చేసినవాదమే యుక్త మన్నారు గాని ఆవలి సంప్రదాయజ్ఞులమాట యుక్తం అనలేదు. అప్పుడు మాతాత్కాలిక నివాసగ్రామం యానాముకు సమీపగ్రామం కోలంకలో శ్రీగోవిందవఝ్ఝుల రాజన్నశాస్త్రుల్లుగారిని అడిగితే వారు సెలవిచ్చారుగదా? "అర్ధాంతవర్జ మఖిలేష్వపి వృత్తికేషు" అనివుంది నాయనా! అన్నారు. దాని ఉత్తరార్థం నేను అడగనూ లేదు, వారు చెప్పనూలేదు. ఎక్కడ వుందనికూడా ప్రశ్నించినట్లు జ్ఞాపకం లేదు. సంస్కృతంలో యెన్నిపుస్తకాలు చదివినా యీ నియమానికి కట్టుబడియ్యేవే వుంటాయి. ఒక్కొక్కరి వద్ద వొక్కొక్కమాటచొప్పున తెలిసికొంటేనే కాని కవికి కాలం జరగదు. ఆలా కొంతసామగ్రి సేకరించడాన్ని గూర్చి—

ఉ. ఒక్కొకచోట నొక్కొకకని యొద్ద నొకొక్కొకమాటచొప్పునన్
జక్కఁగ సంగ్రహించితిమి చాతురి మీఱఁగఁ జెప్పుప్రజ్ఞ నొ
క్కొక్కఁ డొకొక్కరోజున కొకొక్క ప్రబంధము సేయనేర్తు మిం
కిక్కడ డాఁప నేల వచియించెద మున్నది యున్నరీతిగా.

అనే పద్యంలో శ్రీ విజయనగరం సంస్థానంలో ప్రస్తావించి యున్నాము. ఇట్టి మమ్ము లేక నన్ను "గ్రామ్యకవినిగా, ద్వైతగాణ్ణిగా, మనుష్యాధముణ్ణిగా" కొందఱు సమర్థించడానికి ప్రయత్నించి కష్టించు చున్నారు.

"గ్రామ్యకవి" అనేదానికి నేను గ్రామంలో నివసించేవాణ్ణేకాని పట్నంలో నివసించేవాఁడను కాను గనుక యౌగికార్థం సరిపోయిం దను కున్నాను. యీ సంస్కృతశ్లోకరచనా సంప్రదాయం నా కుపదేశించిన రాజన్నశాస్త్రుల్లుగారిని గూర్చి కొంచెం వ్రాస్తాను. వీరు సుప్రసిద్ధ సాహిత్య చక్రవర్తులు. శ్రీవేదుల సోమనాథశాస్త్రుల్లుగారికిన్నీ రాజగురువులు శ్రీపెద్దాపుర సంస్థానస్థులు శ్రీ రంగాచార్యులవారికిన్నీ శిష్యులు. రంగాచార్యుల వారివద్దనే మాపరమగురువులు శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారు కావ్యాలు

పడుచుకొన్నది. సాహిత్యరత్నాకరానికి మందరం అనే వ్యాఖ్యానం వ్రాసిన శ్రీ మల్లాది అచ్చన్నశాస్త్రుల్లుగారు కూడా ఆయీ ఆచార్యులవారి శిష్యులే. వీరు కేవలసాహిత్యమాత్రపరిజ్ఞాతలే అయివుండి కూడా పండితజనాదరణ పాత్రమైన అట్టి మహాగ్రంథానికి వ్యాఖ్యానం వ్రాయఁగలిగినా రనడం వల్లనే ఆచార్యులవారిశుశ్రూషామహిమ యెట్టిదో లోకం గ్రహిస్తుంది. అట్టి సంప్రదాయవేత్తలైన సాహిత్యపరులు క్రమంగా అంతరించినట్లు అన్యత్ర వ్రాసివున్నాను. ప్రధానాంశం సంస్కృతకవిత్వంలో ద్వితీయ చరణాంతానికిన్నీ తృతీయచరణాదికిన్నీ సమాసం పెట్టకూడదన్న విశేషం జిజ్ఞాసువులు తెలుసుకోఁగోరుతాను. మఱిన్నీ ఔపవిభక్తికాలనుగూర్చి కొంత వ్రాస్తాను.

"(1) పేరునకుమాత్ర విరటుఁడు (2) కాలుపోరునకుఁ బొమ్మంచున్ (3) తేరునకు (4) కలనుం బొనర్పుము (5) తేరునందు విసరి (6) ఆ కిరీటి విలునందు న్నేరుపు"

చాలును. యింకా ఆక్షేపకులవి బోలెఁడు ప్రయోగాలు వున్నప్పంటికీ చేదస్తమనిపించుకుంటుంది. యివి అన్నీ ఔపవిభక్తికములే అయినను అట్టి విశేషాన్ని తెలిపే గుఱుతులు లేకుండానే వాడి వున్నారు. నన్ను మాత్రం అనాలోచితంగా ఆక్షేపించివున్నారు. నా వాదం యేలాటిదంటే? వారివిన్నీ సమర్థనీయాలే నావిన్నీ సమర్థనీయాలే అని మాత్రమే. ఏ కొన్నిటికో తప్ప ఔపవిభక్తికచిహ్నాలు నియతంగా రావని లక్షణజ్ఞులే అంగీకరించినారు. నేనాశాసనానికి లోఁబడియే వాడినాను. ఆక్షేపకులు మాత్రం దాన్నికూడా అతిక్రమించి వాడినట్లు కొన్నిటివల్ల తెలుస్తుంది.

క రేఫయుక్తాక్షరానికి తద్విరహితమైన అక్షరాన్ని ప్రాసకూర్చుటనుగూర్చి

(1) తే. గీ. "వాక్త్రిణేత్ర" అని యెత్తుకొని - 'శక్తులు' అనిన్నీ

(2) "నాతో" అని యెత్తుకొని "ఈ త్రైలోక్య" అనిన్నీ అప్పకవి స్పష్టంగా వుదాహరించివున్న యీవిషయమై ఆక్షేపించడానికి హేతువు

అప్పకవీయాన్ని యీవిషయంలో ఖండించే తలంపుగా భావించవలసి వుంటుంది.

యింక "చాలన్" అన్నదాన్ని గూర్చి. యిది కళ అంటూ ప్రారంభించి - చాలు + అ అంటూ రూప ప్రదర్శనం చేశారు విమర్శకులు. నేనెక్కడనేనా దీన్ని ద్రుతాంతంగానే వాడుతూ వున్నాను. ఇతర కవులు కూడా అంతే. విమర్శకు లేలా వాడినారో పరిశీలిద్దామని చాలా పేజీలు తిరగవేశాను. వారున్నూ అట్లే వాడివున్నారు. పందల కొలందిగా వాడడంచేత వుదాహరించడం అవసరంలేదని మానుతూవున్నాను. చాలు అనే ధాతువుయొక్క తుమున్నంత రూపంకదా! 'చాలన్' అనేది. యిది కళగా సాధించడం యేలాగో నాకు బోధపడలేదు - చాలు, అనేది లాంగలపద్ధతి వాచకమొకటి కలదు. దానికి ఏవకారార్థమైన " అ " కారాన్ని చేర్చుకొన్న రూపమైతే, 'చాల' అనేది కళ కావచ్చును. అట్టిది నేనెక్కడా వాడలేదు. ఆక్షేపకులు అట్టిచోట ఆక్షేపించను లేదు. ఆక్షేపకులు సుమారు నూఱుచోట్ల ద్రుతప్రకృతికములుగా వాడి కొలందిచోట్ల (1)"చాలు చాలతిశయమయ్యె (2) చాల్చాలు " అంటూ కళగా కూడా వాడియున్నారు. అది " చాలు " ధాతువే అయినచో సమర్థితం కానేరదు. ఇతరకవుల ప్రయోగాలు "శా. చాలుం జాలుఁ బిసాళిచేతలు " లోనైనవి యివ్వనక్కఱలేదు. ఎవరో కొందఱు " చాల్చాలు " అని వాడినను దాని కాధారం కానరాదు. అట్టి ప్రయోగం నాఁబోటి " గ్రామ్యకవికూడ " స్వీకరించడానికి సందేహించేటప్పుడు యెక్కువ నియమనిష్ఠలతో కవిత్వం చెపుతా మనుకొను వారు గ్రహించకూడదుగదా? అయితే (1) లేనెలేదు (2) జోకులు మాకులు (3) తాను అనుటకు తను యిత్యాదులతోపాటుగా " చాలతిశయమయ్యె " అనేదికూడ నుపేక్షణీయమని కాని అన్యథాగాఁ గాని వ్రోసివేస్తే దానింగూర్చి జిజ్ఞాసువులు ప్రశ్నింప వలసియుండదు. కానెకాదువలె "లేనెలేదు" సాధ్యంకాదుగాని మావఃతములో సాధుకావదాని కభ్యంతరం లేదు.

"వేనవేలు, కోటానకోట్లు, తునాతునకలు" లోనైనవన్నీ వ్యవహారతస్సిద్ధములనియ్యేవే నే ననుకుంటాను. ఏదో ఒకసూత్రం యుక్తివల పుట్టినప్పుంటికీ అది వ్యవహార బలీయస్త్వాన్ని త్రోసివేయలేక శాస్త్రకర్తలు చూపిన ఆదరాతిశయమే అనుకోవాలి. ఒక్క భారతాన్నిబట్టి రచనసాగి స్తామనేవారికి మాత్రం 'లేనెలేదు' సాధువుకాదు. 'తను' తాను అనే అర్థమందు యెవ్వరికిన్నీ సాధువుకాదు. "తను దానఁ దొరఁగిన-తను దానై అనే సమస్తప్రయోగాల వంటిది కేవల "తను" కా దని జిజ్ఞాసువులు తెలుసుకోవాలి. ఆక్షేపకు లేత్రోవను కవిత్వం సాగిస్తారో అని కొంతపరి శీలించాను. వారు భారతాన్ని పూర్తిగా అతిక్రమించినట్లు "సర్వథా, శతధా, అన్యథా, సర్వదా, దశధా" లోనైన ప్రయోగాలవల్ల విస్పష్టమయింది. భారతంలో ఒక వృథా, వృధ, అనే అవ్యయం మాత్రమే కనపడుతుంది. దాన్ని ప్రయోగించుకోవడానికి మాత్రమే అధికారం వున్నట్లు శ్రీనాథాది మహాకవుల పోకడలు తెలుపుతాయి. అన్యాలనేనా వీరంత విచ్చల విడిగా ప్రాచీనులు వాడినట్లు కానరాదు. అధికరణార్థకం 'అన్యత్ర' అనే సంస్కృతావ్యయానికి కువర్ణకం చేరకూడ దని ఆక్షేపకులు వ్రాసినారు. అధికరణార్థకమైన అందు, ఇందు, ఎందు, అనే అవ్యయాలకు కువర్ణకం చేరఁగా దీని కెందుకు చేర కూడదో? అంటే వారేమి జవాబు చెప్పుదురో వినవలసి యుండును. కొన్ని ప్రత్యయాలు ప్రాతిపదికార్థంతో గతార్థం కాఁదగ్గవి వున్ననూ వాటి మీఁద మళ్ళా ఆ అర్థాన్నే బోధించే ప్రత్యయాలు రావడం కలదు. ద్విశబ్దంకంటె చేసిన ధాప్రత్యయానికి ప్రకృత్యర్థంకంటె అతిరిక్తార్థం లేదు. ఏకశబ్దంకంటె కూడా ఏకవచనండిటా — "ఏకవచనముత్సర్గతః కరిష్యే" అనివున్నప్పటికీ అనన్వితవిభక్తిని చేయడంకంటె అన్విత విభక్తిని చేయడమే యుక్తమని భాష్యకారులన్నట్లు జ్ఞాపకం.

"అనుక్త మన్యతోగ్రాహ్యం" అందుకు అన్నచోట వున్న—కు, విభక్తి "అందు" నిష్ఠమైన అధికరణార్థమును పాఱద్రోలి, ఆ ప్రదేశము

అనే ప్రథమాంతార్థమునే ప్రాతిపదికకు నిల్పుతుంది. ప్రస్తుతంకూడా అట్లే అనుకుంటే సరిపోతుంది. యింకా విస్తరించవలసివున్నను సంగ్రహంగా వ్రాసి విరమించాను. యిఁక మధ్యమ పురుషార్థమున — "గెల్చిరేని యీమీసముదీసి మీపదసమీపములన్ దలలుంచి మ్రొక్క-మే" అనే దాన్నిగూర్చి వ్రాస్తాను. సామాన్యులకు యిక్కడవున్న విశేషం బోధపడదనేవుద్దేశంతో వారివారికిపంపే సందర్శనప్పుస్తకాలలో — "గెల్తురేని" అని దిద్దియే ప్రఁపివున్నాను. వారి వారి పేళ్ళు చిఠాలో వ్రాయఁబడియే వున్నాయి. అవసరమైతే వారి వారిద్వారా ఋజువు చేయఁగలను. యిఁక అక్కడవున్న విశేష మేమిటంటే ? వినండి. గౌరవార్థకమైన భవచ్ఛబ్దార్థకమైన మీరు అనే కర్తకు సంస్కృతంలో వలెనే ప్రథమపురుషమును ప్రయోగించుట యుక్తమని పాశుపతంలో — "మీరలుండిరనెడి కారణమ్మననె" అనేచోట వ్రాసి వున్నాను. అట్లే యిక్కడఁగూడ మేము తలలు పాదములవద్ద వుంచి మ్రొక్కఁదగువారు మా కెంతో గౌరవించఁదగ్గవారుగా వుండాలనే మాటకు వప్పుకోనివా రుండరు గనక ఆ గౌరవాన్ని తెలిపేనిమిత్తం అక్కడ వున్న "మీ" అనేది భవచ్ఛబ్దార్థకమంటే సరిపోతుంది. ఇంతవఱకు విచారించి ప్రయోగించిందో కాదో గాని ఆక్షేపకులు వాడుకొన్న — "చ. అనిమొన మీర లుండి రనినంత" అనే ప్రయోగంకూడా యీ మార్గంచేతే సాధించవలసి వుంటుంది. కాదు కూడదు దిద్దుకుంటాము మేము అని విమర్శకు లనేయెడల వారితోపాటు మేమున్నూ దిద్దుకొందుము. పట్టుపటాంగం వస్తే మాత్రం దిద్దనక్కఱలేదని పైపన్తు చూపివున్నాను. యింక — 'పంథ ఉత్తరపన్థ' అనే ప్రయోగాలు గ్రాంథిక భాషలో వాడఁగూడదనే విషయం వ్రాస్తూవున్నాను.

"పథిన్" శబ్దానికి — "పథి" అని అవుతుందనిన్నీ, దానికి అనభిధానమనిన్నీ శబ్దరత్నాకరంలో వుంది. అది సర్వసమ్మతమే. "పథ" శబ్దం వకటి అకారాంతం వుందంటూ అదే నిఘంటు చెపుతూవుంది. దానికి "పథము" నిర్బాధమేకాని దానికి సంస్కృతకవుల ప్రయోగాలు

తఱచు కనపడవు. అట్టి అకారాంత పథ శబ్దమే వుండేయెడల — " ఋక్పూ. ర్బ్ధూః పథామ్ " అనే సూత్రారంభానికి సార్థక్యం కష్టపష్టిమీఁద కల్పింప వలసి వస్తుంది. భవతు. మార్గవాచక పర్యాయాలలో వున్న — అధ్వన్ శబ్దానికి, అధ్వానం అనేరూపం, ద్వితీయావిభక్తిలో వుంది గాని తత్స మంలో ద్వితీయాంతం ప్రాతిపదిక మయేతెగలో యిది చేరదు. 'అధ్వాన' అనే అకారాంతశబ్దమున్నట్లు శ-ర-లో వుందిగాని దానికి అర్థం " అమా ర్గము " అనే వ్రాయడంచేత " మహదధ్వానము " అనే ప్రయోగాన్ని అదిన్నీ సాధించనేరదు. కాఁబట్టి దీన్నిబట్టి " అధ్వానము " అనేదాన్ని, అధ్వము అనే అర్థమందు వాడఁగూడదని తెల్పుతూ వున్నాను. ఈ " అధ్వాన " ప్రయోగము భర్తృ శబ్దమునకు — " భర్తారుఁడువంటివి " అని తెలిసికోవలెను. యీ " భర్తారుఁడు " నరసరావుపేట ప్రాంతంలో వాడఁగా విన్నాను. ఇంక — " దవీయపదము " అనే దాన్నిగూర్చి కొంత వ్రాస్తాను. దవీయ శబ్దము సకారాంతముగాని అకారాంతము గాదు. అందుచేత, " దవీయఃపదము " అని వుండడం యుక్తం. యీలా దిద్దితే పద్యం చెడుతుంది. యిఁక గ్రంథారంభముకాని — " చేసెన్ దీనిని " అనేపద్యాన్ని గ్రంథారంభమనుకొని దానిలో వాయుబీజము, అగ్నిబీజము, అని వ్రాయడాన్నిగూర్చి వ్రాయవలసివున్నను, ఆ యీ సందర్భములు విమర్శకులు యెఱిఁగికూడా యేదో తాత్పర్యంతో దూషించ డానికి వ్రాసినవి కనక జవాబు నపేక్షింపవని వుపేక్షిస్తాను. నేను " శ్రీమ త్పరదేవతాయైనమః " అనేమాట వ్రాయకుండా యెవ్వరికిన్నీ వుత్తరం కూడా వ్రాయను. అట్టిస్థితిలో — గ్రంథారంభం చేస్తానని విమర్శకులు మాత్రం యేలా అనుకుంటా రనుకోను? ఆఘట్టంలోనే — " చెట్టుచెడే కాలానికి కుక్కమూతిపిందెలు " అని విమర్శకులు గ్రంథకర్తనిగూర్చి వాడివున్నారు. దీనివల్లనే వారి సదుద్దేశం వెల్లడి అయింది కనక తక్కిన దూషణవాక్యాలన్నీ దీనివంటివే అని వుపేక్షిస్తాను. ఆయీవిషయాన్ని " జయంతి " లో కొంత విస్తరించి వున్నాను. ఇఁక ప్రథమమందు

చేసినపని బాగుంటుందా? పిమ్మట చేసినపని బాగుంటుందా? అని ప్రశ్నించుకొని కొంత వ్రాస్తాను. ఒకశిల్పి వున్నాఁ డనుకోండి. వాఁడు మొట్టమొదట తన చాతుర్యమంతా కనపఱచుకోవా లని వక చిత్తరువు వ్రాసి ప్రకటించాఁడు. దాన్నిబట్టి లోకంలో పెద్దపేరువచ్చేసింది. తరువాత కొందఱి కోరికవల్లనైతేనేమి, తనంతట తానే అయితేనేమి మఱి కొన్ని చిత్తరువులుకూడా వ్రాశాఁడు. కాని మొట్టమొదట వ్రాసినంత సొగసుగా లేవు. యీ సందర్భంవల్ల మనం తెలుసుకోఁదగ్గ విశేష మేమిటి? ప్రథమరచన చాలాబాగా వుంటుందని తెలిసికోవాలి. యీసందర్భాన్నే యింకోలాగు మార్చికూడా ప్రసిద్ధినిబట్టి వ్రాసి చూపుతాను. నేర్చుకుంటూ వుఁడే వకశిల్పి కొన్ని చిత్తరువులు ముందు వ్రాశాఁడనుకొందాం. అవి వక మాదిరిగా వున్నాయి, తరువాత బాగా చెయి తిరిగాక కొన్ని వ్రాశాఁడు, అవి వెనుకటివాటికంటే చాలా బాగా వున్నాయి. ఆ యీసందర్భాలు రెండున్నూ సర్వానుభవసిద్ధములే. యిందులో నేను మొదట వ్రాసినదాన్నే కాళిదాసు — "సృష్టి రాద్యేవ ధాతుః" అని మేఘసందేశంలో కథానాయకురాలిని వర్ణించే ఘట్టంలో అనుసరించి వున్నాఁడు. బ్రహ్మదేవుని సృష్టిలో ఆస్త్రీ మొట్టమొదట సృష్టింపఁబడ్డదేమో? అన్నట్లు వుంది. అనఁగా అంత అందంగా వుంది అని కాళిదాసు వర్ణించివున్నాఁడు. దీన్ని అనుసరించే నేను "బొబ్బిలిపట్టాభిషేకం"లో, యేదో విషయం వ్రాస్తే వకరు ఆక్షేపించి కాళిదాసోక్తికి యేదోఅర్థం అన్యథాగా వుందంటూ వ్రాయడానికి వుపక్రమించారు. స్పష్టంగా సంప్రదాయం తెలిసివుండిన్నీ లోకంలో అందఱికిన్నీ ఆయావిషయాలు తెలిసివుండవు కనక మనబోట్లు— "తప్పని అంటే తప్పే అనుకుంటా" రని ఆత్మవంచనా తాత్పర్యంతో కొందఱు యీకాలంలో యిట్టి వ్రాఁతలకు వుపక్రమిస్తూ వున్నారు. ఎఱిఁగి వ్రాసే వ్రాఁతలకు జవా బెందుకు? యెఱిఁగినవేవో, యెఱుఁగనివేవో, స్పష్టంగాతెలుస్తాయి. చూడండి యీ ఆక్షేపకులే — "వృక్షవిచరన్మత్తాన్యభృచ్చారికా" అంటూ వకపెద్దసమాసంలో "కోకిలలు" అనే

అర్థం వస్తుం దనుకొని, " అన్యభృత్ " అనే పదాన్ని ప్రయోగించి వున్నారు. కోకిలకు - పరభృత - అనే పేరువుంది. అది యెందుకువచ్చిందంటే? పర = ఇతరజంతువులైన కాకులచేత, భృత = భరింపఁబడేది, అనఁగా కోకిల గుడ్లుపెట్టడమే కాని పిల్లలను చేయడం చేతకానిది కనక ఆగుడ్లను కాకిగూఁటిలో పడవేస్తుం దనిన్నీ తరువాత కాకి అవి తనగుడ్లే అనుకొని పిల్లలుగా చేస్తుం దనిన్నీ చెప్పుకొనేమాటలు అందఱూ యెఱిఁగినవే కనక విస్తరింపను. నిష్కృష్టాంశము, ప్రస్తుతం, విమర్శకుల — " పరభృత్ " అనేపదానికి ఆ అర్థంరాదు. పరజంతువులను తాను భరిస్తుందనే అర్థం వస్తుంది. యీలాటి వేవేనా విమర్శకులు చూపి నన్ను — " తప్పులుతడక కవిత్వం చెప్పేవాణ్ణి " గా లోకానికి ప్రదర్శిస్తే యిదివఱలో నా యెడల కొంత ప్రామాణ్యజ్ఞానం కల అమాయిక లోకానికి నాతత్త్వం వెల్లడి అవడమే కాకుండా శాస్త్రజ్ఞులు కాకుండా కవిత్వం చెప్పుకొనే భావికవులకు కొంత ఆ యీవిమర్శనం సహాయం చేసేది. వృథాగా వొప్పులు తప్పులని వ్రాయడంవల్ల భావికవుల కెంత సందేహించడాని కవకాశం కలిగించారో జిజ్ఞాసువులు పరికించుకొందురుగాక! కోకిలకు సంబంధించిన పదప్రసక్తి వచ్చింది కనక యిక్కడే దాని పెంపుడుతల్లి — కాకినిగూర్చి కూడా కొన్నిమాటలు వ్రాస్తాను. యీ కాకి చాలాకాలం బ్రదుకుతుందనే కారణం చేత — " చిరంజీవి " అంటూ దీన్ని కవులు వాడుతూ ఉంటారు. " దీర్ఘ ఖిద్దా " దిశబ్దాలవలె కాక యీ చిరజీవిపదము వ్యుత్పత్త్యర్థం కలదిగా ఉంది. మనము మనపిల్లలు తుమ్మినప్పుడు, ' చిరంజీవ ' అనడం కలదు. మనం మనకన్న చిన్నలకు ఉత్తరం వ్రాసేటప్పుడు, " చిరంజీవి " పదాన్ని వాడతాం గాని సున్నలేని " చిరజీవి " పదాన్ని వాడము. ఎందుచేత? ఆపదానికి రూఢివల్ల కాకి అర్థం అవుతుంది గనుక. అమరంలో, " చిరజీవీ చైకదృష్టిః " అని వాడి వున్నాఁడు. " యోగాద్రూఢిర్బలీయసీ " అని ఉండడంచేతనంటే? ఆపదానికి అవయవార్థంకంటె సముదాయార్థమే ఝుడితిస్ఫూర్తిని పొందుతుంది.

"మార్కండేయుం డనుముని చిరజీవి యగుచు" అన్న ప్రయోగము కొంత చింత్యం కాకపోదు. కొందఱుకవులు కొన్నిచోట్ల రూఢ్యర్థాన్ని వదలి యౌగికార్థానికి ప్రాధాన్యం యివ్వడమున్నూ కలదు. కవులకన్న ప్రపంచకంలో కక్కుర్తి మనుష్యులు కనపడరు. కవియనఁగా వకపెద్ద — "సంసారి". సంసారి యనఁగా కృష్ణాజిల్లాలో వ్యవసాయదారునికి పర్యాయపదము. ఆ వ్యవసాయదారుఁ డెన్నిపాట్లు పడతాఁడో కవికూడా అన్నిపాట్లున్నూ పడవలసినవాఁడే. కవికి అక్కఱకురాని శబ్దంగాని, అర్థంగాని ప్రపంచకంలో లేనేలేదు. యీమాట నేను కల్పించి వ్రాసింది మాత్రమేకాదు—

శ్లో. "న స శబ్దో నతద్వాచ్యం న సా విద్యా నసా కలా
జాయతే యన్నకావ్యాంగ మహో భారో గురుః కవేః"

యిట్టిస్థితిలో కవి అక్కడక్కడ తాను యెఱిఁగిన విషయాలను కూడా అతిక్రమించవలసివస్తుంది. అంతమాత్రంచేత ఆకవికి ఆసంప్రదాయం తెలియదనుకోవడం ప్రౌఢమార్గం కాదు. ప్రస్తుతం — చిరజీవి పదాన్ని మార్కండేయులకు విశేషణంగా వాడిన విమర్శకులకు అమరంలో ఉన్న యీ స్వల్పవిషయం తెలియ దనుకోవడంకన్న ప్రమాదం ఉంటుందా? అందుచేత నాతాత్పర్యం యేమి టంటే? కవి వకరిని విమర్శించకూడదనియ్యేవే! యెందుచేత? తన గ్రంథాన్నుంచే ఆవలివాళ్ళు ఉదాహరణాలు చూపిస్తే తన వాదానికి పూర్తిగా వోడు తగులుతుంది గనక. అయితే విమర్శనమంటూ లేకేపోవలసి వస్తుందంటారేమో? దానికి ప్రత్యేకించి కవిత్వవాసనా దూరులైన కేవలపండితు లుంటారుగా! వారు విమర్శనాలకు ఉపక్రమిస్తే వారిని యెదురు తిరిగి అడగడానికి అవకాశం లేదు. కవులకో? యెదురుతిరిగితే జవాబివ్వవలసి వస్తుందిగా! అది పెద్దచిక్కు. అందుచేతనే నేను నా అంతట యెవరినిగాని వెక్కిరించడానికి నా జన్మమధ్యమందు తలపెట్టకపోయింది. నన్నాక్షేపిస్తేనో? వూరుకోలేదు, జవాబుచెప్పి తీర్తాను. విమర్శకులు వకచోట — "భరతుఁడు-

సార్వభౌముఁడై... చక్రవర్తియై తేజరిలెన్ " అని ఆంధ్రీకరించారు. చక్రవర్తి, సార్వభౌమ పదాలు ఏకార్థకాలు. యెందుకీ పునరుక్తి అంటే జవాబు లేక పోలేదు. సంస్కృతభారతంలో రెండుపదాలున్నూ ఉన్నాయి కాఁబట్టి, " మక్షికాకు మక్షికా లిఖ " అంటారు. ఋషిప్రోక్తములలో నెన్నో భాగాలు పునరుక్తి భూయిష్ఠాలుగా ఉంటాయి. అవి సవరించుకోకుండా ఆంధ్రీకరింపవలసిందేనా ? మూలానుసరణంగా తెలిఁగించవానికి పూనుకోవడంచేత యథామూలంగానే తెలిఁగింపవలసి వచ్చింది అంటారా ? అనండి. అలాగేఅయితే కొన్నిచోట్ల — " ఈకథ యిదివఱలో గతార్థమయింది కనక సంక్షేపించఁబడ్డది " అని " ఫుట్టునోటు " వ్రాసి ఆకథ తగ్గించడం యెందుకు ? శ్రీనాథుఁడు — " అనుచితంబు త్యజించియు " అనడానికి కారణ మేమి? శ్రీహర్షుఁడు అనుచితకవిత్వం చెప్పేవాఁడున్నూ శ్రీనాథుఁడు సవరించే వాఁడున్నూ అగునా ? అంటే సమాధాన మేమి ? ముఖ్యాంశం కవి వకరిని విమర్శించఁగూడ దని తేలింది. విమర్శించెనో ? ముందు తాను ప్రయోగించుకొన్న ప్రయోగాలేనా జ్ఞప్తిలో ఉంచుకొని విమర్శించవలసి ఉంటుంది. లేదా ? అపహాస్యత్వం తప్పదని నేననుకుంటాను. ఇట్టివెన్నో విమర్శకులవి చూపవచ్చును. విస్తరభీతిచే నుపేక్షిస్తాను. నేను - "చూపఱులు" అని వాడివున్నాను. దీనిని విమర్శకులు ఆక్షేపించిరి. కళాపూర్ణోదయం, కవికర్ణరసాయనం, యీ రెండున్నూ వెదకి ఆఱుదాఁకా ప్రయోగా లివ్వడమేకాకుండా ప్రౌఢవ్యాకరణంకూడా ఉదాహరించితే, వాట్లన్నిటినీ నిందించిన్నీ బుడబుడక్క లనిన్నీ ప్రమాదాలంటూ వ్రాస్తారు. పోనీ అట్టిప్రయోగాలు తాము వాడుకోరేమో అనుకుంటే బహువచనంమీఁద బహువచనం వచ్చినవి — " పెక్కండ్రున్ " మొదలైనవి వాడికొని ఉన్నారు. గుప్తార్థప్రకాశికలో చూపఱులు అనే దాన్ని సమ్మతించి వున్నారు. దాన్ని చూపుతాను — " చూపఱులచూడ్కి కొంకవింతసొబగొనర్చె " కళా - 7 - ఆ. ఇంకను బహువచనాంతంబుపై బహువచనముగల శబ్దంబులు ప్రయోగంబులం బెక్కులు గలవు.

ఈ రీతిని వ్యాకర్తలు సమ్మతించిన మహాకవి ప్రయోగాన్ని మొదట విమర్శకులు ప్రమాదపడి ఆక్షేపించి వ్రాసి యిప్పుడు చెప్పఁదగ్గ జవాబు లేక నన్నుఁగూర్చి వారువ్రాసే యెకసక్కెపు మాటలు లోకం జవాబు చెప్పఁదగ్గవే కాని నేను జవాబు చెప్పఁదగ్గవి కావు. నా కేమో పూర్వకవుల గ్రంథాలలో ఉండే వ్రాఁత పొరపాట్లు వగైరాలు ప్రమాణాలఁట! "బుడ బుడక్కలవాళ్ళ" మాటలుకూడా ప్రమాణంగా నేను స్వీకరిస్తానఁట! నా కవిత్వం గొల్లవాళ్ళున్నూ గొడ్లకాపరులున్నూ మెచ్చుకుంటారఁట! ఇవన్నీ నాకు సమ్మతమే. పాపం దీనులుగదా! గొడ్లకాపరులు. వాళ్ళను సంతోష పెట్టిందే పెట్టడం. నన్ను దూషించడం యుక్తమే కాని నా కవిత్వాన్ని ఆదరించినవారిని దూషించడం యుక్తం కా దనియేనా విమర్శకులకు తోఁచిందికాదుగదా! అని నేను విచారిస్తున్నాను — దేవీభాగవతంలో —

క. కోపము చీఁకటికూపము
కోపము పాపముల కాదిగురు వగు హింసా
ధూపము కోపము కావునఁ
గోపింపంగూడ దేరికొఁజకైన సఖా!

అందుచేత పైవిషయమై ఆశ్చర్యపడవలసి వుండదు. వాదోపవాదాలలో వాది ప్రతివాదులు వారివారి పాండిత్య ప్రకర్షాలు యెంత చూపించుకొన్నప్పటికీ తప్పులేదుగాని అపసిద్ధాంతాలు మాత్రం సృష్టించడం అపరాధం అవుతుందని నేను అనుకుంటాను. ఆ కారణంచేతనే నేను అట్టి క్రొత్తత్రోవలు త్రొక్కినప్పుడు అది నాస్వంత కల్పన అనే సంగతి తెల్పే ధోరణి కనపరుస్తూ వుంటాను. ఇందుకు వక వుదాహరణ చూపుతాను.

"కద్రాజమద్రాక్షమహంయథా" అని మా కవిత్వంలో ప్రమాదంగా పడింది. అచ్చైన తర్వాత అప్రమాదం మాలో మాకే గోచరించింది. వెనక చరణం చివర — "రుద్రాణి! భద్రాణి తథాదిశేర్మే" అని వుంది. కనక, 'కద్రాజం' అన్న పదాన్ని, అకారప్రశ్లేష చేత

'అకదార్జిజం' చేసి, 'అక, అగ కుటిలాయాం గతౌ' అనే ధాతువును బట్టి "అకతీతి అకన్. అకం శ్చాసౌ రాజాచ, అకదార్జిజః" అని సమర్థించి కుత్సితభూపాలుఁడు అనే అర్థాన్ని సంపాదించడాన్ని ఆవల శంకించిన పండితులు మిక్కిలిగా అభినందించినారు. వారిప్పుడు కీర్తిశేషులు. నిన్న మొన్నటివఱకున్నూ జీవించియే వున్నారు. బొమ్మగంటి షట్కంలో నరసింహశాస్త్రిలుగారు వారు. ప్రస్తుతం విమర్శకులుకూడా వారివలెనే సంతోషించవలసింది.

"మృతాయితుఁడు" అనేది సమర్థించి చూపి వున్నాను. దానికి సంతోషించవలసినదానికి మాఱు మిక్కిలిగా దూషించి తిరస్కరించి వున్నారు. నేను విమర్శకుల సంతోషార్థం దీనిని ప్రకటించడం లేదు. భావికవుల కుపకరించు నని మాత్రమే యీ పరిశ్రమచేస్తున్నాను. విమర్శకుల కవిత్వంలో చాలా ప్రమాదములు — "శ్వశ్రేయముల్" మొదలైనవి వున్నాయి. వాట్లను చూపి వెక్కిరించడం నాపనిగాదు. నన్ను ఆక్షేపించిన మాదిరి ప్రయోగాలనుమాత్రం ఆక్షేపకుల రచనుండి చూపవలసివచ్చింది. కొన్ని యితరాలుకూడా ప్రసక్తానుప్రసక్తంగా నాఖండనలో విమర్శకుల లక్షణ విరుద్ధ ప్రయోగాలు కూడా తగిలివున్నప్పంటికీ అది ప్రధానంగా జిజ్ఞాసువులు తలఁపఁగూడదు. నేను ప్రయోగించిన —

"స్త్రీపుంజనస్వాంతమ్ముల్" అన్న ప్రయోగానికి గత్యంతరం వుందిగాని విమర్శకుల — "శ్వశ్రేయముల్" అనేది "శ్వశ్రేయసముల్" అని కావలసిందే కాని గత్యంతరంలేదు. సమాసాంత ప్రత్యయమే అయినను, అనిత్యత్వంచేత అన్యథాకరించడానికి అవకాశం యిచ్చేది యిదికాదు. నిపాతనం గనుక "బాధకాన్యేవహి నిపాతనాని" అనేదానికిందికి యిది చేరుతుంది. నాకున్నూ ప్రమాదాలు వుంటాయి. నన్ను ప్రస్తుతం విమర్శించి దూషించి వెం॥ శా॥ కవికానేకాఁడు అనే విశేషాన్ని సంపాదించి ఆ విశేషం లోకంలో వ్యాపింపఁ జేయడానికి మిక్కిలిగా కష్టిస్తూవున్న విమర్శకులకున్నూ ప్రమాదాలు ఉంటాయి గాని నాప్రమా

దాలు సవరణ కాఁదగ్గవిగా ఉంటాయనిన్నీ ఆక్షేపకులవి దిద్దుకోవలసిందే కాని సవరించడానికి అవకాశం కలవిగా నుండవనిన్నీ ప్రతిజ్ఞాపూర్వకంగా యీముసలితనంలో వ్రాయవలసి వచ్చినందుకు మిక్కిలిగా చింతిస్తూ వున్నాను. ఆక్షేపకులు నూర్లకొలఁది పేజీలు వ్రాసి నాకవిత్వాన్ని ఆక్షేపించిన దానికి నేను యేకొన్నిపుటలో వ్రాస్తే యేం లోకులకు తృప్తికలుగుతుంది? అట్లని అన్నిటికీ వ్రాయడానికి మొదలుపెడితేమాత్రం యేంబాగుంటుంది? వారు వ్రాశారుకదా? అని నేనున్నూ వ్యర్థంగా పేజీలుపెంచి వ్రాసిన ట్లవుతుంది. కాఁబట్టి జిజ్ఞాసువులను నేను కోరే దేమిటంటే? నే నిందులో సమాధానాలు వ్రాయక వదలిపెట్టినవాట్లల్లో గాని లేక యేకొంచెమో సమాధానం చెప్పినవాట్లకే గాని మీకు తృప్తికరంగా లేదని తోస్తే యేకొన్నిటినో గొంతుకు పట్టుకు తీరుతాయి అని మీకు తోఁచినవాట్లను యెత్తుకొని నన్ను జవాబు వ్రాయవలసిందంటే విస్తరించి వ్రాస్తాను. దేన్నిగుఱించేనా ఉపన్యసించడం, తేలికగాని వ్రాస్తే చాలావ్రాయవలసి వస్తుంది. కొంద ఱేమో శబ్దగంధాన్ని బాగా యెఱుఁగనివారు వూరుకోక యేదో ఆక్షేపించడమున్నూ, అవి యెదురు తిరిగినప్పుడు తిట్లకు దిగడమున్నూ వారితోపాటు తిట్లు తిట్టడం విద్వద్ధర్మం కాదని యెదటివారు వూరుకోవడమున్నూ దానితో మేమే నెగ్గినా మని ఆక్షేపకులు ప్రచురించుకోవడమున్నూ తఱచు జరుగుతూవుంది. వారివెనకాల కొందఱు — "చాఁకిరేవు బండలమీఁద యీవలివారిని ఆవలివారు ఉతికేశా" రంటూ వ్రాసేవారుకూడా బయలుదేరినారు. మఱికొందఱు ఆవలివారిని "యేనుఁగు" లనిన్నీ యీవలివారిని "దోమ" లనిన్నీ వ్రాసేవారు బయలుదేరారు. తుదకు భాషగతి అధోగతికి వస్తూవుంది. కొందఱు లోకవాడుకలో వున్న నిర్దుష్టపదాలనుకూడా నిఘంటులో లేవన్నంత మాత్రంచేత ఆక్షేపించడం కలదు. మళ్ళావారేమో ప్రయోగించుకుని — "గోదావరీతీరంలో దీన్నిలా వాడతారనిన్నీ, గంగాతీరంలో ఆలా వాడతారనిన్నీ" "పుటునోట్లు" వ్రాస్తారు. కవి యేప్రాంతంవాఁ డవుతాఁడో ఆప్రాంతాన్ని ఉన్న పదాలు

పడతాయి. భారతాదికంవల్ల యీసంగతి విస్పష్టం కాఁబట్టి విస్తరించేది లేదు. తప్పొప్పులు బాగా తెలియనివారు కవిత్వం చెప్పఁకోవడంలో అంత తప్పులేదు గాని విమర్శన మంటూ పెట్టుకొని తెలిసీ తెలియని జ్ఞానాన్ని బయట పెట్టుకోవడంకన్న శోచ్యదశ వేఱే వుండ దని ఖండితంగా వ్రాయ వలసివచ్చినందుకు విచారిస్తూ ఉన్నాను. భ్రాంతి పురుషధర్మమగుటచేత దాన్ని దాఁటేవారు ఉండరు. తెలిసినవిషయంలో పొరపాటున వచ్చే తప్పు భ్రాంతిమూలక మవుతుంది గాని అసలే యెఱుక్క ప్రయోగించేది భ్రాంతి మూలకం కాఁజాలదు. లోక మెంతవఱకు విశ్వసిస్తుందో? కాని " జయంతి " లో నే నిట్లు వ్రాసికొని వున్నాను—

శా. తప్పుల్లేవనఁ గాని మత్కవితలోఁ దద్జ్ఞుల్ వినుం డిప్పు డేఁ
జెప్పం బూనినమాట, మద్గురులవాసిం జూచినన్ వారి వా
తప్పుల్ నూటికి నాకుఁగూడ నెచటో తప్పుండెనే నుండు నే,
నిప్పట్లం బ్రతినం బొనర్చెద వినుం డెల్లన్ గవుల్ పండితుల్.

వచ్చినముఖ్యవిషయం తప్పొప్పులనుగూర్చి కానేకాదు. తప్పొప్పు లను నిరూపించి నాకవిత్వాన్ని దూషించి నన్నేమో అధోలోకానికి పంపడా నికి బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తూవున్నారు. చాలామంది యీప్ర యత్నం చేసినవాళ్ళున్నారు. గట్టెక్కినట్లుమాత్రం లేదు యేమో? యెప్పుడూ వకలాగే వుంటుందా? కాలం. అందుకే " జయంతిలో " యీలా వ్రాశాను—

మ. అవమానించు ప్రయత్న మాత్మ కవమానార్థంబు వక్రించె, నా
కవనమ్మం దలపెట్టి నేఁటి కెవరున్ గట్టెక్కలే దెక్కడో,
"శివ" యం చొజ్జదె "బోణి" నాదగుయశశ్శ్రీ కేమొ? లోకమ్ములో
నవమానంబు ఘటింతురంట! విజయం బౌఁగాక యప్పాన్కికిన్.

ఏదో అవమానమే కలిగించాలని పూర్తిగా ఉద్దేశం ఉంటే అడిగే ప్రశ్నలలో వకటిన్నీ ఆక్షేపకుల ఆక్షేపణలో త్రాణకలవి కనపడడం

లేదు. చిన్నకుఱ్ఱలని అడిగే ప్రశ్నలుగా కనపడతాయి. అయితే వారివుద్దే శంలో వెం॥ శా॥ స్కూలుకుఱ్ఱవాళ్లమాత్రమూ భాషావిషయంలో ప్రవేశం లేనివాఁ డని సాధించడ మనుకోవాలి.

"చండనిర్భీకకవనచారి పిండిపోలి। కవికుల వరుఁడు" వుండఁగా 'కవనం' అనేపదం తప్పేలా అవుతుందో? అదిన్నీ కాక, "కవయామి వయామి యామి" యేమవుతుందో? అమరంలో వున్న "పండితః కవిః" అనే దానికి వ్యాఖ్యాత వివరిస్తూ కవిశబ్దం యేధాతువువల్ల నిష్పన్న మయిందో స్పష్టంగా వ్రాసి ఉన్నాఁ డన్నమాటకూడా తెల్పవలసిందేనా? మురారి చెప్పినట్టు "శబ్దబ్రహ్మోత్థమైన" గంధము నాఘ్రాణింపని వారు విమర్శనలకు దిగడం ప్రమాద మన్నమాట పరమసిద్ధాన్తం కాక తప్పదు—

శా. ఏదో పెద్దపదానఁ గాలిడినతా మేలబ్ధికై యిట్టి దు
ర్వాదంబుల్ పచరింపఁగావలయు, నీ వాదాలకున్ బాండితీ
స్వాదం బొండొకఁ డుండఁగావలయు స్వల్పంబైనచో "గోఁచికిం
బై దాఁటున్ సరిపోదు గోణమున" కన్ పల్కుల్ స్మరింపించెడిన్.

వకరు నన్నయ్యగారిని "కాసీన" పదం చిక్కువచ్చేచోట వాడినా రని ఆక్షేపించడమున్నూ, నేను దాన్ని నిరసించడమున్నూ చిరకాలంనాఁడు జరిగినమీఁదనే సుమారు పండ్రెండేండ్లకు పూర్వం యీ వాదోపవాదాలకు అంకురార్పణ జరిగింది. అట్లా అనేవారు సంస్కృతంకూడా పరిశీలిస్తా రేమో అంటే, అట్టిపరిశ్రమకు వారు పూనుకోరు. సంస్కృతం పరిశీలిస్తే మాత్రం కొన్నివిషయాలు తేలుతాయేమో అంటే అప్పుడుకూడా నిష్క ర్షగా కొన్ని తేలనేతేలవు. ఎన్నివిధాల ప్రతులున్నాయో యేదేశంలోవి యెట్టివో ఆయీ విషయాలు నిర్ణయించడం కష్టం. "నన్నయ్యగారి వ్రాఁత చింత్యం, తిక్కన్నగారివ్రాఁత చింత్యం" అనడం మాత్రం సుళువు. ఎక్కడో కొన్ని ఘట్టాలు తప్ప భారతం యేమాత్రంసాహిత్య

జ్ఞాన మున్నప్పటికీ మిక్కిలి తేలికగా అన్వయిస్తుంది. అట్టి భారతశ్లోకాలు నన్నయ్య తిక్కనాది మహావిద్వత్కవులకు అన్వయింపక అన్యథాగా అంగీకరించా రనడానికి ప్రాజ్ఞు లెవరున్నూ విశ్వసింపరు. వారి కే ప్రతులు దొరికినవో అని అనుకోవడమే యుక్త మని నే ననుకొంటాను. "సుధేష్ణ" అని చతుర్థవర్ణయుక్తంగా ఉన్నట్లు విశ్వసించి అప్పకవి "ద, ధ," వర్ణాలకు ప్రాసవిషయంలో — "సుధేష్ణ తజ్జాలకములఁ జూచెన్" అని ఉదాహరించి వున్నాఁడు. 'సుదేష్ణ' అనియే కాని 'సుధేష్ణ' కాదని సుజనరంజని ప్రెస్సులో అచ్చుపడే భారతంలో దిద్ది మఱికొన్నిచోట్ల "సంబోధన" వగయిరాపదాలు "సంచోదన" కింద దిద్ది యతిస్థానాన్ని కూడా మార్చడం నేనెఱుఁగుదును. యీదిద్దడానికి పూర్వం కొన్నివందల యేండ్లనుంచి తదనుసారంగా ప్రయోగించుకొన్న కవులగతి యేంకావల సింది ? స్వాంతశబ్దం ఉభయయతులలోఁ జేర్చి అప్పకవి ఉదాహరించి ఉన్నాఁడు. బహుశః, స్వ + అంత, అని దానిలో పదద్వయమున్నదనే అభిప్రాయంతో తిక్కనాదులు ఉభయయతికిఁద దాన్ని వాడి ఉన్నా రన డానికి సంశయింపవలసి ఉండదుగదా ? అమర వ్యాఖ్యానంలో వకదానిలో "స్వన" ధాతువునుండి "స్వాంత" శబ్దం నిష్పన్నమైనట్లు నిన్నమొన్న నేను చూచినాను. నేను చూచినవ్యుత్పత్తి తప్ప మరియొకవ్యుత్పత్తి ఆ శబ్దానికి లేకపోతే అది ఉభయయతికి యెన్నఁడుగాని ఉపయోగించదు కదా ? కాఁబట్టి వేఱొకవ్యాఖ్యానంలో స్వరం విఱగడానికి తగ్గ వ్యుత్పత్తి కూడా వుండి తీరుతుం దనుకోవాలి. ఉదర శబ్దాన్నిగూర్చి, స్వరం విఱిగేది వకటిన్నీ విఱగనిది వొకటిన్నీ "సుధ" అనే అమరవ్యాఖ్యానంలో ముప్పది యేళ్ళకు పూర్వం నాకవసరమై చూస్తే కనపడ్డాయి. అది చూడకుండానే — "దురో, దరమా ! నీదగుపే రెఱింగియును గట్టా ? మోసపోతిన్" అని నేను ప్రయోగించుకొని, ఉదరశబ్దనిష్పత్తిని చూడ వలసివచ్చింది. లోకంలో పండితులైన కవులు పలువురు — "చుబుకం" అని వాడుతున్నారు. "చిబుకం" అని కనపడుతూవుంది అమరవ్యాఖ్యా

నంలో వకదానిలో; యెందటినో యీమధ్య వాకపు చేశాను పండితులను నేను — "భావుకం భవుకం భవ్యం" అనియ్యేవే వారివారికి వచ్చును. అమరవ్యాఖ్యానమూలాలలో వకదానిలో — "భవికం" అని కనపడుతుంది. వ్యుత్పత్తికేమి; భవికానికి వ్రాసినట్లే భవుకానికిన్నీ వ్రాయవచ్చును. విమర్శకులేమో, 'భవుకం' తప్పంటారు. 'భవికమా, భవుకమా ?' అని తేల్చవలసి వస్తే తెలుఁగులో యతిస్థానంలో ప్రయోగం చూపితేనేకాని నిర్ధారణ కాదు. సంస్కృతంలో దిద్దడాని కవకాశం వుంటుంది. చిబుకం, చిఞ్ ధాతువునుండి వకవ్యాఖ్యానంలో నిష్పత్తి చూపి సాధించి వున్నాఁడు. అన్యత్ర అన్యథాగా కూడా దానినిష్పత్తి చూపి చుబుకాన్ని కూడా సాధించడానికి అభ్యంతరంలేదు. ఒకటే పదానికి అనేకరీతులుగా వ్యుత్పత్తులు కనఁబడుతూవున్నాయి. దేశభేదాన్ని బట్టి పాఠభేదాలున్నూ వున్నాయి. వేదానికికూడా యీ తేడాపాడాలు పూర్తిగా వున్నా యని నిన్న మొన్న వకశుక్లయజుశ్శాఖవారు వారివేదాన్నిగూర్చి మాట్లాడుతూ వక్కాణించి వున్నారు. యతిస్థానంలో వున్న ప్రయోగాలయితే కొంతవఱకు రూపనిశ్చయానికి తోడుపడవచ్చును. కాని యే నన్నయ్యభట్టుగారివో యే శ్రీనాథుఁడి వంటి వారివో అయితే తప్ప వాట్లను పుచ్చుకొని నిశ్చయించడానికి కూడా జంకవలసి వస్తుంది. వెనక శ్రీ మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు రంగాచార్యులవారు మమ్మల్నిద్దఱినీ పరీక్షచేసి కొన్నిపుస్తకాలు మా కిచ్చి వున్నారు. అప్పుడు వారు ప్రస్తావరీత్యా అడిగినారుగదా ? "ధారుణి" అనే రూపాన్ని యతిస్థానంలో యెక్కడేనా కనపఱచఁగలరా ? అన్నారు. కొంత అవకాశంమీఁదైతే కనపరచవచ్చునేమో ? అని సందేహాస్పదంగా మనవి చేశాము. తుదకు వారు ప్రశ్నించిన రెండుమూఁడేళ్ళలో కాఁబోలును, "చ. సమస్తధా, రుణిప్రజఁ బ్రోచుచున్ విగతరోషుఁడునై" అనే ప్రయోగం భారతంలో నన్నయ్యగారిది దొరికింది. నాగరంలో — "ధారిణి, ధారణి" అనే రూపాలే తఱచు కనపడతాయి. "నాగరిక" శబ్దంకంటె నాగరలిపి — "నాగరక" శబ్దాన్నే తఱచు కనపఱుస్తుంది.

"అంగణ" శబ్దంకంటె ఆ అర్థమందు, "అంగన" అనేదే ఆ లిపిలో కనపడుతుంది. "పట్టణ" కంటె "పట్టన" శబ్దమే ఉపలభ్య మవుతుంది. యింతమాత్రంచేత వకదాన్నిపుచ్చుకొని వేఱొకదాన్ని త్రోసివేయుడానికి వలనుపడదని నేను అంటాను. ప్రస్తుతం భవుక, భవిక శబ్దాలు రెండున్నూ అంగీకార్యాలే. భవికంకన్న "భవుక" పాఠమే అనేకులకు అనుభూతమై వుంది, అని అనేకులతో సంప్రతించి యీమాట నేను వ్రాస్తూ వున్నానుగాని లోకాన్ని వంచించడానికి మాత్రం కాదు. వ్యుత్పత్తికేమి? యేకొన్ని శబ్దాలకు చెప్పే వ్యుత్పత్తులో తప్ప హృదయంగమమైన వ్యుత్పత్తులంటూ లేనేలేవు. వ్యుత్పత్తిపక్షిశ్రియణం చేసి చూపడానికి మొదలుపెట్టిన వ్యాఖ్యాతలకు యేదోవిధంగా వ్యుత్పత్తి చూపడం తప్పని విధి గనక ప్రతీదానికిన్ని వ్యుత్పత్తి చూపడం పెట్టుకొని "సర్వం ధాతుజమాహ" అన్న భాష్యోక్తి ప్రకారం వ్యుత్పత్తులు చూపినారే కాని అంత మాత్రంచేత శబ్దజాలమంతా యేలాగా సిద్ధించదు.

"వ్యుత్పన్నా న్యవ్యుత్పన్నాని చ" అనవలసి వచ్చింది. ఒకటే "వరాంగ" శబ్దం, ఒకటే "శివా" శబ్దం, భిన్నభిన్నార్థాలు కలిగి వున్నాయి. వీట్లకువ్రాసే అవయవార్థాలు ఊరికే చూపఁబడ్డవిగా భావించవలసిందే కాని యేమంత హృదయంగమంగా వుంటాయి? దీన్ని గుఱించి యింకా వ్రాయవలసియున్ననూ ప్రస్తుత మీవ్యాసం తదర్థమై పుట్టలేదు గనక సంక్షేపింపఁబడింది. ముఖ్యాశం, బహుపండితపరంపరచే అంగీకరింపఁబడుచున్న "భవుక" శబ్దము "ధారుణి" వలెనే స్థిరమైనదే గాని పోయేది కాదన్నది. ఇట్లే "మఱుచటి" అన్నదికూడా "మఱుసటి" వల్ల కొట్టఁబడేది కాదని యెఱుఁగునది. విమర్శకులు కొన్నిచోట్ల — "మానిసులు" అనిన్నీ కొన్నిచోట్ల "మానుసులు" అనిన్నీ వాడియున్నారు. ఇందేది వారికిష్టమో తెలియదు. చిన్నయ్యసూరిగారి మతం "మానుసులు" అనే దానికే అంగీకరిస్తుంది. మా మతం 'మానిసులు' అనేదానికే అంగీకరించడం పాశుపతంవల్ల తెలుస్తుంది గనక యిక్కడ విస్తరించను. దేశ్యపదాలకే

తప్ప ఆ ఉపోత్త మేత్వంరాదనే అంశం అహోబలపండితుఁడిచ్చిన వుదాహరణాలవల్ల తేలుతుంది. యిట్లా వ్రాస్తే చాలావాట్లనుగూర్చి వ్రాయాలి.

"వచ్చినాను, పోయినాను" వగయిరా ప్రయోగాలను విమర్శకులు తప్పంటారు కాని వారి కవిత్వం నిండా యెన్నో ప్రయోగాలు యిట్టివే వున్నాయి.

(1) నమ్ముచున్నాను (2) సఫలీకరించుచున్నాను (3) డాయంజూచుచున్నా నిటన్ ఇత్యాదులు శర్వపర్వంగా ప్రయోగించి – "నేనున్నూ దిద్దికొంటాను నీవున్నూ దిద్దికోవలసింది" అనడంవల్ల ప్రయోజనంలేదు. కవిత్రయేతర మహాకవులవికూడా మనకు మాన్యములే అని నేను చెపుతాను. యింక – "మిక్కిలిన్" అనే అవ్యయానికి ద్రుత మేలాచేరందనేదాన్ని గూర్చి వ్రాస్తాను—

(1) "తల్లిందండ్రియు (2) అంతనుండిన్నెలసన్నగిల్లె (3) గర్వివిజ్ఞ"

ఇత్యాది మనుచరిత్ర, విజయవిలాసాదులలో వున్న ప్రయోగాలకు ద్రుత మేలా వచ్చిందో, ఆలాగే వచ్చిందంటే సరిపోతుంది. యిందు తుట్టతుది ప్రయోగం ఆక్షేపకులదే. దానికి ద్రుతం యేలా వచ్చిందంటే గతి యేమి? అన్నిటికీ తెలుఁగుప్రయోగాలకు మహాకవిప్రయోగాలే ఆధారంగాని వ్యాకరణ మెక్కడ వుంది? అహోబలపండితుఁడు "ద్రుతోపజీవు" లంటూ కొన్నిటిని వ్రాసియున్నాఁడు. తద్ద్వారాగా 'మిక్కిలిన్' 'మఱిన్' వగయిరాలు సాధువు లవుతాయని అన్యత్ర వ్రాసియున్నాను. పాండిత్యపాటవాన్ని తెలుసుకోవాలంటే యీలాటి ప్రయోగాలవల్ల తెలియదు. చూడఁడి ఆత్మశబ్దానికి మనస్సు అనే అర్థం చెప్పఁకొన్నప్పుడు, 'ఆత్మ' అని అవుతుందిగదా? అని-అధ్యాత్మశబ్దానికి – "అధ్యాత్మ" అని ప్రయోగించా రనుకోండి. ఇది అవ్యయీభావము. సమాసాంతప్రత్యయం వచ్చి సంస్కృతంలో "అధ్యాత్మం" అని పరినిష్ఠితరూపం

అవుతుంది. పైఁగా నపుంసకత్వంకలుగుటకు సూత్రంకూడా వుంది. ఇట్టి సందర్భం తెలియక ప్రయోగించినట్లు — " అధ్యాత్మ " ప్రయోగం స్పష్ట పరుస్తుంది. మధ్యశబ్దంవలె దీన్ని చరితాదుల్లో వశిస్తామంటే కూడా ఏతత్సజాతీయాలు దానిలో లేకపోవడంచేత అంత యుక్తియుక్తంగా వుండదు. మఱివకటి — " న్యూనాధికముల్ " " న్యూనత్వము. అధికత్వము " అనే అర్థమందు పై ప్రయోగం చింత్యం.

" జన్మజన్మములు " ఇక్కడ యేకశేష దుర్వారం. అయినప్పటికీ సంస్కృత కవిత్వంకాదు కనుక తెలుఁగులో నిట్టివ్యవహార ముండడంవల్ల ప్రయోగించుకొన్నా మంటే తప్ప గత్యంతరం లేదు.

" నదీనదములు, విటీవిటులు, దాసదాసీజనములు " లోనైనవి సంస్కృతకవిత్వంలోనున్నూ కనపడతాయి. తెలుఁగులో చెప్పనక్కఱే లేదు. యిక్కడ కూడా యేకశేష దుర్వారమే. అతికష్టంమీఁద యేవో త్రోవతొక్కి సమాధానం చెప్పుకోవలసి వుంటుంది. మఱిన్ని (1) "శకృన్మూత్రంబులు విడిచె (2) మలమూత్రంబులు విడిచె " అంటూ శరపరంపరగా యుద్ధసందర్భంలో ఆవలి శూరుని పరాక్రమాతిశయద్యోతకమైన వర్ణనలో యిప్పటి భారతంలో కనపడతాయి. సంస్కృతంలో ఆలా వుండడంచేత " మఖనాకు మఖనా లిఖ " అనేమాదిరి తెలుఁ గవడంచేత యీలా వ్రాయకతప్పిందికా దనడంవల్ల కూడా అవి సమాధేయములు గావు. యథార్థకథనతాత్పర్యంతో వైద్యాది శాస్త్రములయందు తప్ప అట్టివి వాడకూడదు. లోకంలో — " కచ్చలో యేమోచేసుకున్నాఁడనిన్నీ, పోసుకున్నాఁడనిన్నీ " వున్నమాట సత్యమే కాని కవిత్రయభారతంలో ఆమాటలు ఆలాటి సందర్భాలలో వాడడానికి సాహసించలేదు. సంధివశంవల్ల వచ్చే — " కంపు " శబ్దమే ఆక్షేపణీయముగా భావించువారు పైరీతివర్ణనకు సాహసించకూడ దని నా తలంపు. పశ్యశబ్ద విచారాదులలో ఆ యీ విషయం విపులంగా చర్చించి ఖండనమండనాలు జరిగించఁబడ్డది కాఁబట్టి వలయువా రందుఁ జూడఁగలరు. మఱిన్నీ — " విరోచనాత్మజుఁడు " అని

సూర్యపుత్రుఁడు అనే అర్థమందు విమర్శకులు వాడియున్నారు. దీన్నికూడా ఆక్షేపించేవారు వక శిరోమణిగా రవతరించివున్నారు, కాని నేను దీనిని ఆక్షేపించే తెగలోకి చేరను. విరోచనశబ్దము విరేచనశబ్దానికి స్మారకమే అయేయెడల భాషలోన్నుంచి ఆ శబ్దాన్ని తీసివేయవలసే వస్తుందిగదా? ఆ పద్ధతిని మనము "కేశవ" నామాలు చెప్పుకోవడానిక్కూడా నోఁచుకోక పోవలసివస్తుంది. కాఁబట్టి ఆపంథ మంచిదికాదు. "సుభగ, భగవత్ భగినీ" ఇత్యాదులయందున్న భగశబ్ద మర్థవత్తయికూడా అపార్థాన్ని యివ్వదని లాక్షణికుల శాసనం. అట్టిస్థితిలో — "కేశవ" పదనిష్ఠమైన "శవ" శబ్దం అర్థవత్తుకూడా కాదు. కాఁబట్టి దీన్ని ఆక్షేపించడానికి ప్రాజ్ఞులు బొత్తిగా సమ్మతించరు. కాని కొందఱు నేఁటి వారు యీశబ్దాన్ని కాకపోయినా ఈదృశమైన వాట్లనే ఆక్షేపిస్తూవున్నవారు బయలు దేఱడంచేత ప్రతిబంధ్యుత్తరంగా ఆయీమాటలు రెండు వ్రాయవలసి వచ్చింది. అయితే నీవు — "సుభగస్నిగ్ధములై మహాయుతములై శోభిల్లు కేశమ్ములన్" అన్నచోట వున్న "భగ" అనేదాన్నిగూర్చి 'వాపోవడం' యెందుకు తటస్థించింది? యేమీ నేను "వాపో" లేదు. ఉదాహరించి వూరుకున్నాను. అందున్న "సుభగ" శబ్దం సహవాసదోషంచేత తాను చెడి కేశాలనుకూడా చెఱిపింది. "శబ్ద స్యాన్యస్య సన్నిధిః" అని అభియుక్తులు. లేకపోతే ఆశబ్దం నిర్దుష్టమే. కవిత్వానికి యెన్ని కర్మాలో తెలియాలి. కేవల లక్షణమే కాని లక్ష్యమే కాని అనుసరణీయం కాదు. చూడండీ, నిఘంటులో, 'కంగారు' పదానికి వ్రాసిన అర్థం యేమిటోను. లోకంలో అనుభవం యేలావుందో? ఆలోచించండి. అలాగే, అలుసు అంటే లాఘవం, అనే అర్థంలో, లోకంలో వాడుక. నిఘంటులో, "అలుసు" లేనేలేదు. "అలఁచు" వుంది, అర్థం, మందము, అనివుంది. దీన్నిబట్టి 'అలుసు' గ్రామ్య మంటే, సు, చు, గా దిద్దుకుంటే అర్థం కుదురదు. అది గ్రామ్యమనడానికి కాని ఇది అగ్రామ్య మనడానికికాని తగిన ఆధారం కనపడదు. నిఘంటులో — 'గొందాడు' లేదు. గొండా

డుట అంటే చిక్కుపడుట అనే అర్థంలో లోకంలో వాడఁబడుతూవుంది. "నేను సంసారంలోఁ బడి గొండాడుతున్నాను" అనే వ్యవహారం యెఱుఁగనివారుండరు. దీన్ని "కొండాడు" అనేది సంధివశాన్ని మారినట్లు తలఁచడానికి నా కిష్టం లేదు. యెందుచేత? "కొండాడు" కు వ్రాసిన అర్థం దీనికి చెప్పుకుంటే సరిపోదు గదా? నేను దీన్ని ధాత్వంతరంగానే జయంతిలో వాడి ఉన్నాను. అలుసు కూడా డిటో. ఇచ్చట గ్రామ్యా గ్రామ్యవిచారం చేసేవారిని ప్రాజ్ఞులుగా నే నంగీకరించేవాణ్ణి కానని యిదివరలో సూచించేవున్నాను. మఱిన్నీ చొచ్చుధాతువుకు కొన్ని చోట్ల మాత్రం — చొరుధాతువు ఆదేశంగా రావడం కలదు. క్త్వార్థకంలో "చొరి" అని యిప్పటి భారతంలో వుంది. అది నాకేకాక వ్యవహారానికి కూడా సమ్మతమయినరూపం కాదు. అట్లే, 'పెచ్చి' అనేదిన్నీ. పెచ్చునుగూర్చి "దే-వి" అనిమాత్రమే వ్రాసిన నిఘంటువే యుక్తంగా ఉన్నట్టు నేను తలుస్తాను. దీన్నిధాతువనుకొని, "పెచ్చి" వగయిరాలు ప్రయోగించిన వారి ఉద్దేశ్యం చింత్యం, హెచ్చెను, అనడానికిబదులు "పెచ్చెను" అని అనడం క్వాచిత్కంగా కనఁబడుతుంది. దాన్నిబట్టి ధాతు వనుకొనేటట్టయితే, పెచ్చుచున్నాఁడు వగయిరా ప్రయోగా లుండవలసి వస్తుంది. శబ్దరత్నాకరంలో వ్రాయకపోయినంతలో ఆమాట లేదనేవాదం నేనైతే చేయనుగాని నా అనుభవానికికూడా యిది ధాతువని తోఁచడంలేదు. గ్రామ్య మనిమాత్రం అనడానికి తగ్గ గుఱుతులు దీనియందు లేవు. సంప్రదాయసిద్ధ మనిమాత్రం చెప్పడానికి సాహసించేది లేదు. ఇది రమ్మి, లేక రా! అనడానికి "రద్దూ" అనడానికి దగ్గిఱగా ఉంటుంది. యీలాటివి నిరాఘాటంగా ప్రయోగిస్తూ కూడా కొందఱు చక్కని ప్రయోగాలు ప్రయోగించుకొనేవాళ్ళను దూషిస్తారు. అంతతో చాలించితే కొంత మెఱుఁగే. మంచిపద్యాలలో యిహాపరాలు లేశమున్నూ చూడక అపార్థం ఉందంటూ ఆత్మవంచనానికి సిద్ధపడి కొందఱు లోకాన్ని వంచించడానికి

ఆలాయపడతారు. పడితేమాత్రం లోకం గ్రహించుకోకపోతుందా? అట్టి పద్యాన్ని వకదాన్ని ఉదాహరిస్తాను.

ఉ. స్త్రీలనుగూడఁ గొందఱు పతివ్రత లొక్కొకచిక్కునందు ని
ర్వేలమనీష, వంశమభివృద్ధికి రాఁదగునట్టి తంత్రముల్
పాలక సత్కుటుంబినులు పాడిగఁ జేయుట యెందు వింద మీ
శీలవతీలలామ మిటఁ జేసినసత్కృతి కవ్వి లొచ్చగున్.

ఈపద్యం యేసందర్భంలోదంటే? ప్రస్తుతపు బొబ్బిలిరాజాగారి తాతగారిని వేంకటగిరిరాజ కుటుంబాన్నుంచి దత్తు తీసుకున్న వకరాణీగారిని గుఱించి వ్రాసినది. యీమె పాతకోట అచ్చి వచ్చింది కాదని దాన్ని వదలిపెట్టి కొత్తకోట కట్టించినదనిన్నీ, దానివల్ల వంశాభివృద్ధి జరిగిందనిన్నీ పూర్వం రాజస్త్రీలు వంశాభివృద్ధికి చేసినకార్యాలకన్న యీపె చేసిన కార్యం చాలా యుక్తమైనదనిన్నీ పద్యంయొక్క అభిప్రాయమైయుండఁగా యిందేమో! చెడ్డ అర్థం ఉందంటూ వ్రాసేవారికి ఆత్మవంచనాశక్తి కన్న యితరం లేశమున్నూ లేదని నే ననుకుంటాను. వెనుకటి రాజస్త్రీలను గూర్చి కొంత చెడ్డఅర్థం వస్తేకూడా చిక్కులేదు. వారు చేసినపనులు మంచివి కావని చెప్పడం కవికి యిష్టమేకదా? సత్యవతి, కుంతి మొదలైన వారు వంశాభివృద్ధికి చేసినకార్యాలు శాస్త్రసమ్మతాలే అయినను యేకొంచెమో వాట్లల్లో లోపముండినట్లు పద్యంలో తాత్పర్యం రావడం యిష్టమే. ప్రస్తుతవర్ణన మే రాణివాసపు స్త్రీకి సంబంధించినదో ఆపెవిషయమున దురర్థం వస్తేకదా, పద్యకర్తకు సంబంధించిన తెలివితక్కువ నాక్షేపించవలసి ఉంటుంది? అట్టిది లవమున్నూ లేకున్నా ఉన్నట్లు వ్రాయుట— అందులో తెలిసికూడా వ్రాయుట యెట్టిదో? తెలిసికొనే భారం లోకానికే వదలిపెడతాను. యెవరో నిమిత్తమాత్రం ఉంటేనేకాని కొన్ని అమూల్యవిషయాలు లోకానికి తెల్పడానికి అవకాశం కలగదు. అందులో నాప్రకృతి బొత్తిగా దానంతట అది యెందులోకిన్నీ దిగేది కాదు. ఎవరో యేదో

శంకిస్తే తెలిసినంతలో వ్రాసే అలవాటుమాత్రం నాకు వుంది. దీన్ని పత్రికలలో కొందఱు నాపద్ధకృతిని వీరరసప్రధానంగా అభివర్ణిస్తూ ఉంటారు. యెవరేనా సరే — " నాఽపృష్టః కస్యచిద్బ్రూయాత్ " కదా ! సదభిప్రాయంతోనో దురభిప్రాయంతోనో ప్రశ్నించడం వకటి కలిగితే చేతనైనంతలో వ్రాయడం తటస్థిస్తుంది. దానివల్ల జిజ్ఞాసువుల కేమేనా ఉపయోగిస్తే ఉపయోగిస్తుంది, లేదా ? లేదు. వ్రాసేటప్పుడు లోకాన్ని వంచించే తాత్పర్యంతో మాత్రం నేను వ్రాయను. ఆకారణంచేతనే యిదివఱలో వ్రాసిన విమర్శనాఖండనాలను లోకం మన్నించినట్లు నే నభిప్రాయపడతాను. ఇదికూడ అట్లే అగుఁగాక ! ప్రస్తుతం—"మహదైశ్వర్య" పదవిచారంతో యీవ్యాసం ప్రారంభమయింది. చాలా విషయాలు దీనిలో ప్రసక్తానుప్రసక్తంగా నడిచి వున్నాయి. ఇంకా మొట్టమొదటిదాన్ని గుఱించే కొంత తరవాయి ఉంది. దాన్ని పూర్తి చేస్తాను.

" మహచ్చిత్రం కృతం, మహత్కార్యం కృతం " అంటూ సంస్కృత నాటకాలలో అక్కడక్కడ ఉంటే దాన్ని తెలిఁగించేవారుకొందఱు సంస్కృతప్రవేశం బాగా లేనివారు — " మహచ్చిత్రము చేయఁబడ్డది, మహత్కార్యముచేయఁబడ్డది " అంటూ తెలిఁగించి ఉన్నారు. "నాకు కౌముది బాగా వచ్చును, శాస్త్రార్థం చేయమంటే చేస్తాను" అనేవారే " మహ " చ్ఛబ్దాన్నిగూర్చి యేన్నో స్థలాలలో పొరఁబడి వున్నప్పుడు తదితరులు పొరఁబడడంలో విశేషం ఉండదు. అయితే సంస్కృతంలో ఆలా వుంది గదా ? అంటూ స్థూలదృష్టికి శంక కలగవచ్చు. సంస్కృతంలో— మహత్ + చిత్రం, మహత్ + కార్యం, అని వ్యస్తం కాని, సమస్తంకాదు. తెలుఁగులోకి వస్తే సమస్తపదం కాక తప్పదు. అయితే ఆకారాదేశం తప్పదు. యీలాటిరహస్యాలవల్ల కవికి సంస్కృతంలో యేమాత్రంప్రజ్ఞ ఉందో తేలుతుంది గాని, యితరాలవల్ల తేలదు.

" అఘౌఘదహద్దండకమండలు ప్రధితుఁడు " యిది వూరికే వుదాహరించి వూరుకున్నాను. పాణినీయప్రవేశం ఉన్నవారికి యిక్కడ

వుండే చిక్కు తెలుస్తుంది. యితరులకు అగమ్యగోచరమే. మఱుసటి, అనడానికి మఱుచటి, అన్నాఁడుకనుక ఆకవికేమిన్నీ తెలియదని మొదలు పెడితే ప్రాజ్ఞులు సంతోషించరు. "మఱుస" అనేదానిలో 'స' కారమే వుందని నిర్ధారణ చేయడానికి పెద్దలు దిగిరావాలి. అది వ్యావహారికంలో నలిగే మాట. కొందఱు మఱుచటి అనిన్నీ కొందఱు మఱుసటి అనిన్నీ వాడడం కలదు. నిఘంటులో సకారఘటితాన్ని యెత్తుకున్నాఁడు. ప్రాస స్థలంలో ఉదాహరణ యివ్వలేదు. అందుచేత, "స"కారంవల్ల "చ"కారం కొట్టఁబడదు. అదిన్నీ కాక యిదిన్నీ వకపాండిత్యలోపమేనా ? శబ్దరత్నా కరం బాగా తిరగేయడం చేతకాదనే ఆక్షేపణకూడా ఒక ఆక్షేపణే అవు తుందా ? అయేయెడల అందులో వ్రాసిన "మేళం, కావలెన్" వగయి రాలుకూడా కొందఱు పరిశీలింపక వృథాగా వొప్పులు తప్పులనడం కలదు గదా ? వారి ఆక్షేపణలకు గతి యేమిటి ? ఇవి అన్నీ అవిమృశ్యకారిత్వం కింద జమకావలసిన విషయాలు. ప్రస్తుతం "మహత్" అనేదాన్ని గూర్చి కనక తరవాయివ్రాస్తాను. — సంస్కృతంలో — "మహాన్ విశేషః కృతః "అనివుంటేమాత్రం తెలుఁగులో పొరబడడం సాధారణంగా కలగదు కాని అసలుసంప్రదాయం యెఱక్కపోతే అప్పుడుగూడా అసంప్రదాయంగా పడవచ్చు. అందుకే కవికి యెన్నో సంప్రదాయాలు తెలియాలని వ్రాస్తూ అందులో మొట్టమొదటిది ఛందస్సనిన్నీ రెండవది వ్యాకరణమనిన్నీ తెలపడానికే కాఁబోలును — "ఛందోవ్యాకరణాదివిత్" అని లక్షణం పుట్టింది. సాహిత్యం యేవో పుస్తకాలు చూస్తూఉంటే క్రమంగా యెదుగు తుంది కాని వ్యాకరణం అట్టిదికాదు. అధమం మూడునాలుగేళ్లేనా గురు కులవాసంచేస్తే తరవాత స్వంతకృషిమీఁద మఱికొన్ని విశేషాలు అవగత మైతే కావచ్చును. అంతేకాని మొట్టమొదటనుంచీ స్వంతకృషివల్ల సాధిం చాలంటే సాధింపఁబడదు. యేవోకొన్నిసంగతులు తెలిసినా అవి అసంప్రదా యంగా ఉంటాయి. వీట్లనుగూర్చి మఱివకప్పుడు చర్చింపఁదలఁచి యిప్పటికి దీన్ని ఆపుతాను—

అనుబంధము

(1) అస అనునది అసు అని సవరించుకోవలెను. (2) తర్లి క్రిందు శబ్దవిచారఘట్టములో శ-ర-లో అట్టి ప్రయోగమున్నదని చెప్పే జవాబుకూడ నిష్ప్రయోజనమని యెఱుఁగఁదగు (3) "స్త్రీపుంజనస్వాంత మ్ముల్ '' అను ప్రయోగమునకు మార్గాంతరమున్నది అను ఘట్టములో విమర్శకుల "స్త్రీపుంభావముగాంచు వేల్పుల వేల్పులట" అనుదానికి యేమాత్రమున్నూ ఆధారము లేనేలేదని తెలుసుకోవలెను. (4) నిర్ఝరీ శబ్దమునుగూర్చి వ్రాసినఘట్టములో — చ. బసపడు... ....పసిరిక మేసి నిర్ఝరుల బాఱెడి తియ్యని నీరుగ్రోలి" అనెడి శ్రీనాధుని హరవిలాస ప్రయోగమున్నూ, శ్లో. జటాకటాహ సంభ్రమ భ్రమ న్నిలింప నిర్ఝరీ విలోల వీచివల్లరీ – శ్లో. నిలింప నిర్ఝరీ ధర స్తనోతు – శ్లో. కదా నిలింప నిర్ఝరీ కుంజ కోటరేవసన్ అనెడి రావణభుజంగస్తోత్రస్థప్రయోగత్రిత యమున్నూ అనుసంధించుకోవలెను. అక్కడక్కడనున్న అచ్చుపొరబాటు లను సవరించుకొనుటకు చదువరులు ప్రార్థితులు.



# తిక్కనగారి నైపుణ్యం

( 17–3–1937 సం॥ ఆంధ్రపత్రిక నుండి )

యావత్తున్నూ భారతాంధ్రీకరణంలో కనపడుతుంది. పలువురు యీ విషయం వ్రాసే వున్నారు. ఇప్పుడు కొత్తగా నేను వ్రాయవలసింది అంతగా లేదు. ముఖ్యంగా భగవద్గీతాంధ్రీకరణాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. వ్రాయడానికి ముందుగా లోకంలో వ్యాపించివున్న ఆహోహలు వుటంకిస్తాను. కొందఱంటారు గదా, తిక్కన్నగారు అసలు లౌకిక కుటుం బములో పుట్టి లౌకికానికి చాలా సంబంధించిన మంత్రిత్వాన్ని కూడా నిర్వ హించిన మహాకవియైనప్పటికీ కేవలచ్ఛాందసానికి సంబంధించిన సోమ

యాజిత్వాన్ని పొందిన పిమ్మట భారతాన్ని తెలిఁగించడంచేత ఆ శ్రౌతులు వగయిరాలతాత్పర్యంతో యేకీభవించిపోయి భగవద్గీతార్థాన్ని ప్రత్యక్షరశో ధగా తెలుఁగులోకి అనువదించడానికి సందేహించి యేదో టూకీగా తేల్చి వేశాఁ డంటారు.

నా మట్టుకు పైమాట అపోహగా తోస్తుంది. అతఁడు వైదికకర్మ శ్రద్ధకలవాఁ డైనంతమాత్రంచేత వారివారి చాదస్తా లన్నీ అనుకరిస్తాఁ డనడానికి నాకు సమ్మతం కాదు. వైదికులైన శ్రౌతులెవ్వరున్నూ పశువు లేని యజ్ఞాన్ని యజ్ఞంగా అంగీకరించరు. ఇక్కడ వైదికపదంచేత స్మార్తులనె గ్రహించండి. తిక్కన్నకూడ వైదికులలో స్మార్తులలో చేరినవాఁడే కనుక ఆశ్రౌతులే వచ్చి యజ్ఞాన్ని నిర్వహించవలసివుంటుఁది కనుక ద్వైతులు మొదలైనవారిలాగు పిష్టపశు యజ్ఞాన్ని చేయక ప్రత్యక్ష పశువుతోనే యజ్ఞాన్ని చేసి వుంటాఁడు. కాని అతనియుద్దేశములో హింస లేని యజ్ఞమందే యెక్కువ తాత్పర్యం వున్నట్టు తోస్తుంది. అట్లేకాకపోతే అశ్వమేధపర్వములో నీ కింది విధముగా వ్రాయఁడు—

"అట్టి పరమ ధర్మం బా నకులంబుచేత గర్హితంబగుటకుం గార ణంబేమి యని యడిగిన వైశంపాయనుండు — ధర్మపుత్రునధ్వరంబు నీ చెప్పిన యట్టిద యైనను నొక్కటి చెప్పెద నవహితుండ వగుము. ఆన్నకులంబు (ముంగి) హిఁసాత్మకం బయిన పశుయజ్ఞంబుకంటె, నహింసామహితంబైన తపోమయ యజ్ఞం బధికంబని చెప్పినయది యయ్యె రిత్తచెప్పుట కాక తన శిరంబును శరీరార్ధంబును సువర్ణమయంబు లైన కతంబునం బలికెం గాన దానివచనంబులు త్రోపువడవు...." అని నిస్సందిగ్ధంగా వ్రాసెనుగదా! దీనివలన తిక్కన్నగారు సోమయాజు లైనప్పటికీ హింసాత్మకమగు యజ్ఞమందు లేశమున్నూ గౌరవం లేనివా రని తెలుతూవుంది. పోనీ దీనిఁబట్టి చూడఁగా సోమయాజి పిష్టపశు యజ్ఞాన్నే చేసెనని మన మనుకోరాదా? అని కొందఱు వాదింపఁ బోతారు. కాని అది సాధ్యం కాదు. స్మార్తులలో ప్రత్యక్షపశువు లేకుండా

చేసేయజ్ఞానికి సుప్రసిద్ధశ్రోతు లెవ్వరున్నూ రారు. కోమట్లలో కొలంది వత్సరాలనాడు యజ్ఞంచేస్తూ పిష్టపశువునే వుపయోగించినట్లయితే నేను వినివున్నాను గాని దానికి సుప్రసిద్ధులైన శ్రోతులు వెళ్ళినట్లు వినలేదు. అసలు యజ్ఞాధికారమే లేదంటూ వాదించే స్థితిలో జరిగించే ఆయజ్ఞం. అందుచేత దాన్ని మనం తిక్కన్నగారి యజ్ఞానికి పోల్చడానికి వల్లకాదు కూడాను. విశిష్టాద్వైతులలో వకతెగవారు అసలు యజ్ఞానికేకాదు వైదిక కర్మలలో వేటికిన్నీ అంత ప్రాధాన్యాన్ని యివ్వరు. కేవలము భక్తిని మాత్రం అంగీకరించి దానివల్లనే తరణోపాయాన్ని వారు సాధిస్తారు. వారిలో రెండో తెగవా రున్నారా, వారు వైదికులంత కాకపోయినా చాలా భాగం వైదిక కర్మలకు అంగీకరిస్తూ స్వమతసిద్ధాంతప్రకారం వర్తిస్తారు. వారు యజ్ఞం చేయడ మంటూ వస్తే ప్రత్యక్షపశువునే పెడతారు. విశ్వ గుణాదర్శం మొదలైన మహాగ్రంథాలు వ్రాసిన శ్లేషయమకచక్రవర్తి యీతెగలోవాఁడే. ఈయన వేంకటాధ్వరిబిరుదం వల్ల యజ్ఞకర్త అని తెలుస్తుంది. కరిగిరిచంపులోని వర్ణనంకూడా యీ విషయానికి తోడవు తుంది. ఈయన రెండవతెగవారి కేవలభక్తిప్రపత్తిసిద్ధాంతాని కంగీకరించ డనడానికి — "త్రైవిద్యే నిత్యతయా శ్రితే యదశనం యాచ వ్యవాయ క్రియా" అనే విశ్వగుణాదర్శశ్లోకపాదం పూర్తిగా సాక్ష్య మిస్తుంది. ఈ వేంకటాధ్వరితెగవారు దక్షిణాదిని పలువురు వైష్ణవు లున్నారు. వారంద ఱున్నూ చాలాభాగం స్మార్తాచారాలను అనుమోదిస్తారు. వితంతుశిరోముం డనంకూడా వారిలో వుంది. కాని యిన్నిటికిన్నీ అంగీకరించిన శాఖలో వాఁడైనా యీ మహాకవి యజ్ఞకర్త అయికూడా తత్కర్తలకు అనూచా నంగా వస్తూవున్న సోమయాజిబిరుదాన్ని పెట్టుకోక దానిపర్యాయపదమైన "అధ్వరి" పదాన్ని పెట్టుకోవడానికి కారణమేమో ? నా కీలా తోస్తుంది — ద్వైతాద్వైతాది పరస్పరమతభేదం వున్నవారు వకటే విష యంలో పాండిత్యం కలవారై కూడా పేర్లు భిన్నభిన్నాలుగా ధరిస్తూ వున్నారు. వైష్ణవులు మహామహోపాధ్యాయబిరుదాంకితులై కూడా తుట్టి

తుడను గురుత్వబోధకమైన ఆచార్యపదాన్నే అనూచానంగా ధరిస్తూ వున్నారు. అంతేకాని శాస్త్రిపదాన్ని ధరించడంలేదు. ద్వైతులుకూడా డిటో ప్రకారమే కొన్ని పేర్లలో యీ మతాలవారికి కొంచెం భేదంకనపడు తుంది. వైష్ణవులలో - కృష్ణశబ్దానికి ఆచార్యపదం చేరినప్పుడు - కృష్ణమా చార్యులు అని మకారాగమం కూడా కలుస్తుంది. ద్వైతుల కది చేరదు.

శ్రీకాశీ కృష్ణాచార్యులుగారు దీన్ని గుఱించిన సంప్రదాయం వకప్పుడు చెప్పి వున్నారుగాని దాన్నిప్పుడు మఱచిపోయాను. చాత్తాను లనఁబడే వైష్ణవతెగలోవారు పండితులైతే సూరిపదాన్ని తద్బోధకంగా ధరిస్తారు. వైష్ణవమత ప్రవక్తల యందు పూర్వులలో కొందఱికి యీసూరిపదం కనపడుతూవుంది. వారిని నిత్యసూరు లంటారు. ఆను పూర్వీభేదంతప్ప యీ పదాలన్నీ పర్యాయపదాలే. యీ సూరిపదానికి ఉదాహరణం మనం వెదుక్కో నక్కఱ లేదు. చిన్నయ్యసూరిగారే మనకు చాలును. ప్రస్తుతం వేంకటాధ్వరి వేంకట సోమయాజు లెందుకు కాలే దంటే పైకారణం వల్లనే అని మన మనుకోవాలి, వేంకటపదమే పనికిరా దనేవారు అప్పుడే కాదు, యిప్పుడున్నూ లేరు. ఎవరేనా ఉన్నప్పటికీ అది నెగ్గేవాదం కాదని అన్యత్ర విస్తరించాను. మనకు ప్రస్తుత మేమిటంటే తిక్కన్నగారు హింసాత్మకమైన యజ్ఞానికి అంగీకరించేవారు కాకపోయినా శ్రౌతులనిర్బంధంవల్లనున్నూ వేదప్రామాణ్యంవల్లనున్నూ హింసాత్మక మైన యజ్ఞాన్నే చేసివుంటా రనుకోవడమే. ఇటీవల శ్రీ నందిరాజు దీక్షితులుగారు శ్రౌతులనుకూడా స్వశాఖలోనే తయారు చేసుకొని యజ్ఞం చేసినట్లున్నూ అందులో పశుహింస లేకుండానే జరిగినట్టున్నూ వింటాను. ఈమాట సత్యదూరం కాదు. తిక్కన్నగారినాఁటికి యిట్టి పట్టుదల లేదను కోవాలి. దీక్షితులుగారు వైదికకర్మలకొఱకే జీవితాన్ని ధారపోసిన అవతార పురుషుఁడు. తిక్కన్నగారో ? సోమయాజియైనప్పటికీ - " మ. కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నావృత్తి యీ, భవ మద్దానఁ దరింతు " అనుకోదగ్గవారు. అందుచేత ఈశ్రౌతులతో వివాద పెట్టుకొంటే ఆకాలం

నాఁటికి వుండే ఛాందస బలాన్నిబట్టి పలు కష్టాలకు పాలుగావలసి వచ్చి దానికి సంబంధించిన వాదాలకు వ్రాసే గ్రంథాలతోనే జీవితం ఖర్చుకావలసి వస్తుందనుకొని తదనుమతంగానే యజ్ఞం చేసివుంటారేమో? కాని అహింసాత్మకమైన యజ్ఞమందే ఆయనకు తాత్పర్యం — యీ క్రింది అశ్వమేధపర్వపు వాక్యాలు కూడా చూడండి — "ఉపరిచర వసువు సన్నిహితుండగుటయు నయ్యిరుదెఱంగులవారును నారాజున్యుని సాక్షిగాఁ గోరిన నతండు దేవతాపక్షపాతంబునఁ బశువిశసనంబు కర్తవ్యంబని పలికి యధఃపాతంబు ప్రాపించెంగావున హింసారహితంబయిన యజనంబ పూజనీయంబనుటకు సంశయింప వలదు...." దీనివలనఁ గూడా తిక్కన్నగారి హృదయం తేటతెల్లంగా తేలుతూవుంది. అయితే యిది తిక్కన్నగారి హృదయమేమిటి? వ్యాసులవారి హృదయంగదా అంటారేమో? అనండి అదిన్నీ మనకు కావలసిందే. వ్యాసులవారిహృదయ మిట్లుంటాదమె. ఈ వ్యాసులే ధర్మరాజుగారి అశ్వమేధానికి ప్రేరకుఁడామె. శిష్యసహితంగా దాన్ని నడిపించి వున్నాఁడామె. ప్రస్తుతం జనమేజయుఁడితో ఆ యీనిష్కృష్టాంశాన్ని తెలిపే వైశంపాయనుఁడు ఆవ్యాసులవారితో పాటుగా ఆయజ్ఞంలో వున్నవాఁడే ఆమె. వీరంతా ప్రత్యక్షహింస చేసి వుండిన్నీ పైకి చెప్పేమాటలు అన్యథాగా వుండడంవల్ల — "మేము చెప్పినట్లు చేయండి. మేము చేసినట్లు చేయకండి" అనే పెద్దలమాటలు జ్ఞప్తికి తెచ్చినట్లవుతూ వుందా లేదా? దీన్నిబట్టే కాఁబోలును, శ్రీబులుసు అచ్చయ్యగారు, ఇతరులను వద్దని శాసించడమైతే లేదుగాని వారుమాత్రం పశుహింసకు జంకి యజ్ఞం చేయనేలేదని చెప్పుకోవడం వినఁబడుతుంది. వారికుమాళ్ళు పాపయ్యశాస్త్రుల్లుగారున్నూ అంతే. వీరి అన్నగారు వెంకప్ప సోమయాజులుగారు మాత్రం యజనయాజనాలు రెండున్నూ పూర్తిగా నిర్వహించినవారే. కానివ్వండి ప్రస్తుతం యీ వ్యాసం యీ విషయం తేల్చడానికి పుట్టింది కాదు. కాబట్టి యింతతో యీ చర్చ ఆపుదాం. భారతాన్నిబట్టి గాని మరికొన్ని స్మృతులను బట్టి గాని చూస్తే హింసాత్మక

మైనయజ్ఞం కంటె అహింసాత్మకమైన యజ్ఞమే యుక్తమని తేలుతుంది. కాని యీ భారతాదులు స్మృతులవడంచేత శ్రుతులప్రామాణ్యం బలీయం కనుక తద్వేత్తలు హింసాత్మక యజ్ఞానికే అంగీకరిస్తూన్నారని స్పష్టమవుతుంది. దేవీభాగవతంలో మాత్రము—

తే. గీ. మాంసము భుజించువార లంబన్ యజించి
రేని పశువుల బలిదాన మీయవలయు
నజవరాహమహిషము లత్యంతముఖ్య
ములు బలివిధానమున కని మునులమతము .

అనివుంది. దీన్నిపట్టి చూచినప్పటికీ దశవిధ బ్రాహ్మణులలో నున్నూ మాంసభక్షకులు గాని — "ఆంధ్ర ద్రవిడ కర్ణాట మహారాష్ట్ర ఘూర్జరు" లనేటి పంచద్రావిళ్ళున్నూ అహింసాత్మక యజ్ఞాన్నే ప్రేమించడం యుక్తంగా కనపడుతుంది. ఇన్ని ఆధారాలు ఉన్నప్పంటికిన్నీ తోడిమతస్థులు ద్వైతులు లోనైనవారు వారివారి ఆచార్యుల ఆదేశాన్ని బట్టి అహింసాత్మకమైన యజ్ఞాలు సాగిస్తూవున్నప్పంటికీ స్మార్తులు మాత్రం కేవలమూ అహింసాతత్పరులై వుండికూడా యజ్ఞంలో హింసాతత్పరులుకావడం కొంత విచారణీయమే. యెన్నివిధాల సరిపెట్టుకున్నప్పటికీ ద్రౌపదికి సంఘటించిన పంచభర్తృకత్వం హేయంగా కనపడ్డట్టే యీ విషయంకూడా ఘోరంగా కనపడకమానదు. బంగాళీలు దేవీయజ్ఞంలో యిప్పటిక్కూడా నరపశువు నుపయోగిస్తా రని వినికి. ప్రస్తుతం తిక్కన్నగారు శ్రౌతుల నిర్బంధాన్నిబట్టే పశుయజ్ఞం చేసినా భగవద్గీత ప్రత్యక్షరమున్నూ "మక్కికి మక్కి" గా తెలుఁగు చేయకపోవడం వారివారికి జంకికాదు. ఇందులో వున్నరహస్యం తెలుఁగవడంతోనే స్త్రీ శూద్రాదులందరికీ యీ పరమరహస్యం తెలిసిపోతుందనిన్నీ సంశయించి మానినట్లు కొందఱయితే అంటారు కాని ఆ మాటకూడా అంత యుక్తిసహం కాదు — అసలు భారతం పుట్టడమే — "స్త్రీ శూద్రద్విజబంధువుల

కొలకుంగదా!" అట్టిస్థితిలో భారతైకదేశాన్ని వారికి తెలియకుండా దాంచిపెట్టవలసి వస్తుందా? ఎవరో సామాన్యు లీమాట అనుకున్నారంటే తప్పు లేదు గాని తిక్కన్నవంటి సర్వతోముఖ పాండిత్యం కలవానికా? యిట్టిసంశయం. అయితే యెందుకు తెలిగించ లేదంటారంటే వినండి నాకుతోంచిన మాట. 18 అధ్యాయాలల్లోనున్నూ ముఖ్యంగా తెలుసుకో దగ్గది ఆత్మవిషయకమైన విచారమే కదా! ఆ విచారము సంపూర్తిగా ముందు రాంబోయే శాంత్యానుశాసనిక పర్వాలలో రానే వస్తూవుందిగదా అని తిక్కన్నగారు భీష్మ పర్వంలో సంగ్రహంగా కనపఱిచి తనకు సహజంగా వున్నలోకజ్ఞానాన్ని ప్రకటించినట్లు నాకు తోస్తుంది.

ఇప్పటి కవులలో కొందఱయితే తిక్కనగారు "కేవల కవిమాత్రుండే కాని విమర్శకుండు కాండు" అంటూ వ్రాయ సాహసిస్తూన్నారు గాని అందుకు నామనస్సు వప్పుకోదు. లేనిపోని వెక్కిరింపులతోనున్నూ ధిక్కరింపులతోనున్నూ యే వెట్టిమొట్టి విమర్శనాలో కొన్ని ప్రకటించి తమ జీవితకాలంలోనేకాక జీవితానంతరంకూడా ప్రాజ్ఞులచే పరిహసింపంబడుతూవుండే వారివలె తిక్కనగారు వర్తించకపోయినంతమాత్రంచేత కొందఱపోహపడ్డట్లు తిక్కన విమర్శకుండు కాకపోండు.

తిక్కన్న విమర్శకత్వం యావత్తున్నూ భారతాంధ్రీకరణమందే కనపడుతుంది. అందులోనున్నూ భగవద్గీత సంగ్రహపఱచడంలోనే సమస్త తెలివిన్నీ వుంది. యేమంటారా? యుద్ధప్రారంభదినం నాండుకదా! యీ భగవద్గీతా ప్రసక్తి. మొట్టమొదటిరో జవడంచేత యుద్ధప్రారంభము నకే కొంత ఆలస్యం కాకతప్పదు. సుమారు జాము ప్రొద్దెక్కినతరవాత యుద్ధానికి మొదలనుకుందాం. అప్పట్లోకదా! అర్జునుండికి — "గురూన్హి హత్వా హి మహానుభావాన్" అనేసంశయం ప్రారంభ మయింది. దాన్ని తీర్చడానికి శ్రీకృష్ణ భగవానుండు గీతను వుపదేశించాడు. ఆ వుపదేశం వల్ల బుద్ధి కుదుటంబడి అర్జునుండు యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఆ వేళకూడా

చాలావఱకు యుద్ధంజరిగింది. పేరుగల యోధులు కొందఱు వీరస్వర్గానికి వెళ్ళి వున్నారు. అందుచేత ఆరోజంతా చాదస్తంగా దీనికిందనే వినియోగించా రనుకోవడానిక్కూడా అవకాశం కనపడదు. ఈశంక వ్యాసులవారికేల తోఁచింది కాదంటారా? అది వేఱు — ఆకారణంచేత సమయోచితంగా తిక్కన్నగారు సంగ్రహపఱచడం యెంతో లోకజ్ఞత్వాన్ని వెల్లడిచేస్తూ వుంది. లోకానికి గీతార్థం బోధపడడమో? అంటే అది ముందుముందు భారతంలో చాలాఘట్టాలల్లో యేలాగా వెల్లడి అవుతుంది. "ఉక్తార్థానామ ప్రయోగః" గతార్థమయిన సంగతులు మళ్ళామళ్ళా భారతంలో యెన్నో వస్తూవచ్చాయి. వక్తానున్నూ శ్రోతామాత్రమే వేఱుగాని తక్కిన సంగతి మాత్రం వక్కటిగానే వుంటూవున్న ఆచోట్లల్లో తిక్కన్నగారు తనలోకజ్ఞత్వాన్ని సూచనచేస్తూనే రచన నడిపించడం పరిశీలిస్తే గోచరిస్తుంది. గరుత్మంతుని చరిత్రవగయిరాలు గతార్థాలు మళ్ళావచ్చినప్పుడు అవి గతంలో తనరచనలోవి కాకపోతే కొంతవిపులంగా వ్రాయడమున్నూ గోచరిస్తుంది. అనేక సందర్భాలల్లో సోమయాజులుగారు యిదేమాదిరిగా తనలోకజ్ఞత్వాన్ని వెల్లడించి వున్నారు. ఆకారణంచేతనే తిక్కన్నకు తరువాత యెందఱో మహామహులు భారతాంధ్రీకరణానికి ఉపక్రమించినప్పటికీ అవి తగినంత పేరుకు రాక అంతంతలో వుండిపోవలసి వచ్చింది గాని తిక్కన్నగారియందు లోకానికి వుండే నిర్వ్యాజాభిమానంచేతకాదు. "మక్కికి మక్కి" తెలుఁగెన్నటికిన్నీ చాదస్త మనిపించుకుంటుం దని య్యేవే నన్నయాదులు ఆత్రోవ వదలుకున్నారు. యీ విషయం చిరకాలం నాఁడే మాచేత చెప్పఁబడింది గాని నేఁడు చెప్పే మాటకాదు—

ఉ. ఒక్కయెడన్ సమానముగ నొక్కొకచోట విశేషరీతిగా
నొక్కెడఁ దగ్గుగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపఁగాఁ
జక్కఁగఁ జేసి రాంధ్రకవిసత్తము లాంధ్రము సేయునప్పు డా
ఫక్కియె మేము పట్టినది పండితులార! పెనంగఁ బోకుఁడీ.

(శ్రీనివాసవిలాసము).

ఆంధ్రీకరణంగదా ! మూలానికి వ్యతిరేకించి రచిస్తే అది ప్రమాదం కాదా ? అని కొందఱు శంకింపవచ్చును. యిది స్థూలదృష్టుల శంక. సమాధానం వినండి — సంస్కృత భారతంలో యుద్ధసందర్భంలో— వ్యాసులవారు వొకానొక వీరుని పరాక్రమాతిశయాన్ని వర్ణిస్తూ ప్రతిపక్షుల సేనలు భయపడి "మలమూత్రములువిడిచినవి" అనే అర్థ మిచ్చేమాటలు వ్రాసి వున్నారే అనుకోండి, దానికి తెలుఁగులో "మక్కీకిమక్కీ" చేస్తేనే బాగుంటుందో, అన్యథాకరిస్తేనే బాగుంటుందో ? సహృదయులు బాగావిచారించండి. యీదిక్కుమాలిన "మలమూత్రా" అను పరిత్యజించినంత మాత్రంచేత తిక్కన్నగారి ఆంధ్రానువాదం మూలాతిక్రమణ దోషానికి ఆస్పద మవుతుందా ? యిదే కాదనుకోండి మూలంలో—దెబ్బయి పదకొండు బాణాలు అర్జునుఁడిమీఁద కర్ణుఁడో కర్ణుఁడిమీఁద అర్జునుఁడో ప్రయోగించినట్లు వుంది. తిక్కన్నగారు ఆ ఘట్టంలో అన్యథాగానే అనువాదం చేశా రనుకుందాం, అంతట్లో చరిత్రకిఁగాని లేదా, రసానికిఁగాని వచ్చినలోపమేమిటో ? సహృదయులు పరిశీలింప వలసివుంటుంది. ఆయా విశేషాంశాలు యెఱిఁగి భారతాన్ని ఆంధ్రీకరించిన తిక్కన్నగారేమోనఁట ! "విమర్శకులు గారట ! కవిమాత్రులట !" అంతతో చాలించినా కొంత బాగుండేది పైఁగా "కేవల కవిమాత్రుఁడు" అనికూడా అలంకరించారు. వకరిని గొప్పచేయడానికి వేఱొకరి నధఃకరించవలసి వచ్చిందంటా రనుకోండి. ఆ అధఃకరణం యింత అసంగతంగావుంటే యేలాగ ? ఇదిన్నీ కాక యెవరినిగొప్ప చేయఁదలచారో వారు మంచిపండితులై వుండికూడా విమర్శనా విషయంలో చాలా అనుచితాలు వ్రాసివున్నారు. ఆ అనుచితాలు వ్యక్తిదూషణకు సంబంధించినవి. అందులో వేళాకోళాలకు మితిలేదు. వాట్లను సమర్థించాలంటే నొష్టను మూఁడో కన్నున్న వానికికూడా శక్యం కాదు. విమర్శన మన్నప్పుడు తెలిసో తెలియకో గ్రంథాన్నిగూర్చి వ్రాస్తే అది నిలిస్తే నిలుస్తుంది. లేదా, దుమ్ముధూళిగా యెగిరిపోతే పోతుంది. అంతవఱకు సహ్యమే కాని ఆ విమర్శనంలో గ్రంథకర్తకు వకటే కన్ను

వుందని శ్లేషించేవారు కొందఱు, రెండోకంట్లో పువ్వువుందని ధ్వనింపఁ జేసేవారు కొందఱు, నల్లఁగా వుంటాఁడని తోఁపింపఁజేసేవారు కొందఱు. అసలే అంధుఁడనిన్నీ యేవో యేవో అంగవైకల్యాలు వగయిరాలు వాచ్యంగానున్నూ వ్యంగ్యంగానున్నూ వచ్చేటట్టు వ్రాసేవారు కొందఱు, అని వ్రాసిన వారికి తీరనికళంకాలుగా నిలిచిపోయేవే కాని యెంతమంది సవరించినా సవరణకు మాత్రం లేశమున్నూ లొంగ వనే మాటకు వప్పని వారు వుంటారనుకోను. వాతపిత్త శ్లేష్మాలవలెనే సత్త్వరజస్తమోగుణాలు ప్రతి శరీరకిన్నీ సహజాలు. ఆ అయుక్తపు వ్రాఁతలు వారువారు తమోగుణాతిరేకంచేత ఆయాసమయాలలో వ్రాసి వుఁటారు. వారివారిని మనం గౌరవించవలసి వచ్చినప్పుడు చంద్రుఁడికి కళంకంలా వున్న ఆ విషయాన్ని స్మరించక యితర యోగ్యతలకు సంబంధించిన విషయాలనే యెత్తుకొని గౌరవించడం యుక్తం అని నే ననుకుంటాను. తమోగుణ విషయమే కాదు రజోగుణవిషయం కూడా డిటోప్రకారంగానే చేయవలసివుంటుంది, కనక వ్యాఖ్యాన మవసరంలేదు. ప్రస్తుత మేమిటంటే? అట్టి అనుచితపు విమర్శనలు చేసిన మహామహులను వారి పాండిత్యాతిశయాన్ని బట్టి గొప్పచేయడంలో లేశమున్నూ తప్పులేదు గాని ఆ సందర్భంలో విమర్శకాగ్రేసర చక్రవర్తిగా శిరసావహింపఁదగి అట్టి అనుచితాలు చేయడం లేశమున్నూయెఱుఁగని తిక్కన్నగారిని అధఃకరించడం కేవలం అన్యాయమనే నే ననేది — ఉంటే యెప్పుడేనా యెక్కడేనా తిక్కన్నవంటి కవి వుంటాఁడేమో కాని విమర్శకుఁడు వుండఁడనే నేను తలుస్తాను. కొందఱిపి విమర్శనాలు వేఱుగానున్నూ కవిత్వాలు వేఱుగానున్నూ వుంటాయి. తిక్కన్నదో? అలాకాదు. కవిత్వంలోనే విమర్శనంకూడా యిమిడి పోయింది. యీ విషయం శ్రద్ధకలిగి పరిశీలించే సహృదయులకు భారతంలో ప్రతీ ఘట్టంలోనున్నూ గోచరిస్తుంది. ఆ యీ తిక్కన్నగారి రహస్యాన్ని గోచరం చేసికొన్న కవులలో మొట్టమొదటివాఁడు శ్రీనాథుఁడు. అటువంటి వాఁడు కనుకనే నైషధాన్ని ఆంధ్రీకరిస్తూ శ్రీనాఁథుఁడు — “ అనుచితంబు

త్యజించియు రసంబు పోషించియు" అని నిర్భయముగా వ్రాయ సాహసించాడు, వ్యాసులవారినైనా నీ కవిత్వంలో కొంచెం అనుచితం వుందంటే లోకం వప్పుకుంటుందేమో కాని శ్రీహర్షుణ్ణిగాని అంటే వప్పుకుంటుందా ? అందులో ఆకాలం యేలాటికాలం ? రాజపీఠంవద్ద పెట్టి కవిత్వ తారతమ్యాలు సాక్షాత్తుగా పరిశీలించుకొని గెలుపోటములు నిర్ణయించుకొని మానావమానాలు పొందే కాలానికి దాదాపుగా పూర్వకాలం కాని యిప్పటికాలంలాగు యెవరికి తోఁచినట్టు వారు వొప్పులు తప్పులనిన్నీ తప్పులు వొప్పులనిన్నీ విరసం సరసమనిన్నీ సరసం విరసమనిన్నీ వ్రాస్తే అల్లాటప్పాగా పోనిచ్చేకాలం గాదు. భోజరాజుగారివద్దకు శంకరకవి వచ్చినప్పుడు ఆ విద్వత్కవిరాజు యెంత చమత్కారంగా పరీక్షించిందిన్నీ పలువురు యెఱిఁగే వుంటారు. అయినప్పటికీ కొంచెం దాన్ని ప్రస్తావిస్తాను. శంకరకవి భోజుని దర్శనానికి వచ్చి ఆశీర్వచనంగా — "రాజ న్సౌఖ్యమయోఽస్తు" అన్నాఁడు. భోజుఁడు, ఆయనపలికినవాక్యాన్నే శార్దూల శ్లోకారంభంగా చేసుకొని గణబద్ధంగా — "శంకరకవే కిం పత్రికాయామిదం" అని ప్రశ్నించాఁడు. ఆ సరసత్వాన్ని కవి గ్రహించి - "పద్యం" అని జవాబిచ్చాఁడు. భోజుఁడు "కస్య" అన్నాఁడు, కవి "తవైవభోజ నృపతే" అన్నాఁడు భోజుఁడు — "పాపఠ్యతాం" అన్నాఁడు, కవి— "పఠ్యతే" అన్నాఁడు. ఇక్కడికి శ్లోకంలోసగం ప్రశ్నోత్తరాలతో ముగిసింది. సగం మిగిలివుంది, పూర్తిచేసే భారం కవిమీఁద పడింది. ఆశువులోనే పూర్తిచేయాలి సమయోచితంగా వుండాలికదా ? ఆపట్లాన్ని కవి — "ఏతాసా మరవింద సుందరదృశాం ద్రాక్చామరాందోళనా దుద్వేల్లి ద్భుజవల్లికంకణఝుణత్కారః క్షణం వార్యతామ్" అని సమయోచితంగా పూర్తిచేశాఁడు. యీ పూర్తి చేయడంలో — అందులో క్షణం అనడంలో యెంతో సొగసు వుంది. ఆశంకరకవి యేమేమి గ్రంథాలు రచించాఁడో తెలియదు కాని యీ వక్క శ్లోకంవల్లనే అతని కీర్తి భాషాప్రపంచంలో నిలిచివుంది. ఆకవుల అదృష్టం మంచిది కనక వారి కాలంలో ఆలాంటి

రసజ్ఞులైన మహారాజులు వుండేవారు. పిడివాదాలు చేయడానికి పిలిచ్చేది కాదు. అట్టిరసజ్ఞులు లేనికాలంలో కవిగా పుట్టడంకంటే వేఱే పాప మంటూ వుండదని మేము శ్రీ విజయనగరం మహారాజావారి దర్శనసందర్భంలో చెప్పివున్నాము.

"మ. కవితా మాధురి తా గ్రహించి " యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబు గా
దు విశేషం బిట, నిర్విశేష మిట మాధుర్యం బిటన్, వహ్వారే ?
కవిరాజా !" యని మెచ్చి యిచ్చు నృపుఁడొక్కండైనఁ గర్వైవచోఁ
గవియై పుట్టుటకన్నఁ బాపపరిపాకం బుండునే భూవరా ! "

ప్రస్తుతం మనకు కావలసింది తిక్కనగారి విమర్శకత్వం సంస్కృత భారతంలో వున్నపునరుక్తులు వగయిరాలు వీలైనంతవఱకు తొలఁగించుకుంటూ చేదస్తం లేకుండా రసవత్తరంగా చేసిన ఆంధ్రానువాదంవల్లనే సహృదయులకు చెప్పక చెప్పినవిధంగా ఆ విషయం గోచరిస్తూవుండఁగా అట్టివిమర్శకాగ్రేసరచక్రవర్తి నెవరో వృథాగా యెందుకో ? " కవిమాత్రుఁడు, " అనడం శోచనీయ మని విచారించడమే. కవిమాత్రుఁడంటే ? " యతియుం బ్రాసయుఁగూర్చు మాత్ర గవియే ? " అనుపద్యానికి ఉదాహరణం కాఁదగ్గవాఁడన్నమాట ! అయితే ఆమాట అన్నవాని హృదయంలో యింతఅభిప్రాయంవుండి వుండదేమో ? యేలా తెలుస్తుంది ? అన్యబుద్ధి అప్రత్యక్షం కదా ! తిక్కన్నకు వక్కవిమర్శకతా నైపుణ్యమే కాదు కవికి వుండఁదగ్గ యోగ్యతలు అన్నీవున్నాయని యేశపథంపడితే ఆశపథం పట్టవచ్చును. ఆంధ్రానువాదవిషయంలో మూలాతిక్రమణాలకు కారణం చాలవఱకు విమర్శకత్వమే, కొన్ని కథల తబ్బిబ్బునకు ఆయనకు లభించిన గ్రంథమే అనుకోవాలి. " మక్కికిమక్కి " తెలుఁగు కాకపోవడానికి హేతువు నన్నయ్యగారి మార్గానుసరణం. యిఁక ఛందోవ్యాకరణాల విషయంలో నన్నయ్యగారికంటె కొంతకట్టుఁబాటు సడలించడం వుందే ? అది దేశభాషలో చేసేఅనువాదం కనక లోకామసరణాన్ని పురస్కరించు

కొన్నదని నే ననుకుంటాను. నన్నయ్యగారు సీసపద్యాలు రచనచేయడంలో యతితో మొదలు పెడితే యతితోనే, ప్రాసతో మొదలుపెడితే ప్రాసతోనే కొంతలో అదీ కొంతలో యిదీ పెట్టిమొదలిడితే ఆ ప్రకారంగానే నూటికి తొంభై తొమ్మిదులు రచియించి వున్నారు. ఎక్కడో యీకట్టు తప్పినవీ ఉన్నారు. తిక్కన్నగారు పూర్తిగా యీకట్టు నతిక్రమించారు. ప్రయోగాలవిషయంలో చాలావరకు లోకానికి తిక్కనగారు ప్రాధాన్యం యిచ్చారు. అహోబలుఁడు దాన్నిబట్టే కాఁబోలును నన్నయ్యగారి కిచ్చినంత ప్రామాణ్యం తిక్కన్నగారి కివ్వక, " తిక్కయజ్వప్రయోగస్తు ప్రామాదిక ఏవ " అంటూ వచ్చాఁడు.

అహోబలుఁడికి ఆంధ్రభాషను సర్వవిధాలా సంస్కృతంతో తులతూఁగిద్దా మనినీ తానేమో పతంజలితో తులతూఁగుదామనినీ పట్టుదలం వున్నట్టు అతని ధోరణి చెపుతుంది. ఇప్పటికి ముప్పది యేళ్ళనాఁడు మేమున్నూ అహోబలునితో పాటుగానే అనుకొనేవాళ్ళం. క్రమంగా పరిశీలిస్తే శ్రీనాథాదు లందఱున్నూ నన్నయ్యగారి ప్రయోగాలతో పాటుగానో అంతకన్న అధికంగానో తిక్కనగారి ప్రయోగాలను గౌరవించినట్లు కనపడడంవల్ల ఆ దురభిప్రాయాన్ని మార్చుకోవడం యుక్తమనితోఁచింది. నన్నయ్యగారివలెనే తిక్కన్నగారుకూడ ప్రయోగవిషయంలో మాన్యులే.

లక్షణగ్రంథకర్త లొక్కొక్క రొక్కొక్క చేదస్తానికి అలవాటు పడుతూవుంటారు. అప్పకవి, భాగవతంకన్న యెన్నో రెట్లు లాక్షణిక సమయాలను వుల్లంఘించినవారి గ్రంథాలనుంచి యెన్నో లక్ష్యాలు స్వీకరించికూడా భాగవతాన్నుంచి వక్కలక్ష్యాన్నినీ చూపక పెద్ద అపరాధం చేశాఁడు. దానితో యిటీవలివారు కొందఱు భాగవతప్రయోగ మనడంతోనే వుల్లిగడ్డవలె యీసడించడానికి ఆరంభించారు. యీ మహాఘోరాన్ని యేవగించుకొని కూచిమంచి తిమ్మకవిగారు అబహిష్కారాన్నైతే తొలఁగిం

చారు గాని యేమయినా "పిడివాద" ప్రవీణులుమాత్రం ఆ వెనుకటి పుంతకే వెడుతూవుంటారు.

"సాధ్యో హి రసో యథాతథం కవిభిః" అంటే ఆ మహనీయునికే చెల్లింది. ఎంతకష్టపడ్రి యెత్తుకున్నా పద్యం కుంటుతుందా? నాలుగుచర ణాలింటికిన్నీ నాలుగు యత్యర్థపు పదాలున్నూ నాలుగు ప్రాసార్థకపదా లున్నూ పోతన్నగారి కవిత్వంలో మందుకున్నా దొరకడం కష్టసాధ్యం. అందఱున్నూ యెఱిఁగినవిషయమే కనక పద్యాలు వుదాహరించి చూపడం అనవసరం. తిక్కన్నగారివలెనే పోతన్నగారున్నూ విమర్శనగ్రంథాలు యేమిన్నీ వ్రాసినట్లు కనపడదు. అంతమాత్రంచేత విమర్శకుఁడు కాఁడను కోవలసిందేనా? ఆ పద్ధతిని నన్నయ్యమాత్రం విమర్శకుఁడు కాఁగలఁడా? కాళిదాసు కాఁగలఁడా? విమర్శన మంటే పూర్వకాలంలో యేలాటి అర్థంలో వుండేదో కాని యీ యిరవయ్యోశతాబ్దంలో శుద్ధ అనవసరపు వెక్కిరింపు కిందకి దిగిం దనికాని లేదా తిట్లు తిట్టుకోవడంలోకి దిగిం దనికాని అంటే అంగీకరింపనివారు వుండరు. ఆ వెక్కిరించడంలో శబ్దార్థ జ్ఞానం తక్కువగావున్న వారుకూడా దిగడం వస్తే తుదకది యేలాపరిణ మిస్తుందో అన్యత్ర విస్తరించడంవల్ల యిక్కడ వ్యాఖ్యానం చేయలేదు. కొందఱు తిక్కన్నగారికి భగవద్గీతార్థం బోధపడక వదిలిపెట్టినట్లు పలికే వారున్నూ వున్నారు. అట్టి వారినిగూర్చి వ్రాయడం బొత్తిగా అప్రస్తుతం గనక వుపేక్షిస్తాను. వకాయన తిక్కన్న పద్యాలు బాగున్నాయి కావనిన్నీ అంతకన్న మిన్నగా రచించి చూపుతాననిన్నీ కొన్నిపద్యాలు వ్రాసి పత్రిక లలో ప్రచురించివున్నారు — ఆయనకూడా కవి అనడానికి సంశయంలేదు కాని తిక్కన్నగారి పద్యాలలో ఆయన కనపఱిచిన వ్యత్యాసాలు నిలిచేవి కావు. యే కథాసందర్భం అతుకుపెట్టే టప్పుడో నీరసంగా వుండడాన్ని సహృదయులు గణించరు. తగినఘట్టాలలో అంటే యే శకుంతలా దుష్యంత సమాగమంవంటి స్థలంలోనో కవిత్వం నీరసమయితే దాన్ని గణించవలసి వస్తుంది. తిక్కన్నగారు వేదాంతఘట్టంలో—

క. సంగము బంధ మఖిలని
స్సంగత మోక్షంబు బహు విచారము లేలా?
పింగజటాజూటకలిత
గంగాబాలేందుమహిత గౌరీసహితా.

అనే పద్యంలో వకవంతుమాత్రం అవసరానికిన్నీ మూఁడుపంక్తులు అనవసరానికిన్నీ వినియోగించారు. ఇక్కడ రసం చెడఁదగ్గవిషయం లేదు. భగవంతుఁడైన యీశ్వరుఁడికి పెద్దవిశేషణం వేసి పద్యం ముగించారు.

“ఏమి సెప్పుదుం గురునాథా?” అన్నచోట కల్పించిన శ్లేషేనా కథ కల్పిద్దామంటే కూడా అవకాశం లేదు. ప్రాజ్ఞు లిట్టి స్వల్పాలు గణింపరు. యితరులు భారతకవులవి కాకపోయినా మహాకవులవియినా యిట్టివి వెక్కిరించి, తీరని అపయశస్సును సంపాదించుకొని నిలవచేసుకుంటారు. అది ప్రస్తుతకాలానికే కాక భావికాలానికి కూడా యెంత అపకారం చేయాలో అంతా చేసితీరుతుంది. యింగిలీషు చదువుకొన్నవారి విమర్శనలు బాగుంటాయని వినడం కలదు. ఆభాషలో వ్రాసినవాటిమాట నేను చెప్పఁజాలనుగాని వారిలో మంచిప్రవీణు లయినవారే తెలుఁగులో వ్రాసిన విమర్శనాలు కొన్ని చదివిచూచాను. అవి కూడా డిటోప్రకారంగానే కనపడ్డాయి. అందులో వ్యక్తిదూషణ లేకపోవడం మాత్రం గోచరించింది. అందుకు కారణం వారు విమర్శించిన గ్రంథం ప్రాచీన కవికృత మవడంచేత ఆ గ్రంథకర్తకున్నూ విమర్శకులకున్నూ వ్యక్తిగతమైన వైరం లేకపోవడమే. తిక్కన్నగారి రచనలో యెంతలోకజ్ఞానం వెల్లడి అవుతుందో ఆయన బిరుదంలోకూడా అంత లోకజ్ఞానం వెల్లడి అవుతుంది. ఆయన బిరుదాలు స్వయందత్తాలే, అని నా వూహ. విజ్ఞులు గమనింతురుగాక —

“ఉభయకవిమిత్రుఁ” డనికదా! ఆయనకు వకబిరుదు. ఇది నేతిబీరకాయవంటిదో? లేక సార్థకమో? చదువరులే నిర్ణయించుకోం

దురుగాక. అనవసరపు తగాయిదాలు కవులతో పెట్టుకొనే వాఁడయితే యీబిరుదు లోకసమ్మతికి పాత్రం అవుతుందా? యింకొక్క బిరుదు సోమయాజితో పాటుగా "బుధారాధనవిరాజి" అనేది. యీబిరుద మెంత సార్థకమో? కేతన్నగారి — "సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడ నిన వీఁడను నాలుకకుఁ దొడ వైనవాఁడు" అనేవర్ణనమే తెలుపుతుంది. సమకాలీనుఁడగు వకమహాకవిచేత అలా వర్ణింపఁబడడం యెంత అర్హత కలవారికో కాని తటస్థిస్తుందా? బిరుదంటూ అనేటప్పటికి తాత్కాలికులలోఁ బలువురు ద్వేషించి వెక్కిరించడమే అనుభూతం. చూడండీ మహావిద్వాం సుఁడున్నూ మహాకవిన్నీ అయిన సర్వజ్ఞ సింగభూపాలునికి వున్న సర్వజ్ఞ బిరుదాన్నిగూర్చి యెవరో కవి—

"క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావు సింగజనపాలునకే
యుర్విన్ జెల్లును నితరుని
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే"

అనిస్తుతిచేస్తూ సమయోచితంగా వర్ణించే టప్పటికి ఆసభలోనే వున్నవాఁడో మఱొక్కఁడో వకకవి యెదుటనో చాటుగానో — బహుశః చాటుగానే అయివుంటుంది. ఏమంటే సివిలు మేజస్ట్రీటు వగయిరా అధికా రాలు చేతులోవున్న అప్పటి నిరంకుశాధికారిని యెదట వెక్కిరించడం పొసఁగ దనుకుంటాను. కాని నిరంకుశులైనకవులు కొందఱు అట్టి అధికా రాలు కూడా లెక్కింపకుండానే ప్రవర్తించినట్లు కొన్ని యితిహాసాలవల్ల తెలుస్తుంది కానివ్వండి వకకవి ఆ అతిశయోక్తికి సహింపక — "రావు సింగ జనపాలునకు — ఏ యుర్విన్ జెల్లును?" అని ప్రశ్నార్థకంగా విఱిచి అన్వయించి యీశ్వరుఁడికంటె యితరులైన సామాన్యులలోనే సింగభూపాలుణ్ణికూడా చేర్చి వారికిపట్టిన దురవస్థనే పట్టించినట్లు వినడం, యిప్పటిలాగ అప్పుడు యీలాటి విషయాలకు పత్రికలైతే లేవుగాని లేక

పోయినా " కాఁవగ్గవని గంధస్మృతే " చెప్పివేశారు. అది ప్రచారంకూడా ప్కాగా వాఙ్మయంలో నాటుకుపోయింది. యీలాటి అర్థాంతరాలు చెప్పడం యిప్పుడున్నూ వుంది. సుమారు ముప్పై యేండ్లనాఁడు ఒక మహాశాస్త్రి గారు మా కవిత్వాన్ని విమర్శిస్తూ — " కింకవీంద్రఘటాపంచానన " అనే మా బిరుదానికి కొంగముక్కువంటి ముక్కుకలవారు అంటూ అపార్థం రాక పోయినా వస్తుందంటూ వ్రాసి కొంత పరాక్రమించారు. రాకపోవడానికి కారణ మేమి టంటే ఆయన — కిం = కుత్సితమైన; క = ఉదకమందలి, వీంద్ర = పక్షిశ్రేష్ఠములయొక్క, అని అర్థం వ్రాశారు. మే మే మన్నా మంటే ? నీటిపక్షులలో శ్రేష్ఠత్వం హంసలకు సంఘటిస్తుంది గాని కొంగల కెన్నఁటికిన్నీ సంఘటించదు కాఁబట్టి మీ మనోరథం లేశమున్నూ నెఱ వేఱదని పూర్తిగా పండితజనానుమోదంగా నిరుత్తరంగా ఖండించికూడా " అభ్యుపగమ్య " వాదానికి వుపక్రమించి — " అయ్యా ! మీ కెంతకుతూ హలం వుందో అట్టినీచార్థం చెప్పడానికి ? అందుచేత మేము మీకోరికనే నెఱవేరుస్తూ వున్నాము. మీరుమమ్మల్ని కొంగలుగా అపలపించారు కనక ఆకొంగలికి ఆహారం పెట్టడం మాకు ఆవశ్యక మవడంచేత మిమ్మును మేము చేఁపనుగా అందులోనున్నూ మంచిచేఁపనుగా సమర్థిస్తాముచూడండి " అని వారి పేరుకు మేమీ క్రిందిరీతిగా అర్థాన్ని నిర్వచనం చేసి వున్నాము. అప్రస్తుతమే అయినా చిరకాలంనాఁటి విషయం గనుక నవకవుల వినో దార్థం కొంచెం యిక్కడ చూపుతున్నాను.

" కాశినాథ " అనికదా ఆక్షేపకులనామం ? దానికి చేఁప అనే అర్థం యేలా వచ్చిందో ? చూడండి. క = అంటే నీరు. దానిని అశ్నాతి భక్షించునది లేక నీటియందు నివసించునది, శసయోరభేదః, ఆస ఉపవేశనే, కనుక చేఁప. ఇక్కడికి కాశిపదమును తేలినట్లయింది. ఆచేఁపలకు నాథుడు అంటే శ్రేష్ఠమైనచేఁప అని తేలింది. దీనితో కొంగలకు ఆహారం చక్కఁగా పెట్టినట్లయింది. అంతతో ఆ శాస్త్రులవారున్నూ సంతోషించి విరమించారు. పాండిత్యంవున్నవారితో వాదోపవాదాలు వస్తే చక్కఁగా

వాక్యోపవాక్యాలు యిట్లాగే నడుస్తాయి. అందులో తమోగుణ ప్రధానమైన మాటలు కొన్నివున్నా అవి వినేవాళ్ళకు కొంతమట్టుకేనా ఆహ్లాదం కలిగిస్తాయి. ఆసరుకు తక్కువవారితో వాదంవస్తే వారిచేత వట్టి తిట్లు తిని వూరుకోవడమే ఫలితం. మళ్ళా తిట్టరాదా ? అని ప్రాజ్ఞు లనరు. యెందుచేత ? ఆవలివారితిట్లకు యేవగించుకుంటూ యీవలివాళ్ళను తిట్టవలసిందని యెందుకంటారు ? పనిలోపనిగా చిరకాలంనాఁడు మాబిరుదానికి పట్టినదురవస్థను సంగ్రహంగా వివరించడమున్నూ దాన్ని తొలఁగించిన ప్రకారం కొంత తెలపడమున్నూ అయింది. తరువాత రమారమీ మూఁడు దశలు నిశ్శంకంగా నిరంకుశంగా జరిగిపోయాయి. అంతట్లో — "ముదిముప్పున బాలపాపచిన్నె" మాబిరుదుకు మళ్ళా సంప్రాప్తించింది. యేకొన్ని రోజులో నిశ్శబ్దంగా కాలంగడిచినా అది లెక్కలోది కాదనుకోండి. మాబ్రతుకు కాస్త గోఁచీపెట్టింది మొదలుకొని యీలాటి వాక్కలహాలతోనే భుక్తమవుతూ వుంది. యిప్పటికేనా విశ్రాంతి కలుగుతుందేమో ? అనుకుంటే "పడకకుర్చీభావాలు" అంటూ ఆంధ్రవారసంచికలో వ్రాసినట్టు యేవెట్టిమొట్టివ్రాఁతలో వ్రాయకుండా కాలం యిప్పుడున్నా జరగడం లేదు. దీనియందు మాకు విసుగుపుట్టి చిరకాలం అయిందన్న మాట మాపాండవోద్యోగంలో వున్న — "తినఁజాలను నెత్తురుకూడు మాధవా !" అనే ధర్మరాజువచనంవల్ల వ్యంగ్యమర్యాదా వేత్తలు గ్రహించేవుంటారు. ఆయన ఆలా అన్నప్పటికీ తుదకు ఆయనకూ నెత్తురుకూడు తినక తప్పలేదు; మాకున్నూ తప్పలేదన్నది ఫలితార్థం. అనేకవిషయాల్లో ఆయననెత్తురుకూటికిన్నీ మానెత్తురుకూటికిన్నీ పోలిక వుంది. వ్యాఖ్యానం చేస్తే గ్రంథం విస్తరిస్తుంది కనక ఆభారం లోకానికి వదలి ప్రస్తుతం సంఘటించిన "బాలపాపచిన్నె" కు సంబంధించినమాటలు కాఁచెంవ్రాసి ప్రధానాఁశాన్ని వుపక్రమిస్తాను. నిన్నమొన్న వకపూజ్యులు మాబిరుదానికి పనిలేనిపాటగా చెప్పిన అపార్థాన్ని చూపుతాను—

"కింకవీంద్రులకద పుంత (పాక) పరె, అంతటను తెలిసిన నోరు గలవాఁడు (ఉత్తరము చెప్పలేక నోరు వెళ్ళబెట్టాఁడు)" అని వ్రాసి వెక్కిరించారు. యీ వెక్కిరింపువల్ల మంచికవులకు జవాబు చెప్పఁగల రన్న కుకవులకు చెప్పలేరనిన్నీ ఫలితం. సమాన సంప్రదాయము మెఱుఁగనివారికి పైవారు చెప్పిన అర్థము లేశమున్నూ రాదు. ఇదైనావా చిక్కులేదు గదా! కాశీనాథ శాస్త్రుల్లుగారు మహావిద్వాంసులు గనుక వారు చెప్పిన అర్థమునకు వ్యాకరణ విరోధము లేదు. అందుచేత ఇతరవిరోధాన్ని చూపి వారి వాదాన్ని ఖండింపవలసివచ్చింది. ప్రస్తుతము అంతపని కున్నూ శ్రమచేయవలసినపని లేదు. కింకవీంద్రులకు అట్టి అర్థమే వస్తుంది అని వూరుకున్నప్పటికీ క్షతి వుండదు. బిరుదు అంటూ వుంటే దాన్నిగూర్చి పలువురు సార్థకత్వాలనుగూర్చి చర్చిస్తారన్నమాట కంద ఱున్నూ సమ్మతిస్తారు. అందులో యితరులనుగూర్చి పృథగా స్వశక్తి పరశక్తులను గుఱుతింపక తెలిసీతెలియని వ్రాఁతలు వ్రాసేవారి బిరుదులను గూర్చి చెప్పనే అక్కఱలేదుకదా! అయితే వెనకకొందఱన్నవారికి చెప్పిన మాదిరిగా యిప్పుడుకూడా సహృదయసమ్మతమైన అర్థం అంటే సమాధానం చెప్పఁగలరా? అని కొందఱు అడుగుతారేమో! ఇప్పుడున్నూ చెప్పడానికి అభ్యంతరం లేదుగాని స్థలభేదాన్నిబట్టి తటపటాయించి దాన్ని వినియోగించేది లేదు. కారణం సుగమం కనక వ్యాఖ్యానంతో అవసరం లేదు. అసలు మా బిరుదానికిగల అర్థాన్ని వ్రాస్తాను——

"కింకవీంద్రఘటాపంచానన" అంటే, వినండి. ముందుగా "కవీనా మింద్రాః కవీంద్రాః" అని షష్ఠీసమాసం చేసుకోండి. కవిశ్రేష్ఠులు, అని అర్థం వస్తుంది తర్వాత కింశబ్దంతోటి కవీంద్రశబ్దాన్ని కలపండి. కుత్సితులైన — అనఁగా ఋజుమార్గవర్తులుగాని కవిరాజులు, లేదా కవిచక్రవర్తులు అని ఫలితార్థం. అనఁగా — ఎంత గొప్పకవులేనాసరే వారివర్తన కుత్సితమై దురుద్దేశంతో మ మ్మెదిరించేయెడల అట్టివారి యొక్క, ఘటా = సముదాయమునకు, పంచానన = సింహములు తి॥ వెం॥

కవులని తాత్పర్యం. ఋజువర్తన గల కవిరాజులకును తి॥ వెం॥ కవులకును వివాద ముండ దని తెల్పుటకే, ఆ 'కిం' అనేవిశేషణం అని సహృదయులు గుఱుతింపఁగలరు. ప్రతివాదుల అర్థానికి సమ్మతించేయెడల ప్రతివాదులకే పెద్ద చిక్కు వస్తుంది. కింకవీంద్రులకడ, నోరుతెఱుస్తారనేయెడల, వీరు నోరు తెఱచినా లేక ఆవలివారిని నోరు తెఱపింపఁ జేసినా వీరిపై పూర్వపక్షాలు చేయడానికి వుపక్రమించేవారు ఆ కిం శబ్దార్థానికి గుఱి కాక తప్పదు. దానివల్ల ఆ దురర్థం తమనెత్తికి వచ్చి తీరుతుంది. కనక విస్తరింపవలసింది లేదు.

ఇంకా — "బాలసరస్వతి, బాలకళానిధి" లోనైనవాట్లకుకూడా వెనుకటి వారున్నూ యేవో చెప్పివున్నారు; వీరున్నూ చెప్పివున్నారు. అవి బొత్తిగా అమాయికధోరణి కలవిగా ఉండడంవల్లనేమి, అసంగతంగా వుండడం వల్లనేమి ఖండించ నక్కఱలేదు. ఆ రెంటిలో వకటి ఇతరత్ర ప్రసిద్ధంగా వున్నట్టు ఆక్షేపకులే అంగీకరించికూడా వున్నారు. ఇతరత్ర ఆక్షేపణీయము కాక యిక్కడమాత్రమే ఆక్షేపణీయ మేలా అవుతుందంటే ఆవలివారికి జవాబులేదని వ్రాయనక్కఱలేదు.

ఇంతకూ మనక్కావలసింది బిరుదాలంటూ మనంగాని వేఱొకరుగాని శ్రమచేసి ఆశ్రయించఁదగ్గవారిని ఆశ్రయించో లేక అయాచితంగానో సంపాదిస్తే తీరా భోజరాజుగారు విక్రమార్క సింహాసనాన్ని అధిష్ఠించఁబోయేటప్పటికి అడ్డుదగిలినరత్నపుబొమ్మలవలె యేనిర్మాగమాటపు పత్రికలో యీకాలంలో నున్నూ పూర్వకాలంలో యే యితరకవులోనున్నూ అడ్డుతగులుతూ ఉండడం కలదనిన్నీ మన కథానాయకులు తిక్కన్నగారి బిరుదాలకు అట్టిదురవస్థ లేకపోవడంవల్ల అవి నేతిబీరకాయలు కావనిన్నీ మనం సంతోషించడానికి లేశమున్నూ అభ్యంతరం లేదని తేలింది. తిక్కన్న మంత్రిపదవిలోకూడా ఉన్నవాఁ డవడంచేత రజోగుణ ప్రధానంగా అతని ప్రవర్తన ఉండవలసింది. అట్టిస్థితిలో ఆ మహాకవికి భార

రాంధ్రీకరణానికి పూర్వమే సంస్కృతభారతపాఠ్యం వ్రాసిన్న మునీంద్రుని ఆయన భారతగ్రంథము చెప్తూవుంది. యిక్కడికే వ్యాసం పెరిగిపోయింది గాని ఆయన ఆంధ్రీకరణనైపుణ్యాన్ని గురించి పక్కనున్నమేరా ఉదాహరించి చర్చించలేను. ఆ పని చేసి చూపి మరీ చెప్ప మునుపు ప్రయత్నం చేస్తాను—

"పుత్రిక నొసంగు దేవ!

తే. గీ. కృప భవత్సము నసిన నప్రమేయ
తేజుఁ డాత్మతేజమున నాద్యుఁ డుపేంద్రి
యములు మనసును సమ్మోహితములు సేసి
యపుడు తనయుం బుట్టెడు మునియెఁ బిడప."

ఈ పద్యము ఆశ్రమవాసపర్వద్వితీయాశ్వాసం లోది, కుంతి వ్యాసులవారితో తాను కర్ణుని గన్న చరిత్రమును చెప్పేది ఘట్టములోది. ఇచ్చట మూలములో నెట్లున్నదో నే నింకాచూడలేదు. ఇతరు లెట్లాంధ్రీకరించిరో ఆసంగతిన్నీ చూచుట కవకాశం లేకపోయింది. కేవలమున్నూ "పడకకుర్చీభావా" అన్నట్లే తిక్కన్నగారిదిమాత్రమే చదివి నాకు తోఁచినమాటలు వ్రాస్తూఉన్నాను. సూర్యుఁడికిన్నీ, కుంతికిన్నీ జరిగిన శృంగార ప్రవర్తనాన్ని వ్యాసులవారుమాత్ర మింత మృదువుగా వ్రాసివుంటారా? యెంతమృదువు! యెంతసొగసు! పోనీ యిందేమైనా దాఁపరికమున్నదా? లేదు. అసలు కుంతికి ప్రస్తుత మీ విషయ మెందుకు చెప్పవలసివచ్చింది? అవసానకాలము సమీపించుచున్న రోజులలోఁ గదా? యీసందర్భం — "చేసినపాపం చెపితే పోతుంది" అనే లోకోక్తి ననుసరించి మామగారున్నూ, భగవదవతారమున్నూ, త్రిజగత్పూజ్యుఁడున్నూ అయిన వ్యాసభగవానునితో తనయౌవనచేష్టితాన్ని చెప్పి, దానికి సంబంధించిన యితర చరిత్రాన్నికూడా చెప్పి యేమేనా దోషమున్నట్లు ఆ ముని చెప్పినచో నిష్కృతికి ప్రాయశ్చిత్తాన్ని చేసుకోఁ దలఁచుకొన్నట్లుగా ఆ ధోరణివలన గోచరిస్తుంది. ఆసమయమందు — తనమనస్సుగాని యిత

రేంద్రియములు గాని తనస్వాధీనములో లేనే లేవనికదా, పద్య తాత్పర్యం: సర్వలోకములకును యెవనితేజము వెలుఁగు నిచ్చి యంధకారపీఁడ తొలఁగిస్తుందో, అట్టిసూర్యుఁడు రూపాంతరాన్ని ధరించే అందాం తనవద్దకు వచ్చి తన్ను స్పృశిస్తూ ఉన్నప్పుడు కనులు మిఱుమిట్లు కొనడమున్నూ, తద్ద్వారాగా యితరేంద్రియములుకూడా వశం తప్పడమున్నూ కేవల స్వభావోక్తియేకదా! యిఁక వ్యంగ్యమో? నవనవయౌవనయున్నూ — ("ప్రతిక్షణవిజృంభణా దుభయబాహుకూలంకష స్తన త్రుటితకంచుక"యున్నూ) శృంగారవతిన్నీ అయిన రాచకన్నియయొద్దకు అట్టి తేజశ్శాలి, అట్టి నిత్యయౌవనుఁడు సూర్యుఁడు వచ్చి యేమో శృంగారోచితసల్లాపానికి వుపక్రమించి పాణిగ్రహణాన్ని చేసేటప్పుడు సాత్త్విక భావోదయంవల్ల— "మనఃప్రభృతులైన యింద్రియములు" సమ్మోహితములు కాకుండునా? ఆయన సహజంగానే యీరచనను సాగించి వున్నాఁడేమో కాని అల్పబుద్ధుల మగునస్మదాదులకు మాత్రం తిక్కన్నగా రెంతో ఆలోచించి యీ చిత్రమును నిర్మితం చేశారని తోస్తుంది. బంగారుపిచ్చుక గృహనిర్మాణం యే మంతకష్టపడి చేస్తుంది. అది ఆపనిచేసేటప్పుడు దగ్గఱ వుండి పరిశీలించినా మన కది లేశమున్నూ గోచరింపదు. యీవిషయ మెందఱికో అనుభూతమే. కొందఱు ప్రాచీనులేకాదు నేఁటివారేకాదు, కవులు యిట్టి శృంగారసందర్భాలు వస్తే యేమేమో పెంచి వ్రాస్తారు. అంతదాఁకా అక్కఱలేదు. స్త్రీవర్ణనమాత్రాన్నే పుచ్చుకుందాం, ఆసందర్భంలో కూడా తమరు వర్ణించే స్త్రీ యెవ్వరో? ఆమాటకూడా మఱచిపోయి వర్ణిస్తారుకూడాను. ఆవర్ణన చూస్తే నవ్వు ఆఁపినా ఆఁగదు. యీలా వున్న మాట వ్రాయవలసివచ్చి వ్రాస్తే వారికి కోపంవచ్చి పడతిడతారు. కొందఱు, తిట్టడమే కాదు, యేడవ మంటారు కూడాను. అయినా యథార్థం వ్రాయడం తప్పుతుందా?

తే. గీ. "కోడెకాండ్రమదులు వట్టఁగోరి మరుఁడు
పన్నియుంచిన వలచుమీ? కన్నె కురులు."

ప్రస్తురాని కీఁతే వాయుసు, పస్నుమంతా అక్కఁడవేసు. ఆరాధక స్త్రీలు కోరేదాలట! యేలా వున్నా యంచే మన్మథ వసియుసంటి వారా నొక వేఁటకాఁడు కోదెకాండ్రయొక్క మనస్సులను అసఁగా పక్షుల మనస్సులనే వేఁటలను లేక పక్షులనుపట్టుకోడానికి యేర్పఱుచుకొన్న వలలాగు వున్నాయని వర్ణింపఁబడింది. యిందులో వ్యాకరణంగాని ఛందస్సుగాని చెడలేదు. యితరదోషమున్నా కనిపించదు. కాని కన్యక యెవరో అని విచారణ చేస్తే యెంతో చిక్కు వస్తుంది. కన్యక పర మహారాజుపుత్రి. ఘోషా, రాజకుటుంబాలలో అందఱికీ వుంటుంది. అందులో పోఢ్రి రాజకుటుంబాలలో వుండే ఘోషా నియమాలను గూర్చి యిక్కడ వ్రాయవలసివస్తే వ్యాసం ఒక్కని తోఁలవలసినంత పెరుగుతుంది. మందసా సంస్థానానికి వెళ్ళినప్పుడు ఆ యీవిషయం ఆమూలాగ్రంగా విని వున్నాను.

మగవాళ్ళమాట చెప్పనక్కఱలేదు. అది ఆలా వుంచుదాం. అక్కడ దాసీలుగా ఉండే ఆఁడవాళ్ళుకూడా యెంతవఱకు పెండ్లి చేసుకోకుండా లేదా పురుషునిముఖ మెఱుఁగకుండా ఉంటారో అంతవఱకే ఆ అంతః పురంలో పరిచారికత్వానికి అర్హత కలిగి ఉంటారు కాని, ఆ పిమ్మట అర్హత కలిగి వుండరఁట! అట్టి అంతఃపురం ప్రస్తుతపద్యంలో వర్ణ్యం. అట్టికన్యకను — " కోడెకాండ్రు చూడడం యేలా తటస్థించడం? " అనే విషయం రచించేవారికి తట్టనే లేదు. ప్రతివారికవిత్వమందూ అంతో యింతో అనౌచిత్యాలు ఉంటూనేవుంటాయి. కాని యిది మఱీబాధించే అనౌచిత్యంకదా? ఇట్టి వర్ణన వేశ్యావిషయంలో యెంతో యుక్తంగా ఉంటుంది. పింగళి సూరన్నగారు — " కుటిలప్రరోహముల్, పోఁకలతోడ సామ్యమును బొందకమున్న " అంటూ యెత్తికొని ఆ కలభాషిణి అనే వేశ్యాపుత్రికను వర్ణించి విటసమూహాన్ని — " అట్టాఁకలఁబెట్టసాగె " అని వివరించినట్లు జ్ఞప్తి. ఆమె వేశ్య కనుక ఆమెను వర్ణించడంలో విటకాం డ్రను ప్రవేశపెట్టడం దూష్యం కాదు. పోతుటీఁగకు చొరరాని అంతః

పురంలో ఉండే పరమపతివ్రతాశిరోమణిని, భవిష్యత్కాలంలో వక ఉత్తమరాజకుటుంబానికి మూలభూతురాలిని వర్ణిస్తూ "కోడెకాండ్రి" ను ప్రవేశపెట్టడమే కాకుండా, ఆయీ కుసుమకోమలికి సంబంధించిన విరహావస్థావర్ణనలో — "సర్షపరస (ఆవనూనె) పానంబు చేసిన పశువుపగిదిఁ జెర్లాటంబున నిలిచినచోట నిలువక" అంటూ కూడా వర్ణింపఁబడింది! యేమనుకోవాలి? వీరు యితరులను కవులపంక్తినుండి బహిష్కరించడానికి చేసే ప్రయత్నానికి మితమే కనపడదు. చూడండీ, ఆ రాచకన్యక "చెరలాటాన్ని" యెంత యుక్తంగా వర్ణించారో? శాంతంపాపం! వీ రేచెరలాటం వర్ణించినా అట్లే ఉంటుంది సుండీ! అయితే వకటిమాత్రం వారికి బాగా తెలుసును — "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః" అనే శ్లోకానికి సంబంధించిన అంశం వారు బాగా గమనించి ఉండడంచేత యెంత దుర్ఘటమైన విషయమైనాసరే ప్రయత్నించి చూచితీరుతారు. ప్రయత్నించిన విషయాలలో కొన్ని కాకపోతే కొన్ని అయినా ఫలించి తీరతాయి, అని వారి దృఢవిశ్వాసం. ఆ కారణంచేతనే తమ కవిత్వం యీలాటిదైనా యితరులను కవులపంక్తినుంచి బహిష్కరించడానికి వారు ప్రయత్నించడం కూడా యుక్తమే అనుకోవాలి. కవిత్వపు సొగసు తెలుసుకోవడం చాలా కష్టం. చూడండీ—

శ్లో. క్షుత్తృడాశాః కుటుంబిన్యో మయిజీవతి నాన్యగాః
తాసా మంత్యా ప్రియతమా తస్యా శ్శృంగారచేష్టితమ్.

ఈ చిన్నశ్లోకం చెప్పినకవిపేరు తెలియదుగాని ప్రౌఢకవిత్వంలో అత్యుత్తమ తరగతికి రాఁదగ్గ యీశ్లోకానికి వక యితిహాసంమాత్రం పరంపరగా వింటూవున్నాము. ఆ యితిహాసం వ్రాస్తేనే కాని దీనిలో వున్న విశేషం బాగా తెలియదు. వక మహాకవి వక మహారాజుదర్బారులో పెద్ద సమ్మానాన్ని పొంది ఆదర్బారులోనే తాత్కాలికంగా జరిగిన యేశుభానికో భూరిసంభావన యిస్తూవుంటే యేఖర్చుకేనా అక్కఱకు వస్తుందని దాని

లోకూడా అవస్థపడ్డాడనిన్నీ, అక్కడ అల్లరిపిల్లల ద్రోహాలకు జరిగే మర్యాదలో ఆసమీపంలోవున్న బురదగోతులో పడడం సంభవించిందనిన్నీ, ఆసందర్భం మేడమీఁదనుంచి చూస్తూవున్న రాజుగారు కవిగారిని పైకిపిలిపించారనిన్నీ, పిలిచి యిదేమిటి అని ప్రశ్నించినప్పుడు జవాబుగా యీ శ్లోకాన్ని చెప్పినట్టున్నూ చెప్పుకుంటారు. దీనిఅర్థం — రాజా! నాకు ముగ్గురు భార్యలు. పెద్దావిడపేరు క్షుత్తు — అంటే ఆఁకలి, రెండవది తృట్టు అంటే దప్పిక, మూఁడు ఆశ—సదరు ముగ్గురుభార్యలలో నున్నూ కుట్టకుదిభార్య మిక్కిలి ప్రేమపాత్రురాలు. ప్రస్తుతంజరిగిన మర్యాద (బురదచిందులు సేలువునిండా పడడం అన్నమాట) ఆమూఁడో భార్య చేసినశృంగారచేష్ట గాని మఱివకటి కాదు. అని చమత్కరించేటప్పటికి రాజుగారు మిక్కిలి సంతసించి యింకా యెక్కువగా సమ్మానించారని వినడం. దురాశా కారణంవల్ల యీలాటి దుస్థితి పట్టిందంటే అందులో కవిత్వపదార్థ మేముంటుంది? యిందులోనో యెంతకవిత్వం వుండాలో అంతా వుంది. గ్రహించే తెలివితేటలు లేనివాఁడికి కూడా యీశ్లోకంలో వున్నచమత్కారం తెలిసితీరుతుంది. జన్మానికల్లా వకటేనా యిట్టిశ్లోకమో పద్యమో చెప్పినవాఁడు కవి — లేదా? "కాకవు లేకవులేని కాకవుల్" ధనంకోసం ప్రతికవికిన్నీ వారివారిని గుఱించి నీవు సాక్షాత్తుగా సింహాద్రి అప్పన్నవే అనిన్నీ, కాశీవిశ్వేశ్వరుఁడవే అనిన్నీ స్తోత్రం చేస్తూవుండడం యేలాగా తప్పదనుకోండి! అందులోకూడా తెలివితేటలున్నవాళ్ళు కొంత హద్దులోనే వాక్కును నడిపిస్తారు. కొందఱో? "బళి! బళీ! మీతాత బల్లెమ్ము చేఁబూని పుల్లాకు తూటుగాఁ బొడిచి నాఁడు" అనేమాదిరిగా నడిపిస్తారు. ప్రస్తుతకవివరుఁడో? యేమీ లేకుండానే రాజసమ్మానాన్ని పొందినాఁడు. ఈలాటికవినోటమ్మట వచ్చేమాట లన్నీ కవిత్వమే అనిపించుకుంటాయి. యిట్టి కవిత్వాలకు వేఱే అచ్చుకూటముల తోడ్పాటు గాని, సంఘాలసహాయంగాని అక్కఱవుండదు. సంఘాలసహాయం అన్న దానికి వ్యాఖ్యానాన్ని అవధరించండి. అక్కడక్కడ కొందఱు కొందఱి

కవిత్వాన్ని అభిమానించే సంఘా లంటూ యేర్పఱచుకొని వాదోపవాదాలు చేసుకుంటూ వుంటారు. వారు వారికో, వారిమండలానికో, సంబంధించిన కవి కవిత్వమైతే సరి, అది యెంతపదడుగా వున్నాసరే బాగా వుంది అని పొగ్డడమే. భగవంతుడు కొందఱికి కొన్నిశక్తులున్నూ, మఱికొంద ఱికి మఱికొన్ని శక్తులున్నూ యిస్తాఁడు గాని యేకత్రి అన్నేశక్తులు ప్రసా దించడం మృగ్యం. అట్టిస్థితిలో వకశక్తికి వకరిని మెచ్చుకొని యింకో శక్తికి మెచ్చుకోకపోతే ఆసంఘంవారికి కోపం వస్తుంది. అక్కడనుంచి ఆ సంఘంవారూ యీ సంఘంవారూ శిఖపట్లగోత్రానికి ప్రారంభిస్తారు. ఆత్మవంచకులు కొందఱు వారికీ కొందఱు వీరికీ సహాయం చేసి మీవాదమే యుక్తంఅంటూ ఉపన్యాసాలు యిస్తారు. దానితోటి—"మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః" కనక ఆయా సంఘాలవారు వారివారివాదమే గెల్చిందని సంతో షిస్తూ వుంటారు. ఇది పూర్వకాలంలోకూడా వుండేదేమో కాని యిప్పటి కాలంలో విశేషించి కనపడుతూ వుంది. ఈవిషయంలో ఆయా సంఘాల దోషంకన్న సహాయంగా ఉపన్యసించే ఆత్మవంచకుల దోషమే యెక్కువ కనపడుతుంది. ఎవరియందో అభిమానం చూపేసంఘంవారికి సహాయం చేయవలసివస్తే, బాగుండకపోయినా వారికవిత్వం బాగానే వుందని చెపితే చెపుదురుగాక యీ ఆత్మవంచకులు, వారు యేతమోగుణాన్నో పురస్క రించుకొని వకగౌరవపాత్రమైన వ్యక్తినిగుఱించి చేసినదూషణాన్నికూడా ఆమోదిస్తూ "యీలాటి రచన వుండి తీరవలసిందే" అని సలహాయిచ్చి వారిని సంతోషపెడతారుగదా! ఆయీసందర్భాలలో వున్న యథార్థం జన సామాన్యం పూర్తిగా యెఱిఁగే వున్నప్పటికిన్నీ కాగితంమీఁద మాత్రం అదియెక్కడానికి ఆత్మవంచకుల వ్రాఁతలు అడ్డుతగులుతాయి. నిజమైన కవిత్వానికి సంఘాలతోఁ గాని చుట్టఱికాలతోఁగాని అవసరమే లేదన్నం దుకు నేను వుదాహరించిన శ్లోకమే సాక్ష్య మివ్వఁగలదు కాఁబట్టి విస్త రించేది లేదు. కవికర్ణరసాయనంలో — "....లోకులరసనలె, యాకు లుగా నుండునట్టి యవివో కవితల్" అని వుంది. అట్టికవిత్వాలకు యేసంఘాభిమానంతోటిన్నీ పని లేదని చెప్పనక్కఱలేదు.

యీ శ్లోకాన్నికూడా చూడండీ—

శ్లో. హేగోదావరి దేవి ! తావకతటోద్దేశే కళింగః కవి
ర్వాగ్దేవీం బహుదేశదర్శనసఖీం త్యక్త్వా విరక్తిం గతః
ఏనా మర్ణవమధ్యసుప్త మురజిన్నాభీసరోజాసనం
బ్రహ్మాణం గమయ క్షితౌ కథ మసా వేకాకినీ స్థాస్యతి.

కళింగుఁ డనే వకమహాకవి సన్యసిస్తూ యీశ్లోకం చెప్పినట్లు శ్లోకార్థంవల్ల వ్యక్తమవుతుంది. సరస్వతి బ్రహ్మదేవుణ్ణి వదలిపెట్టి యింత కాలమున్నూ తనతోటివున్నట్టున్నూ, యిప్పుడు తాను సన్న్యసిస్తూ వున్నాఁడు కనుక ఆపెను పరిత్యజించడం తప్పనివిధి కనక యీగోదావరీ నదీద్వారాగా సముద్రంలో నిద్రిస్తూవున్న శ్రీమహావిష్ణువు నాభీకమల మందువున్న బ్రహ్మదేవుని సన్నిధికి పంపుతూ వున్నట్టున్నూ, ఆలా పంపకపోతే యీమె యీపిమ్మట యీలోకంలో అసహాయురాలై వుండడం కష్ట మన్నట్టున్నూ వాచ్యార్థం కనపడుతుంది. వ్యంగ్యార్థమో ? తానుతప్ప సరస్వతిని ధరించఁదగ్గవారు లేరే లేరనేది. ఇట్టి శ్లోకాలలోఁగాని పద్యాల లోఁగాని వున్నస్వారస్యం తెలుసుకోలేక కొందఱు — "వైదికునిచేతివిడె మాయె వనితబ్రతుకు" అనే పద్యార్థాన్ని జ్ఞాపకం తెచ్చేమాటలు వ్రాస్తారు. వారివ్రాఁతలుచూస్తే విచారం కలుగుతుంది. అది యట్టు లుంచుదాం. తిక్కన్నగారు భగవద్గీతార్థం తెలియకపోవడంచేతఁగాని లేదా అందులోవుండే విశేషాలు సర్వసాధారణంగా తెలిసిపోతాయనే చుప్పనాతితనంచేతఁ గాని క్లుప్తపఱచలే దనిన్నీ, నిష్కృష్టమైన విమర్శకు లవడంచేతనే క్లుప్తపఱచా రనిన్నీ నేనభిప్రాయపడతాను. మఱిన్నీ నాకీ మధ్య పని కలిగి తిక్కన్నగారి యావద్భారతాన్నే కాక నన్నయ్యయెఱ్ఱన్న గార్ల భాగాలు కూడా ప్రత్యక్షర పరిశీలనగా చదవడం తటస్థించింది. యెక్కడేనా శాస్త్రవిరుద్ధాలు కనపడతాయేమో అని మిక్కిలిగా వెదకి వున్నాను. నాకు తెలిసినంతలో కనపడనే లేదు. కాని మొత్తం ఆయన

పదిహేను పర్వాలలోనున్నూ "రెండు సుమహత్తులు" కనపడ్డాయి. వాటిని వుదాహరించి మఱీవ్రాయఁదగ్గమాటలు వ్రాస్తాను —

(1) శూలపినాకాది సుమహదాయుధముల వెలిగెఁడు చేతులు—
(2) సుమహదుపాశ్రియప్రమదశోభిత విశ్వజగన్మధువ్రతా—

యిందులో మొదటి "సుమహ" ప్రయోగం విధిగా కర్మధారయ సమాసంలో దని తేలుతూ వుండడంచేత — "సుమహాయుధములు" అని కాకతీరదు. దీన్నిగుఱించి "మహదైశ్వర్యాభివృద్ధి" అనే వ్యాసంలో సాధకబాధకాలు చూపించి చర్చించి వుండడంచేత యిక్కడ విస్తరించ లేదు. పోనీ — "సుమహాయుధముల" అనే అనుకోరాదా? అంటే గణం చెడుతుందికాని—"సుమహాయుధమ్ముల" అని సవరిస్తే ఆ ముద్రాలోపమో? లేక సంస్కర్తృలోపమో తేలికగా సవరణ అవుతుంది. లేదా? "సుమహితాయుధముల" అంటే అంతకన్న తేలికగా సవరింపఁబడ్డట్టవుతుంది. ఈ సవరణ మనుజుల విప్రిండు అనేదాన్ని — జనులందు అనిగాని నరులందు అనిగాని సవరించడంవంటిది కాదు. తిక్కన్నగారి — "ఉభయకవిమిత్రబిరుదు" నేతిబీరకాయవంటి దనడానికి నాకే కాదు వేఱొక్కరికిన్నీ నోరురాదు. అట్టి స్థితిలో కౌముదిపూర్వార్ధంలో మూఁడోవంతు చదువుకొన్నవాళ్ళకుకూడా గోచరించే యీ స్వల్పవిషయం తిక్కన్నగారికి తెలియదనుకోవడానికి వీలుపడదు. పనిలోపని బిరుదు తత్సమసమాసంలో తుట్టతుద నుండవచ్చునన్నందుకు తిక్కన్నగారి ఉత్తరరామాయణ ప్రయోగాన్ని యిచ్చి ప్రస్తుతానికి వస్తాను.

"పరివారసన్నాహ బిరుదు గలుగ"

పై ప్రయోగం మా "కవిసింహ బిరుదు" అనే ప్రయోగానికి జీవకమో కాదో ప్రాజ్ఞులు విచారింపఁగలరు. ఇట్టి వేవిన్నీ చూడక వృథాగా కాగితాలు నలుపుచేసి లోకాన్ని వంచించే రోజులలో నిజం అబద్ధంగానున్నూ అబద్ధం నిజంగానున్నూ మారడంలో ఆశ్చర్యం వుండదు

కదా! ఇదివఱలో ప్రయోగమైతే యిప్పుడేమిగాని సాధుత్వాన్ని చూపించడం జరిగింది మహానైవేద్యంలో. అయితే యేంలాభం? దాని మీఁద "పిడివాదం" ప్రవర్తించఁబడింది. ఇప్పుడో? యింకోవంకర మార్గం వుంటుంది. ప్రామాణ్యజ్ఞాన మంటూ వుండాలిగాని అది ప్రాప్త మైనప్పుడు వాదానికేం తక్కువ? దీన్ని యీలా వుంచుదాం, యింక రెండో సుమహత్వపప్రయోగాన్ని గూర్చి అది ఆశ్వాసాంతపద్యచరణంలో వుంది. వ్యధికరణంగా సమన్వయించుకోవడానికి వీలుంటే బాగుండును. లేకపోతే సుఖసుఖాల దిద్దఁబడేటట్టు మాత్రం కనపడదు. అచ్చుపొరపాటు కాదు. కాఁబట్టి దానిభారం ప్రాజ్ఞలోకానికి వదులుతూ వున్నాను. సంస్కర్తలు చాలాచాలా రహస్యవిషయాలు యెత్తుకొని చూపిస్తూ వచ్చారు. కాని యీ రెండు ప్రయోగాలను గూర్చిన్నీ వారు సందేహించినట్లే లేదు. ఇంతమాత్రంచేత వారి కజ్ఞత్వాన్ని ఆపాదించడం ప్రాజ్ఞలక్షణం కాదు. "గచ్ఛతఃస్ఖలనం న దోషాయ" కదా! రేఫద్విత్వానికి పూర్వం గురుత్వం వికల్పమనే రహస్యం సంస్కర్తలకయితే గోచరించినట్లు లేదుగాని ఆవిషయంలో వారికి శంకమాత్రం కలిగింది. ఇక్కడ శంకకూడా కలగలేదు. యింకొకప్రయోగం — "అక్షౌహిణి" అనడానికి బదులు "అక్షోహిణి" అని యతిస్థానంలో అసకృదావృత్తిగా తిక్కన్నగారు వాడివున్నారు. పాణినిసూత్రాలనుబట్టి మాత్రమే చూస్తే తిక్కన్నగారి అక్షోహిణికి క్షతి లేదుగాని — "అక్షాదూహిన్యామ్" అని వార్త్తికం పుట్టడం వల్ల తిక్కన్నగారి ప్రయోగం యెట్లా వుపపన్నమవుతుందో గోచరించడంలేదు. దీన్నిగూర్చి వైయాకరణులు ప్రష్టవ్యులు. ఇది తిక్కన్నగారు బుద్ధిపూర్వకంగా ప్రయోగించిందే కాని మఱొకమాదిరిదికాదు. స్వతంత్రించి ప్రయోగించిందేమో అనుకుందామంటే మునిత్రయాన్ని అతిక్రమించడానికి తిక్కన్నగారి కధికారాన్ని కల్పించఁజాలం. ఇంకా వ్యవహార బలీయస్త్వాన్ని పురస్కరించుకొని సంస్కృతానికి సంబంధించిన మయట్ప్రత్యయాన్ని తెలుఁగులోకూడా — "తనమయము, మెదడు ప్రోవుల

మయము " ఇత్యాదిస్థలాల్లో ప్రయోగించిన తిక్కన్నగారిని శిరసావహిం చడానికి అంతబాధకం కనపడదు. అది తనకు మాతృభూతమైనసంస్కృత భాషతాలూకు ఆస్తి కనక యేమాత్రమో కూఁతురుకు సంక్రమించి శిష్ట వ్యవహారంలో ఉండడంవల్ల ఆశిష్టులయం దుండే గౌరవాతిశయంచేత సోమయాజులు గౌరవించి ప్రయోగించా రనుకొని యథాకథంచిత్తుగా సమ ర్థించడానికి అభ్యంతరం ఉండదు. ప్రస్తుతం శాస్త్రవిరోధం పూర్తిగా కన పడడంవల్ల తటపటాయించవలసి వచ్చింది. ణకారఘటితంగా తిక్కన్న గారు ప్రాసస్థలాల్లో వాడిన — " దుర్ణయ " గత ణత్వం నన్నయ్యగారి క్కూడా యిష్టమే కనక శంకించవలసి వుండదు. అందుకుఁ గల వుపపత్తులు అన్యత్ర చిరకాలంనాఁడే చూపఁబడ్డాయి కనక విస్తరింపను. ఆ వుపపత్తు లను లేశమున్నూ గణింపక వక నిశ్శంక " శిరోమణి " గారు నన్నయా దులను తృణీకరిస్తూ యేదో కొంత అయుక్తప్రసంగాన్ని స్వకృతపు పుస్త కంలో మఱికొన్ని సొంతతప్పులతో పాటుగానైతే వ్రాసివున్నారుగాని అది అకించిత్కర మనిమాత్రం వ్రాస్తే చాలును, ఖండించనక్కఱలేదు. ఏమంటే ? నన్నయ్యగారినాఁటికి ఆణత్వం నిర్బాధమే, ఆంధ్రానికి ఆయన పరమావధిగదా ! అందుచేత సోమయాజిగారు, దాసుగారు, నాథుఁడుగారు, తాతగారు, యింకా కొందఱున్నూ ప్రాసస్థలాల్లో వాడుకొని ఉన్నారు. చిరకాలభుక్తానికి యితరరూల్సు లేశమున్నూ భంగించలేనట్లే దాన్నిన్నీ నవీనసిద్ధాంతాలు బాధించనేరవు. డిటో ప్రకారమే కాలీన ప్రయోగం కూడాను. దీనికి వైయాకరణుల వ్యాఖ్యానాల్లో యిటీవల గత్యంతరంకూడా ఉందని అన్యత్ర విస్తరించాను. మఱిన్నీ తిక్కన్నగారు — " అవ్విరించి పలుకులు మనస్కరించి మహాదేవుండు " అని శాంతిలో వచనంలోనే అనుకోండి వాడియున్నారు. వచనం గనక దిద్దుతామనేవారిని నేను మన్నిం పను. ఈమనస్కరించు ప్రయోగాన్ని యెవరోకాదు " గుప్తార్థప్రకాశిక " వారే ఆక్షేపించి యున్నారు. కాని యిది కవిబ్రహ్మగారి దని వారు గమ నించలేదు. లోకవ్యవహారంలో దనిమాత్రమే అనుకొన్నట్టు వారివాక్యధో రణి చెపుతుంది. చూండండి —

మనశ్శబ్దంబు నమశ్శబ్దవ్యుత్క్రమంబే కావున "నమస్కరించు" అన్నట్లు "మనస్కరించు" అని ప్రమాదంబున లోకుల ప్రయోగింతురు.
(గుప్తార్థ — చూ)

దీనివల్ల శ్రీ "గుప్తార్థ" వారు తిక్కన్నగారి ప్రయోగాన్ని చూడనేలే దనిన్నీ యిది సామాన్యలోకుల దనుకోవడం అందుచేతనే తటస్థించిం దనిన్నీ స్పష్టమే. దీనివలన వారివిమర్శకత్వానికిఁగాని పాండిత్యోత్కర్షకుఁగాని లేశమున్నూ భంగం లేదని సహృదయులు గుర్తింతురు. భారతాన్ని శ్రద్ధగా తిరగవేయడమున్ను శబ్దరత్నాకరాన్ని బాగా అవలోడన చేయడమున్నూ కొంత వుపకారకం కాకపోదుగాని ఆ చూడడంలో భ్రాంతివశంవల్ల దేన్నైనా గమనించక పోయినంతలో వారు పండితులు కారనిగాని పరిశీలకులు కారనిగాని అనడం మిక్కిలీ గర్హ్యం. ఈ "మనస్కరించు" శ-ర-లో వున్నదే, సం-అ-క్రి-అన్నాఁడుకాని గ్రామ్యాలలో చేర్చలేదు. మనసుంచు అని అర్థం వ్రాసినాఁడు కాని భారతోదాహరణాన్ని ఆయనకూడా యివ్వనేలేదు. గుప్తార్థవారు దీన్నిగూర్చి కొంత చర్చకూడా వ్రాసివున్నారు, అది సంస్కృతవ్యాకరణానికి సంబంధించింది, ఇక్కడ వుదాహరిస్తే గవడ గొయ్యిగా వుంటుంది.

"మహాఋషీణాం మతయశ్చ భిన్నాః" అనే అభియుక్తోక్తిని స్మరించుకొని, వూరికే యెవరినిగాని పరిశీలించకుండా తూలనాడి తరువాత దారి కనపడక "దాన్ని దిద్దుతాము, దీన్ని దిద్దుతాము" అనడంకన్న మొట్టమొదటే విచారించుకోవడం మంచిదని భావివిమర్శకులకు నాసలహా; లేదా వృథాగా వకరిమీఁదకు వెళ్లవద్దనేనా నాసలహా. ప్రసక్తానుప్రసక్తంగా యేమేమో వ్రాసినప్పటికీ ప్రధానం "మనస్కరించు" ప్రయోగం భారతంలో వుండడంవల్ల "శంఖునఁబోసిన తీర్థం" వంటి దయిందని తెలుసుకోవడమే. నన్నయ్యగారి నతిక్రమించకుండానే తిక్కన్నగారు చాలా వఱకు రచన సాగించారు; కాని కొన్ని ఆయనకు కొంచెం భిన్నంగా కూడా ప్రయోగించినవి లేకపోలేదు. అంతమాత్రంచేత అవిదుష్టా లనుకునేవారు

అపహాస్యాస్పదులు కాక తప్పదు. యీ విషయం విపులీకరిస్తే చాలా వ్రాయాలి. మచ్చుకు వక వుదాహరణ చూపి కొంచెం వ్యాఖ్యానిస్తాను. నన్నయ్యగారు — "కొండొక" అనేదాన్ని విశేషణంగానే వాడివున్నారు. ఉదాహరణాలు "కొండొకసేపు — కొండొకనేల — కొండొకకోల" లోనైనవి చాలా వున్నాయి. తిక్కన్నగారో ? దీన్ని కేవలంగా — "కొండొక విచారించి, కొండొకమనమునఁజింతించి, కొండొక తొలంగి, కొండొక తేఱి, కొండొకదిగంబాఱెడిచిత్తమ్ము, కొండొక లజ్జించి" యెన్నిటి నని చూపేది ? శరపరంపరగా వాడిఉన్నారు. ఆ పదానికి మఱికొన్ని అర్థాలు సందర్భానుసారంగా చెప్పికొనవలసిన వున్నప్పంటికీ ప్రధానంగావచ్చే అర్థంమాత్రం "కొంచెము, చిన్న" అనిమాత్రమే. ఈఅర్థాలనుగూర్చి సప్రయోగంగా వేఱొకవ్యాసంలో చర్చిస్తాను. శ-ర-లో వ్రాసిన అర్థాలతో భారతప్రయోగాలన్నీ చక్కఁబడవు. ప్రస్తుతం నన్నయ్యగారికన్న భిన్నంగా తిక్కన్నగారు ప్రయోగించినట్లు ఋజువుచేశాను. "పేదసాదలు" అనుదాన్ని గుఱించి లోఁగడవ్యాసంలో విస్తరించివ్రాశాను. కవిత్రయభారతంలో ఆయీప్రయోగం పలుచోట్లవుంది. కాని యిప్పటివారు వాట్లన్నిటినీ దిద్దివున్నారు.

"జనులను బేదలసాదల నిత్యంబు" అనే నన్నయ్యగారి సభాపర్వ ప్రయోగాన్ని బట్టి-"పేదలకును సాదలకును, వేదములకుఁ దాపసులకు"అని శాంతిలో తిక్కన్నగారు వాడినారు. కాని సంస్కర్తలు—"సాదలన్" అనే దాన్ని, "సాధులన్" అని సర్వత్రా దిద్దివేసినారు. ఆప్రయోగము, "చెట్టాచేమా" వగయిరాలవంటిది. చెట్టుతో తోవాసంగా వచ్చిన "తోడపెళ్ళికొడుకు" "చేమ"కు అన్యత్ర వున్న అర్థం యిక్కడ కూడా ఉందనుకోవడం భాషాస్వభావవేతృత్వానికి భంజకం కాకపోదు. యీచేమకు అట్టి అర్థం చెప్పేయెడల యేంచిక్కంటారేమో ? వినండి, భారతంలో "దుర్యోధనుండు తొలంగెం జెట్టుచేమల నడంగియుండునో ? మీరు మెలఁగునెడల నరయవలయు" అని ధర్మరాజు బోయవాళ్ళతో చెపుతాఁడు. ఇక్కడ

తోవాసప్పుడమైన “ చేమ ” కు స్వార్థం వుంచేయెడల చేపసుంచలమదిలో ఆమట్టలలో దుర్యోధనుఁడు దాక్కొని ఉంటాఁడేమో పరిశీలించండి, అని ధర్మరాజు పలికినట్లర్థం చెప్పాలి. అది సంగతం కాదని సహృదయులకు వేఱే చెప్పనక్కఱ లేదు. యిక్కడ చేమశబ్దం, చెట్టుశబ్దార్థాన్ని బలపఱుస్తూ, చెట్లలోఁగాని సజాతీయమై రహస్యంగా దాఁగడానికి వీలుగా వుండే మఱివకచోటఁగాని, అనే అర్థమే యిస్తుంది కాని స్వార్థాన్ని యివ్వనే యివ్వదు. పేదతో వున్న సాదశబ్దంకూడా, పేదయున్నా, అటువంటివాళ్లే అయిన బాలురూ, వృద్ధులూ, రోగులూ అనే అర్థం యిస్తుంది. యిఁక సాధు శబ్దార్థకమైన తప్పుపరూపంగా — “ సాదులు ” అని దిద్దితేనో ? యోగ్యులు అని అర్థం యివ్వవలసివస్తే యిస్తుంది గాని అది హృదయంగమం కాదు. పైఁగా అసాధువులయితే పేదలను రక్షించ వలసి ఉండ దనికూడా అర్థంవస్తే రావచ్చును. ఆ అర్థంకూడా మాకిష్టమే అంటారేమో ? మీయిష్టంతో పని లేదు, అక్కడ కవిహృదయం అట్టిది కాదు. కనక అది హృదయంగమం కాదని చెప్పకతీరదు. అయితే— “ దుర్జనులఁగూడి పేదసాదులను గొట్టు ” అని భళ్హాణ చరిత్రలో వున్న ప్రయోగంగతి ఆలోచించాలా ? వద్దా ? అంటే వినండి అదే అర్థంచెప్పు కొనేయెడల భారతప్రయోగాలు రెండున్నూ హృదయంగమంగా వుండవు. భారతంకంటె యితరం మనకు ముఖ్యంకాదు. సాధులుఅంటే సాధువులైన గోమహిష్యాదులు అని—శ—ర—కారుఁడు వ్రాశాఁడు. యీ అర్థం సరసంగా వుంటుందో నేను చెప్పిందే సరసంగా వుంటుందో భారతం చూచి సహృదయులు నిర్ణయింతురుగాక. యింతకున్నూ వ్యావహారికంలో వుండే కొన్నింటిని స్వీకరించడానికి నన్నయాదుల సమ్మతివుందని తెలపడానికే తప్ప దీనిలో నాస్వార్థమేమిన్నీ లేదని తెల్పుతూ వున్నాను. “ సాదకున్ ” అన్నదాన్ని “ సాదుకు ” అని దిద్దినా నాకు చెడేదిలేదు.

నన్నయాదులు యెంత గ్రాంథికభాషాపరులైనప్పటికీ లోకాన్ని అతిక్రమించలేదు. నన్నయ్య — వలయున్ — అన్నదానికి వలెన్ అనే

రూపాంతరం వాడడమేమి? అట్టి ధాతువేకదా "వెలయున్" అన్నది కూడా దానికి "వెలెన్" అనే రూపాంతరాన్ని వాడక పోవడమేమి? అంటే? యెవరేనా నావలెనే "దాకలాగ నోరు తెఱవడమే ప్రత్యుత్తరం గాని అన్యం కనపడదు."

వ్యవహార బలీయస్త్వాన్ని పురస్కరించుకున్నవారి కేచిక్కూ లేదు, "తెలుఁగునకున్న వ్యాకరణదీపము చిన్నది" కదా! "నడచు" ధాతువుకు ప్రేరణరూపం "నడపు" అనేకాని "నడపించు" అనేది నన్నయ్యగారు వాడనే లేదు. తిక్కన్నగారో? శరపరంపరగా వాడివున్నారు. యెన్నిచోట్లనంటారా? సుమారు వందకు తక్కువుండ వనుకొంటాను. దిద్దుతామంటారా? పద్యాలల్లో యతులలో ప్రాసలలోకూడా వున్నాయి. సరే, కిక్కురుమనకుండా "నడిపించు" వప్పుకున్నామను కుందాం. సజాతీయమైన ధాతువునే "విడుచు" అనేదాన్ని పడదాం. దీనికి ప్రేరణరూపం "విడిపించు" మాత్రమే కనపడుతుంది. దానికి వున్నట్టు "విడుపు" ఉండేయెడల — "రథము నడపెన్" అన్నట్లే, "చేయివిడిపించెన్" అనే అర్థమందు "చేయి విడిపెన్" అనికూడా ఉండవలసి వస్తుంది. యీలాంటి వెన్నో చూపవచ్చునుగాని వ్యాసం మఱీ పెరుఁగుతుంది. ఆంధ్రకవులందఱూ వ్యావహారానికి 99 వంతులు ప్రాధాన్యం యిచ్చి రచనసాగించారు. అందులో "గుడ్డిలో మెల్ల" గా ఉండేమాటలను గ్రహిస్తూ వచ్చారు. ఇప్పుడే కాదు, అప్పుడుకూడా అయొచ్చేదీ పయొచ్చేదీ ఆలోచించకుండా శంకించేవారు గాని వెక్కిరించే వారు గాని లేకపోలేదు. వున్నట్టు "వెలగకు వెల్గయంచు" వగయిరా పద్యాలు సాక్ష్యమివ్వడం లేదా? మొత్తం నూటికి తొంబదివంతులు ప్రయోగాధారంమీఁదనే కవి రచన సాగించుకోవాలి. దేవీభాగవతంలో—

"జెలగ శరీరముం బొదివి చీమును నెత్తురు గ్రోలుభంగిఁ గొం
తలు తమవీర్యమున్ దమధనంబు మనంబు హరింతు రంచు"

అని మొదట వ్రాశాము. అప్పటికి శ-ర-నిఘంటు అచ్చైనను యిప్పటిలాగ పల్లెటూళ్లల్లో వుండేవాళ్లకు అందుఁబాటులో లేదు. అంచు చేత అన్నింటికీ భారతమే ఆధారంగా వుండేది. ఎందుకోసమో భారతం వెదుకుతూవుంటే యతిస్థానంలో "జలగ" అని కనపడింది. ఆ పద్యాన్ని ఆపద్యం — "జలగ శరీరముం బొదివి చయ్యన" అని దిద్దుకున్నాము. మళ్ళా కొన్నాళ్ళకు భారతంలోనే — "జెలగ" అని యతిస్థానంలోనే కనపడింది. దానితో మళ్ళా మొదటిదే అట్టేపెట్టుకున్నాము. ఈ దిద్దుకోవడం గాని అట్టేపెట్టుకోవడంగాని పాండిత్యప్రకర్షకుఁగాని, అపకర్షకుఁగాని స్ఫోరకాలు కావు. "చెట్టుకింది ప్లీడర్ల" మాదిరి విమర్శకులు యిట్టివి పట్టుకొని వ్రేలాడుతూవుంటారు. ఇందులో వ్యాకరణజ్ఞానం తేలుతుందా లేక మతాంతరజ్ఞానం యేదేనా తేలుతుందా? ఇప్పుడు పసికూనకూడా శ-ర నిఘంటును దగ్గిరపెట్టుకుంటే ఆ యీ రూపాలసంశయాలు నిర్ణయించు కుంటుందిగదా? ఆ యీ అనవసరపువిచారణ యెందుకు వచ్చిందంటే? నన్నయ్యగారి—

క. కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయజనకులు చనుదెం
తురు వారు వచ్చి నీ కి
చ్చిరేని పాణిగ్రహణము చేయుము నన్నున్.

అనేపద్యానికి సర్వవిధాలా విచారిస్తే—

క. స్త్రీస్వాతంత్ర్యము లేమిన్
మాస్వాములవారు వచ్చి మనలక నీకున్
సుస్వాదువృత్తి నిచ్చిన,
నోస్వారాట్తుల్యనన్ను నొందుముపిదపన్.

అనేపద్యం తీసిపోతుందని యథార్థంగా నేను వ్రాసినమీఁదట మెఱిఁగీయెఱుఁగని ఆక్షేపణలతో దస్త్రాలకు దస్త్రాలు నింపడంవల్ల వచ్చింది.

అనింపడం మొత్తానికి, వెం॥ శా॥ కి కవిత్వమే తెలియదన్నది ఫలితార్థం. యిది సత్యమైతే కావచ్చునుగాని ఆరెండుపద్యాలకున్నూ "హస్తిమశకాంతరం" తేడాకు వప్పనివారుమాత్రం ఉండకూడదు. ఆ రెండు పద్యాలకూ వుండేతేడాపాడాలు ప్రతి ఆంధ్రుఁడికీ గోచరించేవే అయినా కొంచెం వివరిస్తాను. ఆ ఘట్టం శకుంతలాదుష్యంతుల సమాగమానికి సంబంధించిన శృంగారఘట్టం. ఆలాటి చోటు కనక కొంత మృదుపదాలతో యతిప్రాసలకు తోవాసాలు వేసుకోకుండా రచన సాగాలి. నన్నయ్యగారి కవిత్వధార, ఆవిధంగా నడిచిందో లేదో సహృదయులు పరిశీలిస్తారుగదా! రెండవపద్యంలో కొంత దుష్కరప్రాస యెత్తుకోవడంచేత చరణం వక్కంటికి వొక్కొక్కటి చొప్పున వ్యర్థపదం పడక తప్పింది కాదు. రెండోచరణంలో యతిస్థానంలోకూడా "మసలక" అనేది పడవలసి వచ్చింది. అసలు పద్యం యెత్తుకోవడంలోనే యీలోపం ఉందిగాని తరవాత పూర్తి చేయడంలో లేదు. పద్యం యెత్తుబడి ఆలా ప్రారంభమైనప్పుడు నన్నయ్యగారేనా నీరసంగానే పూర్తి చేయవలసి వస్తుంది. అక్కడినుంచి ఆయాపదాలకు సూత్రప్రపదాలకులాగ వ్యాఖ్యానం మొదలుపెట్టి సార్థక్యాన్ని కలిపిస్తామే అనుకోండి, అంతమాత్రంచేత ఆ లోపం కమ్మదల అవుతుందా? అవదు. పోనీ ఆ నీరసత్వాన్ని యెవఁడో కల్పించినట్లభిప్రాయపడి వాణ్ణి పట్టుకొని తిట్టడానికారంభిస్తేనో? అప్పుడు మాత్రం అది సవరణ అవుతుందా? కాదు. కందానికేమో 64 మాత్రలు కదా! ఆమాత్రలలో సుమారు సగం పొల్లుక్రిందే యెగిరిపోయే పద్యాన్ని సమర్థించడం యేలాగ? ఇది రసారస విచారం గాని శబ్దార్థవిచారం కాదుగదా! యితర కవులు వారిలో వా రేమనుకుంటారో గాని ఈలాటి విషయంలో — "రసారసవిచారము మాయది కాదు" అనే మేము వ్రాసుకున్నాము, యితరు లేపనిచేశారో ఆపనినే మనం చేసివున్నప్పుడు అంటే వకరు తెలిఁగించినదాన్నే మనం తెలిఁగించినప్పుడు దానికీ దీనికీ పోటీ పడడం తప్పదు. కొంద అదిబాగుందనీ కొంద ఇది బాగుందనే మాదిరిగా

యిటీవల వారిరచన వున్నట్టయితే ఫరవాలేదు, గాని మొత్తగా "యేదం పెట్టయితే" చిక్కు. ఆ చిక్కే నా శ్రీపద్మద్వయం విషయంలో వచ్చి కట్టింది. కాఁబట్టి "సహృదయాః ప్రమాణం" అని నమస్కారం చేస్తున్నాను. యెవరేనా సాహసించి నన్నయ్యపద్యమే బాగాలేదు "స్త్రీస్వాతంత్ర్య పద్యమే బాగావుఁదని ప్రకటిస్తారా? నేను దానికే ఒప్పుకుంటాను గాని వాదించేది లేదు. యేమంటారా? విషయం అలాటిది కనక యిది వాదార్హం కాదు, ఇది విషయాంతరం. మనకు ప్రస్తుతం తిక్కనగారి నైపుణ్యం. ప్రసక్తానుప్రసక్తంగా యితరవిషయాలు నడిచాయి. తిక్కన్న గారి పద్యాలలో ఒకచోట యుద్ధభాగంలో — "సారసానకు" అనివుంది. శ—ర—లో దీనికర్థం వ్రాయలేదు, నాకు అర్థం కావున్నా లేదు, ముద్రా ప్రమాద మని తోఁచనున్నూ లేదు. నన్నయ్యగారికన్న యెన్నో పదాలు తిక్కన్న శుద్ధ తెలుఁగువి మనకర్థం కానివి వాడివున్నాఁడు. అప్పటివ్యవహారంలో నెల్లూరు గుంటూరు మండలాల్లో ఆయాపదాలు కొంచెె మించు మించు రూపభేదంతో వ్యవహారంలో వుండితీరాలి. కొన్ని వోరుగల్లు ప్రాంతంలోవిగా వుండివుండును. తిక్కన్న ఆప్రాంతానికికూడా వెళ్ళినట్లు కనపడుతుంది. అంతేనేకాని ఆపదాలన్నీ అతని స్వకపోలకల్పితాలు మాత్రం కావు; అంటే సాంకేతికాలు కావు. సమాసం చేయడంలోకూడా మంచిసాహసాన్ని తిక్కన్నగారు చూపించారు.

"ఈవిండ్లు కుఱుచ లలఁతిబలంబుల్" అని అర్జునుఁడు ఉత్తరుఁడితో అన్నాఁడు. అలఁతి తెలుఁగు; బలము సత్తువ అనే అర్థములో సంస్కృతము. అలఁతి యైనబలముకలవి అని బహువ్రీహి చెప్పకోక తప్పదు: శ్రవణకటువుగావుందా "చెడినచిత్తాంభోజుడు" లాగ? అంటే లేదు. శ్రవణపేయంగానే వుందికదా! అందుకే కాఁబోలు యిప్పటివఱకింకా దాన్ని సంస్కర్తలు మాటపెక్కించుకోలేదు. యెంతోమార్పునక్కఱ లేదు. అల్పబలంబుల్ అంటే తీరిపోతుంది. యీలాటి వన్నీ దిద్దితేనే ఆకవిత్వం తుట్టతుదకు "కాళిదాసుగారికవిత్వం కొంతా మాషైత్వం

కొంతా" దగ్గిఱికి దిగుతుంది. కాని యెవఁడిశక్యం? యెన్నెన్ని దిద్ది పాడుచేస్తూన్నారో? పరిమితి వుందా? వొక్క వేదానికంతగా యీదోషం తగలలేదు. యెందుచేత? అది శ్రుతికదా! దానిలోకూడా పాఠభేదాలు లేకపోలేదుగాని పురాణాదులలో వున్నంతగా ఉండవు. ఈపాఠభేదాలే కాదు గ్రంథభాగాలకు భాగాలే భేదించిన మాతృకలుకొన్ని ఉండడంవల్లనే కొందఱు తిక్కన్నగా రదివదిలి పెట్టేరనిన్నీ నన్నయ్యగారిది వదిలిపెట్టే రనిన్నీ అనడం తటస్థిస్తూవుంది గాని లేకపోతే తటస్థించదు. స్పష్టంగా— "సీతాయాః పతయే నమః" అని మాతృకలో వుంటే, కుమారస్వామికి నమస్కారము అని తెలిఁగించడానికి వారికర్మం యేంకాలింది? అందు చేత వారి రచనలో వేఱుకారణం చూపి ఆక్షేపిస్తే తప్పులేదుగాని పైకారణాన్ని చూపిస్తే మాత్రం సహ్యంగా వుండదు. కొన్నిచోట్లు సంస్కర్తలు వృథాగా దిద్దినట్లు సూక్ష్మంగా విచారిస్తే కనపడతాయి. మచ్చుచూపుతాను.

"యాదవవృష్ణిభోజాదు లెల్ల" (అర ౧ అ) అని ఉండవలసిన సీసచరణోత్తరదళాన్ని — "యాదవవృష్ణిభోజాంధులెల్ల" అని దిద్దినారు. ఈదిద్దుబాటులో అర్థం లేశమున్నూ చెడని మాటకు నేనున్నూ వప్పుకుంటాను కాని గ్రంథకర్త నియమం వృథాగా చెడింది. నన్నయ్యగారు సీసాన్ని యెత్తడంలో మొదటిచరణంలో యతివిషయం యేలా వుంటుందో, చిట్టచివరవఱకున్నూ ఆలాగే వుంటుంది. ఈ సంగతి విమర్శకులు పలువు రెఱిఁగినదే కాని నేను క్రొత్తగా వ్రాసేది కాదు. ఈ దిద్దుఁబాటు ఆనియమాన్ని భంగిస్తూవుంది. వలసినవారు ఆ పదాన్ని పరిశీలింతురుగాక. ఎక్కడో వొకానొకచోట నన్నయ్యగారినియమాన్ని అతిక్రమించారుకదా అని తిక్కన్నగారు పూర్తిగా వుల్లంఘించి ఉన్నారు, అని దీనిలో వ్రాసే వున్నాను. యెఱ్ఱన్నగారు "ఆతనిరచనయకా, అరణ్యపర్వ శేషము" పూరించడంచేత కాఁబోలును చాలావఱకు ఈ నియమాన్ని పట్టుకునే సీసపద్యాలు నడిపిస్తూ వచ్చారు. వ్యాసం విస్తరించడంచేత మఱికొన్ని సంగతులు వ్రాయక స్వస్తిచెపుతూ వున్నాను. ప్రధానాంశం తిక్కన్నగారు

భగవద్గీత సంక్షేపణ చేయడంలోనే ఆయన నైపుణ్యాన్ని సహృదయులు తెలిసికోవలసి వుంటుందనియ్యేవే. మేము శ్రీనివాసవిలాసపీఠికలో—

"పురాణము తెల్గొనరించినన్ గడున్ శ్రావ్యతగాంచి యొప్పెఁగ సంస్కృతముం గని గేలిసేయుచున్"

అని యిప్పటికి సుమారునలువదియేండ్లనాఁడే వ్రాయడానికి కారణం చేదస్తంగా వుందని తిక్కనాదుల అనువాదానికి సంబంధించిందే అని చదువరులు గమనించకోరుతాను. ఋషికవిత్వాలలో చాలాభాగం పునరుక్తులు వుంటాయని యెఱుఁగనివారు లేరు. కొన్ని తెలిగిస్తే రసాభాసుగా వుండేవిన్నీ వుంటాయి.

"పంచ మే పతయస్సంతి" అనే శ్లోకంలో మూఁడోచరణం తెనిఁగించ వలసివస్తే హేయంగా వుండకపోదు. తెలుఁగు మాటట్లావుంచఁగా అది సంస్కృతంలోనే కొంత జుగుప్సాకరంగా వుంటుంది. అలాటి వాట్లనుకూడా కొన్ని సందర్భాలలో వుండవచ్చునంటూ లాక్షణికులు శాసించినట్లు అన్యత్రా చిరకాలంనాఁడే వ్రాసి వున్నాము. కాని పైనుదాహరించిన సందర్భం దానివల్లకూడా సంరక్షింపఁ బడదు. అవసరమైతే ఆ ఈ విషయాలు మఱొకప్పుడు చర్చింపఁదలఁచి యిప్పటికి ఆపుతాను.



## "పిల్లలమఱ్ఱి" వారి కవిత్వం

(5—5—1937 సం॥ ఆంధ్రపత్రిక నుండి)

'.........పిల్లలమఱ్ఱి' పేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపల పినవీరు వాక్యసరణి
సరసులకునెల్లఁ గర్ణరసాయనంబు"

అను సుప్రసిద్ధమహాకవినిగూర్చి తోఁచినమాటలు కొన్నివ్రాస్తాను. "కవికర్ణరసాయన" మనఁదగిన యీతని కవన మే విషయమందుఁగాని భారతకవిత్వానికి లేశమున్నూ తీసిపోదు. భారతకవులు ప్రాచీనులగుటచేత నీతని కాభాగ్యం చేకూరినది కాదుగాని లేకపోతే యితని వక్కానిచేతి మీఁదుగానే వారిశైలిలోనే యావద్భారతమున్నూ ఆంధ్రంలోకి వచ్చేది.

భారతాంధ్రీకరణమం దీతనికి వున్నవాంఛను యితఁడు పరివర్తింపఁ జేసిన — "జైమిని భారతమే" వ్యంగ్యమర్యాదచేత తెలుపుతూవుంది. గతించినపనికి ఆలోచించి ప్రయోజనం లేదనుకొని— "తన్నామగంధాన్నలకూబరం సా" అన్నట్లు భారతనామధేయవాసన అంతో యింతో వుంది గదా! అని పాప మితఁడు దాన్ని తెలిఁగించి తృప్తిపడి వుండును. రంభకు నలమహారాజును పతినిగాచేసుకోవడం తటస్థించకపోఁగా అతని పేరుతో చిహ్నితమైన పేరుండడంచేత నలకూబరుణ్ణి వరించి అంతతో సంతుష్టిపడింది అని పై నైషధీయ శ్లోకపాదానికి తాత్పర్యం. నైషధాన్ని ఆంధ్రీకరించిన శ్రీనాథుఁడున్నూ యీతఁడున్నూ వకటే కాలంవారని చెప్పుకుంటారు. పిల్లలమఱ్ఱి శ్రీనాథుణ్ణి నైషధాంధ్రీకరణంలో యేవో కొన్నిచోట్ల — అంటే? "గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్" అన్నచోటానున్నూ యింకా యెక్కడో నున్నూ ఆక్షేపించినట్లు పుక్కిటి పురాణాలు వినడం కలదు. ఆ ఆక్షేపణలమాట యెంతవాస్తవమో? కాని దీనివల్ల వీరిద్దఱూ యేకకాలంలో వుండడం నిజ మనుకోవలసి వుంటుంది. ఆంధ్రీకరణ మర్యాద తెలియనివాళ్ళెవళ్ళేనా ఆలాటి ప్రశ్న వేశారంటే వప్పుకోవలసి వుంటుంది గాని "పిల్లలమఱ్ఱి" వంటి వుచితజ్ఞుఁ డట్టి అనాలోచన ప్రసంగం చేశాఁడనడానికి సహృదయు లొప్పరు.

"కావ్యముగాని నాటకముగాని మఱొక్కటిగాని తెల్గునన్, శ్రావ్యముగా నెనంగదు" అని మేము అన్యత్ర వ్రాసివున్నాము. దానితాత్పర్యం ఆంధ్రీకరించడం తగినంత స్వాతంత్ర్యంతో కూడుకున్నదై తేనే తప్ప

కావ్యనాటకాలు అనువాదంలో గ్రంథకర్తకు పేరు లేఁడాలనటిన్యేవే. తెలుఁగులో కావ్యం మట్టుకు స్వతంత్రించి రచించి మెప్పుఁహొందితే హొంద వచ్చునేమో? కాని నాటకాన్ని రచించి మెప్పుసంపాదించడం కష్టసాధ్యం. యేమంటే? ఆయా నీచపాత్రిలకు వాడతగిన భాష యేర్పాటుగా దీనికి సంస్కృతాని కున్నట్లు లేదు. గ్రామ్యం వాడవలసి వస్తుంది. వానికి హొంద అంగీకరించరు. వారికి భయపడి గ్రాంథికాంధ్రాన్నే వాడితే అది విరుద్ధంగా వుంటుంది. ఆయావిషయం వ్రాస్తే చాలా వ్రాయాలి, మరొక్కప్డు చూచుకొందాం. కావ్యం ఆంధ్రీకరించడంలో కొన్నిచోట్ల మాత్రకలోవున్న సమాసాలే వాడడం యుక్తమన్నంతవఱకే యిక్కడ చూచుకోవాలి అచ్చతెలుఁగుసమాసాలు కొన్ని వున్నప్పటికీ తత్సమసమాసాన్ని అచ్చికంలో కష్టపడి యిమిడిస్తే చాలామంది పెదవి విఱుస్తారు కాని సంతోషించరు — యతిప్రాసలచిక్కులేదు గనక సంస్కృతంలో సమాసం కమ్మచ్చున తీసినట్లు సాపుగా పోతుంది — ఆ సమాసం సమాసంగానే తెలుఁగులోకి తేవడమేనా శ్రీనాథుఁడు వంటి వానికి తప్ప సామాన్యులకు వశంగాదు. అట్టి శ్రీనాథుణ్ణి కష్టసుఖాలెఱిఁగిన "పిల్లలమఱ్ఱి — కర్ణరసాయనంగా కవిత్వం చెప్పే పిల్లలమఱ్ఱి" ఆక్షేపించడానికి అవకాశం లేశమున్నూ లేనిచోట ఆక్షేపించాఁ డనడానికి నేనే కాదు వేఱొకరున్నూ వప్పరు. మొత్తం లోకానికి "పిల్లలమఱ్ఱి" అంటే శ్రీనాథునికంటే కూడా యెక్కువగౌరవం వుందన్నమాట, పైకథవల్ల తెలుసుకుందాం.

"వాణి నారాణి" అంటూ అన్నాఁడంటూ కూడా యీయన్నిగూర్చి వకగాథ చెప్పుకుంటారు. యీ జైమినీభారతం వకరేరాత్రి సరస్వతి రచించి యిచ్చిందంటూ వకగాథ వుంది. వీట్లసత్యాసత్యాలు నిర్ణయించడానికి మనకు శక్తి చాలదు. కాని యీ మహాకవి దైవతోపాసకుఁ డన్నంత వఱకు పైగాథలు సాక్ష్య మిస్తాయి. యిట్టి వుపాసనాసందర్భాలు కొందఱు పుక్కిటిపురాణాలుగా మార్చి పాడుచేయడం కలదు. యీ విషయం పట్టి నవభద్రికాశి ప్రత్యక్షమైనట్లు వకరివిషయంలో వ్రాసి రసాభాసు చేయడం

అన్యత్రా విమర్శించడమయింది. అది యటులుండె. యితఁడికి తనయింటి పేరవడంచేత "మఱ్ఱిచెట్టు"ను కృత్యాదిని — "అమృతాంశుమండలం బాలవాలముగాఁగ మొలచె నొక్కటి జగన్మోహనముగ". అంటూచాలా గొప్పఁజేసి వర్ణించడమేకాక అష్టమాశ్వాసంలోకూడా మళ్ళావర్ణించి వున్నాఁడు—

"సీ. అంబుధు లేకోదకంబైన నిచటికి
వెళ్ళి వెంబడివచ్చు వేల్పు నగర
మాసమయమున శాఖాసహస్రాజాండ
పూర్ణమై యొకమఱ్ఱి పొదలుచుండు
నందు నేకదళంబునందుఁ జక్కని పిన్న
బాలకుం డొక్కండు పవ్వళించు"

మఱిన్నీ యితనికవిత్వ మెంతరసవంతమైనదో తెలుసుకోవాలనేవాళ్ళకి మొట్టమొదట వర్ణించిన "పిల్లలమఱ్ఱి" వర్ణనవల్లనే తెలుస్తుంది. ఆపద్యవర్ణనలో వున్నవిశేషణాలని బట్టి వ్యంగ్యార్థం తీస్తే తనవంశం కర్మిష్ఠ మయిందనిన్నీ, భగవద్భక్తికి ఆలవాలమయిందనిన్నీ అమృతం వంటి కవిత్వం చెప్పఁగలదనిన్నీ, యింకా కొన్ని విశేషాలు కలదనిన్నీ స్ఫురిస్తుంది. యితఁడు కేవలం మూఢభక్తిగా వుపాసన చేసేకవిగాఁడనిన్నీ, మంత్రోపాసనాపరాయణుఁడనిన్నీ యితనిరచన సాక్ష్యమిస్తుంది—

"సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరల్ గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు"

యిదేరీతి ధూర్జటికవిత్వంలోకూడా కొన్ని ఆధారాలు కనడతాయి. యీ "పిల్లలమఱ్ఱి" నన్నయ్యగారివలెనే పనిపడ్డప్పుడు తనసంస్కృతభాషా నిష్ణాతత్వాన్ని కనపఱుస్తూ వుంటాడు. యిందు కెన్నో వుదాహరణాలు కనపడతాయి. కొంచెంగా చూపుతాను—

"మ. తొలిమ్రొక్కుల్ గొనువేల్పుఁ గొల్తు శశభృత్కోటీరకోటీరట
త్కలభూషాంకిత గాత్రుగాత్రిమరనంపుస్తోత్రివేళానిర
ర్గళధారాళకట ప్రధానతటినీరంగద్విరేఫాలికా
వలితాలోలవిచారుఁ జారుహరిభృత్ప్రాలంబు లంబోదరున్."

యిందలి పదముల పొందిక అలా వుండగా వాడిన సంస్కృత సంధులను బట్టి చూస్తే యితఁడు సంస్కృతంలో పరిమితపాండిత్యం మాత్రమే కలవాఁడు కాఁడని స్పష్టపడుతుంది. కొందఱు పరిమితపాండిత్య మాత్రంతో కూడా దీర్ఘసమాసాలు వాడడం కలదు. యింకోవిశేషం, తమకు సంస్కృతంలో పాండిత్యం తక్కువనుకుంటా రని అట్టివారు మఱీ విస్తరించి దీర్ఘసమాసాలు వాడడంకూడా కలదు. కాని ఆసమాసాలు కొన్నివిషయాలలో పట్టిచ్చి తీరతాయి. యీ కవి భక్తుఁడని వ్రాసివున్నాను లీలాశుకుఁడులాగ. యితనిభక్తి కొంత శృంగారభక్తిగా వుంటుంది. శృంగారానికి దగ్గిఱగా వుండే హాస్యరసాన్ని కూడా యితఁడు చక్కఁగా చిత్రిస్తాఁడు—

" మొదల నత్యంతకాముకుఁడ వౌటకు గొల్ల
యిల్లాండ్రి గుబ్బపాలిండ్లు సాక్షి...."

దిఙ్మాత్రంగా యితనిభక్తిమార్గాన్ని చూపడం అయింది. సంస్కృతంలో కావ్యాలను సామాన్యంగా రెండువిధాలుగా విభజించి గద్యలూ అనఁగా, వచనాలూ పద్యాలూ వున్నట్టయితే దానికి — "చంపువు" అని పేరుపెట్టి వున్నారు — "గద్యపద్యాత్మకం కావ్యం చంపూరిత్యభిధీయతే". దీన్ని యెందుకు విడఁదీయ వలసివచ్చిందో కాని తెలుఁగులో అన్నీ యీలాటివే కనపడతాయి. ఎక్కడో శతకాలు వగయిరాలలో అన్నీ పద్యాలే వుంటాయి. యీకాలంలో యీభేదానికి కులభేదాలతో పాటుగా స్వస్తి చెప్పవలసినట్లు కనపడ్డప్పటికీ పూర్వకాలంలో యెంతో ఆవశ్యకత వున్నట్టు కనపడుతుంది. ఆలాగే కాకపోతే లక్షణకర్తలు అంతగా పాటింప వలసి వుండదు. యీభేదం తిక్కన్నగారినాటికూడా బాగా అమల్లోవుంది.

కనకనే ఆయన, "నిర్వచనోత్తరరామాయణ" మంటూ గొప్పగా పేరు పెట్టడం తటస్థించిందనుకుంటాను. యిటీవల "నిర్వచన" విశేషణమే కాకుండా మఱికొన్ని అనఁగా నిరోష్ఠ్య మొదలైన విశేషణాలు చేర్చి కొన్ని పుస్తకాలు రచించి వున్నారు. యీ విశేషణాలతోపాటుగా — "నీరస" అనే విశేషణాన్ని యెవరున్నూ వారివారి పుస్తకాలపేళ్ళలో పెట్టికొని వుండడం తటస్థించదు కాని ఆ విశేషణం పూర్వమున్నూ యిప్పుడున్నూ యికముందున్నూకూడా చాలామంది కవిత్వాలకు దానంతట అదే వచ్చి తీరుతుందని వేఱే వ్రాయ నక్కఱలేదు. ప్రస్తుతం మన "పిల్లలమఱ్ఱి" వ్రాసిన "జైమినిభారతం" చంపువై వుంది. యీచంపూ శబ్దానికి యింతవరకు "చంబూ" అని రూపాంతర మున్నట్టు నాకు తెలియదు. యెక్కడేనా బకారసహితమైన రూపం కనపడ్డప్పటికీ సంస్కృతంలో దిద్ది పాఱవేస్తారుగదా! ప్రాసస్థలం కాకపోతే తెలుఁగులోనూ అంతే దానిగతి. అందుచేతే కాఁబోలు, ఈతఁడు పూర్ణానుస్వారపూర్వక బకారంతో — "శా. జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తంబు" అని పద్యాన్ని ప్రారంభించి నాల్గోచరణంలో — "చంబూకావ్యము చేసెదన్ బుధజనశ్లాఘా నిరాఘాటతన్" అని దిద్దరాని స్థలంలో వాడివున్నాఁడు. అచ్చులో — "చంపూ" అనేవుంది. యెందుచేత? "చంబూ" శబ్దానికి యెక్కడా వుపలబ్ధి లేకపోవడంచేతే అనుకోవాలి. యీరూపాంతరాన్ని వప్పుకోకపోతే, ప—బ—అనే రెండిటికిన్నీ ప్రాసమైత్రి వప్పుకోవలసి వస్తుంది. దానికి యెక్కడా లాక్షణికుల అభ్యనుజ్ఞ వున్నట్లు లేదు. కాఁబట్టి అంతకన్న యీరూపాంతరాన్ని వప్పుకోవడమే యుక్తమని నేను అనుకుంటాను. ఏ నిఘంటులోనేనా వుండేవుఁటుందికూడాను. శబ్దరత్నాకరంలో మాత్రం చంపూశబ్దాన్నే యెత్తుకోనప్పుడు రూపాంతరాన్ని యెత్తుకోవడం యెందుకు తటస్థిస్తుంది? మఱ్ఱి "తలకిందు" అనేదానికి "తల్లకిందు" అనే మఱోరూపాన్ని వ్రాసి — "చక్రములతోఁ, దల్లకిందైన రథవ్రజంబు" అని వుదాహరించి వున్నాఁడు. భారతంలో చాలాచోట్ల ద్విత్వ

రహితంగానే కవిత్రియంవారివి కనపడతాయి. అపిన్నీ కాక, తలక్రింద, అని స్పష్టంగా విడదీసుకుంటే ఆశబ్దం — తల గాని తల్లి కాదని తేలుతూ వుంది. ఇచ్చిన వుదాహరణమో? స్వల్పంలో దిద్దుబాటవుతుంది "తల క్రిందులైన రథవ్రజంబు" అంటే చాలు. క్రిందుకు క్రిందుటు అని బహువచనరూపం నిర్బాధంగా లోకంలో శ్రుతమవుతూవుంది. పైగా "తలక్రిందులై" అని కూడా శ్రుతి కలదు. అయితే "తల్లక్రింద" అనే శ్రుతిమాత్రం లోకంలో లేదా? అని స్థూలదృష్టిని వకశంక రావచ్చును. ఈద్విత్వసహితరూపం గ్రాహ్యంగదా? వచ్చుచున్నాడు, అనడానికి వస్తాడు గ్రాహ్యమని కదా లక్షణజ్ఞులు వ్రాశారు. అది సరియైన వ్రాతా? కాదా? అనే విచారణ యిప్పుడు మనకు వద్దు. ఆ శ్రుతి లోకంలో వున్నంతమాత్రంచేత అది శుద్ధరూపానికి రూపాంతరం అవుతుందా? ఆలాగే యిక్కడకూడా రూపాంతరం అని వ్రాయడం చింత్యం కాక తప్పదు. దీన్నిగూర్చి అన్యత్రి వ్రాయడంచేత యిక్కడ పెంచి వ్రాయలేదు. లోకంలోవుండే ఉపలబ్ధినిబట్టే ప్రయోగించుకొనేటట్టయితే "గట్టిగా చదువు" అనడానికి మరీ ప్రాధాన్యం రావడానికి గట్టిగా అనే పదంలో ఆద్యక్షరానికి ఘకారాదేశం చేసి "ఘట్టిగా చదువు" అని వుచ్చరించడం కలదు. ప్రస్తుతం — "తల్లక్రింద" ఆ తరగతిలోనే చేరుతుంది. బహుశః యిట్టిదాన్ని "పిల్లలమఱ్ఱి" ప్రయోగించునని తోఁచదు. యీ ప్రయోగం వున్నచోటు యెంతో మార్చకుండా దిద్దడానికి వీలవుతూ వుంది. అంతేకాని — "మనుజుల విప్రుండు" అనేచోట — జనులందు — నరులందు — అని దిద్దడం వంటిది కాని "నమ్మి నమ్మక" అనేచోట, మూలార్థమే చెడేలాగ దిద్దడంవంటిదికాని కాదని సహృదయులకు గోచరిస్తుంది. వకవేళ యీతల్లక్రింద ప్రాసస్థానంలో కూడా దొరికేటట్టయితే యద్వా, గణం చెడేచోట — "తల్లక్రిందయిన నేనై యాశ్రయింపంజుమీ" అనేమాదిరిస్థలంలో పూర్వకవిప్రయోగం దొరికేటట్టయితే అప్పుడు దీన్నిగూర్చి ఆలోచించవలసిందే కాని యీలోపున ఆలోచించ వలసింది లేదు.

కనుకనే వావిళ్ళవారి యిటీవలిముద్రిణంలో దిద్దడం జరిగిందనుకుంటాను. యీసీసచరణంలో కాక యింకొక వచనంలో కూడా యీద్విత్వసహిత ప్రయోగం "జైమిని"లో కనపడుతుంది. అది బొత్తిగా బాధింపదు. శ—ర—లో ఇట్టి వింకా కొన్నివున్నాయి. వ్యాఖ్యాతలు సహృదయులుగాని పెద్దపండితులైనచో కవి హృదయానికి దూరంగా వుండే అర్థాలేకాక పద చ్ఛేదాలుకూడా బయలుదేఱతాయి. ఆముక్తమాల్యదలో — "తెలుఁగొకండ" అనేచోట, తెలుఁగొ ? కండ, అని విఱిచి, కండ అంటే పులకండమనే అర్థం చెప్పి ప్రధానార్థమైన "ఒకండ" అనేపదానికి స్వస్తి చెప్పడం యీతరగతికే చేరుతుంది.

తమపాండిత్య ప్రకర్షను చూపుకోవడానికి "రామం దశరథం విద్ధి" అన్నచోట చెప్పినట్లు కవిహృదయం కానివిచెపితే చెప్పవచ్చుఁగాని ప్రధా నార్థాన్ని "తోసిరా" జనడం యుక్తంకాదు. ప్రధానాంశం "పిల్లల మఱ్ఱి" పాండిత్యం నిరంకుశ మన్నది. ఆయన వాడడంచేత తప్పక చంపూశబ్దానికి చంబూశబ్దం యెక్కడో రూపాంతరం వుండి తీరుతుంది అనేదిన్నీ, తలక్రిందుకు తల్లక్రిందు "పిల్లలమఱ్ఱి" వాడి వుండడనే దిన్నీ. పక్షాంతరంచేత అతఁడు వాడేవుంటాఁడనేవారికి అట్టిమహాకవి ప్రయోగాన్నిబట్టి తెలుఁగువ్యాకరణంలో — "తలకుఁ గ్రింద పర మగుచో ద్విత్వము వచ్చును" అని సూత్రమొకటి పుట్టవలసియుంటుంది.

భారత ప్రయోగాలకేకాని యిట్టిగౌరవం లేదంటారా ? "పిల్లల మఱ్ఱి" కవితగాని పాండిత్యంగాని భారతమునకు యద్వాధంగానున్నా తీసిపోయేది కాదని నేను ఋజువు చేస్తాను. యింతప్రసిద్ధుడైన మహా కవిని చిన్నయ్యసూరి బొత్తిగా గణించినట్లే నాకు తోఁచదు. యేమంటే? "క్త్వార్థకంబైన యిత్తునకు సంధి లేదు." అనే సూత్రం పూర్వలక్షణాను సారంగా తానున్నా చేయడం యుక్తమే కాని యీసంధి నిషేధాన్ని పూర్వమహాకవు లెంతవఱకు పాటించారో ? ఆసందర్భం కొంచెం స్పృశించే నా పైకి వెళ్ళవలసింది. "లాకలూకాయల" ప్రయోగాలనైతే లెక్క-

పెట్టకపోవడం చింత్యం కాదు గాని యిట్టి మహాకవి సమాస మేలిమి దింటికి తక్కువగాకుండా ప్రయోగించిన క్త్వార్థకేకార సంధులను (ప్రయోగాలు అన్యత్ర వుదాహరించాను) యెత్తుకోకుండానే విషయాంతరాన్ని వుపక్రమించడం న్యాయంకాదు. యెక్కడాకూడా సూరిగారు యిట్టి విషయాలు చర్చించనే లేదంటారేమో ? ఆమాట సత్యదూరం.

"ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడి" — లోనైనఅక్షరాలు పైవారి వాదధోరణికి ధంజ కాలు. పైఁగా పైవాక్యంవల్ల సూరిగారీ "పిల్లలమఱ్ఱి" కవిత్వం అంత శ్రద్ధగా చదవలేదనికూడా అనుకోవలసి వస్తుంది.

"క. అని చదివి లవుఁడు 'రాఘవ
మనుజేంద్రుని తల్లి వీరమాతఁట ! సీతాజ
ననికుశలవుల నిరువురఁ
గనియు నకట ! గొడ్డువోయెఁగడపట' ననుచున్ "

అనే పద్యంలో వున్న "వీరమాతఁట" అనే తత్సమసంధిని—పయిగా స్త్రీవాచకసంధిని గమనించి వుండాలి. గమనించేవుంటే "ఆధునిక కృతులందు" అనడం తటస్థింపదు. శ్రీనాథునికికూడా కొంచెం వెనకవాఁడేమో అనుకోతగ్గ "పిల్లలమఱ్ఱి" ఆధునికుఁడవుతాఁడా ? శ్రీనాథుఁడు — "నూనూఁగుమీసాల" వయస్సులో వుండేనాఁటికి "పిల్లలమఱ్ఱి" వృద్ధావస్థలో వున్నట్లు వినడం. చరిత్రకారులుమాత్రం శ్రీనాథుడే పెద్దవాడని వ్రాశారు. యేలాగయినా సమకాలీనులే కదా ! అసకృదావృత్తిగా యితఁడు క్త్వార్థకసంధి చేసివుండడంవల్లనే చేమకూరమహాకవి — "ఊరకే యనవల సంటి కాక" అనియు, "అటు చూపిటు నిటు చూపటు" అనియు ప్రయోగించియుండెను. "పిల్లలమఱ్ఱి"కి ఆధారభూతం.

"ఇతఁడు మదీయాగ్రిమునో
హితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగిం చిపుడే"

అను కవిబ్రహ్మగారి యుద్యోగపర్వప్రయోగం. ఆ ప్రయోగాన్ని నిన్న మొన్నటివారు — "నమ్మినమ్మక" ప్రయోగందిద్దినట్లే "ఎఱిఁగించి తగన్" అని దిద్దినట్లు "గుప్తార్థప్రకాశిక" లో వున్నపాఠాంతర ప్రదర్శనంవల్ల స్పష్టపడుతూ వుంది. "చేతురు — కోతురు" అనే ప్రయోగాలు కూడా భారతసమ్మతా లన్నంతవఱకు "గుప్తార్థ" లో వున్న — "కవిబ్రహ్మప్రయోగంబునందు నిదియె కంటంబడినది — మ.... సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టలుకన్." అనే వాక్యంవల్ల విస్పష్టమే. ఈకవిబ్రహ్మప్రయోగాన్నిబట్టి — చేతు రనిన — అని శ్రీనాథుఁడు ప్రయోగించుకొంటే దాన్ని యిటీవలివారు దిద్దివేసినారు. ఆయీ విషయం వకరిచేత కొంత 1937 జనవరి, ఫిబ్రవరి మాసముల పరిషత్పత్రికలలోఁ గొండొక విచారింపఁబడి వుంది. మహాకవి ప్రయోగాధారమే ప్రధానంగా వున్న యీ తెలుఁగుకవిత్వానికి ఆదర్శభూతు లైనవారి ప్రయోగాలు దిద్దిపాడుచేస్తే యేంచేయాలి ? కవిబ్రహ్మగారిప్రయోగంజోలికైతే రాలేదు గాని శ్రీనాథప్రయోగం మఱోప్రతిలో మఱోలాగు దొరికిందంటూ వ్రాశారు. యీ "చేతురు — కోతురు" ప్రయోగాలనుగూర్చి అన్యత్ర వ్రాసి వున్నాను. దానితోపాటుగా "నమ్మినమ్మక" ప్రయోగాన్ని కవిబ్రహ్మదాన్ని చూచి శ్రీనాథధూర్జట్యాదులు ప్రయోగించుకోవడమే కాకుండా యీ "పిల్లలమఱ్ఱి" కూడా — "చ. నియమిత దుందుభిధ్వని వినీవినమిన్ బురిలోని" అని ప్రయోగించుకొని వున్నాఁడు. యిచ్చట "వినిన్వినని" అని కొందఱు. దానిలో వచ్చినలాభం అంతగా వారికి కనపడదు. యీకవులెట్టి విజ్ఞులో ? వీరికవిత్వం యెట్టిదో ? పరిశీలించకుండా "బుడబుక్కల" పదంతో కొందఱినిన్నీ, మఱియొకరీతిగా కొందఱినిన్నీ అపవదించడం మిక్కిలీ శోచ్యంగా కనపడుతుంది. "లేఖకప్రమాదపదంతో" "తోసిరా" జనడం కొంతసుళువే కాని యెనిమిదేసిచోట్ల, పదేసిచోట్ల వాడినవాట్లగతేమిటి ? ఆయీ ప్రయోగాలు ఆక్షేపించేవా రేమేనా పరిశీలించే వోపిక కలవారేమో ? అనకుంటే అదిన్నీ కనపడదు. వక్క "నడిపించు" అనేది

లేదన్నందుకు వెదికితే ఆక్షేపకులవే 34 ప్రయోగాలు దొరికివున్నాయికదా! యింకా కొన్ని వారివే దొరకడానికి సందేహంలేదు. దీనిమీఁద జవాబు చెప్పేది యేమిన్నీ తోఁచక వారు — "నేను తప్పుగా ప్రయోగించాను. కొద్దిరోజుల్లో వాట్లని దిద్దుకుంటాను" అంటూ వక "వక్రః పంథాః" మార్గం దిగేటప్పటికి కవిత్రియభారతం 18 పర్వాలు తిరగేస్తే స్థూలదృష్టిని యిప్పటికి దాదాపు 30 "నడిపించులు" కనపడ్డాయి. యితర కవులవెన్ని వున్నాయో లెక్కలేదు. అట్టే ఆలోచిస్తే యీ ఆంధ్రకవిత్వాన్ని చెప్పడమే తప్పని తోస్తుంది. దీనికి ప్రతివ్యక్తిన్నీ దిగడంచేత యెవరికోగాని పాండిత్యం తగ్గంత ఉండదు. వుండకపోయినా ఉన్నంత జ్ఞానంతోనే పూర్వపక్ష సిద్ధాంతాలకు దిగుతూవుంటారు. కాస్త మానాభిమానాలు వుండి కవిత్వం చెప్పుకొనేవాళ్లకు వ్యర్థమైన ఆక్షేపణలకు సహించడం "చచ్చినచావు" గా వుంటుంది. దానితో ఎందుకూ కొఱగాని వప్పు చేయవలసి వస్తుంది. దాన్నిచూచి ప్రాజ్ఞులు సర్వసామాన్యంగా తెలిసే విషయాలక్కూడా పరిశ్రమచేసి యింతవ్రాయడమెందు? కని అనుకుంటారు. ఆ యీ విషయం యెఱిఁగినిన్నీ యిందులో కొన్ని సంగతులేనా అపూర్వాలు వుండక పోవని యీపరిశ్రమ చేయడం. తెనాలిరామలింగమున్నూ, అంతకంటే ప్రాచీనులున్నూ తాపసి అనే పదాన్ని పురుషవాచకంగా వాడివున్నారు. అది స్త్రీవాచకమే కాని పురుషవాచకము కాదనుకొని వకరు కొన్నాళ్లక్రిందట వెక్కిరించడం జరిగింది. సమర్థనం చూపడమున్నూ జరిగింది. మళ్లా యీమధ్య ఆప్రయోగానికి, లంకలో అగ్నిపరిశుద్ధిని పొందిన సీతకు మళ్లా ఆక్షేపణ తటస్థమయినట్లే అయి సమర్థించడంకూడా జరిగింది. నిన్న నేఁడు ఆంధ్రభాషా పరిషత్పత్రిక చదువుతూవుంటే "అతఁడేడ తాపసి యనెడి వారు" అనే పుంవాచక ప్రయోగం సీసంలో ఋష్యశృంగుణ్ణి వుద్దేశించి వాడింది రఘునాథ రామాయణంలో కనపడింది. బహుశః యీరఘునాథుఁడు తంజావూరు ప్రభువని తోస్తుంది. యీ మహాకవి పూర్వకవిప్రయోగానుసారం ప్రయో

గించివుంటాఁడు. దిద్దితే దిద్దఁబడకపోదు. తాపసుఁ డనెడువారు అంటే సరిపోతుంది. ప్రతీదీ దిద్దడమనేనా ? అని నాప్రశ్న. మనకు సంశయం కలగడమేనా పూర్వప్రయోగాలు దిద్దడానికి కారణం ? యింకా యేమేనా వుండాలా ? అయితే తపశ్శబ్దమ్మీఁద తద్ధితప్రత్యయం వచ్చి "తాపసః" అని అయిందికదా ! దీనికి తెలుఁగులో "తాపసుఁడు" అని కాక — "తాపసి" అనే రూపం యేలా అవుతుంది ? అనేశంక లేకపో లేదు. ప్రధానుఁడు (మంత్రి) యిది తత్సమరూపంకదా ! దీనికి యింత కన్నా ప్రాచుర్యంగా "ప్రధాని" అనే ప్రయోగం తత్సమంలోనే మహాకవి ప్రయుక్తమై వుంది. యేలా వచ్చిందంటే ముందు వ్యవహారంలో వుందనిన్నీ, తరవాత మహాకవి ప్రయోగారూఢ మవడంవల్ల "శంఖునఁ బోసినతీర్థ" మయిందనిన్నీ జవాబు. "పులిమీఁద పుట్ట" అన్నట్టు, యీమధ్య అమరవ్యాఖ్యానం చూస్తూవుంటే — ప్రధానశబ్దం నిత్యనపుంస కంగా తేలింది. విశేష్యనిఘ్నంగా "చెలామణీ" అయేదికదా ! యిది. దీన్నిగుఱించి గ్రంథాంతరాలు చూస్తేనేకాని తేల దనుకున్నాను, చూచాను తేలింది. దాన్ని మఱొకచోట వ్రాస్తాను. ప్రతీదీ యీలా పరిశీలించవల సిందే. అంతే కాని "దుడుంగుమంటే బెడ్డ వేయడానికి" వీలులేదు. వేస్తామో ? చిక్కు రాక మానదు. ఆచిక్కులోన్నుంచి బయటపడడం కష్ట సాధ్యం. హనుమద్రామాయణంలోని శ్లోకాలలో కొంత కొంతభాగం అక్క డక్కడ దొరకడమున్నూ తక్కినదాన్ని యితరకవులు తోఁచినట్లు పూర్తి చేయడమున్నూ మళ్ళాకొన్నాళ్ళకు అసలుపాఠమే దొరకడం వగయిరాల కథలవల్ల మన కేంతేలుతుంది ? ప్రతీదానికీ నిదానమైన పరిశీలన ఆవశ్యక మని తేలుతుంది. అట్టి పరిశీలనతో వ్రాఁసేవ్రాఁతలలోకూడా వకప్పుడు అపసిద్ధాంతాలు బయలుదేఱడం అనుభవసిద్ధం. అట్లేకాకపోతే, పాణిని సూత్రాలలో సవరణలవంటివిగా వుండేవార్తికా లేమిటి ? యీ సూత్ర వార్తికాల మీఁద సవరణమాదిరిగావుండే సర్వస్వతంత్రమైన భాష్యమే మిటి ? అట్టి సర్వస్వతంత్రుణ్ణి యేమీఅనడానికి మార్గంలేక యెక్కడేనా

భాష్యకర్త తోఁచిన అసంగతంగా వున్నట్టుతోస్తే దాన్ని "పూర్వపక్ష భాష్యం" అంటూ అపవదించి మర్యాద కాపాడడం యేమిటి? యిప్పన్ని పరిశీలించినకొద్దీ విశేషాలు బయలుదేఱుతూ వుంటాయన్నమాట ఉపోద్ఘాతకాలే. యీ కష్టసుఖాలేమీ ఆలోచించక "ఏకదేశ మప్యేయానః" అని మహాభాష్యకర్త అన్నట్లు దేన్నో కాస్త చదివి "అవితప్పు యిది తప్పు" అంటే యేంలాభం? ప్రసక్తానుప్రసక్తంగా చాలావ్రాశాను. ప్రస్తుతం మనంమాట్లాడుకోవడం "పిల్లలమఱ్ఱి" వారిని గూర్చి. ఆయన కవిత్వంలో వున్న ప్రయోగాలను, "అవునూ కాదూ" అనడానికి మొదలు పెట్టేటప్పుడు ఆయన పాండిత్యం యెట్టిది? మనపాండిత్యం యెట్టిది? అని ముందు చూచుకొని వ్రాఁతకు దిగాలి. యీ వ్యాసంలో ముఖ్యంగా నేను పైవిషయాన్ని యెంతవఱకు నిర్వహిస్తూ వున్నానో చదువరులను గమనింపఁగోరుతాను. నిన్న మొన్న "తిక్కనగారి నైపుణ్యం" అనే వ్యాసంలో యతిస్థానంలో వున్న "అక్షోహిణీ" శబ్దాన్నిగూర్చి పరిష్కర్తలతో పాటుగా నేనుకూడా సమర్థనీయం కాదన్నట్టుగా వ్రాసివున్నాను. మళ్ళా చిరంజీవులకు పాఠం చెపుతూవుంటే తత్త్వబోధినిలో దాని సమర్థనానికికూడా మార్గం కనపడింది. ఆసమర్థనాన్ని గూర్చి వ్రాస్తే గ్రంథం పెరుగుతుంది. కావలసినవారు "అక్షోదూహిన్యాం" అన్నచోట పరిశీలింపఁ గలరు. ఊహినీశబ్దంతో సమాసం కలిపితేనే, "అక్షౌహిణీ" అని వృద్ధిఘటితరూపం అవుతుందిగాని "ఊహిన్" అనుదానితో అక్షశబ్దానికి మొట్ట మొదట సమాసంచేసి పిమ్మట, నాంతత్వాత్తు జీపు చేసుకుంటే అక్షోహిణీ అని గుణయుక్తరూపమే అవుతుందని తత్త్వబోధినీ తాత్పర్యం. అయితే కౌముదీవ్యాఖ్యానం తత్త్వబోధినిగదా! తిక్కన్నగారినాఁటికి కౌముదే పుట్టలేదు. అట్టిస్థితిలో తత్త్వబోధిని పుట్టివుండదని చెప్పనక్కఱ లేదుగదా! ఈ రహస్యం తిక్కన్నగారి కెట్లు గోచరించింది? అని కొందఱు శంకిస్తారు. యీశంక బొత్తిగా అనాలోచితం. ఆయీవ్యాఖ్యాన గ్రంథాలే కాదు, మూలగ్రంథాలే కాదు, సూత్రగ్రంథాలేకాదు, పురాణాలే

కాదు యేవీకూడా వారివారి స్వకపోల కల్పితాలు కావు. ప్రతీదానికిన్నీ అంతకు పూర్వం వ్రాసిపెట్టిన ఆధారాలు వుంటూనే వుంటాయి. భగవద్గీతక్కూడా సూతసంహితలో ఆధారం కనపడుతూవుంది. తుదకి వేదానిక్కూడా మరోవేదంలో ఆధారం వుండే తీరుతుంది. యిప్పటి విమర్శకుల వలె సాహసించలేక మనపూర్వులు వేదాదులకు కాలనిర్ణయం చేయక అనాదివిగా నిర్వచించి వున్నారు. సృష్టినిగూర్చికూడా యింతే. "ధాతా యథా పూర్వ మకల్పయత్" అన్నదే తుట్టతుదకు నిల్చే సిద్ధాంతం. తిక్కన్నగారినాఁటికి తత్త్వబోధిని లేకపోయినా దానితాతబోధిని మరొకటి వుండి వుంటుంది. దానిలోవున్న యీవిశేషాన్ని తిక్కన్నగా రెఱిఁగుండడంచేత యతిస్థానంలో ప్రయోగించి తన వ్యాకరణపాండిత్యరహస్యజ్ఞత్వాన్ని వెల్లడించి వున్నారు. నేఁటిసంస్కర్తలుకూడా చాలా సంగతులు తెలిసినవారే అయినప్పటికీ తిక్కన్నగారి కున్నంతజ్ఞానం లేకో యేమో ఆ విషయంలో తమ సందేహాన్ని సూచించారు. అంతేనే కాని పాపం! ఖండితంగా తప్పని మాత్రం అనలేదు; దిద్దడానికి వీలులేక దిద్దనూలేదు. వీరితోపాటుగా నేనున్నూ "ఖసూచిత్వా" న్నే మొట్టమొదట అవలంభించాను. అంతట్లో భగవంతుఁడు సత్యాన్ని తెల్పి అనుగ్రహించాఁడు. యిట్లాగే యెన్నో విషయాలు చిరకాలపరిశీలనాసాధ్యాలు కనపడతాయి. అందుచేత తొందరపడి దిద్దడం "అవిమృశ్యకారిత్వం" అనుకోక తప్పదు. తిక్కన్నగారిదే వకప్రయోగం యతిస్థానంలో "వ్యయం" అనడానికి బదులు కొందఱు లోకంలో వాడుకుంటూవుండే "వ్రయం" అనేది పడ్డది. సంస్కర్తలు అసలుపాఠంవుంచి దిద్దుఁబాటునుకూడా కనపఱిచి వున్నారు. యీ "వ్రయం" కూడా సాధించడానికి ఆధారమేమేనా వుందేమో? వైయాకరణులు పరిశీలింపఁ బ్రార్థితులు. గిడుగువారు దీన్నిగుఱించి యేదో సమర్థనం చెపుతారుగాని అది వైయాకరణు లొప్పేదికాదు. వైయాకరణులు నిరాధారమనేయెడల తిక్కన్నగారు లోకవ్యవహారాన్ని కూడా మన్నించి యతిస్థానంలో యీ పదాన్ని ఉగించా రనుకొంటేకూడా అనుకోవచ్చును. యేమం

టూరా? కేవల సంస్కృతభాషలో విశారాద్యర్థాలయందువిధించిన "మయ ప్రత్యయాన్ని" తెలుఁగులో తన, మెదడుపోఁవులు అనేకర్థాలమీఁద వాడడానికి లోకంకంటె అన్యాధార మేఁ కనపడుతుంది? సంస్కృతకవిత్వానికే "వ్యవహారతశ్చ" అని శాబ్దబోధోపకరణములలో చేర్చినప్పుడు వ్యావహారికంగా ఉండే తెలుఁగుకవిత్వానికి ఆ మాట యెంతవఱకు అనువర్తిస్తుందో సహృదయులకు తెలియకుండా ఉంటుందా? విషయం యిలావుండఁగా "శోభన" పదం గర్భాధానార్థమందు ప్రయోగించడాన్ని వెక్కిరించడం అనాలోచనపనికాదా? ఆ పదం నిర్దుష్టం కూడాను. నూటికి తొంభై వాక్యాలు సమన్వయించుకోవడంలో క్రియాకారకసంబంధం లోకాన్ని పట్టే కుదుర్చుకోవలసి వుంటుంది అని అన్యత్రి వ్రాశాను. అనుభూతమైన విషయం ఒకటి యిక్కడ వుటంకిస్తాను. శ్రీ గిడుగుపంతులుగారు సుమారు ముప్పదియేండ్లనాఁడు బందరుకు దయచేసినప్పుడు గ్రాంథికభాషా కవులుకూడా గ్రామ్యాన్ని వాడి వున్నారని పెద్దజాబితా తయారుచేసి పలువురతోపాటు నాకున్నూ చూపివున్నారు. ఆ జాబితాలో కొన్ని వారనుకొన్నట్లే గ్రామ్యాలే అని నేనున్నూ వొప్పుకొంటూ శ్రీ కం. వీ. లింగం పంతులవారి "తిప్పకేసి వెళ్లెను" అనే ప్రయోగాన్ని గ్రామ్యం కాదన్నాను. యేమంటే? "తిప్పకున్—ఏసి—వెళ్లెను" ఈశబ్దత్రితయంలో వక్కటీకూడా గ్రామ్యం లేదు గదా! పంతులవారితాత్పర్యం తిప్ప కేసి అంటే తిప్పవైపునకు అని. అప్పుడుకూడా గ్రామ్యత్వశంక కనపడదు గాని వారు స్థూలదృష్టిని అస్థలం రిమార్కు చేసివుంటారు. గ్రామ్యమన్నప్పుడు వ్యాకరణదోషాన్ని చూపించవలసి వుంటుంది. ఆయీ విషయం "జయంతి" లోనున్నూ, పాశుపతాదుల లోనున్నూ, యింకా అన్యత్రానున్నూ నేను విస్తరించి వున్నాను. ప్రస్తుతవాక్యంలో సమన్వయం చూపుతాను.

తిప్పకున్—తిప్పకు; ఏసి—వేసి—దేనిని? అని శంకరాఁగా, చూపును అని అధ్యాహారం అవుతుంది. కాఁబట్టి "తిప్పవైపునకు దృష్టిని పెట్టుకొని

వెళ్లైను." అని సమన్వయం అవుతుంది అంటే పంతులవారు సంతోషించారు. ఇతరగ్రాంథికకవులతోపాటు నేను గిడుగుపంతులవారికి ప్రతిపక్ష కోటిలో వాణ్ణయినా వారితోఁగాని తదనుయాయులతోఁగాని నాకు ద్వేషం లేదు. వ్యావహారిక భాషలో వ్యాసాలు వ్రాసేవా రందఱున్నూ నరకానికి వెడతారని నే నెక్కడా వ్రాయలేదు. నాకట్టి నమ్మకమున్నూలేదు. అలా వెళ్లేటట్టయితే మహావిద్వాంసు లందఱికిన్నీ, అందులో యజ్ఞయాగాలు చేసి స్వర్గానికి మెట్లు కట్టించుకొనివున్న శుద్ధచ్ఛాందసు లందఱికీనిన్నీ నరకమే శరణ్యం కావలసి వస్తుంది. యేమంటే ? యితర లోకులు వాడే వ్యావహారికంకన్నా వారు, అనఁగా అశ్రోత్రియులు వాడే వ్యావహారికం మఱీ అధ్వాన్నంగా వుంటుంది——

"శా. ఆస్సే చూస్సివషే? వొషే చెముడషే అష్లాగషే యేమిషే ?
విస్సావఝ్ఝలవారి బుఝ్జీ నష ! యూవిస్సాయి కిస్సారుషే !
విస్సం డెంతటివాఁడె ? యేళ్లు పదిషే ! విన్నావషే మంచివ
ర్చస్సే ! యందురు శ్రోత్రియోత్తమపదస్త్రీ లాంధ్రదేశమ్మునన్ "

( దాసు శ్రీరాములుగారి వీథి )

యీలా మాట్లాడేవారిభాషకన్న గ్రామ్య మంటూ మఱోటి వుండదు కాబట్టిన్నీ వీరివంటివారికి యింతమాత్రంచేత నరకం రావడానికి నాకేకాక యెవరికీకూడా యిష్టం వుండదు కాఁబట్టిన్నీ ఆ అమాయికపు వ్రాఁతలకి నేను బొత్తిగా సమ్మతించేది లేదు. యింకా పరిశుద్ధప్రయోగాలు అపప్రయోగా లనిన్నీ దుర్వ్యంగ్యం లేని పద్యాలలో లోకవంచనాతాత్పర్యంతో దుర్వ్యంగ్యం వుందనిన్నీ వ్రాసేవారి విషయంలో అట్టిదోషం వుందని యెవరేనా వ్రాస్తే నేను దాన్ని శిరసావహిస్తాను. విషయం విషయాంతరంలోకి వెళ్ళింది.



# గిడుగా? పిడుగా?

( 15—5—1937 సం॥ర కృష్ణాపత్రిక నుంచి )

"గిడుగు గాదిది పిల్లలపిడుగు గాని" అని పెద్దపెద్ద విమర్శకు లందఱూ శంకరగిరిమన్యా లట్టుకొని పాఱిపోయే ప్రోక్షాశాలి వక మహా నీయుణ్ణిఁగూర్చి నాలుగుమాటలు వ్రాస్తాను. చక్కని విమర్శకులు యింగ్లీషు వారిలో వున్నారంటూ వినడమేకాని దాన్ని తెలుసుకోవడానికి ఆభాష బొత్తిగా రానివాడను కావడంచేత నాకధికారం లేదుకదా? యిఁక అంతో యింతో వచ్చిన భాషలు సంస్కృతాంధ్రాలు. పుట్టి బుద్ధి వచ్చింది మొదలు ఆభాషాద్వయంలోనున్నూ కొందఱిని కొందఱు విమర్శిస్తూనే వున్నారు, చూస్తూనే వున్నాను. కొన్నిటిని గ్రంథకర్తప్రమాదాలను చూపినా చాలా భాగం విమర్శకులు స్వంతప్రమాదాలు ప్రకటించుకొన్నట్టే కనపడుతుంది. వ్యక్తిదూషణనుగూర్చి చెప్పనే అక్కఱలేదు. ఆయావిమర్శకులు లోకోప కారార్థం విమర్శన కారంభించినట్లు కొన్నిమాటలు వ్రాసి ప్రధానాంశంలో కైతే దిగుతారు కాని, అసలువారికి ముఖ్యప్రయోజనం గ్రంథకర్తను దూషించడమే కాని గ్రంథవిమర్శనం కానేకాదని ప్రమాణం చేసి చెప్ప వచ్చును. యీవిమర్శకులలో చాలామందికి శాస్త్రజన్యజ్ఞానం వుండదు. వుండకపోయినా యెందఱినో అట్టిజ్ఞానం కలవాళ్ళని విమర్శించడం కలదు. అది చూచి దానితత్త్వం తెలుసుకునేవారు అరుదుగా వుండడంచేత — "ఫలానావారు విమర్శించి చాలా తప్పులు పట్టి వోడించా" రంటూ చెప్పు కోవడమే తటస్థిస్తూ వుంటుంది. విమర్శకులసారం యెఱిఁగినవాడవడం చేత వారితో మనకెందుకని గ్రంథకర్త జవాబివ్వక వూరుకుంటేనో? యిఁక చెప్పేదేమిటి? యీలా వుంది యిప్పటిప్రపంచకం. యాభై అఱవై యేళ్ళనుంచి యీలాగేవుంది యీ విమర్శనాలకర్మం. ఆయావిమర్శనాలలో వుండే వేళాకోళపుమాటలు పుచ్చుకొని జాబితా వ్రాయవలసివస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. ఆమాటలవల్లనే వ్యక్తిగతద్వేషం వున్నట్టు స్పష్టపడు తుంది, విమర్శనమాట యేలా వున్నాసరే! చాలా గ్రంథం వ్రాసినటు

కొన్నాళ్ళకు జనసామాన్యానికి వ్యక్తం అవుతుంది. అంతేనేకాని ఆపని యేలావుందని విచారించే వ్యక్తులు తక్కువ. విమర్శనాలగతి యీలా వుంది. యిఁక కవిత్వాలు యేవో అవియివీ కానివీ వ్రాయడం, వాట్లని చూచేవారెవరూలేకపోవడం, దానితో విసుగు రావడం, అప్పుడేదీ వుపాయం తోఁచక యిదివఱలో శ్లోకాలుగావుండేదాన్ని పద్యాలుగానో పద్యాలుగా వుండేదాన్ని శ్లోకాలుగానో లేకపోతే వచనంగానో వ్రాయడానికి మొదలెట్టడం ఆగ్రంథం అదివఱకే అట్టి మార్పులు పొంది వుండడంచేత యెవరో దానికీ దీనికీ తారతమ్యం వుందంటూ మొదలెట్టడం, ఆలా అనడమేమి అని వారిని తిట్టడానికి వుపక్రమించడం, యీలావుంది రచన అవస్థ. యేలా వుంటేయేమి యింత గ్రంథం వ్రాయడం కష్టంగాదా అనేది తుట్టతుదకి తేలేపర్యవసానం. కవిత్వానికి ప్రధానమయిందేదో అట్టి రసాన్నిగూర్చిన చర్చకు అవకాశం లేనేలేదు. యెవడేనా ఆ ప్రసక్తితెస్తే వినే దెవరు? అందుచేత — "నలుగురితోపాటు నారాయణ కులంతోపాటు గోవిందా" అని వీఁడుకూడా నలుగురితో యేకీభవించి "జే, జే" అంటూ తాళం వేయడమే సర్వత్రా జరుగుతూ వుంది.

గ్రంథరచనలనుగూర్చి మఱొకప్పుడు మాట్లాడుకుందాం. యిప్పుడు విమర్శనలే పుచ్చుకుందాం. విమర్శింపఁబడేవారు గాని విమర్శించేవారు గాని బొత్తిగా తెలియనివారెవ్వరున్నూ కారు. కాని విమర్శకులు గ్రంథకర్తలనుమాత్రం యేమీ తెలియనిమూర్ఖులనుగా అపలపించడం సహజమైపోయింది. యీలాగే కాలం జరుగుతూవుంది. ఆయాగ్రంథకర్తలున్నూ విమర్శకులున్నూ వున్నకాలంలోనే శ్రీయుతులు గిడుగు రామమూర్తి పంతులుగారొకరుకూడా బయలుదేరివున్నారు. వీరికివున్న విమర్శనాజ్ఞానం యింతా అంతా అని చెప్పడానికి నాతరం కాదు. యీయన యింగ్లీషులో బి. ఏ. తెలుఁగులో యేపండితులున్నూ యీయనకు చాలరు. సంస్కృతంలో యీయన వ్రాసేవిషయంచూస్తే దానిలో యెంతపాండిత్యం వుఁదో తెలుసుకోవడానికి శక్యంకాదు. యింకా ఆయీభాషలతో సంబంధం

వున్నవీ సంబంధం లేనివీకూడా యీయనకు హృత్కవిలి. అట్టి యీసర్వ
జ్ఞునకు వ్యావహారికభాషలోనే గ్రంధాలు కవులు రచించాలి గాని గ్రాంథిక
భాషలో రచించడం పనికిరాదనే పట్టుదల పూర్తిగా వుంది. అది నెగ్గు
తుందో నెగ్గదో చెప్పలేనుగాని, ఆయనకుమాత్రం కొన్నాళ్ళల్లో తన
సంకల్పం నెరవేరుతుందనే నమ్మకంమాత్రం పూర్తిగా వుంది. ఆ సంకల్పా
న్నుంచి ఆయన్ని మాత్రం బ్రహ్మదేవుడుకూడా తిప్పనేలేడు. ఆయనకి
వయస్సిప్పుడు యెనభై యోపడిలో నడుస్తూవుంది. యిప్పుడున్నూ ఆయన
చేసేకృషి దానికోసమే. జీవితమంతా ఆ మహనీయుడు ఆ యీ కృషికే
ధారపోయడం లోక మెరిగిందే. వెనక యెవరో వక బ్రాహ్మడు మంచి
ముత్యాలు వుసిరి కాయలంతవేసి యెవరికో సప్లయిచేస్తానని మాట యిచ్చి
నట్టున్నూ, దానికోసం దోసిలితో సముద్రం తోడడానికి ఆరంభించి
నట్టున్నూ, ఆలా కొన్నాళ్లు జరిగాక సముద్రుడికేమో ఆయనమీఁద దయ
వచ్చి వృద్ధబ్రాహ్మణరూపంతో ప్రత్యక్షమై "ఏమిటయ్యా బ్రాహ్మఁడా
చేస్తూన్నావు" అని ప్రశ్నించినట్టున్నూ, దాని కాబ్రాహ్మఁడు తన వుద్య
మాన్ని స్పష్టంగా చెప్పినట్టున్నూ, దానిమీఁద సముద్రుఁడు "యిన్నాళ్ళ
నుంచి తోడుతూన్నావుగదా? సముద్రం యేమాత్రం తరిగిం" దని
అడిగినట్లున్నూ, చాలా భాగం తగ్గిందని ఆబ్రాహ్మఁడు జవాబు చెప్పిన
ట్లున్నూ, ఆమాట విని ఆబ్రాహ్మఁడి మనోనిశ్చయానికి సముద్రుఁడు
చాలా సంతోషించి తన నిజస్థితిని చెప్పి నీ కెన్నిముత్యాలు కావాలో
అన్నిటినిన్నీ నేనే సముద్రుణ్ణి యిస్తూవున్నానని చెప్పి యిచ్చినట్టున్నూ
"యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః" అనేశ్లోకపదానికి
సంబంధించింది చెప్పుకుంటూ వుంటారు. ప్రస్తుతం గిడుగుపంతులు గారి
వుద్యమంకూడా ఆలాగే కనపడుతుంది.

అయితే ప్రస్తుతం వ్రాసేవిషయం శ్రీపంతులవారి వ్యావహారిక
భాషోద్యమాన్నిగూర్చి లేశమున్నూ కాదు. వారికి వున్న గ్రాంధికభాషా
పరినిష్ఠితత్వాన్ని గూర్చియ్యేవే. నన్నయ్యభట్టు మొదలుకొని నేఁటివర

కున్నూ బయలుదేఱిన భాషానుశాసకులలో యెవరికిఁగాని గిడుగుపంతులు గారికి తెలిసినన్ని మహాకవి ప్రయోగవిశేషాలు తెలియవని యేప్రమాణం పడితే ఆ ప్రమాణం చేయడానికి జంకను. యిదివఱలో నాకు వీరిని గుఱించి వ్యావహారికభాషాభిమానులనిన్నీ తగుమాత్రం గ్రాంథికంకూడా తెలిసినవారనిన్నీమాత్రమే అభిప్రాయం వుండేది. వారి వుపన్యాసాలుకాని అచ్చైన వారిగ్రంథాలు కాని నే నేవిన్నీ యెఱగను. యెఱక్కపోయినా గ్రాంథికాంధ్రం చేతకాక వ్యావహారికాంధ్రంలో దిగినబాపతని మాత్రం అనుకున్నవాణ్ణి కాను. సుమారు ముప్పైయేళ్లకు పూర్వం వీరు బందరు దయచేసినప్పుడు నన్ను కలుసుకుని కొంచెం ప్రయోగాలవిషయమైన ప్రస్తావన చేశారు. ఏవో నాలుగు మాటలు నాకు తోఁచినవి వ్యతిరేకంగానే మాట్లాడినట్లు జ్ఞాపకం. ఆ మాటలు బహుశః పంతులవారి రికార్డులో వుండే వుంటాయి. వారి రికార్డు చిత్రరేఖాపటంకదా ? యిటీవల మాతిరుపతిశాస్త్రుల్లున్నూ వారున్నూ కలుసుకున్నారు గాని నే నెప్పుడున్నూ వారిని కలుసుకోనేలేదు. ఇలావుండఁగా గతించిన సంవత్సరంలో అనఁగా 1936 సం॥లో ఆగష్టులో కాఁబోలును నెల్లూరులో దీపాల పిచ్చయ్యశాస్త్రుల్లుగారు శ్రీ పంతులవారి దంటూ వకపుస్తకం యిచ్చారు. దానిని నేను విప్పనేలేదు. మా రెండో చిరంజీవి దుర్గయ్యమాత్రం దాన్ని దాఁచాఁడు. శ్రీపంతులవారు రాజమండ్రి మకాంగా ప్రవేశించిన తరువాత చాలాసార్లు నన్ను కలుసుకొనే కోరికతో వారు ప్రసంగించినట్లు కొందఱు ఆప్తులవల్లనైతే విన్నానుగాని అసమర్థస్థితిలో వుండడంచేత నైతేనేమి, వారికిన్నీ మనకున్నూ చుక్కెదురుగా వుంటుందనే కారణంచేత నైతేనేమి, శ్రీవారిని నేను కలుసుకోనేలేదు. పంతులవారివాదం "పిడివాద" మ్మాత్రం కాదని యెఱుఁగుదును. యేలా తెలుసు కున్నావంటారేమో ? "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" ఇంతకన్న నాకు నిన్నమొన్నటివఱకున్నూ పంతులవారి స్వరూప స్వభావాలనుగూర్చి లేశమున్నూ తెలియదు. సుమారు నాలుగేండ్లనాఁడు జరిగిన నా "షష్టి పూర్తి" సందర్భంలో

పడుగురితోపాటు పంతులవారున్నూ వారికి తోఁచినమాటలు నన్నుఁగూర్చి వ్రాసి వున్నారు కాని అందులో వారు నాకిచ్చిన స్థానాన్నిగూర్చి నేను అంతగా వుప్పొంగలేదు. "కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా" అని మెత్తుకొని శ్రీ పంతులవారు నన్నుఁగూర్చి వ్రాసిన అతిశయోక్తిని నేను ఆశీర్వచనం గానే జమకట్టుకున్నాను, అంతేనేకాని అప్పుడున్నూ నేను వారివిమర్శ నలు వగైరాలు ఒక అక్షరంకూడా చదవనేలేదు. అప్పుడు నేను మరీ వోపికతగ్గివున్న రోజులు.

సుమారు నెలరోజులనాఁడు శ్రీపంతులవారికి శిష్యతాసంబంధం వున్న వకరిజిస్ట్రారుగారు చిత్తూరునుంచి శ్రీ పంతులవారిదర్శనానికి వచ్చి రాజమండ్రీనుంచి నన్నుకూడా చూడడానికంటూ వచ్చారు. వారితో పంతులవారు యెంతో ప్రీతిగా కబురు చేశారు, వకసారి రాజమండ్రీలో వున్న తమరిని కలిసికోవలసిందని, లేదా తామే వస్తామని, యీలోగా తమ శరణ్యగ్రంథం చూడవలసిందని. యీ మాటిలోనున్నూ మొదటిపనినే నేను ఆ రిజిస్ట్రారుగారిప్రేరణచేత చేయఁగలిగాను. ఆపూట పంతులవారిం ట్లోనే ఆఁగాను. పలకమీఁదవ్రాస్తూ యేవో కొన్నిమాటలు పరిమితిగా మాటలాడడం తటస్థించింది. తిరుపతిశాస్త్రి అతనిజీవితకాలంలో శ్రీపంతుల వారికి యేదో వాగ్దానంచేసినట్టున్నూ దాన్ని నేను నెఱవేర్చవలసివున్న ట్టున్నూకూడా శ్రీ పంతులవారు ప్రసక్తానుప్రసక్తంగా ప్రసంగించారు. ఆ వాగ్దానాన్నికూర్చి యిప్పటికిన్నీ నాకు బాగా తెలియదు. బహుశః భాషా విషయకమే అయివుంటుం దనుకుంటాను. అలవాటున్నవారికిఁగాని శ్రీపం తులవారితో ప్రసంగించి వారి అభిప్రాయాన్ని గ్రహించడం సులభ సాధ్యం కాదుగదా? మరునాఁడుకూడా శ్రీ సోమెనవారింట నేనుండఁగా పంతులవారు దయచేసినారు. నా "జయంతి" ని గతదినం చూడఁగా మిగి లినదాన్ని నేను భోంచేసివచ్చేలోపున చూస్తూ కూర్చున్నారు. అందులో వకపద్యంలో నేను పంతులుగారు వాకు "విపక్షు" లని వ్రాసినందుకు నొచ్చుకున్నారు. దానికి సమాధానం యేదో తోచింది మనవిచేశాను— అంతే. అంతటితో మా ప్రసంగం ముగిసింది. యీమధ్య నా "జయంతి"

శ్రీపంతులవారివద్దకు అభిప్రాయార్థం వచ్చినట్లు చూచినవారెవరో చెప్పఁగా విన్నాను. నేను పంపనిదీ యేలా వెళ్ళిందని సంశయించాను. నే నెవరికిన్నీ అభిప్రాయార్థం పుస్తకాలుపంపే ఆచారంలేదు. యీసంగతి జగద్విదితం. అయితే కృష్ణాపత్రికవారికి కొంచెం విపులంగా నాలుగుపంక్తులు వ్రాసి అడ్వర్టైజుమెంటు చేసిపెట్టవలసిందని మాత్రం వ్రాసి వున్నాను. దాన్నే పత్రికవారు అభిప్రాయం కోరినట్లు భావించి పంతులవారివంటివారు వ్రాస్తే బాగుంటుందని శ్రీపంతులవారికి పంపి యుందురేమో. అభిప్రాయం కోరేయెడల యీమధ్య నేనున్నూ వారున్నూ రాజమండ్రిలో కలిసినప్పుడే కోరివుండేవాణ్ణి. నే నల్లా విధిలేక వక్కజయంతివారినే అభిప్రాయం అడిగి వున్నాను. వారు యెంతో ఖండితంగా యీవలసి వున్ననూ యేదేశమో పిడివాదంవారిక్కూడా అనుకూల్యం కనపఱుస్తూనే అభిప్రాయాన్ని యిచ్చివున్నారు. కాని ఆమాత్రం అనుకూల్యానికి వారిహృదయం సంతోషించక "లంచం తిన్నారు మీరు" అంటూ ఆ విద్యావయోవృద్ధులను యీసడించి గేలి చేయడానికి మొదలు పెట్టారు. బ్ర॥ శ్రీ॥ వేదుల సూర్యనారాయణశాస్త్రులు (పిఠాపురసంస్థాన పండితులు) గారినే "వ్యాకరణం రా" దంటూ అపలపించేవారిలేఖిని కడ్డేమిటి? ఆక్షేపించేవారు ఆశాస్త్రుల్లుగారు చదివి శిష్యులకు పాఠాలుచెప్పిన గ్రంథాల పేళ్లేనా యెఱఁగి వుండాలా? శాంతం పాపం! అయితేనేమి? "న సాహసమనారుహ్య నరో భద్రాణి పశ్యతి" అన్నాఁడుకదా? ఆ శాస్త్రుల్లుగారిని పైవిధంగా ఆక్షేపించి యిప్పటికి అయిదేళ్లుదాటవచ్చింది. ఆయన లేశమేనా ప్రత్యుత్తరం యిచ్చారా? ఆ యివ్వకపోవడాన్నికూడా తమపాండిత్య ప్రకర్షకు స్ఫోరకంగానే జమకట్టుకుంటే చేసేదేమిటి? యెంతటివారినైనా సరే యేలాటి మాటేనా అనడమే. పరిశీలించే దిక్కులేనప్పుడు అంటే మాత్రం వచ్చిన చిక్కేమిటి? రామయ్యపంతులుగారు లంచం తినడమంటే! ఆయీవాదోపవాదాలు వినడానికి అంగీకరించి సంబోధ్యమానులుగా వుండడం కాఁబోలును! యీలా యెవరిని సంబోధిస్తే వారినే అపవదిస్తే గతేమిటి? అయినా వారినిట్లు ప్రార్థిస్తాను. "అయ్యా,

యీ ఆంధ్రదేశంలో ఏ కెవరిపేరు నచ్చుతుందో వారిచేస్తే నే నంగీక రిస్తాను. ఎవరినో వొక్కరిని వేలు పెట్టి కనపరచండి" అని మూస్తాను. పదచ్ఛేదం తిన్నఁగా చేసుకోక, సమాసార్థం చక్కఁగా రాక, ప్రకరణభే దాన్ని గమనించక, పూర్వకవిలక్ష్యాలు జ్ఞప్తికిరాక, ప్రమాదపడి ఆక్షేపిం చిన ఆక్షేపణలు సరియైనవే అని చెప్పఁదగ్గమనీషి, రాను రాను పుట్టే అనుకుందాం, యెక్కడ దొరుకుతాఁడో చూదామని నాకున్నూ వొకింత కుతూహలం వుంది. యిది విషయాంతరం. ప్రస్తుతం శ్రీ గిడుగుపంతుల వారి విషయం ముఖ్యం. ఆపంతులవారికి కృష్ణవారు జయంతిని అభిప్రా యార్థమో విమర్శనార్థమో పంపివున్నారన్నది ఆవాంతరం. వారికి తోఁచిం దేమో వారు వ్రాస్తా రనుకుందాం. అది ఆక్షేపకులకు అనుకూలి స్తే ధన్యులం. అన్యథాగా వుంటే "మంగళహారతులు" తగులుతాయన్న మాటే. యీలాటి పాండిత్యంతోటే నెగ్గుకురావడానికి జాతకాలలో యేలాటి గ్రహబలిమి వుండాలో పరిశీలించి చూడాలి. అది ఆలా వుండనియ్యండి.

మొత్తం గిడుగుపంతులుగారితోకాని వారిగ్రంథాలతోకాని మాతిర పతిశాస్త్రికి యే కొంచెమో సంబంధం వుందికాని నాకు నిన్న మొన్నటిదాకా పరిచయం లేనేలేదు. ఆయనగ్రంథాలు విమర్శనకు సంబంధించినవి చదివి చూస్తిని. ఆయన పరార్థం కలిగించుకోవడంచేత స్వార్థమైన గ్రామ్యభాషా సమర్థనాన్ని అంతగా ప్రధానం చేసుకోక గ్రాంథికభాషాపాండిత్యానికే ప్రాధాన్యం యిచ్చి వ్రాశారు. అందులో పంతులవారికాలంలో వుండేకవుల నందఱినీ యెత్తుకున్నారు. వారి వారి విమర్శనాలు కూడా చాలాభాగం యెత్తు కొన్నట్లే. ముఖ్యంగా శ్రీకళాపూర్ణుల విమర్శనాన్నిగూర్చి పీల్చి పిప్పి చేస్తూ వచ్చారు. కృష్ణభారతప్రయోగాలు అక్కడక్కడ తఱచుగా స్పృశిస్తూ ఆ గ్రంథానికీ గ్రంథకర్త వుద్యమానికిన్నీ లేశమున్నూ సంబం ధమేలేదని ఋజువుచేశారు. ఆ నిరూపణాన్ని కాదనడానికి "విశ్వసృష్టయే రావలెన్." పంతులవారి లేఖిని మా మీఁదకికూడా దూఁకింది. "మహా గజాః పలాయంతే మశకానాంతు కాగతిః" అది యెక్కడ పరిశీలనా జ్ఞానమో? వొక్కొక్క శబ్దాన్ని యెత్తుకుని వర్గత్రయాలు వ్రాయడం

మొదలెడితే వంశవృక్షాలు వ్రాయడం మొదలెడితే అదే వ్రాయడం, అదే వ్రాయడం. ఆ వ్రాయడంలో వక్క అక్షరంకూడా సూటి తప్పినదంటూ వుండదు. అదెక్కడి పాండిత్యమో ? నిజంగా గ్రాంథికకవులమని పేరు పెట్టుకొన్నవాళ్ళుండఋూ ఆత్మవంచనలేనివాళ్ళే అయితే వక మహాసభ చేసి వారివారి బిరుదాలన్నీ పంతులవారికి సమర్పించి ఆయన అనుగ్రహించి మళ్ళా యిచ్చేటట్టయితే అలంకారార్థం ధరించుకోవలసిందే కాని లేకపోతే వదులుకోవలసిందే.

నా స్వభావం శత్రువుదగ్గరేనాసరే గుణంవుంటే దాన్ని కప్పిపుచ్చడం చేతకానిది. పంతులవారు అంతో యింతో నాకు శత్రుకోటిలోవారే గాని మిత్రకోటిలో వారు కారుగదా ! ఆ విషయం వారివాదానికి అనుకూలించే "యెంకిపాటలనుగూర్చి" నేను వ్యతిరేకించి వ్రాసిన వ్యాసాంతే సాక్ష్య మిస్తాయి. పంతులు గారికిన్నీ నాకున్నూ వున్నమతభేదం అన్యత్ర నేను వివరించే వున్నాను. నామతం గ్రాంథికభాషలో వ్రాసేవారు గ్రాంథికభాషలోనే వ్రాసుకోవచ్చుననిన్నీ వ్యావహారికభాషలో వ్రాసేవారు వ్యావహారికభాషలోనున్నూ వ్రాసుకోవచ్చుననిన్నీ వీరికీ వారికీ వివాదపడవలసిగాని తిట్టుకోవలసికాని లేశమున్నూ ప్రసక్తి వుండకూడదనియ్యేవే. అయితే గ్రాంథికకవులపుస్తకాల్లో యెన్నో వ్యావహారిక ప్రయోగాలు కనపడడంచేత యీ గ్రాంథిక కవులు గ్రాంథికకవులు కారంటూ పంతులవారు తరచు ఆక్షేపించడం కలదు. దానికి నా సమాధానం యేమిటంటే, యెక్కడో వక్కటితప్ప ఆ వ్యావహారికపదాలు చాలవఱకు సాధ్యాలే అవుతవి. కానిదేదేనావుంటే అది ప్రమాదపతితంగా భావించవలసిందేగాని అంతమాత్రంచేత ఆ గ్రంథకర్త వ్యావహారికభాషాకవిమాత్రం కాఁడనియ్యేవే. శ్రీ పంతులవారు కూఁతురు శబ్దం యెదుటివ్యక్తినిగూర్చి ప్రయోగించడంలో కూఁతురవు అనడానికి బదులుగా, కూఁతవు, వగయిరా ప్రయోగాలు చేసినవారినిగూర్చి కొంత వ్రాసివున్నారు. అవి యెవరున్నూ సమాధానం చెప్పఁదగిన ఆపత్తులు కావు. ప్రతి గ్రాంథికకవికిన్నీ అంత వెఱ్ఱిగా వుండేవి కాకపోయినా మఱోమాదిరివేనా కొన్ని వుండి తీరతాయి.

"కూతఁపు - కూఁతను" యిత్యాది ప్రయోగాలు మెక్కువగా శాస్త్రవాదానికి అనుకూలించడానికి ప్రయత్నించి గోతిలో జారిపడినటువంటివి. ఒక్కొక్కప్పుడు అయ్యవారిని చేయఁబోతే కోతిరావడం కలదుకదా! "పసువుల్లంక రాజుల" మని చెప్పడానికి బదులు "ప్రసువుల్లంకరాజుల" మని చెప్పి అదేమిటయ్యా! అలా మాట్లాడుతూవున్నావంటే "నేను కొంచెం చిదుమ్ముకున్నాను" అని చెప్పడం వంటిది, ప్రమాదపతిత ప్రయోగం. "తలం పెట్టినన్" వంటివైతే క్షమించవచ్చునేమో కాని మెక్కువ శాస్త్రజ్ఞానాన్ని వినియోగించడానికి వుద్యమించి మొదటిఁకే మోసం తెచ్చుకొన్నప్రయోగాన్ని పంతులుగారు ఆక్షేపించి కృతకభాష అంటే వివదించి చేయవలసింది లేదు. యెక్కడేనా యతిగాని ప్రాసగాని పోవడమో, సంధి తప్పడమో, గ్రామ్యపదం ప్రయోగించడమో జరిగితే దాన్నిబట్టి యావద్గ్రంథాన్నీ అలాగే వ్రాయరాదా అన్నమాదిరిగావుంచే పంతులవారి వాదానికి నేను అనుకూలుణ్ణి కాను. బియ్యంలో యెక్కడో చిన్నచిన్న జాళ్లువుండడం అనుభూతం, అవి అన్నంలోకి వస్తాయి, వాట్లను తొలగించుకొని భుజిస్తారు, కాని మఱుచటి రోజునుంచి బియ్యంలేకుండా రాళ్ళతోటే పాకం తయారుచేయమనడం సర్వానుభవవిరుద్ధంకదా? యేదో యీలాటి భేదం మాకూ మాకూ వున్నప్పటికీ వారినిగూర్చి నేనుగాని నన్నుగూర్చి వారుగాని లేశమున్నూ ఖండనముండనాలకు వుపక్రమించ లేదు. "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి" గా అన్యోన్యమూ తలపెట్టడం లేక పోలేదు. వ్యావహారికభాషలో వ్యాసాలువగయినా వ్రాసేవాళ్లందఱికీ కొత్తగా నరకాలు తయారవుతాయంటూ నేనెక్కడా వ్రాసిందిలేదు. యిఁకముందున్నూ వ్రాస్తానని తోఁచదు. లేదా? పలువురతోపాటు అంతో యింతో పంతులవారు మమ్మికూడా విమర్శించి వారివాదాన్ని మాప్రయోగాల మూలంగా సమర్థించుకోవడం కూడా పరిహాసంలోనే చేరుతుంది కనక విపక్షకోటిలోకే చేరతా రనుకుందాం. అందుచేతే కాఁబోలు "జయంతి" లో ధార యీలా పడింది. "నాకు విపక్షం డతఁ డట్టులే గురునకున్ గూడన్ వివాదమ్మలన్."

విపక్షుణ్ణిగురించి వ్రాసేవ్రాతకే ప్రాజ్ఞులు దానిలో యథార్థమంటూ వుంటే యెక్కువ గౌరవం యిస్తారుగదా! సపక్షులనుగూర్చి వ్రాసేవ్రాత కెప్పుడూ గౌరవం వుండదు. "దొంగలూ దొంగలూ కలిసి వూళ్ళు పంచుకొన్నట్లు" వుండే వ్రాఁతలు పనిపడితే వుపయోగించవనేకదా నేను "పుణ్యైర్యశోలభ్యతే" అనే వ్యాసంలో విపక్షులవ్రాఁతలనే చూపుతూ వచ్చాను. హరి నాగభూషణంగారు నాశత్రుత్వ మిత్రత్వాలనుగూర్చి బాగా యెఱుఁగుదురు. నేను అంతగాని కొంతగాని సంగీతపాటకుణ్ణి కాక పోయినా బందరులో వుండేరోజుల్లో "అది బాగూ, యిది వోగూ" అనే వాదాల్లో కొంచెం పాల్గొనడం వుండేది. కొన్ని వత్సరాలకు వత్స రాలు నాగభూషణంగారికి వ్యతిరేకపార్టీలో కోటయ్యగారితరఫున వుండి నాగభూషణంగారిని ఖండించడమే జరిగింది. నాతోపాటు కే. టి. రామా రావు బి. యే. యల్. టి. (ప్రస్తుతం ఆశ్రమస్వీకారం చేసినారు) గారొకరు వుండేవారు. క్రమంగా నాగభూషణంగారు పెద్దస్థితికి వచ్చి త్యాగరాయలవారినిగూర్చి హరికథ వకటి రచించి బందరులో సభలో వినిపించారు. ఆ రోజున పలువురు సభ్యుల యెదుట నేను ఆయన్నిగురించి మాట్లాడినమాటలు విని నాగభూషణంగారేకాక సభ్యులుకూడా అత్యాశ్చర్య పడ్డారు. శత్రుత్వమిత్రత్వాలు విద్యావిషయంలో అడ్డుతగిలేయెడల అట్టి వాఁడు మనీషికాకపోవడమే కాక మనిషికూడా కాఁడని నే ననుకుంటాను. యెందుకు యింతగా వ్రాస్తానంటే? గిడుగువారు వాదసందర్భంలో యెదటి పార్టీవారైనా వారి పాండిత్యం యేలాటిదో వారిరచనను బట్టి చెప్పవలసి వచ్చినప్పుడు హృదయాన్ని కప్పిపుచ్చడంకంటే మహాపాపం వుంటుందని నాకు తోఁచదు.

క. శుక్రుఁడు కవియని చెప్పిన
శక్రుఁ డతఁడు "కాఁడుఁ" డని ప్రసంగించినచో
నక్రములు తప్పఁ జాలు ను
షక్రమణము మేలు మేల్! సెబా! సని నగరే?

పంతులుగారంతటివిజ్ఞుడు, లేదా వారిప్రజ్ఞలో సగభాగమైనా వున్న విజ్ఞుడు నేటిగ్రాంథిక కవులలో మృగ్యుడు. ప్రాచీనులలో వుంటే వుండవచ్చునేమో ఆలోచించాలి. ఆయన వ్యావహారికభాషావాదిగా వుండడంచేత ఆయనశక్తి యెఱిగివుండిన్నీ ఆయన వారివారి కవిత్వంలో తరచి తప్పులు చూపించారనే హేతువుచేత ఆయనప్రజ్ఞనుగూర్చి మూకీభావం వహించడం సహృదయులు మెచ్చే పంథ కాదు. ఆయనకంటె మాకు యెక్కువ పాండిత్యం వుంటే, ఆయన చూపినప్రయోగాలను ఖండించి జవాబులుచెప్పి మా ప్రయోగాలను మేము సమర్థించుకోవలసిందే గాని "గ్రామ్యాచార్యులు" అనిన్నీ యింకా యేమో అనిన్నీ వృథాగా పరిహసిస్తే యేంప్రయోజనం? యెవరు పట్టుదలగా ఆయన్నిగూర్చి పైమాటను వాడుతూవున్నారో, వాడినారో, వారివారిజీవితకాలంలోనే పంతులవారు సహృదయసమ్మతంగా వ్రాయదగ్గంత వ్రాసి వున్నారు. వారిలో కొందఱు పంతులవారి కేవిధమైనసమాధానమున్నూ వ్రాయకుండానే కాలం గడపి స్వర్గ మలంకరించారు. కొందఱు దీర్ఘాయుష్మంతు లింకా వున్నారు. వారు లేశమున్నూ పంతులవారికి జవాబు వ్రాయడమైతే లేదుగాని వెక్కిరింపుమాటలతో అపవదించడం కలదు. ఆత్మవంచనాశక్తిని భగవంతుడు వారికిచ్చినట్లే నాకుకూడా యిస్తే పంతులవారినిగూర్చి నేనుకూడా చాటునా మాటునా ఆలాగే అపవదించేవాణ్ణేమో? దిక్కుమాలిన శక్తి ఆశక్తి నాకు జన్మజన్మలకూ అనుగ్రహించవద్దని మాయిలువేల్పులను గూర్చి ప్రార్థిస్తాను. జవాబు చెప్పలేకపోయినవారిలో కొందఱు తూష్ణీంభావాన్ని వహించి వూరుకున్నారు. అది సహృదయత్వభంజకంగాదు. వెట్టిమొట్టి మాటలతో అపవదించడమనేదిమాత్రం దండించతగ్గ దుర్దోషం. పంతులుగారిపాండిత్యం తలుచుకుంటే యేంచెప్పేది కడుపంతా గాబరా అవుతుంది. నిజమైనభాషావేత్తృత్వమంటే యేభాషావేతృత్వం? గ్రాంథిక భాషావేతృత్వం ఆబాహ్మణుడిసొమ్మే. ముమ్మాటికీ సంశయంలేదు. అయితే అంత ప్రజ్ఞ వుండి వ్యావహారికభాషనే అభిమానించి వాదించడం యెందుకంటారా? అది ఆయన దోషంకాదు. పరాశరుడేమన్నాడు?

"తేషాం నిందా నకర్తవ్యా యుగరూపాహితే ద్విజాః" అన్నాడు. యీ యిరవయ్యో శతాబ్దంలో అన్నీ ఆలాటివే జరుగుతున్నాయికదా! (1) శారదాబిల్లు వివాహాలు (2) చండాలదేవాలయప్రవేశాలు (3) వితంతు వివాహాలు వకటేమిటి? ఎవరి యిచ్ఛవచ్చినట్లు వారల్లా తోవలుతొక్కుతూవున్నారు. ఆలాగే గిడుగు వారున్నూ అనుకోవాలి. మనకు కావలసింది పంతులవారి సమకాలీనులలో పంతులవారితో శతాంశానికేనా పోలతగ్గ విమర్శకు లున్నారా? అనే అంశమే. గ్రాంథిక భాషలో అంత మహా సముద్రుండైవుండి పంతులవారు వ్యావహారికభాషకోసం పాట్లుపడడం యేలావుందంటే! శ్రీయుతులు భమిడిపాటి కామేశ్వరరావు బి.ఏ.,ఎల్.టి. గారు గానమిళితంగా లోకోత్తరంగా పద్యం చదివేవారిలో మూర్ధన్యులో ధన్యులో అయివుండి "గానం పద్యాలు చదవడంలో వాడడం పనికిరాదు" అని ప్రచారం చేయడంవంటి దంటాను. అట్టి శక్తివుండి దాన్ని నిషేధిస్తేనే అందముంటుందిగాని ఆ శక్తిలేనివాండు దాన్ని నిషేధిస్తేయేం లాభమంటాను. "నిందతి శుష్క....నారీకంచుకమేవ" అనేస్తారు. దానితో తీరిపోతుంది. పెద్దలేమన్నారు? "చెల్లియుండియు సైరణ సేయునతండు" అన్నారుగదా? చెల్లనివాండు సైరణచేయ కేంచేస్తాడు? అందుచేత పంతుల వారి వాదానికి వారి పాండిత్యం అడ్డు తగులదు. వారి పాండిత్యం నిరుపమానం. యీలా వ్రాసి వారిచేత మెప్పుపొందుదామనే తాత్పర్యాన్ని నాకు కొందఱు ఆపాదిస్తారనిన్నీ నాకు తెలియకపోలేదు. ఆపొందే మెప్పు యిది వఱకే జరిగింది. పంతులుగారిద్వారా "చిటికెనవేలుమీందికి" యిదివఱకే యెక్కడం జరిగి చాలాకాలమయింది. అందుకోసం యిప్పుడు వేఱే శ్రమ పడవలసి వుండదు.

పంతులుగారినిగూర్చి నేను వ్రాసే స్వభావోక్తినికూడా యీలాటి శంకలు చేసేమహానుభావులు అన్యథాగా అపవదిస్తే అపవదించవచ్చును. ఆ కారణాన్ని పురస్కరించుకొని మానవలసివుండదు. పంతులవారి విమర్శనగ్రంథాలు నేను నిన్నా నేండు చూడడం తటస్థించింది గాని లేకపోతే

యీమధ్య నేనువ్రాసిన వ్యాసాలకోసం భారతం మళ్లాచదవవలసినపనే వుండేదికాదు. భారతంలో కాని యితరకవుల గ్రంథాలలో కాని యెన్నో పుటలో యెన్నో పంక్తిలో యేఅపురూపప్రయోగం వుందో ఆ విశ్వనాథ పంతులుగారి 'బాలకవిశరణ్యం'లో వ్రాయఁబడేవుంది. పంతులుగారేమాలోచించి ఆపుస్తకానికి 'బాలకవిశరణ్యా' మని పేరుపెట్టారో కాని దానికి పేరు "ప్రౌఢకవిశరణ్యం" అన్నదే సర్వవిధాలా తగివుంటుంఁదని నాకు తోఁచింది. నాసలహా యుక్తమయిఁదిగా వారికి తోఁచేయెడల వచ్చేముద్రణంలో ఆలా మారుస్తా రని తలుస్తాను. ఆయన గ్రంథాన్నిగురించి ఆత్మవంచనలేకుండా నేనీలాటి అభిప్రాయాన్ని యిచ్చినందుకు మిక్కిలీపరితపించి ఆయనగ్రంథాన్నిన్నీ నన్నున్నూ దూషించేవారు దూషిస్తారవిన్నీ యెఱుఁగుదును. అయినప్పటికీ వ్రాయవలసిన మాటలు వ్రాయకుండా మానేది లేదు. ఆ దూషించేవారికి శాస్త్రసమయాలు తెలియవుగదా, లోకసమయాలు కూడా తెలియవు, నిక్కం. యేమంటే? యెవరేనా యెవరినేనా కొడితే కొట్టినట్టివారిమీఁద న్యాయాధికారివద్ద అభియోగం తేవడం కలదు. ఆలా తెచ్చినప్పుడు ఉభయుల వాదోపవాదాలున్నూ అవగతం చేసుకొని న్యాయాధికారి తీర్పుచెప్పడమేకదా జరుగుతుంది. ఆజరగడంలో ముద్దాయీస్థానమందున్నమనిషి నేను నిన్ను తీర్పు చెప్పవలసిందని కోరలేదే అని అధికారిని తిరస్కరించినట్లు యెక్కడా కనపడదు. ఫిర్యాదీ ముద్దాయీల వాఙ్మూలాలు అచ్చుపడేవున్నాయికదా! తీర్పు కర్త చూచేవున్నారు. అట్టిస్థితిలో అట్టి అక్షరాలు వ్రాసేవారికివున్న లోకానుభవానికి వక నమస్కారమే కర్తవ్యం. మిక్కిలి ఉత్తమచరిత్ర కలిగినట్టిన్నీ "అగ్నిహోత్రంలో వకకాలూ మంచిగంధంలో వకకాలూ" గా వుద్యోగకాలమంతా గడపఁగలిగినటువంటిన్నీ మహాపురుషుణ్ణి "లంచగాఁ" డని అపవదించే సాహసానికి పరశ్శతనమస్కారాలు. యిట్టిసాహసాన్ని పూర్తిగా యెఱిఁగినవా రెందఱో వుండిన్నీ మనకెందుకని వూరుకుంటూ వున్నరోజుల్లో శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు కడుంగడు వృద్ధులై యుండికూడా యీ దురన్యాయాన్ని సహించలేక తల కంటగించుకొని

380 పుటలగ్రంథం శ్రీకల్లూరిమహాశయులప్రశంసనుగూర్చి వ్రాస్తూ అందులో "సరాజు పెళ్ళిలో గురాజుకొకపోచగా" ఎత్తుకొని కొంత చర్చించినట్లు వారి కరపత్రాలవల్ల తెలిసింది. ఆ పుస్తకం ప్రచురించ వద్దని నయానా భయానా గురువులు ప్రయత్నించి విఫలమనోరథులై నట్టుకూడా రూఢిగా విన్నాను. యెందఱో అట్టివారు బతిమాలడానికి లొంగేవా రుండడంచేత వీరభద్రరావుగారుకూడా ఆ తెగలోవారే అని గురువు లభిప్రాయపడి వుంటారు. ఆ గ్రంథంలో ఆయన వ్రాసినవిషయ మేనా అంతగా బాధించేది కాదు. గురువుల వ్యాకరణపాండిత్యానికి సంబంధించి వున్నట్టు వింటాను. దాన్నిగూర్చి మొట్టమొదట కావ్యాలు చదువు కొన్నవారివద్దనే జరిగినట్లు హరికథలో వ్రాయించుకోవడం వీరభద్ర రావుగా రెఱుఁగుదురో యెఱుఁగరో! వారల్లా "చెరలాటం" లో పేర్కొన్న వెంకటరామశాస్త్రుల్లుగారి గురుత్వాన్ని గూర్చే వ్రాసివుంటా రనుకుంటాను. మొత్తం అసత్యం జీవితానికి మిక్కిలీ హాన్ని కలిగిస్తుందని రావుగారు ఆ గ్రంథాల్లో వ్రాసివున్నట్టు కరపత్రంలో కొన్నిమాటలవల్ల తేలుతుంది. ఆమాటలు వుదాహరిస్తాను. "అట్టి యుత్తమశీలత్వము కవియందు కాన్పింపకున్నయెడల కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ బిరుదముల చేతఁ బేర్కొనఁబడినను స్వర్ణాభిషేకభాగ్యముఁ బొందఁగలిగినను, కవి గండపెండేరధారణము వహించినను, నయ్యవి జీవితమునకు శోభస్కర ములు గాకపోవుటయేకాక దేశమునకును సమాజమునకును నరిష్టదాయక ములుగానుండును." యింత నిర్మొగమాటముగా యథార్థాన్ని వ్రాసేవారు వెనక కీ॥ శే॥ కస్తూరి శివశంకరకవిగా రొక రుండేవారు, మళ్ళా వీరు కనపడుతూవున్నారు. మూఁడోవారు గిడుగువారుకూడా యీకాలంలోనే వుండడంచేత వీరుముగ్గురున్నూ ముగ్గురు మూర్తులని నేను సంతోషిస్తాను. రావుగారిగ్రంథంవల్ల యేయేవిశేషాలు పైకి వస్తాయో అని కనిపెట్టుకున్న వాళ్ళల్లో నేను వక్కణ్ణి అని రావుగారికి మనవి చేస్తాను. చరిత్రలు వ్రాయక పోయినా నాజీవితంకూడా మీవలెనే అసత్యవాదుల అపవాదులు ఖండించ డానికే ఛాలాభాగం కర్చుపడ్డ దనిన్నీ యీ వార్ధక్యంలోకూడా అందుకే శ్రమ

చేయవలసి వచ్చిందనిన్నీ శ్రీ వీరభద్రిరావుపంతులుగారికి తెలుపుతూ వున్నాను. ప్రిమాదంచేత అసత్యం మాడితే అది క్షంతవ్యమవుతుంది కాని బుద్ధిపూర్వకంగా ఆడితే అది క్షంతవ్యమెట్లా? నేను మొట్టమొదట యీచర్చకు సంబంధించిన వ్యాసాలకు వుపక్రిమిస్తూ "సుజలపూరి తమ్ములు" అనే పద్యాన్ని వుదాహరించి వున్నాను. దాన్ని గణించినట్లే లేదు. ఆవలివారు వీరభద్రిరావుగారేలాగో యీ అంశాన్ని కనిపెట్టినందుకు వారిని అభినందిస్తూ వున్నాను. గిడుగువారినిగూర్చికూడా ఆగ్రింథంలో యెత్తుకుంటే సరే! లేకపోతే ప్రిత్యేకించి వ్రాయవలసిందని హెచ్చరిస్తాను.

విద్యావిషయంలో అభిప్రాయభేదాలు వునప్పంటికీ ఆడరానిమాటలు ఆడడంగాని ముఖముఖాలుచూచుకోకపోవడం గాని విద్వల్లక్షణం కాదు. యీరీతి పూర్వపండితులకు అంతో యింతో ప్రతివారికిన్నీ వుండకుండా వుండదు. ఆ పూర్వపురకం పండితులుగాని మజీవకదుగాని ప్రస్తుతవిష యంలో ప్లీడర్లను బట్టి నేర్చుకోవలసింది కొంత వుంటుందని నాకు తోస్తుంది. వారు పరస్పరమున్నూ వ్యతిరేకంగా కోర్టులలో యెంతో కఠి నంగా వాదించివాదించి ఆకోర్టు వదలి రావడంతోటట్టుగానే యెంతో సోదర భావంతో వర్తించడం చూస్తే యెంతో ముచ్చటగా వుంటుంది. ప్రస్తుతం గిడుగువారుకూడా ఆలాగేవుంటారు గాని విద్యావిషయక మతభేదాన్ని పుచ్చుకొని లేశమున్నూ యెడమొఖము పెడమొఖమూ అన్నట్లుగా వుండరు. ఇదినేను స్వానుభవముమీఁద తెలుసుకున్నాను. మళ్ళా కలంచేత బట్టినప్పుడో! యెంత గాఢంగా విమర్శించాలో అంతగాఢంగానూ విమ ర్శించికాని వదలరు. యేవో కొన్నివిషయాలలో అభిప్రాయభేదాలు వున్నప్పటికీ నాకు గ్రాంథికభాషావాదులలో పరమశ్రోత్రియులనిపించుకొనే జయంతివారితో గాని వ్యావహారికంలో పరమ శ్రోత్రియంగా వుండే గిడుగువారితోగాని లేశమున్నూ వైమనస్యం లేదనే విషయం నేను దీనిలో వ్రాయకుండానే లోకం నాప్రవృత్తిని బట్టి గ్రహిస్తుంది. యెవరికేవా సౌమనస్యం ఆవశ్యకంగదా? అట్టి సౌమనస్యం యెంత ఉండాలో అంతా పంతులవారియందు మూర్తీభవించి ఉందనికాని; లేదా, సౌమనస్యమే యీ

స్వరూపంగా అవతరించిందని కాని నేను విశ్వసిస్తూ వున్నాను. ఇట్టిమహా సీయుణ్ణి గ్రామ్యభాషావాది యైనంతమాత్రంచేతఁగాని, వారివారిగ్రంథాల్లో నిజమైనతప్పులు చూపించడ మనే హేతువుచేతఁగాని విరసించడంకన్న పామరత్వం మఱొకటి వుండదు. అవసరాన్నిబట్టి నేఁటికవులనే కాదు, ప్రాచీనకవులనే కాదు యీయన వకవూఁపు వూఁపి చూచినమాట నిజం. ఆయనపెట్టిన వాఁతలు శాశ్వతంగా నిలిచిపోయేవే కాని యేవో వెక్కిరింపుమాటలతో అంతరించేవి కావు. యితరులతోపాఁటు మాకున్నూ ఆయన వాఁతలు స్వల్పంగా తగిలివున్నాయి. అందులో కొన్నిసవరణవుతాయేమో కాని కొన్ని దిద్దుకోవలసిందే. నేను పిడివాదానికి వుపక్రమించేవాణ్ణి కాను కాఁబట్టి యథార్థం వ్రాస్తూ వున్నాను. అన్యథాగా సమర్థించినప్పుడు అది నా పాండిత్యప్రకర్షకు గుఱుతుగాని మఱొకటి కాదని ఆఘట్టంలో నేను వ్రాయడం ఆచారమే. నాలాగే తక్కినవారుకూడా పంతులవారి ఆక్షేపణలు దిద్దుకొంటూ వారికి భాషాచరిత్రలో యెంత గౌరవం యివ్వాలో అంతగౌరవమున్నూ యివ్వడం ఆంధ్రభాషాభిమాను లందఱికీ విధి. వ్యావహారికంవారు శ్రీవారి నిదివఱకే గౌరవించి పూజిస్తూవున్నారు. నే విప్పుడు చెప్పేది గ్రాంధికభాషావాదులుకూడా వారి కివ్వతగ్గంత గౌరవం యిచ్చితీరవలసిందనియ్యేవే. యీసభ ధనధాన్యాలతో సంబంధించి వుండ నక్కఱ లేదు. కేవలమున్నూ గౌరవవాక్యాలతో జరిగితే చాలును. వారికి కొన్నిబిరుదులు సర్వజనసమ్మతమైన విదివఱకే వున్నాయి. ఆబిరుదులకు వారు తగుదురా? తగరా? అనేప్రశ్న యింత వఱకు రాలేదు. యెవరేనా తగినవారు శిఫారసు చేస్తే యింకో బిరుదు గవర్నమెంటువారు వారికి అనుగ్రహించకపోరేమో? కాని పంతులవారు దాన్ని ధరించడానికి సుతరామున్నూ వప్పుకోరని నేను తలుస్తాను. యెందుచేతంటే? ఆబిరుదుకు వున్న అర్థం వారికి తెలిసిన ట్లెవ్వరికీ తెలియనే తెలియదు. అందునుగూర్చి విమర్శించి పంతులుగారు వ్రాయవలసివస్తే యెంతేనా వ్రాస్తారు. వారివ్రాఁతకు తిరుగంటూ వుండదని నా విశ్వాసం. పంతులుగారి విమర్శనానికి పంతులుగారి విమర్శనమేసాటి. "రామరావణయో ర్యుద్ధం రామరావణయోరివ."

# బహిరంగలేఖ

( 16—6—1937 సం॥ ఆంధ్రపత్రిక నుంచి )

"ముంజేతి కంకణమ్మున కద్దము" అక్కఱలేదంటూ ప్రతీవాళ్లూ అనడం వుంది. వున్నాసరే? నేను అద్దం చూపిస్తూ వున్నందుకు పాఠక లోకం నన్ను క్షమించాలి. అసలు నాకవిత్వం "గొల్లలకూ గొడ్లకాపఱు లకూ" తెలిసే స్థితిలో వుంటుంది. దానిక్కూడా వ్యాఖ్యానం వ్రాయ వలసివచ్చిన యీ కాలాన్ని వర్ణించవలసివస్తే మేటరు ఒళ్ళని తోలవలసి వస్తుంది. కాఁబట్టి ప్రస్తుతానికి వస్తాను.

"చ. నృపులకు నుండుసద్గుణములే యితనిన్ వరియించెఁగాని త
న్నృపతుల కుండుదుర్గుణము లేమియు పేయనఁ జేరలేవు, పు
ణ్యపుమహిమంబ కాదె యిది యౌవనమున్ ధన మాధిపత్యమున్
రిపు నవివేకమున్ సఖునిరీతిగఁ జేర్చుట యెంచుఁ జూడమే?"

యీ పద్యంలో వర్ణ్యం శ్రీ బొబ్బిలి ప్రస్తుతపు రాజుగారు. యీయనయందు రాజులకు వుండఁదగ్గ సద్గుణములే వున్నాయి గాని రాజులకు వుండేదుర్గుణాలు యేవిన్నీ లేవు అని రెండు చరణాలవఱకున్నూ తాత్పర్యం. మూఁడో చరణంలో వున్న "పుణ్యపు మహిమంబ కాదె? యిది" అన్నదానికికూడా తాత్పర్యం వ్రాయాలా? అక్కఱలే దనుకుం టాను. మొత్తం యిక్కడికి తేలినముఖ్యాంశం, ప్రస్తుతం వర్ణింపఁబడు తూవున్న రాజుగారు చాలా అదృష్టవంతులనిన్నీ, ఆ కారణంచేత రాజులకు వుఁడవలసిన సుగుణాలే యీయన్ని ఆశ్రయించాయి కాని దుర్గుణాలు ఆశ్రయించనే లేదనిన్నీ తేలింది. యీపైని మిగిలినపద్యభాగం "యౌవన మున్, ధన, మాధిపత్యమున్" అన్నది. దీనికి వ్రాస్తాను. పైని చూపిన మూఁడున్నూ అంటే? నూనూఁగుమీసపు వయస్సున్నూ, ద్రవ్యమున్నూ ప్రభుత్వమున్నూ, (తమకు) రిపున్—శత్రువైనటువంటి; అవివేకమున్—అవి మృశ్యకారిత్వాన్ని, అనఁగా పరిశీలించకుండా ప్రవర్తించడాన్నన్న

మాట. సఖునిరీతిగ — స్నేహితునివలెనే, చేర్చుట — చేర్చుకోవడాన్ని, ఎందున్ — సర్వత్రా, చూడమే? చూడడంలేదా? అంటే? చూస్తూనే వున్నామని ఫలితార్థం. యెక్కడ యౌవన ముండునో అక్కడే అవివేకం కూడా వున్నట్టయితే ఆ యౌవనాన్ని పాడుచేస్తుం దనిన్నీ, యెక్కడ ధనం వుంటుందో? అక్కడే అవివేకం కూడా వున్నట్లయితే ఆ ధనాన్ని యుక్తవ్యయం చేయనీయక పాడుచేస్తుందనిన్నీ, యెక్కడ ప్రభుత్వం వుంటుందో? అక్కడే అవివేకం కూడా వున్నట్టయితే ఆప్రభుత్వ శక్తిని దుర్వినియోగం చేయించి పాడుచేస్తుందనిన్నీ, యివి ప్రత్యేకించి కాక మూఁడూ వున్నచోట అనఁగా ధనమున్నూ యౌవనమున్నూ ప్రభుత్వమున్నూకూడా చేరినచోట అవివేకం చేరితే మఱీచిక్కనిన్నీ ప్రస్తుత ప్రభువునందు, ధన యౌవన ప్రభుత్వములు మూఁడున్నూ చేరివున్నప్పటికిన్నీ ఈత్రితయాన్ని పాడుచేసే అవివేకం లేశమున్నూ లేదని వాచ్యార్థము. వ్యంగ్యమో? రాజులు ధనవంతులున్నూ అధికారవంతులున్నూ అయి ఆగర్భశ్రీమంతులుగా పుట్టడంచేత యెక్కడో కాని "యిది మంచీ యిది చెడ్డా" అనే వివేకం కలవారుగా వుండడం తటస్థింపదనిన్నీ అట్టివారి యౌవనం ఆ అవివేకంతో చేరి సకల విధాలా పాడుగా వుంటుందనిన్నీ ప్రకృతప్రభువు వివేకశాలి కనుక యీయన ధనంగాని యౌవనంగాని ప్రభుత్వంగాని అవివేకానికి లేశమున్నూ చోటివ్వకపోవడంచేత కవివర్ణనీయాలుగా వున్నాయనిన్నీ భావం. యిందులో "సఖునిరీతిగ" అనడంచేత, అవివేకం వస్తుతః యౌవనాది త్రితయానికి పరమశత్రు వైనప్పటికీ కొందఱు అవ్యక్తులు దాన్ని మిత్రునిగా భావించి చేర్చుకొని పాడవుతూ వుంటారనిన్నీ ప్రస్తుతప్రభువు అవివేకాన్ని చేర్చుకోకపోవడంచేత తనయౌవనానికిఁ గాని, ధనానికిఁ గాని ప్రభుత్వానికి కాని లేశమున్నూ హాని కలుగలేదనిన్నీ ముఖ్యతాత్పర్యం. ఆ యీ భావం పద్యం చదివీ చదవడంతోనే యేమాత్రం ఆంధ్రభాషా ప్రవేశంవున్నా గోచరిస్తూ వుందని నేను అనుకుంటూవున్నాను. యిందులో

తప్పితుపను ప్రస్తుతసందర్భం భర్తృహరిశ్లోకంలో వున్నదే కాని వ్రాత్రపి కూడా కాదు.

శ్లో. యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా
ఏకైక మప్యనర్థాయ యత్రైతాని చతుష్టయమ్.

యిది సంస్కృతమైనా తెలుఁగులాగే అందఱికీ తెలుస్తూవుంటుంది కదా: పైఁగా పైని వ్రాసిన వ్యాఖ్యానంకూడా కొంత దీనికి సహాయపడుతుం దనుకుంటాను. అయినా కాలదౌర్భాగ్యాన్ని బట్టి దీనిక్కూడా అర్థం వ్రాస్తాను. చేదస్తు డనుకోకండి నాయనలారా! యౌవనమున్నూ ధనసంపత్తున్నూ ప్రభుత్వమున్నూ అవివేకమున్నూ, యీనాలుగున్నూ యేకత్ర చేరనక్కఱలేదు. యీ నాల్గింటిలో యేవొక్కటి చేరినా మనిషిని పాడు చేయడానికి చాలును. అట్టిస్థితిలో యీనాలుగున్నూ యేకత్ర చేరితే చెప్పే దేమిటి? అన్నాఁడు భర్తృహరి. అంటే? యెంతపాడుచేయాలో అంత పాడున్నూ చేస్తాయని తాత్పర్యం. యీభర్తృహరిశ్లోకార్థాన్ని మనస్సులో పెట్టుకొని నేను పైపద్యాన్ని రచించాను. యిందులో నాతప్పేముందో? చదువరులు పరిశీలించి నాతప్పున్నట్టుతోస్తే పత్రికాముఖాన్ని తెలిపి నన్ను మందలించవలసిం దని ప్రార్థిస్తాను. యీ నా పద్యార్థం "గొల్లలకూ గొడ్లకాపరులకూ" కూడా సులభంగా బోధపడుతుం దని నే ననుకున్నాను గాని, కవిసార్వభౌములకు, మహామహోపాధ్యాయులకు, కళాప్రపూర్ణులకు, కూడా బోధపడక నేనే వ్యాఖ్యానం వ్రాయవలసి వస్తుందని స్వప్నేపి నేను తలఁచలేదు. చూడండీ? దైవదుర్విలసితం యేలావుందోను.

"ఇందు యౌవనము, ధనము, ఆధిపత్యము, రిపువవివేకము, సఖునిరీతిగఁ జేర్చుట యెందుఁజూతము" అనఁగా నర్థమేమో? విచారింపనగు" అని పరమపూజ్యులు గురువులు శంకించారు. మహాభారతంలోవున్న వ్యాసఘట్టాలకు, నన్నయ్యగారు వదిలిపెట్టిన భాగాలకు తిక్కన్నగారు వదలిపెట్టిన భాగాలకు, ఎఱ్ఱన్నగారు వదలిపెట్టిన భాగాలకు

ఆంధ్రీకరణాన్ని ప్రకటించిన మహావిద్వాంసులకు, ఆంధ్రవ్యాసులకు నా తాలూకు పేలపిండిపద్య మర్థం కాలేదని శ్రీవారే వ్రాసుకోవడంచేత మీరు విశ్వసిస్తారేమో కాని నేనుగాని మఱివకరుగాని వ్రాస్తే విశ్వసిస్తారా? విశ్వసించడం తప్పుగాని, విశ్వసించకపోవడం తప్పున్న్నూ కాదుసుఁడీ! పైఁగా నాపద్యంలో "రిపున్, అవివేకమున్" అని వ్యస్తంగా విడఁదీసి కోవలసిన భాగాన్ని సమాస మనుకొన్నట్లు స్ఫురింపఁజేస్తూ "రిపున వివేకము" అని కోటు చేసినారు. పరిశీలించి చూడండి. అన్యబుద్ధి యప్రత్యక్షం కనక నా వుద్దేశం వారికి గోచరించ లేదంటారా? నాయనలారా! అట్టి తికమకధోరణి పైపద్యంలో వుందా? యీ మాట మిమ్మల్ని అడిగేదిలేదు. ఆంధ్రయూనివర్సిటీ యజమానులు శ్రీయుతులు రెడ్డిగారి నడుగుతాను. నేను దైన్యం లేకుండా యీవయస్సువఱకూ కాలం నెట్టుకు వచ్చా ననుకుంటూ వున్నాను. నాకీ వయస్సు తుట్టతుదను యీలాటి యాచ్నా దైన్యం తప్పక వచ్చింది. యేమంటే? విషయం ఆలాటిది. వాదం యెవరితో వచ్చిందీ? గురువుగారితోఁగదా! గురువుగారి జ్ఞానం శిష్యునిజ్ఞానంకంటే యెక్కడాకూడా యెక్కువగానే వుంటుందని అందఱూ అనుకుంటారు. అట్టిస్థితికి తాఱుమాఱుగా విషయం ఋజువు చేయవలసిన భారం నానెత్తిమీఁద పడింది. దీనికోసం శ్రీ జయంతి పంతులుగారిని కోరుకున్నాను. వారు గంభీరంగా లోకసమ్మతంగా తీర్పిచ్చారు. కాని వారిని గురువులు తృణీకరిస్తూ "జీలుగుబెండు తీర్పు మీ తీ" ర్పంటూ గేలిచేశారు. ఆ గేలిచేసినదానిలోనే పై పద్యములో వున్నపదాలు వుటంకించి 'అర్థమేమో? విచారింపనగు' అన్నారు. విచారించకుండానే అర్థ మయేదానికి విచారించడం యెందుకు? అథవా దేనికేనా కొంచెం విచారం అంటూ వుండాలి. ఆ కొంచెపు విచారణకేనా తెలిసేటట్టు వ్రాయడంకూడా కవికి దొసఁగే అవుతుందా? అని శ్రీ రెడ్డిగారిని నేను ప్రశ్నించు కుంటాను. యిది లోకం కోసం కాదు, నా కోసమే, అందుకే ఆత్మనేపదార్థక ప్రయోగం. వెనక నన్నయ్యభట్టారకవర్ధంతికే అనుకుంటాను

శ్రీ రెడ్డిగారు అధ్యక్షులుగా దయచేశారు. ఆసభలో నేనున్నూ శ్రీ రెడ్డిగారి ఆజ్ఞానుసారం నాలుగుమాటలు తోచినవేవో మాట్లాడివున్నాను. యీవిషయం జరిగి యిప్పటికి పుష్కరకాలం దాటిపోయింది. నేను మాట్లాడినమాటల్లో ద్రౌపదీవివాహఘట్టంలో "కానీన" అని కర్ణుణ్ణి, అర్జునుడు సంబోధించడాన్ని గూర్చి శ్రీ రెడ్డిగారిఅభిప్రాయానికి కొంత భిన్నంగానే ప్రసంగించాను. అప్పుడే కాదు యిప్పుడున్నూ పడితే శ్రీవారి అభిప్రాయానికి నేను భిన్నంగానే వ్రాస్తాను. అంతమాత్రంచేత రెడ్డిగారియందు నాకు గౌరవం లేదని వారుగాని యితరులుగాని వూహించరని నావిశ్వాసం. నాకు శ్రీజయంతివారియం దెంత విశ్వాసమున్నదో? రెడ్డిగారియందున్నూ అంతే. అందుచేత యీకార్యభారాన్ని వారిమీఁదకూడా వుంచుతూవున్నాను గురువులవారి విమర్శనం కూడా చిత్తగించి మరీ తీర్పు చెప్పవలసిందని కోరుతూన్నాను. శ్రీపంతులవారు ఆలా చిత్తగించే తీర్పు చెప్పినప్పటికీ గురువులు "నావాదము మీకు వినిపింపను లేదు" అంటూ వ్రాశారు వారే వినిపించాలి కాఁబోలును! తీర్పరులు చూస్తే చాలదా? యేమనుకొనేది? గురువుల "చెరలాట" గ్రంథం రెండుభాగాలు 176 పుటలున్నూ అచ్చువేసి ప్రచురించివున్నారు. పంతులవారు చిత్తగించేతీర్పు చెప్పియున్నారు. అందుకు సూచకమైనవి కొన్ని అక్షరాలు వారి తీర్పులో లేకపోలేదు. వున్నప్పటికీ గురువులు పంతులవారిని ఆవిధంగా నిరసించివున్నారు. పైఁగా యెన్నోతొందరమాట లన్నారు. చూడండీ! "చేతగాని తీర్పు చెప్పుట మీయట్టి పేరుగలవానికిఁ దగదని చెప్పుచున్నాను" అనేవాక్యంతో స్వస్తి చెప్పి వున్నారు. అయితే తామిట్లు శంకిస్తారనుకుంటాను. "మీరు మీగురువులచేత నన్నుకూడా కొన్నితొందరమాట లనిపించడానికే యీయెత్తు యెత్తినట్లుందని" నావుద్దేశం అది కాదు. కాకపోయినా తుట్టతుద కాలా పరిణమిస్తే పరిణమిస్తుందేమో? అయినప్పటికీ మీరీభారం వహించకతప్పదు. యెందుచేతంటారేమో? వినండి. ఖండాంతరాలకి వెళ్ళి యితరభాషలలోనో? లేక భాషలలోనో? మహామహోపాధ్యాయులవంటివా రనిపించుకొన్న మీరు, యీ ఆంధ్రి

భాషలో? యేకొంచెమో కాకుండా యెంతో పెద్దపాండిత్యాన్ని యెందుకు సంపాదించాలి? కవిత్వతత్త్వవిచారం యెందుకు వ్రాయాలి? ఆకారణంచేత యీభారం దానంతట అదే మీశిరస్సుమీఁద పడింది. నేనో? నిమిత్తమాత్రుణ్ణి. యింకొకటి మనవి చేసుకుంటాను. నాకవిత్వంలో తమ కేవేనా యితర తప్పు లున్నట్టు పొడకడతాయేమో: వాట్లను తమరు యెత్తుకో నక్కఱలేదు. మీరు నాయావత్తు కవిత్వాన్నీ సున్నా చుట్టినా నేను శిరసావహిస్తాను; కిక్కుఱు మనేది .లేదు. యెందుచేతంటారా? మాచేదస్తపుధోరణి మీనాగరకతకు నచ్చ దని నే నెఱుఁగుదును. పింగళి సూరన్నవంటివాఁడే మీనాగరకతముందు నిలవనప్పుడు నావంటివాని లెక్కయేమి? "మహాగజాః పలాయంతే". నేను మిమ్మల్ని కోరుకొనేదల్లా, పైపద్యంలో అర్థంగాని తాత్పర్యంగాని వ్యంగ్యంగాని దుర్బోధంగా వుందా? లేక అనుచితంగా వుందా? అని మాత్రమే. నాకవిత్వంలో దుర్బోధంగా వుండేదే లేదని పలువు రనుకుంటారు. గురువులున్నూ అందుకు వ్యతిరేకించేవారు కారు. "గొల్లలూ గొడ్లకాపఱులూ" అనే గురువులవాక్యాన్ని చిత్తగించండి. బాల్యకవిత్వంలో చాలా తికమకలుంటాయి, అది యిక్కడ ప్రస్తుతం కాదు. అయినా కొంచెం చూపుతాను.

శ్లో. క్లీబపుంసోస్తు దేహో స్త్యేకో మాతర్న తత్ర బహు చిత్రమ్
 స్త్రీపుంసయోరపితథా లలితే: య ద్దృశ్యతే మహచ్చిత్రమ్.

అయ్యా! ఈశ్లోకార్థం మావల్ల సంప్రదాయం విన్నవారికే తప్ప యితరులకు గోచరించడం కష్టసాధ్యం. యిట్టిగూఢశైలి లేక తికమకశైలి పైపద్యంలో వుందా? చిత్తగింపవలసిందంటాను. ఈశ్లోకం రచించేనాఁటికి నావయస్సు సుమారు 16 లేక 17 మాత్రం. బొబ్బిలి వ్రాయునాఁటికి నావయస్సో? 58 వత్సరములు. అప్పటికి 40 వత్సరాలనాఁడు వ్రాసిన శ్లోకంలో "స్త్రీపుంసయోః" అని వ్రాసిన నాకు "అచతుర విచతుర" అనే సూత్రంవల్ల, స్త్రీశబ్ద పుంశబ్దములు కలిస్తే, స్త్రీ పుంస అవుతుం దని తెయదఁట! సుమారు అఱవైయాఱు సంవత్సరాల

ప్రియంలో గురువులు వ్రాసిన విశ్వనాథ్యుదయంలో "స్త్రీ పుంభావము గాంచువేల్పులవేల్పు." అనివున్నది. అది 1932 లో అచ్చయినది. 36 వ సం॥లో నన్ను విమర్శిస్తూ "స్త్రీ పుంజనస్వాంతపుష్పములన్" అనుదాన్ని మార్గాంతరంచేత సాధువు కావడాన్ని మనస్సులో పెట్టుకొని నేను వ్రాసినదాన్ని వారు తప్పు పడరాదే? వారిప్రయోగం. "స్త్రీపుంభావము" అనేదానికి "అన్యథా శరణం నాస్తి" కదా? నేను. "విందైన పుష్పమ్ములన్" అని వ్రాస్తే అదేమో? దురుద్ధరమైన తప్పనుకొని మళ్ళామళ్ళా దాన్ని యెత్తుకొని ప్రశ్నిస్తారే?

"శా. నానాగాయన గాయనీమణుల గానంబుల్పి నాలింపమో?
నానాటన్ నగభేదిపీటఁ గల గంధర్వాప్సరో గాన వి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో? అందైన నెందైన విం
దైనాదం బొనఁగూర్చునే? మదికి నిట్లానంద సందోహమున్"

అనే పద్యంలోవున్న "విందైనాదంబు" అనే ప్రయోగం నా "విందైన పుష్పమ్ములన్" అనేదాన్ని సమర్థించదా? అసలు ఆక్షేపణ వాక్యాలు చూపి మరీ ప్రశ్నించడం యుక్తం కనక అట్లా చేస్తాను. "విందు, చుట్టములకుఁ బెట్టుభోజనము విందు తినఁదగినది. పుష్పములు తినఁదగినవికావు. ఇట్లు కవిసమయము లేదు. విందునకు పరిమళార్థము మందుకైన లేదు" యీ యాక్షేపణ పండితకవులు కాదు కాదు "కళాప్రపూర్ణులు" చేయఁదగ్గదే అవునా? గానం తినఁదగ్గదనియేనా? వసుచరిత్రలో అట్లు కవి వాడు కొన్నది! గానం చెవికి విందైనట్లే పుష్పములు ముక్కుకు విందు కావా? ఇదే కుదరక పోతే "శ్రవణపేయం" వగయిరా కాళిదాసాది మహాకవుల ప్రయోగాలు కుదురునా? రఘువంశంలో కాళిదాసు "పపౌ నిమేషాలస పక్ష్మపంక్తి రుపోషితాభ్యా మివ లోచనాభ్యామ్" యీకవిత్వం కుదురుతుందా? దిలీపమహారాజును భార్య నేత్రములచేత పానంచేసిం దంటాఁడే? కాళిదాసు; దిలీపుఁడు పానార్హమైన ద్రవపదార్థమేనా? అంటే గతేమిటి? పోనివ్వండి విషయం విస్త

రిస్తూవుంది. యిదే వృత్తిగా పెట్టుకొన్న నాకు వృథా అని తోఁచకపోయినా వుపకారార్థం యిందు జోక్యం కలించుకోవలసిన తమకున్నూ మిక్కిలీ విలువగల తమ కాలమునకున్నూ అనవసరంగా తోస్తుందేమో? మొట్ట మొదటి పద్యరచనాన్ని గూర్చియ్యేవే నన్ను మందలించవలసి వుంటే మందలించ కోరతాను. వారు నా "బొబ్బిలి" లో పట్టిన తప్పులు వేలు వున్నాయి. మచ్చుకు కొంచెం చూపి వున్నాను, ఆతప్పులలో యివి యెప్పటికీ సమర్థనీయాలు కావని గురువులు నమ్మకొన్నవి కనక యిందు వుటంకించాను. సంస్కృతవ్యాకరణానికి సంబంధించినవి కూడా చాలా తప్పులుపట్టి వున్నారు గురువులు. మచ్చుకు వకటి చూపుతాను శ్రమ కలిగిస్తూవున్నందుకు క్షమించండి. నేను "బొబ్బిలిలో" "చ. గిరులన్ దరులన్ గిరి నిర్ఝరులన్, వనపంక్తులన్" అంటూ వకపద్యంలో నిర్ఝరీ శబ్దతత్సమ బహువచనాన్ని "నిర్ఝరులన్" అని ప్రయోగించాను. గురువులు ఆక్షేపించారు. ఆక్షేపించి వూరుకోలేదు. "స్త్రీలింగం వుండ దంటూ వ్రాస్తూ వా పక్షంచేత స్త్రీలింగం వున్నప్పటికీ "నిర్ఝరిణులు" అని వుండవలసివస్తుం దంటూ వ్రాశారు కూడాను. గట్టిగా నోరెత్తడానికి నాకు అధికారం లేదు. ఆయీ వ్రాఁత చూస్తే దుఃఖం పొర్లిపొర్లి వస్తుంది. వొక్కొక్కప్పుడు నవ్వున్నూ వస్తుంది. కాని నవ్వడానికిన్నీ నాకు అధికారం లేదు. నాకు శ్రీవారు కావ్యాలు చెప్పిన గురువర్గంలో వక్కరు. నవ్వునేలాగో దిగమింగుతూ వున్నాను. దుఃఖాన్ని దిగమింగ లేక మీకూ మీకూ శ్రమ కలిగిస్తూ యీలా వెళ్ళఁబోసుకుంటూ వున్నాను. ప్రస్తుతాన్ని చిత్తగించండి "అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిరస్సరర్ఝరీపటల." అని మనుచరిత్రలో వుందికదా? అమరంలో "నిర్ఝరోఝరః" అనిమాత్రమే వున్నది. అక్కడ వ్యాఖ్యానంలో "ఝరీ" అని పాఠాంతరాన్ని చూపివున్నాఁడు. పాణినీయప్రవేశం యేమాత్రం వున్నా యింతటితో నా "నిర్ఝరులన్" అనేది సాధింపఁబడు తుంది. అయితే వచ్చినవాదం శ్రుతమాత్రపండితులతో కావడంచేత

యింతా ప్రయత్నం కావలసివచ్చింది. రావణ భుజంగ స్తోత్రంలో— "నిలింపనిర్ఝరీధరః" అంటూ ప్రయోగత్రయం "నిర్ఝరీ" అనేదే దొరికింది. కాని రావణాసురుడు కవి అని ఋజువు చేయమంటారేమో? అందుకు ఆయుగంలో వుండే సాక్షు లిప్పు డెక్కడ దొరుకుతారు? అని భయమేసింది. మఱికొన్ని గ్రంథాలు చూదామంటే? పల్లెటూళ్లో ఆ సౌకర్యం వుండ దని మనవి చేయ నక్కఱలేదు. నాదేహావార్ధక్యం యిల్లు కదిలి వీథిగుమ్మందగ్గిఱకు కూడా వచ్చే స్థితిలో లేదు. యేంచేసేది? యెవరిదగ్గిఱో "హరవిలాసం" కంటబడింది. యిందుకోస మనేకాదు గాని యెందుకో తిరగేయడానికి మొదలెట్టాను. "నిర్ఝరుల బాటెడి తియ్యనిసీరు" దొరికింది. బ్రతికాను బాబూ! అనుకున్నాను. కాని యీ శ్రీనాథప్రయోగం యతిస్థానంలో వుందా? లేదు. ఆపద్ధతిని గురువుగారు దిద్ది పాఱవేస్తారు. మచ్చుకు వారి దిద్దుబాటు ధోరణి చూపుతాను. "కావున శాంతిఁ బొందుటయె కర్జము తా నది యట్లు లుండె శ్రీ,గావలె నంచు...." అనే భారతప్రయోగం చూపుతూ దీనితోపాటు మఱికొన్ని ప్రయోగాలు చూపితే యివన్నీ "కాదగున్" అని దిద్దవచ్చు నన్నారు. దీన్నిబట్టి చూస్తే యతిప్రాసభంగాన్ని కూడా చూడకుండానే స్థూలదృష్టిని గురువులు దిద్దుతా రని యెఱిఁగివుండీకూడా దానికోసం యత్నించాను. అంతట్లో "....అని, రోధక్షతజోగ్రనిర్ఝరులు గనుపట్టెన్" అనేది యతిస్థానంలోనే పిల్లలమఱ్ఱిమహాకవిది దొరికింది. దొరికితేమాత్రంలాభం యేమిటి? దీన్ని "బుడబుక్కల" ప్రయోగం అంటారు, పరిహసిస్తారు. యేమిటి చేసేది? యీ దిద్దడం యెంతో ఘోరంగా కనపడు తుంది. ప్రమాదపడి తప్పనడం, దాన్ని సమర్థించుకోవడానికి యిచ్చినదల్లా దిద్దడం. వారిపరిశీలన యెట్టిదో? చూడండి. 'కలియు' అనునది యికారమధ్యము కాదు" అని ఆక్షేపించినారు గురువుగారు. చిన్నయసూరి "కలపము" అనేరూపాన్ని సాధించడానికి ప్రత్యేకంగా "కలియున కత్వంబగు" అనే సూత్రాన్ని రచించుకున్నాడు. దీన్ని బట్టి నేను పైని వుదాహరించిన

అంశం అంటే ? పరిశీలన యేలాటిదో ? తేలుతుంది. వారు నన్ను పరమ మూర్ఖుణ్ణిగా వ్రాసి వున్నారు. అందుకు నాకు విచారం లేదు. యెంతమూర్ఖుణ్ణి కాకపోతే ఆయీపరిశ్రమ యెందుకు చేస్తాను ? కాని మీబోట్లవల్లి మిన్నాగా గౌరవింపఁబడ్డ గురువుగారు యిట్టి ఆక్షేపణలు చేస్తే మీరు యేమనుకుంటారో ? అని నేనువిచారిస్తాను. శ్రీజయంతివారిని పద్యరూపంగా కోరినా మిమ్మల్ని వచనరూపంగా కోరినా నేను నారచనలో వారు చూపిన శాబ్దికదోషాలు కాని ఆర్థికదోషాలుకాని నిలిచేవేనా ? అనేకాని వారిపాండిత్యం యెట్టిది ? అనేదికాదు. వారు జగదేకపండితులు "నచ శంకా నచోత్తరం." నిర్ఝరీశబ్దవిచారము, శాస్త్రవాసనవున్న "కళాప్రపూర్ణ" లతోఁగాని, "మహామహోపాధ్యాయ" లతోఁ గాని, వస్తే యింత చిక్కువుండేది కాదు. అమరంలో వ్యాఖ్యాత చూపిన "ఝరీ" అనే పాఠంతరంతోటే తీరిపోయేది. యిప్పుడో శాస్త్రం చూపినా ప్రయోజనంలేదు, ప్రయోగాలు చూపినా లాభంలేదు. వారు పట్టిన కుందేటికి మూఁడేకాళ్లు. అయితే యీమాత్రం లోకం గ్రహించదుకనకనా ? యెందుకీ వృథా పరిశ్రమ అంటారేమో ? ఆలకించండి. వారు సుమారు ఐదు వందలపద్యాలుగల నా "బొబ్బిలి" గ్రంథంలో యెన్నోదోషాలు వదిలిపెట్టి జాబితా వ్రాస్తే 2000 లు దోషాలు కనపడ్డట్టు వ్రాసివున్నారు. పైఁగా "బొమ్మలాట" "భాగోతం, పొగటివేషాలు" ఇత్యాది మాటలతో నాకవిత్వాన్ని అపవదించి వున్నారు. లోకంలో నన్ను మఱివక్క రెవ్వరేనా యీలా అపవదిస్తే సామాన్యజనం విశ్వసించదేమో కాని మీవంటి పరమోత్కృష్టులచేతనున్నూ గవర్నమెంటు చేతనున్నూ గొప్పగొప్ప బిరుదాలు పొందినవాడు అపవదిస్తే సామాన్యలోకం విశ్వసిస్తుఁదిగదా ? ఆ విశ్వాసాన్ని తొలఁగించుకోవలసి వస్తే "అన్యథా శరణం నాఽస్తి" కదా ? అందుకోసం నే నీపాట్లు పడుతున్నాను. దీనికి సాక్షాత్పరంపరాకారణం మీవంటిమహనీయులు. యిది తొలఁగవలసివస్తే మీవంటివారివల్లనే తొలఁగాలి "వజ్రం వజ్రేణ

భిద్యతే" మీవంటివారు పెద్దగా గౌరవించిన వారికంకలు సుఖసుఖాల తీరతాయా? యెవరికేనా ప్రమాదం వుంటుంది. అట్టిది నాతాలూకుది పకటి చూపుతాను. "తనసేన న్నడిపించి ఘానుకొమరున్ దద్వైరిబంధ మ్మునుండి నిమేషమ్మునఁ దెచ్చి యిచ్చుటయుఁ దర్ధీరత్వమున్" అనే పద్యంలో ప్రమాదవశంచేత రెండోచరణంలో బిందుపూర్వక డకారానికి బిందుపూర్వకం గాని ధకారం విశ్రమస్థానంలో పడింది. యిది నేను వప్పుకోక చేసేదేమిటి? యిక్కడల్లా గురువుగారివాదం వెంకటశాస్త్రి జ్ఞానమే యింతటి దని. నావాదం ప్రమాదంగాని యిది బుద్ధిపూర్వకం కాదని యేలాగయితేనేమి తప్పని వొప్పుకుంటూ వున్నప్పుడు మీబోట్లేదో నిర్ణయించనే నిర్ణయిస్తారుకదా? యింకొకస్థలంలోకూడా నేను వప్పుకో తగ్గది కనపడుతుంది కాని అది అదృష్టవశంవల్ల శాస్త్రానికి అనుగుణ మవడంచేత ఆక్షేపకులకే బాధకం కావలసి వచ్చింది. స్థలం వుదాహరించి మఱీ చర్చిస్తాను.

"చ. అలనిసిశేషమున్ నృపతి హాయిగఁ గడ్పినమీఁద నోలిమైఁ
దెలతెలవాఱఁ జొచ్చెఁ దొలిదిక్కుల భాస్కరుతేరివారువం
బుల నెమరోయనంగ........................ ... ..."

యీ పద్యంలో గుఱ్ఱాలకు నెమరు వుండదు గనుక అని యెత్తుకొని యేమేమో ఆక్షేపించారు. గడ్పిన అన్నది, గప్పిన అని అచ్చులో పడింది. దాన్నిగూర్చి కూడా చాలా చర్చించారు. "యీమాత్రం తెలియని వెంకటశాస్త్రి యేమో పెద్ద కవి అంటూ వ్రాయడానికి మొదలెట్టేరు మీరు" అంటూ శ్రీ జయంతివారిని గురువుగారు గట్టిగా మందలించివున్నారు. నిజానికి నాకు గుఱ్ఱాలు నెమరు వెయ్యవనేసంగతి తెలియదు. యేమీ? యెందుకు తెలియాలి! "నహి సర్వస్సర్వం విజానాతి" "సర్వజ్ఞత్వము సాంబమూర్తిది" కదా! భవతు. ఏనుఁగులకా? సిఖ్లు చూపడం, సింహాలకా? ఆక్షేపకుల కీవిషయం యెంతవఱకు తెలుసునో వారి భార తంలో సింహానికిసిఖ్లుచూపిన ఘట్టాన్ని, వుదాహరించి "యిదెక్కడి

సంప్రదాయ" మని తమవంటివారు ప్రశ్నిస్తే జవా బేమిటి? అది "నిరుత్తరః పూర్వః పక్షః" అవుతుంది. ఇట్టి వెన్నో చూపఁగలను. కాని అది నే పెట్టుకొన్నపని కాదు, ఆయన గురువు, నేను శిష్యుఁడను. ఆయన యెట్లో నన్ను గేలి చేయవచ్చును, తప్పుగానిది కూడా తప్పని నాశక్తిని పరీక్షించ వచ్చును. నేనో? తప్పయినప్పంటికీ వారిదాన్ని తప్పని నిరూపించ కూడదు. నిరూపిస్తేనో? "ఏకాక్షరప్రదాతృ" న్యాయాన్నిబట్టి కుక్కగా పుట్టి తరవాత చండాలుఁడుగాకూడా అవతరించ వలసి వస్తుంది. యీ ధర్మశాస్త్రానికి నేను కట్టుబడేవాణ్ణే, వుల్లఘించేది లేదు. అయితే యేంచేసేది? వారు నన్ను తోఁచినట్లల్లా అపవదించి అపలపించి యీ పాపాన్ని యీ వార్ధక్యంలో నాకు అంటఁగట్టుటకు సంకల్పించి వున్నారు. అందుచేత యేకొంచెమో? ప్రసక్తానుప్రసక్తంగా వారి ప్రమాదాలు ప్రతిబంద్యుత్తరంగా నేను స్పృశింపక తప్పిందికాదు. గాని ప్రత్యేకించి ఆపనికి మాత్రం పూనుకో లేదు, పూనుకుంటేనో? లోకం యెంతవఱకు విశ్వసిస్తుందో? కాని 'పద్దెనిమిది పర్వాలకున్నూ మళ్ళా అందులో మూఁడోవంతేనా దోషాలజాపితా తిరుగులేనిది బయలు దేఱక పోతుందా; చేయఁదలఁచనిపని గదా? అది, అందుచేత దాని ప్రస్తావన యెక్కడెందుకు? యిక "గుఱ్ఱాలనెమరు" ను గూర్చి నాకు తెలియకపోయినా నాది సమర్థింపఁబడడం యేలాగో చూపుతాను. "తొలిదిక్కు, అలభాస్కరుతేరి వారువంబుల నెమరో యనంగఁ దెలతెలవాఱఁజొచ్చె." అని సమన్వయము. తెలవాఱుజామున తూర్పుదిక్కు తెల్లఁబడడాన్ని గ్రంథకర్త యీ రీతిగా ఉత్ప్రేక్షించాఁడు. ఉత్ప్రేక్ష అన్నప్పుడే అప్రసిద్ధం అని విజ్ఞులైన ఆలంకారికులు గుర్తిస్తారు. గుఱ్ఱాలకు నెమరు వుండడం అప్రసిద్ధమవడంచేతనే యిచ్చట అలంకారం ఉపమకాక ఉత్ప్రేక్ష అయిందంటే వొప్పుకోని ఆలంకారికు లుండరు. యీ మాట నవీనాలంకారిక మతానికి సంబంధించింది. ప్రాచీనమతంలోనో? దీన్ని అభూతోపమాలంకారం అన్నారు. అభూతోపమ అంటూ మళ్ళా సంఖ్యాపూరణకోసం

ఒక కొత్తపేరును అంగీకరించడం యెందుకు? ఉత్ప్రేక్షలో అంతర్భావం చెపితే తీరిపోతుందన్నారు నవీనులు. నా "గుడ్డాలనెమరు" నేను తెలిసిక ప్రయోగించిందే అయినా యీ ఉభయుల మతంలోనూకూడా సమర్థింపఁబడుతుంది. వారి "సింహపుసిల్లు" యేమయినా నాకు అక్కఱలేదు. పై విషయానికి మాఘంలో ప్రథమసర్గలో "పతత్పతంగప్రతిమస్తపోనిధిః" అనే శ్లోకవ్యాఖ్యానంచూస్తే సర్వమూ తేలుతుంది. అందులో నారదమహాముని ఆకాశాన్నుంచి కృష్ణమూర్తిగారి యెదుటకు దిగడాన్ని "పడుతూవున్న సూర్యుఁడితో" పోల్చాఁడు మాఘమహాకవి. దాన్ని అభూతోపమగా పెద్దిభొట్లుగారు వ్రాసినారు. నవీనులు ఉత్ప్రేక్షగా జమకట్టుకున్నారు. అక్కడ సూర్యుఁడు ప్రసిద్ధపదార్థమే అయినా పడుతూవున్న సూర్యుఁడు ప్రసిద్ధపదార్థం కాదు (యిక్కడ విశేష బాధావప్రయుక్త విశిష్టాభావం) ప్రస్తుతం యితర జంతువులకు నెమరు ప్రసిద్ధమే అయినా గుడ్డాలకు అప్రసిద్ధం. వ్రాస్తే యింకా వ్రాయాలి. విజ్ఞుల కింతతో సర్వం గతార్థం. యీలాటి సమర్థనం వున్నప్పటికీ అసలుమాత్రం నేనింత విచారణచేసి చెప్పింది కాదు కనక యథార్థాన్ని మొట్టమొదట నేను వొప్పుకున్నాను. నూటికి వకటో రెండో యీలాటివి వుంటే అవి సమర్థనీయా లయినా నేను ప్రమాదాలనే వొప్పుకుంటాను. నూఱింటిలోనూ యీలా రెండుపోతే 98 వారు వృథాగా ఆక్షేపించిన వుంటాయికదా? ఆతొంభై యెనిమిదిన్నీ ఆక్షేపకుల విజ్ఞత్వాన్ని బయటఁ బెట్టి "ఆక్షేపకులు ఆక్షేపించఁబడేవారికన్న 98 రెట్లు విజ్ఞత్వంలో వెనకపడతారు" అని సిద్ధాంతీకరిస్తాయంటారా? సుఖసుఖాల పోనిస్తాయంటారా? అని మిమ్మల్ని నేను ప్రశ్నిస్తాను. యీ "నెమరు" నుగూర్చిన శంకలకు నాకు చింతలేదు. అడగావచ్చు, సమాధానమూ చెప్పవచ్చు. మఱికొన్ని చూడండీ? "కవీంద్రస్తుతమౌచు మాఘము పదంపడి మాసము వచ్చె" అనివొకచోట వొక వాక్యం వుంది. "పాఠక్రమా దర్థక్రమో బలీయాన్" అనే న్యాయం పద్యకవిత్వానికి చాలాచోట్ల వుపాదేయమేకదా? పదంపడి మాఘమనేపేరు

గల మాసం వచ్చిందని అన్వయించుకోవడానికి బదులు "మాఖము పదం పడిమాసము" అని సమస్తపదం చేసుకొని మాఖం తరవాత వచ్చేమాసం ఫాల్గునమని అర్థం, అని పొరఁబడి హాస్యం చేయడాని కేమంటారు? వారు పొరఁబడి చేసిన అర్థంవల్ల చిక్కేమిటంటే? తర్వాత పద్యంలో మాఖపూర్ణిమనుగూర్చిన ప్రసంగం వుంది. ఆకారణంచేత ఫాల్గునమాసానికి అనంతరమందు మాఖం వచ్చిందని వెంకటశాస్త్రి వర్ణించాఁడు కనుక శుద్ధమూర్ఖుఁడని వెక్కిరించడానికి అవకాశం కలిగింది వారికి. ఆ యీ స్థలంలో పరస్పర విరుద్ధం లేకుండా సమన్వయం చేసుకోక వ్యస్తాన్ని సమస్త మనుకొని తొందరపడి ఆక్షేపించడం యుక్తమేనా? "కశ్చిత్కాంతా" అని చదివేచదవడంతోనే కాంతా శబ్దం స్త్రీలింగంకదా? దానికి కశ్చిత్తనేది విశేషణ మేలా అవుతుందని శంకించడంవంటిదేనా? యిది కాదా? కానివ్వండి అచ్చులో క్రౌనుసైజులో చరణంవక్కంటికి వొక్కొక్క పంక్తిగా యిమడ్చడంవల్ల మాఖముపదంపడి అనే పదద్వయానికి మధ్య స్పేసు లేకపోవడంవల్ల అది సమస్తపద మనుకొని పొరఁబడడం తటస్థించిం దంటారా? అయితే పాండిత్యానికి స్పేసులేనా నిర్ణాయకాలు? కానివ్వండి.. యీశంకకూడా చిత్తగించండి.

క. పరివారదైవతమ్ముల
దరిసెన మొనరించి ముద మెదం బొదలఁగ భూ
వరుఁ డల్లరాజ్యలక్ష్మిని
దరిసించెన్ స్వామివారిదయితన్ బ్రీతిన్.

ఈ పద్యంలో అర్థం కఠినంగా లేదుగాని సంప్రదాయం కొంచెం తెలియాలి. అది ఆ సీతారాంపురంలో వేంచేసివున్న దేవునిభార్య పేరు రాజ్యలక్ష్మీదేవి అనేది మాత్రమే. స్వామివారి దయితన్ అన్నది సమస్త పదం గాని అందులోవున్న "దయితన్" అన్నది వ్యస్తపదం కాదుగదా? అట్టిస్థితిలో "దయితన్" అని విడఁదీసి దోషోద్ఘాటనం చేసేవారి హృదయాన్ని మీరే నిర్ణయించవలసిం దంటాను. ఆక్షేపకుల దోషోద్ఘాటనాన్ని

చూపుతాను. "యింద దయితన్ దరిసించె నని యపార్థము స్ఫురించు చున్నది. యీ అపార్థమునకు తాము సమ్మతింతురా? అన్నిటికన్న అద్భుతమైన ఆక్షేపణాన్ని చూపుతాను. "శా. మాపూర్వోక్ ధపదీయపాదము లసామాన్యస్థమై" అనే పద్యంలో, పాదములు అసామాన్యస్థ అని పద చ్ఛేదం స్పష్టంగా ప్రకృతోచితమైనది కనఁబడుతూవుంటే "పాదములన్ + సామాన్యస్థ" అని విఱిచి యేమేమో రెండు ఆక్షేపణలు నన్నుఁగూర్చిన్నీ, కృతిపతి బొబ్బిలిరాజుగారిని గూర్చిన్నీ గురువులు చేసివున్నారు. యిందుకు తా మేమంటారు? స్ఫోను మాత్రం వారి పదచ్ఛేదానికి మార్గదర్శకంగా వుంది. అంతమాత్రంచేత అపమార్గంలో పడడం పాండిత్యలక్షణమేనా? యిదేమా దిరిగా మిక్కిలీ ప్రమాదానికి లోనయి, నన్నూ నాకవిత్వాన్నీ కృతినాయకుణ్ణీ యెంత నిందించాలో అంతా నిందించి యిట్టి చిక్కు తెచ్చుకున్నారు గురువు గారు. ఆయీ ప్రమాదాలు యిప్పుడు వారికి అవగతమైతే కాకపోలేదు గాని అయితే మాత్రం యేం లాభం? యేలాగో కలగఁజేసుకున్న తీర్పులను కూడా గేలిచేసి నెగ్గుకుపోలేకపోతామా? అని ఆత్మవంచనోక్తులు వ్రాస్తూ వున్నారు. ఆ వ్రాఁతలు వారి హృదయదౌర్బల్యాన్ని ప్రకటించడం లేదని తాము చెప్పఁగలరా? యిది పకరు తెచ్చిపెట్టిన చిక్కు కాదు. స్వయం కృతం. అయితే నేను తత్త్వం తెలిసివుండీ కూడా వారికి బాధకంగా వుండే నా ప్రయోగ సమర్థనానికి ప్రయత్నించకూడదు. ఇది పాపహేతువే. వారు తెచ్చుకున్నదైనా నేను దాని తత్త్వం తెలపకపోతే యెవరో ఓపంటి వారికి తప్ప సర్వసామాన్యంగా గురువుల పాండిత్య సందర్భం తెలిసేది కాదు. యిప్పుడో? నేను గురువులుచూపినవన్నీ నా ప్రమాదాలే అని వొప్పుకొన్నప్పటికీ ప్రయోజనంలేదు. అందుచేత వారిచిత్తానికి నొప్పిగా వుండవలసివచ్చింది. యీ నొప్పికి నా "బొబ్బిలి" కవిత్వమే సాక్షాత్పరం పరాగా కారణ మవడంచేత నేను దోషిని కావలసివచ్చిందనుకుంటాను. మన హిందూశాస్త్ర మర్యాదనుబట్టి గురులోపాలను శిష్యుఁడు చూపడానికి వప్పు కోదు పరి కదా? యెవరేనా యితరులు చూపడానికికూడా అంగీక

రిస్తే పాపం చుట్టుకుంటుందని కనపడుతుంది. ఆ పాపానికి జంకి వారి లోపాలు చూపక వూరుకుందా మంటే లోకానికి తత్త్వం తెలియకపోవలసి వస్తుందేమో నని నా భయం. అయ్యా! యీ వొక్కటీ చిత్తగించండి. నేను ఆటవికులనుగూర్చి "ఆ జంతువు లేగి రయ్యాచలజాలవిశాలవనాళి వెంబడిన్" అని, జంతుపదంతో వాడివున్నాను. జంతుపదం లక్షణయా జంతుసదృశులైన మనుష్యులను చెప్పుచున్నట్లు కనుపడుచున్నా వారు "జంతువు లేగిరి" అని వుండకూడ దంటారు. మొదట అన్నారు సరే? అది ప్రమాద మనుకుందాం. మళ్ళా జయంతివారిని యేమేమో గేలిచేస్తూ యిప్పుడుకూడా యేలా ప్రశ్నిస్తారో? చూడండి. "కృతిభర్తగారూ! 109 వ పుట 70 వ పద్యము జంతువు లేగిరి" ఇట్లు సరియందురా?" యిది యెక్కడిధైర్యం. యిది యెక్కడి పాండిత్యం? యింతమాత్రం కూడా వారికి తెలియదని అనుకోవడం యేలాగ? వారి అభిప్రాయాన్ని బట్టి "జంతువు లేగెను" అని అమహత్కర్తృకక్రియగా దిద్దుకొని మీవంటివారి ఆక్షేపణకు పాత్రుణ్ణి కావలసిందేనా? యేమిటి కర్తవ్యం? యిదేమాదిరిగా నా "బొబ్బిలి" యావత్తూ విమర్శించారు గురువుగారు. శతానికి వకటిరెండు ప్రమాదాలు వుంటా యని నేనే కంఠోక్తిగా వప్పుకుంటూ వున్నాను. ఆత్మవంచనకి నేనుకూడా సిద్ధపడేటట్టయితే ఆమాత్రం కూడా నిలవడంకష్టం. కాని నామార్గం అట్టిదికాదు. అందుచేతే "జయంతి" లో యీలా వ్రాశాను.

మ. ఒకటో రెండొ శతానకు న్నిలుచునో యొక్కండును న్నిల్వదో
ప్రకటింతున్ సమయంబు నీయెదుట పాండిత్యమే కాక దే శ్య
శికు పాండిత్యముకూడ నీవెఱుఁగు దీ "చెళ్ళిళ్ళ" యే రేఁగుచో
నిఁక దిక్కెక్కడ? కృష్ణభారతగవీన్మృత్యానకున్ జూడవే?

(జయంతి. లో)

గ్రంథరచనకు శ్రుతపాండిత్యంకూడా పనిచేస్తుంది. వకరిని వెక్కిరించవలసివస్తే యేలాటి పాండిత్యం వుండాలని తమ అభిప్రాయం?

నా అభిప్రాయం, యేదో పెద్దపదవిలోకి యేలాగో అడుగుపెట్టినవున్నవారు యీలాటి విమర్శనాభాసాలకు వుపక్రమించకూడదనిమ్మాత్రవే. యీ అభిప్రాయాన్ని జయంతిలో

శా. ఏదో పెద్దపదానఁ గాలిడినతా మేలబ్ధికై యిట్టి దు
ర్వాదమ్ముల్ పచరింపఁగా వలయు ? నీవాదాలకున్ బాండితి
స్వాదం బొండొకఁ డుండఁగావలయు స్వల్పం బైనచో " గోఁచికిం
బై దాఁటున్ సరిపోదు గోణమున " కన్పల్కుల్ స్మరింపించెడిన్

అని వ్రాసివున్నాను. యీ విషయంలో తమరుకూడా యిట్లే అభిప్రాయపడ్డట్టు విన్నాను గాని దానికి తగినంత ఆధారం లేకపోవడంచేత యీలాగు మళ్లా ప్రశ్నిస్తూన్నాను.

ఉ. స్త్రీలనుగూడఁ గొందఱు పతివ్రత లొక్కొక చిక్కునందు ని
ర్వేలమనీష వంశమభివృద్ధికి రాఁదగునట్టితంత్రముల్
పాలక సత్కుటుంబినులు పాడిగఁ జేయుట యెందు విందుమీ.
శీలవతీలలామ మిటఁ జేసిన సత్కృతి కవ్విలొచ్చగున్.

అయ్యా ! చేదస్త మని యెఱిఁగీనిన్నీ, గతంలో జోలెఁడు వ్రాసి అదే తాము నిరసిస్తారని అనుమానించీనిన్నీ మళ్లా వకపద్యాన్ని వ్రాసి ప్రశ్నిస్తూన్నాను. ఆ యీపద్యం బొబ్బిలివారి వంశంలో వకపతివ్రతాశిరోమణికి సంబంధించినది. ఈ "శీలవతీలలామ" యేమి చేసిం దంటే ? వంశాభివృద్ధి చాలా తక్కువగా వుండడం చూచి దీనికి కారణ మేమైయుండు నని ఆలోచించి అంతకుపూర్వం బొబ్బిలివారుండేకోటను వదలిపెట్టి కొత్తకోట కట్టించింది. పూర్వం రాజకుటుంబంలో యీలాటిచిక్కు తటస్థిస్తే కొందఱు పతివ్రతలు కొన్నితంత్రాలు శాస్త్రీయమైనవే చేసివున్నట్టుంది కాని అవికూడా యుక్తమైనవే అయినా ఈ "శీలవతీ" శిరోమణి చేసిన కార్యానికి లొచ్చు అవుతా యనేకాని ఈ పద్యంలో యితరార్థం యెంత యత్నించినా వాచ్యంగా కాని వ్యంగ్యంగా కాని స్ఫురించదుకదా ! యిందులో దురర్థం వుం దంటూ వొకసారి కాదు, అసకృదావృత్తిగా

గురువులు వ్రాస్తారు. ఆ వ్రాయడం కేవలం పరవ్రతారణ కంటారా? లేక వారిమనస్సుకేనా ఆలా తట్టి వుండు నంటారా? వచ్చే దురర్థం సత్య వతి, కుంతి లోనైనవాళ్ళకు తగులుతుంది కాని ప్రస్తుతమైన "శీలవతీ లలామ" మునకు తగులదుకదా! వ్యతిరేకాలంకారస్థలాల్లో సర్వత్రా ఉపమానంకంటె ఆధిక్యం వుపమేయమందు రావడం కవివివక్షితమే కదా! సత్యవతి, కుంతి, లోనైనవారు వంశాభివృద్ధికి చేసినకృత్యాలలో మన మెంత సరిపెట్టుకొన్నా పరపురుష సాంగత్యరూపదోషం వుంది. అది దోషమైనా పెద్దలు కారణాంతరంచేత అవసరాన్నిబట్టి కొన్నినియమాలతో అంగీకరించారు. యిక్కడ పాతకోట వదిలి పెట్టడమున్నూ కొత్తకోట కట్టడానికి ఆరంభించడమున్నూ యింతేకదా! జరిగింది. యెన్ని విధాల గాలించినా పద్ధాలుగులోకాలవఱకూ బుద్ధిని పోనిచ్చి పరిశీలించినప్పటికీ ప్రస్తుత మెవరివర్ణన కీపద్యం పుట్టిందో, ఆ "శీలవతీలలామ" మునకు గౌరవాపాదక మైన వ్యంగ్యమేకాని లాఘవాపాదకమైన వ్యంగ్యం లేనే లేదు. మున్మాటికిన్నీ లేదనే ధైర్యం నన్ను బాధించడంచేత యింతగా మిమ్మ నేను వేధిస్తూ వున్నాను. ఆక్షేపకుల కీపద్యతత్త్వం తెలియ దను కోవడానికి కారణం కనపడదు. తెలియదని నేను వ్రాస్తానే అనుకోండి, లోకం విశ్వసిస్తుందా? ఈ పరిశ్రమంతా యెందుకు? లోకంకోసమే కదా! యిందు శాస్త్రవిషయమైన చర్చ లేశమున్నూ లేదుకదా! ఈ ఆక్షే పణ కేవల పరప్రతారణ తాత్పర్యంతో వుపక్రమించిం దనడానికి మీరంగీక రిస్తారా? లేదా? అవసరం లేకపోయినా ఆ "శీలవతీలలామ" ము చేసిన పనిని తెల్పే పద్యంకూడా యిక్కడ వుదాహరిస్తాను.

తే. గీ. స్థలశిలాభోగమహిమలు దైవమునకుఁ
గాక మనుజుల కెటు లెఱుఁగంగ నగును?
క్రొత్తకోట గట్టినమొదల్ కొనలుసాగెఁ
దనదువంశంబు తామరతంప రగుచు

ఆ "శీలవతీలలామ" ము చేసినపని యిదిమాత్రమే. మా అదృష్టం ఫలించి తామింపు జోక్యం కలిగించుకోవడ మంటూ వుండాలిగాని, అదే వుంటే దీనికి సంబంధించిన రికార్డు అవసరమైన దంతా తమ సన్నిధికి పంపుకుంటాను. మొట్టమొదటి పద్యాన్ని అన్వయించుకోవడానికి అంతో యింతో భర్తృహరిశ్లోకం "యౌవనం ధనసంపత్తిః" అనేదానితో సంబంధమేనా వుంది కనక అది సమయానికి జ్ఞప్తికిరాక "అర్థమేమో? విచారింప నగు" అన్నా రనుకుందాం. ఈ పద్యాని కట్టి చిక్కు లేదుగదా! యెంత పరిశీలించినా నాకు దురర్థం కనపడదు. శ్రీ జయంతి వారుకూడా "అప్రతిషిద్ధ" న్యాయంచేత ఈ ఆక్షేపణవిషయంలో తమ అసమ్మతిని తెల్పినట్లయింది. వ్యాకరణవిషయాన్నే యెత్తుకొని తమకు తోఁచిన లక్ష్యాలు చూపించి గురువుల ప్రమాదాన్ని ఖండించి వున్నారు. మళ్లా గురువులవారు వ్రాసే ప్రశ్నలో! యేలా వున్నాయో చిత్తగించండి. "ఆపద్యమునందలి యశ్లీలముమాట విడిచినారేమి? మీకు గోచరింపలేదా? అది అశ్లీలము కాదందురా? అనుటకు సందేహము లేనివారే గ్రామ్యవాదులే, యవి యిప్పటికిఁ దెలిసికొంటి" ఈ వృథాధార్ష్ట్యము వుపేక్షింపతగ్గదేనా? యెన్నో సందర్భాలు తమరిని ప్రశ్నింప వలసివున్నా ప్రధానాంశాన్నే ప్రశ్నించాను. వీరికి వున్నస్థానాన్నిబట్టి వీ రేమంటే అదే జనసామాన్యం నమ్మవలసి వస్తుందికదా! "మహాజనో యేన గత స్స పంథాః" అది యస్మదాదులకు బాధకం గాదా? అట్టియన్యాయాన్ని మీబోట్లు వుపేక్షించడం న్యాయమా? జయంతి పంతులుగారు "గ్రామ్యవాదు" లఁట! వారి నటుంచుఁడు. గిడుగువారు "గ్రామ్యవాదులు" గ్రాంథికభాషలో గిడుగువారికిఁగల పాండిత్యంలో మా గురువుగారి కెన్నో వంతుపాండిత్యమున్నదో? తామే నిర్ణయించి వచింపవలసి వుంటుంది. యేదో దీర్ఘాయుర్దాయం పట్టింది కనక భారతం పూర్తిచేశారు. మునుపు ముగ్గురుకవులు చేశారు. వీరొక్కరే చేశారు. యిదేనా పాండిత్య ప్రకర్షకు హేతువు? 15 పర్వాలు వ్రాసిన తిక్కన్నగారు నన్నయ్యగారియం దుండేగౌరవాన్ని

పురస్కరించుకొని "అం, దాదిదొడంగి మూఁడు కృతు లాంధ్రికవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని వ్రాసి తరవాయినే పూర్తిచేసినాఁడు కాని ఆమూఁడుపర్వాలున్నూ మూఁడు మాసాలల్లో తాను పూర్తిచేసి ఈపేరుకూడా దక్కించుకోలేకపోయినాఁడా ? వీరి కట్టిగౌరవం వారియందు లేకపోవడమేనా పునఃపాకానిక్కారణం ? భవతు. యేమైనా చేసినపని మంచిది కనుక గౌరవార్హమే అందాము. రామకోటి వ్రాసినవారినే గౌరవించేటప్పుడు వీరి నేల గౌరవింపరాదు ? ధాన్ని నిల్పుకొనుటకు వీరిప్రస్తుతోద్యమం తోడ్పడుతుందా ? వాక్కసారికాకున్ననూ క్రిమక్రిమంగా మీవంటి ప్రాజ్ఞులవల్ల ఆ ఈ గురువిమర్శనయం దుండే తత్త్వం బయట పడక పోతుఁదా ? నాకు తాము ప్రత్యుత్తర మివ్వకపోయినా యేమిత్రుఁడితోనేనా యేసమయమందేనా హృదయం విప్పి చెప్పకపోతారా తత్త్వాన్ని ? అది వారివారి నోటఁ బడి "నిజం నిడివిమీఁద తేలక పోతుందా ?" అని నా ఆశ. అనాదిగా వీరికి ప్రతివారినీ ఆక్షేపించడం సహజమైపోయింది. వీరిపాండిత్యం కేవల కావ్యనాటకచంపూపఠనంతో చేరింది. తక్కినది శ్రుతపాండిత్యం బాపతు. ఆయీ అంశం వీరు పూర్వం విమర్శించిన విమర్శనలవల్లనేకాక నేఁడు నన్ను విమర్శించిన విమర్శనవల్లకూడా తేలుతూంది. కృష్ణా సంపాదకీయం "ఇఁక వీరిపాండితీవిశేషము నీ (మహామహోపాధ్యాయ) బిరుద మెంతవఱకు వాకొనుచున్నది యనుసంశయము కలవా రిటీవల శాస్త్రులవారు ప్రచురించుచున్న విమర్శనగ్రంథము చూడఁగోరెదము.........ఈ బిరుదు పండితులకుమాత్రమే యిచ్చెడిది కాదని నేఁటితో విస్పష్టమైనది" అని నిర్మొగమాటంగా, ఖండితంగా వ్రాసిన వాక్యాలు గురువులు చిత్తగించే వుంటారు. తాముకూడా చూస్తే చూచే వుంటారేమో ? యిట్టివ్రాఁత యెవరినిగూర్చిన సమ్మానానికేనా బయలుదేరినట్లు తాము చూపుతారా ? దీనికి వారుగాని వేఱొకరుగాని చెప్పేజవా బేమిటి ? అస్మదాదులం యేకఫలాపేక్షులం కనుక వకరిమీఁద

వకరికి అసూయ వుండడం తప్పదనుకుందాం. ముట్నూరి కృష్ణారావుగారు మాతోపాటు ఆ యీ బిరుదాలు సంపాదించుకొని కాలుష్యం ఋడాన్నిదేసు కొనే తెగలో వారేనా? వారిని "అవివేకు" లనీ, "జ్ఞానలవదుర్వి దగ్ధు" లనీ ప్రస్తుతం యింకా వ్రాయలేదు గాని చాలానాళ్ళ క్రిందట గురువులు వేణొకబిరుదువిషయంలో ఖండించినప్పుడు వ్రాసి వున్నారు. అందులకు మీరు సహిస్తారా? యేదో అభిప్రాయభేదం కలిగినంతలో సర్వం తోటకూరకట్టగా వ్రాయడానికి మీవంటి ఉదారహృదయులు సమ్మతించరనే వెఱ్ఱినమ్మికతో మి మ్మింతగా నేను ప్రశ్నిస్తాను. క్షమించండి. గురువులు వకరోజున మా మృచ్ఛకటిక నాటకం ప్రదర్శిస్తూ వుంటే ఆహూతులై వచ్చి కూర్చున్నారు. వొక అఱగంటకాలం కూర్చున్నాక అప్పుడు వారి కది నచ్చింది కాదు. ప్రదర్శకుల నైపుణికాదు, మా అనువాదమూ కాదు; అసలు శూద్రకమహాకవి నాటకరచనానైపుణే! అపుడు దాన్నిగూర్చి వారు నాతో వెలవిచ్చినమాటలు వ్రాస్తే చాలా గ్రంథం పెరుగుతుంది. అపుడు వారితో నేను మనవిచేసిన మాటలు "అయ్యా! తాము పరాకుగా చిత్తగిస్తూ వున్నారు. కాళిదాసాదుల నాటకరచనకన్నా మిన్నగా దీన్ని పాశ్చాత్యులు మెచ్చుకున్నట్లు తద్జ్ఞులవల్ల విన్నాను. కాళిదాసుమా టేమోకాని తక్కిన మనకవుల నాటకరచనాన్ని నిరసించే పాశ్చాత్యులమెప్పును పొందిందికదా? యిది మా కవిత్వలోపాన్ని బట్టిగాని ప్రదర్శకుల నైపుణ్యలోపాన్ని బట్టిగాని అన్యథాగా అపోహపడకండి 'నాటకకల్పననే' పరిశీలించండి." అని మనవి చేశాను. మఱికొంత సేపు చిత్తగించి "అవును నీవు చెప్పినమాట నిజమే" అన్నారు. దీనిం బట్టి వారికి గోచరించే విషయాలల్లోకూడా వారు శ్రద్ధవహించక తొందరపడు నలవాటు కలవారని తమకు గోచరిస్తుందని పైవిషయం వుదాహరించాను. యిట్టి తొందరతోనే నా మీఁద వుండేకోపం పురికొల్పడంచేత వారి విమర్శనంలో ప్రవేశించి వున్నారు ఆలాగే కాకపోతే వొకచోట యతి చెడింది, యింకొకచోట గణాలు చెడ్డాయి. యింకెక్కడేనా వకటి రెండు

నాకు గోచరించనివి యీలాంటివే వుంటాయేమో ? ఈ నాలిగింటినీన్నీ చూపితే నేను నోరెత్తడానికి వీలిచ్చేదేనా ? కిక్కురుమనకుండా వూరు కొనేవాణ్ణికదా పెద్దయెత్తు యెత్తినారు. " వేలకొలఁది తప్పు " లన్నారు. " మనుష్యాధముఁ " డన్నారు. యేమో అన్నారు, మనం యేం వ్రాస్తే చెల్లకపోతుంది. సర్వాన్నీ మన బిరుదాలే సమర్థిస్తా యనుకున్నారు. పైఁగా కృతిపొందిన బొబ్బిలిప్రభువును ప్రస్తుతం జయంతి పంతులుగారిని లాగే గేలి చేశారు. వ్యంగ్యంగా దూషించారు. తమ సార్వభౌమత్వాన్ని నఖముఖాలా అమలుజరపడానికి వుపక్రమించారు. దానిధోరణి బొత్తిగా అనుచితంగా తోఁచింది. ఆ పట్లాన్ని మీవంటివారికి వారివిమర్శనాతత్త్వం యెట్టిదో ? పరిశీలకత్వం యేలాటిదో ? తెల్పడంకన్న వుపాయాంతరం లేదని నాకుతోఁచింది. తెల్పడానికి వుపక్రమించాను. గురువుగారికి మఱింత కోపం హెచ్చింది.

గంప చిక్కునుంచి గురువులవారిని తప్పించేవా రెవరు ? " సహేంద్ర తక్షకాయ స్వాహా " చేస్తా మనుకున్నారు. తమరిని " బడబాగ్ని " గా ప్రశంసించు కున్నారు. నన్ను " తూలాగ్ని " గా నిరూపించారు. వారి కులగురువు వచ్చి పురికొల్పుతూ వున్నాఁ డన్నారు. వెం॥ శా॥ వచ్చి కాళ్లపట్టుకున్నా రాజీ కుదరడం దృశ్యా దృశ్య మని సూచించారు. నేనో ? పాపమేనా సరే, బాగా చేఁజిక్కినాడు గురువుగా రనుకున్నాను. " మెల్లఁగా, గుట్టుంబట్టుక త ద్విమర్శనము చేకొన్నాఁడ నాచేతి యీపట్టున్ ' భల్లుకపట్టు ' విప్పుటకు విశ్వసృష్టయే రావలెన్ " అని కూర్చున్నాను. నేను వారి గ్రంథాన్ని విమర్శించలేదు. వారే నావిషయంలో అట్టిపని పెట్టుకొన్నారు. అది యెట్టిదో తెల్ప వలసిందని మీవంటివారిని కోరడం నాకు అవశ్య కర్తవ్య మయింది. చెప్పడం మీకున్నూ కర్తవ్యమే అయితే చెపుతారు లేదా ? చెప్పరు. చెపితే సహేతుకంగానే చెపుతారు కదా ? ఆ చెప్పడం తగినంత యుక్తి యుక్తంగా వుండకపోతే నాకు వుపకరించేలాగు వున్నా నేను దాన్ని ఖండించి నా " స్వపక్ష పరపక్ష

సర్వనామధామత్వాన్ని" సార్థకం చేస్తాను. యీ బిరుదు నాకు నా పరమగురువులు బ్రహ్మయ్య శాస్త్రులు గారు నా విద్యార్థి దశలో అనుగ్రహించారు. సుమారు యేభై యేళ్ళకు యిప్పుడు అది జ్ఞాపకం వచ్చింది. ప్రకటించాను. బిరుదు యెలాటిదైనా వకరు యిచ్చినదేనా, తానే పెట్టుకొన్నదే అయినా అర్థవత్తుగా వుంటే లోకం సంతోషిస్తుంది. లేదా? మూతివిరుస్తుంది. యీ బిరుదు నాకు తగివుంటుందో వుండదో భవిష్యత్తులో మీకే విశదం అవుతుంది. వూరికే మెచ్చితే నేను సంతోషించేది లేదన్నది యిక్కడ ముఖ్యాంశం. వూరికే నిరాకరిస్తే కూడా విచారించడం లేదని వేరే వ్రాయనక్కఱలేదు. అసలు యీవిషయమే అవసరం లేదనే మాటకు నేను వప్పుకొనేవాణ్ణే కాని యీమాట గురువుల విమర్శనం చిత్తగించి అనేటట్టయితే వప్పుకొంటాను. ఆ విమర్శనం వల్ల వారికి వారిపాండిత్యమందు యెంతటి ధైర్యం వుందో తమకు స్పష్టమవుతుంది. వకరిని పేరు నుచ్చి వక్కాణించలేదు గాని గురువుగారున్నూ జనరల్‌గా పండితుల మీఁదే భారం పెడుతూ వచ్చారు. ఆ పెట్టడం భ్రాంతిమూలకమైతే దాన్ని వారించడం మీబోట్లకు చాలా అవసరమని నేను వేఱే వ్రాయనక్కఱలేదు. కాదు. సత్యమే అనితోస్తుందా? మఱీ మంచిది. నన్నే మందలించండి. మీ మందలింపును నేను శిరసా వహించి వారి విమర్శనానికి బదులు వ్రాయ మొదలుపెట్టినందుకు క్షమాపణ ప్రచురించి నిరపరాధిని అవుతాను. మీ మందలింపులో నా కేమాత్రం అవకాశమున్నా యీలాగే యింకొకసారి ప్రశ్నించి చూస్తాను.

అసలు వ్యాసం జనరల్‌గా ఆరంభించానుగాని మధ్య దీనికి తగ్గవారు శ్రీయుతులు రెడ్డిగారని తోఁచి చాలా భాగం వారిని వుద్దేశించి నడిచింది. చదువరులలో యెవరేనాసరే రెడ్డిగారిని నేను కోరిన పనిని చేయడానికి సమర్థులైతే చేయడానికి అభ్యంతరం వుండదు. విశేషించి రెడ్డిగారిని కోరడంవల్ల "మనకెందు" కని తదితరులు వుపేక్షిస్తారేమో? అట్లు వుపేక్షించ నక్కఱలేదు.

"దేవుఁడి పెళ్లికి అంతా పెద్దలే" కదా? యిది భాషా మహాదేవతకు సంబంధించిన కార్యంగాని యెవతో యిద్దఱు వ్యక్తులకు సంబంధించింది మాత్రమే కాదు. భాషాప్రసక్తి వున్నంత కాలం నిలిచేది కాని నేఁడూ రేపూ వుండి మాసిపోయేది కాదు. శంకించేవారేమో? పెద్ద పెద్ద లోకోత్తరమైన విద్వాంసుల కెవ్వరికీ లేని బిరుదావళులు యూనివర్సిటీ వారిచేతా, గవర్నమెంటు వారిచేతా, లోకంచేతా పొంది వున్నారు. శంకించే శంకలు చూస్తే యెంత తక్కువ తరగతిలో వుండే అక్షరాస్యులూ కూడా చేయవలసినవి కావు. తప్పులు కావని యెఱిఁగే కోపోద్రేకంచేత గర్వం పెరగడానికి చేశారంటారా, అప్పుడు శీలానికి భంగం కలిగి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రీమధ్య ప్రచురించిన కరపత్రానికి బలకర మవుతుంది. యెఱక్క- శంకించా రంటారా? బిరుదుల ప్రాణంమీఁదకి రావడమే కాకుండా బిరుదప్రదాతల మీఁదికి రావడమే కాక, వీరికి సంస్కృత భారతంకూడా యీలాగే అన్వయించిందా? అయితే వ్యాకరణాది దోషాల మాటాలా వుండఁగా అనువాదం మూలానుసారంగా లేదేమో? అని అనుమానించవలసి వస్తుంది.

"యెగఁదీస్తే బ్రహ్మహత్య, దిగఁదీస్తే గోహత్య" యీ రెండిట్లో యేదో వకటి అంగీకరించి తీరవలసిందని గురువులవారి విమర్శనం తెలుపుతూ వుంది. ఆ యీ గంపచిక్కునుంచి గురువులవారిని తప్పించేవా రెవరో? నాకు గోచరించడం లేదు. నేను "మీరా? మీరా?" అని మిమ్మల్నీ మిమ్మల్నీ యాచిస్తున్నాను కాని గురువుగారు యెవరి పేరున్నూ యెత్తుకోక నిమ్మకి నీరెత్తినట్లు కూర్చొని "చెరలాటమే సర్వానికీ చాలివుంది" అనే అర్థమిచ్చే వాక్యాలు వ్రాస్తూ లేని ధైర్యాన్ని వ్యక్తీకరిస్తూ ఉన్నారు. పైఁగా నా ప్రార్థన మీఁద యెవరేనా తగవు చెపితే వారిని గేలిగొట్టి "నిన్ను నేను చెప్పు మన్నానా? నీ కేంతెలుసును?" అనే అర్థం వచ్చే మాటలు వ్రాస్తూ వున్నారు. చూడండీ! వారి లోకజ్ఞత్వం యేలా వుందోను?

మెవరేనా యెవరినేనా బాహుబలాన్ని పురస్కరించుకొని కొడతా రనుకుందాం, లేదా ? తిడతాడు. పడ్డవాఁడు అధికారివద్ద చెప్పుకొంటాఁడు. అధికారి ముద్దాయీని శిక్షిస్తాఁడు. అప్పుడు ముద్దాయీ "నేను నీతో చెప్పుకోలేదే" అనడం యెక్కడేనా ఉందా ? కొట్టిన వాఁడెప్పుడేనా చెప్పుకోడ మంటూ వుంటుందా ? యీలా అంటే మాత్రం ఆ శిక్ష తప్పు తుందా ? అవకాశం వుంటే హైకోర్టుకి అప్పీలు చేసుకోవాలి, లేదా ? శిక్షకు బద్ధుఁడు కావాలి. అయితే ముద్దాయీ వాదం కూడా కోర్టువారు వినవలసి వుంటుంది. అది జరగలేదంటూ ఆభాస రమణీయంగా వక కుయుక్తికి వస్తారేమో గురువులు, వస్తారేమిటి ? రానే వచ్చారు.

"అదీ అయిందో యమ్మ ! అదీ అయింది" అన్నట్టు 176 పుటల చెరలాటాన్నిన్నీ జయింతివారు చిత్తగించి చెప్పినతీర్పేకదా ? అది, అట్టి స్థితిలో యింకా పెనుగులాడడమున్నూ తీర్పరులను తూలనాడడమున్నూ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వీరిని గూర్చి వ్రాస్తూ వున్న చరిత్రవిష యాన్ని బలపరచడానికే అనుకుంటాను. వెనక శ్రీ కస్తూరి శివశంకర కవిగారు వుండేవారు. ఈలాటి సందర్భాలలో మందలించతగ్గ వారిని గాఢంగా నిర్మొగమాటంగా మందలించేవారు. "నేటికాలం పూర్తిగా గొడ్డుపోయింది. అయ్యో, యెవరూ లే" రనుకుంటూ వుంటే శ్రీ "చిలు కూరి" వున్నారని వారి కరపత్రంవల్ల తెలుస్తూవుంది. ఆ గ్రంథం 380 పేజీలఁట ! రు 1—0—0 వెల. అది శ్రీ కస్తూరి మహాశయుల జీవిత చారిత్రమఁట ! అచ్చయిందఁట ! బయిండు తరవాయి కాఁబోలును ! అందులో అధమం 80 పేజీలేనా గురువులవారినిగూర్చి వుంటుం దను కొంటాను, సత్యతత్పరులున్నూ అసత్య విద్వేషులున్నూ లేనే లే రను కుంటూ విచారిస్తూ వున్న నాకు "యిదుగో నేనువున్నా" నని శ్రీవీర భద్రరావు గారి కరపత్రం అభయహస్తం యిస్తూ వుంది. దాని తల్లికి డువు కాలిన పాండిత్యం, పాండిత్యానికేమి ? తరవాత చూచుకొందాం గాని, గురువుల సత్య తత్పరత్వాన్నేనా అది తేల్చక పోతుందా ? యేమో?

తినఁబోతూ రుచు లడగడ మెందుకు ? నేఁడో రేపో అది వెలువడుతుంది ఆయన్ని జయంతి వారిని గేలిగొట్టినట్లే కొడితే సాగదు, గురువులకన్న వేయిరెట్లు గేలికొట్టడానికి వీరభద్రిరావు గారున్నూ సమర్థులే. పట్టుదల గలవారే అని వింటాను. యీ రామాయణం లోకి చిలుకూరి వా రెందుకు ప్రివేశించారో కదా ? యేదో తేలడానికే గురువులు యీకొఁలగాని విమ ర్శనాన్ని అయొచ్చేదీ పయొచ్చేదీ ఆలోచించక చేసివున్నారు. నిశ్చయం. లేకపోతే యీ జటాయు ప్రివేశం జరగవలసి వుండదు.

"ఫలానుమేయాః ప్రారంభాః" గిడుగువా రేమో నాజయంతిని గూర్చి కొంత వ్రాస్తూవున్నట్లు కృష్ణాపత్రికలో వున్న నా "గిడుగా ? పిడుగా ?" అనే వ్యాసంవల్ల తెలియడం తోటే మండిపడి అనిషధయోగ్యు ణ్ణిన్నీ నన్నూ వచింపరాని మాటలతో దూషిస్తూ "యేదో వ్రాస్తాను, దానితో వీళ్ళ యిద్దఱిపనీ 'చక్కఁపొగడం' అవుతుం" దని సెలవిచ్చా రఁట ! యింతవఱకు సహ్యమే. ఆ వ్రియఁబోయే వ్యాసం పేరుకూడా చెప్పారఁట ! అది యిక్కఁడ వ్రియడానికి అర్హత కలదిగాదు, యేంచే స్తును ? కొద్ది రోజుల్లో వారే ప్రిచురిస్తారు కదా ? యింతలో తొంద రెందుకు ? ఆ శీర్షికలో చివర అక్షరాలు "వాయువు" అన్నది. దీన్ని బట్టి గ్రిహించుకోండి. గిడుగువారి భాషకున్నూ నా కవిత్వానికిన్నీ అట్టి పోలిక చెపితేనేగాని గురువుగారికి సంతుష్టి కలగలే దనుకోవాలి. యిట్టి అనుచితపు మాటలు వీరు పలువురు పండితులను గూర్చి "శృంఖలా" గ్రింథంలో తారతమ్య దూరంగా వాడడాన్ని బట్టే నేను వీరి వ్రాఁతలలో వుండే సారాన్ని తేల్చడానికి యిందులో దిగాను గాని లేకపోతే "యింత కన్న మిన్నగా వెం॥ శా॥ పద్యాలు వెలిఁగించలేఁ" డంటేకాని యింకా యెన్నో అనుచితోక్తులఁగాని, అసత్యోక్తులు గాని శృంఖలంలో నన్నుఁ గూర్చి వినియోగిస్తే కాని గణించక వూరుకొనే వున్నాను. తొందర ధోరణి కలవారనియ్యేవే ఆ శృంఖలాన్ని గణించక "పెండేరాన్ని" తొడిగాను. తుదకు కలిగించుకోక తప్పిందిగాదు. యిప్పు డల్లా భగ

వంతుఁ డనుగ్రహించ వలసినవి నూరుపున్నాలి దీర్ఘాయురారోగ్యాలు. లోకం తమ కొంపలతోటు "చెళ్లపిళ్ళ" నేలా ఆదరించిందో? అభిమానం యీపైని యిరవై యేళ్లైనా నాకు తెలిసికొని ఆనందించడానికి దీర్ఘాయురారోగ్యాలు అపేక్ష్యాలు. యెందరి తీర్పులు "క్షిప్తమైంది" పదంతో యీనా డిస్తారో? యెందఱు మహాకవులను "యిదయుక్కాలి" వాక్యంగా అపవదిస్తారో చూడడానికి నాకు కూడా అవి అపేక్ష్యాలే కాని వాట్లకోసం నేనే వుండనక్కఱ లేదు. యితర ప్రాజ్ఞలోకం వుంటుందికదా?

నే చేయవలసిన కృత్యం "జయంతి" కన్యకను పెండ్లి. యీపసి పిల్లకి నేను సాహసించి 77 యేళ్ళ పెళ్ళికొడుకును వెదకి తీసుకొని వచ్చి యితర సంపత్తుకన్న "పితా శ్రీతమ్" అనే అంశానికే ప్రాధాన్యం యిచ్చి శారదా బిల్లుకి కూడా జంకకుండా పెండ్లిచేశాను. ఆ కన్యక కాపరానికి వెళ్ళకుండానే అల్లుఁడికి మిక్కిలి జబ్బు చేసింది. యేమి? వృద్ధునికి పిల్ల నిచ్చి జబ్బుచేసిందని భయపడితే యేమవుతుంది? నా సాహసాన్ని భగవంతుఁడు మన్నించి మళ్లా ఆరోగ్యం కలిగించాఁడు. పిల్ల కాపరం చేస్తూవుంది. నేను పెళ్ళికొడుక్కు "శతమానం భవతి" అంటూ పిల్ల జాతకాన్ని బట్టి ఆయుర్దాయం నిర్ణయించి ఆశీర్వదించాను, పెండ్లివేళ ప్రతిపెళ్ళికొడుక్కూ యిదే రీతిగా ఆశీర్వచించడం ఆచారమే. యెన్నో దూసుకు పోతూనే వుంటాయి. కాని సప్తపాదాలవద్దనే వైకల్యం వస్తే ఆశీర్వచించిన వారిని లోకం నిందిస్తుంది "అటు చూచి నఱుక్కు ర" మ్మన్నారు కదా? యిప్పటికి భగవంతుఁడు నా వాక్కు నందున్నట్టే యిఁక ముందుకూడా భగవంతుఁడు నావాక్కును కాపాడుఁగాక! నేనే నిజమైన కవినో, నన్ను అన్యథాగా అపలపించే వారే నిజమైన కవులో తేలుఁగాక! నా యీ సాహసం వర్ణనీయం.

వాది ప్రతివాదుల మిద్దఱమున్నూ వృద్ధులం, రోగగ్రస్తులం, నేను తీర్పరిగ కోరుకున్న పంతులవారు మా యిద్దఱికన్నా చాలా వృద్ధులు రుగ్ణులే యీ గ్రంథ రచనకేమి? త్వరలోనే ముగిసింది, కాని అచ్చు

పడాలి. పరిచురానికి రావాలి. మా తర్గియంలో యెవరికి భంగం వచ్చినా నిందపాలు కావలసి వస్తుంది. అందులో కృతిభర్తకు యీ మధ్యకాలంలో భంగం వస్తే చెప్పేదేమిటి? గురువుగారి కెంతేనా అవకాశం చిక్కేది. యిఁక ఫరవాలేదు. ధన్యుణ్ణి, ముమ్మాటికీ ధన్యుణ్ణి. అవసరం లేనిదే "అగ్నిబీజాలూ వాయుబీజాలూ" యేకరువు పెట్టి అసూయ వెళ్ళఁబోసుకొనే వారి ప్రకృతికి అవసరమే కలిగితే "పట్టపగ్గా" లుండవు కదా! ఫరవా నహీ హై. మా "జయంతి" అదృష్టవంతురాలు. యెందు కవతరించిందో? ఆ పని పూర్తిగా నెఱవేర్చి తీరుతుంది. వెంకన్న అనే నాపేరుకు "వెనుక + అన్న. వెనుకన్న వెంకన్న" అంటూ విఱిచి అర్థం చెప్పే గురువులవారిని పూర్తిగా సంతోష పెడుతుంది. "దాకలాగు నోరు తెఱవడం" యెట్టిదో? లోకానికి స్పష్టం చేస్తుంది. "చెట్టుచెడే కాలానికి కుక్కమూతి పిందె" అనడం యేలాటిదో! తెలుస్తుంది. యితరులమీఁదకీ యీ వెంకన్న మీఁదకీ కాని కాదు వెనుకన్న మీఁదకే దాడి వెడలడానికి వుండే భేదాన్ని వివరిస్తుంది.

నాకు రామయ్య పంతులుగారు యీపుస్తకాన్ని కృతి పుచ్చుకొన్నందుకు యేమీ సమ్మానించ లేదంటూ వక ఆక్షేపణ. అయ్యో! భగవంతుఁడ! గ్రంథం చూడకుండానే తొందర పడడం వల్లకదా? యీలాగు అసంబద్ధంగా వ్రాయడం తటస్థించింది. యిదిన్నీ కాక నేను పంతులవారికి మొట్టమొదట వ్రాసిన శుభలేఖలో "అహూయ కన్యాదాన" మనిన్నీ మీ రేమిచ్చినా పరిగ్రహించేది లేదనిన్నీ స్పష్టంగా వ్రాసివున్నాను. జయంతిలో దీని కేమేనా సమ్మానం చేసేటట్టయితే గురువులకే చేయవలసి వుంటుందని స్పష్టంగా వకచోట "యిందుకుఁ జేయు సత్కృతియు న య్యాచార్యుఁడే పొందున్" అని కూడా వ్రాసి వున్నాను. పయిగా పంతులుగారు కోరే యెడల వేయార్లు కట్నమివ్వడానికి సిద్ధంగావున్నానని కూడా వక పద్యంలో వ్రాసి వున్నాను.

"మ. అడుగం గొంకితి వేమొ? నీవడుగుచో సర్వింతు "గార్న" ర్మాదల్
కడు మేటుల్ మొన మొన్న నాకిడిన యాకట్నంబు వేయాఖ లి
ప్పుడు మించంబడ, దిప్పుడే నడుగు మిష్టంబుగూడ నేనిత్తు నీ
బడు గేమిచ్చు నటంచు నెంచకు మయా భాస్వజ్జయంత్యస్వయా!"

ఆయీ గ్రంథ మింకా బైండై ప్రచురింపఁ బడక పూర్వమే గురువులు "జీల్గు రెండు తీర్పు" వ్యాసాన్ని ప్రచురించు కొన్నారు. కనక యీ విషయాలు వారికి తెలియక పోవడం తప్పుకాదనుకుందామా? మంచిది. ప్రత్యక్షరమున్నూ పరికించి యుద్ధార్థం నన్ను ఆహ్వానించడానికి వుపక్రమించిన "బొబ్బిలి" విమర్శనంలో యీలాటి ప్రమాదాలెందుకుండాలి? అంటే "అవిమృశ్యకారిత్వం" వల్ల అనక తప్పదు. భారవి మహాకవి వూరికేనేనా "సహసా విదధీత నక్రియాం" అన్నది? యీ అవిమృశ్యకారిత్వం గురువులకు అనాదిగా వుంది. యిది పాండిత్యం వున్నవారినే బోల్తా గొట్టిస్తుంది. యితరులను చెప్పేదేమిటి! యిప్పుడేమనుకొంటే యేం లాభం? గతజల సేతుబంధనం. ముఖం వుంది, అద్దం వుంది. విమర్శనం వుంది, ఖండనం వుంది. నేనెవరిమీఁదో భారం పెట్టాను. వారు, దానికి తగుదురో? తగరో? విజ్ఞులు నిర్ణయించేవుఁటారు, తగరని బుకాయిస్తే ప్రయోజనం లేదు, తగిన వారెవరినో వకరిని తామే పేర్కొంటే నేను వారి తీర్పే శిరసావహిస్తానని "గిడుగా? పిడుగా?" అనే వ్యాసంలో వ్రాసిన అక్షరాల గతేమిటి? యీలా సాహసించి వ్రాసినందుకు నన్ను అభిమానించే వారిలో మూఢ భక్తికల వ్యక్తులు "చిక్కు వస్తుందేమో" అని భయపడతారేమో? "న్యాయమైన సొమ్ము నష్టేట్లో పారేసినా పోదు" అని వారికి సమాధానం చెపుతూ వున్నాను. నేను లోకంలో కవి ననిపించుకొని అంతో యింతో పయికి వచ్చింది ఈ గురువుగారు "నా వాఁడని దయచూపి యిందాఁకా నాకవిత్వ విషయంలో కలమాడింపక పోవడం చేత" నేనా? యిట్టి వుపేక్ష మా ద్వయంలో యెవరు యెవరివిషయమై చేసివున్నారో లోకం పూర్తిగా

యెఱిఁగి వుండును. యెఱిఁగినందుకు సాక్ష్యం కూడా వుంది. అదిన్నీ గ్రంథ రూప మయిందే. ఆ గ్రంథకర్త గురువుగారిని భూషిస్తూ నన్ను దూషిస్తూ వ్రాఁసే వ్రాఁతలోనే ఆ యథార్థాన్ని కాస్తా జాఱ విడిచాఁడు. గురువుగారు యిదివఱకే దాన్ని చదివి వున్నారు. ఆ కవిమిత్రునకు సదభిప్రాయాన్ని కూడా యిచ్చి వున్నారు. కాఁబట్టి విస్తరించ నక్కఱలేదు.

గురువుగారు నన్నెవ్వరో గంధర్వుఁడు యెన్నో తిట్లు తిట్టి యేమో వ్రాసివున్నాఁడని సంతోషిస్తారు. వారి వజ్రాయుధం పత్రికద్వారా ఆ తిట్లను కూడా "ఫేరాపేజు" చేసి కూడా ప్రచురించి ఆమోదాన్ని తెలిపీ తెలుపనట్లు తుదకి తెల్పివున్నారు. ప్రస్తుతం తాము నాయెడల చూపే కార్యాన్ని కూర్చి వక పిల్లవాఁడు వచ్చీ రాని కవిత్వంతో నావద్దకు వ్రాసిన పద్యాలు పైపుగుద్దినవి, ఈమధ్య వచ్చివున్నాయి. ఆపిల్లవాఁడుచేవ్రాలుచేసే పంపివున్నాఁడు. ఆ పిల్లవాని అమాయకత్వమున్నూ న్యాయ పక్షపాతిత్వమున్నూ మాత్రమే దానివల్ల తెలుసుకోవలసి వుంటుంది. గురువుగారికే ఆలాటిది యెవరేనా వ్రాస్తే వారు దాన్ని గంధర్వలోక బహిరంగ లేఖ వలెనే ప్రచురించుకొని ఆనందించేవారు. అట్టి పని చేయలేని నాకు పంపినాఁ డా పిల్లాఁడు. దాన్ని మార్పు చేసుకొని తమకు అనుకూలంగా ప్రచురించుకొనే యెడల గురువులకు నేను దాన్ని సమర్పించుకొంటాను. కాని తగినంత ప్రతిజ్ఞ చేసి మఱీ దాన్ని గురువులు నావద్దనుంచి పరిగ్రహించాలి. ఆ పిల్లవాఁడి మీఁదికి "లీగల్" గా వెళ్లేటట్లయితే నేను యిచ్చేది లేదు. యెందు కీవిషయం యిందు యెత్తుకొన్నా నంటే, లోకంయొక్క యిష్టానిష్టాలు మనం తెలుసుకోవాలంటే యీలాటి అమాయికుల వ్రాఁతల వల్లగాని నిర్మొగమాటంగా వ్రాసే పత్రిక లేవేనా వుంటే వాట్లవ్రాఁతల వల్లఁగాని తటస్థంగా వుండి తెలుసుకోవలసి వుంటుంది గాని "బళిబళీ మీతాత" అనే రకాలవారి స్తోత్రపాఠాలవల్ల మన లోపాలోపాలు బొత్తిగా తేలవు. అట్టి పత్రికలలో మొటమొదటిది కృష్ణ. అది వ్రాసిన వ్రాఁత బ్రహ్మవ్రాఁతలాగ

లేదా పెట్టిన వ్రాఁతలాగ అలాగేవుందో? దాన్నెవరేనా యెదురుకోఁగలి గారో పరిశీలించాలి. యెవరో నాలుగు మాటలు గురువులను సమర్థిస్తూ వ్రాశారు. అవి చప్పగా వున్నాయి. యెవరో యెందుకు? ఖండనానికి అవకాశం వుంటే రంగంలోకి నేనే దిగి ఖండించి గురువుల కుపకారం చేసి, "స్వపక్ష పరపక్ష నిర్ధూమ ధాముఁడు" వెం॥ శా॥ అని నాకు నా పరమగురువులు ప్రసాదించిన బిరుదాన్ని సార్థకం చేసుకోవాలని బోలెఁడు కుతూహలం వుంది. కాని యెన్ని విధాల చూచినా ఖండనో పాయం కనపడడమే లేదు. "కాశ్యపుల" వ్రాఁతవలెనే వ్రాసేటట్టయితే ఆ వ్రాఁత యేంపనిచేస్తుంది? సహేతుకంగా కృష్ణా సంపాదకీయాన్ని ఖండించే వ్యక్తి యెక్కడా కనపడడం లేదు. చాలా పట్టుదలతో ప్రవర్తించే గురువుల లేఖిని కూడా యిప్పట్లు మౌనమే వహించింది. గురువుల వారి కులగురువు కూడా "పిటికిపందా!" అని సంబోధించి పురికొల్పి నట్లు లేదు.

యే విషయమైనా వ్రాసేటప్పుడు చాలా ఆలోచించాలి. యేలాటి వారికేనా సరే, విమర్శనాలలో అనవసరపు వెక్కిరింపులూ ధిక్కరింపులూ కూడవు. గురువుల సమకాలీనులలో వారికన్న కొంచెం మాత్రమే వయస్సా పెద్దలు, యితరాలు పాండిత్యాదులలోనో? చాలా పెద్దలు శ్రీ సుప్రసిద్ధ కళా ప్రపూర్ణులు, వారిని గురువులు అనుకరించడంలో తప్పు లేశమూ వుండదు గాని ప్రధాన విషయంలో కాక వట్టి వెక్కిరింపులో మాత్రమే కావడం చేత అది యేదో మాదిరిగా వుండవలసి వచ్చింది. సర్వసమర్థులైన "ప్రపూర్ణుల" వెక్కిరింపులు నిక్షేపం వంటి వారి జీవితచరిత్ర కెంత చిక్కు తెచ్చి పెట్టినవో గిడుగువారు పూర్తిగా వ్యాఖ్యానించి వున్నారు. యితరు లావిషయమై పరిశ్రమ చేయనక్కఱ లేదు. కాని తన్మయత్వం చేతనే అనుకుంటాను, "రావు సాహేబు" గారు కళాప్రపూర్ణులను సహేతుకంగానే కొంచెం ముదురు పాకపు మాటలు అంటూ వచ్చారు. అది కూడా లేకుంటేనో? "వహవ్వా"

పంతులవారి ప్రసన్న రాఘవాన్ని కళాప్రపూర్ణులు విమర్శించిన కొలఁది కాలంలో నేను దాన్ని చదివి చూచాను. పంతులవారి పాండిత్యంకన్న "కళాప్రపూర్ణుల" పాండిత్యం చాలా హెచ్చనుట స్వభావోక్తి గాని అతిశయోక్తి గాదు. అట్టి స్థితిలో వెంకటరత్నం పంతులుగారు మహా మహోపాధ్యాయ బిరుదాన్ని పొందడానికిన్నీ వెంకటరాయ శాస్త్రిలవారు ఆ బిరుదాన్ని పొందక పోవడానికిన్నీ కారణం శిఫారసు బలిమిన్నీ ప్రదాతలు విదేశీయులగుటా తప్ప వేఱు కారణం కనపడదు. పంతులవారి ప్రకృతి చాలా బోళా ప్రకృతి. వారిని నే నొకపరి ఆర్ట్సు కాలేజీలో క్లాసులో పాఠము చెప్పుచుండఁగా సందర్శించి వున్నాను. గ్రాంథికంగానే వుపన్యసిస్తూ వుంటే కొంత అపూర్వంగా కనపడి నప్పటికీ మిక్కిలీ వినసొంపుగా వుండేది. వారికిన్నీ వెంకటరాయ శాస్త్రిలగారికిన్నీ పూర్వవైరం యేదో వున్నట్టే తోస్తుందిగాని వున్నప్పటికీ అంత అనుచితంగా అయుక్తంగా పరిహసించడం నాకు సమంజసంగా కనపడలేదు. యేదిన్నీ ప్రసక్తి పట్టక నేను దీన్నియెక్కడా వ్యాఖ్యానించ లేదు. గిడుగువారు, ఆ పంతులవారి జీవిత కాలంలో కాకపోయినా చేయవలసినంత పనిన్నీ ఇటీవల నేనా బ్రహ్మభేద్యంగా చేసి పంతులవారి అవమానాన్ని తొలఁగించి జగద్వంద్యులైనారు సంశయంలేదు. అబ్బ! యేం వెక్కిరింపులు! యేం వెక్కిరింపులు! భవితవ్యత ఆలా చేయిస్తుంది కాఁబోలును గిడుగువారు చేసిన కార్యం మిక్కిలీ స్తవనీయం. యెవరి కర్మం వారిదని వూరుకొనే వారే గాని పరార్థం కలిగించుకొని అంతపని చేసేవా రుండడం చాలా అరుదు. అయితే గిడుగువారే నాఆక్షేపణలన్నీ ఖండించారని నేను వ్రాయఁజాలను. కాని కళా ప్రపూర్ణులు బొత్తిగా విశృంఖలంగా కలాన్ని నడిపి అనరాని మాటలు పంతులవారిని గూర్చి అనడం చేత నిజమైన ఆక్షేపణలు కొన్ని వున్నప్పటికీ ప్రయోజనం కనపడక పోవలసి వచ్చింది. గురువుగారయితే వారిని అనుసరించడానికి మొదలు పెట్టారు గాని యెక్కడి కెక్కడ? విమర్శనం మాటకేమి? దాన్ని ఆలావుంచుదాం, వెక్కిరింపులు కూడా

అలా నచవవు వీరికి. పూరికే పట్టుకు తిట్టడం తప్ప వీరికి మృదువుగా యుక్తి యుక్తంగా తిట్టడం కూడా పుస్తకాపేక్షే.

నిజమైన కవితాశక్తి కలవాఁడికి లేఖిని చేతపట్టినప్పుడే కాదు "స్వపన్నపి లిలపన్నపి స్థితి ముపాగతోఁగతి ముపాగతోఽపి భజతమ్" అన్నమాదిరిగా యెల్లప్పుడూ కవిత్వమే నడుస్తూ వుంటుంది, వాని నిద్ర వాని భోజనం, వాని నవ్వు, వాని నడక, వాని కోపం, వాని తాపం, వాని తిట్టు, వాని కట్టు, వాని బొట్టు, వకటేమిటి? సర్వమున్నూ కవిత్వంగానే పరిణమిస్తుంది. "ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతేచ వసతి విజ్ఞానమ్" అన్నట్టు వాఁడు ప్రతివిషయంలోనూ కవిత్వ పదార్థాన్ని కనుక్కోఁ గలడు. వాఁడికి ఆలంకారికులు నిర్దేశించిన 18 వర్ణనల లోనే అక్కఱ లేదు. ప్రకృతి సమస్తమూ కవిత్వరంగమే. యేవో కొన్నిపద్యాలు లేదా కొన్ని వేలే అనుకుందాం, లక్షలే అనుకుందాం యతి ప్రాసలుపోకుండానే అనుకుందాం, వ్రాసినంతలో సామాన్య లోకం కవిగా వప్పుకున్నా ధ్వన్యాచార్యుల వంటి వారు వప్పుకోరు. అన్నిటికంటె నా చేదస్తం మఱీ విలక్షణంగా వుంటుంది. దాన్ని మనస్సులో దాచుకో వడం యెందుకు? బయటఁ బడవేస్తాను. విశ్వసించిన వారు విశ్వసిస్తారు పరిహసించినవారో పరిహసిస్తారు. యెవరి కవిత్వం "లోకుల రసనలె యాకులు" గా వుంటుందో అదే కవిత్వం గాని యితరం కాదనియ్యేవే. తిక్కన్నగారు కొన్నివేల పద్యాలు వ్రాశారు. పోతన్న గారున్నూ డిటో. ఆ పద్యాలన్నీ నోటికి రావడం అసంభవం కాదా! అంటారా? అసంభవ మైన మాట నేనెందుకు వ్రాస్తాను, నూటికి అథమం వక పద్యం వంతు నేనా వస్తే చాలు ననియ్యేవే నేననుకొనే దిన్నీ యిందుకు ప్రాచీన రచనలో కూడా వుదాహరణాలు మృగ్యంగానే వుంటాయి. కవిత్వ మనో హరత్వానికి కారణం ప్రాచీన నవీనత్వాలు కావని కాళిదాసే చెప్పి వున్నాఁడు కదా? నా సమకాలీనులలో దాసువారు, చిలకమర్తివారు, అది పూడివారు, వడ్డాదివారు, (వచనంలో అయితే) కందుకూరివారు, పైసూత్రా

నికి ప్రథమోదాహరణంగా కనపడతారు. వచనాలు నోటికి మెట్టిపీ రావుకాని భావం హృద్గత మవుతుంది. దాసువారి తెలుఁగునాడున్నూ, దేనీ భాగవత ప్పీఠికలో వున్న అల్లూరో, వల్లూరో జ్ఞాపకం లేదు. "పల్లెటూరు" అనే పద్యాలున్నూ, చిలకమర్తివారి "భరత ఖండంబు" న్నూ, ఆదిపూడివారి "శృంగారరసము వర్ణించిన" లేదా? "రఁగారెడ్డిని మంత్రిజేసితివి" లేదా "పెండిలిసేయఁగాఁ దనకుఁ బెద్దలు" యీలాటి మెరికెలు యింకా చాలా వున్నాయి. యివీనిన్నీ, వడ్డాదివారి భక్తచింతామణిన్నీ కందుకూరి వారి వచనాలలో యేవోతప్ప అన్నీనిన్నీ శత్రుకోటి కూడా మెచ్చక తప్పనివియ్యేవే. యిటీవల కాల దౌర్భాగ్య కారణంచేత బ్రాహ్మల్లో సంధ్యావందనం చేయడం మానేశారు కాని వడ్డాది వారి భక్తచింతామణి పద్యాలు ఆలోటు తీర్చడం చేత అంతగా విచారించ వలసినపని కనబడడం లేదు. పానుగంటివారి సాక్షిని నేనైతే చూడలేదు గాని అది పైతరగతిలో చేర్చ తగ్గదే అని వినికిడివల్ల తేలుతుంది. పానుగంటివారి హాస్యరచనా చాతుర్యాన్ని మెచ్చనివారే లేరు. "బచ్చుండవు నెఱదాతల, మచ్చుండవు చిచ్చుండవు" అనే నీర సాళు ఘోషా నిరస నాపహాస్య ప్పద్యాలు చూచి నేను చాలాకాలమయింది. అయినా వాట్ల రచనాకౌశలాన్ని బట్టే ఆపద్యం వకటేనా కొంతభాగమేనా జ్ఞప్తిలో వుండడాని క్కారణం బహుశః ఆ యీ పద్యాలు వున్న గ్రంథం పేరు కఁఠాభరణం అనుకుంటాను. అది కంఠాభరణమైనా కావచ్చు లేదా కర్ణాభరణమైనా కావచ్చు నా మతంలోను. నేనిందు పేరు గుచ్చి యెత్తుకున్న కవులందఱూ వారి వారి రచనలని బళ్ళని తోలిన వారేకాని యే స్వల్పమో వ్రాసి విరమించిన వారు కారు. అట్టి స్థితిలో కొంచెం కొంచెం చూపి వూరుకోవడం అపరాధం కాకపోదు. అయితే యేంచేసేది? ప్రతిపద్య రసాస్పదమైన కాళిదాసు కవిత్వానికే ఈస్థితి తప్పింది కాదుగదా? "తత్ర శ్లోక చతుష్టయం" అన్నమాట అంతా యెఱిఁగిందే.

యింక అఱువై వేల పద్యాలువ్రాసి యింకా యెన్నోవ్రాసి నాకు అంతో యింతో గురువులవడంచేత పరమపూజ్యులైన కవి సార్వభౌము లున్నారు. వారిని నేనిందు యెత్తుకోక పోవడం అందులోను పరస్పర వైషమ్య స్థితిలో వున్నరోజుల్లో యెత్తుకోకపోవడం కన్న నీచప్పని యింకోటి వుండదు. వుం డనే వుండదు. నేనువారి గ్రంథాన్ని చదవ లేదేమో అంటే శ్రీపర్వాంతం ఈమధ్య చదివి వున్నాను. ప్రమాదాలు రసాన్ని భంగిస్తాయని నేను చెప్పను. యతులు పోవుట ప్రాసలు పోవుట యివి ప్రమాదాలు. వీట్లను నేనే కాదు యెవ్వరున్నూ గణింపరు. పాణినీయ ప్రవేశం లేక, 'ఇంద్రాణి' అనుటకు బదులు 'శక్రాణి' అని ప్రయోగించడం వగయిరాలు కవిత్వం లోవున్న రసాన్ని తగ్గిస్తాయని నేను చెప్పేవాణ్ణికాను. అట్టిలోపాలు శాస్త్రజ్ఞత్వం లేదని మాత్రమే ఋజువు చేస్తాయి. నేను యెవరిపుస్తకం చదివినా అందులో యేకొంచెమో నాకు అప్రయత్నంగా వస్తే వారి కవిత్వం రసవంతమని నిర్ణయించు కుంటాను. యెంతో శ్రద్ధగా తప్పులు పట్టే వుద్దేశంతో చదివితేకూడా నాకు వకపద్యం కూడా రాలేదు. కాని గ్రంథారంభదశలో వారి కులగురువును గూర్చి వ్రాసిన "సృష్టికిఁ బ్రతిసృష్టి సేయఁజాలిన" అనే కాఁబోలును వక సీసచరణం అంతా జ్ఞాపకం లేదు గాని యిందులో వ్రాసిన మట్టుకు జ్ఞాపకం వుంది. దీని రచనకు నేను వారిని మిక్కిలీ అభినందిస్తాను. యేమిటి యిందులో వున్న విశేషమంటారా? గురు వుగారి గోత్రకర్త విశ్వామిత్రుఁడు సృష్టికి ప్రతిసృష్టి చేసిన మాట ప్రసిద్ధం. వీరు ఆగోత్రమందు పుట్టి భారతానికి ప్రతిభారతాన్ని రచిస్తూ యీమాట వుపయోగించడం యెంతో రమ్యంగా వుంది. యిది వాచ్యంగాక వ్యంగ్యంగా కనపడడం చేత ఉత్తమ కావ్యత్వ భాగ్యాన్ని ఆ వక్కచరణమున్నూ కలి గిస్తూవుంది. ధ్వన్యాలోకన కారుఁడి మతాన్ని బట్టి యీ మాత్రం వున్నా ఆకవిని ధన్యుఁడనడానికి అభ్యంతరం లేదు కనుక నేను వారిని దీనిచేతే ధన్యులని తలుస్తాను. నేను చదవని వాట్లల్లో యింకా యేవేనా వుంటే వుంటాయేమో? యెవరేనా పరిశీలించి చూపితే శిరసావహిస్తాను. నావాదం

"మూఁడేకాళ్లు" అనే మాదిరిదో కాదో లోక మిదివఱకే గ్రహించి వుంటుంది. నాకు వారు విశ్రమం పెట్టడమే చేతకా దన్నారు కదా? అని నేనేదో తోఁచినట్లల్లా వ్రాసినంతలో లోకం నావ్రాఁతను వారి వ్రాఁతలాగే అపహాసిస్తుందని నాకు తెలిసి వ్రాసే అక్షరాలో యిది మఱో మాదిరిదో? చదువరులు గమనించాలి. వారు చేసిన కార్యం చాలా పుణ్యకార్యం అన్నందుకు అభినందించవలసివస్తే ఆ తెగలో నేను మొదటి వాణ్ణిగా తేలతాను. కవిత్వానికి రసమే ముఖ్యమని వాదించేవారిని గూర్చియ్యేవే నేను యిట్లావ్రాయడం. వీరు రసవిషయంలో యిప్పటి కవులలో యేస్థానానికి వస్తారో! ప్రాజ్ఞులు పరిశీలించాలి. రసారస విచారంతో పని లేదంటారా? ఆ పద్ధతిని యెక్కువ రచన చేసినవారికే అగ్రస్థానం రావడం యేలాగా తప్పదు, కాని దానిమీఁద వచ్చే పూర్వపక్షాలు చాలా వుంటాయి. పనిపడితే వాట్లని వివరిస్తాను. యిప్పుడెందుకు?

"సరే! వారివారి కవిత్వాలనుగూర్చి వ్రాస్తూన్నావు, స్థాన నిర్ణయం చేస్తూన్నావు. నీ కవిత్వాన్నిగూర్చి యేంచెపుతావు? నీ స్థానం యేలాటి దంటావు?" అని నిర్మొగమాటులు యెదటే అడుగుతారు. తదితరులు చాటుగానేనా అనుకుంటారు. అయితే నాస్థానాన్ని నేను నిర్ణయించుకోవడం యేలాగ? నన్ను అభిమానించే అమాయిక లోకం మెచ్చిన మెప్పులు పని చేస్తాయా? ఆ మెప్పులు నేను కోరకుండా సంఘటించినవేనా వేలకు వేలున్నా అకించిత్కరాలే. "బ్రతికివున్న వాని తుమ్ము పాటికి రా" దన్నమాటే, యిట్టి స్థితిలో కర్తవ్య మేమిటి? పడక కుర్చీలో కూర్చుని —

(గేయం)

(నేను బాగా కవనం, చెపుతా,
నాకా, విత్వం, రసవం, తామూ,
సంధ్యా, వందా, నంలా, గానూ,
నాప, ద్యాలు, వల్లిస్తారూ)

అనుకుంటూ సంతోషిస్తే శేషించిన ఆయుర్దాయం గడచిపోదా? యెవరేనా మా యింటికి వచ్చి నీవు తప్పభిప్రాయ పడుతూన్నావు. నీ కవిత్వమందు లోకానికి అలాటి సదభిప్రాయం లేదని ఖండితంగా చెప్తారా? చెప్పరు. పైంగా వూరుకోక, నా వెనకాల తాళం వేస్తారు. అనవలసిన మాట లేవేనా వుంటే అవతలికి వెళ్ళి యేమిత్రుడితోనో అంటారు. అవి నాకేలా తెలుస్తాయి? ఆ పద్ధతిని నా లోపాన్ని నేను తెలుసుకోవడం తటస్థించదు కదా? యిక్కడ వుపాయం యేమిటి? జీవితానంతరం యెవరో తేలుస్తారనుకుందాం, అది నాకు తెలిసే దెలాగ? యీలా అనుకోవలసిన చిక్కు లేకుండా భగవంతుడు వక సదుపాయం కనపరిచాడు. నన్ను "గర్భశత్రు" వుగా లిఖిస్తూవున్న గురుపరుతే ఆబాలగోపాలంగా నా కవిత్వాన్ని ఆమోదిస్తూ వున్నారనే అర్థం యిచ్చేమాటలు "గొల్లలూ గొడ్లకాపరులూ" అంటూ వ్రాసివున్నారు. వారు ఆమాట యెందుకు వ్రాసినా "ఆత్మన్య ప్రత్యయం చేతః" అనే కాళిదాసోక్తికి స్మారకమై నా కవిత్వాన్ని నూటికి తొంభై తొమ్మండుగురు ఆమోదిస్తూ వున్నా రనుకుంటూ కాలక్షేపం చేయ వచ్చు ననుకుంటాను. ఈలాగే నా చదువును గూర్చి కూడా వక వాక్యం "శ్రీరాగం" తో అనేది వారే అనుగ్రహించి వున్నారు. వకరినిఆశ్రయించకుండా పుస్తకాలుపోస్టేజీ పెట్టి పంపకుండా వచ్చిన ఈ సర్టిఫికెట్టు కన్న నాకవిత్వానికి కావలసిన దేమిటి? ఆ యీ సందర్భాలు "పుణ్యైర్యశః" అనే వ్యాసంలో భంగ్యంతరంగా వుదాహరించినవే ప్రసక్తి కలిగి మళ్ళా యిక్కడ స్పృశించినాను. "భాగోతం" "బొమ్మలాట" "పొగటి వేషాలు" ఆ యీ పదాలన్నీ నా కవిత్వానికి విశేషణాలుగా వుపయోగించడం కూడా నా కవిత్వం బహుజన సమ్మతికి పాత్రమనిన్నీ ఆ యీ విషయం శత్రు కృత వింద నుండి వుపలబ్ధమవడం చేత నేను ధన్యుణ్ణనిన్నీ పొంగుతూ వున్నాను. శ్రీ గిడుగు పంతులుగారు నన్ను "చిటికెన వేలిమీద" కెక్కించడం అంత లాభకారి కాదు, యిదే లాభకారి. యింక నూటికి వకరో యిద్దరో 'నా కవి

త్వాన్ని ఆమోదించని వ్యక్తు లుంటారని గురువరులే చెప్పక చెప్పినట్లు యింది. అందులో ప్రథమస్థానాన్ని గురువులే అలంకరించాలి? రెండో దాన్ని ప్రస్తుతం కారణాంతరం చేత వారి వెనకాల హంగుచేస్తూవున్న 'గంధర్వుఁడు' గారు అలంకరించాలి. పోనీ పండితులుమాత్రమే సమ్మానించే కవిత్వాన్నేమేనా గురువులు సంస్కృతంలోఁ గాని ఆంధ్రంలోఁ గాని రచించి వున్నారా? లేక యిఁక ముందు రచిస్తారా? ఆలాగయితే "నా కవిత్వాన్ని పండితులు మెచ్చుతారు. వెం॥ శా॥ కవిత్వాన్ని పామరులు మెచ్చుతారు" అని వ్రాస్తే లోకానికి నచ్చేది. యెన్నో ప్రయోగాలు పండితులు నొచ్చుకొనేవి భారతంలో వాడివున్నారు. అందుచేత అదిన్నీ పొసఁగదు.

యిఁక శ్రీనాథుఁడు లాగ కవిత్వాన్ని చెప్పడంగూర్చి జీవిత చరిత్రలో యీ విషయం కొంత అనంతపంతులు వారు శ్రీవారి అభిప్రాయానుసారం వ్రాసినట్లు జ్ఞాపకం. గురువుగారికిన్నీ శ్రీనాథునికిన్నీ పోలికల్లా వొక్క లంకవ్యవసాయం చేసి ఋణగ్రస్తు లవడంలో తప్ప కవితా విషయంలో వుండనే వుండదని ఋజువు చేస్తాను. "ఉండు నేవీట మార్కండేయ లింగమ్మ" అనే మాదిరి జీవ కవిత్వం చెపితే ఈకాలంలో ఆదిపూడి ప్రభాకర రాయఁడు గారు చెప్పేవారు. వారు కొలఁది కాలం నాఁడు "అరుగు చున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి" అయినారు. యిఁక మళ్ళా బయలుదేఱితే ముందు బయలుదేఱతారేమో? ఈ సంగతి మా బంధువులు రామలింగస్వామి గారు బాగా గమనించాలి. వట్టి ముఖస్తుతులు పనిచేస్తాయా? పరీక్షసమయం వచ్చింది, లోకం ఆ యీ విషయం వద్దన్నా చర్చించక మానరు. గురు కవిత్వ సమ్మానార్థం యేర్పడ్డ సభలలో కూడా గ్రంథం విస్తారం వ్రాసినారనే కారణాన్నే వారు వారు వుపన్య సిస్తూన్నారు కాని "రసారస" విచారాన్ని యెత్తుకుంటే చిక్కు వస్తుందని సుతరామున్నూ దాన్ని స్పృశించడమే లేదు. కాఁబట్టి రామలింగస్వామి గారు అవసర మనితోస్తే వారు వ్రాసిన చరిత్రలో కొన్ని

విషయాలు సవరిస్తే అనుకూలంగా వుంటుంది. ఇంకా శ్రీయుతులు చిలుకూరివారి గ్రంథం బయటికి వస్తే కొన్ని సవరణలు కనపడతాయి. స్వామి గారికి జ్ఞాపకం వుందో? లేదో? నా ఉపాధ్యాయ కాలాన్ని ఇప్పుడు చెప్పిన గురువుల మాటల యెడల విశ్వాసం చాలదో యేమో? మొన్న ప్రస్తావన వచ్చినప్పుడు నన్ను ప్రశ్నించి వున్నారు. వ్రాఁత ప్రతి వికారి సంవత్సరంలో వ్రాసి వుంచినది చూపినాను. దానితో వారు కవుల చరిత్రలో ఆ విషయాన్నే యెత్తకుండా వూరుకొన్నారు. ఆ చరిత్ర చూస్తే యీ విషయం స్పష్టపడుతుంది.

"అటునుంచి నలుక్కు రమ్మన్నాఁ" డని యెప్పటి కప్పుడు తోఁచినట్లల్లా యేదో తోవ తొక్కడమే కాని ఆ తోవ యేం బాధిస్తుందో? అని గురువులు ఆలోచిస్తున్నట్లే లేదు. దీని కెన్నో వుదాహరణాలు వారి చెరలాటంలో వున్నాయి. యెత్తి చూపవలసివస్తే చాలా పెరుఁగుతుంది గ్రంథం. "ఏనిని" అనే ప్రయోగం మొదట తప్పన్నారు, భారతంలో వుందన్నాను నేను. మళ్ళా కొన్నాళ్ళయినాక సౌప్తిక పర్వంలో అని నిర్దేశించాను. అప్పుడేనా పరిశీలించు కోవాలా? సుతరామున్నూ పరిశీలించక "లేదు, లేనేలేదు" అనే అర్థం వచ్చేలాగ బోలెఁడు వ్రాస్తారే, యే మనుకొనేది? శల్య, సౌప్తిక, కర్ణ పర్వాలలో మూఁడు చోట్ల ప్రాసస్థానంలో వున్నదాన్ని యీ రీతిగా అపలపించడానికి వారికేం ధైర్యం వుందో? "యిదంతా యెవరి క్కావాలి? మనం లేదంటే కాఁబోలు ననుకుంటారు కాని పరిశీలించే దెవ?" రనే ధైర్యమే అనుకోవాలి కదా! యితరులు పరిశీలించరే అనుకుందాం, ఎన్నో అపహాస్య మ్మాటలతో నేలి చేయఁబడ్డ వాణ్ణి నే నెందుకు పరిశీలించి స్థలం చూపకుండా వుంటాను? నాకు సత్యం తేల్చకుండా యేలా నిద్దర పడుతుంది? ఆ ప్రయోగాలిక్కడ వుదాహ రిస్తున్నాను.

(1) "నను.... ....నీవు మన్నించెదవేనిని వచ్చెద నీపాలికి" కర్ణ-౨-ఆ.

(2) "తనకై.........వినుము దాఁ బ్రళయ మొందిన యే,నిని" శల్య-౧-ఆ.

(3) "........తేజనేనిని బటు శోక వేగమున" సౌప్తి-౨-ఆ.

ఈ త్రియంలో, సౌప్తిక పర్వ ప్రియోగం దిద్దితే దిద్దఁబడుతుంది గాని తక్కినవి రెండున్నూ దిద్దఁబడవు. అదిన్నీ కాక వూరికే దిద్దడమేనా? దానికి తగినంత హేతు వుండ నక్కఱ లేదా? ఈమాత్రిం పాండిత్యం లేకేనా భట్టోజీ దీక్షితులు, "తే నావైహీతి వృద్ధి రసాధు రేవ" అన్నది? అసలు పాఠం "అవేహి" అనేదే అంటే తీరి పోయేది కదా? నాగర లిపిలో ఏకా రైకారాల కెంతో భేదం కూడా వుండదు కదా! "ఏనిని" లేదంటూ వ్రాసే ఘట్టంలో అంతతో సరిపెట్టక ఆ సౌప్తికపర్వంలో మరో కందపద్యాన్ని యెత్తుకొని ఆ పద్యంలో యేమో నేను భ్రాంతి పడి 'ఏనిని' ప్రియోగం వుందని అన్నట్టు అభిప్రాయం తేలుస్తూ "గురుద్రోహికి చాలా దుర్గతి వస్తుం" దంటూ యెన్నో వాక్యాలతో వివరించారు. ధృష్ట ద్యుమ్నుణ్ణి అశ్వత్థామ చంపిన సందర్భంలోది ఆ పద్యం అయితే యెదురు పడి యుద్ధం చేసి చేసి తాత్కాలికంగా యుద్ధాన్నుంచి విరమించిన ద్రోణా చార్యుల వారిని ధృష్టద్యుమ్నుఁడు తల కోయడం దోషమే అనుకుందాం, యిక్కడ అట్టి దోషం కనపడదే? విద్యావిషయంలో గురువుగారు శిష్యుణ్ణి యేమీ తెలియని మూర్ఖుఁడుగా లోకానికి ప్రిదర్శించడానికి పూనుకొన్నారు. యిది సదుద్దేశమే నని యెవరేనా సమన్వయిస్తారా? పోని యధార్థ కథన మేమో, అనుకుంటే? అందెంత వెదకినా నిజమంటూ లేనే లేదాయె. అట్టి స్థితిలో దాని తత్త్వాన్ని తెలపడం కూడా గురుధిక్కారమే అవు తుందా? దానివల్ల గురువులకు పర్యవసానంలో పరాభవం ఫలిత మవు తుంది గనుక యించుమించు దానికిందకే వస్తుం దంటారా? ఆమాత్రిం నాకున్నూ తెలుసును. వూరుకుంటే ఆ పరాభవం నాకు ఘటిస్తుంది. "తన తల్లి చావుకన్న పినతల్లి చావు మే" లనే లోకోక్తి వుందికదా? అదిన్నీ కాక "అయ్యా! యీ తోవలోకి తాము రావద్దు తమకు వోడు తప్ప" దంటూ నేను చెప్పి చెప్పి అప్పుడు కూడా వారు నామాటను గమనించక

తొక్కుకు వస్తే విధిలేక నేను న్యాయమైన ప్రయోగాలతోనున్నూ యితర గురువుల శుశ్రూషవల్ల నాకు సంప్రాప్తమైన శాస్త్ర జన్యజ్ఞానంతోనున్నూ సమర్థనానికి వుపక్రమించినాను. అయితే "మీరు వుపక్రమించకుండా వుంటే క్రమంగా లోకమే దీనికి వుపక్రమించేది. మీ క్షేమాత్రమున్నూ దోషశంక కవకాశమే లేకపోయేది" అని కూడా కొందరు అంటారు. అది సత్యమే "ఊరకున్న వారి కూరెల్ల నోపదు" కాని సర్వధర్మ రహస్యము లకున్నూ పెట్టిన పేరైన భారతంలో "క్షమ మేలగు నైన నతిక్షమ దైన్యము దెచ్చు" అని వుండడం చేత నేను అతిక్షమను అవలంబించక యదార్థాన్ని ప్రకటించి విజ్ఞులైన పెద్దలకు శ్రుతపరచి నిర్దోషి ననిపించు కున్నాను. యీలా అనిపించుకోవడంలో కూడా నాంతరీయకతయా యేకొంచెమో దోషం గురుధిక్కార రూపం వుందంటారా? ఆదోష నివృత్తి కోసం గురువుగారికి నేను క్షమాపణ చెపుతూనే వున్నాను. యీ చెప్పడం యీ వ్యాస మూలకంగానే అక్కఱ లేదు, మహాసభలో పలువురు పెద్దల యెదుట కూడా చెపుతాను, ఒప్పులు తప్పు లంటే మాత్రం వప్పుకోవ డానికి నాకు చేతకాదు. పశ్చాత్తాపం దోష నివారక మని పెద్దలు చెపు తారు. అందుచేత త్రికరణ శుద్ధిగా నా పశ్చాత్తాపాన్ని గురువులకున్నూ ప్రాజ్ఞ లోకానికిన్నీ విన్నవించుకొంటూ యిక యీ వ్యవసాయాన్నుంచి పూర్తిగా విరమిస్తూ వున్నాను.

వెం॥ శా॥ శతావధాని.

---

# క్షమాపణ

( 14–8–1937 సం॥ర కృష్ణాపత్రిక నుండి )

శ్రీ గురువుగారు మొట్టమొదట నాకిప్పించిన లాయరు నోటీసుకు తెలుగు

యమ్. పురుషో_త్తంనాయ్డు బి. ఏ. బి. యల్. అడ్వకేట్ రాజమండ్రి నుంచి } "శతావధాని" చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి, కడియం, రాజమండ్రి తాలూకా.

ప్లీడరుగారు యిచ్చిన రిజిష్టరీ నోటీసు.

మా క్లయింటు శ్రీపాద కృష్ణమూ_ర్తిశాస్త్రిగారు యిచ్చిన సంజ్ఞ యిప్పైన యీక్రింది నోటీసు యిచ్చు చున్నాను.

(1) సి. వీరభద్రరావుగారికి యిచ్చిన నోటీసు కాపీ యిందుతో జతపర్చడమైనది.

(2) మీరు మా క్లయింటు 'పరపతి'కి భంగము కలుగునని తెలిసియుండియు, మా క్లయింటు పరపతికి భంగము కలుగచేయవలెనని దురుద్దేశ్యముతోను, కార్పణ్యము వహించియును, సి. వీరభద్రరావుగారు వ్రాసిన కరపత్రములోని అసత్యమైనట్టివన్ని, కార్పణ్యసహితమైనట్టివన్ని, "లైబెల్" (నిందాగర్భితమైన ప్రకటన) ను మీరు 22–5–1937 తేదీ కృష్ణాపత్రికలో "గిడుగా! పిడుగా" అనే మీ వ్యాసంలో ప్రచురించి యున్నారు.

(3) వారి నోటీసు 7 వ పేరాలోని అంశములు మీకు కూడా వ_ర్తించును. అందులో కోరిన పరిహారములకు మీరుకూడ బద్ధులౌదురు.

(4) అందులో కోరిన పరిహారములు మీరు నెరవేర్చని యెడల మీపైన ఆ పరిహారములకును ఖర్చులకును తగిన సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకొనబడును.

రాజమండ్రి } 5–7–37

యం. పురుషో_త్తం.
అడ్వకేటు.

నవరు నోటీసు పిమ్మట నా అంతట నేను యిచ్చిన క్షమాపణ

కవిటం, తూర్పు గో॥ జి॥

మ॥ రా॥ రా॥ మాదిరెడ్డి పురుషోత్తంనాయుఁడు (అడ్వొకేటు) గారికి—

అయ్యా! తాము 5 వ జూలై 1937 సం॥ తమ క్లయింటు శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ కవిరాజ అంధ్ర వ్యాసాది బిరుదాంకితులును, అస్మద్గురువులును, అను బ్ర॥ శ్రీ॥ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి తరఫున యిచ్చిన నోటీసు పుచ్చుకొని యింగ్లీషు చదివికొన్న విజ్ఞులవలన చదివించుకొని దాని ముఖ్యాంశము అవగతం చేసు కున్నాను. నాతాలూకువ్యాసం "గిడుగా? పిడుగా?" అనే శీర్షికతో వున్నది రెండవభాగం ఈశ్వరసం॥ వైశాఖ శు ౧౩ శనివారంనాఁటి కృష్ణాపత్రికలో 17, 18 పేజీలలో ప్రకటింపఁబడ్డవానిలో 18 వ పేజీలో 21 వ పంక్తి మొదలు 27 వ పంక్తి వఱకున్న వున్న — "అట్టియుత్తమ శీలత్వము.... ...అరిష్ట దాయకములుగా నుండును" అనే వాక్యము (శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి కరపత్రమునుండి గైకొన్నది) శ్రీ మా గురువుగారి హృదయానికి నాచేత క్షమాపణ చెప్పించుకోఁదగ్గదిగా తోఁచి నట్లు స్పష్టపడింది.

(2) అయితే ఫలానామాటకంటూ ప్రత్యేకించి నేను క్షమాపణను యెక్కడా యిదివఱకు ప్రచురించి వుండలేదుగాని తఱచుగా ఖండనాత్మక మైన ప్రస్తుతానికి సంబంధించిన వ్యాసాలలో నేను యెక్కడి కక్కడే క్షమాపణోక్తులు వుటంకిస్తూనే వున్నాను. అందులోనున్నూ 30 వ జూన్ 1937 సం॥ ఆంధ్రవారపత్రికలో వెలువడిన దీర్ఘవ్యాసం రెండవభాగం "ముంజేతి కంకణమ్మున కద్దము" అనే శీర్షికతాలూకు తుట్టతుదభాగంలో పూర్తిగా క్షమాపణాన్ని శ్రీవారి ఆజ్ఞ కాకముందే నా అంతట నేనే ప్రచు రించుకొని నా హృదయ నైర్మల్యాన్ని శ్రీ గురువులకున్నూ యితర ప్రాజ్ఞలోకానికిన్నీ విన్నవించు కొని వున్నాను. అది శ్రీవారు చిత్తగించి

వుండేయెడల నాకు మళ్ళా యీ నోటీసు జారీచేయించి వుండరని తలు స్తాను. శ్రీవారు చిత్తగించలేదనే తాత్పర్యంతో చర్వితచర్వణంగా ఆ వాక్యా లువున్న భాగం మళ్ళా యిక్కడ వుదాహరిస్తూవున్నాను.

(30 జూన్ 1937 సం॥ ఆంధ్రివారపత్రిక 31వ పుటలో తుట్టతుదకాలంనుండి)

" యీలా అనిపించు కోవడంలో కూడా నాంతరీయకతయా యే కొంచెమో దోషం గురుధిక్కారరూపం వుండంటావా? ఆదోషానికి గురువుగారికి నేను క్షమాపణచెపుతూనే వున్నాను. యీచెప్పడం యీవ్యాస మూలకంగానే అక్కఱ లేదు. మహాసభలో పలువురు పెద్దలయెదుటకూడా చెపుతాను. ఒప్పులు తప్పులంటే మాత్రిం వప్పుకోవడానికి నాకు చేఁతకాదు. పశ్చాత్తాపం దోషనివారకరమని పెద్దలు చెపుతారు, అందుచేత త్రికరణ శుద్ధిగా నాపశ్చాత్తాపాన్ని గురువులకున్నూ పాఠ్రిజ్ఞలోకానికిన్నీ విన్నవించు కుఁటూ యిఁక యీవ్యవసాయాన్నుంచి పూర్తిగా విరమిస్తూ వున్నాను."

(3) అయితే అయీఁక్షమాపణవాక్యాలు శ్రీవారు చిత్తగించివుం డిన్నీ వారి హృదయానికి సంతుష్టి కలగక యీనోటీసు యిప్పించివున్న ట్టయితే శ్రీవారు యేలాటి వాక్యాలతో క్షమాపణ యిమ్మని ఆజ్ఞాపిస్తే ఆలాటిమాటలతోనే యివ్వడానికి సిద్ధంగా వున్నానని సవినయంగా మనవి చేసుకుఁటూవున్నాను. వారికోరికలేకుండానే క్షమాపణ ప్రిచురించుకొన్న నేను అది కూడా తటస్థించినప్పుడు ప్రచురించక పోవడమంటూ వుంటుందా? అట్టి మంచిసమయానికి నేనున్నూ నిరీక్షిస్తూనే వున్నానని విజ్ఞప్తి.

(4) యిఁక నేను "కోటు" చేసిన "అట్టి యుత్తమ శీలత్వము" అనే వాక్యానికి నేను ఆక్షేపించిన తాత్పర్యమేనా చరితిపురుషు లనిపించు కొనే మహాశీయులకు సత్యవాక్యతత్పరత్వం వుండడమనేది "బంగారుకు పరిమళం అబ్బడమంటిదిసుమీ" అని తెలుపడానికే కాని శ్రీవారిహృద యాన్ని నొప్పించడాని కెంతమాత్రిమున్నూ కాదు. నావుద్దేశం వాక లాగు వుంటే శ్రీవారు మరివకలాగ అభిప్రాయపడినందుకు నేను మిక్కి

లిగా విచారిస్తూ వున్నాను. అయితే గ్రంథకర్త వారి అభిప్రాయంతో వ్రాసినదాన్ని యితరులు మరొక అభిప్రాయంతో అన్వయించుకోవడమున్నూ అక్కడక్కడ తటస్థిస్తుంది. ఈ అంశం ప్రఖ్యాతమైన గురువులు వేసే మనవి చేసుకోవడానికి గ్రంథం పెంపుచక్కరచేను. దీనికి యెన్నో వుదాహరణాలైతే చూపవచ్చును. కాని క్షమాపణనే చెప్పుకోవచ్చునప్పుడు అట్టిపరిశ్రమ నిష్ప్రయోజనం కనక క్షమాపణాన్నే ప్రధానంగా యిస్తూ వున్నాను.

(5) నాకన్నా ముఖ్యంగా ఆపేక్షించతగ్గది శ్రీవారి "పెంకాట" గ్రంథంవల్ల వ్యక్తిగతంగా నాకున్నూ సామాన్యంగా నాకవిత్వపు గౌరవకున్నూ కలిగిన నిర్హేతుక కళంకాన్ని మాపుకోవడమే కాని యిప్పించేదగాని శ్రీవారిని అవమానించే దురుద్దేశం లేశమున్నూ కాదు. అయితే పయి రెండుకళంకాలలోనున్నూ నాకవిత్వానికి వారు ఆపాదించిన కళంకాన్ని మాపుకొనే నిమిత్తమే నేను కృషి చేశానుగాని మొదటిదానికై లేశమున్నూ చేయనేలేదు. సర్వానికిన్నీ "సహృదయాః ప్రమాణమ్." వారికి నా పరిశ్రమకు ఫలితం యేదో గోచరించే వుంటుంది. గురువుగారి హృదయానికి నా ప్రయత్నంలో దేనివల్లనేనా పరితాపం కలగడం నాకు సమ్మతం కాకున్నా వారికి అది కలిగినట్లు వారి నోటీసువల్ల తెలిసికొని వారి అభిప్రాయానుసారం క్షమాపణ ప్రచురించి నిర్దోషిని కాగలిగినందుకు వుప్పొంగుతున్నాను.

(6) అయితే యింకొకమనవి. ఆయీ క్షమాపణ నా అంతట నాకు తోచినమాటలతో వ్రాసేదేకాని లాయర్లసలహామీద వ్రాసేది కాకపోవడంచేత యిది కొంత చేవస్తంగా వుంటే వుండవచ్చు ననుకుంటాను. అయినా యిందులో ముఖ్యాంశం విజ్ఞులగు గురువులకు విశదం కాకపోదని నమ్ముతాను.

(7) ఒకవేళ నేను సలహానిమిత్తం లాయర్లను ఆశ్రయిస్తేనో? వారికి మాయిద్దఱితాలూకు వాదోపవాదాల రికార్డు చూపడం యేలాగా

చెప్పమనవా? అప్పుడు వారు నాకిచ్చే సలహా యింత సుఖకరంగా వుండదేమో. మేమంటే? శ్రీవారి "పోరాటం" చాలా ముదురుపాకంలో వుందని పత్రికల్లో సర్వత్రా అంగీకరించేదే కనుక దాన్ని గురించి విస్తరించడం అనవసరం. అందులో వ్యక్తి దూషణవాక్యాలు చాలా వున్నాయని ఆ లాయర్లకు తోచి ప్రతిబంధ్యకరంగా వున్నకూడా శ్రీవారి మాదిరిగానే నోటీసిమ్మని సలహా చెపితే కర్తవ్య మేమిటి? ఆలా నోటీసిస్తేమాత్రం అంతటో తేలుతుందా? "యిల్లలికినంతలో పండుగవుతుందా?" కోర్టుల మ్మట యెన్నాళ్లు తిరగాలో? తుదకు జయాపజయాలు దైవాధీనాలుకదా? అదిన్నీకాక వారు నాకు గురువులు కనుక ఆ స్థానానికి నాచేత క్షమాపణ చెప్పించుకోవడానికి పూర్తిగాహక్కు వుండడానికి అందరూ అంగీకరిస్తారు. శిష్యస్థానానికి అట్టిఅర్హత లేశమున్నూ వుండదుకదా? అట్టి అనుచితకార్యానికి నామనస్సు యొత్తిగా అంగీకరించిందికాదు. యీలాటి కొంటవ్యాజ్యాలు పండితులు పెట్టుకొన్నవి యేమైనదిన్నీ చదివి వున్నాను. వీట్లవల్ల వృథాప్రయాసమే తప్ప యశస్సుకు అపవాదలవల్ల వచ్చేకళంకం తొలఁగడం పుస్తకాపేక్షే. అందుచేత లాయర్ల సలహాకోసం యత్నించక నాఅంతట నేనే యీక్షమాపణ వాక్యాలు వ్రాసి ప్రచురిస్తూ వున్నాను.

(8) కవితాకన్యకకు యితరులవల్లవచ్చే కళంకం పోవాలంటే, సత్యవాక్యతత్పరత్వంతో మిళితమైన పాండిత్యం వల్లనే తప్ప "అన్యథా శరణం నాస్తి" అని నాకు గాఢమైన నమ్మకముండడం చేతనైతేనేమి, వార్ధక్యమే కాక అంతకూప్రధానం రుగ్మత్తకూడా కోర్టుకు యాతాయాతాలు చేయడానికి అనుకూలించే స్థితిలో లేనందువల్ల అందులోకి దిగలేకైతేనేమి? "సంధి మిచ్ఛంతి సాధవః" అనే వాక్యమందు నాకువున్న ఆదరాతిశయం చేతనైతేనేమి, శ్రీవారి అభిప్రాయానుసారంగా యీ క్షమాపణ ప్రచురించి యిహపరలోకాలు రెంటికిని అనుకూల్యాన్ని ఆర్జించుకోగలిగినందుకు నన్ను నేనే అభినందించుకుంటూ వున్నాను అవి మనవి చేసుకుంటూవున్నాను.

(9) ఆ యీ క్షమాపణ బాపతు నకలు నాకున్ను ఒకటి పంపుచున్నాను. శ్రీగురువులు దీన్ని యేయేపత్రికలకు పంపమని ఆజ్ఞాపిస్తే వాటికన్నిటికిన్నీ పంపుటకు నా అభ్యంతరం లేశమున్నూ లేదనిన్నీ మనవి చేసుకుంటూ వున్నాను. ఆజ్ఞకు యెదురు చూస్తూవుంటానని కూడా విజ్ఞప్తి.

ఇట్లు విధేయుడు

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.

కడియం తూ॥ గో॥ జి॥ 10-7-37

శ్రీగురువుగారు తిరిగి యిప్పించిన నోటీసు

యమ్. పురుషోత్తంనాయుడు బి. ఏ. బి. యల్.
అడ్వకేట్
రాజమండ్రి నుంచి

“శతావధాని”
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి,
కడియం, రాజమండ్రితాలూకా.

యీ నడుమ మీపై మేము యిచ్చిననోటీసుకింద 10-7-37 తేదీని మీరు వ్రాసిన క్షమాపణవుత్తరము చేరినది. అందు అనవసరమైనట్టియు, అప్రస్తుతమైనట్టియు సంగతు లేమేమో వ్రాసినారు. అవి ప్రస్తుతము మీపై మేము చర్యనడిపింప దలచినకేసుకు సంబంధించి యుండలేదు. అట్లువ్రాయుటవలన మీరు మాకు క్షమాపణ యిచ్చినట్లుగా మేము భావించుటకు వీలు లేదు. మీపై చర్య జరపుటకు నిశ్చయించియు మీనోటీసు మూడవ పేజీలో “శ్రీవారు యేలాటివాక్యాలతో క్షమాపణ యిమ్మని ఆజ్ఞాపిస్తే ఆలాటిమాటలతోనే యివ్వడముకు సిద్ధముగా యున్నానని సవినయముగా మనవి చేసుకొనుచున్నాను” అని వ్రాయుటచేత మీకీ నోటీసు తిరిగి యివ్వడమైనది. మీ రీనోటీసు అందిన ఎనిమిది దినములలో యీ క్రింద మే ముదహరించిన ప్రకారము మీరు మాకు వ్రాసి పంపించవలయును. సదరు క్షమాపణ కృష్ణాపత్రిక, ప్రజా సేవ, ఆంధ్రపత్రిక లలో ప్రచురింపవలయును. అట్లుచేయని పక్షమున మీపై తప్పక చర్య చేయుదుమని యిందుమూలమున తెలియ చేయడ మైనది.

( ఇంగ్లీషు పేవ్రాలు. )

## క్ష మా ప ణ

“ చిలుకూరి వీరభద్రరావుగారు “ బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి జీవితచరిత్రము ” అనుపేరుగల గ్రంథ పరిశీలనపత్రమును ప్రకటించుచు 22 మే 1937 సం॥ తేదీని ప్రచురింప బడిన కృష్ణాపత్రికలో “ నిజమా ? నిజమా ? ” అను వ్యాసములో 18 వ పుట 2 వ కాలములో “ మొత్తం అసత్యం జీవితానికి మిక్కిలి హానికలి గిస్తుందని వ్రాసుగారు ఆ గ్రంథములో వ్రాసియున్నట్లు కరపత్రములో కొన్ని మాటలవల్ల తేలుచున్నది. ఆమాటలు ఉదాహరిస్తాను ” అని నేను వ్రాసి “ అట్టి యుక్తమరీతిత్వము కవియందు గానిపింపకున్నయెడల, కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ బిరుదములచేత పేర్కొనబడినను, స్వర్ణాభిషేకభాగ్యము పొందగలిగినను, కవిగండపెండేరధారణము వహించి నను అట్టివి జీవితమునకు శోభస్కరములు కాక పోవుటయేగాక దేశము నకు సమాజమునకు నరిష్టదాయకములు గానుండును ” అని నేను పొర పాటున అనువదించి వ్రాసి ప్రకటించియున్నాను. ఇప్పు డావ్రాతలు దోషయుక్తములనియు అయుక్తములనియు, మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి మానసష్టము కలిగించు నవియే యనియు తెలుసుకొన్నాను. నే నట్లువ్రాసి ప్రచురించి నందులకు ఇప్పుడు మిక్కిలి విచారించుచున్నాను. నన్నుక్షమించి నాపై సివిల్ క్రిమి నల్ చర్యలను చేయకుండవలయునని కోరుచున్నాను. ”

యీ నోటీసుమీద నేను శ్రీ గురువుగారి అభిప్రాయానుసారంగా నే యిచ్చిన

## క్ష మా ప ణ వు త్త ర ం

కడియం తూ॥ గో॥ జి॥ 6—8—37

మ॥ రా॥ రా॥ శ్రీ మాదిరెడ్డి పురుషోత్తం నాయుడు (అడ్వకేటు) గారికి.

అయ్యా, తాము తమ క్లయింటు శ్రీ మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌముల తరఫున యిచ్చిన 3-8-37సం॥ తేదీగల నోటీసు తెలుగుతోనే వుండడంచేత స్వయంగానే చదువుకొని సదరు నోటీసు రెండవవైపున తాము, లేక మాగురువుగారు దయచేయిం

చిన ముషాయిరా ప్రకారం "మన్నిక్కి మన్నిక్కి"గా యీరీతి క్షమాపణ యిస్తూ వున్నాను. యీ రోజుననే ఆ నోటీసులో దాను పేర్కొన్న ఆయా పత్రికలకు కూడా ప్రకటనార్థము పంపి పెంపడిని ఈడు 5—7—1937 వ తేదీగల నోటీసు మొదలుకొని గడిచిన యావత్తున్నూ పంపిపూటా వున్నా నని మనవిచేసుకుంటూ వున్నాను.

చిత్తగించవలెను,

వెం॥ శా॥ శతావధాని.

చిలుకూరి వీరభద్రరావుగారు బ్రహ్మశ్రీ కల్లూరి వెంకటరామశాస్త్రిగారి జీవితచరిత్రము అను పేరుగల ప్రకటన పత్రమును ప్రకటించుచు 22 మే 1937 సం॥ తేదీని ప్రచురింపబడిన కృష్ణాపత్రికలో "గొడుగా? పిడుగా?" అనువ్యాసములో 18 వ పుట 2 వ కాలములో "మొత్తం అసత్యం జీవితానికి మిక్కిలి హాని కలిగిస్తుందని రావుగారు ఆగ్రంథములో వ్రాసియున్నట్లు కరపత్రములో కొన్నిమాటలవల్ల తెలుచున్నది అమాటలు ఉదాహరిస్తాను," అని నేను వ్రాసి "అట్టి యుక్తయుక్తిత్వము కవియందుగానిపింపకున్నయెడల కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ బిరుదములచేత పేర్కొనబడినను స్వర్ణాభిషేక భాగ్యము బొందగలిగినను కవిగండపెండేరధారణము అయ్యవి జీవితమునకు శోభస్కరములు గాక పోవుటయే కాక దేశమునకు సమాజమునకు నరిష్టదాయకములుగా నుండును" అని నేను పొరబాటున అనువదించి వ్రాసి ప్రకటించియున్నాను. ఇప్పుడావ్రాతలు దోషయుక్తములనియు అయుక్తములనియు మహామహోపాధ్యాయ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి మాననష్టము కలిగించునవియే యనియు తెలుసుకొన్నాను. నేనట్లు వ్రాసి ప్రచురించినందులకు ఇప్పుడు మిక్కిలివిచారించుచున్నాను. నన్ను క్షమించి నాపై సివిల్ క్రిమినల్ చర్యలనుచేయకుండ వలయునని కోరుచున్నాను.

చిత్తగించవలెను

భవద్విధేయుడు

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.



# "దెబ్బకు దెయ్యం జంకుతుంది"

(25-8-37 సం॥ ఆంధ్రపత్రికనుండి)

"దెబ్బకు దెయ్యం" జంకుతుంది అంటూ వక సామెత. దీని తత్త్వం సర్వసామాన్యంగా తెలిసిందే గాని సూక్ష్మాంశాలు మాత్రం కొంతమందికి తెలిసి వుంటాయి. యీ లోకోక్తి ప్రభుత్వ సందర్భంలో తఱచు వాడి వుంటా రనిన్నీ, క్రమంగా అది లోకం సర్వత్రా వ్యాపించి ఉంటుందనిన్నీ నాకు తోస్తుంది. సామ, దాన, భేద, దండోపాయాల్లో మొదటి మూఁడింటికీ లొంగనియెడల దండోపాయంచేత యేలాటి కార్యమైనా సాధింపఁ బడుతుందని దీని తాత్పర్యం. చక్రవర్తులు వగయిరా ఆయారోజులలో కొంత మందిని దీనిచేతే సాధించినట్లు విస్పష్టమే.

చిన్నతనంలో కుఱ్ఱవాళ్ళు బళ్ళోకి వెళ్ళకపోతే తల్లిదండ్రులేమి, ఉపాధ్యాయులేమి పూర్వకాలంలో దీన్నే వుపయోగించేవా రని అందఱికీ తెలిసిందే. విస్తరించడం అనవసరం. చాలా వెనకటి కాలంలో బడిపంతులు కోదండం తీయించడ మంటూ వుండేదని విన్నాను. నా చిన్నతనం నాఁటికే యీ కోదండం నామ మాత్రావశిష్టంగా వుండడంచేత దాని స్వరూపం నాకయితే తెలియదు కాని కొందఱు చెప్పఁగా వినడం జరిగింది. జుట్టుకో తెక్కలకో తాడుకట్టి విద్యార్థిని వేళ్లాడఁ దీయడమున్నూ, నాలుగో అయిదో గంటాలు క్రింద గుచ్చడమున్నూ, ఆలా వేళ్లాడఁ దీసి కొంతసే పుంచడమున్నూ, చెప్పినట్టు వింటా ననిపించి అప్పుడు ఆ నిర్బంధాన్నుంచి విడుదల చేయడమున్నూ జరిగేదని వింటాను. కొందఱు ఆ గంటాలు గుచ్చినచోట మంటకూడా యే తాటాకులతోటో పెట్టడం కూడా వున్నట్లు చెపుతారు. కాని ఆ మంటకు ఆఁగలేక కింద పడితే గంటాలు గుచ్చుకొని మొదటికే మోసం వస్తుంది గనక మంట మాట అబద్ధమేమో అనుకొంటాను. యింతింత నిర్బంధ విధానం అవలంబిస్తే కూడా లొంగని బడిపిల్లలు కూడా వున్నట్టున్నూ వినడం వుంది.

ఆశ్చర్య మేముంది ? యీమధ్య లాటీవాళ్లే హఠాపిడిలో పైకొంగతులున్నా తేలాయికదా ? మంచికేనానరే చెడ్డకేనానరే “ సిద్ధార్థంబు పిడుపిడు సిద్ధిమతులు ” చిన్నప్పటి బళ్ళల్లో ఆనాటి కష్టాలు అనుభవించిన వాళ్లల్లో యేకొందరో తప్ప చాలామంది పెద్ద పెద్ద పదవు లనుభవిస్తూ బాల్యంనాటి తమ చరిత్రలు ఆహ్లాదకరంగా చెపుతూవుంటే వినటానికి యెంతో ఆప్యాయనంగా వుంటుందని అందరూ యెఱిగిందే. శ్రీ కృష్ణమూర్తి వారున్నూ కుచేలుడున్నూ కలుసుకున్నప్పుడు తమ విద్యాభ్యాసం నాటి వొకానొక సంగతిని గూర్చి యెంతో సంతోషంగా ముచ్చటించు కున్నారు కుచేలో పాఖ్యానంలో ఆ విషయం వుంది. కనక యిక్కడ స్పృశించిమాత్రం విడిచాను. యెంత కష్టమేనా సరే అనుభవించేటప్పుడు చిక్కుగా వుంటుంది కాని పిమ్మట దాన్ని స్మరించుకొని మాట్లాడేటప్పుడు సంతోష జనకంగానే వుంటుంది. దీన్నిగురించి వ్రాస్తే చాలా వ్రాయాలి,

గర్భవాసం కంటే అధికమైన కష్టం లేదంటూ సర్వగ్రంథాలూ చెపుతాయి.

“ తే. గీ. గర్భమున కెక్కుడగు నరకమ్ము లేదు
పురువు లంగమ్ములను బట్టి పొడుచు నాఁక
లి యధికమ్ముగఁ బీడించు లేవరాదు
పదినెలల కష్ట మియ్యది పార్థివేంద్ర.

తే. గీ. దారుణమ్మగు యోనియంత్రమ్ము వెడలి
పడుట యొక కష్ట మామీఁద బాల్యమం ద
నేకములు కష్టములు చెప్పనేల ? దీని
నేవగింతురు తత్త్వజ్ఞు లెఱుక కలిమి. ”

అంటూ గర్భవాస నరకాన్నిగూర్చి దేవీభాగవతంలో విస్తరించి వుంది వాక్కు దేవీభాగవతంలోనే కాదు, యింకా యెన్నో పురాణాల్లో వుంది. దీన్ని అనుభవించకుండా వున్నవా ళ్ళంటూ కనపడరు. కాని

దాన్ని స్మరించి భయపడ్డమున్నూ వుండరు. యెవరో మహాత్ములు దీన్ని భయపడి రాసి, జన్మరేఖంటా చేయరాని తలంపుతో జీవితాన్ని గడిపినట్టు గ్రంథాల్లోనే కనుపిస్తుంది. అలాంటివారు "మాతుః పయోధర రసం న పునః పిబామి" అంటూ అభియుక్తులు చెప్తారు. సర్వా సర్వాలు మన బోంట్లకు తెలియవు. ఇది విషయాంతరం,

గతించిన కష్టానికి యెవఁడున్నూ అంతగా భయపడఁడు గాని రాఁబోయే కష్టానికి భయ పడతాఁడు. అంతకన్నా కూడా తాత్కాలికాను భవంలో వున్న కష్టానికి ప్రతివాఁడున్నూ లొంగి తీరవలసిందే. కాని దాన్నికూడా సహించే మహానుభావులు లేకపోలేదు. వారే శాంతస్వరూపులు. వీరిలాంటి శాంతిస్వత్వం కలవాళ్లు కొందఱు నేను వుదాహరించిన కోదండా నికన్నాఁడా లొంగక వుపాధ్యాయులను మిక్కిలిగా అల్లకల్లోల పెట్టినా శ్చగా వుంచేవారని వినడం. యీలాంటి స్వభావులు కేసులు కొన్నివుంటే వుండనియ్యండి గాని మొత్తం "దెబ్బకు దెయ్యంకూడా జంకడం" సర్వ సామాన్యంగా అనుభూతం.

దెయ్య మంటే ? పిశాచమనిన్నీ అనుకోవచ్చు దేవుఁడనిన్నీ అనుకోవచ్చు. దేవుఁడుకూడా దెబ్బకు జంకుతాఁడా ? అని శంకించవల సింది లేదు. దేవుఁడంటూవుండి మనకు కనిపించడమే తటస్థిస్తే తగినంత శక్తి కలవాళ్లం మనం అయితే జంకకుండా వుండడానికి దేవుడికి మాత్రం శక్యం అవుతుందా ?

మనదేవాలయాలలో దేవుఁడు వున్నాఁడనే కదా అనాదిగా ధూప దీప నైవేద్యాలు వగైరా సమర్పించి పూజించడం. దేవుఁడు భక్తానుగ్ర హంతో చేసిన పనులు యెన్నో వున్నాయి కదా ? దుర్వృత్తితో సంచరించే అర్చకులందు కూడా దేవుఁడు అనుగ్రహం చూపడం జుట్టుమొలిపించు కొన్న కథవల్ల విస్పష్టం అవుతుందాయె. అట్టిదేవుఁడు మాల మాదిగలు తన గుళ్ళోకి జొరఁబడితే యెందుకూరుకోవాలి ? ధర్మకర్తకు జంకే

అనుకోవాలి. దేవుఁడు జంకలేడు. అర్చకుఁడు జంకాఁ డంటామా ? అల్లాగే అయినా ఆ అర్చకుఁడికి యేకొంచెమేనా దేవుఁడి ఆసరా వుంటే అర్చకుఁడు ధర్మకర్తకి లొంగుతాఁడా ? యిక్కడ దేవుఁడంటే ? మనం అర్చకుఁడనే అనుకోవాలి. అర్చకుఁడు దెబ్బకి జంకాఁ డంటే ? దేవుఁడే జంకినట్లు. గుళ్ళో వున్నది రాయే గాని దేవుఁడే కాఁడనుకుంటే ? యేమీ చిక్కు కనపడదు గాని గాంధి మహాత్ముఁడు ఆ రాయి దగ్గఱికి హరిజనులను పంపించడానికి ఫలితం పూర్వాచార పరాయణులను యేడిపించడానికి తప్ప ప్రయోజనాంతరం కనపడదు. దేవుఁడు రాయే అయే యెడల ఆ రాయితో పూర్వాచార పరాయణులు యేలాగో దేవుళ్లాడుతా రని మహాత్ముఁడేనా వూరుకుంటే బాగుండేది. కాని రాజనీతిలో ఆఱితేఱిన మహాత్మునికి మనస్సా నమ్మిక వుందో లేదోగాని వున్నట్టే కనుపఱుస్తూ దేవుఁడు ఆచండాల బ్రాహ్మణ పర్యంతమున్నూ వొకటే విధంగా సేవించ తగ్గవాఁ డని అభిప్రాయపడడం తటస్థించింది. చ్యవనుఁడు పట్టుబడితే అంతకు పూర్వం యజ్ఞంతో లేశమున్నూ సంబంధం లేని అశ్వనీ దేవతలకు యజ్ఞంలో భాగార్హత కూడా కలిగినట్లే హరిజనులకు అగ్రవర్ణాలతోపాటుగా దేవాలయప్రవేశం తటస్థించింది. యిది సంతోషమైన కార్యమే అయినప్పటికీ దేవాలయాలకీ దేవుఁడికీ ఆధార భూతాలైన ఆగమాలు మాత్రం మన్నుగొట్టుకు పోవడం తటస్థించింది కదా ? అవి నోరులేవి పూర్వాచారాలవారు విచారించవలసి వచ్చింది. అట్టి దేవాలయంలో మనం యేమొగం పెట్టుకొని అర్చన చేసేదిరా ? దేవుఁడా ? అని కొత్త మానావమానాలు కల అర్చకులు కుమిలి కుమిలి యేడ్చారంటే ? తప్పేముంటుంది ? వుండదుకదా ? పోనీ గుడి వదలి లేచిపోరాదా అంటే ? యేంలాభం ? తమకులస్థులలోనే యెవరో ఆ స్థానాన్ని ఆక్రమించి తీరుతారు. లేదా ? యేహరిజనులో ఆక్రమిస్తారు. అందుచేత అర్చకులు అవమానానికి సహించి కిక్కురు మనకుండా కుక్కిన పేనులా అంత్యజులకు తీర్థ ప్రసాదాలు సమర్పించి గుళ్ళోనుంచి యివతలికి వచ్చి స్నానం

చేసుకొనో చేసుకోకో కాలక్షేపం చేస్తూవున్నారు. యెప్పుడో వకప్పుడయితే స్నానం చేసి మళ్ళా యజ్ఞోపవీతాలు వేసుకుంటారేమో కాని "విత్యం చచ్చేవాడికి యేడిచేవా డెవ" డని ప్రతినిత్యం వుస్నదానికి ఆ యీ చేదస్తం యేలా కుదురుతుంది? దీనిపేరేమిటి? "దెబ్బకు దెయ్యం జంకడమే"

యిక్కడ మహాత్ముఁడు శాంతంగానే బోధించాఁడు గాని లేశ మున్నూ అర్చకులను బెదరించలేదే? అనుకోవచ్చును. కాని వున్నదంతా ఆ శాంతంలోనే వుంది. ఆ శాంతానికి రాజాధిరాజులు దాసానుదాసులు కావలసి వచ్చింది. దానితో మహారాజు ధర్మకర్తగావున్న దేవాలయం తలుపులు విడిపోయాయి. దేవుఁడు మనకెందుకని కాఁబోలును వూరుకొని "బెల్లంగొట్టిన రాయి" సామెతకు ప్రథమోదాహరణంగా మారిపోయి వాఁడు. ప్రజాశక్తి ముందఱ దేవుని శక్తి జంకవలసిం దయిందని సామాన్యులం మనబోట్లం అనుకోవలసి వచ్చింది. కాని విశేషజ్ఞులు మాత్రం యీలా అనుకోరు. కలియుగంలో అయిదువేల సంవత్సరాలు జరిగేటప్పటికి దేవాలయాలలో వుండే దేవుళ్ళ యందున్నూ మహానదులయందున్నూ పుణ్యక్షేత్రాల యందున్నూ వుండే మూర్తిమంతం అంతరించి పోతుందని పురాణవాక్యాలు ఘోషిస్తూన్నా యనిన్నీ ఆ కారణంచేత ఆ యా దేవాలయ ప్రవేశాలు ఆంధ్ర కవితా పితామహుఁడు యేదో సందర్భంలో చెప్పిన "కన్నడం బెట్లు చొచ్చెదు గజపతిందర? తెలిచి నిలు కుక్క చొచ్చిన తెలుఁగు దోఁప?" అన్నమాదిరిగా వుందను కొంటారు.

వోడిపోయిన పార్టీ తమలో తాము యేదో విధంగా సమాధాన పఱచుకోవడం లోకంలో అనుభూతమే. వ్యాజ్యం వోడిపోయినప్పుడు యెవళ్లో మహోదారులు తప్ప సామాన్యులు యేమంటారు? అధికారి అవలిపార్టీవల్ల యేమాత్రమో నంజాఁ డంటారు. యేలాటి అధికారిని యీలా అనడం? అగ్నిహోత్రంతో వకకాలూ మంచిగంధంలో వక కాలూగా ప్రవర్తించే విషయయోగ్యజ్ఞే సుమండీ! నరంలేని నాలుక గదా!

దానికి తలుపేమిటి? ద్వారబంధ మేమిటి? యీ విషయంలో పురారత లేఖకవులు చేసే పనేమిటో? చూచారా! యేదో అప్పచ్చి సంభాషణతో అసత్య కల్పనతో పరిహాసన మంటూ వ్రాసి ప్రకటించి యిహపరాలు రెండూ కూడా యెంతవఱకు చెడఁగొట్టుకోవాలో అంతవఱకూ చెడఁగొట్టు కోవడం, దాన్ని సమర్థించాలని ప్రయత్నం, రసాభాసు, యివి విషయాంతరం గాని పూర్వాచార పరాయణు లన్నమాటగూడా కొంత ఆలోచించ తగ్గదే కాని కేవలం తోసేయ తగ్గది కాదు. అయిదు వేలని సామాన్యంగా మితిపెట్టినా పదివేల వఱకున్నూ యింకా కొన్ని నదుల యందున్నూ, తీర్థాల యందున్నూ, దేవస్థానాల యందున్నూ అంతో యింతో మహిమ వుంటుందని కొన్ని పురాణ వాక్యాలు చెపుతూ వున్నాయి. కనక పూర్వాచార పరాయణు లింకా పూర్తిగా నిరాశ పడనక్కఱ లేదని తోస్తుంది. యేమైనా? దేవుఁడుకూడా దెబ్బకు జంకి తీరతాఁడన్నది సత్యదూరం కాదని తేలింది.

వెనుకటి కాలంలో మతవిప్లవాలు తటస్థించినప్పుడు యెందఱో హిందువులు మహమ్మదీయు లైపోయినట్లు చరిత్రలు ఘోషిస్తూ వున్నాయి. ఆ విప్లవం విశేషించి ఉత్తరహిందూస్థానానికే తగిలింది గాని మన దక్షిణానికి అంతగా సోఁకలేదు. అందుచేతే యింకా చెక్కుచెదరకుండా దక్షిణాది యాత్రాస్థలా లన్నీ కనపడుతూన్నాయి మనకు. మహమ్మద్ఘోరీ సోమనాథ దేవాలయంలో లింగాన్నో విగ్రహాన్నో దేవేంద్రుఁడు పర్వతాలు ఛేదించినట్లు ఛేదిస్తూవుంటే యెంతో పేరు ప్రతిష్ఠలు గల ఆ దేవుఁడు నోరు మూసుకొని వూరుకోవడంవల్ల మనకు తేలే సారాంశం యేమిటీ? "దెబ్బకు దెయ్యం (దేవుఁడు) కూడా జంకుతాఁ" డనేకదా! యింకా యెన్నో వుదాహరణా లైతే చూపవచ్చును గాని వ్యాసం విస్తరిస్తుంది. కనక స్వవిషయం కూడా రెండు మాటలు వ్రాసికొని ముగిస్తాను.

కొందఱు ధైర్యశాలులు దెబ్బ తగిలేదాఁకా బిగఁబట్టుకు చూస్తారు. నాబోఁటి పిఱికి పందలో "యెందుకురా? యేడుస్తా వంటే? యెల్లుండి

కొడతా " రనే లోకోక్తికి ప్రిధమోదాహరణంగా వుంటారు. చూడండీ: నే నిమఖ్య యేం చేశానోను? శ్రీ మా గురువుగారు విద్యా వివాదాన్ని వదులుకొని లీగల్‌గా నన్నునూ మఱికొందఱినిన్నీ కలిపి నోటీ సివ్వడం తోనే నాతో వున్నవారు జవాబే యివ్వక నిర్లక్ష్యంగా వూరుకున్నారని యెఱిఁగికూడా యెందఱో ప్లీడర్లు దీనిలో మీకు రాఁబోయేచిక్కు లేశమూ లేదని సలహా యిస్తూ ఉన్నప్పటికీ వొకానొక అద్వకేటుశిరోమణి యీఅభి యోగం అసలుఫైల్లో చేర్చుకోవడమే దటస్థింపదని చెపుతూ వున్నప్పంటికీ నేను క్షమాపణ ఒకటి కాదు రెండు విధాల వ్రాసి పంపడమే కాకుండా స్వయంగా కూడా శ్రీవారి సన్నిధికి వెళ్ళి చెప్పివున్నాను. దీన్ని బట్టి నా ధైర్యస్థైర్యాలు యేలాటివో లోకం పూర్తిగా గ్రహించి తీరుతుంది. ఆ యీ విషయం కృష్ణ, ప్రజాసేవ, ఆంధ్ర (వారపత్రిక) పత్రికల వల్ల విస్పష్టమే కనక విస్తరించేది లేదు. శ్రీవారి ఆజ్ఞానుసారంగా పై విష యాన్ని నేను పై పత్రికా త్రయానికి పంపి వున్నాను. యథామాతృకంగా జాగ్రత్తగా ముద్రింప వలసిందని కోరి వున్నాను. అలాగే ముద్రించారు. కాని ప్రజాసేవా పత్రికలో మాత్రం "ఒక ప్రేక్షకుఁడు" అనేచేవ్రాలుతో కొన్ని వాక్యాలు అదనంగా దీనికి కంటిన్యూగా ప్రకటిత మయివున్నాయి. అందులో కూడా అసత్య మేమీ లేదుగాని శ్రీ గురువుగారికి నేను వినిపిం చిన శ్లోకాలు మూఁడు అయి వుండఁగా రెండని వ్రాయడం పొరపాటు గనుక అది క్షంతవ్యమే గాని వొక విషయంమాత్రం క్షంతవ్యంగా తోఁచదు. అదేమిటంటే? "3 – 4 వందలు గల శ్లోకములలో చివరి రెండుశ్లోకములు చదివి అనేక విషయములు మాటాడి" అనే వాక్యంలో నేను శ్రీవారితో మాటాడిన విషయము లేవో? అవి వ్రాయకపోవడంలో యేదో కొంత కృత్రిమం వుందని లోకు లనుకొని నాపేర వ్రాస్తూ వున్నారు. అందుచేత ఆ మాటలు యీక్రింద వ్రాస్తూ వున్నాను. ఆ శ్లోకా లల్లో యీ క్రింద నేను వ్రాసే మాటల అర్థమేవుంది. అసలు ఆ శ్లోకాలు వేసేందుకు మొదలు పెట్టవలసి వచ్చిందంటే? జయాపజయాల మాట

యేలావున్నా అంతోయింతో గురు శిష్యభావం వున్నప్పుడు విద్యావిషయమే అయినా వివాదం యిహ పర లోకదూష్యం అని మెళఁగిపున్న నేను శ్రీ సాంబమూర్తిని గూర్చి క్షమాపణ చెపుతూ పశ్చాత్తాప సూచకంగా రచన కారంభించాను. 92 శ్లోకాలు అయినప్పుడు శ్రీగురువుగారి నోటీసు నాకు అందింది. వెంటనే ఈ క్రింది శ్లోకం తోఁచింది.

"శ్లో. మామాక్షిప న్నపజయం గమితో గురు స్త్వం
మార్గాన్తరేణ పరిమార్ష్టు మహంకరిష్ణుః
న్యాయాఽధికారి నికటే త్వభియోగ మేకం
కర్తుం ప్రవృత్త ఇతిచ శ్రుత మద్య శంభో!"

యిది సంస్కృతమైనా తెలుఁగులాగే అందఱికీ తెలిసే శైలిలోనే వుండడంచేత అర్థం వ్రాయలేదు.

వెంటనే రాజమండ్రి వెళ్ళి యెవరెన్నివిధాల చెప్పినా వినక నాకు తోఁచినమాటలతో క్షమాపణ పంపుకున్నాను. శ్రీయుతులు నాళం కృష్ణా రావుగారు ప్రస్తుతవిషయం వ్రాయవలసివస్తే చాలా వ్రాయఁగలరు. "ప్రేక్షకుఁడు" గారు వ్రాసిన వ్రాఁతలో వుండే గుట్టుకూడా కొంత ఆయన వ్రాసేదానివల్ల బయటికి వస్తుంది. కాని ఆయన ఉదాసీనులుగా వుంటా రనుకొంటాను. ఆయనమాత్రం కొంత వ్రాయవలసి వున్నది. ఆయన వ్రాయకపోయినా నా సంస్కృతగ్రంథంలో ఆయనకున్నూ నాకున్నూ జరిగిన సంభాషణ పూర్తిగా వ్యాఖ్యానించి వున్నాను. వొక శ్లోకం వుదాహరిస్తాను.

"శ్లో. నాళంకవి స్తదిదమస్య గురోస్తు కృత్యం
నాఽలం బభూవ సుతరా మభినందితుంవా?
నో మే క్షమాపణ కృతించ తథాఽపి సోఽహం
మాం త్వం క్షమాపయ గురో ఇతిచాఽ లిఖంభో"

యీ శ్లోకంలో వున్న నాశం కృష్ణారావుగారి అసభిసంధనాన్ని గూర్చి శ్రీగురువుగారున్నూ నాతో ముచ్చటించే వున్నారు. యింక నేను గురువుగారితో మాటలాడిన మాటలు వ్రాస్తాను.

"అయ్యా! నేను క్షమాపణ వ్రాసి సిద్ధంగా పెట్టినాను. రిజిష్టరు చేయడం మాత్రమే తరవాయి యిదుగో నకలు" అని నకలు చదివి విని పించి "ఇంక నేను తమవల్ల భయపడ నక్కఱలేదు గదా? కాఁబట్టి స్నేహపకారార్థంకాని మాటలు కొన్ని మనవిచేస్తాను. చిత్తగించండి. నాతో తమరు మఱికొందఱికి కూడా నోటీసిచ్చివున్నారు. వారికిన్నీ తమ కున్నూ నాకు వున్న సంబంధం వంటి సంబంధం లేశమున్నూ లేదు, వారెవ్వరున్నూ నాలాగ క్షమాపణ చెప్పరు. యీ కేసు స్వభావం తమకు చాలా బాధకంగా నాకు కనపడుతుంది. ఋజువు భారం అంతా తమది. యెన్నో విధాల క్రాసు చేస్తారు. ముద్దాయీకేమి? అదృష్టవంతుఁడు. మొట్టమొదట చిక్కంతా ఫిర్యాదీది కదా? యీ వార్థక్యంలో అనారోగ్యంలో దీనిలో తాము చిక్కుకోవడం నా కిష్టంలేదు. యింతకూ ప్రధానుడుగా నన్నుకదా నోటీసులో తాము వుదాహరించి వున్నారు. అట్టి ప్రధానుణ్ణి నేను పాదాక్రాంతుణ్ణి అయినప్పుడు యింకా కేసెందుకు? యీమాటలు నాతోవున్న యితర ముద్దాయీల సంరక్షణార్థం నేను చెబుతూ వున్నట్లు దేవరవా రభిప్రాయ పడితే మనవి చేసుకోతగ్గది లేదు. ఆ ముద్దాయీలలో యేవకరో తప్ప నేను సుతరామున్నూ యెఱిఁగి వున్నవారు కారు, యిదంతా తమయందు వుండే ప్రేమగానే తాము విశ్వసించే యెడల వెంటనే కేసు వుపసంహరించుకో వలసిందని నా ప్రార్థన" అనే అర్థం యిచ్చే మాటలు మనవి చేసాను.

శ్రీ వీరభద్రరావుగారు వ్రాసిన కల్లూరి వారి పుస్తకంలో గురువుగారికి సంబంధించిన వాక్యాలను గూర్చికూడా సమర్థనాసమర్థనాలనుగూర్చి కూడా కొంచెం ప్రసంగం వడిచింది. అది ప్రస్తుతం కాదు. నా మాటలు విని

గురువుగారు నేను ఉపసంహరించుకోవడాన్ని గురించి సౌమ్యభావంతోనే "కొంచెము ఆలోచించేవారితో ఆలోచించి కాని వెంటనే యేమాట చెప్పడానికి వీలుకా" దని సెలవిచ్చారు. "అలాగైతే రాత్రి సహపంక్తికి భోజనానికి వస్తున్నాను. అంతవఱలో యీసంగతి తేలుతుం" దని మనవి చేశాను. అందుకు వారు సమ్మతించినట్లే తోఁచింది. మా యిద్దఱికీ గలిగిన యీసఖ్యానికి గురువుగారు చాలా సంతోషించినట్లే నాకున్నూ కృష్ణారావుగారికిన్నీ కూడా పొడకట్టింది. యీ సఖ్యానికి కారణం ఒక పతివ్రతా శిరోమణిగా గురువుగారు భావించి ఆమెకు నమస్కారాలు గూడా సెలవిచ్చారు. కాని యిదంతా నా సొంతబుద్ధిచే జరిగిందే కాని యితరులు లేశమున్నూ యెఱుఁగరని వారితో మనవి చేసి నాకు వల్లమందుకు వేళ అవుతూవుందని సెలవు పుచ్చుకొని సోమెన వారింటికి వచ్చివేసినాను. క్షమాపణ పోష్టు ద్వారా గురువుగారికి పంపి పత్రికలకుకూడా పంపి సాయంకాలం హిందూ సమాజానికి వెళ్ళినాను, గురువుగారు కూడా అక్కడికే దయచేశారు. మా యిద్దఱి సఖ్యానికిన్నీ అంతో యింతో కర్ణాకర్ణికగా తెలిసినవారు సంతోషించారు. అందులో ఒకరిద్దఱు మా సహపంక్తికి కూడా దయచేశారు. ఒకాయన భోజనం చేయలేదుగాని వచ్చి కూర్చున్నారు. వారు శ్రీయుతులు వేమూరి విశ్వనాథశర్మ (యమ్. యే. యల్. టి) గారు. దీనికంతకూ సూత్రధారులుగా వుండి నడిపిస్తూ వున్న శ్రీయుతులు చయనులు గారు మా యిద్దఱికీ యేలాగేనాసరే సఖ్యం కావాలని కోరుతూ వున్నవారే కనక వారు సహపంక్తికే దయచేసారు. పిండివంటలతో భోజనం జరిగింది. ప్రస్తుత విషయం మళ్ళా గురువుగారున్నూ తేలేదు, అవకాశం లేక నేనున్నూ తేలేదు. చయనులుగారుమాత్రం నేను బసకు వచ్చేటప్పుడు ప్రస్తుతం చెపితే గురువుగారు వినరనిన్నీ కొద్దిరోజుల్లో వారే వింటారనిన్నీ కొంత బెట్టుసరీగా సెలవిచ్చారు. నా కర్తవ్యాన్ని నే నెఱవేర్చుకున్నాను గదా? అని గురువుగారివద్ద సెలవు పుచ్చుకొని నేను బసకు వచ్చాను. చయనులుగారితో యింకా యెన్నో కష్టసుఖాలు మాట్లాడుకోవడం అయితే

జరిగింది గాని అవన్నీ వ్రాస్తే గ్రంథం మరీ పెరుగుతుంది కాబట్టి ఉపేక్షిస్తాను.

అన్నట్టు గురువులకు నేను చదివి వినిపించిన శ్లోకాలు ఉటంకించనే లేదు. యిక్కడ ఉటంకిస్తాను.

"శ్లో. మాం దుష్ట ఇత్యపపదే త్కవితాం మదీయాం
నిష్ఠీవనా ద్యవమతాం కురుతాం యథేష్టమ్
సోఽమాయికః ప్రకృత సంకటతః స్మృతే ద్వై
గర్తే తతోఽహ మభవాఽద్య విచార యామి." ॥౧॥

"శ్లో. గత్వా గురోశ్చ నికటం తదిదం సమస్తం
వక్తుం కుతూహల మతీవహి బాధతే మామ్
కాలస్స ఏష యదివాఽతిపతే దథాఽస్మ
త్తీర్థస్య సర్వవిధయాఽ ప్రతికృతిర్ధ్రువాస్యాత్." ॥౨॥

"శ్లో. తస్మా న్మమోపకరణే యదితే మనీషా
మద్దేశికం కురువిభో! మయి సుప్రసన్నమ్
మద్వాచితస్యతు యథాఽఽప్త మతి స్తథాత్వం
కించి ద్విదేహితమహం ప్రతిబోధయామి." ॥౩॥

అసలు గ్రంథంలో యీ శ్లోకాల సంఖ్య ౩౭౧, ౩౭౨, ౩౭౩ అయితే గురువుగారు మొదట లీగల్‌గా నోటీ సిప్పించేటప్పటికి 92 వ శ్లోకంలోవున్న గ్రంథం క్షమాపణ సమయానికి 373 వఱకున్నూ దేఁకిం దన్నమాట. యీ వ్యాసం వ్రాసేటప్పటికి గ్రంథం ౪౨౦ శ్లోకాలలో వుందన్నవిషయం గమనించవలసి వుంటుంది. యిది యీశ్వరుణ్ణిగూర్చి ప్రార్థన. యీ ప్రార్థనలో నేను గురువుగారితో విద్యావిషయంలో అంతో యింతో పత్రికావాదానికి పనికివచ్చే స్థితిలో వున్నాను, కాని కోర్టులమ్మట తిరగడానికి లేశమున్నూ తగి లేననే విషయాన్ని గూర్చి చాలావుంటుంది. యెందుకు ధార సంస్కృతంలో నడిచిందో? నాకున్నూ తెలియదు.

సంస్కృత కవిత్వం మానుకొని 45 యేళ్ళు దాఁటిపోయింది. మళ్ళా దానిలో పడింది ధార. శ్రీ గురువుగారి అనుగ్రహం వల్ల యీ పరమోత్కృష్టమైన గ్రంథం జయంతికన్నా ముందుగా తయారయింది. భారవి మహాకవి "వరం విరోధోఽపి మహాత్మభిస్సమమ్" అని పూర్వకవే అన్నాఁడా? గురువుల కొత్త మనవి. నేను లీగల్‌గా వకటి కాకుండా రెండు క్షమాపణలు దాఖలు చేసుకొన్నాను. స్వయంగా దర్శనం చేసుకొని వాగ్రూపమైన క్షమాపణాన్ని కూడా యిచ్చివున్నాను. దీన్నిబట్టి జయం దేవరవారిదే అని సంతుష్టి పొందటానికి పూర్తిగా అవకాశం వుంది. అందుచేత లోక సంతుష్టికొఱ కేనా తమరు పత్రికలకు విశ్రాంతి కలిగిస్తే వుచితంగా వుంటుంది.

క్షమాపణానన్తరం కూడా దేవరవారు "మూడింటి తా ఆరింటికా" అంటూ వ్రాయడం అవసరమని తోఁచదు. నేను కవినే కాను. యేమో త్రిమో అయినా దేవరవారి వంటి కవిని కాను. అని తాము ఆముషాయి దాలో వ్రాసి నాకు పంపలేదు కాని అందుకు కూడా నేను కిక్కురుమనక అంగీకరించడానికి సిద్ధంగా వున్నాను. యిప్పుడు మించిపోయింది లేదు. తాము మఱికొన్ని షరతులు వ్రాసి ముషాయిదా యిప్పించి ఆ క్షమాప ణాన్ని కూడా స్వీకరించి నన్ను క్షమించి ఆ ప్రకారం తమ జీవితచరిత్రి రీ ప్రింటులో ప్రకటించండి. మళ్లా విద్యావివాదానికి బీజాలు కల్పించవద్దని ప్రార్థిస్తాను. తమ పూర్వపక్షాలు దురుర్ధరాలనే ధైర్యం తమకువుంది. వొకటీ నిలిచేది కాదనే ధీమా నాకు వుంది. నే నెవరినో పెద్దలను కోరుకు న్నాను. వారి ద్వారా నాకు "ఆత్మన్యప్రత్యయం చేతః" అనే బాధతొలఁ గింది. తాము కూడా యేమనీషిమీఁదో లేక మనిషిమీదో భారం పెట్టడం వుచితంగాని యేదో వ్రాస్తూనే వుండడం ఉచితంగాదు. మనవాదాలు విద్యాసం బంధమైనవే అయినా లోకానికి కొంత విసుగు కలిగిస్తూ వున్నాయి. పైఁగా "లీగల్" వ్యాపారంలోకి దిగడంతోటట్టే మఱీ లోకానికి వీట్లయం దాదరం తగ్గింది. దేవరవారు "లీగల్" నోటీసు యెప్పుడనుగ్రహిం చారో? మనవిచేస్తాను. నా ఆనందానికి పరిమితే లేకపోయింది. యెందు

చేరవద్దూరా? మనం క్షమాపణ చెపితే సరిపోతుంది, గురువులు అనుగ్రహిస్తారు. గురువులవారు విద్యాపీఠమునుంచి విరమించారు అనుకున్నారు. అయితే నా క్షమాపణకు పూర్వమే తమరు పంపివున్నారేమో జయంతి వారిని గూర్చిన బహిరంగలేఖ ప్రజాసేవ పత్రికకు. అది నా క్షమాపణతోనే కలిసి పడింది. అట్టి సందర్భంలో తమరు వక పనిచేయ వలసింది. "శిష్యుఁడు క్షమాపణ చెప్పినాఁడు యింక మా వాదోపవాదాలకు స్వస్తి చెప్పడం వుచితంగాఁబట్టి నేనుపంపిన వ్యాసాన్ని ప్రకటించవద్దు" అని వకవుత్తరం వ్రాయవలసింది లేదా? తంతివార్త: అని గురువులకు మనవిచేసుకుంటూ ప్రస్తుతం వ్రాస్తూవున్న దెబ్బకు దెయ్యాన్ని స్పృశించి ముగిస్తాను.

దెబ్బంటే? కఱ్ఱతోటే అక్కఱలేదు; కత్తితోటే అక్కఱలేదు, కాగితంతోటీ కలంతోటీ కూడా కొట్టే దెబ్బలు కూడా దెబ్బలే. ఆలాటి దెబ్బలకు కొందఱయితే లక్ష్యపెట్టక వూరుకొంటారు. కొందఱో? తిరగబడతారు. నావంటి పిఱికిపందలో జంకుతారు. జంకడానికి ముఖ్యకారణం మొదటి క్షమాపణలో వుదాహరించే వున్నాను. ఆరోగ్యలోపం ఆరోగ్యలోపమంటావు, అట్టిలోపంలో వున్న నీవు పెద్దపెద్ద వ్యాసాలేలా వ్రాస్తున్నావు? జయంతివంటి పద్యకావ్యాలు, క్షమాపణ వంటి శ్లోక కావ్యాలు యేలా వ్రాస్తూ వున్నావని ప్రశ్నిస్తారేమో వినండి నాసోదె. నా ఆరోగ్యం వకరి కట్టుఁబాటులో క్షణంకూడా వుండడానికి తగివుండదు. రోజుకి 24 గంటలలో యే వొకగంటో పరాధీన స్థితికిన్నీ వొకానొకప్పుడు సమ్మతిస్తుంది గాని అధికారి ఆలాటప్పుడే నా కేసు విచారించడం యేలా సంభవించడం? ఆలా విచారించే కోర్టంటూ వకటి వుండి అక్కడ నాకు పడకకుర్చీకూడా యిస్తే యిప్పటి నా ఆరోగ్యం సరిపోతుంది. అందుచేత ఫిర్యాదీగాఁ గాని, ముద్దాయిగాఁ గాని నాకు వుండే అర్హత లేశమున్నూ లేదు. అందుచేత నోటీసు దెబ్బకే హడిలిపోయి గురువుల అనుగ్రహం వల్ల విముక్తుణ్ణయినాను. నన్ను అంతతో తేలికగా వదలిపెట్టి నందుకు

సంతోషం. నాపట్టామట్టా యితరులకన్నా గురువులు బాగా తెలుసు. అన్నవరం వెళ్ళడం నేను నాలుగేళ్ళనుండి మొదలు మానివేశాను. గురువుగారెందుకు వెళ్ళగలిగి వున్నారో శ్రీవారికే కాక శ్రీ అన్నవరపు దేవుఁడికూఁడా తెలిసిన విషయమే కనక విస్తరించేది లేదు. శ్రీవారిప్పటి కింకా అన్నవరం కొండ కాలినడకతో యెక్కే ఓపికలో వున్నారు. నేను సవారీమీఁద వెళ్ళేకూడా అక్కఁడ వుండే శక్తిలో లేను. యిట్టిస్థితిలో కవిత్వ మేనా నేను వదులుకోవలసిందే కాని దానివశంలో నేనుఉండవలసిందేకాని నావశంలో అది వుండేది కాకపోవడంచేత ఆపవి సాధ్యమయింది కాదు. వెంకటాధ్వరి యేమన్నాఁడు? “ పరద శ్శరదాం శతం ప్రబంధాన్. ” అన్నాఁడు. నేనుకూడా జయంతిలో యీ అంశాన్ని వ్యాఖ్యానించి వున్నాను. దాన్ని వుదాహరించి యీ వ్యాసం ముగిస్తాను.

“మ. కవనార్థం బుదయించితిన్ సుకవితా కార్యంబె నా వృత్తి యీ
భవ మద్దాన చరింతు చచ్చువమ మ ద్భాగ్యంబు సర్వంబు మృ
త్యువు నే దానజయించితిన్ రుజ జయింతున్దానిచే విట్టి నా
కవనంబున్ గురుఁడేమిలెక్క హరుఁడేకా దాడ వాదాడెదన్. ”

నాకు ఆ కవిత్వమందంత నమ్మకం వుంది. యిది పిచ్చిగా లోకం భావించినా నేను యీమాట వ్రాయడం మానేది లేదు. “ యెవఁడి పిచ్చి వాఁడికి ఆనందం ” ఇట్టి నేను “ లీగల్ ” గానే కాదు, మన శాస్త్ర ప్రకారంగా కూడా వోడిపోయానని పునఃపునశ్చ వ్రాతపూర్వకంగా వప్పుకుంటూ వున్నాను. లోకులకందఱికీ యీ అంశం యిదివఱకే సాక్షమూ పణవల్లా, ప్రేక్షకుఁడిగారి వ్రాఁతవల్లా తెలిసివున్నప్పటికీ యీ వ్యాసం మూలకంగా మళ్ళా తెలుపుతూ గురువుగారు యింతతో వాదాన్నుంచి విరమిస్తారని తలుస్తూ విరమించవలసిందనికూడా ప్రార్థిస్తాను.

యింకొకమనవి ఆ యీ కేసు అసలుఫైలులో వేసుకోనే లేదనిన్నీ కొట్టివేశారనిన్నీ కాకినాడలో యెవరో చెప్పినట్లు విన్నవాళ్ళు నాకు చెప్పి

మీకు తొందర పడి క్షమాపణ చెప్పా రనడానికి మొదలు పెట్టాను. వ్యాసు నా అంతర్యం తెలియును. నాకు యేలాగో క్షమాపణ చెప్పడానికి అవకాశం దొరకడం మనస్సా నేను భగవత్సాక్షికంగా కోరుతూ వున్నా నన్న రహస్యం శ్రీవారి నోటీసుకు 5 రోజులకు పూర్వం ఆంధ్ర వారపత్రి కలో తుట్టతుది వాక్యాలవల్ల విజ్ఞులు గ్రహించే వుంటారు. అట్టి నాకు శ్రీ గురువుగారు ఆనాటి అవకాశం కల్పించడం పరమోపకారంకాదా? నేను త్వరలో క్షమాపణ యిచ్చివున్నాను కాని ప్లీడర్ల సలహాప్రకారం కొంత జంపు నడిపే మొదల ఆ పుణ్యకాలం కాస్తా దాటిపోయి యెంతో పశ్చాత్తాప పడవలసి వచ్చేది. యీ పశ్చాత్తాప పడడం కేసు ఫైలులో చేరకుండా కొట్టివేశారన్న కింవదంతి నిజమైనపక్షంలోనే సుమండీ! విచా రణకు వచ్చేస్థితిలో వుంటే యీ విచారానికి అవకాశం వుండదు. నేనీ వ్యాసాన్ని రైలులో ప్రయాణంచేస్తూ వ్రాయడం చేత పైకింవదంతికి సంబంధించిన యథార్థం తెలుసుకోవడానికి అవకాశం లేకపోయింది. నేను పెంపరాళే మేలుకొన్నాను గనక యిక నాకు ఆ కేసేమయిందో తెలుసుకో వలసిన ఆవశ్యకత లేదని సంతోషిస్తూ యీవ్యాసాన్ని ముగిస్తాను.

---

## పిండిప్రోలివారి దండితనం

( 25—9—1937 సం॥ర కృష్ణాపత్రిక నుండి )

మిక్కిలీ వినసొంపుగా వుంటుంది. నా చిన్నతనం రమారమీ పదేళ్ళదాకే కోపున జన్మస్థానమైన కడియంలోనే గతించింది కాని అంతట్లో ఫ్రెంచి టవున్ యానాంగ్రామానికి వలసవెళ్ళిందని యితరత్రి వ్రాసే వున్నాను. ఆ యానాంలో మర్ల పేరుసోమయాజులు గారనే వక వృద్ధ వైద్యు లుండేవారు. వారింటికిన్నీ మా యింటికిన్నీ చాలా దగ్గిర. సదరు సోమయాజులుగారు కాసలనాటి శాఖవారు, శ్రీ పిండిప్రోలు లక్ష్మణకవి

గారితో మిక్కిలి వాదోపవాదాలతో సంబంధం వున్న మహాకవి శిష్టు కృష్ణ మూర్తిగారు రాసలనాటి శాఖవారే. అదిన్నీకాక లక్ష్మణకవిగారి నివాస గ్రామం రుద్ర్యేరనేది యానాముకు సుమారు అట. లేక మేము మైళ్ళున్నదిమిచను. ఆ యీ కారణాలచేత చాలా కథలు మా పేరుసోమయాజులు తాతగారికి స్వాతస్స్యవిలిగావుండేవి. లక్ష్మణకవిగారు కృష్ణమూర్తిగారికంటే వయస్సు చాలా పెద్దలని వారు చెప్పినట్లు జ్ఞాపకం. కవితాపరీక్షానున్నూ వానికి మిక్కిలి వాదాపుగావుండే ఆవశ్యకమైన యితర పరీక్షలున్నూకాక యింకా చాలా పరీక్షలు కృష్ణమూర్తిగారివద్ద వుండే వనిన్నీ, పురాణం చెప్పడంలోనున్నూ ఆశుకవిత్వం చెప్పడంలోకూడా శ్రీ కృష్ణమూర్తిగారు చాలా నిపుణులనికూడా శ్రీ ఉప్పులూరి రామజోగన్న సిద్ధాన్తిగారు చెప్పఁగా వినివున్నాను. ఆకథలు యీ సిద్ధాన్తిగారు స్వయంగా చూచినవి కూడానున్నూ. ఆ ఆశుకవిత్వం సంస్కృతంలో నడిచేదా విన్నాను. దీన్ని గూర్చి యింకా వ్రాస్తేనేకాని తేలదు. యేవాల్మీకమో, లేక భారతమో మంచిరక్తిగా—

"ప్రత్యక్షబాహాటుపాంచాలశయ్యాలఁ
జదివింపనేర్తు నేఁ జదువనేర్తు"

అనే పద్యపాదానికి వుదాహరణంగా చదివి పురాణం చెపుతూవున్న సమయములో "శాస్త్రుల్లుగారూ, ఆపట్లాన్ని పుస్తకం మూసివేయండీ!" అని చెపితే పుస్తకం మూసి తరవాయి స్వకపోలకల్పనగా ఆదేమాదిరిగా నడిపించే మహాశక్తి శ్రీశిష్టుమహాకవిగారివద్ద వుండేదఁట! యింకో విశేషం. అట్టిఆశుధారలో యెవరో తప్పుపడితే దాన్నిపాండిత్య విశేషంచేత సమన్వయించడంకూడా వుండేదంటూ "దధంతం" అన్నస్థలంలో, దధాతీతి, దధంతం అనేమాదిరి సమర్థనాన్నికూడా వుటంకించి శ్రీసిద్ధాన్తిగారు వెల విచ్చేవారు. యీ కృష్ణమూర్తిశాస్త్రుల్లుగారు యిటీవల వయస్సుకొంత శ్రీకాళహస్తి సంస్థానంలో వెళ్ళించినా అంతకుపూర్వం చాలాభాగం,

కోటిరామచంద్రపురం, మురమళ్ళపోలవరం, యీమూఁడుముఠాలకున్నూ సంబంధించిన శ్రీ కాకర్లపూడివారి సంస్థానమందే కాలాన్నిగడిపినట్టు చెప్తారు. శ్రీ కాకర్లపూడిసంస్థానం క్షీణదశకు వచ్చేసూచనలు కొన్ని కనపడడంతోటట్టుగానే యీ మహాకవి గ్రహించి—

శ్లో. త్రిషష్టిక్ష్వంసనార్థాయ ప్రవిష్టం నాయసత్రియమ్
తత్రైకస్తుకృతార్థోఽభూ దన్యోద్వౌతుభవిష్యతః.

అని పేలగా పక అనుష్టుప్‌తో భవిష్యద్విషయాన్ని స్థిరీకరించుకొని కాళహస్తికి చద్బా దవాలీ కట్టినట్టువినికి. అప్పటికప్పుడే పెద్దాపురపు సంస్థానం నామమాత్రావశిష్టమయిందాయె. పిఠాపురం, లేటు శ్రీగంగాధర రామారావుగారు సింహాసనానికింకా రాలేదాయె. అందుచేత స్వదేశం గోదావరిడిస్ట్రిక్టులో యేతులసింగి సెట్టిగారోతప్ప ఆధారం లేకపోవడం చేత అంతకంటె కృష్ణమూర్తిగారికి గత్యంతరం కనపడలేదనుకోవాలి. లక్ష్మణకవిగారికిన్నీ పైని కనపరచిన వ్యత్యాసాలు ఉన్నప్పటికిన్నీ యీయన స్వదేశత్యాగం చేసినట్టు కనపడదు. స్వగ్రామం కుయ్యేరులోనేవుండి కాలక్షేపం జరుపుకొన్నట్టు కనపడుతుంది. ఆ గ్రామంలో లక్ష్మణకవిగారికి—

తే. గీ. ఏడుపందుముల్లోకము లెఱుఁగ లంక
నేలకోలపరక్షేత్రాఽపి మేలుగాదు.

అని రావణదమ్మీయమనే నామాంతరంగల లంకావిజయగ్రంథ పద్యమందున్న యేడుపందుముల భూమి అనఁగా ? యిప్పటిలెక్కనుబట్టి చూస్తే యిరవైయెనిమిది యకరాలు. పుట్టి 1 కి యకరాలు యెనిమిదనిన్నీ పుట్టెకు పందుములు రెండనిన్నీ మావైపు భూమిని లెక్కించుకొనే పద్ధతివి చూచుకోవాలి. ఆ భూమిమీఁద ఆకాలంలోవచ్చే ఫలసాయంతో సమీపంలోవున్న శ్రీ పిఠాపురసంస్థానంవారి వార్షికమేమేనావుంచే దానితోటిన్నీ లక్ష్మణకవిగారు చాలాముప్పిదంగా కాలక్షేపం చేశేవారనుకోవాలి. ఆభూమిని శ్రీ రావుదమ్మన్న (ధర్మారావు) గారనే రాజబంధువులు అన్యాయంగా

ఊహించడం సందర్భంలోనే యీయనకు కొంత చిక్కేర్పడి యెట్ట కేలకు "లంకావిజయం, లేక రావణవమ్మయంగా" అచిక్కు పరిణ మించి, కవికి శాశ్వతమైన యశస్సుఅంటే యెంతయశస్సు? మన్నా రెండో పింగళిసూరన్న గారన్నంతయశస్సు సంపాదించి కవిలోకంలో గణనీయ మైన స్థానాన్ని సంపాదించిపెట్టినట్టు నాస్వానుభవాన్ని బట్టి నేనభిప్రాయ పడతాను. ఆ ధర్మారావుగారు స్వనామధేయానికి కేవలమున్నూ వ్యతిరే కంగా సంచరించకేపోతే యీ లక్ష్మణకవిగారికి యీలాటి ఉన్నతస్థానం కలగడానికి అవకాశంలేకపోయేదేమోనని నా అనుమానం. దానికి తథ్యంగా లక్ష్మణకవిగారిది మహోగ్రింథం యేదిన్నీ వేలుమడిచి పేర్కోదగ్గది కనబడడమేలేదు. యెంతసేపూ శ్లేషమాటలూ చమత్కారంమాటలూ మాత్రం కొన్ని కనపడతాయి. వాట్లనుబట్టి ఉత్తమస్థానం లమ్మంటే కవికి రాదు గదా? అందుచేత శ్రీ లక్ష్మణకవిగారిపేరు శాశ్వతంచేసిన దమ్మన్నగారిని మిక్కిలిగా అభినందించవలసి వచ్చింది. అంతో యింతో నారచనకున్నూ లక్ష్మణకవిగారి రచనకున్నూ విషయములో సామ్యము లేకపోయినా హేతు సామగ్రిలో సామ్యంవుండడంచేత దీన్ని నేనింతగా ప్రస్తాపించినట్టు లోకం భావించకపోదు గనుక యింక విస్తరించేది లేదు.

దమ్మన్నగారు శ్రీ పిఠాపురపువారి తరఫున ఆ ప్రాంతంలోవున్న ఆరెవెట్టం వగయిరా కొన్నిగ్రామాలకు గుత్తదారులుగావచ్చి లక్ష్మణ కవిగారి యేడుపందుముల మాన్యాన్నిన్నీ అపహరించినప్పుడు కవిగారికి జీవనం జరగడం కష్టమని వేరే వ్రాయనక్కఱలేదు. ఆ కారణంచేతే కాఁబోలును లక్ష్మణకవిగారు నాగవల్లి (నాకబలి) పద్యాలకు సంభావనకు వెళ్ళటం తటస్థించిందనుకుంటాను. యీ పద్దెలసంగతి యిప్పుడు పూర్తిగా కాకున్నా చాలాభాగం మఱపు తగిలింది. దీన్నిగుఱించి లోకానికి కొంత జ్ఞాపకంచేస్తాను. మా చిన్నతనంనాఁటికి యింకా యీ పద్యాల ముచ్చట వుండేది. కాకినాఁడ శతావధానానికి పూర్వం నేనూ తిరుపతిశాస్త్రీకూడా రెండుమూఁడు కోమటిపెళ్ళిళ్ళల్లో యీ పద్యం యెత్తడాన్నిగుఱించి గందర

గోళం పడివున్నాము. పళ్ళెం యెత్తేవాఁడు కవిగా వున్నాసరే వుండకపో యినాసరే, అతని పూర్వులలో యెవరేనా ప్రసిద్ధులువుంటే అతఁడు పళ్ళెం యెత్తడానికి అర్హత కలిగి వుండేవాఁడు. తన పూర్వులు చెప్పిందో, యితరులు చెప్పిందో, యేదో వకపద్యంమాత్రం చదివి ఆపళ్లెం యెత్తడం ఆచారం. కొమ్ములుతిరిగిన పండితులు వున్నాసరే, పళ్ళెంయెత్తేఅధికారం మాత్రం ఆ కవి వంశంవాఁడికేకాని యితరులకికాదు. అయితే ఆపళ్లెంలో వుంచిన పావోడపలమో తాముమాత్రమే అనుభవించక ఆయాసభ్యులకు “తిలాపాపం తలో పిడికెడు” గా పంచిపెట్టడం ఆచారం. యెత్తినవాణ్ణి అంతా పీక్కుతినేవారే, అందులో శవవాహకులదాఁకా వుంటారనేది అతిశయోక్తి కాదు. యేకొంచెమో వీళ్ళందరికీ పంచిపెట్టి తాను మిగుల్చుకోవాలి. అది యెంతో దుర్మార్గం అభ్యసించినవాఁడికితప్ప సాధ్యపడదు. యేంచెప్పేది? ఆ రసాభాసు చూచితీరవలసిందే. అంటుచేతే కొంచెం నామరూపాలువచ్చాక యెన్నఁడుగాని ఆ పళ్ళాలజోలికి మేం పోలేదు. కాకినాడావధానానంతరం వకసందర్భంలో చెప్పిన పద్యం పయివిషయాన్ని బోధిస్తుంది.

క. నాకబలి పళ్లెరమ్ముల । నాఁకట జీవించు కుకవు లరుగుదురె? లస
న్నాకనిలయకవి సమకవి । నాకాఽధిపులున్న సభ కనఘ ! శ్రీమేశా !

యీ పళ్ళాలన్నవి కోమట్లపెళ్ళిళ్లకే యేర్పడ్డాయి. వకకవీశ్వరులకుమాత్రమే యివి పుట్టలేదు. భాగవతులకు, తోలుబొమ్మలకు, యింకా చాలావాట్లకు సదరు పళ్ళాలు పుట్టివున్నాయి. పూర్వపురాజులవల్ల ఆయీ పళ్ళాలకు పట్టాలు పుట్టివున్నాయి. కాని క్రమంగా లోకం తెనుఁగుమీఱిన తర్వాత కోమట్లు వీట్లని యివ్వడమే మానివేసినట్టు కనపడుతుంది. సుమారు పాతిక ముప్పైయేళ్ళదాఁకానున్నూ తృణమో దుగ్గాణో యిస్తూ వుండేవారు. యిప్పుడు పూర్తిగా మానేసినట్టే. యీలాటి పూర్వపు మర్యాదలెన్నో యిప్పుడు నష్టేటిలో గలిశాయి. లీగల్‌గాకూడా కోమట్లు

వల్ల యీ పత్యాలు రాబట్టుకొన్నట్టుకూడా మన గవర్నమెంటు ప్రభుత్వం వచ్చాక సమేతు కొన్ని కేసులు ఋజువుచేస్తాయి. అలా రాబట్టుకోవడానికి తగ్గపట్టాలు పూర్వపురాజులు ఆయా విద్యలకు యిచ్చివుండడమే కారణం. గోదావరిడిస్ట్రిక్టు పిఠాపురంయెస్టేటు గొల్లప్రోలుగ్రామంలో దీన్నిగురించి వక కేసు జరిగినట్టు నేను విన్నాను. దాని పర్యవసానం యేం జరిగిందీ జ్ఞాపకంమాత్రం లేదు. పూర్వపు కవిత్వాల మాటాలావుండఁగా మళ్లా ఆయాపెళ్ళిళ్ళల్లో తమతమ తాహతునుబట్టి ఆయాషాహుకార్లు పళ్లెం యివ్వక పేచీ పెట్టేటట్టయితే తాత్కాలికంగా వచ్చిన కవులలో కొందఱు చెప్పినపద్యాలు నాచిన్నతనంలో వినివున్నాను. కాని అవియిప్పుడు జ్ఞప్తిలో లేక వుదాహరించలేకపోయాను. ఆపద్యాలు బొత్తిగా అవకతవకగా వుండడంచూస్తే పరమాసహ్యంగా వుంటుంది. వక సీసపద్యంలో భాగంమాత్రం జ్ఞాపకంవుంది. ఆపద్యం ప్రతిచరణంలోనూ రెండుయేడ్పులు వస్తూవుంటాయి. "ముసలాఁడు వరుఁడంచు పసికూన తానేడ్వ, కన్నెలేతఁదని యతగాఁడు నేడ్వ.........చేసెరా పెళ్ళి మనసుబ్బిసెట్టిజల్లి" నేనుదాహరించిన చరణాలు సరియైనవి కాకపోవచ్చును కూడాను. యీ అల్లరికిభయపడి అయితే యేమి, స్వతహావుండే బ్రాహ్మణగౌరవమో కవితాగౌరవమో ప్రేరేపించడంచేతనైతే యేమి తప్పకుండా నాగవల్లినాఁడు వైశ్యులు శక్త్యనుసారం కవీశ్వరులగౌరవం పైవిధంగా ప్రకటించేవారు. అలా వారు చూపినందుకు ఆ సొమ్ము అంతో యింతో కవిత్వం చెప్పేవాళ్లు పుచ్చుకొంటే బాగా వుండేది. కాని అలా పుచ్చుకోవడం నేను చూడలేదు. అయిపుట్టినవాళ్ళందరికీ పంచిపెట్టవలసి వచ్చేది. ఆలా పంచిపెట్టకపోతే పళ్ళెంయెత్తిన ఆసామీకి "ఖంధంతాం" జరగడం కూడా విధాయకమే. యిట్టి రసాభాసు సంభావనలో మన పిండిప్రోలి కవివరేణ్యుఁడు వెళ్లడం మళ్లా పేరుసోమయాజులుగారు చెప్పఁగా వినివున్నాను. ఆయా సమయాలలో మన కవిగారికిన్నీ యితరకవులకున్నూ జరిగిన వాదోపవాదాలు, సమస్యాప్రదానాలు, యివికూడా ఆయనే చెప్పేవారు.

(1) "సంస్కృతవాసనారచన చాలదుగా భువినెంతవారికిన్"
(2) "ఇఁకఁ బదివేలొసంగెదను నిందుకుఁ బద్యముచెప్పు సత్కవీ"
లోనైనసమస్యలు వేసవప్పుడు విన్నవే. యీ రెండున్నూ ప్రాసవిషయకమైన కష్టంతో చేరినవి. రెండోసమస్యకు మల్లాకవి చెప్పినజవాబున్నూ జ్ఞాపకం వుంది.

"ఇఁకఁ బదిలక్ష లిచ్చినను నిందుకుఁ బద్యములేదు భూవరా!" లేకపోవడానికి కారణం ఇఁక అనే దానిలోవున్న అర్ధానుస్వారమే. నాలుగు చరణాలున్నూ అట్టిఅర్ధానుస్వారముకలవిగా వుండాలని సమస్యాప్రదాతల సంప్రదాయం, నన్నయ్యనాటికి యింకా యీ నియమం సడలలేదు. తిక్కన్నమహాశయుఁడు యీ దిక్కుమాలిన చేదస్త్రాన్ని అసహ్యించుకొని "నగములు" అనిమెత్తుకొని "ఎసఁగుఁ బూర్వస్థితిన బ్రిదుకు సమకూరంగన్" అని పద్యపూర్తిచేసి కవులకు పరమోపకారం చేసివున్నాఁడు. తెలుఁగుబాసకు యతిప్రాసలు సహజాలంకరణా లన్నందుకు తిక్కన్నగారు వ్యతిరేకించేవారుకారు. యెన్నఁడున్నూ యెక్కడా యిటీవలికాలంలో శ్రవణంలో ప్రచారంలేని అర్ధానుస్వారాన్నికూడా ప్రాసలో పెట్టకపోతే యేం పాపం చుట్టుకొంటుందని ఆలోచించి ఆకాస్తమాటా దక్కించుకొన్నాఁడు మహానుభావుడు. నన్నయ్యగారే దక్కించుకొన్నారని వకరు చెప్పినట్టున్నూ వుదాహరణ కూడా కనపడ్డట్టున్నూ తీరా యెవరికో ఆ వుదాహరణ చూపడానికి భారతం వెదికేటప్పటికి మాయమైనట్టున్నూ నాకు జ్ఞాపకం వుంది. యెవరేనా పరిశీలించి నన్నయ్యగారికే యీ సుకృతాన్ని అంటగడితే మరీసంతోషం. యిది విషయాంతరం. ప్రస్తుతం నాకబలి పద్యాలకు లక్ష్మణకవిగారు వెళ్ళేవారేఅనేది. యీ వెళ్లడంలో యింకోవిశేషం. పెండ్లిజరిగిన వత్సరానికో రెండువత్సరాలకో వెళ్ళికూడా మామోలు వసూలుచేసేవారఁట. "అయ్యా, మీరు సకాలంలో రాలే" దని ఆగృహస్థులు అడిగితే మనకవిగారు నేనురాకుండా నీయింట పెళ్ళి జరగడానికి అవకాశం లేనేలేదు. వచ్చేవున్నాను. నీవు తెలుసుకోలేకపో

యావు, పిండిలేకుండా పెళ్ళి యేలాజరిగిందనిన్నీ, ప్రోలు (యిది నాకబలి నాఁటి వాకానాక తంతు) లేనిదే పెళ్ళియేలా జరిగిందనిన్నీ చమత్కరించే వారఁట! యీలాటి చమత్కారమ్మాటలు పిండిప్రోలికవిగారివి చాలా వున్నాయి. వీరిపౌత్రివ్యర్థి శిష్టు కృష్ణమూర్తిగారు ఇంతకంటే ఎంతో పెద్ద పండితులున్నూ పెద్ద కవులున్నూ పెద్ద గాయకులున్నూ అయితే అవునుగాక. సమయస్ఫూర్తి మాటలలో వీరికి తీసిపోతా రనే అనేకుల తాత్పర్యం. ఎప్పుడో ఒకప్పుడు కృష్ణమూర్తిగారి సర్వకామదాపరిణయంలో యేవో కొంటెతనపు ఆక్షేపణలు లక్ష్మణకవిగారు చేస్తూవుండఁగా మధ్య కలగజేసుకొని జగదేక పండితులు యింద్రగంటి విశ్వపతిశాస్త్రుల్లుగారు యేవో సబోకి మాటలు చెప్పఁబోతూవుండఁగా లక్ష్మణకవి "మామా! నీవు వీ తీస్తే శ్వపతి విన్నీ, శ్వా, తీస్తే విపతివిన్నీ," కనక వూరుకోమన్నాఁడఁట! యీ సంగతి కాజులూటి గ్రామంలో జరిగినట్టు విన్నాను. వక పర్యాయం పిఠాపుర సంస్థానంలో తమకు రాఁదగ్గ వార్షికమో యేదో యివ్వడంలో, యేదో తగ్గించడమో యేమో జరిగిందనిన్నీ, అప్పుడు దివానుగా శ్రీ దిగవల్లి శివరావుగారనే వారుండేవారనిన్నీ, మన కవిగారు ఆ శివరావుగారున్న కచ్చేరీ సావడిలోకివెళ్ళి మా దిగవల్లి శివరావెక్కడ నాయనా! అని రెండు మూడుఁసార్లు రెట్టించే టప్పటికి రసజ్ఞులైన శివరావుగారు ఆమాట వల్ల యేదో మునిఁగి నట్లుందని గ్రహించి యేమిటి! తాతగారూ! ఇదుగో నేనే శివరావునని సవినయంగా చెప్పి ఆ లోటుపాట్లు సవరణచేసి కవిగారి ఆశీర్వచనానికి పాత్రులైనట్లు పెద్దలు చెప్పఁగావిన్నాను. యేదో వివాహసందర్భంలో సంస్థానంవారిని దర్శించేటప్పటికి వారు సర్వోచ్చగా సమ్మానించి పంపడం జరిగిందనిన్నీ జరిగాకకూడా మళ్లా కవిగారు సంస్థానంలోకి దయచేసేటప్పటికి రాజుగారో, లేక దివాన్‌జీగారో "యేం తాతగారు? మళ్లా దయచేశా" రని ప్రశ్నించేటప్పటికి, చాలా వృద్ధులుగా వున్న మన కవిగారు "మరేమీ లేదు. పెళ్ళివారికిన్నీ మాకున్నూ అన్ని విషయాలున్నూ మీ దయవల్ల అనుకూలంగానే కుదిరాయికాని పట్టుకో

కెట్టమని వారంటారు, పట్టుకో కెట్టమని మేమంటూవున్నాము. యీ తగాదా తీరక మళ్లావచ్చా" ననేటప్పటికి పట్టుచీరకూడా కొంతధనం మళ్లా యిచ్చిపంపినట్టు చెప్పఁకుంటారు. యిఁకా మెన్నోవున్నాయి. యీలాటి ప్రశంసలు యితర కవులు యెవరేనా చమత్కరించినవికూడా యీలక్ష్మణ కవిగారికే అంటఁగట్టడమున్నూ వుంది. తెనాలి రామలింగం తరువాత మళ్లా యీలాటి చరిత్ర లక్ష్మణకవిగారికి తప్ప యితరకవులకు లేదు.

---

## కులకట్టుబాట్లు

( 29—9—37 సం॥న ఆంధ్రవీక్లీనుండి )

వీట్లని గురించి కొంచెం ముచ్చటించుకుందాం. మన భరతఖండంలో తప్ప యెక్కడా అంతగా కులకట్టుఁబాట్లు లేనే లేవని పాశ్చాత్య సంప్రదాయ వాసన కల మనవాళ్లు కొందఱు చెప్పఁగా విని "కాఁబోసు" ననుకొనేవాణ్ణి. యీమధ్య చక్రవర్తిగారి వివాహంతో ఆ సంశయం తీరింది. "యింటింటా వుంది యింకో పొర్రియ్యి. మాయింటా వుంది మఱోపొర్రియ్యి." అన్న సామెత జ్ఞాపకం వచ్చింది. ప్రతిదేశానికీ ప్రతీ కులానికీ యేదో ఓ విధమైన కట్టుఁబాటు వున్నట్టు స్పష్టపడింది. దానితో తేలిన విశేషమేమిటంటే? లేనిపోని కట్టుఁబాటు లున్నాయనే మిషతో యేమతస్థుడుగాని వాట్ల బాధ తప్పించుకోవడానికి యింకోమతం లోకిఁగాని కులంలోకిఁగాని చేరడం శుద్ధపొరపాటని తేలింది. మన హిందూదేశంలో ఆబ్రాహ్మణ చండాల పర్యంతమున్నూ చక్కని కట్టుఁబాట్లు వుండేవి. వాట్లను పరస్పర సాహాయ్యముతో చెడకుండా సంఘమే చాలా వఱకు కాపాడుకొనేది. సంఘానికి సాధ్యపడని విషయమేదేనా వుంటే ప్రభుత్వం కలగఁజేసుకొనేది. అందుచేత హెచ్చుకులస్థుల ఆచా

రాలు గాని, లొచ్చుకులస్థుల ఆచారాలు కాని చెక్కుచెదరకుండా నిన్న మొన్నటివాఁకా యెట్లో జీవవంతాలుగా వుంటూ వచ్చాయి.

యిప్పటికి సుమారు 60 యేళ్ళకు పూర్వం ఫ్రెంచి యిలాకా యానాం గ్రామంలో వక దొమ్మి జరిగింది. అది కులకట్టుఁబాట్లకు సంబంధించిందే. పల్లెజాతిలో కొన్ని భేదాలు, మరకాళ్లు వగయిరాలు వున్నాయి. యీతెగ జనం యానాం, నీలపల్లి, తాళ్ళరేవు, కోరంగి యింకా తీర్థాలమొండి, పండిపోరు వగయిరా సముద్రతీరాలలో యిప్పటికీ విశేషించి ప్రాయశః స్వకులవృత్తులతో జీవిస్తూ వుంది. పెళ్ళిళ్లలో ఫలానావారు పల్లకీ లెక్కే ఆచారం కలిగి వున్నారనీన్నీ ఫలానావారు కలిగి లేరనిన్నీ పూర్వపురాజుల శాసనం వున్నట్టు వ్రాఁతమూలకాలు ప్రచురింపఁబడ్డట్టు యెప్పుడో చదివినట్టు జ్ఞాపకం. యానాం చుట్టుపట్ల గ్రామాల్లోవున్న పల్లీలలో ఆకాలంలో తెలుఁగు వాడల వర్తకం అప్పటి కింకా పడిపోలేదు గనక కొందఱు ఐశ్వర్యవంతు లుండేవాళ్లు. వాళ్లల్లో యేదో వివాహం వచ్చింది. ఆ వివాహంలో పల్లకీతో వూరేఁగించాలని పట్టుదల బయలుదేఱింది. కాని కాపులు వ్యతిరేకిస్తారని పల్లీలకు పూర్తిగా తెలుసును. దాన్నిబట్టి ఫ్రెంచిగవర్నమెంటు సహాయాన్ని కోరుకున్నారు. వారు సహాయం చేశారు. యెక్కడెక్కడి నుంచో వేలకొలఁదిగా పల్లీలు వచ్చారు. గ్రామమంతా వూరేఁగింపు జరిగింది. పూర్వాచార పరాయణులైన మానాటి కాపులకు ఆవూరేగింపు మహా అవమానకరంగా కనపడింది. ఆ కాలంకేసి వక్కమాటు భావన చేసి చూడఁగలవారికి తప్ప ఆవూరేఁగింపు ఆకాపదనానికి యెంత ప్రాణసంకటంగా వుంటుందో తెలుసుకోవడానికి వీలుపడదు. అందులో కాపదనం అంతా వకయెత్తు యానాం కాపదనం వకయెత్తు. ఆవూళ్ళో గవర్నమెంటు కూడా కాపదనం వెలవుప్రకారం వెళ్ళవలసిందే. యిందులో అతిశయోక్తి లేదు, లేనేలేదు. మనం యిప్పుడిప్పుడు ప్రజారాజ్యంలోకి వస్తూవున్నాం గాని ఫ్రెంచిదేశం ప్రజారాజ్యంలోకి వచ్చి యెన్నో యేళ్లయింది. ఆ ప్రభుత్వాన్ని "రిప

శిక్ష" ప్రభుత్వమంటారు? యానాంలో నామరూపాలుగల కాపు కుటుంబాలు మర్యాదతో ప్రవర్తిస్తూ వున్నవి చాలా వున్నాయి. ఆ కుటుంబాల వారిలో బహుమంది ఉద్యోగులు కూడాను. వారందరికిన్నీ పూర్వాచారానికి కేవలం విరుద్ధంగా జరిగిన యీ వూరేఁగింపు చాలా తలవంపులుగా వుందని వేరే వ్రాయనక్కఱ లేదు. అయితే యేం చేస్తారు? పాపం! వేలకొద్దిగా పల్లెలు వచ్చి పట్నమంతా భూమి యీనినట్లు కనపడుతూ వుంది. అట్టి స్థితిలో ఆ వూళ్లో వుండే కాపదనం యేంచేయగలుగుతుంది? చేతనైన పనికనక ఆ వూరేఁగింపులో పాల్గొనడంగాని ఆ సమయంలో తలుపు తీసి చూడడంగాని చేయక యెవళ్లింట్లో వాళ్లు సిగ్గుతో మగ్గడం తప్ప యింకో దౌర్జన్యం లేశమున్నా తలపెట్టకుండా తమ మాన మర్యాదలను యానాం కాపదనం కాపాడుకోఁ గలిగింది. ఆ స్థితిలో వూరేఁగింపు చక్కఁగా జరిగింది. గవర్నమెంటుద్యోగులు యెవరిళ్లకు వారు వెళ్లారు, పోలీసు సిబ్బంది గూడా నిష్క్రమించింది. ఆ స్థితిలో పెళ్లివారు కూడా గతానికి సంతోషిస్తూ విరమిస్తే బాగావుండేది కాని ఆ విజయోత్సాహం అంతతో ఆఁగనిచ్చింది కాదు. ప్రపంచం పుట్టింది మొదలు ఆరోజుదాఁకా ఆజాతిలో యెవ్వరున్నూ యెక్కి యెఱుఁగని పల్లకీ అంతతో ఆ సంఘాన్ని ఆఁగనిచ్చింది కాదు. "అమ్మనాఁ డెఱుఁగనే వుయ్యాలా? అబ్బనాఁ డెఱుఁగనే వుయ్యాలా!" అంటు పిల్లలు పాడుతూ వుండడం అంతా యెఱిఁగిందే. ఆ వుయ్యాలా స్థానాన్ని యీ పల్లకీ ఆక్రమించింది. దానికి తోడు స్వకులోచితమైన పానం మఱింత వుత్సాహం కల్పించింది. దానితో ఆ సమీపంలో వున్న కనగాలపేఁట గ్రామం కూడా వూరేఁగి కాపదనానికి మఱింత తలవంపు కలిగిద్దామనే కుతూహలం కలిగింది. విరమించుకొన్న వూరేఁగింపు మళ్లా ప్రారంభ మయింది. కనగాలపేఁట దాదాపుకు వూరేఁగింపు చేరింది. వూరివెలపట సామాన్యమైన వకనాఁచుతో వుండే వెడల్పాటి కాలవ వకటి వుంది. దానివద్ద వూరేఁగింపు వుండఁగా ఆగ్రామస్థులు అంతకు పూర్వమే

ఒక వుపాయం చేశారు. నార తీసేసిన జనపకట్టె ఆసమీపంలోనే పడివుం డఁగా దాన్ని కొన్ని భాగాలు చేసి అక్కడక్కడ పేర్చి ఆ పోగుల మీఁద తెల్లబట్టలు కొన్ని కప్పి యింత సున్నమూ పసుపూ కలిపిన నీళ్లు చల్లేటప్ప టికి ఆ పోగులు బలవంతపు దెబ్బలచే మూర్ఛ వచ్చినవాళ్ళో లేక చచ్చి పడి పోయిన వాళ్ళో అనే భ్రాంతిని కలిగించడం చేత యీ వూరేఁగింపులో వున్న మరికాళ్ళు ఆ పడిపోయిన మరకాళ్లు తమవాళ్లే నని భయపడి ఆ సమీపంలో దక్షిణదిక్కుగా వున్న గౌతమీ నదిలోకి యీఁతకుఁ బడి బ్రతుకు జీవుఁడా ? అని పారిపోవడాని కారంభించారు. వీళ్లకి యీలాటి భ్రాంతి కలగడానికి కారణం ఆసమయం పొద్దుగుంకే సమయం కావడం కూడాను. యెవరో ఒకరిద్దఱు పల్లీలలో కాపులచేత కొట్టఁబడడం కూడా తటస్థించింది. పానంవల్ల నిజం తెలుసుకొనే శక్తి అంతరించింది. పల్లీలు యీమాదిరిగా విఱిగి పారిపోవడంతో టట్టుగానే యే స్వల్పమో వున్న పెళ్ళివారిని కనగాలపేఁట కాపులు గట్టిగా దంచారు. పెళ్ళికొడుకూ పెళ్ళికూఁతురూ వున్న పల్లకీ నెత్తుకొని పల్లకీవాళ్ళు యానాం గ్రామంలోకి పాఱిపోయారు. శివాలయ ప్రాంతంలో ఆ పల్లకీని పట్టుకొని యానాం కాపులు విఱిచి ముక్కలుచేసి అక్కడవున్న గోదావరి తూములో కుక్కారు. భగవదనుగ్రహం వల్లో, కాపుల యోగ్యతవల్లో పెళ్ళికూఁతు రున్నూ పెళ్ళికొడుకున్నూ సురక్షితంగా యిల్లు చేరఁగలిగారు. యింతటితో నేనా కథ ముగిస్తే కొంత బాగుండేది. కాని యీ భారతానికి ఆ భారతానికి సౌప్తిక పర్వపు గాథలాగ మఱో కథ జతపడింది. దాన్ని కూడా కొంచెం వివరిస్తాను.

పల్లకీ విఱగగొట్టిన పిమ్మట కాపదనానికి శివ మెక్కువయింది. పల్లెగూడెంలో ప్రవేశించి దోపిడీ కారంభించారు. కొందఱు భయపడి వెండిబంగారాలు నూతుల్లో దాఁచుకోవడాని కారంభించారు. ఈ అల్లరిని ఆపడానికి వూళ్ళోవుండే స్వల్ప సిబ్బందీ చాలా చాలదు. చాలినప్పటికీ ఆ సిబ్బందీ జనమంతా కాపజనమే కనక వూళ్ళోవుండే కాపదనాన్ని వ్యతి

శించడానికి వీలున్నూ లేదు. ఆ సమయంలో యానాంలో వుండే గవర్నరు స్వయంగా వచ్చి ప్రధాన నాయకునితో నయానా భయానా చెప్పి వారిద్దామని ప్రయత్నించడ మైతే జరిగిందఁట? కాని ఆనాయకుఁడు యోగ్యుఁ డయినందు కల్లా ఫలితం ఆ యూరోపియన్ ఆఫీసరుకు మఱో త్రోవ లేకపోవడమే అని చెప్పఁగా విన్నాను. ఆ సమయం అలాంటిది. అది స్వయంగా చూచి తీరవలసిందే అంటారు. అప్పుడు ఆ గ్రామంలో పరిమితిగా వున్న యూరోపియన్ ఆఫీసర్లకు భయంవేసి పుదుచ్చేరికి తంతివార్త యిచ్చుకొన్నట్టున్నూ గ్రామాన్ని భస్మీపటలం చేసి రావలసిందిగా ఆర్డరిచ్చి వక పటాలాన్ని పంపినట్టున్నూ ఆ పటాలం వచ్చి చేరేలోపున ఆఫీసులు వగయిరాల సంరక్షణం నిమిత్తం బ్రిటీషువారిని కోరితే అప్పుడు చామర్లకోటలో వుండే పటాలం బాపతు కొందఱినైతే పంపటం జరిగిందఁట కాని గ్రామం తూర్పుభాగాన్ని వున్న గోదావరి దాఁటి రాకుండా ఆ సమీపంలోఁ గాని కొంచెం దూరంలోఁ గాని వున్న పడవలన్నిటినీ బొత్తలు గొట్టి ముంచివేయడం చేత త్వరలో గ్రామం ప్రవేశించడానికి అవకాశం కలఁగలేదనిన్నీ తరవాత యేలాగో బ్రిటీషువారు పంపిన పటాలం గ్రామం ప్రవేశించి తల గలవారి నందఱినీన్నీ అరెస్టు చేసి గవర్నమెంటుకు వప్పఁజెప్పడం జరిగినట్టున్నూ ఆ కారణంచేత అసలు పుదుచ్చేరీ నుంచి బయలుదేరిన పటాలం రాకుండా మధ్యతోవ నుంచే వెనక్కి తిరిగి వెళ్ళిపోయినట్టున్నూ చెప్పఁగా విన్నాను. అరెస్టు చేయఁబడ్డ పెద్దతలకాయ లందఱికిన్నీ ఆఱేసీ, యేడేసీ సంవత్సరాలు యీ విధంగా శిక్షలు విధింపఁ బడ్డాయి. దోపిడీ జరగడంవల్ల యీ శిక్షలు పడ్డాయఁట కాని పల్లీల పల్లకీ విఱగఁగొట్టడంవల్ల జరగనేలేదని కొందఱు చెప్పఁగా విన్నాను. అంతమంది పల్లీలని కొలఁది మంది కాపులు వోడించి పాఱిపోఁగొట్టినందుకు దోపిడీ వ్యాపారమే లేకపోతే గవర్నమెంటు కొంత సంతోషించి పారితోషికాలు కూడా యిచ్చేవా రంటూ తాత్కాలికులు అంతా కళ్ళారా చూచినవాళ్లు చెపుతూ వుంటే వినేవాణ్ణి. యీ శిక్షలు అనుభ

వించిన వారి సందడిని శిక్షలోనుంచి విడుదలై వచ్చి మళ్లా ఉద్యోగాలూ సద్యోగాలూ చేస్తూవుండఁగా నా బాల్యంలో నేను చూచే వున్నాను. కాని యీ మానాటి గత్తరనాఁటికి మాత్రం నేను పుట్టి వున్నానేమో కాని ఆ గ్రామవాసిని మాత్రంకాను. బహుశః అప్పటికి నేను పుట్టనేలేదని కూడా తోస్తుంది. దీన్ని బట్టి చూస్తే యీ గత్తర జరిగి యిప్పటికి సుమారు యెనభై యేళ్లకు తక్కువ కాదనుకుంటాను. మా చిన్నతనంలో అప్పటికి 20 యేళ్లయి జరిగినట్టు చెప్పేవారు. ఆ చెప్పేనాఁటికి నాకు 10–12 యేళ్లవయస్సు. ఖపతు. కాలనిర్ణయానికేమి. యేదో గుడ్డికి బాటెఁ దెబ్బతగ్గుగా వుంటుంది.

మనకి ముఖ్యం పయి సందర్భంవల్ల తెలుసుకోఁదగ్గ విషయం బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యానికి పూర్వాచారాలు పాటించడం విషయంలో యెంత పట్టుదల వుండేదో తేటతెల్లమవుతుంది. “నీకు జోడువాగడా లెవరిచ్చారంటే వాకరిచ్చేదేమిటి? నా ఆముదపు చేనే యిచ్చిం” దనే యీ కాలానికీ ఆకాలానికీ వుండే తారతమ్యం యెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ప్రజా పరిపాలకులైన రాజులకన్నా ఆకాలంలో ప్రజలే ఆ యీ ఆచారాలను కాపాడుతూ వుండేవారనుకుంటాను. మన ఆచార వ్యవహారాలతో లేశమూ సంబంధం లేని పరిపాలనలో వున్న మనం, మన ఆచార వ్యవహారాలకోసం మొత్తుకోవడం సర్వథా “అరణ్య రోదనం” గా కనపడుతుంది. పోనీ ప్రభుత్వం మన ఆచారాదుల జోలికి స్వతహాగా రాదనే అనుకుందాం, మనలో కొందఱు “మీరు జోక్యం లిగించు కొంటేనే గాని వీలు లే” దంటూ మొఱ్ఱ పెట్టుకోవడమాయె. అలాట ప్పుడు కలిగించుకోకుండా యేలా వుంటుంది పాపం?

చచ్చి స్వర్గాన్నే వున్నాఁడో మఱెక్కడున్నాఁడో? మహానుభావుఁడు ఆ పానుగల్లు! ఆయన దేవాలయాలకు యెంత వుపకారం చేయాలో అంతా చేశాఁడు కదా? యేదో “కంట్రిబ్యూషను” అంటూ వకటి విధిం

దారు. అవి యిమ్ముకోలేక పుస్తెలూపూసలూ అమ్ముకొంటూ వున్న అర్చక కుటుంబా లెన్నో వున్నాయి. ట్రస్టీలంటూ కొందఱు బయలుదేఱారు. వారిలో యెందఱో స్వార్థపరు లున్నారు. యెప్పుడో అర్చకుఁడు తనకు అడిగితే మంచిచ్చాఁడుకాఁడనో? మఱొకటో వ్యక్తిగతంగా వుండే ద్వేషాన్ని పురస్కరించుకొని రెండువందలు వచ్చే దేవాలయాన్ని పన్నెండువందలు వస్తాయని రిపోర్టు చేసే ట్రస్టీలు కొందఱు యేలాగయితే యేమి పది పన్నెండేళ్లనుంచి అర్చకులు పడుతూవున్న బాధ ఆ భగవంతుడికే యెఱుక. అయితే అయిందిగాని కొంతమంది అర్చకుల దుష్ప్రవర్తనాన్ని పట్టి చూస్తే పానుగల్లుచేసిన ప్రాయశ్చిత్తం కూడా యుక్తంగానే కనపడుతుంది, గాని యేదుర్మార్గులో కొంద ఱున్నారని అందఱి కొంపలకూ చిచ్చు పెట్టడం మాత్రం యేం న్యాయం? దాని కూఁడా యేదో వ్యక్తిగతమైన కారణం వుందంటూ కొంద ఱనడం. యేమయితే యేమీ? దేవాలయాలకూ మఠాలకూ యింకా కొన్ని ధర్మ సంస్థలకూ మొదట యేవుద్దేశంతో ద్రవ్యదాతలు భూములు యిచ్చివున్నారో ఆ వుద్దేశం పూర్తిగా మట్టిలో కలిసిపోయింది. పైపెచ్చు యిప్పుడెవళ్ళైనా తప్ప గడించినవాళ్ళు యేదేనా ధర్మం చేయా లనుకున్నా పూర్వపు ధర్మాలన్నీ పదటఁ గలిసిపోవడం కళ్ళారా చూచికూడా చేయడం యేలా తటస్థిస్తుంది? అందుచేత యీబోర్డు యెంత త్వరలో అంతరిస్తే అంత లోకానికి మేలు కలుగుతుం దేమోనని నే ననుకొంటాను.

అధికారం పిశాచమంటూ చెప్పడం కలదు. ఒక్కొక్కరికి వచ్చిన అధికార ఫలితం కేవలమూ వ్యతిరేకంగా ఫలిస్తుంది. అది ఆ అధికారితో పోదు. యేదో 'కాదన్నవాఁడు కరణం' అన్నట్టు కలంపోటు పొడవడ మంటూ తటస్థిస్తే ఆ పోటు పోటు తరతరాల దాఁకా పీడించి తీరుతుంది. యీ పోటువల్ల పూర్తిగా బాధపడుతూ వున్నవాళ్ళు నోరూ వాయీ లేని అర్చకులు. పోనీ వేయి రూపాయలకు మించని అర్చకులను మినహాయించడమేనా జరిగితే కొంత సాధుబాధ తగ్గేదేమో? అదేనా జరిగితే

కాంగ్రెస్సు మంత్రుల వల్ల యీ అర్చక లోకానికి యేమాత్రం వుపకార మేనా జరుగుతుం దేమో? యిది విషయాంతరం.

పూర్వాచారాలకు సొద్దు పెట్టడం వల్లనే ఆ యీ వ్యవహారాలన్నీ పొడచూపుతూ వున్నాయి. కొన్ని పూర్వాచారాలు యీ కాలంలో సాగని మాట సత్యం. శ్రీ బులుసు పాపయ్యశాస్త్రుల్లుగారు రైలే యెక్కేది లేదని పెట్టుకున్నారు, సాగించుకున్నారు. శ్రీ చెలికాని గోపాలరాయనింగారు శ్రీ వేంకటగిరి లేటు పెద్దమహారాజా వారి అల్లుఁడు లండను వెళ్ళి వచ్చిన వారి సహపంక్తిని భోంచేసేది లేదని పెట్టు కొన్నారు; సాగించుకున్నారు. అలాటి అసిధారా వ్రతాలు యీకాలంలో పెట్టుకుంటే సాగడం కష్టం. యేపల్లెటూళ్ళనో యేతోఁటలోనో మకాం పెట్టుకొని వానప్రస్థాశ్రమంలో జీవితాన్ని గడుపుకొనే వారికి సాఁగితే సాగుతాయేమో? అలాటివా రెవరో వకరు వుంటే వుండనియ్యండి. వారిపేరు చెప్పుకొని మనం గర్విస్తే గర్వించవచ్చును. అంతేనే కాని మనం అందఱమూ అలా జరుపుకోవడా నికి తగ్గ అవకాశం లేదు. నీళ్ళే వున్నాయనుకోండి, పంపుల్లోనుంచి కదా చాలా వఱకు పట్నాల్లో సప్లయికావడం. ఆ నీళ్ళు అక్కడ యేవో "ఫిల్టర్" చేసి కాని రావు. అవి దేవతార్చనాదులకు వుపయోగించుకో వచ్చునా? అంటే? ఛాందసులు సందేహించకపోరు. ఇంకా యీలాటి వెన్నో వున్నాయి. దేశ కాల పాత్రలను అనుసరించి పోవాలి. రైలంటూ యెక్కితే నానా కశ్మలమున్నూ చెప్పేదేమిటి? వుద్యోగాల మాట చెప్పనే అక్కఱలేదు. అందులో స్కూలు మాష్టర్లకూ యినస్పెక్టర్లకూ సంపర్క దోషం యేలా తప్పించు కోవడం? ప్రతిరోజూ యజ్ఞోపవీతాలు మార్చు కోవడం మాత్రం యేలాగ? అన్నింటికంటే విద్యాభ్యాస విషయంలో పూర్వాచారుల పిల్లలకి చిక్కుగావుంది. అక్షరాభ్యాసం యే తండ్రో తాతో చేస్తాఁ డనుకోండి, మఱునాఁటి నుంచి బళ్ళోకి పంపాలా? వద్దా? పంపితే అక్కడ వుపాధ్యాయు లెవరు?

"చాకలి యొక్కండు సాతాని యొక్కండు
భట్రాజొకండు బావం దొకండు."

యిది యిప్పటికి నిర్విష్టమైన స్థితి. యింక కొన్నాళ్ళకు యీస్థితిన్ని నిలిపేటట్టులేదు. యీ వుపాధ్యాయులకు తిన్నగా వుచ్చారణ జ్ఞానం వున్నట్టులేదు. వీరి వుపదేశం కుఱ్ఱలను బాగుచేసే దేమిటి? నేఁటి రేపటి హరిజనోపాధ్యాయులు పల్లెటూళ్ళ బళ్ళను పూర్తిగా ఆక్రమిస్తారు. వారిలో యే అంబేద్కరుగారో మహావిద్వాంసులైతే కావచ్చుఁగాక! అందఱున్నూ అలాటి ప్రజ్ఞాశాలులే యెక్కడ తటస్థిస్తారు? కాఁబట్టి తక్కిన డిపార్టుమెంటులమాట యేలావున్నా యెడ్యుకేషను డిపార్టుమెంటు మట్టుకేనా అంతా కాకపోతే మానిరి, శాస్త్ర వాచకం కుదిరేదాఁకా చెప్పే మాష్టర్లేనా శాస్త్ర నోరు పరిశుభ్రంగా వుండే బ్రాహ్మలుగా వుండేటట్టు విద్యాశాఖవా రనుగ్రహిస్తే కొంత బాగుంటుందేమో? అనుకుంటాను. దీనిలో విస్తారం జీతవాతా లుండవు గనుక నాన్‌బ్రాహ్మిన్సు తెగవారు కూడా యీ శాస్త్రకూ ఆమోదిస్తా రనుకుంటాను. "కూకుంటాఁడు, విల్చుకుంటాఁడు" అనే రకం మాటలతో విద్యాబోధ చేయడంవల్ల పిల్లల స్థితి బొత్తిగా అవక తవకగా వుంటుందేమో? అని నే నింతగా వ్రాయడంగాని మరో హేతువు గాదు.

చదువుకోవడానికి సర్వ సామాన్యంగా అందఱికీ హక్కు వుంటే వుండనియ్యండి గాని చెప్పడానికి అందఱికీ వుండదేమో? అని నాచేదస్తం. ఆ చేదస్తమేనా? మొట్ట మొదట శాస్త్ర సంస్కృత పదోచ్చారణ కుదిరే దాఁకానే. తరవాతనో? యేమైనా చిక్కులేదు. యీవిషయం యీలా వ్రాసినందుక్కు యెవరో అక్కఱలేదు, నాకు వుండుకున్న నాన్‌బ్రాహ్మిను శిష్యులే కొంత యేవగించుకుంటా రనుకుంటాను. నేను నాన్‌బ్రాహ్మిన్సు శిష్యుల నేవిధంగా ప్రేమిస్తానో వాళ్ళెఱిఁగిందే. వేద శాస్త్రాలు తప్ప అన్నీ బ్రాహ్మలతోపాటుగా నాన్‌బ్రాహ్మిన్సుకు కూడా చెప్పవచ్చునని నేను వట్టి పొడిమాటలతో మాత్రమే కాక కొంత గ్రంథ ప్రామాణ్యంకూడా వుందని నమ్మేవాణ్ణి. అట్టి నాకు యీ అక్షరాభ్యాస విషయంలో యీ చేదస్తం యింకా వదిలింది కాదు. యీ చేదస్తమేనా సంస్కృతాంధ్రా

లకు మాత్రమే నున్నదీ? లేకైన యింగ్లీషు పరాయివాళ్లకు యెవరేనా వుపదేష్టలుగా వుండవచ్చును. యిది జాత్యభిమానాన్ని పురస్కరించుకొన్న వాళ్లంటూ అంటారుగాక! అందుకు నే నంగీకరిస్తాను.

కొందఱు నాన్‌బ్రామిన్సు స్వంత పౌరోహిత్యంవల్ల వివాహాదులు నెఱవేర్చుకొంటున్నారని విని నేను మనస్సా సంతోషిస్తూ వుంటాను. యేమంటే? బ్రాహ్మణ పురోహితులందఱూ కాదుగాని కొందఱు పురోహితులు చాలా దురన్యాయంగా వర్తించడం చూస్తే యీ అయోగ్యులకు కాళ్ళు కడిగి ఆ నీళ్ళు శిరస్సుమీఁద ధరించడం కంటే మంచో చెడ్డో స్వకులస్థులవల్లనే ఆ పురోహిత కృత్యం నెఱవేర్చుకోవడమే మిక్కిలీ యుక్తమని నాకున్నూ తోఁచింది.

మా ప్రాంతంలో వక పురోహితుఁడు నాన్‌బ్రామిన్సుకు యేదో అంత్యకర్మ చేయిస్తూ మధ్య యేదో విష్కంభసమయం వంటి అవకాశం వచ్చేటప్పటికి ఆ కర్మకు అంగుగా వున్న అగ్నిహోత్రంతోటే చుట్ట అంటించి ధూమపానం చేయడం నేను స్వయంగా చూచివున్నాను. యిట్టి పురోహితులను కళ్ళారాచూచిన బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణ పౌరోహిత్యాన్ని యేవగించుకొన్నాఁ డంటే? తప్పుంటుందా? అక్కడక్కడ నాన్‌బ్రామిను పురోహితులలో కొందఱు అపాత్రులు లుంటే వుంటారేమో కాని నేను వుదాహరించినంతటి అపాత్రుఁడు, అయోగ్యుఁడు దొరకదేమో అనుకొంటాను. యిది దుర్వ్యసన ప్రయుక్తమైన అపాత్రత్వం. కేవలం కొంటెతనాన్ని బట్టి వచ్చిన అపాత్రత్వాన్ని వకదాన్ని వుదాహరిస్తాను.

వకవూళ్ళో వక పురోహితుఁ డుండేవాఁడు. సామాన్యంగా అవసరమైనంతవఱకు పప్పుబొట్లన్నీ వచ్చినవాఁడే ఆయన. యితర పౌరోహిత్యాలు కూడా ఆయనకు లేకపోలేదు గాని విస్తారం పల్లెల పౌరోహిత్యాలున్నాయి. వక మరకాఁడు రంగంవెళ్ళి అక్కడ కొన్నాళ్లుండి కొంత ద్రవ్యసంపాదన చేసి దేశానికి వచ్చాఁడు. భార్యా యీడేరి అప్పటికప్పుడే

నాలుగైదేళ్లు కావచ్చింది. కార్యం చేసుకొని భార్యనికూడా తీసుకు వెళ్ళవలసిందని అత్తవారు పట్టుబట్టడంచేత సుముహూర్త నిమిత్తం పురోహితుఁడుగారి దగ్గఱికి వచ్చి అడిగాఁడు పాపం! యేదో వున్నంతలో వీలైనదిచూచి చెప్పితే తీరిపోయేదానికి ఆ పురోహితుఁడు చేసిన కొంటెతనం చూడఁడీ యేలాగుందోను. "అబ్బాయీ! నీవు సుముహూర్తం కావాలంటున్నావు. వున్నముహూర్తాల్లో కొన్ని కోలంకరాజులకున్నూ కొన్ని పిల్లంకరాజులకున్నూ యిచ్చివేశాను. వుంటే నీకంటే నాకు ముఖ్యులెవరూ?" అంటూ చెప్పేటప్పటికి ఆ శోభనప్పెళ్ళికొడుకు, ఆ సత్యకాలమ్మనిషి "అయ్యా! యేదో మీరిమ్మన్నంత సొమ్ము యిచ్చుకుంటాను, త్వరలో సుముహూర్తం వకటి నాకుయిప్పించా లనేటప్పటికి పురోహితుఁడుగారు "వోహో! గట్టిగాఁ బట్టుకున్నావే!" అంటూ విసుక్కోవడాన్ని నటించి "ఆవీధిని మా నరసన్న దగ్గిఱేమయినా ముహూర్తా లున్నాయేమో? వెళ్ళి కనుక్కో నేనుకూడా చెప్పినట్టు చెప్పు" అనేటప్పటికి ఆ అమాయికప్పెళ్ళికొడుకు నరసన్నగారి దగ్గిరకి కూడా వెళ్ళి అడిగాఁడు. యిద్దరున్నూ తోడిదొంగలే అవడం చేత "నరసన్న దగ్గిఱ మాత్రిం ముహూర్తాలు మూలుగుతూ వున్నాయనుకొన్నాఁడా? బ్రిహ్మన్న" అంటూ విసుక్కొని బ్రిహ్మన్నగారిదగ్గిరకే పంపివేయడం తటస్థించేటప్పటికి బ్రిహ్మన్నగారు తాటాకులు చాలావెదికి వెదికి మట్టమధ్యాహ్నం 12 గంటలవేళ వక సుముహూర్తం పెట్టి పంపించాఁడు. అదే ముహూర్తం ఖాయంచేసుకొని పిల్వాదగ్గవాళ్ళనందఱినీ పిల్చుకున్నాఁడు ఆ పెళ్ళికొడుకు. బ్రహ్మన్నగారు అదే సుముహూర్తానికి శుభకార్యం జరిగించారు. జరిగిస్తూ వుండఁగా వక యాయవారబ్రాహ్మడు వచ్చేటప్పటికి ఆయన ఆక్షేపించి పోతాడేమో వని ఆయనికి వక రూపాయి సంభావన యిప్పించాడఁట!

సమీపగ్రామం సీలపల్లెలో పల్లీలకు కులగురువు వక గృహస్థు పల్లెకులస్థుఁడే వుండేవాఁడు. ఆయనకి యజ్ఞోపవీతాలు వుండడం అనాదిగా జరుగుతూవుంది. దాశరాజుగారి కుటుంబమేమో ఆయనగారిది. ఆకుటుంబం

ఒక శంకరాచార్య పీఠంవంటిది. ఆయన్ని పూజించడం వగయిరా మర్యాదలు ఆ కులస్థులు చేస్తూవుంటారు. యిప్పటికీకూడా ఆ యీ మర్యాదలు జరుగుతూ వున్నాయనే నాతలంపు. నా చిన్నతనంనాఁటికి యీమర్యాదలు జరగడం నేను స్వయంగానే యెఱుఁగుదును. ఆయన ఒకపేరుపడ్డ వేశ్యనుకూడా వుంచుకున్నారు. ఈ శుభకార్యానికి ఆయనకూడా ఆహ్వానితుఁడవడంచేత వచ్చాఁడు. వస్తూవున్నట్టు తెలియడంతోటట్టుగానే పురోహితుఁడుగారు రేవుదాఁటి స్వగ్రామానికి యానాముకు వెంచేశారు. పిమ్మట కులరాజుగారు వచ్చి పట్టపగలు గర్భాధానముహూర్త మేమిటని మందలించి గదిలో వున్న నూతన దంపతులను యివతలకు రప్పించారు. పురోహితుఁడు చేసిన తప్పిదాన్ని కులస్థులకు బాగా విశదీసి బోధించారు కులరాజుగారు. కులస్థులకు ఆగ్రహం వచ్చి పురోహితుఁడుగారిని తుదముట్టించడానికి బయలుదేరారు.

అప్పుడు యానాం గ్రామంలో బహుసుప్రసిద్ధులు శ్రీ బెజవాడ బాపనయ్య నాయఁడుగారి తండ్రి చిన్నయ్యనాయఁడుగారిది ప్రభుత్వం. యీ బ్రహ్మన్నగారు సదరు నాయఁడుగారికిన్నీ పురోహితులేకనక ఆయన్ని శరణు చొచ్చారు. ఆనాయఁడుగారు సర్వసమర్థులు కనక గురువుగారికొచ్చిన ఆపత్తును అతి తేలికగా తప్పించారు. కాని బ్రహ్మన్నగారి జీవితంలో మళ్ళా యెన్నఁడున్నూ పల్లెకొంపలకు పౌరోహిత్యానికంటూ వెళ్ళలేదు. యీ బ్రహ్మన్నగారు చేసినపనివల్ల పురోహితుల కెంతచిక్కు వచ్చిందో చూడండి. సామాన్యంగా బ్రహ్మద్వేషంతో వుండేవాళ్ళకు బ్రాహ్మలని యీసడించడానికి యెంత అవకాశం కలిగినట్లయిందో! ఆలోచించండి. పోనీ యిందులో స్వార్థాన్నేమేనా సాధించుకొన్నట్టయిందా? అంటే అదిన్నీ లేదు. యీపని ఆయన యెందుకు చేశాఁడో? అంటే సమాధానమే లేదు కాని బ్రహ్మద్వేషులు యీలాటి ఆధారాలు పురస్కరించుకొని నిరపరాధులైన యితర పురోహితులమీఁదకి దాడి వెడలడానికి మాత్రం పైకొంటెపని పూర్తిగా సహాయం చేస్తుంది. యీ బ్రహ్మన్నగారు

యీలాటి ప్రసంగాలు యింకా చాలాచేశాడు. అవన్నీ వ్రాస్తే చాలా పెరుగుతుంది. పయిగా ఆ పురోహితుఁడి కొంటెతనం వ్యాఖ్యానించి నట్లే అవుతుందిగాని దానివల్ల లోకానికి కలిగే మేలు లేశంకూడా కనపడదు. అయినా చదువరుల వినోదార్థం యింకొకటి కూడా వుటంకిస్తాను.

బ్రహ్మన్నగారి పౌరోహిత్యంలో బాపతే వక వృద్ధ వేశ్య బాగా చదువుసంధ్య తెలిసినది వకపుణ్యకాలంలో స్నానానికి వచ్చి "అయ్యా! నాకు మహా సంకల్పం చెప్పవలసిం" దని కోరిందఁట! ఆయన యీక్రింది రీతిని కొంటెతనంగా చెప్పారఁట! "ఏక మాతౄణాం అనేక పితౄణాం బాదరాయణ సంబంధానాం" యీ విధంగా మహాధారగా స్వకపోల కల్పితంగా మహాసంకల్పాన్ని సాగిస్తూ వుంటే ఆ వృద్ధురాలు "అయ్యా! మొదట రెండున్నూ అర్థం తెలిసినమాటలే కనక అర్థం చెప్పనక్కఱలేదు. మూఁడోమాట "బాదరాయణ సంబంధానాం" అన్నారే! దానికి తాత్పర్యం సెలవిప్పించవలసిం" దని అడిగినట్టున్నూ మన బ్రహ్మన్నగారు యేదో చెప్పినట్టున్నూ వినికి. యీయన కవియై పుస్తకాలైతే వ్రాసినట్టు లేదుగాని పూర్వపు ఋషులవలె మంత్రద్రష్టగా వుండి కొన్ని మంత్రాలు స్వకపోల కల్పితాలు వినికి చేసినట్టు వింటాను. అందులో వకటి వుదాహరిస్తాను. (మంత్రం) "గంటం గణాయ కిం గంటికే నాసికే, అష్టౌ బలాకా నవ చక్రవాకా స్సముద్రమధ్యే సలిలం పిబంతి" యీయన్ని నేను స్వయంగానైతే చూడలేదు గాని యీయన కుమారుణ్ణి నేను బాగా యెఱుఁగుదును. తండ్రిగారి లక్షణాలన్నీ యీయనకున్నూ వున్నాయి. కాని తండ్రిగారిలాగ దేనిలోనూ చిక్కుకుని అవమానం మాత్రం పొందలేదు. పౌరోహిత్యమన్న పేరుతో యానాంలో యీయన రాజ్యమే యేలినట్టు నా అనుభవంలో యెఱుఁగుదును. యీయన పురోహితుఁడుగావుండి కన్యస్త్రీల (నన్‌సు) బళ్లో వుపాధ్యాయత్వాన్ని కూడా నిర్వర్తించేవారు. ఫ్రెంచి బళ్ళకు గురువారమున్నూ ఆదివారమున్నూ సెలవు. దాన్నిబట్టి ఆయన ఆశ్రమాలలో వచ్చే ఆబ్దికాలన్నీ ఆ రెండు

రోజుల్లోనూ వెఱపేర్చేవాఁడని చెప్పుకొనేవారు. తెనాలి రామలింగఁడి కథల లాగ యీయన కథలు కూడా వ్రాస్తే చాలావ్రాయొచ్చు.

పుష్కరాల్లో నేను 4 యేళ్ళ వయస్సులో వున్నప్పుడు జరిగిన కథ వకటి మాత్రం వ్రాస్తాను. ఆరోజులలో పితృదేవతలు తరించడానికి గృహస్థు లందఱున్నూ తీర్థవిధు లంటూ పెడతారు. ఆలా పెట్టేటప్పుడు పిండితో పిండాలు చేసి ఆ యీ పితరులనూ వారికి సంబంధించిన వారినీ వుద్దేశించి దక్షిణతో ఆ పిండాలు పురోహితుఁడు వేయిస్తాఁడు. ఆలా వేయించేటప్పుడు మఱికొన్ని కల్పనచేసి ఆ ఆసామీ తెచ్చిన ద్రవ్యమంతా ఖర్చుపెట్టించడమే కాకుండా మఱికొంత కాసు అప్పుకూడా యిచ్చి దాన్ని కూడా ఖర్చు పెట్టించేవాఁడు. యీ కుకల్పనంతా యెందుకంటే? ఆసమయంలో దుడ్డో దుగ్గాణో సంభావన దొరుకుతుందని వచ్చినవైదిక బ్రాహ్మలకు యేమీ లేకుండా చేయడానికే! ఆఖరైన తరవాత ఆ యజమానికి పైగావున్న బ్రాహ్మలని చూపి "వీరంతా చాలా మంచివారు, తీర్థవాసులు, వీరిని సత్కరించడం ఆవశ్యకం కనుక చెపుతూ వున్నా" నని చాలా నిపుణంగా చెప్పేటప్పటికి ఆ యజమాని "అయ్యా! నేను తెచ్చిన సొమ్మంతా అయిపోయింది సరిగదా! మీవద్ద బదులు పుచ్చుకున్నదికూడా అయిపోయిందని తమరే యెఱుఁగుదురాయె, ఇఁక నేనెక్కడనుంచి వీరికి తెచ్చియిచ్చేది?" అనేవాఁడు. దానిమీఁద "నేనుచెప్పడం మర్యాదకనక చెప్పాను. ద్రవ్యం లేకపోతే నీవేమి చేస్తావు? పాపం! అయితే వకటి, యీవున్నవారిలో యిద్దఱు ముగ్గురు మఱీముఖ్యు లున్నారు. వారు తీర్థవాసులు కాఁబట్టి వారిని యేదోవిధంగా సత్కరించడం తప్పదు." అని చెప్పి వారికి వొక్కొక్కరికి వొక్కొక్క పిండం చొప్పున వేయించేవాఁడు. ఆలా వేయించేటప్పుడు వారివారికి కొత్తపేళ్లు కల్పించేవాఁడు. ఆసమయంలో లేశమున్నూ నవ్వడంగాని యేవిధపు కొంటెతనపు చిహ్నం కనపర్చడంగాని చేసేవాఁడు కాఁడు. ఆపిండా లెవరిని గూర్చి వేయించేవాఁడో వాళ్ళు "మొఱ్ఱో! మాకు పిండాలెందుకయ్యా! దబ్బాడనక్కమూ

లేని పల్లకాటి పిండాబూ" అనే టప్పటికి "నాయనా! మీరు కోరతారా యేమిటి? మెట్(గివుండి యువతల వాళ్ళు చేయవలసిందే గాని" అంటూ ఆపిండాలు వేయించే వా(డు. ఇది ఆ బ్రిహ్మన్నగారి కౌమారు(డి చర్య.

బ్రిహ్మన్నగారి చర్యను గూర్చి కొంత వ్రాసే వున్నాను గదా! బ్రిహ్మన్నగారు పెద్దపండితులైతే కారుగాని మూ(డు లోకాలకున్నూ సరి పడ్డ పండితులని పేరుపడ్డ శ్రీ యిందిగంటి విశ్వపతిశాస్త్రుల్లుగారితో కూడా వొకానొక విషయంలో వాదించిన మహాసాహసులు! ఆ విషయ మేమి టంటే? విశ్వపతిశాస్త్రుల్లుగారు మహా విద్వాంసులు. వీరు శ్రీ బులుసు అచ్చయ్యగారి శిష్యులు. "విస్సన్న చెప్పింది వేదం" అనే లోకోక్తి వీరి కాలంలోనే పుట్టింది. వీరు యెంతవారో చెప్పడానికి యెవరికీ శక్యం గాదు. గాని వీరివాదం మాత్రం ప్రిమాణాలను అరికట్టేది కాదు. అందరూ "అవు" నంటే వీరు "కా" దనడమే తప్ప వీరికి వక మత మంటూ లేదు. "మయి జల్పతి కల్పనా ఒధినాథే రఘునాథే మనుతాం తదన్యథైవ" వీరిని యెదిరించి మాటాడి అవమానం పొందని వారే లేరని మా పరమగురువులు చెప్ప(గా విన్నాను. వీరు యే జమీందారును గాని యేమండీ అని మన్నించి మాట్లాడినట్లే లేదని వింటాను. తృణీకృత బ్రిహ్మ పురందరు లనే మాట వీరికే యిటీవలి కాలంలో చెల్లిందంటే అతిశయోక్తి కాదు. యిట్టి వీరు శ్రీ మన్యంవారి దివాణంలో యితర పండి తులందఱికీ వ్యతిరేకంగా చేసిన సిద్ధాంత మేమిటంటే? కోమట్ల యిళ్లల్లో ఆబ్దికాలప్పుడు బ్రాహ్మణులు తైలంతో పక్వంచేసిన గార్లున్నూ అరిసె లున్నూ యింకా యీలాటివే సజాతీయాలున్నూ తినడాని కభ్యంతరం లేదని యేర్పఱిచార(ట! యీ అధికారం వక కోమట్ల యిళ్లల్లో మాత్రమే కాదు; శిష్టకరణాలని అనిపించుకొనే వడ్డీలు శ్రీ వేణం వీరన్నగారి యింట్లోకూడా తినవచ్చు ననిన్నీ "శ్లో. ఘృతపక్వం తైలపక్వం పక్వం కేవల వహ్నినా, శూద్రాదపి సమశ్నీయా దేవమాహ పితామహః." అని ప్రిమాణ వచనం చదివి సిద్ధాన్తం చేసినట్టున్నూ విన్నాను. (వీరిచర్యలు

వ్రాయవలసివస్తే చేతే వ్రాయాలి యింతతో తేలదు.) అసలు జరిగిందో లేదో పూరికే బిల్లుమాత్రం ప్యాసయి అంతతో ఆగిందో తెలియదు. బహుశః అప్పటికాలంలో అమలుజరగడం కష్టం. యీ రోజుల్లో అయితే యిది అమల్లోకి రావడం అంత కష్టసాధ్యం గాదని వ్రాయనక్కరలేదు.

యింతకూ మన బ్రహ్మన్నగారు యీ విశ్వపతిశాస్త్రుల్లు గారికి ప్రతి పక్షవాదుల్లో వుండి కొంతపని చేసివున్నారనడం వల్ల కొంతగణనీయమైన బ్రాహ్మడే గాని సామాన్యుడు కాడని తేలుతుంది. యిట్టివాడు తనకు లాభం లేశమూ లేని పనులు కొన్ని చేసి పురోహిత జాతికి తీరని కష్టం కొన్ని తెచ్చిపెట్టడానికి మనం మిక్కిలీ విచారించవలసి వుంది. యేమై నప్పటికీ అప్పటి కింకా కులాచారాలు అతిక్రమించడ మంటే బొత్తిగా యెవ్వరున్నూ సమ్మతించే పని కాకపోవడం చేత బ్రహ్మన్నగారి కొంటె తనాన్ని పురస్కరించుకొని వైదిక బ్రాహ్మణ పౌరోహిత్యమే త్యాజ్య మనే రిజల్యూషన్ ప్యాసు కాలేదు.

యిప్పుడో ఆదేదిన్నీ లేకుండావే జాత్యభిమానాన్ని పురస్కరించుకుని అది బయలుదేరింది. యిది మొట్టమొదట అంతో యింతో తలచూపింది నియోగులలో, తరువాత కోమట్లలో తరువాత దేవాంగులలో తరువాత యిటీవల కమ్మవారిలో. యీ కమ్మవారిది మటీ పట్టపగ్గాలు లేకుండా వుంది. కంసాలులలో చాలాకాలం నాడే బయలుదేరిం దనుకుంటాను. వూరికే బయలుదేర వలసి బయలుదేరిందే కాని నియోగులలో బయలు దేరవలసిన ఆవశ్యకత కనపడదు. యెవరో చాందసులు కొందఱు నియో గులలో నెవరినో కొంత అవమాన దృష్టితో చూడడంవల్ల శ్రీనందిరాజు దీక్షితులుగారనే మహావిద్వాంసుడు బంధుయాజనం శాస్త్ర సిద్ధమని ఋజువు చేసి కొంత కర్మశ్రద్ధను సజాతీయులలో కలిగించినారు. కాని అప్పటి కప్పుడే కర్మద్వేషం బ్రాహ్మణజాతిలో అంకురించడం చేత ఆ మహామహుని పరిశ్రమకు తగినంత ఫలితం కలిగింది కాదు. అధమం అయిదాఱువందల యేండ్లనాడు యీ దీక్షితులుగారు అవతరిస్తే వేదశాస్త్ర

విహితములుగా వుండే కర్మలకు చాలా ప్రచారం కలిగేది. అట్టిమాదిరిగా కాక యేదో మాదిరిగా వుండే కాలంలో కావడం చేత తగినంత ప్రయోజనం కలగలేదు. అదిన్నీకాక, ఆయన సిద్ధాంతాలేమిన్నీ నూతనాలున్నూ కావు. వివాహాలు శాస్త్రీయాలా ? కావా ? అనే విషయాన్ని సాధించడమనేది సిద్ధ వస్తువును సాధించడానికి చేసే ప్రయత్నం వంటిదే కాని మరొక మాదిరిది కాదు. అయినప్పటికీ అప్పటి కొందఱి పూర్వపక్షాలను పట్టి ఆ దీక్షితులుగారు కొంత ప్రయత్నం చేసివుంటే వుండనివ్వండి, అందులో యితరుల ఖండన మండనాలకు అవకాశం వున్నట్టు నాకుతోఁచలేదు. తదితరుల ప్రయత్నాలలో బోలెఁడంత చర్చనీయమైన విషయం కనపడుతుంది గాని చర్చించి యిదమిత్థమని చెపితే వినేది మాత్రం యెవరు ? అందుచేత కులతత్త్వాలను కూర్చిన్నీ వాటి వాటి కట్టుఁబాట్లను గూర్చిన్నీ యిప్పుడు బొత్తిగా చర్చించడం అనవసరమని వేఱే వ్రాయనక్కఱలేదు. వొక్కొక్కరు వొక్కొక్కతోవ తొక్కుతారు.

"యెవరికి వారే యమునా తీరే" పూర్వం అనులోమ వివాహాల వల్లనేమో ముప్పు మూఁడుతుందనే వారా ? యిప్పుడో అవి చేయడమే చాలా అవసరమనిన్నీ దానివల్లనే యెంతో లాభం వుందనిన్నీ చెప్పేవారు బయలు దేఱారు. అలా చేసి చూపినవారిని మఱీ మెచ్చుకుంటూ వున్నారు. యే మంచిగాని యే చెడ్డగాని చేయడానికేనా మానడానికేనా లోకాన్ని బట్టి గదా ? ముందడుగో వెనకడుగో వేయడం. అట్టి లోకం చాలావఱకు పూర్వం నిషిద్ధ మనుకొనే కార్యాలకే మార్గదర్శకంగా వున్నప్పుడు చేసేదేమిటి ? శాంతం పాపం !

"గతాను గతికో లోకో నలోకః పారమార్థికః" అనుకొని వూరుకోవలసిందే అనుకుంటాను. యింతకన్న కుల కట్టుఁబాట్లను గుఱించి వ్రాస్తే యెవరున్నూ ఆదరించేవారు లేరు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# కవిత్వంలో నా యెదుగు బొదుగులు

(29-12-37 సం॥ర ఆంధ్రపత్రికనుంచి)

దీన్ని గుఱించి అందఱూ యెఱిఁగిందే యెందఱో వ్రాసిందే. మేము కూడా పలుచోట్ల వ్రాసేవున్నాము. యీమధ్య నాకు యేకలవ్య శిష్యప్రాయుఁడు, కవి, కవులంటే అభిమానంగా వుండేవాడు, వకాయన పైవిషయం విపులంగా వ్రాయవలసిందని నొక్కి నొక్కి వ్రాస్తూ అందులో నా అనుభవాన్ని విశేషించి తెలుపుమనికూడా వ్రాశాడు. విషయం వకటే అయినా ఫలితార్థంకూడా వకటిగానే వుండినా ఆ యా వ్యక్తులనుబట్టి అనుభవాలు కొంచెం భేదించడం అక్కడక్కడ కనపడుతుంది. స్వకీయానుభవాన్ని వ్రాసేటప్పుడు యెంతగా "స్వభావోక్తి రసా ధార" గా వ్రాసినా లోకం ఆ వ్రాఁతను ఆత్మోత్కర్షాపాదకంగా కొన్ని స్థలాలు చదివేటప్పుడు అభిప్రాయపడక మానదు. అందుచేత నేను వట్టి శుంఠను అని వ్రాస్తే వినయంగా వుంటుంది గాని అసత్యం అవుతుంది. ఆ యీ భయాన్ని మనస్సులో పెట్టుకొని ఆలాటి చోట్లలో "అన్యథావా ప్రకల్ప్యేత్" గా కలాన్ని నడిపితే దానివల్ల కూడా అనృత దోషమే కాకుండా లోకాన్ని వంచించిన దోషం కూడా తటస్థిస్తుంది. పోనీ యెందుకీ చిక్కని మౌనం వహిస్తేనో? కోరిన వ్యక్తిని అనాదరించిన ట్లవుతుంది. యెవరు దీన్ని గూర్చి నన్ను కోరివున్నారో ఆయన సాహసించి తఱుచుగా నాతో వ్యతిరేకించి తోఁచినమాట లేవో పత్త్రాల్లో వ్రాస్తూ వుండేవారే. అయినా అంతరంగంలో నాయందు మిక్కుటమైన ప్రేమాభిమానాలు కలవారని నేనెఱిఁగివున్నాను.

యీయన రీతి చూస్తే బందరులో వుండే యిద్దఱు వ్యక్తులు నాకెప్పుడున్నూ స్మృతిపథాన్ని తాండవిస్తూ వుంటారు. ఆ వ్యక్తిద్వయంలో వక వ్యక్తి ఆంగ్లవైద్యంవల్ల నామరూపాలు సంపాదించుకొన్న సంపన్న గృహస్థు. వైద్యానికి పూర్వమే అంతో యింతో కవిత్వం అల్లడంమా

ఉల్లాఘించఁగా కాళిదాసాది మహాకవుల కవిత్వంలో కూడా యేవో అప చారాలున్నాయన్నంత ధైర్యంగా యిప్పటికవుల సంగతినీ (లిఖిత రూపంగా రాను) అస్మదాదుల యెదుట చనువుచేతే అనుకుందాం విమర్శించి తూఱు పాఱఁబట్టేవాఁడు. తఱచు నాదగ్గఱికి వస్తూ పోతూ వుండడం కలదు. అతనికి నాయందైతే అభిమానం లేకపోలేదు గాని నాకన్నా కూడా వేఱొ కరియందు వ్యక్తిగతంగా అభిమానం జాస్తీ. దీన్ని బట్టి యేదేనా విషయం వస్తే ఆపక్షంగా నాతో పిడివాదం వాదించేవాఁడు. కాని మళ్ళా ఆయనతో ఆయనకి వ్యతిరేకంగానే ప్రతివిషయంలోనూ దిద్దఁబిద్ద వాదమే చేస్తూ వుండేవాఁడు. ఆయనగాని, నేనుగాని అతనివాదాన్ని వినీవిననట్టు వుపేక్షించడమే కాని "యిదమిత్థ" మని గట్టిగా ఖండించడమంటూ లేదు. మా యిద్దఱికీ గూడా అతఁడంటే అభిమానమే. ప్రస్తుతం నన్ను యీ వ్రాయఁబోయే వ్యాసానికి ప్రేరేపించిన వ్యక్తికికూడా నేఁటి యితర కవులయందు కన్నా మాయందు ఆంతరంగికాభిమానం మెండవి మెఱఁగి వుండడం చేత కొందఱు చదువరులు నన్ను యెందుకీ వ్రాఁతంటారని పూర్తిగా మెఱఁగి కూడా కవిత్వాన్ని గూర్చి నా అనుభవాన్ని వున్న దున్నట్టుగా వ్రాయ సాహసిస్తూ వున్నాను. యింతమాత్రంచేత అందఱి అనుభ వమూ యీలాగే వుంటుందనికాని, యీలాగే అందఱూ ప్రయత్నించవలసి వుంటుందని కాని జిజ్ఞాసువులు అభిప్రాయ పడవద్దని వారి వారిని నేను కోరుతూ వ్రాఁత కుపక్రమిస్తాను.

నేను తెలుఁగు బడిలో అక్షరాభ్యాసమున్నూ బాలరామాయణం పట్టడమున్నూ జరిగే పర్యంతమే వున్నాను. అప్పటి కప్పుడే లోకల్ ఫండు స్కూళ్లు సకృత్తుగా వచ్చాయి. కడియంలో వుండే ఆ స్కూలు మాస్టరుగారికి నాయం దెంతో అవ్యాజమైన ప్రేమ. దానిక్కారణం నేను యిక్కడ వ్రాస్తే మఱీ అతిశయోక్తిగా వుంటుందేమో ? కాఁబట్టి వ్రాసేది లేదు. యేలాగో నన్ను తమ స్కూల్లో చేర్చుకుందామనే ఆయన అను కొని మా నాన్నగారిని అడుగుతూ వుండేవారు. వీధిబళ్ళలో వుండే పిల్ల

లని స్కూలుమాష్టరులు ఆకర్షించడం ఆకాలంలో విశేషించి వుండేవి. పెద్దవాళ్ళకి పూర్వపు బళ్ళయందే యెక్కువ విశ్వాసం వుండేవి. పకపత్రి క్కాని ఆబళ్ళున్నూ పకపత్రిక్కాని యీబళ్ళున్నూ సరిసమానంగానే, ఆరో జుల్లో యీరోజుల్లో పూర్వాచార నవీనాచారాల లాగ వుంటూ వుండేవి. యేలాగయితే యేమి లోకల్‌ఫండు స్కూలుకు విద్యార్థిగా మారడం జరిగింది. మూడో క్లాసు దాకా చదవడం జరిగింది. లెక్కలలోతప్ప యితర సబ్జక్టులలో నాకు దీటు నేనే అన్నస్థితిలో వున్నప్పుడు కడియా న్నుంచి మా కాపరం యానాముకు మారింది. అప్పటికి నావయస్సు పదేళ్ళకు లోపు. వుపనయనం మాత్రం జరిగింది. యే అపస్వరాలతోనో సంధ్యావందన మ్మొక్కలు వచ్చీ రాని స్థితిలో వుండేవి. కాలం యింత ఛండాలంగా లేదు కనక యెప్పుడేనా సంధ్యవార్చడం కూడా వుండేది. యెందువల్ల ? పెద్దవాళ్ళ భయంవల్ల. అంతవఱకూ కవిత్వ ప్రవేశం లేదు సరికదా ? దాన్ని గుఱించి లేశమున్నూ తెలియదు.

కడియం స్కూలుమాష్టరు గారు పౌరాణికులే, కాని కవులు కారు. వారి వల్ల కొంచెం పౌరాణికధోరణి అంతరంగంలో అంకురించిందే కాని అదిన్నీ బహిర్గతం కాలేదు. యెందుచేత ? సిగ్గుచేత. యీ స్థితిలో వున్న నేను యానాం ఫ్రెంచిస్కూల్లో కొన్నాళ్లున్నూ ఆస్కూల్లో మాల మాదిగ లున్నూ యితరులున్నూ కలిసి కూర్చోవాలనే రూలు వచ్చాక నీలపల్లి లోకల్‌ఫండు స్కూల్లో కొన్నాళ్లున్నూ యానాం లోనే వీధిబళ్ళో కొన్నా ళ్ళున్నూ విద్యార్థిత్వం చేయడం తటస్థించింది. కాని ఆవిద్యార్థిత్వంలో తెలుఁగు శబ్దాలూ ధాతువులూ గబ గబ ఆ యా విభక్తులతో ఆ యా కాలాలతోనూ ఆ యా అర్థాల తోనూ చెప్పే శక్తి మాత్రమే ఆర్జించు కొన్న ట్టయింది. కాని కవిత్వానికి ఆరంభం కాలేదు సరికదా ? కవులంటూ వుంటారనే జ్ఞానంకూడా కలిగినట్టే లేదు. కొంచెం సహవాసం వల్లనే అనుకుందాం సంగీతం వేవ మోశాగా పాడడమున్నూ, పొడుం పీల్చడ మున్నూ అభ్యాసమయినాయి గాని కవిత్వ ప్రసక్తి లేదు. అప్పటి నావ

యస్సు సుమారు పన్నెండేండ్లు. మా వీధినే అపర సూతావతార మేమో అనుకోఁ దగ్గ సద్బ్రాహ్మణులు ఆగర్భ శ్రీమంతులు వృద్ధులు యేయితర వ్యాపారమూ లేని కసిరెడ్డి సుబ్బారాయఁడుగా రనే వారొకరుండేవారు. (యీయన మా ఆటంలో ధర్మా ధర్మ నిర్ణయం చేస్తూ కాలక్షేపం చేసే వారు) ఆయన తాటాకుల మీఁద స్వదస్తూరీని భారత భాగవత రామాయణాలే కాక మరికొన్ని గ్రంథాలు కూడా స్వయంగా రాసిన వారు. నేను చదవడం అంటే ఆయనకు చాలా ప్రీతి. అప్పుడప్పుడు నాచేత ఆ యా గ్రంథాల్లో యేవేనా ఒకమాటి చదివించి ఆయన అర్థం చెపుతూ వుండేవారు. రాత్రిళ్లు వారియింటికి ప్రక్కయింటి మా బంధువుల అరుఁగు మీఁదనే నేను పడుకోవడం కనక ఆయన సుమారు 11 గంటల వఱకూ పచారు చేస్తూ కొంచెం కదిలిస్తే భారత గాథలు యేకరు పెడుతూ వుండేవారు. యిటీవల భారతం నేను చాలా కాలానికిఁ గాని చదవక పోయినా ఆ యా గాథలు నాకు తెలియడానికి ఆసుబ్బారాయఁడుగారి వుపన్యాసాలు వినడమే కారణమని చెప్పడమే యుక్తంగా వుంటుంది. ఆయనకి కూడా కవిత్వంతో లేశమున్నూ చుట్టఱికం లేదు. ఇట్టిస్థితిలో ఆరోజుల్లోనే నాకు కీర్తనమాదిరి కీర్తన అల్లడం యెలా అలవాటు పడిందో నాకున్నూ యిప్పుడు తెలియదు గాని అలవాటు మాత్రం అయింది.

తెలుఁగు భాష యతిప్రాసలు యతులను గూర్చి గాని ప్రాసలను గూర్చిగాని లేశంకూడా నాకు తెలియదు. అవి సరిగానే పడేవి. అప్పుడు చెప్పినకీర్తనలు బాగున్నా బాగుండక పోయినా సుమారు యిరవై ముప్పయి దాకా వుంటాయి. అందులో వొకటి రెండు పల్లవు లిప్పటికిన్నీ జ్ఞాపకం వున్నాయి యిక్కడ చూపుతాను.

"గజ ముఖ దేవుని ఘనముగఁ గొల్చెద
విజయము విద్యయు వేగ నొసంగఁగ" ॥గజ॥

పై చరణాలు జ్ఞాపకం లేవు. యింకొకటి కేవలం పల్లవి మాత్రమే జ్ఞాపకం వుంది. అది యిది " పోఁగదవే! మానసా! పోఁగదవే. " లక్షణం

లేశమూ తెలియదు. సులక్షణ సారం అనే పుస్తకం చదివితే లక్షణ విషయం తెలుస్తుందనే సంగతి అంతకు ముందే తెలియదు. యిట్టి స్థితిలో "యత్ర తాళ స్తత్ర యతిః" అనే అభియుక్తోక్తి ప్రకారం యతి గాని ప్రాసం గాని వుండేటట్టు రచన నడిచేది. దీని కారణ మేమో నిన్న మొన్నటి దాఁకా నాకున్నూ తెలియదు. గాని మొన్న రాజమండ్రిలో పైడ వారి కొట్ల సమీపంలో రైలుపట్టాల వద్ద నడుస్తూ వుండఁగా వక సవరాలజాతి ఆఁడది పిచ్చిది ముసలిది దానికి తత్కాలికంగా తోఁచే మాటలు యేవో వక విధమైన లయలోకి చేరేటట్టు యేకరు పెడుతూవుంది. అవి తాత్కాలికమే కాని యిదివఱలో వున్న దాన్ని యేకరు పెట్టడం కాదనడానికి ఆధారం పూర్తిగా వుంది. ఆ రచనలో యతి తప్పడం లేదు. నాకు కీర్తన రచననాఁటికి కొంత భాషా జ్ఞానమేనా వుండిగాని యీ సుకాలి స్త్రీకి భాషా జ్ఞానం యెక్కడిది? దాని జాతి కలవాళ్లైన మామూలు మాటలే దానికి వచ్చును. దీన్ని బట్టి యితర భాషల మాట యేలా వున్నా తెలుఁగుభాషకు సర్వ సామాన్యంగా యతిప్రాసలు సహజాలనిన్నీ అందులో విశేషాలు తెలుసుకోవలసి వస్తే లక్షణగ్రంథావలోకనం కావాలి గాని సామాన్య రచనకు అక్కఱ లేదనిన్నీ నాకు తోఁచింది. ఆ కారణంచేతనే సమస్త భాషలకూ మాతృస్థానాన్ని అలంకరించి వున్న సంస్కృతానికి లేని యతి ప్రాసలు తెలుఁగులో కవులంతా యింతవఱకున్నూ ఆమోదించి వున్నా రనిన్నీ, యిప్పుడు యీ నిర్బంధం తొలఁగించే వారు కూడా తొలఁగించి చేసే రచనకు చేసే ప్రయత్న మంత వుంచి చేయడానికి అక్కఱలే దనిన్నీ నేను అనుకున్నాను. యీ విషయం వారి వారి అనుభవాలకు యేలా తార్కాణ మవుతుందో వారు వారు ఆలాటి నిర్ణయం చేసుకుంటారు.

యింత వ్రాసినా నాకు కవిత్వం యెవరివల్ల పుట్టిందో వ్రాసినట్టు కానే లేదు. వకరి వల్ల పుట్టేదయితే ఆలా యెవరనో నిమిత్త మాత్రులుగా వ్రాయడానికి అవకాశం వుంటుంది.

—• కవిత్వము సహజగుణము •—

ఇది అసలు అలాటిది కానే కాదని ప్రతీ విజ్ఞులున్నూ వ్రాస్తూనే వున్నారు కదా?

శ్లో. శక్తి ర్నిపుణతా లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే.

శ్లో. బీజం యస్య పురాఽఽర్జితం సుచరితం ప్రజ్ఞా నవీనాంకురః
కాండః పండిత మండలీ పరిచయః కావ్యం నవః పల్లవః
సూక్తిః పుష్ప పరంపరా పరిణతి స్సోఽయం కవిత్వం ద్రుమః.....

శ్లో. కవితా వనితా చైవ స్వయమే వాగతా వరా.

"కవులు పుట్టుదురు గాని చేయఁబడరు" యెన్నో యిట్టి అభియుక్తోక్తులు అందఱూ యెఱిఁగినవే వున్నాయి. వాట్లను నేనిక్కడ యేకరు పెట్టి విసుగు పుట్టించేది లేదు.

శ్లో. గాంధర్వంచ కవిత్వంచ, శూరత్వం దాన శీలతా
అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజా గుణాః.

కవిత్వానికి యే యే లక్షణాలు వుండాలో యే యే విషయాలు తెలిసి వుండాలో అవన్నీ సమగ్రంగా తెలిసి వుండిన్నీ నాలుగు వాక్యాలు ఛందోబద్ధంగానే కాదు; ఛందస్సంబంధం లేని గద్యగా కూడా వ్రాయలేని వారున్నూ వున్నారు. యీ కర్మం లేశమున్నూ తెలియకుండానే బోలెఁడు రచన చేసిన వారున్నూ వున్నారు. యీ సందర్భంవల్ల పైవిషయం విస్పష్టమే కనక విస్తరించేది లేదు.

యీ కీర్తన రచన రోజుల్లోనే నేను అప్పటి నివాస గ్రామం యానాముకు సుమారు రెండు మైళ్ళ దూరంలో వుండే కాపులపాలెంలో శ్రీ కామకుర్తి భుజంగరావు పంతులుగారి వద్ద రఘువంశం చదవడానికి ఆరంభించాను. వారు గ్రంథా లేవీ వ్రాయలేదు గాని అవధానాదికం

కూడా అవలీలగా చేసే శక్తి కలవా రనిన్నీ ఆధునికుల్లో రచనలో కూడా విరాళంకు లనిన్నీ యిటీవల వారిని గూర్చి పలువురు చెప్పంగా విన్నాను. వారివద్ద రఘువంశంలో రెండు మూండు అయిదు సర్గలు మాత్రమే చదువుకోవడం తటస్థించింది. యిది తప్ప యీ కవితావిషయానికి సంబంధించిన లక్షణాలు చదవా లేదు. చదవాలనే కుతూహలం కలిగినట్టున్నూ లేదు. అప్పటి పండితులు లక్షణాలు చెప్పవలసిందని మనం కోరినా చెప్పే వాడుక కలవారు కారు కూడాను. అందుకు కారణం యీ వ్యాసంగం విద్యాభ్యాసానికి భంజకంగా పరిణమించి యుక్తకాలం కాస్తా దీనితో గడచి పోవటం తటస్థించింది తుదకు అందుకు యిందుకు కూడా కాక చెడిపోతాండు విద్యార్థి అనే కాని మరోటి కాదు. ఆ యీ సంవత్సరాలు జాతకపత్రంలో సూచించే వున్నాను. రఘువంశం అంతతో చాలించి కారణాంతరంవల్ల మా గ్రామానికి అయిదుమైళ్ళ దూరంలో వున్న పిల్లంక గ్రామానికి విద్యార్థిగానైతే వెళ్ళడం జరిగింది గాని ఆ గ్రామం కొలంది కాలంనాండు నదీపాతం కావడం వల్ల వారి వారి పొలాల్లో బ్రాహ్మలు యిల్లు కట్టుకొని వున్న రోజులవడంచేత రాత్రిళ్ళు వారపు భోజనానికి వెళ్ళడానికి చిన్నతనమవడం వల్ల భయంవేసి రెండు మూండు శ్లోకాల ప్రాంతంలోనే ఆవిద్యార్థిత్వాన్ని వదలుకొని శ్రీ అల్లంరాజు సుబ్రహ్మణ్య కవిగారికి విద్యార్థిగా వెళ్ళడానికి యత్నించి కాకినాండ దాంకా నైతే వెళ్ళడం జరిగింది గాని వారు వారి వూళ్ళో వారాలు దొరకడం దృశ్యా దృశ్యంగా కనపడి ఆశీర్వచనం మాత్రం చేసి జాతకాన్ని బట్టి భావియోగాన్ని కూడా తెలిపి కాకినాడలోనే శ్రీ కల్లూరి గణపతి శాస్త్రుల్లుగారి వద్ద చదువుకో వలసినదిగా ఆధారం చూపి వదలిపెట్టి వారి గ్రామానికి దయచేసారు. యీ సుబ్రహ్మణ్య కవిగారి వద్దకు వచ్చేటప్పటికే యే వెట్టిముట్టి కీర్తనలో రచించే వాణ్ణయినా వీరివద్ద నేను యేకొన్నాళ్ళో శుశ్రూష చేయడం తటస్థిస్తే వీరి శుశ్రూషకున్నూ నా కవితా ధారకున్నూ హేతుహేతుమద్భావం కలిగించడానికి సామాన్య లోకానికి అవకాశం వుండేది. కాని అది అంతమాత్రం

లోనే అంతరించడం చేత అట్టి అవకాశం లేకపోయింది. ఎప్పుడు వక కీర్తన వ్రాయడంలోనే వుంది గాని అప్పటి కింకా పద్యరచన మీఁదకి దృష్టి మళ్ళనే లేదు. మళ్ళే యెడల యతిప్రాసలు కొంత స్వత్యాస్తంగా నేవా పడడానికి మాత్రం జ్ఞానం యేమాత్రమో వుందనే అనుకుంటాను. తర్వాత కాకినాడలో కూడా వారాలు సంపాదించుకొనే తెలివితేటలు లేకనూ మేనత్తగారి వూరనే కారణంచేతనున్నూ, అంతకు మునుపు సుమారు నెల్లాళ్ళనాఁడు మేనత్తగారి కూఁతురు పెళ్ళికి వెళ్ళినప్పుడు అల్లరిలో నా చురుకుతనాన్ని చూచి, నన్ను చదువు చెప్తాను రమ్మని శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రుల్లుగారు ప్రేమపూర్వకంగా సెలవిచ్చి వుండడంచేత నున్నూ కాటవరం గ్రామం వెళ్ళడం తటస్థించింది. అక్కడ యెన్నాళ్ళున్నదిన్నీ యెంతవఱకు చదివిందిన్నీ అన్యత్ర విస్తరించే వున్నాను కనక యిక్కడ విస్తరించ లేదు. అక్కడ గూడా లక్షణ గ్రంథం చదవడంగాని పద్యరచన కారంభించడంగాని తటస్థించనే లేదు.

## —• కవిత్వ కృషి — చదరంగపు కృషి •—

ఆ వూళ్ళో కొంచెం జ్వరపడి లంఘనాలు చేసి పథ్యం పుచ్చుకున్నాక స్వగ్రామానికి బయలుదేఱి వస్తూ రాజమండ్రిలో సులక్షణ సారం వక గ్రంథమున్నూ, చదరంగపు భరణి వకటిన్నీ కొనుక్కొని, యానాం ప్రవేశించి సుమారు రెండు మాసాలవఱకున్నూ స్వయంగానే సులక్షణ సారంలో వుండే గణ యతి ప్రాసాదుల కృషిన్నీ చదరంగపు కృషిన్నీ తదేక నిష్ఠగా చేసుకొన్న తరువాత మళ్ళా తరవాయి కావ్యాలు చదువుకోవడానికి కాజులూరు గ్రామం ప్రవేశించడం వగయిరాలు సవిమర్శంగా విస్తరించిన విషయాలే.

కాజులూరు చదువులో వుండఁగా పద్యకవిత్వం ప్రారంభం చేసాను. ఆరచన యానాం శ్రీ వేంకటేశ్వర స్వామిని కూర్చినది. అందులో సుమారు అయిదాఱు పద్యాలు సామాన్య ధోరణితో నడిచిన

వివిధ యమకంగా రచన సాగించాలని బుద్ధి పుట్టింది. దానితో కవిత్వానికి శీఘ్రగమనం తగ్గి మందగతి ప్రారంభ మయింది. క్రమంగా వ్యర్థ పదాలు కూర్చవలసి వచ్చింది. యీ యమక రచనాపేక్షకు కారణం శ్రీ మా ముత్తాతగారి రచనలో వుండే "మగువ పదంబు లోకనవమా, నవమా? నవమా? ప్రబాధి" లోనైన పద్యాలు చూడడం. అప్పటికి నా లక్షణజ్ఞానం సులక్షణసార మాత్రం లోనే వుంది. గణాల విషయంలో సందేహం వకచోట కల్గితే దాన్ని పిల్లంకలో శ్రీ సుదర్శనం అనంతాచారివద్దకి వకనాఁడు వెళ్ళి తీర్చుకున్నాను. యింతకు తప్ప ఛందోవిషయం నేనెవరివద్దనూ అభ్యసించలేదు. కాజులూళ్ళో గురువులు కూడా కవులుకారు. అక్కడ కావ్యాభ్యాసం చేస్తూ అప్పుడప్పుడు మొదలెట్టిన శతకాన్ని రచిస్తూ వుండేవాణ్ణి. యీ శతకం పూర్తిగా రచించలేదు. కారణం యమకంగా రచించాలనే వూహ మనస్సులో గాఢంగా పుట్టడమే. ఆ స్థితిలో వున్న నాకవిత్వం కూడా నాచదువుకు విఘ్నం కలిగించింది. కాజులూళ్ళో వుండఁగా వొకనాఁడు తోఁచింది కదా? "మనం అప్పుడే కవులమైనాం కాఁబట్టి యింకా మనకు చదు వెందు" కని వక అహంభావం తోఁచింది. దానితోపాటు కుడికంటికి జబ్బొకటి అంకురించింది. దానా దీనా చదువుతూవున్న మేఘసందేశ పూర్వభాగంలో యింకా యేనాలుగైదు శ్లోకాలో తరవాయి వుండగానే చదువుకు స్వస్తి చెప్పి యింటికి వచ్చేశాను. వచ్చిన తరవాత శతకం పూర్తికాకుండానే యేదో ప్రబంధం రచిద్దామని బుద్ధి పుట్టి మంచిముహూర్తం చూచుకొని కొన్ని పద్యాలు రచించాను. అవి కలగూరగంపలో అచ్చుపడే వున్నాయి. అందులో వక్కటి యిక్కడ వుదాహరిస్తాను.

శా. శ్రీరామామణి వక్షమందుఁ దనరన్ జెన్నొందు తన్నున్ జనం
"బౌరా! చంచలతన్ దొరంగవె మెఱుం గర్థిన్ ధరింపంగఁబో
లీరాజఘ్న" వంచు వర్ణనలఁ దారింపారఁగా జేయ నా
శ్రీరంగమ్మున నుండు రంగఁడు యశశ్శ్రీలిచ్చు మాకెప్పుడున్.

యింతకు "పోటన ఈ రాజద్ధసము" అన్న చోట చేసిన సంధి అజ్ఞాన మూలకమే. యీ దేశంలో యెంతో దేవుళ్లు వుండివున్నా శ్రీరంగం దాకా వెళ్ళడం ప్రాస కోసమే. శతకంలో మొదటి పద్యాన్ని కూడా వుదాహరిస్తాను.

ఉ. శ్రీమదఖండ వైభవముచేఁ దెలువారెడి వేంకటాద్రిపై
సామజయాన శ్రీరమణి చక్కఁగఁ బాదములొత్త నారదుం
"దో మహసీయ సేవిత గుణోజ్జ్వల" యంచు భజింపుచుండు ని
న్నే మది నమ్మినాఁడ దయసేలుమి శ్రీకర! వేంకటేశ్వరా!

యిది నా పద్యకవిత్వానికి మొట్టమొదటి పద్యం. కాని దీనిధోరణిని యిప్పుడు పరిశీలిస్తే యిది కొంతరచనలో కృషి జరిగిన పిమ్మటిదేమో అనే శంక నాకే కలుగుతూన్నప్పుడు యితరులకు కలగడం తప్పుకాదు. నేను ఆంధ్రం స్కూలు బళ్ళో తప్ప యితరుఁవద్ద లేశమున్నూ కృషి చేయలేదు. వీధి భాగవతాలూ వీథినాటకాలూ తోలుబొమ్మలూ చాలా చూడడమున్నూ మా ముత్తాతగారు తాటాకులమీఁద వ్రాసిన బాపతు పూర్వకవుల గ్రంథాలలో తెలుఁగు గ్రంథాలు కాగితాలమీఁద వ్రాదామనే పిచ్చి వూహతో యేకాన్నో కాగితాలమీఁద వ్రాయడమున్నూ నాకేమా త్రమో మిడిమిడి జ్ఞానాన్ని కలిగించినట్లు నేను అనుకుంటాను. పూర్వపు వాళ్లు ఆయాగ్రంథ సంపాదన చేయవలసి వస్తే వ్రాసుకోవలసి వచ్చేది. ఆలా వ్రాయడంలో సామాన్యజ్ఞానం కలవాఁడికికూడా యెంతో పాండిత్యం గురుశుశ్రూషవల్ల వచ్చేదానికంటే కూడా అధికంగా సంప్రాప్తమయ్యేది. యిప్పుడు ధనంపెడితే కావలసినన్ని గ్రంథాలు దొరుకుతాయి కాని "పుస్తకేషుచ యావిద్యా పరహస్తేషు యద్ధనమ్" అన్న లోకోక్తికి వుదాహరణంగానే వుంటుంది గాని పాండిత్యం అప్పటి పాండిత్యంవంటి దిగా యెక్కడోగాని వుండదు.

— మిత్రుని గుట్టు —

ఆ శతకాన్ని రచిస్తూ "తానూ వక మనిషే దిష్టమూ వక వాక్కే" అనే లోకోక్తికి ప్రత్యమోదాహరణంగా నేను కవి నంటూ నన్నే గర్వంతో విద్యాభ్యాసానికి స్వస్తిచెప్పి యింటిపట్టునే వుంటూవున్న రోజుల్లో అప్పటి కాలంలో "యెవఁడూ నాతో సమానుఁడు లేఁ" డనే గర్వంతో అందరినీ ధిక్కరించే నాపూర్వస్నేహితుఁ డొకనాఁడు వచ్చి నాశతక రచన విన్నాఁడు. విని మఱునాఁడు పదిపద్యాలు నేను పెట్టుకున్న వేంకటేశ్వరా అనే మకుటంతోనే వ్రాసి అది అతని కవిత్వమని నాకు వినిపించాఁడు. నా కేమో రోజుకు మూఁడు నాలుగు పద్యాలకంటే యెక్కువ రచన సాగడం లేదు. నాకుండే అహంభావమేమో సామాన్యస్థితిలో లేదు. వాఁడు యిట్టే వచ్చి పది పద్యాలు చెప్పేటప్పటికి "అన్నా వీఁడు మన మాత్రం కూడా కావ్యాలు చదవలేదాయె యే యింగ్లీషు ముక్కలో తప్ప తెలుఁగు లోనైనా తగినంత ప్రవేశం లేదాయె. రచన చూస్తే పూర్వ కవుల కవిత్వంలా వుందాయె. దీనికి కారణం యేమైవుంటుందని సందేహం మాత్రం కలిగింది గాని కలిగితే మాత్రం చేసేదేమిటి? వాడి ప్రజ్ఞ మనకన్న అధికమయిందే అని మనస్సులో అనుకొని వాణ్ణి అతిక్రమించ డానికి అంటే, పది వాఁడుచెపితే మనం పన్నెండేనా చెప్పాలనే స్పర్ధకి పూనడం తటస్థించింది. తదేక దీక్షగా వాడితో పాటు పద్యసంఖ్య పూరించాను. కాని వాఁడు మర్నాఁడు అంతకంటే యెక్కువగా చెప్పినట్లు కనపఱిచాఁడు. యేమిట్రా? యిది అని దోలాందోళిత మనస్కుణ్ణయి విచారింపవలసి వచ్చింది. అంతట్లో వాఁడిగుట్టు బయలుపడ్డది. యేలాగంటే? వాఁడి పినతండ్రి అల్లుఁడొకఁడు నాదగ్గిరకి రఘువంశ పాఠానికి వచ్చేవాఁడు. ఆ విద్యార్థి రఘువంశంలో అప్పటికి చాలాకాలం నాఁడు అచ్చైన వక శతకం వుంది. అది యాదృచ్ఛికంగా నేను చూచాను. దానిలో మకుటం మాత్రం భేదంగా నాస్నేహితుఁడు నాకు వినిపిస్తూవున్న పద్యాలు కనపడ్డాయి. అనుమానం తట్టడం తోటట్టుగానే బాగా పరిశీలించి చూచాను. ఆశతకం జానకీపతి శతకం. నామిత్రుఁడు జానకీపతీ అనే మకు

టాన్ని "వేంకటేశ్వరా" అని మార్చి యేరోజు కారోజు నాకంటే యెక్కువగా పద్యాలు వ్రాసినట్టు కనపడిచేవాఁడని స్పష్టమయింది. సరే యీసంగతి వాఁడికి స్పష్టంచేసి శృంగభంగం కలిగిద్దామని చెప్పి ఆ శత కాన్ని నాదగ్గిరే ఆనాఁటికి అట్టేపెట్టుకొని ఆవిద్యార్థికి పాఠం మాత్రిం చెప్పి పంపించివేశాఁను. మళ్లా మర్నాఁడు మిత్రుఁడు కొంత సంఖ్య హెచ్చుగా వుండేటట్టు పద్యాలు వ్రాసి పట్టుకొచ్చి "నీ వెన్నిపద్యాలు చెప్పా" వంటూ నన్ను ప్రశ్నించాఁడు. వాఁడి ఆయువుపట్టు నాకు చిక్కిం దని వాఁడు లేశమూ యెఱఁగఁడు, నే నన్నాను గదా? "అబ్బాయీ! నాకు ఒక్కపద్యమూకూడా యీ వేళ తోఁచిందే కాదురా? యేమోకాని" అని జవాబు చెప్పి యేవీ? నీపద్యాలూ? అని వాడి స్వదస్తూరీ కాగితం చేత పుచ్చుకొని చదివి కొంతసేపు ఆరచనా సౌష్ఠవాన్ని శ్లాఘించి కొంతసే పైనాక నాదగ్గిఱవున్న శతకం విప్పి ఆపద్యాలన్నీ చదివి వినిపించేటప్ప టికి మిత్రుఁడు తెల్లపోయి నీవు కనుక్కుంటావా? లేదో? అని యీ చమత్కారం చేశా నన్నాఁడు. వాఁడికి కవిత్వంగాని గానంగాని లేశ మున్నా తెలియదు గాని ప్రతీ కవిని బూకరించి నెట్టేసేవాఁడు ప్రతీ గాయకుణ్ణీ "నీవెంత" అంటూ తృణీకరించేవాఁడు. అప్పటి రోజుల్లో అమల్లో వుండే "లోయర్ శకండరీ" పరీక్ష ప్యాసయితే కాలేదు గాని అంతదాఁకా చదివి మానేసిన బాపతులో వాఁడి చర్యలన్నీ "గిరీశం" చర్యలకన్నా పయితరగతిలో వుంటాయి. నన్ను మొట్టమొదట కాశీ ప్రయాణానికి పురికొల్పి విశాఖపట్నం దాఁకా తీసుకు వెళ్ళి అక్కడనుంచి మళ్లా వెనక్కి తీసుకొని వచ్చిన వాఁడు యీమిత్రుఁడే. విద్యావిషయం యెట్లావున్నా వీఁడి తెల్వితేటలు బూకరింపులో మిక్కిలీ వర్ణనీయంగా వుంటాయి. మనిషి మంచి తేజస్వి, మొట్టమొదటనుంచీ పట్నవాసం అమలాపురంలో వుండడం, అంతో యింతో యింగ్లీషు స్కూళ్ళో చద వడం, ఆ యీ హేతువులవల్ల మంచిగంధ్రితనం అలవాటు పడింది. నాకూ వాఁడికీ ఆటల్లోతప్ప సంబంధం లేదు.

—• కాశీప్రయాణం •—

అంతో యింతో నేను పండితుల ఉక్రోషంలో మెలగవలసి వాఁడి గోణి నాటకపోయినా వచ్చేది కాదు. కాని కాశీప్రయాణం విషయంలో వాణ్ణినేను ఆమోదించ వలసి వచ్చింది. దేశంలో పలువురు మహాపండితులు వున్నా కాశీ వెళ్లడం యెందుకు వచ్చిందంటే? జవాబు లేదు. పుట్టినవుద్దేశాన్ని యిక్కడ వ్రాస్తే చదువరులు గేలిచేస్తారు కూడాను. అందుచేత రాయలేను. పన్నెండు సంవత్సరాలు యేకదీక్షగా కాశీలోవుండి వ్యాకరణం చదివి యీదేశంలో వుండేపండితులందరినీ వోడించాలనే వుద్దేశం నాకూ అంతో యింతో వుండేది. దాన్ని మిత్రుఁడు మరింత బల పరిచేవాఁడు కూడా దొరికాఁడు. వ్యాకరణం చదవడానికి కుతూహలం కలగడం వగయిరా అన్యత్ర వ్రాసే వున్నాను.

“శ్రీమదఖండ” అనేచోట యెవరోవకరు అడిగేటప్పటికి జవాబు చెప్పలేక మెమ్మెమ్మె తెత్తెత్తె అని తెల్లపోవడంవల్ల అట్టివుద్దేశం కలిగింది. అప్పుడు మనస్సులో అనుకొన్నదే యీ పద్యం. దీన్ని యిదివఱకెక్కడా ప్రచురించినట్లు జ్ఞాపకం లేదు. యిక్కడ వుదాహరిస్తాను.

క. వ్యాకరణశాస్త్రమందున
నాకుం బ్రేమయును బుట్టె నయముగ దానిన్
సాకల్యముగా జేయుమి
ప్రాకటముగ మ్రొక్కుచుంటి భార్గవరామా.

భార్గవరాముఁడికీ వ్యాకరణశాస్త్రానికీ సంబంధమేమిటని చదువరులు శంకిస్తారేమో? యతిస్థానం సరిపోవడమే కాని అంతకన్న మరోచుట్టరికం లేదని వారికి జవాబు. ఆమిత్రుఁడు ప్రోత్సహించకపోయినా నేను కాశీప్రయాణం చేయవలసినవాణ్ణే కాని అతని తోడ్పాటుండడంచేత మరీ తొందరగా బయలుదేఱడం తటస్థించడమే కాక అప్పటికి కృతకృత్యత్వం లేకపోవడంకూడా ఘటించింది. యీమిత్రుఁడే నాకు చామర్లకోటలో

మాధుకరం యెత్తుకోవడాన్ని నేర్పిన గురువు. కాశీప్రయాణం చేయడానికి యిల్లు బయలుదేరి నడుస్తూవున్నప్పుడు త్రోవలో ఆమిత్రుఁడు చెప్పేమాటలు యెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. చదువరుల వినోదార్థం కొంచెం వుదాహరిస్తాను. మనమిద్దఱమూ పన్నెండేళ్లు కాశీలో వుండి గొప్పపండితులమై దేశానికి వచ్చేముందు ఫలానా అప్పటికి వస్తున్నామని వుత్తరం వ్రాస్తే మనవాళ్లు ఫలానాఫలానా భోగంమేళాలూ ఫలానాఫలానా డోలు సన్నాయిలూ తీసుకువచ్చి మహోత్సవంతో వూరేగిస్తారనిన్నీ ఆ మఱునాఁడో మూఁడోనాఁడో పెద్ద పండితసభ జరుగుతుం దనిన్నీ అందులో ఫలానా ఫలానా పండితులని మనం జయించవలసి వుంటుందనిన్నీ యేమేమో మిత్రుఁడు "పెట్టఁబోయే బచ్చలిపాఁదుకు కొనఁబోయే గేదె తినిపోయింది" అనే మాదిరిగా కబుర్లు చెపుతూవుంటే ఆ మాటలయందు నాకయితే విశ్వాసం పుట్టేది కాదు కాని యేమైనా "శ్రేయసి కేన తృప్యతే" కనక మఱింత తొందరగా నడక సాఁగేది. విద్యలోతప్ప అన్నిటిలోనూ మిత్రుఁడు నాకన్న చాలా హెచ్చు. చామర్లకోటలో నన్ను దిగఁబెట్టి మిత్రుఁడు మళ్లా రాలేదని జీవితచరిత్రలో వ్రాసేవున్నాను. చామర్లకోటలో వుండేరోజుల్లో విద్యాకృషితప్ప కవిత్వకృషిగాని రచనగాని కొంచెంకూడా జరిగినట్లు జ్ఞాపకం లేదు. ఆ గురువుగారున్నూ కవులు కారు. విశ్వనిఘంటు వ్రాఁతప్రతి దొరికేటప్పటికి దాన్ని కొంతవఱకు వ్రాశాను. అమరం కొండన్నఱ కాఁబోలును మధూకరం యెత్తుకోవడానికి బయలుదేఱేటప్పుడు వల్లించేవాణ్ణి. మొత్తం నా అనుభవాన్నిబట్టి చూస్తే విద్యా సంపాదనకు మాధూకరం చేసినంత సహాయం యేదీ చేయదని య్యేవే. నేను చామర్లకోటలో విద్యార్థిగా వున్నది మూఁడు మాసాలు మాత్రమే. జరిగినవిద్య అవమం మూఁడేళ్లైనా అయితేకాని అంతకావడం దుర్ఘటంఅని నాకు తోఁచింది. విద్యార్థిని నామనస్సులో వరి మొదలైన నారుగా పోల్చుకుంటాను. ఆనారు మిసమిసమంటూ ఆకుమడిలో మొదలు పెరుగుతుంది. దాన్ని చేలో వూడ్చడం వచ్చినప్పుడు ఆ మిసమిసంతా

తగ్గి యెంతో దీనస్థితిగా వున్నట్టు పుష్యకాలంలో కనబడుతుంది. అంతట్లో వేప నాటుకుని మళ్ళా మొదట వుండే మినుమినుకన్నా మిన్నగా శోభ కలుగుతుంది. యెన్నో చిలవలూ పలవలూ పెట్టి పెద గింజను మొలకో అడ్డేదో గింజలుగా ఫలిస్తుంది. విద్యార్థికీ తీరూదా యీలాటిపనానే జరిగితే అది సర్వవిధాలా అభినందనీయంగా వుంటుందని నేను అనుకుంటూ వుంటాను. అంతేనేకాని యేహోటల్లోనో యేహాస్టల్లోనో భోంచేస్తూ టయిముప్రకారం స్కూలుకు హాజరవుతూ చదువుకునే చదువులు లేకపో లేవు గాని ఆ విద్యార్థులలో యెవరికో నూటి నాట కలిగితే చెప్పలేము గాని సర్వే సర్వత్రా కష్టసుఖాలు తెలియడం వుత్తకాపేక్షే. వినయవిధేయ తలున్నూ అలవాటు పడవు. యిది నా యనుభవం సుమండీ. మరొకరి అనుభవంలో మరోలాగు వుంటే వుండనియ్యండి. దాన్ని నేను కాదనే వాణ్ణి కాను. నేను వ్రాసింది మన వేదశాస్త్రములను గూర్చియ్యేనే. యిది విషయాంతరం.

చామర్లకోట విద్యార్థిత్వంలో కూడా కవిత్వాన్నిగూర్చి కృషిచేసి నట్లు లేదు గాని ప్రతీ అనధ్యాయానికీ స్వగ్రామం యానాం వెళ్ళి నాలుగు రోజులు అక్కడ వుండి మా ముత్తాత తాటాకులలో వ్రాసిన పుస్తకాలు కాగితాల మీఁద వ్రాయడమనే చేదస్తంవల్ల చాలావఱకు మాతృభాషా జ్ఞానం వృద్ధిపొందడం జరిగింది. అంతట్లో కంటిజబ్బు వుదిరీ అవడమూ ఆకారణంచేత ఆవూరి చదువుకు స్వస్తిచెప్పడమూ పిమ్మట కంటివైద్యా నికి పాలకొల్లు ప్రాంతంలో వుండే చింతపఱ్ఱుగ్రామానికి వెళ్ళడమూ తట స్థించింది. ఆవూళ్ళో నేను బసచేసినవారియింట్లో మెట్రిక్యులేషన్ టెక్స్టు తెలుఁగుబుక్కు వకటి అప్పటికి కొంతపూర్వపుది దొరికింది. అందులో తెనాలి రామలింగంగారి పాండురంగమహాత్మ్యం ప్రథమాశ్వాసం వుంది. దాన్నిన్నీ దానితోపాటుగా వీరేశలింగం పంతులుగారి రసికజనమనోరంజ నాన్నీ తఱుచు చూడడంవల్ల కొంతభాషాజ్ఞానం వృద్ధిపొందింది. అంతే కాకుండా ఆబసయింటి యజమాని ప్రతినిత్యమూ అధ్యాత్మరామాయణం

పారాయణచేయడం వుండేది. ఆ సందర్భంలో దానికి నన్ను అర్థం చెప్ప వలసిందని కోరడం తటస్థించింది. అప్పట్లో నన్నుమించిన పండితులు లేకపోవడంచేత "సాతానిః పండితాయతే" కనక ధయిడ్దంవిడిచి అర్థం చెపుతూ వుండేవాణ్ణి. రేపు అర్థంచెప్పేభాగాన్ని యీవేళే చూచుకొని సమన్వయం చేసుకొనేవాణ్ణి. పయిగా తెలుఁగు భారతంకూడా యెప్పుడేనా గ్రామస్థులు కోరితే పురాణం చెప్పడంకూడా వుండేది. దీనాదానా సంస్కృతంలోకూడా కొంతపాండిత్యం ఆరోజుల్లో వృద్ధిచెందింది. కవిత్వం మాత్రం అంతకుముందు రచించడానికి మొదలుపెట్టిన వేంకటేశ్వరశతకంలో యేకొంచెమో పద్యాలు నేత్రవ్యాధికి సంబంధించినబాధను తెల్పేవి తప్ప యితరవిషయమేమీ వ్రాసినట్లు లేదు. నా కవిత్వానికి నాచరిత్రకూ మొదటినుంచీ సంబంధం వుండేది. యీస్థితిలో కునికిపాట్లు పడుతూవున్న కవిత్వం యిటీవల శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారి శుశ్రూషకు ప్రవేశించాక కొంత అభివృద్ధికి వచ్చింది. దానిక్కారణం ఆ గురువుగారు కవులయి అభివృద్ధి పఱచటం వల్లనని అనుకోవడానికి వల్లకాదు. వారు సుతరామున్నూ కవులు కారు సరిగదా, కవులంటే అంతగా గౌరవంకూడా కలవారు కారు. ఆ పక్షంలో యేలా అభివృద్ధి చెందవలసివచ్చిందంటే ? వారి దగ్గిఱికి పలుచోట్లనుంచి పలుమందివిద్యార్థులు వచ్చివున్నారు. అందులో అంతో యింతో అల్లిక చేతనైనవాణ్ణి నేను మాత్రమే. నన్నుచూచి తక్కినవాళ్ళు అసహనబుద్ధిచేత నాకవిత్వాన్ని ఆక్షేపిస్తూ వుండేవాళ్ళు. అవునని నేనూ, కాదని వాళ్ళూ వాదించుకోవడమూ వొక్కొక్కప్పుడు జుట్టూజుట్టూ పట్టుకు కొట్టుకోవడందాఁకా కూడా రావడమూ జరుగుతూ వుండేది. యీసందర్భంలో విశేషించి రచన యేమీ జరగలేదు గాని, శంకా సమాధానాల విషయం కొంత అభ్యస్తమయి రగడుదేఱినట్లయింది. తెలుఁగులో అప్పటికి వున్నధార యిప్పుడు పరిశీలించి చూస్తే పరిపక్వస్థితిలోవున్న కవిత్వధారలాగే కనపడుతుంది. చూడండీ అప్పటి కవిత్వంబాపతు వకపీఠచరణం యిక్కడ మచ్చు చూపుతాను.

సీ. శ్రీసుధాంశుని౯ బోల్పఁగా సరియౌ సుధాం
శుఁడు దాఁ గళంకితా కాన్పుఁడేమి.

యీ జన్మలో అప్పటికి చేసినకృషి విశేషించి లేకపోయినా కృష్ణ మావిరిగానే రచన సాక్ష్య మివ్వడంచేత పూర్వజన్మసంబంధమైన కృషి యేమాత్రమో తోడ్పడినట్టు నేనిప్పుడు నిర్ధారణచేసి వ్రాస్తున్నాను. యీస్థితిలో తెలుఁగుధార వుండఁగా "మనం సంస్కృతకవుల ననుసరించు కోవాలి గాని తెలుఁగుకవుల ననుసరించుకోకూడదు" అనే దురభిమానం వకటి పూర్తిగా వుదయించింది. అంతతో తెలుఁగుమానేసి సంస్కృతంలో రచనకు ప్రారంభించి వక వీథీరూపకం కొంతవఱకు రచించడం జరిగింది. అదితెలుఁగులో శ్రీనాథుఁడు వ్రాసిన దని చెప్పుకొనేదాన్ని పట్టి రచించి నదే కాని సంస్కృతంలో వున్న వీథీరూపకాన్ని పట్టి రచించిందికాదు. ప్రతాపరుద్రీయంలో భాణంలాగే అంగాలరచన వుంటుం దని చెప్పి లక్ష్యానికి మాధవవీధ్యాదికం చూచుకోవలసిం దనిమాత్రమే చెప్పడంచేతనున్నూ ఆమాధవవీథి అప్పుడే కాదు, యిప్పుడున్నూ ప్రచారంలో లేకపోవడంచేత వుపలబ్ధం కాకపోవడంచేతనున్నూ ఆ రచన యుక్తంగా వుందో లేదో అని యిప్పటికిన్నీ పుస్తకాపేక్షగానే వుండడంచేత దానిరచిన పూర్తిఅయి చాలా కాలమైనప్పటికీ దాన్ని మేము ప్రకటించనేలేదు. కవికి లక్షణజ్ఞానం వుండడం ఆవశ్యకమేకాని లక్ష్యజ్ఞానంలేని లక్షణజ్ఞానం అంతగా పనిచేయదని పండితు లందఱూ యేకవాక్యతగా అంగీకరించేదే కనక దాన్నిగూర్చి యిక్కడ విస్తరించవలసివుండదు. యింకా లక్ష్యజ్ఞానం మాత్రంవుండి రచనకి దిగితే దిగ వచ్చునేమో కాని లక్ష్యజ్ఞానం లేక లక్షణజ్ఞానం మాత్రమే వుండి రచనకి దిగేటట్టయితే అది అస్తవ్యస్తం కాక తప్పదు. యిప్పటి కవులలో అనేకులు లక్ష్యజ్ఞానం మాత్రమే వున్నవారేను. కాని అలాంటివారు వాదోపవాదాలూ విమర్శనాలూ అంటూ మాత్రం పెట్టుకోవడం అపహాస్యాస్పదత్వానికి కారణ మవుతుంది కనక వారు రచనతో మాత్రం తృప్తిపడి లక్షణ

జ్ఞానం చేత దోషాన్ని సవిమర్శక సాధనాలద్వారా తీర్చుకుంటూ కాలం గడ పడం యుక్తంగా వుంటుంది. యిది విషయాంతరం.

## — బంధకవిత్వం —

శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులవారి శుశ్రూష ప్రారంభించిన కొద్దిరోజులలో నాకు తెలుఁగంటే అనాదరమున్నూ, సంస్కృతమంటే అత్యాదరమున్నూ కలిగి క్రమంగా సంస్కృతంలో మాత్రమే కవిత్వం చెప్పడం తటస్థించింది. కాని అప్పుడప్పుడు అనాధ్యాయాలల్లో పుస్తకాల సంపాదనకుగా యేలూరు వగయిరా పట్నాలకు యాచనకు వెళ్ళినపుడు తెలుగు కవిత్వం చెపితే తప్ప ఆయా సంపన్నగృహస్థులు ఆదరించరు గనుక అది కూడా అప్పుడప్పుడు చెప్పడం వుండేది. ఆ చెప్పడంలో తఱుచు బంధకవిత్వం చెప్పేవాళ్ళం. దాని క్కారణం శ్రీ పన్నాల బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారి శిష్యు లిద్దఱు మాకంటె కొంచెం వయోధికులు యాచనకు బయలుదేఱి యీ బంధకవిత్వంవల్ల సంపాదించడాన్ని చూడడమే. ఆ బంధకవిత్వమేనా అంత చిక్కుగా వుండే బంధాలయితే యితరులను సంతోషపెట్టఁజాలవు. రథబంధ మంటూ వకటి ఆకవులు వ్రాసింది చూచి అదేమాదిరిని మేమున్నూ మొదలెట్టాము. రథంమాదిరిగా గీట్లతో గళ్ళు కొన్ని గీసి ఆ గీట్లు సీసపద్యంతాలూకు అక్షరాలతో నింపడమున్నూ మధ్యగదిలో అవతలి గృహస్థును మేమేపుస్తకం కోరుతామో ఆపుస్తకం పేరుతో సహా మాకోరికను తెల్పే వాక్యం వచ్చేటట్టు వ్రాయడమున్నూ మొత్తం పద్యంలో దేవుని వర్ణనతో ఆగృహస్థుకు ఆశీర్వచనం వుండడమున్నూ ఆబంధకవిత్వంలో ఉండే విశేషం. మొత్తం కొంత చిక్కుతో చేరిన కవిత్వ మవడంచేత రచనకైతే యేమి ఆబంధాన్ని ఆయా రంగుల పెన్సిళ్ళతో చక్కఁగా వ్రాసి తయారు చేయడానికైతే యేమి స్నానసంధ్యాద్యనుష్ఠానాలు ముగించుకొని కూర్చుంటే మధ్యాహ్న భోజనం వేళదాఁకా దానికి సరిపోయేది. మధ్యాహ్నం ఆగృహస్థుని చూడడం వినిపించడమూ ఆయనచే సత్కరింపఁబడడమూ జరిగేది.

అట్టహాసం అంతా చూచిన గృహస్థు అధమం నాలుగింటికి తక్కువ యివ్వడం వుండేది కాదు. ఆకాలంకూడా యీకాలంవంటిది కాదు. కొందఱు గృహస్థులు యేపుస్తకం కావాలని ఆసందర్భంలో సూచించారో ఆపుస్తకం యెంతఖరీదో అంతా యివ్వడంగాని, లేదా తెప్పించి ఆపుస్తకంతోసహా నూతనవస్త్రాదికం సమ్మానించడం కూడా వుండేది. అలాంటి పుస్తకాలింకా నావద్ద నిలవవున్నాయి. ఆపుస్తకాలమీఁద దాతల పేరులు వున్నాయి. అప్పుడు కవులన్నా, పండితులన్నా సర్వే సర్వత్రా గౌరవం విశేషించి వుండేది. అందులోనున్నూ కాశీనుంచి వచ్చిన పండితులంటే చెప్పనే అక్కఱలేదు. జల్లిసీమకు శీతకాలంలో వెళ్ళి 15 రోజులు మకాం చేస్తే ఆ పండితులకు సాలీనా సరిపడ్డ ధాన్యం వసూలుచేసి ఆ పండితుల యింటికి అక్కడ వుండే రాజులు పంపించడమే కాకుండా మళ్లా వారి దర్శనం యెప్పు డవుతుంది మనకని స్వాతివానకి ముత్యపుచిప్పల్లాగ ప్రతీక్షిస్తూ వుండేవారు. ఆ పండితులున్నూ లేనిపోని దురాశలకు లోఁబడక యేదో మాదిరిని గృహకృత్యాన్ని నెఱవేర్చుకుంటూ తమ విద్యను శిష్యులకు వినియోగించడమే వ్రతంగా వర్తించేవారు. యేయింగ్లీషు స్కూల్లోనేనా పండిత పదవికి రావలసిందని ఆ పండితులని యెవరెంత బలవంత పెట్టినా వారు ఆ పదవిని స్వీకరించడం నీచాతినీచంగా భావించి నిరాకరించడమే కాని అంగీకరించడమంటూ వుండేదేకాదు. వొకవేళ యెక్కడేనా స్వీకరించడమంటూ వున్నా ఆ పండితులు ఆ పెద్దపండితుల తరగతికి చెందినవారు కారని తెలుసుకోవలసి వుంటుంది. ఆపెద్దతరగతి విద్వాంసులు యే మహారాజ సంస్థానంలోనేనా వుండాలి; లేదా స్వతంత్రంగా "పంచమేఽహని షష్ఠేవా" అన్నమాదిరిని జీవిస్తూ వుచితంగా విద్యార్థులకు విద్యాదానం చేయడమే పరాకాష్ఠగా జీవితాన్ని సార్థకం చేసుకొనే వారుగానేనా వుండాలి. యింతకు తప్ప పొట్టపోషించుకోవడాని కంటూ భృతకోపాధ్యాయ వృత్తి నవలంబించిన వారిని ఆతరగతిలో వున్నవారిని నేను యెఱుఁగనే యెఱుఁగను. యిది విషయాంతరం.

కథాసందర్భం మాకవిత్వం బంధరచనలో వుందని చెప్పడంవఱకు ఉపకరించింది. ఆరోజుల్లోనే తిర్పతిశాస్త్రుల్లకు కొంత "కావ్యజ్ఞ శిక్షయాభ్యాసః" జరిగినట్టయింది. అర్జన మాత్రం సరిసమానంగానే పంచుకొనేవాళ్లు, యీలా వుండఁగా శ్రీ మాడభూషి వెంకటాచార్ల వార్లు ఏకసంధాగ్రాహులనిన్నీ శతలేఖిన్యవధానులనిన్నీ వినడం తటస్థించింది. తిరపతిశాస్త్రుల్లు నూతనంగా రచన కారంభించడం చేత యింకా అతనికి యీ అవధానం మీఁదికి అపేక్ష ప్రసరించలేదు. కాని అప్పటికప్పుడే కొన్నియేళ్ళనుంచి యేతెలుఁగో రచిస్తూవున్న నాకు అవధానం చేదామనే కుతూహలం ఉదయించింది. యీ విషయం గురువుగారికి తెలిస్తే మర్నాఁడు శాస్త్రపాఠంలో యెక్కడేనా అడిగించి సరిగా చెప్పలేకపోతే దానిక్కారణం కవిత్వకృషిగా భావించి చీవాట్లు పెడతారనే భయంచేత వారికి తెలియకుండానే కొంత రాత్రివరకూ శాస్త్రవ్యాసంగం జరిగినమీఁద సుమారు 20 మంది దాఁకా విద్యార్థులనే కూచోబెట్టి వకటి రెండు సార్లు నేను వాళ్లునాళ్లు కోరిన విషయాలమీఁద పద్యాలూ శ్లోకాలూ చెప్పడం జరిగించాను.

## —• కడియం పండితుఁడు •—

ఆరోజుల్లోనే మాకడియం కాపురస్థులు వకాయన ఏకాంచెమో తెలుఁగు ప్రవేశమున్నూ దానికంటే కూడా మిక్కిలీతక్కువ సంస్కృత ప్రవేశమున్నూ కలిగినవ్యక్తి యేగ్రామంలోనో యెలిమెంటరీస్కూలు మాస్టరుగా వుండి వుండి కవిత్వంలోకి దిగి యీ ఆంధ్రదేశమంతా అల్లకల్లోలపెట్టి అత్యద్భుతమైన సంపాదన చేయడమే కాకుండా దానికి మించిన ఖర్చుకూడా చేయడం వినడఁకూడా తటస్థించింది. ఆయన తన ప్రజ్ఞను యథోచితంగా వినియోగించుకొంటే యేకొంచెమో కవులలో ఆయనకు స్థానం వుండేదేమో కాని అలా వినియోగించక ఉత్ప్రంధలోక్కి దిగి ప్రవర్తించడంచేత ఆరోజుల్లో ప్రతివూళ్ళోనూ యెఱిఁగిన ఆయన పేరు యిప్పుడు చెప్పుకొనేవాళ్ళే కనపడరు. శ్రీమదానంద గజపతి

మహారాజులుంగారి దగ్గర నుంచి పల్లెటూరి చిన్నకాపువాఁడిదాకా ఆయన దర్శించని వ్యక్తి లేదు. ఆయనను అభిమానించక పోయినా మానె సమర్పించని వ్యక్తిన్నీ లేదు. అదేమి జాతకమో? ఆయన సంపాదన గవర్నమెంటు పన్నుకంటే కూడా అధికారంతో వుండేవి. రాత్రి వంటి గంటవేళ కూడా దండించి పుచ్చుకోవడం వుండేవి. వేయిన్నూటపదార్లు నూటపదార్లు పదహారు ఆఱు రూ॥ అని పుచ్చుకోవడంలో ఆయన యేర్పఱిచిన తరగతులు, ఆఖరుది, రూ. ఒకటిరేఫగా వ్రాయవలసి యున్నా యీ చమత్కారంలో దాన్ని గణించకండి. ఆయనకి యిచ్చినవారం దఱూ భయపడి యిచ్చినవారే. కొందఱు యీయనదంతా ధబక్కనిన్నీ యీయన కేమీ రావనిన్నీ ప్రత్యక్షంగా అనికూడా ఆయన యెదుటఁ బడేటప్పటికి యేమీ అనలేక సమ్మానించి పంపినవారున్నూ వున్నారు. వారిలో ఒకరు శ్రీ వీరవ (రావు) వేంకటసూర్యారావు గారు. యీయన మంచి సంస్కృతాంధ్ర సాహిత్యం కలవారు. ఆనాఁటి పండితులలో యీయనవల్ల అంతో యింతో సమ్మానింపఁబడని పండితులు లేరనడంలో అతిశయోక్తి వుండదు.

ఆయన సామాన్యులని గణించేవారు కారు. అట్టి ఆ సంపన్న గృహస్థు విద్వాంసుఁడు. యీయనకి రు 16—0—0 లు యిచ్చి పంపిన పిమ్మట మళ్ళా ఆయనకేమీ రాదని చెపితే యేమనుకోవాలి? ఆ జాతక మహిమ అలాటి దనుకోక తప్పదు. అప్పటి నా నివాసగ్రామం కడియం కాకపోయినా అప్పుడప్పుడు కడియం వెళ్ళడం వుండేది. ప్రత్యక్షంగా ఆయనతో మాట్లాడడం వుండేది. అప్పటికే నేను కవిత్వంలో బాగా చెబుతూ వుండేవాణ్ణి కనక నాతో ఆయన మాట్లాడడంలో "బావా? ప్రబంధ కవిత్వం మీసొమ్ము ఆశుకవిత్వం నాసొమ్ము" అని నేను అక్కడక్కడ చెపుతూవున్నాను. దీనికి నీకంగీకారమా కాదా? అని విలవఁదీసి అడిగేవాఁడు. నేను రెండూకూడా నీసొమ్మే అని అంగీకరించా వని నవ్వుతూ జవాబు చెప్పేవాణ్ణి. ఆయనతో నెలజీతాలు యేర్పరచుకున్నా

పుచ్చుకొనే వేదవేదాంగపండితులు సమర్థులు అథమం పదిమందేనా వుండే వారు. వారందఱూ వేదమున్నూ శాస్త్రాలున్నూ తనవద్దనే చదివినట్టున్నూ యింకా తరవాయి చదువుకొంటూ వున్నట్టున్నూ ఆయనచెప్పడం. అందుకు బదులు చెప్పక వూరుకున్నందుకు వారివారికి జీతం యివ్వడం జరిగేది. రోజూ యెక్కడవున్నప్పటికీ అథమం యేభైమందికేనా పంక్తిని అన్న దానం షడ్రసోపేతంగా జరిగేది. కడియంలో యెప్పుడోకాని వుండేవాడే కాఁడు. వున్నప్పుడు వూళ్ళోవాళ్ళనేనా పిలిచి పంక్తిని పెట్టుకుని కాని భోంచేసేవాఁడు కాఁడు. ఇదంతా నేనేకాదు యెందఱో యెఱిఁగినవాళ్ళు మాప్రాంతంలోనే కాదు ఆంధ్రదేశంలో చాలా ప్రాంతాల్లో యిప్పటికిన్నీ వుంటారు. యెదటివాళ్ళు యేమనుకుంటారో? అనే శంక ఆయన బొత్తిగా యెఱుఁగనే యెఱుఁగడు. యెవరేనా బాగా తనపుట్టుపూర్వోత్తరా లెఱిఁగినవాళ్లు కనఁబడితే వారితో "యేమండోయి! మునుపటి పుల్లయ్యే అనుకుంటూ వున్నారా? యేమిటి, శ్రీ ద్రాక్షారామ మాణిక్యాంబా కటాక్షంవల్ల సమస్తవేదాలూ సమస్త శాస్త్రాలూ వీఁడికి వచ్చేశాయి. యిప్పుడు శంకరభాష్యం ఖండించి మళ్ళా భాష్యం వ్రాస్తూన్నాను. విద్యారణ్యంలో పొరపాట్లు చూపి సవరిస్తూన్నాను అంటూ యేలాటి దిగ్దంతులతోకూడా నిస్సంశయంగా ఆయన మాట్లాడేవాఁడు. ఆ దిగ్దంతులు యేంమాట్లాడు తారు? వెఱ్ఱివాఁడనుకొని ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వూరుకొనేవారు. పైఁగా ఆలాటి పండితులు కనపడడంతోటట్టుగానే పదో యిరవయ్యో తాంబూలంలో పెట్టి వారిని సత్కరించేవాఁడు. దానితోటి వారేమేనా అనఁ దలచుకొన్నా నోరాడేది కాదు. మాణిక్యాంబకంటూ ప్రతీనెలా కొంత సొమ్ము ఆయన యెక్కడున్నా మనియార్డరు చేస్తాఁడని విన్నాను. శాక్తేయుఁడని మాత్రం నాకు నమ్మకం వుంది. కాని యెక్కడా క్రమపద్ధతిగా వుపదేశం పొందినట్టుగాని పునశ్చర్య చేసినట్టుగాని ప్రతీతి లేదు. లేకున్నా ఆపె కటాక్షం అంతో యింతో యీయనకు కలిగిందనే యిప్పటికీ నానమ్మిక. యీయన సంపాదనలో కవిత్వం నామమాత్రంగాని

మాణిక్యాంబికా కుంకుమచేత భయపెట్టడమే ముఖ్యంగా వుండేది. కొండ
జీని యీయన "నీవు మాకివ్వకపోతే యెవరికిస్తావు మావల్ల యెందఱు
పోషింపఁబడుతూ వున్నారో చూడు. అనాదరించి మమ్మల్ని వృథాగా
పంపేశావంటే నిన్ను మాణిక్యాంబ మాడ్చివేస్తుం" దనికూడా భయ
పెట్టేవాఁడని వినడం. యీయన యెక్కడ వచ్చిన ధనం అక్కడే
యుక్తరూపంగా నైతేనేమి అన్యథాగానయితేనేమి ఖర్చుపెట్టడం తప్ప
పైసాకూడా నిలవచేసినట్టు లేదు. ఆకారణంచేతే అనుకుంటాను, ఆ యీ
తెలుఁగు జిల్లాలు అన్నీ ప్రతిపల్లెటూరు దేశీలుగా తిరిగి సంపాదించిన
ద్రవ్యం రెండు మూఁడు లక్షలకు మించి వుండవలసినప్పటికీ తుట్టతుదికా
లానికి పైసకూడా నిలవలేక పోవడం తటస్థించింది.

యీయన వేశ్యలువున్న కొన్ని వూళ్లల్లో "గదప చీరలకు"
బదులుగా గదప గాగరాలు పంచిపెట్టినట్టు కూడా చెప్పుకుంటారు. అది
శక్తి ప్రీతికరమని కూడా అభిప్రాయం కావచ్చును. మండపేటలో
దుగ్గిరాల మాణిక్యం అనే వక వేశ్య (యీమె యిప్పుడున్నూ జీవించి
వుంది. తొంబది వత్సరాలకు మించిన వయస్సులో దారుఢ్యలోపం
కూడా లేదు. యిప్పుడుకూడా భామ వేషం కట్టవలసివస్తే కట్టి విడికిడి
చేస్తుందని వినడం) దగ్గిఱికి యాచ్నకు వెళ్ళినప్పుడు ఆమె రు 20-0-0లు
తాంబూలంలో పెట్టి సత్కరించినట్టున్నూ ఆ తాంబూలం పుచ్చుకొని ఆవే
వేశ్యతో "మణినా వలయం వలయేన మణిః" అనే శ్లోకం యెత్తుకొని
మాణిక్యంచేత కడియం శోభిస్తుంది, కడియంచేత మాణిక్యం శోభిస్తుంది.
కాఁబట్టి నీవు మాగ్రామం కడియంలో వుండవలసిన దానవు మండపేటలో
వున్నావేమి? పద, కడియం వెడదాము. అని చమత్కరించేటప్పటికి
విజ్ఞురాలైన ఆ మాణిక్యం మఱి యిరవైరూపాయీలు తాంబూలంలో పెట్టి
సమర్పించి "అయ్యా! పూర్వంనుంచిన్నీ మావాళ్ళంతా యీగ్రామంలో
లోనే వున్నారు. నన్నుకూడా యిక్కడే వుండడానికి అనుజ్ఞ యిప్పించ
వలసిందని సరసంగా కోరిందనిన్నీ చెప్పుకోవడం (అప్పటికే యీమె

చాలా వృద్ధిరాలు కనక కవిగారి యెడల మతో అపోహను చదువరులు పొ.నకండి) యింపులో యేదేనా కొంత లోకుల కల్పన వున్నా అసలు వలయు పదానికి వున్న అర్థం కడియం కనక దాన్ని బట్టి మాణిక్య పదం కూడా శ్లేషించి యీయన చమత్కరించడం మాత్రం కల్పితం కాదని చదువరులు గ్రహింపవలసి వుంటుంది.

యీయన చిన్నతనంలో ఆంధ్రకావ్యాలు గురుముఖతః అభ్యసించినవాఁడు. అత్యద్భుతమైన ధారణాశక్తి కలవాఁడని యిటీవల యీయన అక్కడక్కడ అవధానాలలో చెప్పిన వ్యస్తాక్షరీ విస్తృతినిఁ బట్టి తెలుసుకోవలసినట్టు కనబడుతుంది. సంస్కృతంలో బొత్తిగా తక్కువ పరిచయం కాని రామశబ్దమే యెఱుఁగడనడానికి వల్లకాదు. యిట్టి స్థితిలో దీనికి తగ్గ వేషంవేసి కథనడిపితే కొంత బాగుండేది. ఆలా కాక వేదాలూ శాస్త్రాలూ వాట్ల భాష్యాలూ వకటేమిటి, అన్నీ నాకు సంపూర్తిగా తెలుసుననడమే కాకుండా ప్రత్యేకించి ఆ యా విద్యలు అన్యత్ర చదువుకొన్నవాళ్ళకు జీతాలిచ్చి నిలిపి వాళ్ళు తనవద్ద చదువుకొనే శిష్యులని ప్రచారం చేయడం వల్ల బొత్తిగా లోకానికి అలుసై యేమీ తెలియనివాఁడని రూఢి పడిపోయింది. కాని యిక్కడ యీయన్ని అనడంకంటె యీయన వెనకాల డబ్బుకక్కుర్తిచే హంగుచేసే పండితుల నంటే బాగంటాను. కవినని అంతకాలం ప్రచారంచేసి నప్పటికి వక్క పద్యం వుదాహరిద్దా మీయన దని యెంత కుతూహలం నాకు వున్నా యీయన పద్యమంటూ లోకంలో లేనేలేదు. దానిక్కారణం లేకపోలేదు. అవధానమని మొదలుపెట్టినా మధ్య యేదో ప్రసంగాంతరం అందుకొని అసలు దానికి స్వస్తిచెప్పడమే తటస్థించేదని వినికి. పైఁగా యింకోవిశేషం. యేదేనా పద్యం చదవడానికి అస్మదాదులవద్ద మొదలెట్టి కొంతనడవనిచ్చి అపద్యాన్ని ఆపద్యాన్ని యెవరో యింకోపద్యంలోకి మార్చమన్నారని చెప్పి మళ్ళా దాన్ని అమార్చిన పద్యంగా అందుకుని కొంత నడవనిచ్చి మళ్ళా అదేమాదిరిగా యెవరో యింకో పద్యంగా మార్చ మన్నారని మార్చి అందుకోవడమే

కాని వకటీ పూర్తిగా చదివినట్టు వుండేదే కాదన్నుండవలెను నేను స్వయంగా చూచిన విషయమే. మావూళ్లో అంతా వేళాకోళం చేసేవాళ్లు కాని నేనెప్పుడూ వేళాకోళం చేసేవాణ్ణి కాను. ప్రత్యక్షంలో నాపట్ల యెప్పుడూ అంతగా విజృంభించినట్టు లేదుగాని పరోక్షంలో ఆయన మమ్మల్ని తృణీకరించేవాఁడని వినడం. ఏవా? అత్యాశుకవిత్వం నా సొమ్మనిన్నీ శాస్త్రీయాశుకవిత్వం తిరుపతివేంకటేశ్వరుల సొమ్మనిన్నీ నేను చెప్తూ వున్నాను. దీనికి ఏకు సమ్మతమా! కాదా! అని అడగడంమాత్రం వుండేదనిన్నీ ఉభయం నీసొమ్మే అని నేననేవాణ్ణనిన్నీ వ్రాసే వున్నాను. యీ సంభాషణ నాఁటి కప్పుడే మేం కూడా కొంత దేశాటనం చేసి చాలా చోట్ల అవధానాలు చేసివున్నాం. యీయన మాకంటే వయస్సులో యెంతో పెద్దలు కారు, సుమారు పదేళ్లు కావచ్చు. మొట్టమొదట యింకా మేము సభలలో అవధానాలు చేయక పూర్వం యీయన ప్రసక్తి వినడం వుండేది. ఆవినడం కొంత మాకు అవధానాదికానికి ప్రోత్సాహం కలిగించింది. యీయన్ని గురించి చాలా సంగతులు ఆశ్చర్యకరంగా వుండేవి వ్రాయవలసినవైతే వున్నాయి కాని అందుకోసంగా యీ వ్యాసం వుద్దేశించలేదు.

యీలాటి ధైర్యశాలి, యీలాటి సంపాదకుడు, యీలాటి దాబు దర్పంకలవాఁడు, యీలాటి దాత కవులలోనేకాదు; పండితులలోనేకాదు; వున్నట్టు నేనెక్కడా చదవలేదు. అన్నిటికంటే పెద్దగుణం యెవరేమనుకుంటారో? అన్న సందేహం లేకపోవడం. అది లేకపోవడాన్ని కొందఱు లజ్జాశూన్యత్వంగా భావించి "లజ్జామేకాం పరిత్యజ్య త్రిలోకీ విజయీ భవేత్" అనేదానికింద జమకడతారు గాని అలాటి తరగతిలో చేరికూడా వక దశకు దశ అవిచ్ఛిన్నంగా ద్రవ్యసంపాదన చేసి యెక్కడా పరాభవమంటూ లేకుండా నెగ్గించుకొని రావడంచేత యీయన యందు పరదేవతానుగ్రహం పూర్తిగా వుందనే నేను విశ్వసిస్తున్నాను. పరు లేమనుకుంటారో అని సందేహించనివా లెందరుంటారు. వారికి యీయనకి పలికినట్లు లోకఁ పలికినట్టు లేదు. యీయన పేరిందుదాహరించవలసివున్ననూ

యిందులో నేను వ్రాసిన సంగతులు యథార్థము లైనా, అవి కొన్ని మాట అవమానకరంగా వున్నాయని ఆయన బంధువు లెవరేనా లీగల్ వ్యాపారంలోకి దిగుతారేమో అని వుదాహరించలేదు. నేనట్టి దురుద్దేశంతో వక అక్షరంకూడా వ్రాయలేదు. మొత్తంమీఁద యీయనను మాకవితాభివృద్ధికి తోడ్పడిన సామగ్రిలో చేర్చక తప్పదు. యీయన ప్రవృత్తి మాకు కొంత గురుత్వాన్ని చేసిన దన్నమాటే.

యింకొకటి వ్రాస్తే అందరూ గేలిచేస్తారని మొహఁగిన్ని, వ్రాయకపోతే కొంత దాఁచిపెట్టినట్టవుతుం దేమో అని వ్రాస్తున్నాను. యేరసంలో నేనా కవిత్వాన్నిచెప్పి అంతో యింతో మెప్పించవచ్చునుగాని హాస్యరసంలోనూ శృంగారంలోనూ కవిత్వం చెప్పి మెప్పించడం చాలా కష్టం. హాస్యం మృదువుగా వుండకపోతే సకలాసహ్యంగానూ వుంటుంది. యీ విషయంలో అనుభూతమైన సంగతి వకటి వ్రాస్తున్నాను. మేము గద్వాల ఆత్మకూరు సంస్థానాలకు వెళ్ళే రోజుల్లో అక్కడ కొంత నామరూపాలు కలిగి వుండడంచేత ఆసంస్థానానికి వచ్చిన గాయకులున్నూ గాయనులున్నూ ఆ సంస్థాన విద్వాంసులతోపాటు మమ్మల్నికూడా వచ్చి చూచి మాబసలో వకపూఁట వారివారి విద్యాప్రదర్శనానికి సభ చేయడం వుండేది. అట్టి సందర్భంలో వొక వేశ్య హైదరాబాదుప్రాంతపుది తన చెల్లెండ్రు ఆఱుగురతోనూ వచ్చి వకపూఁట సభలో తనశక్తిని చూపించింది. ఆ సమయంలో మల్బారుప్రాంతాన్నుంచి వచ్చిన ఒక పరిహాసకుడు మాబసలో మాతోపాటు భోంచేస్తూవుండేవాడు ఆసభలో వున్నాఁడు. అతఁడు వేశ్యల పాటకచ్చేరీ అవడంతోటట్టే తన హాస్యాన్ని వినిపించడానికి అవకాశాన్ని కోరి "సరే" అనిపించుకొని ప్రారంభించి సకలరసాభాసున్నూ చేసి, తన చపలత్వాన్ని పూర్తిగా బయటబెట్టి ఆవేశ్యచే పూర్తిగా చీవాట్లు తిని మాకుకూడా తలవంపులకు కారకుఁ డైనాఁడు. "అతఁ డేంచేశాఁడు? యెందుకు చీవాట్లు తిన్నాఁడు" అని ప్రశ్నిస్తే వ్రాయడానికి వీలులేదు. కాఁబట్టి చెప్పే దేమిటంటే, శృంగారరసానికి తోవాసంగా

వుండే హాస్యరసాన్ని సభ్యంగా ప్రదర్శించడ మనేది బహుకష్టం. అది వక్క కాళిదాసుకే చెల్లిందని నేననుకుంటాను. రెండోవాఁడు శూద్రకుఁడు. మృచ్ఛకటిక ప్రకరణం చూస్తే యీ సంగతి తేలుతుంది. మూఁడోవాఁడు దండి. యిది అతని ప్రహసనం చూస్తే తెలుస్తుంది. హాస్యకంటె కూడా శృంగారప్రబంధరచన చాలా కష్టం. యేవో కచకుచాది వర్ణనలు మొదలు పెట్టి వుపమలూ వుత్ప్రేక్షలూ గుప్పినంతట్లో దాన్ని చూచి రసజ్ఞులు సంతోషించరు. ఆయాభావాలు అంతో యింతో వారివారిమనస్సుకు తార్కాణం (టచ్చి) కావాలి. అలా కానిపక్షంలో ఆప్రబంధానికి కొంచెంకూడా లోకంలో ప్రాముఖ్యం కలగదు. అందుచేతే యెప్పుడో పెద్దన్నగారి మనుచరిత్రతోటేన్నీ భట్టుమూర్తి కవిగారి వసుచరిత్రతోటేన్నీ తిమ్మన్న గారి పారిజాతాపహరణంతోటేన్నీ సూరన్నగారి ప్రభావతితోటేన్నీ శృంగార కవిత్వం ఆంధ్రంలో ఆఁగిపోయిందనిన్నీ మళ్లా విజయ విలాసంలో కొంతజీవం వుందనిన్నీ యింకా యే స్వల్పమో యెక్కడేనా ఉందేమో కాని తక్కిన కవులందరూ వొకటేపుంతని పోయినవారే కాని నూతనమార్గంలో కలం నడపే లేదనిన్నీ వీరేశలింగంపంతులవారు వగయిరా యీతాలపు విమర్శకులు రాస్తూ వచ్చారు. వసుచరిత్రలో వక ఆశ్వాసంలో కొంత భాగంమాత్రమే స్త్రీవర్ణన వుపచరిస్తే మా ముత్తాతగారు "అదేమాత్రంగా" వని చెప్పి మూఁడోఆశ్వాసం యావత్తున్నూ స్త్రీవర్ణనతోనే తెల్లవార్చారు.

క. తళతళనై బెళబెళనై
మిలమిలనై మేనికాంతి మిఱుమిట్లు గొనన్
గళ లలుముకొనియె దివ మొక
నెలవున లేజవ్వనంపునిగ్గులు దేఱెన్.

ఈపద్యం అందులో మొదటిది. యింకా యెందఱో యీలాటివారు కవులున్నారు. వారివారి ప్రబంధాలు చాలాభాగం తాటాకులలో మాత్రమే

వ్రాసిన వుండడంచేత కవిత్వరచన ప్రారంభించకపూర్వమే నేను చదవడం తటస్థించింది. ధారణాబలాన్ని భగవంతుఁడు పుట్టుకతోటే అనుగ్రహించి వుండడంవల్ల యేకవి కవిత్వంలోనున్నుంచి యేకవి దేన్ని దొంగిలించాఁడో ఆయాసంగతి సందర్భాలన్నీ హృత్కవిలిగా కౌముదీప్రారంభానికి పూర్వమే నాకు తెలిసివుండేవి. మొత్తం యేకవిత్వం చెప్పినా వకరిని అనుసరించ కుండా చెప్పాలనిన్నీ పెళ్ళిచేసుకోకుండా బ్రహ్మచర్యంలోనే యావజ్జీవమున్నూ కాలం గడపాలనిన్నీ ఆలా గడుపుతూ దేవతాకార్యాలు చేయిస్తూ వుండాలనిన్నీ మనస్సులో అనుకొనేవాణ్ణి. యీవుద్దేశంలో చిగురు వుద్దేశాని క్కారణం యీనాంవద్ద వుండే సీలపల్లిలో ముక్కామల జోగయ్యగారనే ఆయన బ్రహ్మచారిగానే వుండి దేవతాకార్యాలు చేయిస్తూ వుండేవారు, ఆయనదగ్గిఱ నేను వారంరోజులు లోపుగా సంగీత శుశ్రూషకని వుండివున్నాను. కాని నావిద్య మొదటినుంచిన్నీ విఘ్నబాహుళ్యంతో చేరివుండే దవడంచేత దానికి విఘ్నమైతే కలిగిందిగాని యీ భావం మాత్రం ఆ శుశ్రూషవల్ల నాకు వుదయించింది. కాని శాస్త్రాభ్యాసం ప్రారంభించాక పయిభావం క్రమేణా మాఱిపోయింది. యేలా మాఱిందంటే? యేదేనా అగ్రహారంలో ప్రవేశించి విద్యార్థులకు విద్యచెపుతూ కాలం గడపాలని వుండేది, వివాహ విషయం సుతరామూ మానుకోవాలని వుండేది కాదు గాని కాశీలో పది పన్నెండేళ్ళు చదువు కొని వచ్చాక చేసుకుంటే చేసుకుందామని వుండేది. యెంతసేపూ విభూతిధారణమందూ పీర్కావి బట్టలు కట్టుకోవడమందూ యిచ్ఛవుండేది. కాని శృంగారవేషమందు కొంచెంకూడా తాత్పర్యం వుండేదికాదు. (యిప్పుడుకూడా నాకు వైదికవేషమందే అభిలాష మెండు) ఇట్టిస్థితిలో కాశీప్రయాణం పెట్టుకోవడమున్నూ ఆ ప్రయాణముహూర్తం హఠాత్తుగా వివాహముహూర్తంగా మాఱడమున్నూ అన్యత్రా వ్రాసేవున్నాను. పెండ్లిజరిగిన పదిహేనురోజులలో కాశీకి వెళ్ళడం తటస్థించింది. అక్కడ భక్తిపరంగా ఆయాయీ దేవతలను వుద్దేశించినకవిత్వం సంస్కృతంలో కొంతనడిచింది. అదే

కాళికావిస్తోత్రమాల. అప్పటికింకా శృంగారంలో వకపద్యమున్నూ కూడా చెప్పినట్లే లేదు; శృంగారంలో అనుభవమున్నూ లేదు. తిరుపతిశాస్త్రి నాతో కలిసిమెలిసి వుండడం అప్పటికే తటస్థించింది కాని అతనుకూడా యేకవిత్వాన్నీ పట్టుదలగా వ్రాస్తూన్నట్టు లేదు. యేకొంచెమో వ్రాసినా "యెవరికి వారే యమునాతీరే" అనుకోవలసిందేకాని మేము మిశ్రా రచనచేయడం మాత్రం లేదు. కాశీనుంచి నేను ౫-౬ మాసాలలోనే మళ్లా దేశానికిరావడం తటస్థించింది. అలావచ్చాక కోనసీమలో కొన్ని చిన్న చిన్న అవధానాలు చేయడంవల్ల కొంత నాపేరు పయికి వచ్చింది. కాశీ సంతర్పణానంతరం పెళ్లిబాపతు మనుగుడుపు తరవాయి వుండడంచేత దాన్ని తీర్చుకొని వకశిష్యుఁడితోసహా మళ్లా గురువుగారి సాన్నిధ్యానికి చేరుకున్నాను. యీలా చేరుకున్నాక నాతో తిరపతిశాస్త్రికి యెక్కువ అనుబంధం యేర్పడింది. ధాతురత్నాకర మనే పేరుతో రామాయణకథ రచించడానికి ఆరంభం చేశాము. దాని క్కారణం కవిత్వం శాస్త్రాన్ని భంగిస్తుం దని గురువుగారు చీవాట్లు పెట్టడమే. శాస్త్రానికికూడా దోహదంగా వుండేరచనకే మొదలుపెట్టినట్టు చూపి గురువుగారిని సంతోషపెట్టడం జరిగింది కనక పిమ్మట ఈవిషయంలో వారిఅభ్యంతరం వుండేది కాదు. ధాతురత్నాకర రచననాఁటికిఁగాని ఆరచనామధ్యమందే మొదలుపెట్టిన కాశీసహస్ర రచననాఁటికిఁగాని నేను శృంగారం అంటే పుస్తకాల్లో తప్ప యితరత్రి లేశమున్నూ యెఱుఁగను. తిరుపతిశాస్త్రికూడా దీన్నే చెప్పవచ్చును గాని నా అంత శుద్ధశూన్యుఁడు కాఁడేమో? పిమ్మట కాకినాడ వగయిరా అవధానాలు బందరవధానం నాఁటికికూడా శృంగారం పుస్తకాలనుబట్టే యెప్పుడేనా వకపద్యంచెపితే చెప్పడం. బందరు అవధానానంతరం వేంకటగిరి ప్రయాణానికి పూర్వం నాకు శృంగారంలో నాయకుఁడుగా వుండవలసిన ప్రారబ్ధంవఱకూ అయితే ప్రసక్తి తటస్థించింది కాని యింకా అప్పటికి విద్యార్థిత్వం పూర్తిగా వదలకపోవడంచేత నైతేనేమి దైవానుగ్రహంచేతనయితే యేమి దాన్ని నేను నాప్రజ్ఞచేత తప్పించు

కున్నాను. వేంకటగిరిలో వకనాఁడు దోమలబాధచే నిద్దరపట్టనిసమయంలో కాళిదాసు శ్లోకాలకు తెలుఁగుగా రసికానందమనే చిన్నపుస్తకాన్ని రచించడం జరిగిందిగాని అదిన్నీ శృంగారరసానుభవంతో చేరింది కామయితరకవిత్వానువాదంకదా అది. బందరులో వక నాటకకంపెనీవారికోరిక ననుసరించి శృంగారవేదాంతాలకు సంబంధించిన శుకరంభాసంవాదం ఆశువుగానే రచించాముగాని అదిన్నీ పూర్వకవిగ్రంథాల ఆధారంవల్ల తోఁచినరచనే. మనస్సులోమాత్రం నాకు యేపద్యం వ్రాసేటప్పుడుకూడా యిది యేకవికవిత్వప్పంతలో పడుతుందో అనేభయం పూర్తిగా వుండేది. తఱుచు మా ముత్తాతగారి కవిత్వం చదవడంచేత ఆయన కవిత్వపోలికలు స్ఫురిస్తూ వుండేవి. అలాంటి సందర్భంలో తిరుపతి శాస్త్రి దాన్ని పుచ్చుకుంటే తప్పలేదు. అది వారసత్వపు హక్కులోకి చేరుతుందనేవాఁడు కాని నా కదిన్నీ అంగీకారం లేకపోయేది, కాని యెవళ్ళకవిత్వంలోదిన్నీ యేమాత్రమున్నూ తనకవిత్వంలో కలియకుండా చెప్పాలనుకోవడం వట్టి చేదస్త మనేమాట యిటీవల చాలారోజులకు నాకున్నూ తోఁచింది. వేదంలోవాక్యాలు ఋషులకవిత్వంలోనూ ఋషులస్మృతి పురాణాలలో వుండే వాక్యాలు కాళిదాసాదుల కవిత్వాలలోనున్నూ పడడాని క్కారణం యిదియ్యేవే. కవికర్ణరసాయనగ్రంథకర్త యీ రహస్యం తెలిసిన వాఁడు కనుకనే,

"చ. హృదయగతిన్ బురాతనకవీశ్వరు లేఁగని వీథిలేదు నేఁ
 దదనుగతిన్ రచించుకృతి తాత్త్వికులన్ గరఁగించకుండునే?
 మదగజరాజముల్ చనిన మార్గమునన్ గడునింపునింపవే?
 మదగజ రాజయాన మదమంథరబంధురయానమానముల్."

అంటూ వున్నదున్నట్టుగా చెప్పి వున్నాఁడు. ప్రస్తుతవిషయంలో యింత చక్కని సమర్థనాన్ని చెప్పినకవి నే చదివిన గ్రంథాల్లో యెక్కడా కనపడలేదు. పాతీపుదొంగలు యేదేనా కేసులో పట్టుపడ్డప్పుడు అసలు నేను దొంగనేకా నని చెప్పరు. యీ కేసువిషయం నాకు తెలియదని

మాత్రమే చెప్తాను. యిటేదో? ఆమాత్రం అటపైమున్నా అవరేదు. పూర్తిగా దొంగతనాన్ని వప్పుకున్నాఁడు కాని మనం వదలి విచారించాలి. ఆక్షేపకులనోరు కట్టించడానికి "అభ్యుపగమ్యవాదం" వంటిది వేరొకటి లేకపోవడంచేత యితఁడు యీతోవ తొక్కివున్నాఁడు కాని యేదివేనా యేస్వల్పమో యితర కల్పనానుసరణం తగులుతుందిగాని "సొంతంతా వోటు"గా యెవరికిన్నీ వుండదు. "బాణోచ్ఛిష్ట మిదం జగత్" అంటూ బాణుని కవిత్వం కూలంకషంగా సర్వవిషయాలూ స్పృశించి విడిచిందని చెప్పడానికి పనికివచ్చే అభియుక్తోక్తి వకటివుంది. కాని అంతకు పూర్వం వుండేకవుల మార్గాలు కొన్ని అతని కవిత్వంలోనూ వదేవుంటాయి. బుద్ధిపూర్వకంగా దొంగతనం చేసేకవులు కొందఱు లేకపోలేదు గాని "మేము మడిగట్టుకున్నాం" అని యెంతో నియమంగా వర్తించే కవులకుకూడా ఆ నియమం తుదనెగ్గదు. యేదో వకటి తనకల్పనే అని సంతోషిద్దా మనుకుంటూవుంటే దానికి మాతృక యెక్కడో వుండితీరుతుంది. మచ్చుకు వకటి చూపి కొన్నిమాటలు వ్రాస్తాను.

తే. గీ. "యామినీగోపకామిని యాకసం బ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
తఱచి చేర్చిన వెన్నముద్ద యన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క"

యీకల్పన నాస్వంతమే అని నేను వుప్పొంగుతూ వుండేవాణ్ణి. శ్రీవణానందప్రథమముద్రణం దరిమిలాను ద్వితీయముద్రణం జరుగు రోజుల్లో మా తిరపతిశాస్త్రుల్లు దీనికి మాతృక అభినవదండి కేతన్నగారి దశకుమారచరిత్రలో చంపకమాలలో కొంత భేదంగా వుందని చూపించాఁడు. యింతకన్న ఆపద్యం పెద్దదవడంచేత మఱికొన్ని విషయాలు తాత్కాలికాలు యెక్కువవున్నాయి. కాలాన్నిబట్టి అతనిది మేము దొంగిలించినట్టు తేలుతుంది గాని మేమే పూర్వుల మయేయెడల మాపద్యాన్నే

అతఁడు అనుసరించి కొన్నిసంగతులు ఎక్కువగా చేర్చుకొన్నట్టు స్పష్ట పడుతుంది. లక్షణాపరిణయంలో మన్మథోపాలంభంలో—

"శా. రాజీవంబ! యటంచుపై బెడవు తద్రాజీవమున్ జీవమున్
"రా! జాగేల" యటంచు జీవమును గ్రూరంబై వెలింజేయు"

అనేకల్పన మాస్వంతమే అనుకున్నందుకు యిప్పటికి యింకా వ్యాఘాతం కనపడలేదు. యిఁకముందేమవుతుందో? ఆరోగ్యకామేశ్వరీలో

"మ. తమకున్ దగ్గవిదానిఁ గోరుచురు సంతానంబు నెప్పట్లఁ బ్రా
జ్ఞమతుల్ దగ్గెడిదాని నెట్టికుమతుల్ గాంక్షింప రట్లౌట"

అనేపద్యంలోవున్న దగ్గెడి, తగ్గెడి, తగ్గని, దగ్గని. అనే శ్లేష మాస్వంతమే అని చెప్పినా యిబ్బందిలేనట్టుతోస్తుంది. యేమంటే? యిది దగ్గునుగూర్చిన కవిత్వం. యీ విషయంలో యింతవఱకు యేకవీ భగవత్ప్రార్థనచేసి వున్నట్టులేదు. సరే, యిది విషయాంతరం. యీవ్రాఁత కంతకూ ఫలితం. నాకు కవిత్వం సొంతమార్గంలో నడిపించడానికే మొదటినుంచీ కోర్కె వుండేది గాని ఆకోర్కె యావజ్జీవ బ్రహ్మచర్యంలో వుందామనుకొన్నకోర్కె యెంత సాఁగిందో యిదిన్నీ అంతే సాఁగిందని తేలుతుఁది. యిదిన్నీ అవాంతరంగా వచ్చిన విషయమే. ప్రధానం శృంగారరసాన్నిగూర్చి రుచికరంగా కవిత్వం చెప్పి మెప్పించడం దృశ్యాదృశ్య మవిన్నీ అది నాలుగు శతాబ్దాలమధ్య యేకవులకున్నూ ఘటించనే లేదని యిప్పటి విమర్శకులు పలువురు వ్రాస్తూవున్న వ్రాఁత నిరాధారం గాదనిన్నీ అందుకు నాకున్నూ సమ్మతమే అనిన్నీ తేల్చినట్టయింది. నాకు శృంగారప్రబంధం రాదా మని కాని వేఱొకరసంలో ప్రబంధం రాదా మని కాని వూహ యెప్పుడూ లేదుగాని యేదేనా రాయడమంటూ వస్తే "గ్రంథచోరులుగాని కవులుగారు" అనేఆక్షేపణకు పాత్రంగా వుండకుండా వ్రాదా మని మాత్రం వుండేది. శ్రవణానందరచనకు పూర్వం పక్క వేంకటగిరిరాజులమీఁద పద్యాలు తప్ప అవధానకవిత్వమే కాని

యితరకవిత్వం అంధర్గంలో చెప్పినట్టున్నా లేదు. బందరులో ఆరోజుల్లో వచనాలుగానే నాటకాలు ఆదేవారికి కావలసివుండేవి. శాకుంతలం వగైరాలు రెండుమూఁడు ఆ నాటకుల కోరికనుబట్టి వ్రాసియిచ్చాము. దాని వాట్లు కాపీలు జాగ్రత్తపెట్టలేదు. అప్పటికి కంపెనీనాటకాలు "కొత్త కొత్తకొమ్మన్న" అనే సామెతలో వున్నాయి. సుమారు రెండు మాసాలు మేము బందరులో వుండడం తటస్థించింది. ప్రతీ నాటకానికీ మమ్మల్ని ఆహ్వానించి తీసుకువెళ్ళేవారు. ఆ నాటకాలు చూడడంవల్ల కొంతమార్పు మా మనస్సులకు కలిగిందని చెప్పవచ్చు. అంతకు పూర్వం యేకాసిరాగమో తీసేశక్తివున్న నాకు యేకొంచెమో గాలిపాటలోనే అనండి కొంత మార్పు కలిగింది. యిప్పుడు జ్ఞాపకమైతే లేవుగాని కొన్ని గేయాలుకూడా ఆయానాటకులిచ్చినమట్లను అనుసరించి చెప్పినవి వున్నాయి. వకటి వ్రాస్తూ వున్నాను.

"నారాయణా, నారాయణా, నారాయణ॥ శ్రీమ॥ న్నారా॥ నతామరాగ వి,నతాసుతార్చిత ధృతాగ గోపజనతావనా! హతాధిమర్మ దవితాన తిరుపతి కృతీశ వేంకటకృతీశసేవిత॥ నారాయణ."

యింకా దీనిలో చరణాలు వున్నాయి జ్ఞాపకం లేదు. కవిత్వం యావత్తూ తత్సమ పదాలే. యమకంమీఁద పూర్తిగా అభిలాష కనపడుతూ వుందిగదా! అప్పటివఱకు మేము సంస్కృత కవులుగానే వున్నాము. అవధానంలో యెవరేనా అడిగితే తప్పనివిధి కనక తెలుఁగు చెప్పడం వుండేది కాని తెలుఁగుకు సంబంధించిన విశేషాంశాలు సమర్థించ వలసివస్తే చిన్నప్పుడు స్కూల్లో చదివిన వెంకయ్య వ్యాకరణమే కాని యితరాధారం లేకపోవడంచేత ఆ సమర్థనభారం యితరులకు వదలిపెట్టేవాళ్ళం కాని విశేషాంశాల దాఁకా తెలుఁగు కవిత్వంలో రాకుండానే తత్సమ పదాలతోనే చాలాభాగం రచన సాగించే వాళ్ళం. యిప్పుడు యింగ్లీషు స్కూళ్ళల్లో విద్యార్థులకు తెలుఁగు బాగా రాదనుకోవడం యేలాటి గౌరవమో, అప్పుడు మాకున్నూ తెలుఁగు తెలియ దనడం అంతే గౌరవంగా భావించుకొనేవాళ్ళం

కాని భవిష్యత్తులో తెలుఁగు కవులుగా మాత్రమోగం వుండడం చేతో యేమో తెలుఁగు రచన కూడా బాగానే నడిచేది. ఆత్మకూరి సంస్థానపు పండితులతో వాదం వచ్చేవఱకున్నూ తెలుఁగులో విశేషాంశాలను సమర్థించడానికి మేం కృషి చేయనేలేము. శ్రవణానందరచన ఆత్మకూరి వివాదలకు చాలా పూర్వపుదే. దానిలో నూటికి తొంభై పదాలు తెలుఁగే. అలా చెపితే లోకం ఆదరిస్తుం దనికాని తెలుఁగు కవిత్వ మన్నప్పుడు విశేషించి తెలుఁగుపదాలతోనే వుండా లనికాని అనుకొని దాన్ని రచించినట్టు లేదు. పీఠికలో అలాటి వుద్దేశం మాకు వున్నట్టు వకపద్యం—

తే. గీ. "తనకు నాల్గునిఘంటు పదములు"

అనేది, అలాటి అభిప్రాయంతో మేము శ్రవణానందాన్ని రచించినట్టు తెలిపేదివున్నా అది యిటీవల చేర్చింది గాని రచనా కాలం నాఁటిది కాదు. అసలు దాన్ని-ఆ పుస్తకాన్ని రచించాలని మే మనుకొని కాగితం కలమూ పుచ్చుకుని వ్రాసిందిన్నీ కాదు. అది దానంతట అదే మానసిక సృష్టిగా వుద్భవించింది. చిట్టచివర నున్న "మనమా! వద్దిఁక నాదుమాట వినుమా." అనే పద్యాలు మొట్టమొదటి మానసిక సృష్టి. పిమ్మట పద్యాలలో నూటికి తొంభై వఱకూ గద్వాలప్రయాణం వెడుతూ వున్నప్పుడూ అక్కడనుంచి వస్తూవున్నప్పుడూ తోవలో రైలులోనున్నూ యెడ్లబండిలోనున్నూ ప్రయాణం చేస్తూ వున్నప్పుడు తన్మయమైన మనస్సు చేసినసృష్టి బాపతు. అలా దానంతటఅయిన సృష్టిని అవకాశం చిక్కినప్పుడు వకవిడి కాగితంమీఁద వ్రాయడంజరిగేది. అదిగోప్యంగా వుంఁడదగిన విషయంకావడంచేత భద్రంగా యేమాఱుమూలో దాఁచడం జరిగేది. తిరుపతిశాస్త్రి ఆ యీ పద్యాలల్లో మొట్టమొదటి పద్యాలు కొన్ని "మనమా! వద్దిఁక నాదు మాట వినుమా" అనేమకుటం కలవిన్నీ మఱికొన్నిన్నీ చూచాఁడు. చూచి వున్నదున్నట్టుగానే కథాసంవిధానాన్ని యేర్పఱచి ప్రబంధంగా కూరుద్దామని అభిప్రాయ పడ్డాఁడు. తాను గ్రంథకర్తగానున్నూ నేను నాయకుఁడుగానున్నూ వుండే పద్ధతిగా ప్రారంభించాఁడు. వద్దని వివారించాను

గాని మానేటట్టుతోఁచలేదు. విషయమంతా అతఁడు మొదటినుంచిన్నీ ప్రత్యక్షంగాకొంతా పరోక్షంగా కొంతా యెఱిఁగిందే అవడంచేతనున్నూ మానసిక సృష్టి పద్యాలు యెక్కువ రసవత్తరంగా వున్నట్టు అతనికి నమ్మకంచేతనున్నూ "చోరపంచాశత్తు" బీజంగా పెట్టుకొని బిల్హణీయాన్ని వ్రాసినట్టై ప్రచురించి తద్వారా కీర్తిని ఆర్జిద్దామనిన్నీ అతని తలఁపు. ఆ పుస్తకం వల్లవచ్చే ప్రతిష్ఠాప్రతిష్ఠలు నాకు సంఘటిస్తాయి కాని అతనికేమి? అతఁడు బహుసాహసుఁడు, లోకానికి వెఱచేవాఁడు కాఁడు. దూరాలోచనపరుఁడున్నూ కాఁడు. తోఁచినంతపనీ చేసితీఱేవాఁడే కాని ఆఁపితే ఆఁగేవాఁడున్నూ కాడు గాని యే విషయంలోనూ కూడా దీక్షగా పనిచేసే స్వభావం అతనికిలేదు. ఆ కారణం చేత యే స్వల్పంగానో నాయికా నాయక వర్ణన పద్యాలున్నూ, పుర వర్ణన పద్యాలున్నూ మాత్రం వ్రాసి అంతతో మళ్ళా ఆ విషయం మఱచిపోలేదు గానికొంత సుస్తీగా పూరుకున్నాఁడు. కాని వరుసవెంబడిగా కాదు గాని నామానసిక సృష్టి జరుగుతూనే వుంది. అతఁడు ప్రారంభించి యేక కర్తృకంగా ప్రబంధం నిర్మిద్దామన్నందుకు సాక్ష్యమిచ్చేదివకపద్యం మూఁడు చరణాలు మాత్రం జ్ఞప్తిలోవున్నాయి. నాలుగోచరణం అనఁగా రెండోపాదంమాత్రం జ్ఞప్తిలో లేదు. దాన్ని పూర్తియిప్పుడుచేసి యిక్కడ వుదాహరిస్తాను.—

"ఉ. ఏనఁట కావ్యకర్త ! రచియించెడి కబ్బము క్రొత్తదంట ! యెం
తేనియుఁ బేరుమ్రోఁగు జగదేక మహా కవితావధానధీ
శానుఁడు నాయకుండఁట ! రసంబు రసంబులకెల్ల మిన్నయై,
కానుక లీయఁ జాలునఁట ! కబ్బమిదేల రచింప కుందునో ?"

యీపద్యాన్ని బట్టి తిరుపతిశాస్త్రి రచించి నట్టే శ్రవణానందము ప్రచురించడం జరగడానికి మొదట వుద్దేశం కలిగినట్టు విస్పష్టమే కదా ! అలా ప్రచురించినప్పటికీ మానసిక సృష్టి పద్యాలను పునాదిగా పెట్టుకొని రచించినట్టే పీఠికలో వ్రాయ సంకల్పించి వాఁడు. అయితే దీనికి నేను

సమ్మతించినట్టు లేదు. అతని యేకకర్తృకత్వానికి నా కిష్టం లేక పోలేదు. కాని వున్నదున్నట్టుగా పేర్ల వగయిరాలతో ప్రచురిస్తే "సమకాలము వారలు మెచ్చరేకదా!" అనే సందేహమే నాకు పట్టుకుంది. అంతలో అతఁడున్నూ ఆ వుద్యమం వదులుకున్నాఁడు కాని మొట్టమొదట అతఁడు అభిప్రాయ పడ్డట్టే నేను అయిదాశ్వాసాలుగా అతఁడు రచించినట్టే "ఆతని రచనయరా పూరించెన్ సుకవికర్ణ పుటపేయముగన్" అన్నమాదిరిని గ్రంథపూర్తిచేసి రహస్యంగా దాఁచిపెట్టినను, యెవరో ఆప్తులు తప్ప యీగ్రంథం యేలా పుట్టిందో, యెందుకు పుట్టిందో యెఱుఁగనే యెఱుగరు. ఆత్మకూరు వగయిరా సంస్థానాలలో వినిపించడమైతే వుండేది కాని యేదో కల్పితగాథ అన్నట్టుగానే మభ్యపెట్టడం జరిగేది. అసలు పుట్టుపూర్వోత్తరాలన్నీ యెఱిఁగిన పరమమిత్రులు శ్రీవాడ్రేవు వేంకటరత్నం గారు మమ్మల్ని అవధానార్థ మాహ్వానించి సమ్మానించిన పిమ్మట దీన్ని వున్నదున్నట్టుగానే తమకు కృతిగా యివ్వవలసిందని కోరడం తటస్థించింది. తిరుపతిశాస్త్రిగారు సమ్మతించారు. నేను ఆలోచించి మనవిచేస్తానని కొంచెం తాత్సారంలో వుంచాను. అంతట్లో శ్రీనివాసవిలాసం కృతియివ్వడానికి ఆత్మకూరికి వెళ్ళడం తటస్థించింది. అక్కడవున్న రోజుల్లో యీచరిత్రలో వున్న నాయికానాయకుల పేళ్లు వగయిరాలు మార్చి కొంత కథాభాగంలో యితరులకు బాధిస్తాయనే చోట్లు మార్చి యేకకర్తృకత్వం తీసివేసి వుభయకర్తృకంగా అన్నిటితోపాటు దీన్నిన్నీ తయారుచేయడం జరిగింది. ఆమార్పులో అసలుపేర్లకు సంబంధించిన శ్లేషలువున్న పద్యాలుకొన్ని వదిలిపెట్టవలసివచ్చింది. నాయకుఁడు విశిష్టాద్వైతిగా మాఱడమంటూ రావడంచేత "అప్పరమేశ్వరి" యిత్యాదులు బాధిస్తే వాట్లను పాండిత్య బలంవల్ల సమర్థించవలసివచ్చింది. నాయకురాలు వైష్ణవమతస్థురాలుగా మాఱడంవల్ల "అక్కటా! శివశివ వేయిమాట లిఁకఁ జెప్పఁగనేటికి?" అన్నస్థలంలో "శివస్మరణ యుక్తంగా" దనే ఆక్షేపకులను యుక్తిబలం చేతనే మూకీభావాన్ని పొందింపవలసి వచ్చింది. ఆ యీ సమర్థనం

వగయిరాలు స్వాంతబాహ్యీకరణంలో అప్రస్తుతాలు. కవికి సాంఘికత్వం వుండటం ముఖ్యంగా ప్రతివాదివిజయానికే. కవిత్వానికైతే మానసికశక్తి మాత్రమే ముఖ్యం అని నా తాత్పర్యం. మానసికసృష్టిగా బయలుదేరిన శ్రవణానందంలో మెన్నో పద్యాలు యింకా మిగిలేవున్నాయి. ఇటీవల అనఁగా శ్రవణానందం ప్రచురింపఁబడ్డాక నేను బందరు ఉపాధ్యాయత్వానికి ప్రవేశించడానికి వెళ్ళిన రెండుమూఁడు రోజుల్లో శ్రీ పువ్వాడ సీతారామయ్యగారు శ్రవణానందం వంటి ఒక శృంగార ప్రబంధం తనకు కృతిగా రచించిపెట్టవలసిందని కోరడం తటస్థించింది. అతఁడు కొంత మిత్రకోటి లోనివాఁడే కనుక శ్రవణానందం పుట్టిన విధానం చూపిస్తూ కాకపోయినా కొంతకొంత తెలిపి "అది మానసికసృష్టిగాని మాదిరిపనికాదు దానిమాదిరిని కావలసివస్తే యితరులెవరేనా రచింపఁగలరేమో కాని మావల్లకా" దని స్పష్టంగా చెప్పేశాను. ఆమాటవల్ల అతఁడు సంతుష్టిపడక పదేపదే అడిగి మోమోటపెట్టేటప్పటికి గత్యంతరం లేక శ్రవణానందపు మానసికరచనలో పునరుక్తిప్రాయంగా వుండడంచేత దానిలో చేర్చకుండా మిగిల్చిన కొన్ని పద్యాలు పునాదిగా పుచ్చుకొని తక్కినవి క్రొత్తగా రచించి చేర్చి యింకా యితరత్రి మా అనుభూతికి సంబంధించినపద్యాలు కొన్ని తలవిఱుపులుగా మార్చి ఆయనకోరిక బందరులో వుండేరోజుల్లో నెఱవేర్చడం జరిగింది. అదే పాణిగృహీత. శ్రవణానందం తుట్టతుదకు నివృత్తి శృంగారంగా కనవడినప్పటికీ అది ప్రవృత్తి శృంగారంలోకే చేరుతుంది. పాణిగృహీత ప్రవృత్తిశృంగారంగా చాలా భాగం కనపడ్డప్పటికీ మొత్తం ఆలోచించిచూస్తే నివృత్తిశృంగారబోధకమే గాని అన్యంకాదు. యీరెండు పుస్తకాల్లోనూ చేరకుండా వున్న పద్యాలు ఆమానసిక సృష్టిబాపతు యింకా కొన్ని నిలవవున్నాయి. ఆ పద్యాలు యింతవఱకు దేనిలోనూ చేర్చలేదు. ధన ధాన్యాలేనా వదులుకోవడానికి కవికి కష్టంగా తోఁచదు గాని అలాటి పద్యాలు వదలుకోవడానికి యెంతో కష్టంగా కనపడుతుంది. ఆశ్రవణానందాన్నిగూర్చి యెందఱో

కవులూ పండితులూ యెన్నో విధాల ప్రశంసించి వున్నారు. ఆ ప్రశంస అనేది వారివారికి ఆ పుస్తకాన్ని పంపి మేముకోరితే జరిగిందికాదు. ఆపని యీకాలంలో యెవరో తప్ప అందఱూ ఆచరిస్తూ వున్నదే అయినా మా కిష్టంలేదని అన్యత్ర వివరించే వున్నాను. నిర్వ్యాజంగా ఆ పుస్తకాన్ని గూర్చి ప్రశంసించి పంపిన అభినందనపద్యాలు ఆ పుస్తకంలోవున్న అసలుపద్యాలకు అధమం మూఁడు రెట్లేనా వుంటాయి కాని తక్కువ వుండవు. ఒకపద్యం వుదాహరిస్తాను.

> "క. ఒకశ్రీవణానందమ్మున
> నొకపద్యమునందుఁ గల్గునొకపాదమునం
> దొకయక్కరమున కిచ్చిన
> సకలం బగురత్నగర్భ చాలునె? తూఁగన్."

దీన్ని అసూయాపరులు కొందఱు నిన్నమొన్న అసత్కావ్యమంటూ అపవదించడానికి మొదలుపెట్టారు. వా రనలేదు గాని దానితో పాటు పాణిగృహీతకూడా అసత్కావ్యమే అన్నారనుకొని కొన్నిమాటలువ్రాస్తాను. మనుచరిత్రను అసత్కావ్య మన్నవారున్నూ పలువురు కలరు. యెవరో అన్నారో లేదోగాని కాళిదాసుగారి విక్రమోర్వశీయాన్నికూడా అసత్కావ్యాన్ని గానే నేను అపలపించఁగలను. దేవతాత్వంవల్ల "యోషితో బహుసక్తిశ్చ" అనే దుర్యోగం తొలఁగఁజాల దని ఆ ఆక్షేపకులకు గోచరించి వుండదు. యిన్నిమాట లెందుకు? పంచమవేద మని యెందఱో మన్నించే ఆ మహాభారతాన్ని నేను అసత్కావ్యంగా నిరూపిస్తాను. ప్రధాననాయకులైన పాండవులు "కుండా స్స్వయం పాండవాః" అనే తరగతిలో వారేకదా! దేవతలవరా లెన్నివున్నా భర్తగారి ఆజ్ఞవున్నా, "బహుసక్తి" కుంతికి తప్పదుగదా! పైకారణాలవల్ల పరలోకహాని ఆమెకు లేకపోవచ్చునుగాని రసాభాస శృంగారం కాకుండా అవరా లేంచేస్తాయి? శంతను వివాహం కూడా డిటో. ద్రౌపదీపంచభర్తృకత్వం, పైఁగా "మహ్యం షష్ఠోఽపి

రోజులే" యీవర్ణ్యమంతా రసాభాసకిందకే వస్తుంది. యీనాటి కావ
వంలో యిట్టి వెన్నో వున్నాయి. చిత్రాంగిని చూసి చదివాను. సత్యాసత్యా
సత్యాసత్య నిర్ణయం చేయడం చాలా కష్టం. పోనీ వారిని వారించడ
మెందుకు? అసత్యాస్పదమే అని అభ్యసగమ్యవాదాన్ని అనుకున్నారు.
ఆ యీ శృంగారకావ్యరచనవల్ల మోక్షం వస్తుం దని వేరే రాసి; మన
మున్నా వ్రాయరు. పండితులూ పామరులూ యేపుస్తకమైతే తలలో
నాల్కలా వుంటుందో ఆలాటిపుస్తకం రచించిన కవి ధన్యుండనడానికి
వొప్పనివా రుండరు. అదిన్నికాక కొన్నివందల యేళ్ళనుండి బయలుదే
రిన పుస్తకాలెన్నో వుండఁగా దీనికి విశిష్టత్వం వచ్చినట్టు యెందుకో
వ్రాశాను. అట్టిపుస్తకం కవి కలం, కాగితమూ పుచ్చుకొని వ్రాయఁదగ్గ
దిగా వుండ దనిన్నీ, మానసికసృష్టిగా నైతే అట్టివి నానాటికప్పుడు
పుట్టించవచ్చుననిన్నీ నేను అనుకుంటాను. కవిజన్మలో వక్క ప్రబంధం
తప్ప అట్టివి రెండుమూఁడు వాకచేరసంలో బయలుదేఱడంకూడా దృశ్యా
దృశ్యమనే నేనభిప్రాయపడతాను. భిన్నభిన్నరసాలలో బయలుదేఱితే
బయలుదేఱవచ్చును. మొత్తం రసాలు తొమ్మిదని కొందఱూ, పదని
మఱికొందఱూ, కాదు యెనిమిదే అని కొందఱూ వ్రాసి వున్నారు లాక్షణి
కులు. భోజమహారాజు వక్క శృంగారానికే ప్రాధాన్యేనా రసత్వాన్ని
అంగీకరించివున్నాఁడు. రసరాజమైన శృంగారంలో ప్రబంధం రాసి
మెప్పించడానికి పాండిత్యంతోపాటు చాలా అనుభవంకూడా వుండి తీరాలి.
శ్రీవణానంద రచనకు పూర్వం శుకరంభాసంవాదాన్ని ఆంధ్రీకరించాము.
మారచనలలో చాలామంది శ్రీవణానందాన్నే మెచ్చుకుంటారు; దాని
తరువాత బుద్ధచరిత్రను మెచ్చుకుంటారు. యీ రెండిటికన్నా పాణిగృహీత
ప్రౌఢంగావుందని కొందఱంటారు. "లోకో భిన్నరుచిః" సర్వసామా
న్యంగా లోకుల కందఱికీ పరిచయమైనది శ్రీవణానందమే. దాన్ని గవర్న
మెంటుచే ఆంక్షకు గుఱిచేసినా అది యెందఱికో సంధ్యావందనంలా
నోటికే వచ్చును. దానిలో యెక్కడో కొన్నిపద్యాలు తత్సమసమాస

భూయిష్ఠాలుగా వున్నా తెలుఁగుపదాలు నూటికి తొంభైవంతు లుంటాయి. కొన్ని తత్సమపదాలుకూడా అచ్చ తెలుఁగుపదాల కన్నాకూడా సులభంగా అర్థబోధ కలిగిస్తాయి. చూడండీ: బత్తి అనడంకంటే భక్తి అంటేనే అందఱికీ తేలికగా బోధపడుతుంది. అయితే ఆయీవిషయా లన్నీ మన స్సులో పెట్టుకొని శ్రీవణానందరచన మేము చేయలేదు. తోఁచినపద్యా మల్లా వ్రాస్తూవచ్చాము. తుద కదే వక గ్రంథంగా పరిణమించింది. గ్రంథకర్త తాను యెక్కువ ప్రఖ్యాతికి వస్తుందనుకొన్న గ్రంథం ప్రఖ్యాతికి రాకపోవడమున్నూ యేదో వక మాదిరిగా వుందనుకొన్న గ్రంథం విశేషప్రఖ్యాతికి రావడమున్నూ మా అనుభవంలో కనపడుతూ వుంది. శ్రీవణానందం యిందఱు రసజ్ఞులు ఆదరిస్తా రని మే మనుకోనే లేదు. వొకటి మాత్రం వుంది. పూర్వకవులు వాడి వడపోసిన విష యాలు చాలావఱకు వదులుకుంటూ తప్పనివిధిగా గ్రహించవలసివస్తే ఆలాటి సందర్భాల్లో కొత్తపోకడగా పోదామనుకోవడం మాత్రం పూర్తిగా జరిగింది. అదేనా యెక్కడ? మానసికసృష్టి పద్యాలవిషయంలో కాదు. ఋతువర్ణనాదులలోనే; మచ్చు చూపుతాను.

(1) సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయపు వధూ
వరుల వివాహము ల్నెఱపువారు.... ....

(2) సీ. అత్తతోఁ బోరాట మందిపోయినయట్టి
జామాత తనుఁ దానె సఖ్యపడియె.

యిట్టి వింకా వుంటాయి చూచుకోండి. యింకొకరిసహాయం మాకు యింతకు కొంతపూర్వమే జరిగింది. మాకు మొట్టమొదటి రోజుల్లో కవిత్ర యంవారి కవిత్వంకన్నా పోతరాజుగారి కవిత్వమంటే యెక్కువ అభిమానం వుండేది. ఆకవిత్వంముందు భారతకవిత్వం దిగఁదుడుపు అన్నంతగా వుండేది మాభావం. యెఱ్ఱన్నగారి కవిత్వం బొత్తిగా నచ్చేదికాదు. అప్ప టికి మేమింకా తెలుఁగుకవులుగా మాఱలేదుకూడాను. ఆస్థితిలో నెల్లూరు

వెళ్ళినప్పుడు బ్ర॥ శ్రీ॥ గుండు వాసుదేవశాస్త్రుల్లుగారి మేనగోడలు శ్రీ అప్పమాంబగారు మాకు భారతకవిత్వమంటె నాకా ఆదరిస్తూ పరి గంపెడుమాటలు చెప్పింది. అదిమొదలు భారతకవిత్వాన్నికూడా అభి మానించడానికి బుద్ధి తిరిగింది కాని భాగవతకవిత్వమం దున్న అభి మానం అప్పటికీ యిప్పటికీ ఏకరీతిగా నిల్చి పోయింది. అట్టి పోత రాజుగారి మాదిరిగా అంత్యప్రాసనియమంగా కవిత్వం చెప్పడానికి మేం మొదలు పెట్టలేదు. యెందుచేత? అలాగ చెప్పాలేము "పద్యానికి కాయంగల విన్నపాలు" జరిగినా ఆశైలిమాత్రానికే యెవరేనా మాని "గ్రంథచౌర్యాన్ని" ఆపాదిస్తారనే భయంచేతనే. శ్రవణానందం మొదలు కొని యిటీవల రచించిన గ్రంథాల్లో కొన్ని యేవో చిక్కువచ్చి రచించిన దాపతే. దేవీభాగవతాదులు అట్టివి కావు. మొట్టమొదటినుండీ నాజాతకం యేవో యిక్కట్టు వచ్చినట్టు కనపడడమున్నూ ఆయిక్కట్టు తుదకేవో విద్యా సంబంధమైన వుపకారకంగా పరిణమించడమున్నూ జరిగినట్టు యిటీవల సుమారు యేభై యేళ్ళవయస్సులో కనిపెట్టగలిగాను.

"మ. ఒకయిక్కట్టున విద్య వేఱొకట విద్యోద్రేక మింకొక్కటన్
సుకవిత్వంబు మఱొక్కటన్ సుకవితాస్తోకత్వసామగ్రి"

అనేపద్యంలో ఆరోగ్యకామేశ్వరీలో సూత్రప్రాయంగా వివరించాను. వొక్కొక్క వాక్యానికి వ్యాఖ్యానం వ్రాయవలసివస్తే చాలా పెరుగుతుంది. మొదటిమాటకు మాత్రం వ్రాస్తాను, తక్కినవాట్లకు విజ్ఞు లూహించుకోవాలి. "ఒకయిక్కట్టున విద్య" వచ్చిందన్నాను. యేలాగంటే? నేను అప్పటి నివాసగ్రామం యానాంలో వుండి కాపుల పాలెంలో రఘువంశం చదువుకుంటూ వుండఁగా ఆరోజుల్లో యానాం, నీలపల్లి, తాళ్ళరేవు, కోరంగివగయిరా సముద్రప్రాంత గ్రామాల్లో మాత్రమే విశేషించివుండే వ్యాధి వరిబీజం కనపడింది. దానికి యేవో కొన్ని చికిత్సలు చేసి ప్రయోజనం లేకపోఁగా ఆగ్రామాన్ని వదిలి పెడితే పోతుం దని యెవరో సలహా చెప్పడం చేత అలా చేయడానికి యేదోవ్యాజం

దొరకాది కనక విద్యాసంపాదనా వ్యాజంమీఁద పొరుగూళ్ళకు వెళ్ళడం జరిగింది. యెప్పుడయితే యీనాం వదలిపెట్టానో అప్పుడే ఆవ్యాధి మొదలంటా తగ్గడమే గాని క్రమక్రమంగా తగ్గడాని కారంభించి కొన్నియేళ్ళలో విశ్శేషమయింది. ఆవ్యాధంటూ నాకు కనపడని పద్ధతిని నేను యీనాంలోవుండే సహవాసస్థులను వదిలి మదేకపుత్రికులగు తల్లిదండ్రులను వదలి యితరగ్రామాలలో అధ్యయన బ్రహ్మచర్యాలు చేయడానికి కుతూహలపడేవాణ్ణి కానేమో అని అనుకుంటాను. “అదృష్టజాతకులకు అపత్తులుకూడా సంపత్తులుగా పరిణమిస్తా” యంటూ శ్రీవిజయనగరం మహారాజావారి దివాన్ బీజాపురపు కోదండరావు పంతులవారు సుమారు 44 సంవత్సరాలకిందట చెప్పినమాట జ్ఞాపకం వస్తూవుంది. అవి వుదాహరిస్తాను. హైదరాలీ (యితఁడు టిప్పుసుల్తాను తండ్రి) శ్రీమైసూరు సంస్థానంలో దివానుగావున్న పూర్ణయ్యపంతులుగారి యింట పసులకాపరిగా వుండే వాఁడనిన్నీ క్రమంగా అతని అదృష్టరేఖ బయలుపడి కొాలఁదికాలంలో మైసూరుప్రభుత్వమే కాక దక్షిణహిందూస్థానప్రభుత్వ మంతా పాలించేవాడై నట్టున్నూ చెపుతూ, అతఁ డెప్పుడో యుద్ధానికి వెడుతూ వుండఁగా మొట్టమొదటనే అతఁడెక్కినగుఱ్ఱం మోఁకాళ్ళమీఁద మొగ్గతిలఁబడ్డదనిన్నీ దాన్నిచూచి సన్నిధానవర్తులు “మహాప్రభో! అపశకునం జరిగింది కనక యీరోజుకు ప్రయాణం ఆఁపవలసిం” దన్నారనిన్నీ దానిమీఁద హైదరాలీ “నాజన్మం యెత్తింది లగాయతు నేనెన్నఁడూ అపజయం యెఱఁగను కాఁబట్టి యిప్పుడు అపజయం వస్తుందంటే నాకు నమ్మకం కలగడంలేదు. యిదికూడా యేదో లాభానికి సూచకమే కావాలి కనక యిక్కడ తవ్వించూడవలసిం” దన్నాఁడనిన్నీ అలా తవ్వేటప్పటికి అక్కడ బంగారునాణేలతో నింపఁబడ్డ కొన్ని కాఁగులు కనపడ్డాయనిన్నీ అందఱూ దాన్నిచూచి ఆశ్చర్యపడ్డారనిన్నీ శ్రీ కోందండరావుపంతులుగారు చెప్పఁగా విన్నాను. యీలాటి సందర్భాలు కొన్నిచూచే అనుకుంటాను “ముట్టిందల్లా ముత్యమూ పట్టిందల్లా బంగారమూ అయిం” దంటూ వక

సామెతను పెద్దలు వాడుతూవుంటారు. అంతేకాకపోతే వ్యాప్తి విద్యావిష్కృ తానికి రావడానికి మాఱుగా విద్యాసంపాదనహేతువుగా పరిణమించడమేమి టని నేను యిప్పటికీ అనుకుంటూనే వుంటాను. యీ నా అభిప్రాయం లోకాని కెంతవఱకు నచ్చుతుందో కాని నాకు పూర్తిగా గట్టినమ్మక వుండడంచేత వ్రాశాను. శ్రీపదానందవిర్మాణంకూడా యీలాటి యిక్క ట్లలో అనఁగా ఆపత్తులలో ఒకఆపత్తే హేతువుగా బయలుదేరిందని తెలుసుకోవాలి. అందులో ఆపత్తేమి వుందని స్థూలదృష్టులు అనుకోవ చ్చును. ఆసంశయం కలవారికి ఆగ్రంథంలో వున్నపద్యాలెన్నో సంశ యాన్ని నివర్తిస్తాయి కనక యిక్కడ వ్యాఖ్యానంతో పనిలేదు. రసభేదం వున్నప్పటికీ గుంటూరిసీమకూడా యీలాటిదే. తుట్టతుదకు నిన్నమొన్న రచించిన “జయంతి” అనే తెలుఁగుపుస్తకమున్నూ, “క్షమాపణ” మనే సంస్కృత గ్రంథమున్నూ కూడా ఆయీ తరగతిలోకే చేరతాయి. తన్మయత్వం కలిగినప్పుడు గాని నేను కవిత్వం చెప్పలేను. తన్మయత్వా నికి యేదో తగినంతహేతు వుండాలి. ఆహేతువు కలిగినప్పుడు కవిత్వం మానసికసృష్టిగా బయలుదేఱుతుంది. అవధానపద్యాలు తప్ప తక్కిన రచన యావత్తున్నూ నాది మానసికసృష్టే. యిప్పటికి వ్రాసిన సందర్భా లనుబట్టి మేము తెలుఁగుకవులుగా మాఱడం యేలా తటస్థించిందో కొంత వరకు చెప్పినట్టయింది. వేంకటగిరిరాజాగారు మాకు తెలుఁగైతేగాని బాగా బోధపడదని అనడంకూడా తెలుఁగులోకి దిగడాని క్కారణం. తరవాత యే సంస్థానానికి వెళ్ళినా తెలుఁగు పనిచేసినంత సంస్కృతం పనిచేసినట్టు కనఁబడలేదు. కాని సంస్కృతంలో తగినంత ప్రవేశం లేనిపక్షంలో ఆయాపండితుల ముందఱ నోరు మెదల్చడమే తటస్థింపదు. శ్రీపదానంద రచననాఁటికే మాకు చక్కఁగా రచించడానికి తెలుఁగులో శక్తివున్నట్టు లోకమైతే అంగీకరిస్తుందిగాని ఆరచనను సమర్థించడానికి తగ్గంత తెలుఁగు పాండిత్యం వున్నట్టు మామట్టుకు బొత్తిగా నమ్మకం లేదు. దాని క్కారణం “తెలుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది” కావడమే.

ఆక్షేపం మాకోసం పెద్దదిగా యేలామాఱుతుంది? లక్ష్యములమీఁదనే ఆధారపడడం తప్ప తెలుఁగుభాషకు గత్యంతరం కనపడదు. యిట్టిస్థితిలో ఆత్మకూరి సంస్థానంవారికి వారి కోరిక ననుసరించి శ్రీనివాసవిలాసం ఆంధ్రీకరించి కృతిపెట్టవలసి వచ్చింది. దీనికి పూర్వరంగంలో ఆ సంస్థాన విద్వాంసులున్నూ మేమున్నూ పడ్డ తగాయిదాలకు సంబంధించిన పద్యాలు "సందర్శనం" లో చూస్తే తెలుస్తాయి. అట్టిశత్రుమధ్యంలో ఆగ్రంథాన్ని రాజసభలో వినిపించాలి. గజారోహణాదిసమ్మానాలు అసలు సంస్కృత గ్రంథం రచించిన కృష్ణమాచార్లగారితోపాటుగా పొందాలి! అద్వైతులంటే, ఆ సంస్థానాల్లో, అందులో ఆత్మకూరిలో బొత్తిగా గౌరవంలేదు. అట్టి స్థితిలో విభూతిరుద్రాక్షతావళాల కవిత్వం యెంత నిర్దుష్టమైనా తిరుమణి తిరుచూర్ణాలవారు పైకి రానిస్తారా? ప్రతిపదంలోనూ ప్రతీ అక్షరంలోనూ శంకించడమే. అన్నిటికీ నన్నయ్యభట్టుగారి ఆంధ్రశబ్దచింతామణి ద్వారాగా జవాబు రావాలిగాని చిన్నయ్యసూరి వ్యాకరణాన్నికూడా ఆ పండితులు గౌరవింపరు. చింతామణిలోవున్న ఆర్యాశ్లోకాలెన్ని? ఆ కొలఁది శ్లోకాల్లో వున్నవిషయమెంత? తెలుఁగుభాష సంస్కృత భాషకంటె రెట్టింపు విస్తీర్ణం కలదిగాని అల్లాటప్పాది కాదు. "ఆడిగేఁవాడికి చెప్పేవాఁడు లోఁకువ" యిట్టిస్థితిలో యేమీ తోఁచక భారతం పద్ధెన్మిది పర్వాలూ గుఱుతులుపెట్టి ఆయుద్ధానికి సిద్ధపడ్డాము దానితో తెలుఁగులో మాకు సాధించరాని దంటూ లేకేపోయింది.

"అపశబ్దభయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ" అనేది యెందుకు పుట్టినా మాపట్ల అది సార్థక మయింది. "భారతాదులను లేనిపదములు నవసఁగలవే?" వగయిరా మాటలు దేవీభాగవతపీఠికలో వ్రాయడం దానివల్లనే కలిగింది. లేనిపోని శంకలుచేసి పరాభూతు లయ్యేవారి కెవరికిఁగాని భారతప్రయోగరహస్యం తెలియదనక తప్పదు. తెలియక తొందరపడి తరవాత భారతాన్ని దిద్దడాని కుపక్రమిస్తారు. ఆత్మకూరిలో "దేవతలు ధర్మవర్తులు" అనే ప్రయోగాన్ని మే మిస్తే ఆవలివారు

ధర్మపుత్రులు అని దిద్దడానికి వుపక్రమించి పరాభూతులైనారు. యిది విషయాంతరం. తెలుఁగు ప్రయోగరహస్యాలు అర్థాత్తూ మాకు అన్కూరి సంస్థానపండితులు వుపదేశించినట్టయింది. యిటీవల యెవరెవరితో వాదాలు వచ్చినా అప్పుడు సేకరించి వుంచిన ఆయుధసామగ్రిలో యే స్వల్పమో వినియోగిస్తే సరిపోవడమేకాని కొత్తగా ప్రయత్నించడమంటూ లేనేలేదు. పెద్ద పెద్ద జీతాలుతీసుకొన్న వుద్యోగస్థుల పెన్షన్‌లో సగంకూడా వారి వారి సంసారాలు సర్వోచ్ఛగా నడిపించడానికి సమర్థమయినట్టే ఆనాఁడు చేసివుంచిన విలవ మాకవితా సంసారాని కిప్పటికీ యింతా ముందుకీకూడా, సరిపోతుందని నాసమ్మకం. యెక్కడేనా ప్రమాద వశంచేత తప్పు పడ్డప్పుడు యథార్థాన్ని వప్పుకోవడమే నాకు చిన్నప్పటినుంచీ అభ్యాసం. యితరపాండిత్యాలు యెన్నివున్నా యథార్థాన్ని వప్పుకోవడమనే పాండిత్యంతో యేవీ తులఁదూఁగవని నానమ్మకం. ఆలా వొప్పుకోవడం వున్నవారినే ప్రామాణికులని లోకం విశ్వసిస్తుంది. మార్కొండపాటి చతుష్టయమనేపేరుతో నలుగురు మహావైయాకరుణు లుండేవారు. వా రందఱూ మహావిద్వాంసులే అయినా అందులో లక్ష్మీనారాయణశాస్త్రుల్లుగారు ప్రామాణికు లని పేరుపడ్డారు. కారణం యథార్థానికి భిన్నంగా వారెప్పుడున్నూ వాదించేవారు కారు "యేయెండ కాగొడుగు" గా వాదోపవాదాలు చేసేవారియందు యీలోకం గౌరవం చూపకపోవడం విధాయకమే. పరలోకంకూడా గౌరవించదని ప్రతివిద్వాంసుఁడున్నూ కవీనిన్నీ తెలుసుకోవాలి. యేదో శబ్దాన్నిగూర్చి కాని అర్థాన్నిగూర్చికాని మనం అబద్ధమాడితే వచ్చే హానేముంటుంది? యిది ధనమా? ధాన్యమా? దీనివల్ల యెవరికేమపకారం జరుగుతుంది? అనుకోకూడదు. ధనధాన్యాలకన్నా శబ్దార్థాలే ప్రపంచస్థితికి ముఖ్యాధారాలు. శబ్దార్థాలనఁగా, పార్వతీపరమేశ్వరులే. (వాగర్థావివ సంపృక్తౌ) వాట్లనుగూర్చి అపచారం చేయడ మంటే వారినిగూర్చి అపచారం చేయడమే అని తెలుసుకోవాలి. అజ్ఞానకృతమైతే తప్ప యీ అపచారం బుద్ధి

కృతమైతే బొత్తిగా క్షంతవ్యం కాదు. యీనియమాన్ని నేనెంతవఱకు పాటిస్తూవున్నానో కాని నామనస్సులో మాత్రం చిన్నప్పటినుంచీ దీని యందు ఆదరంమెండు. దీన్ని లేశమూకూడా వుల్లంఘించకుండానే ఆశ్మకూరివారి గ్రంథంలో ప్రతిపక్షులుచేసిన ఆక్షేపణలలో వకటీకూడా మిగలకుండా సమర్థించి యేనుఁగునెక్కడం తటస్థించింది. కనకనే దాన్ని పెద్ద గౌరవంగా భావించి మేము "ఏనుఁగు నెక్కినాము" అని వ్రాసుకోవలసి వచ్చిందిగాని యేకోమాదిరిగా యెక్కినయెక్కడమైతే "దోమపోఁగలందే వసియింపవే తఱచు" అన్నమాదిరిగా వుపేక్షించవలసే వచ్చేది కాని అంత విశిష్టత్వం దానికి యితరులమాటాలావుండఁగా మాకే యివ్వడానికి బుద్ధి పుట్టేదికాదేమో? ఆలాటి అల్లాటప్పా యెక్కడాలు తిరుపతిశాస్త్రి జీవితకాలంలో వకమాటున్నూ పిమ్మట యింకోమాటున్నూ జరిగివున్నాయి. వాట్లను యెక్కడా జీవితచరిత్రలో మేము స్పృశింపనేలేదు. యెందుచేత? అందులో విశిష్టత్వం యేమీ లేదుకనక! యెవరో పదిమంది యీలా చేస్తే యీవేళ బాగుంటుం దనుకున్నారు, యెక్కమన్నారు, విధి లేక యెక్క వలసి వచ్చింది. "యెవరిని జయించినందుకు చేసేసమ్మానం అది?" అంటే జవాబులేదుకదా! ఆగ్రంథంలో యెన్నిచోట్ల యేమే ఆక్షేపణలువారు చేశారో యేయే విధంగా మేము ప్రత్యుత్తరం యిచ్చామో అదంతా వివరంగా వ్రాయవలసివస్తే చాలాగ్రంథం పెరుఁగుతుంది. యిక్కడికి నేను కవిత్వానికి మొట్టమొదట యేలా వుపక్రమించానో తరవాత దానికి దోహదాలు యేయేవిధంగా లభించాయో సంగ్రహంగా జ్ఞాపకం వున్నంతలో మాయా, మర్మమూ విడిచి, సిగ్గూ, బిడియమూ విడిచి వకప్రాజ్ఞుఁడైన యేకలవ్యశిష్యునికోరిక ననుసరించి వ్రాయవలసి వ్రాశాను. అయితే దీనికి కావలసిన సామగ్రికై విద్యావిషయంలో తప్ప యితరవిషయాలకు ప్రయత్నం చేయవలసి వుండదు. ఫలానావారు యిలా వ్రాశారు కనక అనే మూఢవిశ్వాసంతో కొందఱు ప్రమాద పడఁగూడదని మళ్ళామళ్ళా వ్రాస్తూవున్నాను. కవికి యితరగురువు లెందఱు వున్నా ప్రధానగురువు ప్రకృతి. అంటే ప్రపంచకమే. అనఁగా, పంపా

రమే. సంసారమంటే? కొందఱు యిల్లూ, వాకిలి, పెండ్లామూ, బిడ్డలూ, గొడ్డూ, గోదా మాత్రమే అనుకుంటారు. కృష్ణా గుంటూరుజిల్లాల్లో సంసారి అనేపేరు వ్యవసాయకునికే రూఢంగా వాడుతూవుంటారు. నేను వ్రాసినసంసారపదం యిప్పటి "మారిటోరియం" ఒల్లవారి రైతు పద నిర్వచనంలాగ ప్రతిప్రాణికిన్నీ వర్తిస్తుంది. యీరహస్యము కవిత్వ రచన కింకా ఆరంభించినట్టు లేదు కనక ప్రతిమనిషికీ వర్తిస్తుంది. ప్రతిమనిషికిన్నీ యేదోవిధమైన సంసారం వుంటుంది. తుట్టతుదకు సన్న్యాసికిన్నీకూడా సంసారం వుంటుంది. "కౌపీన సంరక్షణార్థమయం పటాటోపః" అని వకసన్న్యాసి చెప్పినమాట జ్ఞాపకం తెచ్చుకోండి. అయితే సంసారంలో వుండే కష్టసుఖాలు బాగా అనుభవంలోకి తెచ్చుకొని ఆస్వాద చేశంగా వ్యక్తీకరించే శక్తికలవాఁడే కవి. శబ్దాడంబరం వగయిరాలతో అంత అవసరం లేదు, భావం చక్కఁగా వుండడమే కావలసింది. అనుభవాన్నిగురించి గోవర్ధనాచార్యులవారు—

శ్లో. "ఆస్వాదితదయితాధర సుధారసస్యైవ సూక్తయో మధురాః
అదశిత రసాలముకుళో నకోకిలః కలముదంచయతి."

అని వ్రాశారు. కొంచెం యించుమించుగా తెనాలిరామకృష్ణకవి తట్టాబాజీచేసేవుద్దేశ్యంతో—

"హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతా ఘనతాపహారసం
తతమధురాధరాధరసుధారసధారలు గ్రోలఁగాఁజుమీ."

అని కృష్ణదేవరాయలవారు యేదో సందర్భంలో,

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల కల్గెనో
అతులిత మాధురీమహిమ."

అని హేళగా ప్రశ్నిస్తే చమత్కరించి జవాబు చెప్పాఁడు. యింతమాత్రంచేత ఆ బాపతువాళ్లందఱున్నూ (కవిత్వధార వున్నమీఁదే

అనుకుందాం) శృంగారం చక్కఁగా వ్రాస్తారని సిద్ధాంతం చేయడానికి వీలుపడదు. ఔచిత్యాది పరిశీలకత్వం వగయిరా మఱికొంత సామగ్రి దానికి తోడుపడవలసి వుంటుంది. కాళిదాసు మేఘసందేశం వ్రాశాఁడంటే అందులో యేదో ఆతనికి సంబంధించిన అనుభూతివుందనే కొందఱను కుంటారు. కొన్ని లేనివికూడా ఆపాదించడమున్నూ వుంటుంది. భవభూతి వుత్తరరామచరిత్రనుబట్టి చూస్తే అతఁడు యేకపత్నీవ్రతుఁడని గోచరిస్తుంది.

"సాంసారికేషుచ సుఖేషు వయం రసజ్ఞాః" ఇత్యాదులు పరిశీలించి చూడండి. యిక్కడ సంసారం లోకంలో సర్వసామాన్యంగా అందఱూ అనుకొనే రూఢ విషయమే కాని నే నిదివఱలో వివరించిన యోగరూఢవిషయంకాదు. కవివర్ణించిన విషయాలన్నిటిలోనూ కవికి సంబంధం వుందనుకోవడానికీ వల్లకాదు, లేదనుకోవడానికీ వల్లకాదు. వున్నదాన్నీ వర్ణిస్తాఁడు లేనిదాన్నీ వర్ణిస్తాఁడు. కొన్నివిషయాలకు అంతగా అనుభూతితో పని వుండదు గాని కొన్ని విషయాలకు అనుభవం వుంటేనేకాని, తన్మయత్వంకూడా వుంటేనే కాని రచన రసికాహ్లాదకరంగా వుండదు.

"శ్లో. దేశాటనం పండితమిత్రతాచ
వారాంగనారాజసభాప్రవేశః
అనేక శాస్త్రార్థవిలోకనంచ
చాతుర్యమూలాని భవంతి పంచ."

అంటూ అయిదింటినీ మనపూర్వులైతే చాతుర్యమూలాలుగా వ్రాశారుకాని యింకా కొన్నివుండాలనే నా తలంపు.



# నా సంసారానుభవం

( 15-6-1938 సం॥ర ఆంధ్రపత్రిక వీక్లీ నుండి )

ప్రపంచకంలో యించుమించు సంసారకష్టసుఖాలు అంతో యింత జ్ఞానంతో సంబంధంవున్న మానవులకుమాత్రమే కాక పశుపక్ష్యాదులకున్నూ వుంటాయి. కాని పశుపక్ష్యాదుల సంసారవిషయాలు గణ్యతలోకి రావడం లేదు. మనుష్యులవి మాత్రమే కొంత గణ్యతలోకి వస్తూన్నాయి. అందులో యెక్కువ యోగ్యత గలవారి సంసారకష్టసుఖాలు మార్గప్రదర్శకాలుగ వుండడంచేత అవి పురాణగాథలుగా వుండి లోకాన్ని -తరింపచేసేవిగ భావింపబడుతూ వున్నాయి. అస్మదాది సామాన్యుల సంసార కష్టసుఖాల అట్టివిగా వుండవు. అందుచేత వీట్లవల్ల లోకానికి కలిగే మేలు అంతగాని కొంతగాని వుండ దని వేఱే చెప్పనక్కఱ లేదు. ఆయినప్పటికీ దీన్ని యెందుకు వ్రాస్తూన్నానంటే మాచిరంజీవులు దీనివల్ల నేను యేస్థితినుంగి యేస్థితికిమాఱి యిప్పుడేస్థితిలో వున్నానో తెలుసుకుంటారేమో అనే వుద్దేశం తప్ప మఱివకటి లేదు. అయితే ప్రచురించడం యెందుకంటే జవాబైతే లేదుగాని శిష్యప్రశిష్యులలో కూడా దీన్ని అభినందించేవా రెవరేనా వుంటే వారి కేమాత్రమేనా యిది వుపకరిస్తుం దనే తాత్పర్యం తప్ప అన్యం కాదు.

ప్రతి మనిషికిన్నీ బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యాలు నాలుగు వయస్సులు వుంటాయి. యీ నాలుగింటిలోనూ యేవయస్సేనా నిర్విచారంగా గడిచేది వుంటుండేమో అని యెన్నిసార్లో పరీక్షించి చూచుకుంటూ వచ్చాను, కాని లోకంలో యెవరికేనా అట్టిది వుంటే వుంటుందేమో కాని నాకుమాత్రం పుట్టిబుద్ధెఱిగింది మొదలు యేతత్క్షణ పర్యంతమూ అట్టికాలం కనపడ్డట్టే లేదు. బొత్తిగా తెలియని పసితనంలోమాట చెప్ప లేముగాని కొంచెము "గోణముకట్టుటాది" గా నేను నిర్విచారంగా కాల క్షేపంచేదామనే వూహతోనే వుండేవాణ్ణి. పుట్టిందిమొదలు సుమారు తొమ్మి

దేశ్యాం(సేవకుకూ నా జీవితం పితృపితామహ నివాసమయిన కడియంలో జరిగింది. ఆ వూరు పల్లెటూరు. ఆకాలంలో ఆడుకునే ఆటలు బంతి, చెడుగుడు, గోళీకాయలు కోతికొమ్మచ్చి యీలాటివి వుండేవి.

"బాల స్తావ త్క్రీడాసక్తః" కనక ఆయీ ఆటలతో కాలక్షేపం అందఱితోపాటూ నేనుకూడా చేసేవాణ్ణి. యీ ఆటలలో విచారానికి యేకొంచెమూ అవకాశం లేకపోయినా నాకు గోళీకాయల ఆటవలనకొంత విచారానికి అవకాశం కలుగుతూవచ్చేది. దానిస్వరూపం యేలాటిదంటే దెబ్బకు దమ్మిడీ అనిన్నీ, యేగాని అనిన్నీ డబ్బునిన్నీ ఆకాలంలో పందెం పెట్టి ఆ ఆటలో ఆడడం కూడా వుండేది. అది జూదంవంటిది అవడం చేత వొకప్పుడు గెలుపూ వేఱొకప్పుడు వోడూ తప్పకపోవడంచేత అప్పు డప్పుడు ఋణపడడం తటస్థించేది. దాన్ని తీర్చుకోవలసివస్తే మళ్ళా ఆ ఆటవల్ల తీర్చుకోవలసిందే కాని యింట్లోవాళ్ళు సహాయం చేయరుకదా! అందుచేత "కుంభకోణే కృతంపాపం కుంభకోణే వినశ్యతి"గా తంటాలు పడవలసివచ్చేది. ఆలాతీరడం తటస్థించకపోవడమున్నూ తటస్థించేది. అది మనస్సుకు యెంతో విచారాన్నికలిగించేది.

యీఆటేకాకుండా ఆకాలంలో గవ్వలతో ఆడేది "గుట్టాట" అనే పేరుతో యింకోటి వుండేది. అది యిప్పుడు యేప్రాంతంలోనేనా వుందో, లేక అసలే అంతరించిందో గాని అది నాచిన్నతనంలో మావూళ్ళల్లో ప్రాచుర్యంగా వుండేది. అది పెద్దజూదానికి "యంత్రన్నా" వంటిది. వక పెద్దగవ్వ పైభాగాన్ని బాగా అరగదీసి. ఆకన్నంలో కరఁగినసీసం పోసి దానితో ఆడేది ఆ ఆట. అది వెల్లకిలపడితే గెలుపున్నూ, బోర్లా పడితే వోడున్నూ ఆ ఆటలో తెలుసుకోవలసి వుంటుంది. ఆ కాలంలో గవ్వలు రాగిడబ్బులతోపాటు సర్వత్రా దుకాణదార్లుకూడా పుచ్చుకొనే వారు. డబ్బుకు దమ్మిడీలు నాలుగనిన్నీ, దమ్మిడీకి టోళీలు రెండనిన్నీ వీథిబళ్ళల్లో కుఱ్ఱవాళ్ళకు పంతుళ్ళు మానాలలో చెప్పడం వుండేది. కొన్ని పట్నాలలో వైశ్యులు వారిపిల్లలకు వర్తకసరళి నేర్పడం యీగవ్వల

మారకం ద్వారాగా నేర్పడం చాలామంది యీ మూప్రాంతంవారు యెఱిఁగేవుంటారు. అందులో యేయింటఁ జూచినా బంగారం మూలుగుతూ వుటుంపినే ప్రతిష్ఠకి ప్రసిద్ధస్థానంగా వుండే పాలకొల్లులో వర్తకం నేర్పడం యీ గవ్వల మారకం ద్వారాగానే అని చెప్పుకోవడమే కాకుండా నేను కంటివైద్యం నిమిత్తం పాలకొల్లు సమీపంలోవుండే చింతపఱ్ఱు గ్రామంలో వున్నరోజుల్లో స్వయంగా యీ విషయం చూచినట్టుకూడా జ్ఞాపకం. యిది విషయాంతరం.

చెప్పొచ్చే దేమిటంటే? యీ 'గుట్టాట' ద్వారాగా నైతేనేమి, గోళీకాయలాట ద్వారాగా నైతేనేమి నాకు యేకొన్ని అణాలో గాగ్రామంలో అప్పు యేర్పాటయింది. దీన్ని తీర్చడం యేలాగరా? అని విచారం పట్టుకుంది కాని మళ్లా ఆడడం తప్పేది కాదు. వొకప్పుడు గత ఋణంలో యేకొంతో తీరినా మళ్లా తీరనవానికి రెట్టింపు పెరిఁగేది. యీ ఋణబాధకు తోడు మఱో ఋణబాధ కూడా వుండేది. వక వడ్రంగి కొడుకు నాతో చదువుకునేవాఁడు వుండేవాఁడు. అతఁడిప్ప టికిన్నీ జీవించే వున్నాఁడు. అతఁడికి చిన్నప్పటి నుంచీ కులవృత్తిలో ప్రవేశం వుండేది. అతఁడిచేత నేను చిన్న చిన్న పడవలు చేయించుకోవడం వుండేది. (దానికి యిచ్చే కూలి కూడా స్వార్జితం ద్వారాగానే తీర్చవలసి వుండేది.) ఆ పడవకి చిన్న తెరచాప వగయిరాలు అలంకరించి మావూరి కాలవలో వదిలి పెడితే అది నడేటికి పోవడం వగయిరా చిక్కులు తటస్థించేవి. ఆ సమయంలో నాకు కలిగినంత విచారం యిటీవల యేలాటి సంసారపు చిక్కులలోనూకూడా కలిగినట్టే లేదు. వొకప్పుడు ఆ పడవ మళ్లాదానంతటది వొడ్డుకు రావడం తటస్థించేది. వొకప్పుడు "నదీనాం సాగరో గతిః" అన్నట్టు జరిగేది. దానిమీఁదే కళ్లుపెట్టుకొని, కాలవవొడ్డే వకటి రెండు మైళ్లువెళ్లి అదివొడ్డుకు రాకపోతే యెందఱినో బతిమాలి డబ్బో యేగాణో యిచ్చి తీయించుకోవడం కూడా అప్పుడప్పుడు తటస్థించేది. కానితరుచుగా అలా జరక్క ఆపడవ కాకినాడకాలవ తోవ పట్టేది. మా వూరికి మైలు సుమారులో కాలవ రెండు చీలికలవుతుంది. అంతవఱకే వెళ్ళడానికి, పీలు

గాని తరవాత వెళ్ళడానికి వక కాలవ దాఁటితేనే కాని అవకాశం లేకపోవడం చేత బిట్టిగోక్కుంటూ వెనక్కి రావలసి వచ్చేది. మళ్ళా కొత్తపదవక్తి ప్రియత్నం. దానికి ఋణం. యీలాగు కొంతఋణం అంటే యెంతో కా దనుకోండి. వకరూపాయి లోపుదాఁకా పెరిఁగినట్టు జ్ఞాపకం.

ఆలాటిస్థితిలో వుండఁగానే మా కాఁపురాన్ని మా తండ్రిగారు ఫెర్రించిగ్రామం యానాముకు మార్చారు. మా తండ్రి గారికి అప్పటికి కుటుంబ సంబంధమైన ఋణం సుమారు మూఁడువందల రూపాయీలు వుండేవి. దాని తీరుమానానికి మాకు వున్న మెరకభూమి (జొన్నచేలం) సుమారు పది యెకరాలున్నూ, పల్లం యెకరన్నఱానున్నూ తాకట్టుపెట్టి "శనగలు తిని చెయి కడుక్కున్నట్టు" నిఋణులై మా తండ్రి గారు వదలలేక వదలలేక నివాసగ్రామం కడియాన్నిన్నీ, వ్యవసాయాన్నిన్నీ, వదిలి "భగ్నాః కృషేర్భాగవతా భవంతి" గా రెక్కలమీఁద జీవించడానికి యానాం ప్రవేశించారు గాని ఋణాలు యెగఁబెట్టే వుపాయానికి యానాం ప్రవేశించలేదు. ఆ వీలల్లా ఆ నాఁటి షావుకార్లకే వుండేది. అప్పటి షావుకార్లు చరాస్తితప్ప యెవరో గాని స్థిరాస్తిని సంపాదించేవారు కారు. యేదేనా అవాంతరం వస్తే చట్టన యానాం ప్రవేశించేవారు. స్థిరాస్తిపరులు యానాం ప్రవేశించినా ప్రయోజనం వుండదుకదా! అప్పులవాళ్లు స్థిరాస్తి ద్వారాగా రాఁబట్టుకుంటా రవి చెప్పనక్కఱలేదు. ఆ కాలంనాఁటికి బిల్లుల వదుపాయీలు లేవు. యానామే బిల్లు.

మా తండ్రి గారేమో ఋణాల తీర్మానానికి తగిన యేర్పాటు చేసుకొనే యానాం ప్రవేశించి నట్టయింది. కాని నేను మాత్రం ఆటల బాపతు ఋణంతోనే యానాం ప్రవేశించడం చేత దివాలాకోర్లలో జమ కావలసి వచ్చింది. కొత్తలో నా మనస్సుకు అది యెంతో బాధకంగా కవపడేది. క్రమంగా కొన్నేళ్ళు జరిగాక మళ్ళా కడియం రావడమైతే వుండేది గాని నే నెవళ్ళెవళ్ళకి అప్పు పడ్డానో వాళ్ళు కూడా అప్పటికినాతో పాటు కొంతపెద్దవాళ్ళయి వుండడం చేత చిన్నప్పటి ఆటల బాపతు బాకీ

తీర్పుమని లేశమున్నూ నిర్బంధించినట్టు లేదు. నేను మన్నా [illegible] వాళ్ళకు బ్రహ్మానందంగా వుండేది.

ఏ విధమైన "బిల్లు"న్నూ లేకుండానే నా చిన్నతనపు ఋణాలు తీరడం, లేదా మాసిపోవడం జరిగింది. కాని తాత్కాలికంగా అంచే, ఆ చిన్నతనంలో మాత్రం మా మాలు సంసారుల కెంత విచారం ఋణ ఋణాలవల్ల కలుగుతుందో అంత విచారమున్నూ నాకున్నూ కలిగేది. దీన్ని యింతగా యెందుకు వ్రాస్తానంటే? సంసారమంటే భార్యా పిల్లలూ, గొడ్డూ గోదా, యిల్లూ వాకిలీ, మడీ మాన్యమూ వుంటేనే కాదు. యివి యేమీలేని పసిపిల్లలకు కూడా యేదో బాదరబందీ వుంటుందని నేనిప్పుడు దాన్నిబట్టి విర్ధారణ చేసుకుంటూ వున్నాను. దీన్నిబట్టి సంసారానికి భయపడి సన్యసించే వారికి కూడా " కౌపీన సంరక్షణార్థ మయంపటాటోపః " అన్నట్టు యేదో సంసార బాధ వుండే తీరుతుం దని తెలుసు కున్నట్టయింది. (యిప్పటి సన్యాసులకు రైలుఖర్చులకు పరాపేక్ష తప్పదు)

పసితనంలో వుండే వాళ్ళకి కష్టసుఖాలతో లేశమూ అవసరమే వుండకుండా కాలక్షేపం జరుగుతుందని చాలామంది అంటూవుంటే వినడ మయితే వుండిగాని అదినా పట్ల మాత్రం సమన్వయ మయింది కాదు. యింకా కడియంలో వుండే రోజుల్లో విచార కారణాలు మరికొన్నివుండేవి.

అన్నిటిలోనూ నేను స్కూల్లో ఫస్టుగానే వుండే వాణ్ణి గాని లెక్కలలో నాకు బొత్తిగా అభిరుచీ వుండేది కాదు; తెలివీ వుండేదికాదు. ఆ జ్ఞానం అప్పటికీ యిప్పటికీ ఒకటే మాదిరిగా వుంది. అవి ఆ మాష్టరు గారు మధ్యాహ్నం చెప్పేవారు అందుచేత మధ్యాహ్నం బడి మానేయ వలసి వచ్చేది. దానికి మరునాఁడు శిక్ష తప్పదు గదా? అని కడుపులో దిగులు తప్పేదికాదు. కాని ఆ మాష్టరుగారికి నేనేమో తెలివైన వాడఁనని నా యందెంతో ప్రేమ వుండడంచేత వకపూఁటకు పూఁటంతా నేను స్కూలు యెగఁగొట్టినా యితరపిల్లలని శిక్షించినంత గాఢంగా రూళ్ళకఱ్ఱతో

నన్ను శిక్షించేవారు కాదు. అదిన్నీకాక, ఆ మాష్టరు గారు యెప్పుడో గాని మధ్యాహ్నం స్కూలుకు రావడమంటూ వుండేదే కాదు.

మా గ్రామం యీపందొమ్మిదో శతాబ్దంలోనూ, అంతకుపూర్వ మున్నూ మంచి మామిడితోఁటలకున్నూ, అంతో యింతో కవిత్వానికిన్నీ ప్రసిద్ధి కెక్కిఁందిగాని అంతకుపూర్వం చదరంగానికి చాలా ప్రసిద్ధి. దొంగతనానికి యిప్పుడూ ప్రసిద్ధి కలిగేవుందిగాని అప్పుడు మిక్కిలీ ప్రసిద్ధి కలిగివుండేది. ద్వారపూఁడి పచ్చిపాళ్ళనీ, కడియం పచ్చిపాళ్ళనీ లోకప్రసిద్ధి. ఆయీవిషయం యేదో వ్యాసంలో యిదివఱకే విస్తరించినట్టు జ్ఞాపకం. అందుచేత స్పృశించి విడుస్తూ వున్నాను. చదరంగం ప్రస్తుతం కూడా అంతో యింతో ఆడేవారు లేకపోలేదు గాని ఆరోజులలోలాగ తదేకదీక్షగా దానిలో కృషిచేసే వ్యక్తులు ప్రస్తుతం లేరు. ఆచదరంగ పాటమూలాన్ని నాకు లెక్కలగండమైతే చాలావఱకు తప్పేదిగాని మాష్టరుగారు యేరోజు చదరంగంమూలాన్న బడికిరావడం మానతారో ముందుగా తెలిసేది యేలాగ? అందుచేత విచారం యేలాగా తప్పేది కాదు. ముఖ్యాంశం లోకంలో అంతా అనుకొనే సంసారంలోకి ప్రవేశిం చక పూర్వంకూడా సంసారపు చిక్కులు యేవో వుంటాయనుకోవడమే. సరే! పసితనం యీలాటి విచారాలతో ముగిసింది. పదేళ్లుదాఁటడం తట స్థించింది. పట్నవాసం యానాంలో ఆటలూ, చదువూ ప్రారంభమయి నాయి. అప్పుడప్పుడు రాజమహేంద్రవరాన్ని కడియంలో వున్నరోజుల్లో నేను చూడకపోలేదుగాని, చూచినప్పటికి నాకు యానాం చాలా అపూ ర్వంగా కనపడింది. అక్కడిఆటలు యించుమించు మావూరిఆటలకు సజాతీయాలే అయినా కొంత భేదంగా కనపడేవి. అవూళ్ళో కోఁతికొ మ్మచ్చి రాజుగారి గుఱ్ఱాలశాల దూలాలమీఁద ఆడుకొనేవాళ్ళం. ఆవూళ్ళో దేవాలయంలో వుండే పెద్ద పొగడ చెట్టుమీఁద ఆడుకోవడం, ఆ పొగడ చెట్టుమీఁద వురకవేయడంలో చాలా ప్రజ్ఞకలవాళ్ళు వుండేవారు. వాళ్ళల్లో నేను చాలా తీసికట్టుగా వుండేవాణ్ణి. అది మనస్సుకు విచారకరంగా

వుండేవి. దానికోసం చాలా కృషి చేశానుగాని యెంత ప్రయత్నించినా అందులో కొంతమందినే అతిక్రమించఁగలిగాను గాని ప్రధానాయుధు లను అతిక్రమించలేకేపోయాను.

ఆ పట్నంలో ఆయా ఆటలకు, సస్యాలకుమాదిరిగా ఆయా కాలాలు యేర్పాటుగా వుండేవి. ఆరోజుల్లోతప్ప యితరకాలాల్లో వాట్లపేరుకూడా తలపెట్టడం వుండేదికాదు. ఆవూళ్ళో పేకాటకూడా అభ్యాసం అయింది కాని, డబ్బూ దస్కమూ పెట్టిమాత్రం ఆరోజుల్లో ఆడినట్టు లేదు. యిటీ వల బాగా ప్రాజ్ఞతవచ్చాక స్వల్పంగా ఆడడం తటస్థించింది. బహుశః ముందు ముందు దాన్నికూడా వుదాహరిస్తానేమో?

కుస్తీపట్లు, సత్తువపట్లు వగయిరాలు కూడా ఆవూరు వెళ్ళినతరవాత అలవాటయినాయి. అందులో పార్టీలు, పోట్లాటలు వగయిరాలు తటస్థించేవి. మావీథికి వచ్చినప్పుడు ఆవలిపార్టీ కుఱ్ఱాణ్ణి మేము కొడితే వాళ్ళ వీథికి వెళ్ళినప్పుడు మళ్ళా మావాణ్ణి వాళ్లుకొట్టడం, యీకారణంచేత వాళ్ళ వీథికి తగినంత సైన్యం లేకుండా వెళ్ళడమంటే భయం. ఫ్రెంచిస్కూలు విద్యార్థిత్వం స్కూలుకు వెళ్ళకపోతే దొరగారు బజాయిస్తారు కనక మాన డానికి వీలులేదు. తోవలో పార్టీపిల్లలు తటస్థిస్తే "ఢుంఢంతాం" జరుగు తుందేమో? ఆయీ సందర్భాలనిపట్టి చూస్తే కాస్త బాల్యదశ ముదురుతూ వున్నా అప్పటి సంసార విచారం తగ్గుతూ వున్నట్టులేదు. అదికూడా ముదిరినట్టే నాకు యిప్పుడు ఆలోచించుకుంటే కనపడుతూ వుంది.

ఆరోజుల్లో చదువుకోవాలని కోరిక అంటూ భగవంతుఁ డివ్వాలి గాని అవంటూ వుంటే చదువు కొదవంటూ వున్నట్టు నేను యెఱుఁగను. వూళ్ళో ఫ్రెంచిస్కూల్లో పుస్తకాలు వుచితంగా యిచ్చి చదువు చెప్పే వారు. జీతం యివ్వనక్కఱలేదని వేరే వ్రాయనక్కఱ లేదుకదా! కాస్త దూరం యేఱుమాత్రం దాఁటితే సరి, నీలపల్లి స్కూలు వుండేది. పుస్తకా లివ్వడం లేదుగాని వుచితంగానే చదువు చెప్పేవారు. వూళ్ళో ఫ్రెంచి

స్కూల్లో మాలమాదిగలకూ, యితరవర్ణాలకూ సహపంక్తిరూల్సు రావడంతోటిష్టే ఆ కాలం దానికి వొప్పదు గనక నీలపల్లి వెళ్ళవలసి వచ్చింది. నాతోపాటుగా బ్రాహ్మలయితే యేమి, కోమట్లయితే యేమి, కాఁపులయితే యేమి పదమ్ముగ్గురుదాఁకా నీలపల్లి స్కూలుకు వచ్చేవాళ్ళు. త్రోవలో చుట్టలు కాల్చుకుంటూ, కేరింతాలు కొట్టుకుంటూ ఆనందంగా వెళ్ళేవాళ్ళం. ఆ రోజులుమాత్రం నిర్విచారంగానే జరిగినట్టు జ్ఞాపకం. కాని స్కూల్లో వక చిక్కు వుండేది, ఆఁడవాళ్ళూ మగవాళ్ళూ కలిసే చదువుకోవడం. మొగాళ్ళు ఆఁడవాళ్ళని పిలవడంలో యేమే అని పిలిస్తే మాస్టరుగారికి రిపోర్టు. యేమమ్మా అంటేకూడా రిపోర్టే. యీ రెండు విధాలూ కాకుండా పిలవవలసిం దని మాస్టరుగారితీర్పు. ఆపిల్లలువేశ్యలజాప తవడంచేత అపూర్వో అగ్రజాతులవాళ్ళ యీచిక్కు తెచ్చిపెట్టేవారు. ఆది అందఱినీ బాధించేది. అప్పటి కింకా అందఱినీ గారనీ, అమ్మాఅనీ పిలిచేకాలం రాలేదు. అప్పటిదాఁకా యెందుకు, సుమారు యిప్పటికి యిరవైయేళ్ళ నాఁటికికూడా రానేలేదు. ఆరోజుల్లోనే నేను "గారుశబ్ద విచారం" అంటూ వక వ్యాసం కూడా వ్రాశాను. అప్పుడు యెవరూ దాన్ని ఖండించడానికి సాహసించ లేదు గాని యీరోజుల్లోన్నే అయితే దాన్ని "తుంటి తుంటాలు"గా ఖండించి పాఱవేతురు. దీన్నిబట్టి అప్పటికంటె యిప్పుడు జ్ఞానాభివృద్ధి యెక్కువగా జరిగినట్టు కొందఱు తలుస్తారు. కాని నాతాత్పర్యం అదికాదు. అప్పటి కంటె యిప్పుడు అనాత్మజ్ఞత అతిశయించడమే సర్వానికీ కారణంగా కనపడుతుంది. యేదో మనంకూడా వ్రాశాం గదా అనుకోవడమే గాని మనకు అందుకు తగ్గ శక్తి సామర్థ్యాలు వున్నాయా, లేవా అనేవిచారం యీ కాలంలో లేదు. యిది విషయాంతరం.

పొరుగూరి వాళ్ళకు మనకీ చిక్కుతో అవసర మేమిటని చెప్పి "తప్పించుకు తిరుగు వాఁడు ధన్యుడు" అన్నట్టుగా సంచరిద్దా మంటే, కూడావున్న క్లాసుపిల్లలతో చిక్కు. వాళ్ళు చెప్పినట్టు వినకపోతే వాళ్ళు యేంచేసినా చేశారే. సందేహం లేదు. అందుచేత నిర్విచారంగా ఆరోజులు

కూడా జరిగినట్టు తోఁచదు. ఆ వయస్సులో యీనాఁటి చిక్కులే నాఁ యింట్లో వుందా, లేదా అనే చిక్కు మాత్రం కలిగినట్టు లేదు. కలక్కు పోవడానికి హేతువు సంపన్నత్వం కాదు. ఆ విషయం మనస్సుకు యెక్కే రోజులు కాకపోవడమే. అంతలో ఒక చదువుకు స్వస్తి చెప్పడం జరిగింది. ఆ రోజుల్లో యానాంలో శివుఁడి రథోత్సవం నాఁటిరాత్రి ఒక ఖూనీకేసు జరిగింది. ఖూనీ చేసినవాఁడు పట్టుపడ్డాడు. వాఁడు "ఆ రోజు రాత్రి నేను ఫలానాచోట కుస్తీ జరుగుతూ వుంటే అక్కడవున్నా" ననిన్నీ "ఆ సమయంలో ఫలానా ఫలానావారు నన్ను చూచా" రనిన్నీ చెప్పడంలో నా పేరుకూడా చెప్పడం తటస్థించింది. ఆ కారణంచేత సుమారు పదమూఁడు సంవత్సరాల ప్రాయంలోవున్న నాకున్నూ నాతోపాటు మరికొందరు పిల్ల వాళ్ళకున్నూ, సాక్ష్యం పడ్డది. కచేరీ అంటే, అప్పుడే కాదు, యిప్పటికీ నాకు జంకే అందుచేత ఆ సాక్ష్యంలో మన కేంచిక్కు కలుగుతుందో అని కొన్నాళ్ళు మనస్సుకు స్వాస్థ్యం లేకపోయింది. అప్పటికి యింకా యేవిధ మైన సంసారపుచిక్కు లేకపోయినా యేదో సంసారపుచిక్కు వున్న వాళ్ళతోపాటు విచారగ్రస్తత కలుగుతూనే వచ్చినట్టు కనపడుతుంది. తరవాత కావ్యాలు చదవడం, తోటివాళ్ళేవళ్ళూ యీచదువు చదువుకునే వాళ్ళు కాకపోవడం, ఆ కారణం చేత కొంత యెటామెటీగానే వుండేది. వూరికేమో దాదాపు రెండుమైళ్ళ దూరంలో వుండే వూరు వెళ్ళి పాఠం చెప్పుకురావాలి. నాకు స్నేహితులుగా వుండే సజ్జంతా చాలాభాగం "రౌడీసజ్జు". ఆ, సజ్జు నాచదువుకే కాదు యేచదువుకీ ఆమోదించేది కాదు. వాళ్ళ ఆజ్ఞ వారానికి రెండుసార్లు అయితే అక్కడికి గొప్ప. వాళ్ళను వ్యగ్రి తించేపక్షంలో ఆ వూళ్ళో వుండడానికే వీలుపడదు. అందుచేత నిర్విచార స్థితి అప్పుడూ తటస్థించేది కాదు. పయిఁగా ఆ రోజుల్లో కావ్యాలు చదువు కుంటూ వున్నట్టు తెలిస్తే వూరుకదిలి యెక్కడికి యెందుకు వెళ్ళినా యే పెద్దలో పరీక్ష చేసిగాని వదిలేవారు కారు. ఆ పరీక్షకు ఆఁగితే తప్ప వారు నానా చీవాట్లూ పెట్టేవారు. పుస్తకంకూడా లాక్కోవడం వుండేది. ఆపరీ

షించే పండితులతోన పేదుగా నున్నా, అప్పుడు నాకు గురుత్వం చేసే గురువులతోన వేఱుగా నున్నా, వుండేది కూడాను. దాన్నిబట్టి ఆ పండితులు "యిది పంతులుగారి పాఠ" మంటూ వెక్కిరించడం తటస్థించేది. ఆ మాటపడడం నాకుకష్టంగా వుండేది. నేను వచ్చి మాగురువులు భుజంగరావు పంతులుగారితో "పండితులు యీ మోస్తరుగా అంటూ వున్నా"రని చెపితే వారేమిన్నీ కలిగించుకొనే వారు కారు. చిఱునవ్వు నవ్వి "వారు ఛాందసులురా!" అని వూరుకొనేవారు. నాకు మాత్రం మా పంతులు గారి చేత ఆ పండితులకు తగినంత శాస్తి చేయించాలని యెంతో పట్టుదల వుండేది. తుదకి ఆ పని సాగింది కాదు కదా అని యెంతో విచారంగా వుండేది.

యీలాగ యెప్పటి కప్పుడు మన స్వాస్థ్యం లేకుండానే జరిగినట్టు కనపడుతూ వుందా? అంతట్లో స్వగ్రామం వదలిపెట్టి చదువుకు గ్రామాంతరాలకు వెళ్ళడం, వాకవూళ్ళోనూ పట్టుమని ఆఱుమాసాలేనా వుండకుండా యేదో విఘ్నం రావడం, యీలా "కంగాబంగా" చదువుకుంటూ వుండఁగా కంటిజబ్బు, ఆజబ్బు యేమందుకూ లొంగకపోవడం, ఆకారణంవల్ల "యిఁక మనకు చదువొచ్చే యోగం లేదు కాఁబోలు"నని మనస్సులో బెంగ. ఆజబ్బుచేసిన కన్ను పోతే బాగుండు ననుకొనేవాణ్ణి. అది పూర్తిగా పోయిందీ కాదు, కుదిరిందీ కాదు. యిప్పటికి కూడా సంసారప్రసక్తి లేకపోయినా యేదో విచారానికి కారణం కల్పితమవుతూనే వుందికదా! యేలాగో కొంతభాగం కంటిబాధ తగ్గించుకొని పరమగురువుగారి సాన్నిధ్యానికి చేరుకుని వ్యాకరణశాస్త్రం, సిద్ధాంతకౌముది మొదలుపెట్టడం జరిగింది. యింతవఱకూ చేసిన విద్యార్థిత్వాలు నాపట్నానపు వేషానికి అంతగా బాధించేవిగా లేకపోయాయి. చామర్లకోట విద్యార్థిత్వంలో మధూకరం యెత్తుకున్నప్పటికీ నాగిరజాలూ వగయిరాలు బాధించనే లేదు. (యిప్పుడు క్రాపింగు కెంత గౌరవమో అప్పుడు గిరజాల కంత గౌరవం) యీగురువుదగ్గిఱికి రావడంతోటట్టే చద్దివణ్ణం

తినడం మానేస్తేనేకాని అవున్నవిద్యార్థులలో 'హాయీహాయీ'గా సంచరించడానికి నాకే సిగ్గుగా తోఁచేది. కావడానికయితే యూపిరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు దగ్గిఱబంధువులు. ఆదరించి అఁవంగుటు చద్దివణ్ణంకూడా పెట్టేవారు. కాని తినడానికి నాకే తోటివాళ్ళమూలాన్ని బిడియం అనిపించేది. అది తినేపద్ధతిని అస్పృశ్యుఁడుగా వుండాలి. పది పదిహేనురోజులు తిని యేలాగో మానేశాను. గిరజాలుకూడా తీయించేసి ఆవిద్యార్థులతోపాటు తయారయాను. (అహా! ఆకాలమెంత పవిత్రమైన కాలం!) కాని చద్ది మానడం చేత కొంత ఆరోగ్యానికి భంగం కలిగింది. కలిగినా సరే అని మళ్ళా చద్దివణ్ణం మొదలు పెట్టనే లేదు. ఆరోగ్యలోపం వల్ల చదువు కెక్కడ అంతరాయం కలుగుతుందో అని వకవిచారం. దీనమ్మకడుపుకాలినవిచారం యెప్పుడూ "తాటితోపబ్బానం" లాగ ఆశ్రియించి వుంటూనే వుందికదా! అంతట్లో కాశీప్రయాణానికి అంకే, రెండోసారి కాశీప్రయాణానికి ముహూర్తం పెట్టుకోవడమున్నూ, దైవాత్తూ ఆసుముహూర్తం పెండ్లి ముహూర్తంగా మాఱడమూ, పెండ్లికావడమూ తలఁచుకోని తలంపుగా జరిగింది. పెండ్లి అయిన అయిదోరోజున అపూరి చెఱువువొడ్డున మామిడితోఁటలో పరధ్యానంగా కూర్చుండఁగా యేదో పెద్ద బరువువచ్చి మెడమీఁద పడివున్నట్టు హఠాత్తుగా నాలోనాకే పొడకట్టింది. "వోహో! యిది వివాహపు మహత్తు కాఁబోలును!" అనుకున్నాను. పెళ్ళనిపేరుగాని అప్పటికి నా భార్యకు అయిదు సంవత్సరాల రెండు మాసములుమాత్రమే వయస్సు. అధమం యింకా పదేళ్ళైనా దాఁటితేనే కాని సంసారభారం నెత్తిమీఁద పడదు. అట్టిస్థితిలో ఆలా కనపడడానికి హేతువు మృగ్యమే. యితరకారణం కనపడకపోవడంచేత నేను దాన్ని గృహస్థాశ్రమప్రవేశ మహత్తుగా వూహించుకొన్నాను.

పెళ్ళి కావడమే తడవుగా కాశీప్రయాణం సాగించాను. అక్కడికి వెళ్ళింది మొదలుకొని మాతల్లిదండ్రులు వుత్తరంమీద వుత్తరం గురువుగారి ద్వారా వ్రాయించడానికి మొదలుపెట్టారు. "నీవు వెంటనేబయలు

దేశి దేశానికి రాకపోయేయెడల మేముకూడా బయలుదేరి కాశీకి వస్తున్నా" మనే అర్థంతో వుండేవి ఉత్తరాలు. యేకపుత్రి విషయం కావడంచేత వారు నిజంగా వస్తారేమో అని భయం. కాశీవెళ్ళిన వాళ్ళల్లో యెవళ్లకోకాని మొట్టమొదట ఆ గంగ శరీరానికి సరిపడక జబ్బుచేయడం మామూలు. కాని నాకు మాత్రం ఆగంగోదకం బాగా ఛర్జించి ఆరోగ్యం అభివృద్ధికావడం మొదలుపెట్టింది. అదిన్నీకాక ఆక్షేత్రించూచింది మొదలు అక్కడ వుండే పండితుల్ని సందర్శించింది మొదలు వదలిరావడానికి బుద్ధి పుట్టడంలేదు. రాకపోతే ఋణమో, ధనమో చేసి తల్లిదండ్రులు వచ్చి యేలాగా తీసుకు పోక మానరు. ఆసలు ఓస్థితి. ఆయా కారణాలవల్ల కాశీలోవున్న అయిదారు మాసాలున్నూ యేదో విచారంతోనే సరిపోయింది.

దేశానికి వచ్చాక మళ్లా శాస్త్రుల్లుగారిసన్నిధిని ప్రవేశించి చదువు కుంటూవుండఁగా నిర్విచారంగానే కాలక్షేపం జరగవలసింది కాని కాశీ నుంచి నేను దేశం రావడానికి తల్లిదండ్రులు రు. 30 లు, రూపాయి వక్కంటికి డబ్బుచొప్పున అప్పుచేసి పంపడంచేత దాన్ని తీర్చడం యేలా గురా అనే విచారం పట్టుకుంది. దేశానికి వచ్చీరావడంలో అష్టావధానా లంటూ మొదలుపెట్టి కొంత ఆర్జించడమయితే జరిగిందిగాని ఆసంపాదన గంగాసంతర్పణకింద ఖర్చయిపోయింది. ఆకారణంచేత లోఁగడ వుదాహ రించిన ఋణం అట్టే వుండిపోయింది. అప్పటికి గురువుగారు పాఠశాలా స్థానాన్ని ధవళేశ్వరానికి మార్చి వున్నారు. ఆవూళ్లోవున్న వుద్యోగస్థులు మాగురువుగారిని విద్యార్థులను నిత్యబ్రాహ్మఁడుగా వుండడానికి కోరి కొత్త పేరుగలవాళ్లను యేర్పఱచుకొని భోజనభాజనాదులతో పూజిస్తూ వుండేవారు. ఆ విద్యార్థులకు పెండలాడే భోజనం దొరకడం తటస్థించేది. పాఠశాలాసత్రంలోనో, యే రెండుగంటలకో గాని మెతుకులు దొరికేవి కావు. అలాగైనా సరేకాని ఆయా సంపన్నుల యిండ్లల్లో వంటింటి బ్రాహ్మఁడుగా వెళ్లడానికి నాకు యిష్టం వుండేది కాదు. మూఁడుజాము

లహా, ముప్పుహొద్దుకూ తినడంవల్ల ఆరోగ్యానికి భంగం ప్రారంభమయింది. అయినాసరే, పాఠశాలానత్రం విడిచేవాణ్ణి కాను. కాని ఆరోగ్య లోపంవల్ల చదువెక్కడచెడుతుందో? తోటివాళ్ళెక్కడ దిగఁదొక్కుతారో అనే విచారానికి పరిమితే వుండేది కాదు.

యీ స్థితిలో వుండఁగా లోఁగడ కాశీనుంచి రావడానికి తర్లివం ద్రిలు ఋణం చేసినరూపాయీలు తీర్చడానికి కాకినాడ సంపాదనకు వెళ్లడం జరిగింది. అక్కడ అసలు అనుకున్నదానికంటె యెన్నోరెట్లు అధికంగా సమ్మానమయితే జరిగిందిగాని ఆపట్నంలోకూడా విచారం తప్పిందికాదు. అవధానంలో చెప్పినశ్లోకాలలో వకదానిలో పృచ్ఛకుఁడు కోరినవిషయం లే దంటూ, వకపండితుఁడు ఆక్షేపించడమూ, దానికోసం "కొండని తవ్వి యెలకని పట్టడమూ" వగయిరాలు అన్యత్రి వ్రాసేవున్నాను. అది సమర్థించడంలో పొందిన విచారం అంతా యింతా అని యిప్పుడు వ్రాయనే లేను. సీతపేరుగాని, రామునిపేరుగాని, తుదకు కన్యాదాత జనకుని పేరుగాని; నిజానికి ఆ శ్లోకంలో లేనేలేదు. దానిలో సీతా కల్యాణార్థం సంపాదించాలి. సంపాదించక పోతే ఆదే పేరుగల అవధానాలలో మొట్టమొదటి దవడంచేత అవమానం తప్పదు. యిటీవల యెన్ని అవధానాలు నిర్దుష్టంగా సమర్థించినా ఆ కళంకు "వామన ఇతి త్రివిక్రమ మభిదధతి దశావతార విదః" అన్నట్టు నిలిచిపోతుంది. అందుచేత అప్పటికి గతించిన విచారాలన్నిటి కంటే కూడా దాన్ని సాధించే లోపున పొందిన విచారం పెద్దదిగా పరిణమించింది. యీ అవధానానంతరం మూడేళ్ళలో కాఁబోలును గద్వాలకు వెళ్ళడం జరిగింది. యీ లోగా అమలాపురం, బందరు, యేలూరు, చెన్నపట్నం, నెల్లూరు వగయిరా గ్రామాలు వెళ్ళడం జరిగింది. బందరులో కొంత మనస్సుకు విచారకారణం కలిగింది. అప్పుడు కోమట్లకున్నూ, బ్రాహ్మణులకున్నూ పెద్ద తగాయిదారోజులు. ఆపట్టణవాస్తవ్యులు కోమట్లు మమ్మల్ని సమ్మానించే వుద్దేశంతో వున్నారు. వారల్లా కోరిం దేమిటంటే, వారి కన్యకామ్మవారి సత్రంలో మకాం

చేయవలసిం దనిపిస్తేనే. అలా మకాంచేసేయెడల బ్రాహ్మణోద్యోగస్థులే కాదు, యితరబ్రాహ్మణగృహస్థులే కాదు, శూద్రసంపన్నగృహస్థులే కాదు, ఉద్యోగులే కాదు యెవరూ మాముఖం చూడరు. అప్పుడు ఆపట్టణ మంతా వాకటిస్నీ, కోమటికం వకటీగా వుంది. వేదోక్తం కావాలని కోరినదానికి వకబ్రాహ్మలే వ్యతిరేకులుగా వుంటేవుండవలసినా ఆకాలాన్ని పట్టి బ్రాహ్మణేతరులుకూడా దానిలో పాల్గొన్నారు. "వెనక్కెడితే నుయ్యో, ముందుకెడితే గొయ్యో" గా చిక్కుపడడంలో ఆలోచన పాలు పోక చాలా విచారం కలిగేది. ఆబందరులో చెప్పింది కాదుగాని తరవాతే వకపద్యం దీనికి సంబంధించింది కనపడుతుంది. అది సందర్భనంలో అచ్చుపడేవుంది. అయినా వుదాహరిస్తాను:

"మ. సభఁజేయించునొ ? లేదొ ? యంచు మొదటన్ సందేహ మామీఁద నీ
సభలో నేమిట లోపమౌనొ యనుచున్ సందేహ మామీఁద నీ
సభలో నింతకు లాభ మేమొ యనుచున్ సందేహ మూహింప నీ
సభలం జేసెడివారెపో జగతిలో సందేహసంరక్షకుల్.

యితరవిషయంలో చెప్పినదే అయినా యీపద్యం యీ అవధానాది సభలద్వారా ధనార్జనచేసే అందఱికీ సంబంధిస్తుంది. కోమట్లకు మమ్మల్ని యేదోవిధంగా సమ్మానించడంవల్ల పండితసత్కారంవల్ల వచ్చేసుకృతం పారలౌకిక మనుకున్నా యిహంలో "మీరందఱూ మమ్మల్ని ద్వేషించి యేబ్రాహ్మలనీ మాయిళ్ళకు రానివ్వకుండా కట్టుదిట్టాలు చేస్తూన్నారు కదా ! చూడండి, మీలో కవీశ్వరులే వచ్చి మాసత్రంలో మకాం చేశా" రని డెకాయించడం ప్రత్యక్షఫలితంకదా ! ద్రవ్యాన్ని ప్రధానంగా చూచు కోక "కులంతోపాటు గోవిందా" అని మేము భీష్మించుకూర్చున్నా ఆవల సంపన్నులూ, మర్యాదస్థులూ అయిన వైశ్యప్రముఖులు వచ్చి "యేమండీ ! మిమ్మ మేము సమ్మానించఁ దలఁచుకున్నాము. మాసత్రంలో మకాంగావుఁటే చాలును." అని కోరుతూవుంటే వారికి చెప్పఁదగ్గ జవాబు లేక చిక్కుపడడం యెంత విచారాన్ని కలిగిస్తుందో, అనుభవైకవేద్యం

యేమాత్రం మొగమాటం వున్న మనస్సులయినా పరుషపదప్రయోగంలో వ్రాలా విమర్శనం అని విజ్ఞులు గుర్తిస్తారు. ప్రతిభావంతుల గ్రంథాలలోనూ యిలాటి విధానా లేవో వుంటూనేవచ్చాయి. గద్వాలప్రయాణానికి కొంచెం వెనకా ముందూ, చెన్నపురి ప్రయాణానికి పిమ్మటానున్నూ కలిగిన వివాదానికి అంతూ పొంతూ లేనేలేదు. అది గ్రంథరూపంగా పరిణమించివుండడం చేత దాన్ని యిక్కడ స్పృశించి విడిచాను. కవులకు కలిగే కష్టసుఖాలు గ్రంథరూపంగా పరిణమించడం అనాదిగా వుందని నాతలంపు. అట్లని అన్యాపదేశంగా వున్న ఆయాగ్రంథాలన్నీ కవులతాలూకే అనుకోవడం పొసఁగదు. ఆయావిషయం కేవలమూ విమర్శనముఁదమాత్రమే కాక కొంత యితరాధారాలమీఁదకూడా పరిశీలించి తెలుసుకోవలసివుంటుంది. దీన్నిగూర్చి యింకా వ్రాస్తే వ్రాయవలసే వుంటుంది గాని వ్రాసేది లేదు “అనుక్త మన్యతో గ్రాహ్యమ్”

యీ వ్రాసిన విచారాలన్నీ సంసారభారం నెత్తిని పడకపూర్వపువే కాని పడ్డపిమ్మటివి కావు. కనక మనిషికి సంసార పరిత్యాగం వల్ల నిర్విచారత్వం సిద్ధిస్తుం దన డానికి వల్లపడదు. అందుచేతే వేదాంతులు సంసార మనేదానికి “ప్రవాహతోఽ నాదిత్వమ్” లక్షణంగా పేర్కొన్నారు. దేహధారణం మొదలుకొని దేహపరిత్యాగం వఱకేకాక మళ్లా వెంటనే సంసారం తగులు కుంటుం దనేది పరమ సిద్ధాంతంగా తెలుసుకోవాలి. అందుచేతే యీ జన్మలో మన కేదేనా అధికారాదికం పడితే దాన్ని లోక కంటకంగా వినియోగించి భావిగతిని చెడఁదీసు కోరా దంటారు పెద్దలు. మృత్యువంటే సంసారమే అని వేదాంతులు నిర్వచించారు. కాని సర్వ సామాన్యులు యీ అర్థాన్ని తెలుసుకో లేరు. సామాన్యులు వాడుకొనే సంసారభారం నేను యిరవై యెన్మిదేళ్ళ వయస్సులో వహించడం జరిగింది. (అలోఁగా కూడా సంసారం లేకపో లేదు.) జరిగిన రెండేళ్ళలో యిల్లు కట్టడానికి ఆరంభం. శంకుస్థాపన జరిగిన కొద్ది రోజులలో బ్రహ్మిష్ఠో బ్రహ్మంగా అనారోగ్యం యేర్పడ్డది. అప్పుడే కఱవు కూడా తటస్థించింది.

యిల్లు తయారు కాలేదు. పాకలో కాఁపరం. దొంగలు ప్రవేశించారు గాని వాళ్ళకేమీ దొరకలేదు. ఆ అవస్థ వర్ణనాతీతం. దాన్ని కొంత మొట్ట మొదట కామేశ్వరీ శతకంలో వివరించాను. యితరులు నమ్మినా నమ్మక పోయినా యిటీవల నా జాతకానికి సంఘటించిన సౌభాగ్యాలన్నీ ఆ కామే శ్వరీ కటాక్ష మూలకాలే అని నా విశ్వాసం. అప్పటి విచారం తద్ద్వారాగా స్పష్టం కనక స్పృశించి విడిచాను.

ఆ రోజుల నాఁటికి, తిరపతి శాస్త్రి శ్రీ పోలవరపు జమీందారు గారి ఆస్థానకవిగా ప్రవేశించాఁడు. నేను వంటరిగానే వెళ్లవలసి వచ్చింది. నాకు వొకచోట కట్టుపడి వుండడం యిష్టంలేదు. యింతకాలం యిద్దఱమూ వెళ్ళి అప్పుడు వంటరిగా వెళ్ళడం యెంత విచారంగా వుంటుందో, వ్రాయనక్కఱ లేదుకదా! శ్రీకాకుళం, మందసా వగయిరా ప్రయాణాలు వంటరిగానే చేసినట్టు శతావధానసారం వగయిరాల వల్ల తేలుతుంది. ఆ ప్రయాణంలో విరివిగానే ధనార్జన జరిగిందిగాని, ఉర్లాములో నేమి, మందసాలో యేమి శ్రీకాకుళంలో యేమి, అనారోగ్యం యేర్పడి పడ్డ చిక్కుకు పరిమితిలేదు. కాని "మబ్బులాగ వచ్చి మంచులాగ విడిపోవడం" మాత్రం జరిగేది. అప్పటికి యింకా చాలాకాలం భూమిమీఁద వుండవలసిన యోగం శేషించి వుండడం చేతఁ గాని లేకపోతే ఆ ప్రయాణంలో గచ్చగొట్ట వలసిందే! వొక్కొక్కటి యెత్తుకొని వ్యాఖ్యానం చేస్తే యెంతో చేదస్తంగా కనపడు తుంది. కనుక మూఁకుమ్మడి మీఁద వుటంకించి వదిలేశాను. (పంచుకోవ డానికి తి. శా. రాకపోవడం చేత ధనార్జన యావత్తూ నాదే అయింది.)

ఆరంభించినగృహనిర్మాణం సుమారు నాలుగేళ్ళకుఁగాని తేలిందే కాదు. గండం దాఁటినా ఆరోగ్యం నిర్దుష్టం కానేలేదు. గృహప్రవేశం జరిగింది. జరిగాక కొద్దికాలంలో వంటరిగానే నూజివీడు వెళ్లాను. అక్కడ అవధానానికి శ్రీరామచంద్రాప్పారావుగారు చాలా సంతోషించి అపారమైన ప్రేమను చూపించారు. రెండో యేఁడు మళ్లా దర్శనానికి వెళ్ళేటప్పటికి బందరువారు స్కూలుపండితుఁడుగా రావలసిం దని కోరడం

జరిగింది. వెళ్ళడానికి కయితే యిష్టం లేమిగాని దేహారోగ్యం దేరాటినా నికి విగ్రస్థితిలో లేదు. సహాధ్యాయి తిరపతిశాస్త్రి గారిపోరు స్థిరంగావుండి పోయాడు. ఒంటరిగా సంచారం చేయడంవల్ల ఘనాఢ్యులో ఒంటరిగానే వాడు లేకపోవడంచేత కొంత లాభం కనపడినా చేయడానికి స్వస్థితిలో దేహస్థితి కనపడటం లేదు. అప్పట్లు మటిచాను, యిలాగానే, దీనికి చాలాపూర్వమే, తి. శా. సహితంగానే ఆత్మకూరు సంస్థానానికి వెళ్ళడమూ, అక్కడ సిగపట్లూ, చలిజ్వరాలూ వ్రాస్తే చాలా వ్రాయాలి. అందులో విచారకారణా లెన్నో కనపడతాయి సరే దాన్ని అలా వుంచుదాం. బందరు స్కూలుపండితుఁడుగా వెళ్ళడానికి శ్రీఅప్పారావుగారికి బొత్తిగా అంగీకారం లేకపోయింది. "ఆయనమాట కాదనడం యేలాగరా ?" అని వకవిచారం. "వాకచోట వుండడానికి మీకిష్టమే వుంటే మానూజు పీట్లో వుండిపోవలసిం" దని ఆయన అన్నారు. యెంతో ప్రేమతో కోరుతూవుంటే ఆయనమాట తోసేయడానికి మనస్సు యెంతో చిక్కుపడింది. బందరు ప్రవేశించాకకూడా ఆరోగ్యం కుదటఁ బడనేలేదు గాని స్కూలుపని చూడడానికి అభ్యంతరపెట్టేది కాదు. బందరు ప్రవేశించే నాఁటికి సుమారు ఆరువందలు అప్పు. 25 రూపాయిల జీతంలోవుండి స్వగ్రామంలో తల్లిదండ్రులు వగయిరా కుటుంబాన్నిన్నీ, యిక్కడ మాదంపతులకుటుంబాన్నిన్నీ పోషించుకోవాలి. పొలంమీఁద వచ్చేరాబడి నాటింటికి లోపు. యిది వకవిచారకారణంగదా ! అయితే పదార్థాలు చవకగా వుండేవి కనక ఆరోజులు చక్కఁగానే జరిగాయి. జరిగితే మాత్రం విచారం యెక్కడికి పోతుంది ?

అప్పటికి శ్రవణానందమూ, బుద్ధచరిత్రతప్ప మాగ్రంథాలు యేవీ అచ్చుకాలేదు. "అచ్చువేస్తే బోలెఁడురాబడి వుంటుంది, వేయవలసిం" దని ఆప్తులు ప్రోత్సహించేవారు, అప్పటికే ఋణంలో వున్న నాస్థితి మళ్ళా దీనికి అప్పుచేసి పెట్టుబడి పెడితే యేంకావలసి వస్తుందో కదా అని విచారం. ఆవిచారం తేలక రెండేళ్ళు అచ్చువ్యాపారంలోకి

దిగవేశేను. అంతలో మాతల్లిగారు కాలంచేశారు. ఆలోఁగా అంటే,
బందరు ప్రవేశించిన కొత్తటికంలో ఒకసంతానం కలిగి నష్టమయింది.
తల్లిగారు చనిపోవడంచేత కష్టపడి సరదాగా యింజరంలో కట్టుకొన్న
చక్కని యిల్లు వదిలిపెట్టవలసివచ్చింది. రెండుకుటుంబాలుగా వుండే
కుటుంబం వొకటిగా మాఱడంచేత యీదురవస్థ తటస్థించింది. అది మన
స్సుకు విచారకారణ మని చెప్పనక్కఱలేదుకదా! యేలాగయితే యేమి?
ఆయిల్లు వదిలి మాతండ్రిగారు వగయిరాలతో బందరులోనే వుండవలసి
వచ్చిఁది. పుస్తకాలరచన బాగా సాగడమే కాకుండా వాట్ల ముద్రణానికి
కూడా వాట్లమీఁద వచ్చే ద్రవ్యమే సరిపోతూవచ్చిఁది. ఐశ్వర్యం
దినదినాభివృద్ధిగా వుంటూవచ్చింది. (ఆయీవిషయం గీరతంలో వుటం
కించాను) సంతానంమాత్రం లేదు. మావంశానికి నేనున్నూ, మాపిన
తండ్రికుమారుఁడూ మాత్రమే అప్పటికి కనపడుతూ వున్నాం. అతనికి
సంతానం వుందిగాని అంతా ఆఁడపిల్లలే. నాకు అప్పటికి సంతానమే
లేదు. అందుచేత మనస్సుకు వంశాభివృద్ధివిషయంలో యెంత సరిపెట్టు
కున్నా యేకొంచెమో అప్పుడప్పుడు విచారం కలుగుతూ వుండేది. ఆరోజు
ల్లోనే శిష్యులతో తగాయిదా, కాఁకరపర్తిలో చప్పట్లపర్వం, దానినిజస్థితిని
గూర్చి తెల్పవలసిం దని దూరదేశస్థులు ప్రశ్నించి వ్రాయడం, అందుకై
రచించిన గీరతగ్రంథం అచ్చు త్వరగా తేలక కొంతవిచారం, ఆగ్రంథం
అచ్చు తేలకముందే గుంటూరుతగాయిదాలు, బందరులో వున్న ప్రెస్సు
లన్నిటిలోనూ కూడా అచ్చుపని సాగించినా పని తేలకపోవడం. కన్న
కొడుకులకుఁగాని కూఁతుళ్ళకుఁగాని పెళ్ళి చేయలేకపోయినా అంతవిచారం
కలగదేమోకాని రచించినగ్రంథాలు అందులో లోకానికి సత్యనిర్ధారణకై
వుపయోగించేవి అచ్చుకాకపోతే కలిగే విచారానికి పారంవుంటుందా?
ఆరోజుల్లోనే భార్యకి టయిఫాయిడుఫీవరు. సహాయం లేదు స్కూలు
వర్కు చేసుకోవాలి, వైద్యసదుపాయం చూచుకోవాలి. అచ్చుప్రూఫులు
దిద్దుకోవాలి. పైఁగా సొంతవంట. చెప్పేదేమిటి? యిందులో విచార

కారణం గానివేసి? ఆయావిచారాలలోన్నుంచి మెల్లో తేరి బయటికి వచ్చాక సంతానభాగ్యానికి మళ్ళా సూచన. మళ్ళా వేళ్ళ సంతానం లేనిచో ముప్పేని నుంచూరు కుగ్గరుబోరసాని ఆస్పత్రిలో పురుడుపోయించడం చేసు కరమని అప్పుడు, అంగ్లవైద్యులు సలహా ఇవ్వడం, పోనీ ఆస్పత్రిమాటల సహాయంమీఁద అక్కడికి పంపుదామనుకుంటే మామయ్యగారు పుట్టింటిసమయం కావడం, పైఁగా ఆవిడకూడా మాయింటికే రావడం, "బరువుమీఁద బరువు" వసిరితా దంటూ సంప్రదాయం తెలిసిన ముసలి ముత్తైదువలు చెప్పడం ఇవంతా యేలాటి విచారానికి కారకంగా వుంటుందో అనుభవజ్ఞులు గుర్తిస్తారు.

సరే. తీరాపురుడు నేఁడో రేపో రాఁబోతుందనే సమయంలో శ్రీ చెల్లాయమ్మారావుగారి షష్టిపూర్తి సందర్భంలో అవధానం చనక రావల సిందని, తి. శా. గారి తంతివార్త, మానేదామంటే, ఆ అవధానం శిష్యులు వెం. రా. లకున్నూ మాకున్నూ జరుగుతూన్న వివాదవిషయాన్ని తేల్చడానికే యేర్పడ్డదని తి. శా. గారు నొక్కి నొక్కి వ్రాయడం అప్పటికి సుమారు రెండు మూఁడు నెలలనుంచి నేను జ్వరంలోవుండి ప్రాణమాత్రావశేషంగా మిగలడం, అలా వుండికూడా విద్యాపక్షపాతం బాధించడాన్ని పట్టి వైద్యుఁడుసహితంగా ఆసభకు వెళ్ళడం, తుట్టతుదకు భగవదనుగ్రహంవల్ల సర్వమూ సుఖానుకూలంగానే పరిణమించినా మొట్ట మొదట మనస్సుకు కలిగే విచారానికి పరిమితి వుండదుకదా?

సరే! కుమారుఁడు కలిగినతరవాత చెప్పేదేమిటి? లోకంతోపాటే ఆయీవిషయం యెఱుఁగనివా రెవరు?

చ. "కొడుకులు గల్గుదాఁక నొక కొన్నిదినమ్ములు చింత నందనుల్
వొడమిన నాయువున్ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁ గల్గఁగా
మడుగనిచింత కల్గి తనునోలి భజింపని చింత తండ్రి కె
ప్పుడుఁ గడుఁ జింత నేయుదురు పుత్రులు శత్రులు గాక మిత్రులే?"

కలిగిన చిరంజీవికి పుట్టిందే మొదలు అనారోగ్యం, దానికోసం మందులు జపాలు తపాలు కవిల్వాలు పక చేమిటి, ఆరోగ్యాకామేశ్వరి, ఆరోగ్యభాస్కరస్తవం వగయిరాలు ఆసందర్భాన్ని విస్తరిస్తాయి. బంద రులో పని విస్తరించి తలతిప్పు మితిమీజి టీచరీ చాలించుకొని బలపంతం మీఁద పితృపితామహనివాసగ్రామం కడియం చేరుకోవడం. అంతకు ముందు వింజరంలో కట్టుకున్నయిల్లు వ్యర్థ మయిపోయిందిగదా అని విచారం. దీనమ్మాకడుపుకాలా, మంచని మంచీ విచారానికే కారణ మవు తుందామె, చెడ్డ సరేసరి చెప్పనే అక్కఱలేదు. ("జనకా! సంసార మందు సౌఖ్యముకలదే?" — దేవీభాగవతము) అందుకే విజ్ఞాను లేమ న్నారు? మంచినీ చేయకు చెడ్డనీ చేయకు నిస్తరంగసముద్రంలా వుండిపొ మ్మన్నారు. అంటే అన్నారుగాక ఆస్థితి మహావిజ్ఞానులకే సిద్ధించదు, సామాన్యగృహస్థుల కేలా సిద్ధిస్తుంది? వీలైనంతలో నిర్వ్యాపారస్థితి మాత్రం నిర్విచారాన్ని సంఘటిస్తుంది. కాని అదేనా సన్న్యాసులకు వుపక రిస్తుందిగాని గృహస్థులకు సోమరిపోతు తన మనిపించుకుంటుంది. జ్ఞాన శూన్యులమాట కేంగాని యేమాత్రం పరిజ్ఞాన మంటూ వున్నా చేసిందే చేస్తూ, చూచిందే చూస్తూ ప్రవర్తించే సంసారంమీఁద విరక్తిమాత్రం కలగక పోదు. కలిగి మాత్రం యేంచేస్తాఁడు? యిందిర్రియలోలత్వం మళ్ళా తప్పుదారికి యీడుస్తూవుంటుంది. యెప్పుడో మనస్సుకు స్వాస్థ్యం కలుగుతుందనిన్నీ, అప్పుడు తరణోపాయాన్నిగూర్చి ప్రయత్నించవచ్చు ననిన్నీ అనుకోవడమే కాని సంసారులకు యెన్నటికిన్నీ విరామస్థితి కల గనే కలగదు. అందుచేతే ఆలా అనుకొనేవాళ్ళని గూర్చి "సముద్రే శాంత కల్లోలే స్నాతు మిచ్ఛతి మూఢధీః" అని వ్రాశారు పెద్దలు. యిది విషయాంతరం.

అంతకుముందు కట్టినయిల్లు అమ్మడంతోటట్టే ఆ విచారం అంత రించింది. మళ్ళా కడియంలో యిల్లు కట్టడం జరిగింది. మఱికొందఱు పిల్లలూ జెల్లలూ కలిగారు. పల్లెటూరి సంసారానికి వుండదగ్గ లక్షణాలన్నీ

యించుమించు సమృద్ధిగా యేర్పడ్డాయి. (నాకు పల్లెటూరి నివాసమందే, పల్లెటూరివేషమందే ప్రీతి అనేది గమనించవలెను.) కాని నిర్విచారస్థితి మాత్రం కలిగినట్టు లేదు. లోకంలో నిర్విచారపురుషులుంటూ వుంటారని శబ్దం వినడంమాత్రం వుంది. అది వంధ్యా పుత్రాదిశబ్దాలవం టింవంటిదే కాని సత్యం కాదని నేననుకుంటాను. యిది కొందఱికి "లక్కానేవె" అనే యితిహాసానికి దీటుగా తోఁచవచ్చును. సన్న్యాసులకే సిద్ధించని నిర్విచారస్థితి సంసారులకు దుర్లభంకదా! జనకమహారాజు వకఁడున్నట్టు గ్రంథప్రమాణం కనపడుతుంది. శుకుఁడు అతన్నికూడా "తోసిరాజు" గానే మాట్లాడాఁడు. ఆమాటలు జనకుఁడు కొన్ని యుక్తులు చెప్పి ఖండించడమైతే జరిగిందిగాని యేమేనాసరే యెక్కడిది కక్కడికి తుంచేసుకుంటే తప్ప సంసారమనేది యెంతటి జ్ఞానికేనా మనశ్శాంతిని కలగనివ్వదనేదే పరమసిద్ధాంతం యెవఁడిమట్టుకు వాఁడు తానేమో పెద్ద పెద్ద కార్యాలు సాధించానని మొట్టమొదటనైతే అనుకోవడం సహజంగా కనపడుతుంది గాని వాఁడే మళ్ళా యేమాత్రమేనా జ్ఞాననేత్రాన్ని విప్పి చూచుకోవలసివస్తే గతమంతా అజ్ఞానంగా వెళ్ళినట్టు తేలకమానదు. తాను చేసిన మహాకార్యాలలో యెన్నోకార్యాలు అకార్యాలుగాకూడా పరిణమించి నష్టేకాక తద్వారాగా తనకు పరలోకహాని యెంతకలగాలో అంతా కూడా కలుగుతుందేమో అనే శంకనుసమేతూ కలిగిస్తాయి. సామాన్య మనుష్యులమాట కేంగాని "కర్తు మకర్తు మన్యథా కర్తుం" సమర్థులుగా వుండే పురుషులు తుట్టతుదకు చాలా పశ్చాత్తాపపడవలసివస్తుంది. యిది విషయాంతరం.

మొత్తంమీఁద యేప్రాణికిఁగాని యేక్షణమూ నిర్విచారంగా వెళ్ళదనే భారతీయుల వేదశాస్త్రాల సారాంశం. "జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునఃపునః" అనే కవపడుతుంది. దీన్ని అనుసరించే నేమీ కింది పద్యం మొదటికామేశ్వరీలో వ్రాసింది.

మ. "జననం బందుట పెద్ద యౌటియు గృహస్థత్వమ్ము కైకొంట నం
దనులన్ గాంచుట పెండ్లిసేయుట యిటుల్ నానాటి కేదేనియున్
బని యున్నట్టులె తోంచు నొక్కొకపనిన్ బైపై విసర్జించి శాం
తిని వేగం గావి నిమ్నుఁ గొల్చుటయె ముక్తిప్రాప్తి కామేశ్వరీ!"

యీ పద్యాన్ని సుమారు ముప్పయి సంవత్సరాలయీడులో వ్రాసిన్నీ ఆఱవై యెనిమిది వత్సరాల వయస్సు యిప్పటికి వచ్చినప్పటికీ మనస్సుకు విశ్రాంతంటూ కలిగించుకోవడం కలిగిందే కాదు. సన్న్యసిస్తే మనస్సు శాంతిస్తుందని కొందరు అంటారు. కాని సన్న్యాసులలోకూడా పలువురు యేవో వేళంబం పెట్టుకొని పాట్లుపడడమే కనపడడంచేత సన్న్యాసంకూడా మనోవిశ్రాంతికి కారణం గాదనే నేననుకుంటాను. "తలలు బోడులైన దలఁపులు బోడులా?" అన్న వేమన్నవాక్యం బాగా ఆలోచించ తగ్గది. "కామ్యానాం కర్మణాంన్యాసం సన్న్యాసం కవయోవిదుః" అనిగీత. అయితే ఆతలఁపులు వయస్సునుబట్టి వుంటూవుంటాయి. లోఁగడ బాల్య యౌవనాలకు సంబంధించినవాట్లను వుదాహరించే వున్నాను. కొందఱు కౌమారమంటూ వకవయస్సును విడఁదీసి వయస్సులు నాలుగని అన్నారు గాని శంకరులవారు లోనైనవారు కౌమారాన్ని పృథక్కుగా కొన్నిచోట్ల పుచ్చుకోలేదు.

"బాలస్తావ త్క్రీడాసక్త స్తరుణస్తావ త్తరుణీసక్తః
వృద్ధస్తావ చ్చిన్తాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః."

అనే భజగోవిందశ్లోకం పై సందర్భాన్ని బోధిస్తుంది. జ్ఞానులు యేవయస్సుగాని సుఖప్రదమయినట్టు వప్పుకోరు గాని సామాన్యులు "ఎల్ల సుఖమ్ములు కైకొనఁ, జెల్లుట యౌవనమునందె చేకుఱు" అంటూ వ్రాశారు. బాగా ఆలోచిస్తే ఆమాట బొత్తిగా అనాలోచితంగా కనపడు తుంది. ఎంతో యుక్తంగా నడుచుకుంటే తప్ప యెన్నో అనర్థాలకు ఆ యౌవనమే కారణ మవుతుందని యెందఱో వక్కాణించివున్నారు.

భర్తృహరి "శ్లో. కలిపయుదిపస్థాయిని ముదిరాక్షిదియావనే పరాత్మనః" అనిమెత్తుగాని యావత్తు జన్మనీ అది వ్యర్థం చేస్తుందని సిద్ధాంతీకరించాడు. ఎన్నివిధాల పరిశీలించినా మనోవిశ్రాంతిని కలిగించేవయస్సు కనపడదు. యౌవనాదివయస్సులలో కలిగిన సంతానానికి సర్వధా శ్రేయస్సంపాదనకై వార్ధక్యం ప్రయత్నించడమే సర్వత్రా కనపడుతుంది. ఏమో వాళ్ళతంటాలు వాళ్లు పడతారు. మన కెందుకని కృష్ణా! రామా! గోవిందా! అంటూ కాలక్షేపం చేసేవాళ్ళు కనపడరు, సరికదా! మరింగా లోకంలోని విషయాలుకూడా తమనెత్తిని పెట్టుకుని పాట్లుఁబడేవాళ్ళే కనపడతారు. పూర్వరకపువాళ్ళకు "కృష్ణా! రామా! గోవిందా" లాగాని కొత్తరకంవాళ్ళకు అవి అక్కఱలేదనుకుందాం. వారేనా నిర్గుణధ్యానాన్ని చేసుకుంటూ కాలక్షేపం చేస్తారా వార్ధక్యంలో? అలా చేస్తూన్నట్టు లేదు. గాంధిగారివంటి మహాజ్ఞానికి కూడా సంసారవిచారం తప్పినట్టులేదు. ఆయనకి జగత్తే సంసారం. ఇంతా ఆయనకంటే సామాన్య సంసారులకే అంతో యింతో విశ్రాం తంటూ వుంటుం దేమో? సామాన్య సంసారి రోగివంటివాఁడు, కాఁబట్టి వాఁడు తనకు అస్వాస్థ్యంగా వుంటే తప్ప దుఃఖపడవలసిన ఆవశ్యకత లేదు. గాంధీజీకో? అలా కాదు. యీయన వైద్యుఁడువంటివాఁ డవడంచేత "పరదుఃఖేన దుఃఖితః" అనే శ్లోకపాదానికి ప్రథమోదాహరణంగా వుండవలసివచ్చింది. విషయభేదం కొంత వున్నప్పటికీ శంకరాదులేమి, నారదాదులేమి, వీరంతా యీమాదిరివారే. అయితే వారు సముద్రం పర్వతంగానూ, పర్వతం సముద్రంగానూ మార్చేప్రయత్నాలు చేసినట్టు కనపడదు. గాంధిజీగాని, తదనుచరులుగాని చేసేప్రయత్నాలు మాత్రం చాలాభాగం అట్టివిగా సామాన్య బుద్ధులకు గోచరిస్తాయి.

అయినప్పటికీ ప్రస్తుతకాలంలో ఆయన వుపదేశాలు యే కొందఱు పండితులకో తప్ప సర్వేసర్వత్ర ఆమోదపాత్రాలుగా కనపడుతూవున్నాయి. ప్రస్తుతం మన క్కావలసిందల్లా నిర్విచార పురుషుఁడంటూ వున్నాఁడా

అనేదే. ఆది గగన కుసుమాయ మానంగా కనపడుతూ వుంది. నామట్టుకు నే ననుకొనే వాణ్ణిగదా యిక వార్ధక్యం వస్తూవుంది. సంసార వ్యాపారం చిరంజీవుల కప్పఁజెప్పి కృష్ణా! రామా! గోవిందా గా కాలక్షేపం చేసు కుందా మనుకొనే వాణ్ణి. కాని అంతో యింతో ఆపనిన్నీ జరుగుతూవుంది కాని ఖండనాలూ మండనాలూ, వాదాలూ భేదాలూ యివి మాత్రం తప్పి నట్టు లేదు. కొందఱు పెద్దలు రాజకీయాల్లో ప్రవేశించి తీరిక లేకుండా పరిశ్రమ చేస్తూన్నా రంటే అది అవసరమే అనుకుందాం, ఆ వుద్యోగం అనేక ప్రజలతో సంబంధించింది కనక వారికి చిత్త విశ్రాంతికి అవకాశం వుండక పోవచ్చు. నాకో? అట్టి వుద్యోగం లేశమూ లేదుగదా, చిత్త విశ్రాంతి యెందుకు లేకపోవాలి? అక్కడికీ నేను లేనిపోని వాట్లలో చిక్కుకోక కొన్నిటినుంచి తప్పుకుంటూనే వున్నానని పత్రికా పాఠకులు యెఱుఁగిందే కనక విస్తరించ నక్కఱలేదు. నేనేమో ఆ రీతులు రావడం తోటే వెనక తగ్గుతూ వున్నాను కాని మఱికొందరు పెద్దలు కావాలని ప్రత్యేకించి అట్టి తోవలోకి యెవరెన్ని విధాల ఆప్తులైన వారు సదుద్దేశం తో వారించినా వినక దిగి పరిశ్రమ చేస్తూన్నారు.

ఆ యీ సందర్భాలన్నీ పరిశీలిస్తే నిర్విచారావస్థ అనేది పండితా పండిత సాధారణ్యేనా యెవరికీ కూడా వార్ధక్యంలో కూడ సంఘటించదనే తేలుతుంది. సంసారంలో వున్నవాళ్ళకి యింకా యెన్నో విచార కారణాలు కలుగుతూ వుంటాయి. అవి అందఱూ యెఱిఁగినవే కనక వివరించనక్కఱ లేదు. అయినా వకపద్యం వుదాహరించి మఱీ తరవాయి అందుకుంటాను.

మ. "ధనమున్నన్ సతి లేక తత్సుఖము సందర్భించినన్ సంతతిన్
గన కాభాగ్యము గల్గ వేఱొకటి అక్కఱ్యంబు చేకూర నిం
కను నొక్కండది గల్గనొక్కఁ డదియున్ గల్గన్ మఱొక్కండు లే
దనుకో ల్దప్పదు తృప్తి యెక్కరణి లభ్యం బౌను కామేశ్వరీ!"

సర్వసామాన్యంగా ప్రతి గృహస్థుకీ కలిగేవి యీ పద్యంలో పేర్కొఁబడ్డాయి. పండితులకూ, కవులకూ మరికొన్ని కూడా అదనంగా

వుంటా యన్నందుకు వెనక వుదాహరించిన కొన్ని సందర్భాలు చాలు ననుకుంటాను. అయినా కోరికలు మనమనిషి జాతికే కాదు; సామాన్యంగా మన కళ్ళకు కనపడే జంతువులలో చిన్నదిగా వుండే చీమదగ్గరనుంచి వుండే తీరతా యన్నందుకు వాట్ల వాట్ల వ్యాపారాలు సాక్ష్య మిస్తాయి. అందుచేతే అనుకుంటాను జ్ఞానులు పొత్తిగా యే వ్యాపారానికీ ఆమోదం చూపకపోయింది. శ్రీకృష్ణుఁడు గీతల్లో యేపనిన్నీ చేయకుండా యేప్రాణి గాని వుండడం సంభవించదనే అంశాన్ని

శ్లో. "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్"

అనే శ్లోకంలో చెప్పివున్నాఁడు. అందుచేతనే సన్న్యాసులు కూడా యేవో సత్కార్యాలకు కొంత ప్రయత్నిస్తూ వుంటారు. కాని వారికి యేర్పడ్డ విధులు అందుకు సమ్మతించవు. కొందఱు సత్కార్యాలనే భ్రాంతితో అసత్కార్యాలకు వుపక్రమిస్తారు. (వీరు సన్న్యాసులు కారు, సంసారులే) ఆ కార్యాలలో కొన్ని "కాకులని కొట్టి గెద్దలకు వేయడం" వంటివిగా నున్నూ "గొర్లను కోసి చెప్పులు దానం చేసిన" వంటివిగా నున్నూ వుంటాయి. కాని అసలు వారి ప్రవృత్తిమాత్రం దురుద్దేశ ప్రయుక్తం కాదు. అక్కడ వున్న దోష మేమిటంటే, సద సత్కార్య వివేచన వారికి గోచరించ డానికి తగిన వృద్ధసేవ లేకపోవడమే. గాయత్రీ మంత్రంగాని,మఱికొన్ని మంత్రాలు గాని జపించ డానికి ప్రధానఫలితం బుద్ధినైర్మల్యంగా కనపడుతుంది. యితర మంత్రాలలో యీ విషయం యెంతవఱకు వుందో ఆ మంత్రశాస్త్రంలో విస్తారం కృషిచేసిన వారికిఁ గాని గోచరించదు. గాని గాయత్రీ మంత్రంలో "ధియో యోనః ప్రచోద యాత్" అనే అక్షరాల వల్ల పైని వుదాహరించిన అంశం స్పష్టంగా గోచరిస్తుంది. ఇంకొకచోట "సనో దేవ శ్శుభయా స్మృత్యా సంయునక్తు" అని వుంది. అట్టి బుద్ధి నైర్మల్యం వల్లఁ గాని సత్కార్యా సత్కార్య వివేచన చేసే యోగ్యత కలగదు. అందుకోసమే యెన్ని జపతపాలు చేసినా చేసినట్టు ఋషుల ప్రవృత్తులు సాక్ష్య మిస్తాయి.

సుమారు యిరవై వత్సరాల వయస్సు నాఁటికి పరిశీలించి చూచు కుంటే నామట్టుకు నేను చేసిన కార్యాలలో మంచి కార్యాలు మూఁడు మాత్రం వున్నట్టు కనపడ్డాయి. వాట్లను కాశీ సహస్రంలో వుటంకించాను.

శ్లో. "పాపా పాదనలాపనేన కిమలం పాపేత రాపాదనం
సత్కృత్యత్రితయం మయాఽపి రచితం సర్వాఘ నిర్వాపణమ్.
గంగాస్నాన మఖో తవ స్తుతి రియం శ్రీధాతురత్నాకర
శ్శ్రీ మద్రామ కథాసుధా మధురీ రంగ త్తరంగా కరః"

నే నేవి సత్కార్యా లనుకున్నానో, అందులో రెండు కవిత్వానికి సంబంధించినవే. కాని ఖొత్తిగా కఠిన పాఠంలో వుండడం చేత లోకానికి అందులో యిప్పటి లోకానికి వాట్లవల్ల యే మాత్రమూ వుపకారం కన పడదు. గంగాస్నానం వల్ల లోకోపకారం లే దని చెప్పనే అక్కఱలేదు కదా! అది కేవలమూ స్వార్థం. అప్పటికింకా దేవీభాగవత రచన కారం భించినట్టు లేదు. యిదికూడా పుణ్యకార్యమే. కనుక దీన్నికూడా కలుపు కుంటే సుమారు ముప్పై యేళ్ళు దాఁటేలోపున చేసిన పుణ్య కార్యాలు "జన్మాని కల్లా శివరాత్రి" కవిత్వ సంబంధమైనవి మూఁడు మాత్రమే కనపడతాయి. శ్రవణానందం ఆలోఁగా రచించినదే. దానియందు లోకా నికి యెక్కువ ఆదరమైతే వుందిగాని ఆ రచన పుణ్యకార్యంకిందకి రాదు. మనుచరిత్రాదుల వల్ల ఆయా గ్రంథకర్తల కెంత పుణ్యం వుంటుందో దీనివల్ల మాకూ అంతే అని వేఱే చెప్పనక్కఱ లేదు. యిప్పటి వారు భాషాసేవ చేయడమే ప్రధానంగా గౌరవించడం వుంది. కాని పూర్వపు వారు భగవత్కథా సందర్భం లేనివాట్లయం దంతగా గౌరవం చూపేవారు కారు. అందుకే కాళిదాసాదులు రఘువంశ, కుమారసంభవాలున్నూ, ఉత్తర రామచరిత్ర, మహావీర చరిత్రాదులున్నూ భగవత్కథా మిశ్రితాలుగా రచిం చినట్టు కనపడుతుంది. కాళిదాసు మేఘసందేశం రచిస్తూ కూడా అంతో యింతో దేవతా స్థానాలను గూర్చి పేర్కొవడం కూడా ఆ దోషపరిహారా నికే అని తోస్తుంది.

నేను సుమారు పదమూఁడుసంవత్సరాలు బడులలో గడిపివున్నాను. ఆరోజులు నా జీవితానికి యెక్కువ సంతృప్తిని ఆపాదించేవిగా పలువురు చెపుతూ వుంటారు. పత్రికలలో కూడా వ్రాయడం కలదు. కాని అక్కడ నేనుచేసినది భృతకోపాధ్యాయత్వం. దాన్ని మనస్ఫూర్తిగా పుణ్యకార్యంగా పరిగణించలేను. స్కూళ్లలో కాక యితరకాలంలో యెవరికేనా చెప్పిన అక్షరాలేతప్ప ఆబడులలోవున్న రోజుల్లోజరిగిన విద్యాదానం నాకు సుకృతాపాదకం కాదని నేను అనుకుంటూ వుంటాను. ఆరోజుల్లో వ్రాసినగ్రంథాలలో యెక్కడో భగవద్విషయం కొంత వున్నా చాలాభాగం యితరవిషయమే కనపడుతుంది. వివాదప్రధానాలు గీరతం, గుంటూరుసీమలనుగూర్చి చెప్పనక్కఱలే లేదు. అయితే యేకవిగాని సర్వదా భగవద్విషయమే వ్రాయడం తటస్థిస్తే ఆకవిత్వం జనరంజకం కాక పోయేమాట సత్యమే. హరికథ చెప్పే కథకుఁడు హరిహరీ అంటూ జపిస్తూ కూర్చుంటే దాన్ని అభినందించే దెవరు? అందుకే వ్యాసవాల్మీక్యాదులు నానాగాథలతోను సంబంధించిన భారత రామాయణాదులు రచించినట్టు తోస్తుంది. ఆపక్షంలో మాత్రం మారచన చాలావఱకు సత్కావ్యరచనకిందకే వస్తుంది. యిటీవల వార్ధక్యంలో నున్నూ, కౌమారావస్థలోనున్నూ ఆరోగ్యలోపాన్ని బట్టి రచించిన దేవతాస్తోత్రాలు పుణ్యసంపాదకాలే అవుతాయి. కాని అవి "ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ" అన్న గీతావాక్యప్రకారం తాత్కాలిక ఫలితాలుగా వున్నప్పటికీ పారలౌకిక సుఖాపాదకాలుగా కనపడవు.

ప్రసక్తానుప్రసక్తంగా వ్యాసం మరోధోరణిలోకి ప్రవేశించింది. చెప్పొచ్చే దేమి టంటే? యీ వార్ధక్యంలో యిదంతా విచారహేతువుగా అప్పుడప్పుడు మనస్సుకు తట్టుతూ వుంటుంది. శంకరులవారు "వృద్ధ స్తావ చ్చింతాసక్తః" అన్నదానికి నాకు యిప్పటికి బాగా అర్థం బోధపడింది. యీవార్ధక్యంలో వెనకటివయస్సులోకన్న శాంతంగా కాలం నడుస్తుందేమో అనుకుంటే అలా నడవడం లేదు. కొడుకులు, కూఁతుళ్ళు మనమలు, మనుమరాళ్ళు వగయిరాలతో సంసారం వక నాటకకంపెనీ

కింద తయారయినప్పుడు మనస్సుకు విశ్రాంతి యెక్కడ? పిల్లశ్రేయస్సు కోసం భగవంతుణ్ణి ప్రార్థించడంతోటే సరిపోతూవుంది.

మ. "కొడుకుల్ కూఁతులు నేగు రిప్పటికి నాకు న్నీకృపన్ గల్గి రె
య్యెడ విద్వాంద్రి ననుగ్రహించుటయు నా యీ సన్ను దైన్యంబుపా
ల్పడకుండన్ దగఁ బ్రోచుచుంటయును నిన్ బ్రార్థింతు నోయమ్మ! నీ
యడుగుల్ మ్రొక్కెడి దాసదాసులకు దాస్యార్హుండఁ గామేశ్వరీ!"

మ. "కొడుకుల్ మూఁగురు కూఁతు లిర్వురగు నీకొంచెంపు సంసారపున్
బెడద న్నేను భరింపలేక మిగులన్ భీతిల్లు చున్నాఁడ నా
క్కడ వీరేశుజగమ్ములన్ మనుతు జాగ్రత్తన్ గటాక్షించి నీ
యడుగుల్ మ్రొక్కెదమత్కుమారునకునిమ్మారోగ్యమున్ భాస్కరా!"

అయీపద్యరచన జరిగి యిప్పటికి పుష్కరకాలం అతిక్రమించింది. సంతానం లేకలేక కలిగింది మొదలు యీలాటికవిత్వానికి ప్రోద్బలం చేసేది కలిగింది. ప్రథమసంతానమే ఆ యీ కవిత్వానికి యెక్కువకారణమైనది కలిగింది. ఆ చిరంజీవి ఆరోగ్యానికి నా పడ్డపాట్లు గాని, పెట్టిన ఖర్చు, యిచ్చిన నూటపదార్లు, శాలువులు, కొల్చినదేవుళ్లు వీట్లనుగూర్చి పలువు రెఱుఁగుదురు. వేయేల? అతఁడు పుట్టినక్షణంమొదలు యేరాగి దమ్మిడీగాని యే కుంటిగ్రుడ్డివానిచేతులో పెట్టినా అతని ఆరోగ్యాన్ని ఫలితంగా వూహించుకొనే గాని పరమార్థానికి చేసినట్టే లేదు. అతణ్ణి ఆశ్రయించిన ఆ దగ్గువ్యాధిని జయిస్తే నేను పరలోకకష్టాల నన్నిటినీ జయించినట్టే తలఁచేవాణ్ణి. "నరకంబున్ దరియించినట్టె మది నానందింతుఁ గామేశ్వరీ!" లోనైనవాక్యాలు పైసందర్భాన్ని తెలుపుతాయి. యిప్పటివారైతే దీన్ని పలువురు యీసడిస్తారుగాని మనపూర్వులు. "తచ్ఛాన్తి రౌషధై ర్దానై ర్జపహోమ సురార్చనైః" అని ఘంటాపథంగా తెల్పివున్నారు. నేను స్వవిషయంలోనే కాదు, సంతానవిషయంలోనే కాదు దేవతాస్తవం చేసి ఆరోగ్యం పొందడమే కాకుండా నావంటి

పెద్దసమ్మతం కలవాళ్ళు మహాదేవుడికి యీమాత్రాన్నే వుపదేశించి వున్నారు. వారివారి కృతార్థత్వం కలిగినట్లు వ్రాస్తున్నారు. వారికి లక్ష్యంగా యీసందర్భం నేను మాచిరంజీవిని గూర్చి అనుకుంటున్నానో వాఁడు వుత్తరపంతుఁడై వర్తిల్లుచున్నాఁడు. వ్యాధిమూలక్రిం అప్పుడప్పుడు ఉపాంచెమో కనపడుతూనే వుంటుంది. (ప్రారబ్ధం రోగతో సహా) దానికి కారణం, మరొకటి, వాఁడికి యీ భక్తి మార్గం పట్టుపడకపోవ ఏమే అని నాతలఁపు. అందులో యీలాటిసందర్భాలకు శివస్తవము ముఖ్యమని నా అభిప్రాయం. ప్రతిస్వల్పవిషయానికీ దేవతాస్తవంద్వారా అవసరం వుండదు. యేవో దీర్ఘ జంఘరోగాలకే—

మ. "పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యులన్
దడవన్ లాభము గల్గినన్ గలుగు మద్రాంతిప్ప్రకాశారముల్
గుడువన్దాపగుచో నరుం డెపుఁగి రాఁ "గుమ్మా! మొరో!"యంచు నీ
యడుగుల్ పట్టుటమే రుజాపనయనోపాయంబు కామేశ్వరీ!"

మయూరుఁడు మొదలైన మహాకవులు ప్రస్తుత విషయంలో ప్రబలప్రమాణంగా కనపడతారు. యెందఱు ప్రమాణంగా కనపడ్డా పిదపకాలం వచ్చింది. ఆయీవిషయా లన్నీ చేదస్తాలుగా "తోసిరా" అనే తోవ యేర్పాటయింది. యిదికూడా యీ వార్ధక్యంలో మనస్సుకు వక విచారకారణంగా యేర్పడింది. వకటేమిటి? యిప్పటి అల్లకల్లోలాల్లో వకటీకూడా నామనస్సుకు నచ్చదు. నచ్చక చేసేదేమిటి? చేసేదిగడ్డిపఱ కంతకూడా లేకపోయినా మనస్సుకు విచారం తప్పడంలేదు.

తేలినముఖ్యాంశం జన్మమెత్తినక్షణం మొదలుకొని జీవుఁడికి యేదో వకవిచార మంటూ లేనిక్షణం వుండదనియ్యేవే. అయితే చదువు సంధ్యలు లేనివాళ్ళకు యింతకన్న కొంత విచారం తక్కువగా వుంటుందేమో అని కొంత తోస్తుంది. కాని వాళ్ళకుకూడా యేవో వుంటూనే వుంటా యను కోవాలి. అందుకే కాఁబోలును, సుఖమనే దంటూ లేనేలే దనిన్నీ, వున్న

చేమో ప్రపంచకంలో దుఃఖమే అనిన్నీ, ఆదుఃఖం కొంత తగ్గివున్నప్పుడు దాన్నే సుఖశబ్దంతో వ్యవహ రిస్తా రనిన్నీ, వేదాంత విజ్ఞాన సునిశ్చితారు లైన మహామహులు నిర్వచించి వున్నారు. ఇంతవఱకు నా అనుభవంలో వున్న విషయాలను బట్టి వ్రాశాను. యితరుల అనుభవాలు యింతకన్న భిన్నంగా వుంటే వుండవచ్చును.

"నానాగతి విధికృత స్పష్టియందు కనపడును గదా!" ఋషులుగా జీవయాత్రను గడిపిన వ్యాస నారదాదులు పరస్పర కష్ట సుఖాలను గూర్చి ప్రస్తావించుకున్న మాటలు పురాణాల్లో వున్నాయి. అవికూడా నిర్విచారా వస్థ వారికి కలిగినట్టు తెల్పడం లేదు. యింక ప్రభువులను గూర్చి విచా రి స్తే వారి స్థితి బొత్తిగా అధ్వాన్నంగా కనపడుతుంది. 'ఈ జగత్రయ మేలు నిందురిన కైన సన్న్యాసి కున్నంత సౌఖ్యమ్ము లేదు' అంటూ దేవీభాగవతంలో కనపడుతుంది. సన్న్యాసులేమో సంసారులు సుఖవంతు లనిన్నీ, సంసారులో సన్న్యాసులే సుఖవంతు లనిన్నీ, బీదలు ధనికులు సుఖవంతు లనిన్నీ, ధనికులు బీదలు సుఖవంతు లనిన్నీ, పురుషులు స్త్రీలు సుఖవతులనిన్నీ, స్త్రీలు పురుషులు సుఖవంతు లనిన్నీ, యీ విధంగా వొకరిని చూచి వక రనుకోవడమే కాని నిజమైన సుఖము అంటే నిర్వి చారావస్థ యెక్కడ వుందో గోచరించదు. అసలు ప్రపంచకపు నడవడి బాగా విచారి స్తే వక వస్తువును వకవస్తువు ప్రేమించడం తోటిన్నీ, వక వస్తువును వకవస్తువు ద్వేషించడం తోటిన్నీ నిండివున్నట్టు కనపడుతుంది. యిందులో ద్వేషిచడ మనేది దుఃఖ కారణమనే విషయం సులువుగానే తెలుస్తుంది. బాగా ఆలోచి స్తే ప్రేమించడం కూడా దుఃఖ కారణమని అవగత మవుతుంది. యీ రెండూ లేకుండా ప్రపంచకమే లేదు. అందు చేతనే ద్వంద్వాతీతత్వాన్ని గూర్చి గీతలు వగయిరా గ్రంథాలు విశేషించి బోధిస్తాయి.

"యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః."

అనే గీతావాక్యానికి లక్ష్యభూతులు యీ కాలంలో ఎక్కడ వాళ్ళమధ్య వుండేవారేమో? యిప్పుడు గీతపైనే ప్రశ్నలు వచ్చి, అందులో వుండే

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః."

అనేదాన్ని తమప్రవృత్తికి అనుగుణంగా అర్థం చెప్పడాని, అందులో వున్న బ్రాహ్మణ, శ్వపాక శబ్దాలను అసలే వదలడాని ఆ గీత శ్లోకే యింకొకచోట వున్న "స్వధర్మే నిధనం శ్రేయః; స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః; చాతుర్వర్ణ్యం మయా సృష్టం" యిత్యాదులు యిటీవలివారి వ్యక్తిత్వ అనుకూల విస్మరించి వాదాలు ప్రారంభి స్తారు. అందుచేత ఆచరణం వున్నవారికన్న లేనివారే మెండుగా కనపడ తారు. యివన్నీ మనస్సుకు విచారకారణంగానే కనపడతాయి. యితరాన్ని విచారాలైతే మనస్సుకు లేకపోలేదు గాని విస్తరించి యీవిచారమే నన్ను కళవళపెడుతూ వుంటుంది. యెన్నివిధాల సరిపెట్టుకున్నా యీవిచారం మనస్సునుంచి అవతలికి పోవడం లేదు. తిండితింటూవున్నా యిదే విచారం, పరున్నా యిదే విచారం. గాంధిగారు నిత్యమూ గీతలుచదువుకుంటూ వుంటా రని వినడం. అట్టిమహాత్ములు కూడా "అర్ధజరతీన్యాయాన్ని" పట్టి ఆగీతార్థాన్ని కొంతమాత్రమే ఆమోదించినట్టు కనపడుతుంది గాని యావత్తున్నూ ఆమోదించినట్టు ఆయన అమల్లోపెట్టే సంస్కారాలవల్ల లేశమూ కనపడడం లేదు. సామాన్యలోకం ఆయన్ని వరవడిగా పెట్టు కొని ఆయా కార్యాలకు వుపక్రమిస్తూవుంది. యిదంతా లేనిపోని విచా రంగా మనస్సుకు బాధించి, పోనీ భగవన్నామస్మరణ చేసుకున్నట్టూ అవు తుంది, మన విచారాన్ని లోకానికి తెల్పినట్టూ అవుతుందని

శ్లో. "శివ! శివ! శంకర! శివ! శివ! శంకర!
శివ! శంకర! శంకర! శివ! శంభో!

పరమదయాకర ! భవహర ! శుభకర !
భక్తిం దిశముక్తిం దిశ శంభో ! "

అంటూ సంస్కృతంలో లోఁగడ వ్రాసిన "నమశ్శివాయ" స్తోత్రంలాగే వ్రాయడానికి మొదలైతే పెట్టాను గాని, అయ్యో ! సంస్కృత మైతే అందఱికీ బోధపడదు. ఆపద్ధతిని లాభంవుండదని దానిలో తెలుఁగు ప్రతిశ్లోకంలోనూ కలిపాను. సగం తెలుఁగూ, సగం సంస్కృతమూ యీలాటి కలగాపులగాలు యిదివఱలో కవులు రచించడం ఆచారం లేదు. లేకపోతే లేకపోయింది. దీనిలో వచ్చే మహాపాప మేమిటని వూహించి యేలా తోఁచిందో ఆలాగే వుంచాను. యతులుకూడా కొన్నిచోట్ల పెట్టనే లేదు. కొంచెం వుదాహరిస్తాను,

"ధర్మము లనుపే రిట నపధర్మము
లెన్నియొ పుట్టుచు నున్నవి శంభో !
శివ ! శివ ! శంకర ! శివ ! శివ ! శంకర !
శివ ! శంకర ! శంకర ! శివ ! శంభో !
అవి కల్పించినవా రవివేకులు
గారు వివేకులె విక్రమము శంభో ! శివ ! శివ ! శంకర !॥
కూఁతులఁ గాంచినవారికిఁ బూర్వము
కొండంత పుణ్య మనిగద శంభో ! శివ! శివ! శంకర!॥
యిప్పుడు కూఁతులఁ గాంచినవారికి
నెట్టినరకమో తెలియదుశంభో ! శివ ! శివ ! శంకర!॥
అల్లుఁడు హరిజనుఁడో ? హరజనుఁడో ?
అమ్యుఁడో! తెలియదక్కట! శంభో! శివ!శివ!శంకర!॥
అద్వైతము జీవేశ్వరులకె కుదురుట
దుర్ఘట మని యందురు శంభో ! శివ ! శివ ! శంకర!॥
అన్నివ్యక్తులకు నన్నిజాతులకు
నద్వైతం బెటు లబ్బెది శంభో ! శివ ! శివ ! శంకర!॥

ఏమియుఁ దెలియని అజ్ఞానుల నీటు
చెప్పఁగొట్టు టవి పోసము శంభో : 5: 5: 1638:

యీమాదిరిగా యేవో చేస్తుంగా కొన్నివందలు యిప్పటికి వచ్చి వాయి శ్లోకాలు. పనిలేనిపాటగా యీవార్ధక్యంలో యీ విస్తారకరణమా విద్వాంసులకి భంజకమే అయినా యిందులో ప్రతిశ్లోకంలోనూ ఏ భాగం భగవన్నామం వుండడంవల్ల యిది యీవయస్సులో యుక్తమయిందే అని సంతోషిస్తూ దీన్ని సాఁగిస్తున్నాను. అంతేనేకాని యిది లోకోపకారకంగా వుంటుందనే తలఁపుతో దీన్ని వ్రాయడం లేదు.

మొత్తంమీఁద విర్విచారాపన్నంటూ యేవ్యక్తికేనా కలిగితే కలుగు తుందేమోకాని అంతో యింతో కవిత్వం చెప్పేవాళ్ళకి కలగదేమో అని నా అనుభవంవల్ల నాకు గోచరిస్తూవుంది. అందుకే అనుకుంటాను "చింత కవులందుఁ దపసులచిత్తమందు" అని శ్రీరామచంద్రుని ప్రభుత్వాలాన్ని గూర్చి దశరథుని ప్రభుత్వాన్నిగూర్చి చెపుతూ మొల్ల వర్ణించింది. లోకం ఆదరించినా ఆదరించకపోయినా వ్రాయడం తప్పదు, ప్రకటించడం మానితే మానవచ్చును. పూర్వంవాళ్ళు వ్రాసిపడేయడమే కాని ప్రచురించడం వుండేదే కాదు. ఆదరంవున్నవాళ్ళు వాట్లని వ్రాసుకోవడం వుండేది. యిప్పుడు ముద్రాయంత్రసహాయ మంటూ వుండడంచేత మంచిదేకావక్కఱలేదు, యేలాటిదేనా సరే వెంటనే ప్రచురించడం జరుగుతూ వుంది. యీ విషయాన్ని తెలిపేపద్యం వకటి యెప్పుడో అవధానంలో చెప్పినదా పతు వుదాహరించి దీన్ని ముగిస్తాను.

చ. "మునుపు మహాకవీంద్రులు సమున్నతరీతి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకులకూఁతలు తాటియాకులం
దునె నశియించె నోటఁ బడు తుంపురులేవియు విప్పు దచ్చువ
చ్చినకతనన్ జగాన విలసిల్లెడి మేటికృతుల్ నశించెడిన్."

యేవో నానావిషయాలు వ్రాశాను. యేవివ్రాసినా నిర్వికారస్థితి కలిగిన ధన్యు లంటూ ప్రపంచకంలో యెక్కడేనా వుంటారా ఆనేదానిని గూర్చియ్యేవే. అయితే నాకొక్కడికే అట్టిస్థితి కలగలేదని లోకానికంతకూ లేదనుకోవడం మిక్కిలీ తెలివితక్కువ. దేన్నిగాని " తనకలిమి యింద్ర భోగము తనలేమియె నిఖిలలోక దారిద్ర్యంబున్ " అన్నట్టుగా సిద్ధాంతీక రించకూడదు కాఁబట్టి నిర్వికారులైన మహామహులు కొందఱు వున్నారేమో ! వారిధన్యత్వాన్ని వేయినోళ్ళ స్తుతిస్తూ వారికి సర్వదా నమస్కరిద్దాం. సంసారులుగా వుండికూడా అట్టిసుయోగం లభించినవారుంటే అట్టివారు మఱీ అభినందనీయులు.

వార్ధక్యాన్ని గూర్చి యింకా రెండు మాటలు వ్రాస్తాను. నేను వార్ధక్యంలోనే వుండిన్నీ, ఆ లక్షణాలు పూర్తిగా అనుభవిస్తూ వుండిన్నీ కూడా యేమోకాని యింకా పడుచుతనంలోనే ఉన్నట్టు నాలోనేను అనుకొంటూ వుంటాను. కాని మా చిరంజీవులు నాకన్న సుమారు పద్దెన్మిదేళ్ళ పెద్దలుగా వున్న వాళ్ళ మాతామహుణ్ణి యేలా భావిస్తారో నన్నున్నూ ఆలాగే భావిస్తారు. అంటే ఆయనకు తమ్మును గూర్చి తెలుసుకొనే శక్తి యెంత వుందో నాకున్నూ అంతేవుం దని భావిస్తారు. అంతేకాని అంతకన్న పడుచు తనంలో వున్నాననిన్నీ, జ్ఞప్తివుం దనిన్నీ, అనుకోరు. వాళ్ళకు కావలసిన యిప్పటి నాగరికానికి సంబంధించిన గ్రామఫోనుపెట్టెలు, యేవో లైట్లు వగయిరాలు కొనడం వగయిరాలయితే చేస్తారు కాని అవి మన స్వంతం కావనిన్నీ యెవరితాలూకో యెరవు తెచ్చామనిన్నీ మభ్యపెట్టి నాతో చెపుతూ వుంటారు. నేను ఆయీ విషయాలు అసలు మా వాళ్ళను పృచ్ఛ చేయడ మంటూ వుండనే వుండదు. యెందుచేతంటే, వాళ్ళు యేలాగా నిజం చెప్పరని నేను యెఱుఁగుదును. అనాదిగా నేను అసత్యం చెప్పక పోవడమే కాకుండా వొకళ్ళని అసత్యం చెప్పవలసిం దని ప్రోత్సహించను. ఆయీ సందర్భాలను గూర్చి వాళ్ళని నేను ప్రశ్నించడం వాళ్ళు అసత్యం చెప్పడానికి కారణమే అవుతుంది కనక ప్రోత్సహించినట్టే అవుతుం దని నేను

తూష్ణీంభావాన్ని వహిస్తూ వుంటాను. వాళ్ళ చెప్పే యీ ఆచారాన్ని నా చిన్నప్పుడే భయభక్తులుగా భావిస్తూవుండేవాడను. నాకు భగవంతుడు అప్పటినుంచీగానే సమస్త సంపత్తులూ సమకూరుస్తూ వచ్చాడు. ఆయా విషయం పలుచోట్ల నేను స్పష్టీకరించి వున్నాను.

"యీనాకు సర్వంబు నీ, బలమే కారణమై యెసంగె జననీ! ప్రార్థింతు నీకీతిగా, గలకాలమ్ము బోవని మృత్తికమున్ గాంక్షింప నామేశ్వరీ!" యిత్యాదులు చూస్తే పైవిషయం తెలుస్తుంది.

నాకు ముదితనం అంటే యేలా వుంటుందో పూర్తిగా తెలుసును కాబట్టి అంతో యింతో వైరాగ్యం పట్టినా నేను పట్టుచేగకుండానే గృహస్థ ధర్మాన్ని నిర్వర్తించుచున్నాను. మా చిరంజీవులకో, ముదితనం అందే లేశమున్నా తెలిసినట్టు లేదు. అట్లని దుర్వినియోగం చేయడంగాని గృహస్థులకు అవసరంలేని వస్తువులు వగయిరాలతో యిల్లు నింపుతూవుంటారు. కలగజేసికొని వారించినా ప్రయోజనమున్నట్టు తోచదు. వృద్ధులమాటలు వినరుకదా! యీ వార్ధక్యంలో యీ విచారంమాత్రం పోగొట్టుకున్నా పోవడంలేదు. యీ సందర్భంలో నాప్రాయంలో అనుభూతమైన వొక విషయం జ్ఞప్తికి వస్తూవుంది. దాన్ని వుదాహరిస్తాను. వకవర్తకుడు పడుచు తనంలో స్వకులవృత్తుల వల్ల ఆర్జించి నిలవచేసిన వాఁడు వుండేవాఁడు. కొడుకులూ కూఁతుళ్ళూ మనుమలూ మనుమరాళ్ళూ చక్కఁగా దుర్యోధన సంపత్తిగా వుండేది అతని సంపత్తు. వార్ధక్యం వచ్చింది. కొడుకులు వ్యవసాయం, వేదాయం వగయిరా వ్యాపారాలు చేస్తూ గ్రామంలో పెద్దపేరుగా వర్తిస్తూన్నారు. చాలాయిళ్ళు కట్టడమే కాకుండా పొలాలుకూడా కొన్ని కొన్నారు. తండ్రికి నేత్రావరోధం కూడా రావడంచేత యిల్లు కదలడం లేదు. పండుగా పబ్బమూ వస్తే ముసలాఁడు చేసుకో వద్దంటాఁడనికాఁబో బను చేసుకున్నా లేదని చెప్పవలసి వచ్చేది. ఆకారణంచేత ఆ చేసుకున్న పదార్థం ఆ ముసలాడికి పెట్టడానికి కూడా అవకాశం లేకపోయేది. మావాళ్ళు అలాటి పనులయితే చేయడం లేదుకాని నాకు యిష్టంలేని యిప్పటి

నాగరికతకు సంబంధించినవి నాకు తెలియకుండామట్టుకు యిప్పటి మట్టుకు కొన్ని నా మనస్సుకు విచారాన్ని కలిగిస్తూవున్నాయి. యీ విచారం వాళ్ళ భవిష్యద్గతికి సంబంధించిందేకాని నా భవిష్యద్గతికి సంబంధించింది కాక పోయినా నన్నే పీడిస్తూ వుండడం తప్పడం లేదు.

నాకు భగవంతుఁడు ప్రసాదించిన విరాగాన్ని వినియోగించినా యీ విచారం తప్పడమే లేదు. పయిఁగా లోకంలో యెవరో వేదశాస్త్రాలకు విరుద్ధమైన సంస్కారాలు ప్రారంభిస్తేనే నా మనస్సుకు విచారం కలిగే టప్పుడు "అత్మావై పుత్రనామాసి" గాళ్ళు మన స్థితిగతులకు మించిన పను లకు ప్రారంభిస్తే విచారం లేకపోవడం యేలా సంభవిస్తుంది ? యిదంతా ప్రతి వృద్ధవ్యక్తికిన్నీ సంఘటిస్తూనే వుఁటుందని నేను భావిస్తాను.

యిక శబ్దాలు తప్పులుకానివి యెవరేనా తప్పంటే కలిగే విచారం నా యితర వ్యాసాలవల్ల లోకం యిదివరకే గ్రహించి వుంటుంది కనక విస్తరించ వలసి వుండదు. భగవన్నామ జపాని కంటూ మొదలు పెట్టడం తోటస్టే ఆయీ విచారాలు వచ్చి చుట్టుకుంటూ వుంటాయి. అందుచేత నిర్విచార స్థితి కలగడం కష్టసాధ్యమని నే ననుకుంటూ వుంటాను. నిర్వి చారస్థితిలో భగవద్విషయక విచారాన్ని కూడా జమకట్ట కూడదు. అది సర్వకాల సర్వావస్థలయందూ అంటే....

శ్లో. స్వపపిన్నపి లపన్నపి స్థితి ముపా
గతోగతి ముపాగతోఽపి భజతం నమశ్శివాయోం"

అన్నట్టు జరగఁదగ్గదే. అది ముముక్షువులకు మాత్రమేకాదు, ముక్తులకుకూడా కర్తవ్యమే అని విస్పష్టంగా "నివృత్తతర్షైరభిగీయమా నాత్" అని శ్రీమద్భాగవతంఘోషిస్తూవుంది. (నాఽతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతే) కాని సంసారులకుమాత్రం భగవద్విచారం మొద లెడితే సాంసారికవిషయాలు వచ్చి మనఃఫలకంలో ప్రతిఫలించి తాండ వించడానికి ప్రారంభిస్తాయి. (అతాండవించేవిషయాలు యౌవనంలో వాక

మాదిరి. వార్ధక్యంలో యింకోమాదిరి. యింతే భేదం) వేసే స్మరణాస్త్రి మెట్టమెదుట కనపడే వస్తువులన్నీ వశ్యం కుసుమం. అది బిరదం మర్కటం. యిది విషయాంతరం.

దీన్నిగురించి వేరొకమాట ప్రస్తావిస్తాను. తేలిన ముఖ్యాంశం నిర్విచారస్థితి గృహస్థులకే కాదు, సన్న్యాసులకుకూడా సంభవించడం కష్ట సాధ్యమనిన్నీ, అది యెవ్వరో పుణ్యాత్ములు సంపాదించఁ గలుగుతారనిన్నీ తేలుతుంది. మొత్తం యెన్నిచదివినా మనోజయం సంపాదించడం చాలా కష్టం. మనస్సు మర్కటం వంటిది. దాని చాంచల్యం బాల్యాదివయస్సు లలో మాత్రమేకాదు, వార్ధక్యంలోకూడా వదలదు. దానికోసమే వాయు నిరోధంతో సంబంధించిన యోగశాస్త్రం పుట్టింది. దాన్ని సంధ్యావందనం లోకూడా ఉపనయన కాలంలో వుపదేశించడం జరుగుతూవుంది కాని వూరికే ముక్కుపట్టుకోవడం తప్ప అంతకన్న దానిలో ప్రవేశం కల వ్యక్తులు కనపడడం లేదు. (అ జ్ఞానం వుపదేష్టలకూలేదు.) యిప్పటికీ హిమవత్ప ర్వత ప్రాంతంలో కొందఱు యోగాభ్యాసం కలవారున్నారనిన్నీ, వారు ఆధివ్యాధిప్రభృతి దేహధర్మాలకు లోఁబడకుండా, శీతోష్ణాదిద్వంద్వాలకు దాసులు కాకుండా భగవచ్చింతతో సమాధినిష్ఠాగరిష్ఠులై కాలాన్ని వెళ్ళపుచ్చుతూవుంటారనిన్నీ యీమధ్యవొక ద్రావిడబ్రహ్మచారి వారి శుశ్రూష చేసివచ్చి రాజమండ్రిలో కొందఱితో చెప్పినట్లు ఆప్తులవల్ల సుమారు రెండుమాసాలనాడు విన్నాను. ఆమహామహులందర్శనం అయేవఱకేకాని ఆబ్రహ్మచారికి ఆఁకలిదప్పులు వగైరాలు నిమ్మళ కనపడనేలే దనికూడా ఆయనే చెప్పినట్టు చెప్పారు. అనేక పందర్భాలు అ_త్తవ్య_స్తంగా జరుగు చున్న యీ కలియుగంలో యింకా అట్టిమహాయోగులు క్వాచిత్కంగా నేనా వుండడమనేది మన వేదశాస్త్రప్రామాణ్యాన్ని బలపఱుస్తూ వుందన డానికి సందేహం లేదు. ఆబ్రహ్మచారి ఆయోగులవద్దనే శుశ్రూషచేస్తూ వుండడానికి కృతనిశ్చయుఁడుగానే వెళ్ళి వున్నాఁడు గాని వారు జ్ఞానదృష్టి చేత కనిపెట్టి "అబ్బాయీ! నీవు కొంతకాలం గృహస్థాశ్రమంలో వుండ

వలసినట్టు గోచరిస్తూ వుంది కనుక ప్రస్తుతం దేశానికి వెళ్ళి గృహస్థాశ్రమ ప్రవేశం చేయవలసిం” దని చెప్పడంచేత వారి అజ్ఞానుసారం బయలు దేఱి వచ్చానని కూడా ఆయనే చెప్పాఁడఁట! యీలాటి యితిహాసాలు పురాణాలలో సర్వత్రా వున్నాయి యిటీవల లోకం మాఱిపోవడం చేత వుదాహరణాలు భొత్తిగా విరళమై ఆయా పురాణగాథలు అసత్యాలనే భ్రాంతి అందఱికీ కలగవలసి వచ్చింది. అన్నా! దేశం యీలాటి స్థితికి వచ్చిందికదా అనుకుంటే “యిదేమిటి దీని తాతముత్తాతల స్థితికి దేశం రాఁబోతుం” దనే విషయం స్పష్టంగా గోచరిస్తూ వుందాయె. ఆ కారణం చేత పూర్వకాలంలో మాటకేం గాని యీకాలంలో మాత్రం మనస్సంటూ వున్న విద్వాంసులకు నిర్విచారస్థితి సంభవించదని నా నిశ్చితాభిప్రాయం. యితరులమాట యేలావున్నా నామట్టుకు చిన్నతనం మొదలుకొని యిప్పటి వరకూ కలిగిన విచారస్వరూపాన్ని యీ వ్యాసంలో సంగ్రహంగా వివరించాను. వ్యక్తిభేదాన్నిబట్టి కొంచెం భేదిస్తే భేదించనివ్వండి గాని ప్రతి వ్యక్తికిన్నీ విచారణచేసి చూచుకొంటే ఆయీ సందర్భం అవగతం కాక పోదని చెపుతూ దీన్ని ముగిస్తాను. నేనల్లా దీనిలో లోఁగడ “ముందు వ్రాస్తే బహుశః వ్రాస్తాములే” అన్న పేకాటను మాత్రం వ్రాయమరచి నట్టు గోచరించింది. దాన్నిగూర్చి వ్రాసేదేమిటి? అందులో వ్రాయడాని కేముంది? స్వస్తి.

---

## ముక్తులకుఁ గర్తవ్య మేమి?

( 1–11–1939 సం॥ర ఆంధ్రపత్రిక వీక్లీ నుండి )

ఈప్రశ్నమునకు నెవ రేమి చెప్పుదురో కాని శ్రీమద్భాగవతము నందు దశమస్కంధమునం దిట్లున్నది.

శ్లో. నివృత్తతర్షై రుపగీయమానా
ద్భవౌషధా చ్ఛ్రోత్రమనోఽభిరామాత్

క ఉత్తమశ్లోకగుణానువాదా
త్పుమాన్ విరజ్యేత, వినా పశుఘ్నాత్?

ఇచ్చటి వ్యాఖ్యాన మిటు లున్నది: "నివృత్తతర్షైః=గతతృష్ణైః, ముక్తై రిత్యర్థః" అని యొకరును, 'తర్షోఽభిలాషః, స నివృత్తో యేషాం తైః, ముక్తై రిత్యర్థః' అని వేఱొకరును వ్రాసియున్నారు. ఇతరపదములకు వ్యాఖ్యానించు సందర్భమున నించుక భేదమున్నను 'నివృత్తతర్షైః' అను పదమునకు వ్యాఖ్యానించు విషయమున నిరువురును 'ముక్తై రిత్యర్థః' అనియే వ్రాసియున్నారు.

"ఫలము చేకూరిన పిదప సాధనమునకై ఎవ్వరైనను పాటు పడుదురా?" అని యీసందర్భమున- ననగా ముక్తులుగూడ భగవచ్చరిత్రను గానము చేయుదురను విషయమున నొకశంక స్థూలదృష్టిని దోచుచున్నది. దీనికి మాగురువులు శ్రీచర్ల బ్రహ్మయ్య శాస్త్రులవారు చెప్పిన సమాధాన మేమనగా "చిరకాల వాసనావశమున మరల సంసార వాంఛలకు లోనై మనస్సు తప్పుదారిని బడి చెడునేమో? అట్టిప్రమాదము కలుగకుండ ముక్తులుగూడ భగవన్నామస్మరణ చేయుచుందు" రని చెల విచ్చిరి. వ్యాఖ్యానములో నా యీసందర్భమును సూచించు నక్షరములు కొన్ని కలవు. వలయువారు తిలకింతురు గదా? ముముక్షువులకే కాక ముక్తులకు గూడ 'పాటుపడ వలసి యున్నట్లు' వ్యాసభగవానుని యభిప్రాయమైయుండగా దాని ననుసరించువారి రచనలు విమర్శకు లేల విరసించు చున్నారో నాకు బోధించుట లేదు. నాకు దెలిసిన దింతమాత్రమే. పెద్దలేమి చెప్పినను విన నభిలషింతును.

# ధర్మసమన్వయము.

(జూలై -- 1944 శ్రీరామకృష్ణపత్రిక నుండి)

మొత్తం భరతఖండం అంతా తిరిగిచూస్తే ఆదిశంకరులనాటికి యెన్నో మతాలు వున్నట్లు తోస్తుంది. 'మహాఋషీణాం మతయశ్చ భిన్నాః' అనే అభియుక్తోక్తి నేటిదికాదు. మతమంటూ వుంటే యావత్తూ కాకపోయినా దానిలో కొంతేనా మంచివుంటుంది కాఁబట్టి యే మతాన్నికాని యెవ్వరూ ద్వేషించక, స్వమతంలోనే వుండి, యితర మతాలలో వుండే మంచిని గ్రహించడం ప్రాజ్ఞలక్షణం. ౧౮ పురాణాలు, మఱి ౧౮ ఉపపురాణాలు ౪ వేదాలు యివన్నీ బోధించేబోధన కొంత వేఱువేఱుగా వున్నట్టు కనపడినా, తుట్టతుదకు తేలేసారం వొకటే. ఆయీ ప్రపంచానికి యెవడో కర్తవున్నాడు. వానిశక్తి అప్రమేయం. వాఁడు మంచిగా ప్రవర్తించే వాళ్ళకు మంచిన్నీ చెడ్డవాళ్ళకు చెడ్డనిన్నీ తుట్టతుదను కల్గిస్తాడు. జీవునకు యీశరీరం వదిలినా యింతతో జన్మసమాప్తం కాదు. అలా సమాప్తం కావడమే మోక్షం. అదిపొందే ప్రాణికోటికి కూడా వొకటి వుండదు.

ఆ ముక్తిపేరే సాయుజ్యం అదే అద్వైతముక్తి. తక్కిన సాలోక్య సామీప్య సారూప్య ముక్తులు, దాని తరువాతవి. ఈముక్తులలో యే ఒకటిని సంపాదింప గల్గినా ధన్యత చేకూరినట్లే. సర్వదాభగవంతునిపై ధ్యాస వుంచేవాళ్ళకు ఇందేదో లభ్యమవుతుంది. "మాధవుఁ దలఁచే మానసమైతే, మానవజన్మం బెత్తవలెన్. మదమున చెడితిరిగే టట్టయితే మహిషంబై జన్మింపవలెన్" యింతేసారం,



# పరమార్థ ప్రసంగము

(అక్టోబరు – 1944 శ్రీరామకృష్ణప్రభ నుండి)

వేదములు అపౌరుషేయములా? అని ప్రశ్నిస్తారు విమతస్థులేకాక స్వమతస్థులుకూడాను. స్వమతస్థులనఁగా? తార్కికులు అన్నమాట. "శబ్దబుద్ధికర్మణాం త్రిక్షణావస్థాయిత్వాత్కథం శబ్దాత్మకస్య వేదస్య నిత్యత్వం" అని వారిప్రశ్న. నిత్యమనఁగా అపౌరుషేయత్వమన్నమాటే. నాస్తికులు కాకపోయినా తార్కికులు శుష్కవాదులు అనఁగా! వేదప్రామాణ్యాన్నిబట్టి పోరు గనక తర్కప్రియులే అనుకోవాలి: వారికి పరమాణువులు జగత్కారణం గాని నారాయణుఁడు గాని మహేశ్వరుఁడు గాని కాఁడు. నారాయణుఁడా? శివుఁడా? పరవస్తువు అనేశంక శాంకరసిద్ధాంతులను బాధించదుగాని తదితరులను మిక్కిలి బాధిస్తుంది. 'శివాయ విష్ణురూపాయ' అనేశ్లోకాన్ని శైవులుగాని వైష్ణవులుగాని సమ్మతింపరు తత్తథాస్తామ్. అయితే పరమేశ్వరుఁడు చతుర్ముఖ బ్రహ్మని సృష్టించి అతనికి వేదములను ఉపదేశించినట్లు శ్రుతి (యోబ్రహ్మాణం) చెపుతూవుంది. ఆమహేశ్వరుఁడేనా వాట్లను సృజించాఁడనడానికి మీమాంసా శాస్త్రజ్ఞులు అంగీకరింపరు. స్మృతులు పరతఃప్రమాణములుగాని శ్రుతులట్టివి కావు. అవి స్వతః ప్రమాణములు. అవి యిన్నీ అన్నీ అవడానికి అవకాశంలేదు.

అనంతావై వేదాః "తగ్ంహ త్రీన్ గిరిరూపా నవిజ్ఞాతానివ దర్శయాంచకార" అనేశ్రుతివల్ల పైసంగతి స్పష్టం. ఆశ్రుతులలోవుండే అర్థాన్నే స్మృతులు (పురాణాదులుకూడా) అనువదించాయి గనక అవిన్నీ మనకు కార్యాకార్యప్రసక్తియందు చోదకములే.

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" అని భగవద్గీత. శాస్త్రశబ్దానికి శాస్తీతి వ్యుత్పత్తివల్ల ఋగ్వేదాదులర్థం. యిది 'శాస్త్రయోనిత్వాత్' అనే

సూత్రభాష్యంవల్ల అవగత మవుతుంది. వేదానువాదకాలే కనక పురాణా దులు వాట్లకి వీట్లకీ వైరుధ్యం వుండకూడదు కాని యేంకారణమో యెన్నో విషయాలలో వైరుధ్యం కనపడుతుంది. అందుచేతే అనుకుంటాను—

శ్లో. శ్రుతిశ్చ భిన్నా స్స్మృతయశ్చ భిన్నాః
మహాఋషీణాం మతయశ్చ భిన్నాః.

అన్నారు అభియుక్తులు. సరే! యీద్వయానికిన్నీ పరస్పర విరోధం కలిగితే యేంచేయాలిమనం అంటే? స్వతఃప్రమాణం గనక శ్రుతిని పట్టే ప్రవర్తించాలి, అందుచేతనే, "అహింసా పరమో ధర్మః" అని స్మృతి ఘోషిస్తూ వున్నప్పటికీ, ప్రత్యేకించి రౌరవనామకమైన నరకం ప్రత్యక్షపశువును యజ్ఞంలో వధించేవారి కొఱకు రిజర్వు చేసి యేర్పఱచి నట్లు స్మృతులధోరణి కనపడుతూ వున్నా, దానికి భయపడక స్మార్త బ్రాహ్మణులు ప్రత్యక్షపశువునే వుపయోగిస్తున్నారు. ప్రత్యక్షపశువునో? పిష్టపశువునో? పెట్టి యింకా యిప్పటికీ యజ్ఞాలు సాఁగిఁచడం మన ఆంధ్రులూ ద్రావిడులూమాత్రమే, వైష్ణవులలో వళహాలలో క్వాచిత్కంగా కనపడుతుందిగాని, తెళహాలు పూర్తిగా వదులుకొన్నట్టే, కర్ణాటకులు (మాధ్వులు) కూడా డిటో. మహారాష్ట్రులలో యెవరో చేసినట్టున్నూ ఆయజ్ఞానికి మనఆంధ్రదేశాన్నుంచే ఋత్విక్కులు వెళ్ళినట్టున్నూ మా పరమగురువులు చెప్పఁగా విన్నాను. యిఁక పంచద్రావిళ్ళలో ఘూర్జ రులు వకరున్నారు, పూర్వకాలమందేమో గాని వారిటీవల యీగొడవలోకి దిగినట్లు తెలియడం లేదు, పంచగౌడులలో బంగాళీలుగాని, ఓఢ్రులుగాని యీయజ్ఞాలు (వేదోక్తాలు) చేసినట్లు లేదుగాని తంత్రప్రచోదితాలు యజ్ఞాలు (బలులన్నమాట) పూర్వం విశేషించి చేసేవారని వినికిడి. యిపుడో? నరబలి చేసినట్టు లేదుగాని "అజవరామహిషము లత్యంత ముఖ్యములు" అనే దేవీభాగవతాన్నిపట్టి చేసేవి మానినట్లు లేదు. బంగా ళీలు నూటికి 90 పాళ్ళు శాక్తేయులు మత్స్యభుక్కు లని వినడమే కాని వారిభక్తి అంతలో యిమిడి వుండదనియే కొందఱివల్ల వినడం. వీరు

కృష్ణభాగవతంకన్న దేవీభాగవతాన్నే ప్రమాణంగా పేర్కొంటారు. మన మతకర్తలు పూర్వవేదంకంటె ఉత్తరవేదానికి (ఉపనిషద్భాగానికి) ప్రాధాన్యం యిచ్చి భాష్యాలు వ్రాసి ముక్తిసాధనం, తత్త్వజ్ఞానమే కాని కర్మ (యజ్ఞాదికం) కాదని సిద్ధాంతీకరించారు కాని పూర్వవేదబోధితమైన కర్మలను వదలడానికి అంగీకరించినట్లు లేదు. ఆకర్మలు సాక్షాత్తూ ముక్తి సాధనాలు కాకపోయినా (నకర్మణా నప్రజయా, శ్రుతి చూ) కర్మణా చిత్తశుద్ధిః, చిత్తశుద్ధ్యాజ్ఞానం, జ్ఞానేన మోక్షః, అని సోపానవిధయా కర్మకు సార్థక్యం కల్పించారు. జన్మతః పూర్వజన్మ వాసనవల్ల చిత్తశుద్ధి అలవడినవారికి కర్మతో పనిలేదని చెప్పినట్లయింది. నారదాదు లీతరగతిలో చేరతారు. ఆదిశంకరులు గృహస్థాశ్రమప్రవేశం చేయకపోవడం చేత కర్మసంబంధం ఆయనకు లేనేలేదు. "యదహరేవ విరజేత్, తదహరేవ ప్రవ్రజేత్" అనేశ్రుతికి ఉదాహరణం శంకరులప్రవృత్తి. దీనినే విహంగమార్గం అంటారు ఉవ్వెత్తుగా పక్షివలె యెగిరి ఉన్నతస్థానం చేరడంవంటిది యీమార్గం. కాని దీనిలో "భోజనాసక్తి శయనేచ్ఛ పుత్రరక్తి" లోనైన వాంఛలు ఆపిమ్మట కలిగి ప్రమాదపడితేమాత్రం ఆవ్యక్తి అధఃపాతాళానికే చేరవలసిందే కనకనే యింతకంటే అనేకరెట్లు పిపీలికామార్గం శ్రేయస్కరం అన్నారు అభియుక్తులు.

తే. గీ, చీమ మెలమెల్లఁగాబోయి చెట్టుతుదకు
నేగుకరణిఁ గ్రమమ్ముగా నెఱుకకలిగి
ఉత్తమపదంబు చెందవచ్చు
ఊర్ధ్వసుప్తుండు పతనంబు నొందకున్నె.

యీమార్గం నిరపాయంగా కనపడుతుంది. పూర్వవేదానికి సార్థక్యం కలిగించవలసివస్తే గృహస్థాశ్రమ ప్రవేశంవినా సంఘటించదు. "ఆగమధర్మమూనఁగ గృహవ్రతియే అధికారి." (దేవీభాగవస్కం, చూ) కనుకనే అంతో యింతో సాంసారికసుఖం రుచిచూచిన వ్యాసులు కొడుకు

కీవిధంగా బోధించడం, శ్లో. "బలవా నింద్రియగ్రామః, విద్వాంసమపి కర్షతి" యీశ్లోకార్థాన్ని, విహంగమమార్గతత్పరుఁ డొక శిష్యుఁడు విని గురువుగారితో "నాఽపకర్షతి" అని పూర్వపక్షం చేసినట్టున్నూ తరవాత గురువుగారు అనుభవపూర్వకంగా ఆశిష్యుని తలతిక్క తీర్చినట్టున్నూ చెప్పుకుంటారు. అందుచేత పిపీలికామార్గమే మోక్షకామికి అనుసరణీయ మనుకుంటే: యెందుకేనా పరమసాధనంగా యేర్పడ్డ దేహం అంత వఱకూ నిలుస్తుందనీ యెవఁడు పూటపడతాడు? అందుచేత దానికీ కొన్ని చిక్కులు కనపడతాయి దీనికి కొన్నిచిక్కులు కనపడతాయి. యింకో మార్గం కనపడదు. యేం చేయాలి, యీరెంటికన్నా "నాఽన్యః పంథా విద్యతేఽయనాయ" అని శ్రుతి ఘోషిస్తూ వుంది. అందుచేత మంచో చెడ్డో భగవద్భక్తికి అనువైనమార్గాన్ని అవలంబించి భక్తులుపోయిన పోకలలో మనస్సుపెట్టి సర్వకాలసర్వావస్థల యందున్నూ శివుణ్ణో? కేశవుణ్ణో? స్మరిస్తూ కాలక్షేపం చేయడం అంత పెద్దమార్గాలలోది కాక పోయినా (శంకరసిద్ధాంతం చూ.) తరణోపాయం కాకపోదు. ప్రతివ్యక్తీ పునరావృత్తిరహితపదవిని కోరితే సిద్ధిస్తుందా? అధికారి తారతమ్యాన్ని బట్టి ఆయాముక్తులున్నూ విభజింపఁబడ్డట్టు ఆయాశ్రుతులే సూచిస్తాయి. ఆచార్యులు అన్నిశ్రుతులకూ యేకవాక్యతను కలిగించడానికి ప్రయత్నించారు. వొకరు అన్నిశ్రుతులూ అద్వైతముక్తి పరంగా సమన్వయించారు. వారికి "ఆనందం బ్రహ్మణో విద్వాన్" ఇత్యాదిశ్రుతులు (భేదకాలు) బాధించాయి, అప్పుడు షష్ఠికి సంబంధార్థం వదలుకొని రాహోశ్శిరః, అన్న చోట యేలాగో, ఆలాగే, అభేదమని వ్యాఖ్యానించి సమన్వయించు కున్నారు. కొన్నిశ్రుతులు "ఆనందో బ్రహ్మ" లోనైనవి ద్వైతులకు వ్యతిరేకించాయి. చేతులోశాస్త్రం వుందిగనక, ఆనందః "అస్యాస్తీతి, ఆనందః" అనివారి ఆచార్యులు తమసిద్ధాంతానికి అనుగుణంగా వ్యాఖ్యానించుకున్నారు. విశిష్టాద్వైతమతగురువులు యింకోవిధంగా (యేదో శేష శేషిభావం అస్మదాదులకు సుళువుగా తెలియదు) వ్యాఖ్యానించారు. యివన్నీ

శాస్త్రమర్యాదలు తెలిసినవారిమార్గాలు. మూఢభక్తులకు వీట్లలో పనిలేదు. ఒకనీళ్ళకావిడి బ్రాహ్మడు, తెల్లవారుజాము మొదలుకొని సంధ్యలకు నీళ్లమోస్తూ "హరేరామ హరేరామ" అని జపించడం నేనెఱుఁగుదును. ఆయనమార్గం సర్వాతీతం అని నాకు తోఁచింది. కానైతే వైదికపండితులు "బ్రాహ్మణై రేవ, ఉపనిషద్భిరేవ, బ్రహ్మవిచారః కర్తవ్యః" అని చెపుతారు. యింతమాత్రమే కాదు "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అనికూడా అంటారు, కాని ఆయీమార్గం బ్రాహ్మణేతరులకు బొత్తిగా ఉపాదేయం కాదు. విశిష్టాద్వైతులు సాక్షాద్భగవత్స్వరూపులుగానో అంత కన్నా మిన్నగానో యెంచి పూజిస్తూ వారువారు అఱవంలో గానంచేసిన భగవద్విషయిక గాథలను బ్రహ్మముఖతః వెలువడిన వేదములతోపాటు గానో అంతకన్న మిన్నగానో గౌరవించడం అందఱూ యెఱిఁగిందే. వారినే "ఆళ్వారు" పదంతో వారు గౌరవిస్తారు. ఆళ్వారులలో అంత్యజులు కూడా వున్నారు. అట్టివారికి బ్రహ్మవిచారాధికారం లేదనడానికి యెవరికి నోరు వస్తుంది కనక భగవద్భక్తి నిర్వ్యాజంగా కుదిరినవ్యక్తి యెవఁడైనా సరే అధికారే అని చెప్పవలసి వస్తుంది. బ్రాహ్మణనియమం వేదశ్రుతు లతో విచారించేవారికి సమన్వయించుకోవా లనుకుంటాను. శ్రుతులసం బంధం లేకుండా భగవంతుణ్ణి ధ్యానించడానికి వారిశాసనం అడ్డుగదా యిందుకు శ్రీరామానుజులవారు పూర్తిగా అంగీకరించినట్లు శ్రీవారి ప్రవృత్తి (గోపురంమీద నిల్చుని తిరుమంత్రమును ప్రకటించడం) తెల్పుతుంది. శంకరులుకూడా (రామానుజులంత కాకపోయినా) అంగీక రించినట్లే "చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషామమ" అనే మనీషాపంచకం తెలుపుతుంది. నిర్వ్యాజమైనజ్ఞానం కలగాలిగాని ఆ భాగ్యం కలిగాక జాతులింకా పట్టుకు పీడిస్తాయా ? లోకంతో సంబం ధించిన గృహస్థులకు వివాహాదివిషయాలలో జాతిమతాదులతో ఆవశ్యకత లేదని విచక్షణులెవరూ అనరు. జ్ఞానవిషయంలోనే పైసందర్భం. కొలఁదినాళ్ళక్రిందట——

డుండుం అనే మహావిజ్ఞాని బందరులో జన్మించి సుమారుయిరువై యేండ్లు జీవించి ముక్తుఁడైన సంగతి తత్రిత్యులు పలువురెఱిఁగిందే. అతని చదువంతా షష్టుఫార పాఠంతంలో "భాషామంజరీ" సమాప్తా అయింది. పూర్వజన్మసంస్కారం వల్ల యేమహా పండితులకూ అలవడని తత్త్వజ్ఞానం అలవడింది. మాటలు అపశబ్దాలుగా వుండేవి. చెప్పేసందర్భాలు శంకర రామానుజాదుల భాష్యాదులకు సంబంధించి వుండేవి. ఆపుస్తకాలపేర్లు కూడా ఆయనకు తెలియవు. ఆయన అనేవాఁడుకదా ?–

"ద్వైతం లోకం, విశిష్టాద్వైతం లోకానుకూలం, అద్వైతం లోకాతీతం" అనేవాఁడు. త్రిమత స్వరూపాన్ని కొద్దిపాటి అక్షరాలలో యేలా సంగ్రహించాఁడో ? చూడండి. ఆయనమతం అద్వైతమే, జనకుడు సంసారేగదా ? నీవు సంసారివి యెందుకు కాలేదని ప్రశ్నించేవాళ్ళం. దాని కాయన జవాబు చెపుతూ, జనకుఁడు సంసారిఁకాడని రుజువు చేసేవాఁడు. చాలామంది వేదాంతులు తాము చెప్పే మాటలకూ తమప్రవృత్తికీ సామానాధికరణ్యం లేనివారుగా వుంటారు. యీ "డుండుం" గారు అట్లుకాదు, ఉభయసామానాధికరణ్యం కలవారు. యీాయన తఱచుగా డుండుం అంటూ వుండడం వల్ల డుండుం, గారనడంగాని ఆయనపేరు రంగదాసు. వొకప్పుడు "డుండుం" అంటే యేమిటని అడిగాం. దానికి ఆయన పరమాత్మకు యేపేరూ లేదు. అట్టివాణ్ణి నేను "డుండుం" శబ్దంతో వాడుకుంటాను. ఆయనికి చెందనిశబ్దం ప్రపంచకంలో యేదీ లేదని చెప్పాడు. కొంచెం కవిత్వం చెప్పడం వుండేది. చివరమకుటం "సంగరహితభవః సిరంగదాసః" అని పద్యం ముగించేవాఁడు. నాకు శిష్యుడు కాఁడుగాని నాసమకాలీనులుగా వుండే నాదెళ్ళపురుషోత్తమకవి గారు లోనైన కొందఱికి స్కూలుశిష్యుఁడు. పూర్వజన్మ వాసనవల్ల లభించే జ్ఞానానికీ జాతికీ సంబంధం మనం లోకాచారాన్నిపట్టి పెట్టుకున్నా అదిమన కట్టుబాటులో నిలిచి వుండదు. చదువుకోవడంవల్ల వచ్చే పరమార్థ జ్ఞానంకన్న పూర్వజన్మవాసన వల్ల వచ్చే

జ్ఞానం వేయిరెట్లు హెచ్చుగా గౌరవనీయం. కేవల గ్రంథాభ్యాసం వల్ల లభించేపాండిత్యం ' శుకానువాదం' గా కూడా పరిణమించ వచ్చును గాని యిది అట్టిదికాదు. శ్రీరామకృష్ణపరమహంస లోనైన మహామహానుభావులు స్వతస్సిద్ధులే. వారిబోధలే కాక వారి ప్రవర్తనలు కూడ మనకు ఆరాధ్యములు, కొన్ని లోక విరుద్ధములుగా కనుపడినా వాట్లను మనం విరసించ రాదు, అనుసరించనూ రాదు. అట్టిపట్ల ఔదాసీన్యమే శ్రేయము.



# అస్తి వా? నాస్తి వా?

ఈసందేహం యెప్పటినుంచో పెద్దపెద్ద ఋషులనే బాధిస్తూ వున్నట్టు యితర సాక్ష్యాలతో పనిలేదు. ఆయా ఋషుల గ్రంథాలే సాక్ష్యమిస్తాయి. వేదంలో మాత్రం యెక్కడా ఖండితంగా నాస్తి అని చెప్పక పోవడంచేత యేఋషిన్నీ నాస్తిక వాదానికి దిగినట్లు లేదు. ఋష్యంశ సంభూతులైన త్యాగరాయాదులు ఆస్తికులై చాలా తఱచి తఱచి వారికి యేంగోచరించిందో తుదకు "కద్దన్నవారికి కద్దు" అంటూ ఆస్తికత్వాన్నే బలపఱిచారు. కాదన్నవాఁడు కరణం అన్న సామెతగా యెవరేనాసరే నాస్తి అనడం సుళువుగా కనపడుతుంది గాని ఆస్తి అనడంలో అట్టిసుళువు కనపడదు.

"క్షిత్యంకురాదికం. సకర్తృకం, కార్యత్వాద్ఘటవత్" అని అనుమాన ప్రమాణాన్ని ఆధారంగా పెట్టుకొని శాస్త్రజ్ఞులు ఆత్మయొక్కసత్తను నిరూపించారు. కాని ప్రత్యక్షప్రమాణాన్ని మాత్రమే వొప్పుకొనే నాస్తికులు మాకు అనుమానంగాని శబ్దంగాని యితరంగాని పనికి రావనిన్నీ చేతనైతే ఆత్మను తీసుకువచ్చి మాయెదుట నిలపఁబెట్ట వలసిందనిన్నీ అప్పుడు మేము వొప్పుకుంటా మనిన్నీ వాదిస్తారు. ప్రతి నాస్తికుఁడు

కోసం పరమేశ్వరుఁడు వచ్చి వాని సత్తాను ధ్రువపరచు కోవలసినంత ఆవశ్యకత్వం ఆతనికి యేమివుంది? ఆ పరమాత్మను గూర్చి యెవరో లేదనికాని వుందనికాని వాదించుకొందురుగాక ఆవస్తువు యెవరికీ గోచరించదు.

"మనోవాచామగోచరం" అనివేదం ఘోషిస్తూనే వుంది. ఆ వేదాన్ని అనుసరించి పుట్టిన పురాణాలున్నూ ఆలాగే బోధిస్తున్నాయి. ఆయా గ్రంథాలు రచించిన ఋషులు సూనృతవాదులు గాని అనృతవాదులు గారు. పైఁగా అతీంద్రియజ్ఞాన నిధులు. అట్టి మహానుభావులను నిస్పృహులను 'శతాంధాః కూపం' ప్రవిశంతి న్యాయంగా జమకట్టి యేవో తోఁచిన కుయుక్తులు చెప్పి చెడఁదంకన్న ఆస్తిక్యాన్ని విశ్వసించడమే శ్రేయస్కరంగా కనపడడం చేత వేదశాస్త్ర విశ్వాసం కలవారందఱూ ఆస్తికులు గానే వర్తిస్తూవచ్చారు. ఆలాటి మహాపురుషులలో తుట్టతుదివారు శ్రీరామకృష్ణ పరమహంస. వివేకానందస్వామి మొట్టమొదట పాశ్చాత్య సిద్ధాంతవాసన బాగా తలకెక్కిన వాడైకూడా తన చదువులోఁగాని యితర చదువులో గాని లేశమూ కృషిచేయకుండానే కేవలం సహజమైన జ్ఞానంతో భగవత్సత్తను నమ్మి వర్తించడాన్ని విని ఆ మహాత్ముణ్ణి సందర్శించి కొంత వితండవాదం చేసి ఆ సహజ విజ్ఞాని చెప్పిన యుక్తులమీఁద తనవాదం బాగుగాలే దని తోఁచి బ్రహ్మచర్యము నుండియే సన్న్యాస స్వీకారం చేసి మనఖండంలోనే కాక అమెరికా లోనైన యితర ఖండాలలో కూడా మన వుపనిషన్మతాన్ని వ్యాపింపచేయడం బహుమంది యెఱిఁగిన విషయం కావడంచేత యిక్కడ విస్తరించడం అనావశ్యకం. అయితే భగవత్సత్తకు వొప్పుకునేవారు కూడా వొకవిధంగా కాక ఆ భగవంతునికి అనేక విధములుగా నామరూపాలు కల్పించి వాదించుకుంటారు గదా! యీచిక్కు యేవిధంగా తీరుతుందంటారేమో? అందఱికీ అంతో యింతో గ్రంథాధారాలు లేకపోలేదు. వాట్లనిపట్టి వారువారు ప్రవర్తిస్తారుగాక, అందులో ప్రత్యవాయం కనపడదు. "యేయథామాం ప్రపద్యంతే" అనేగీత యెవరినీ

విషేధించడం లేదుగదా? నాస్తికులు శ్రీయోదూరు లవుతారుగాని ఆస్తికు లెన్నఁటికీ కారు, యిదే పురాణగ్రంథసారం. దేవునికి పూర్వం యెవరేనా వుంటే, వారికి దేవుని పుట్టుకనుగూర్చి తెలుస్తుంది. అప్పుడు వారు దేవునికి నామకరణం చేయఁగలరు. అలాటి వారెక్కడా లేరుకదా! కనక నామ ధేయ విచారంతో పనిలేదు, అయీ చిక్కును గమనించే అనుకుంటాను వేదాలు అపౌరుషేయాలు గా మీమాంసకులు సిద్ధాంతీకరించారు. ఆ వేదం లోనేకదా? శివ, నారాయణాది శబ్దాలు కనపడతాయి. ఆ శబ్దాలు అస్మ దాదులు కల్పించిన వనడానికి అవకాశం కనపడదు. యీ విషయంలో వైదికమతం చేసినంతకృషి యే మతమూ చేసినట్లు లేదు. తగినంత వ్యాసంగం చేసి తఱిచి చూస్తే ఆత్మవస్తువున్నట్లే వారివారి బుద్ధికి గోచ రిస్తుంది. శబ్దప్రమాణంకన్న యీవిషయంలో అన్యప్రమాణం చూపడం కుదరకే సూత్రకర్త "శాస్త్రయోనిత్వాత్" అని సూత్రీకరించాఁడు. గీతలోకూడా "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" అని శబ్దప్రమాణానికే ప్రాధాన్యం అంగీకరించింది. భగవంతునితోపాటు మాయ నీడలాగు అనువర్తిస్తూవున్నట్లు శాస్త్రం చెప్తుతుంది. అయీమాయకు ఆదిలేదు గాని అంతం వుంది. దీన్నిగూర్చి యెవరో తత్త్వవేత్త యీవిధంగా గానంచేశాఁడు.

"అన్నతో సంసారము చేసేనన్నాదీ,
నన్నుఁ గన్నవా రీభువిలో లేరన్నాది."

దీన్ని బట్టిచూస్తే మాయ అనాదిగా గోచరిస్తుంది. నిజమైనజ్ఞానం కలిగిన జ్ఞానులు మాయను తరింతురు.

'మామేవ యేప్రపద్యంతే మాయామేతాం తరంతి'. అందుచేత మాయ అనాది అయినా సాంతం అని బ్రహ్మవేత్తలు వక్కాణించారు. యీ జగత్తంతా మాయాకల్పితం. పరమేశ్వరుని సాన్నిధ్య మాత్రంచేత జడమైన మాయకు యిట్టి సామర్థ్యం కలుగుతుందని కపిలమహర్షి సిద్ధాంతం.

క్రియలో మాట కొన్ని సిద్ధాంతాలు భిన్నభిన్నంగావున్నా వేదాన్ని అనుస రించిన సిద్ధాంతాలన్నీ ఆస్తికాలు. యెవరుగాని పరమేశ్వర సాన్నిధ్యానికి వెళ్ళి అక్షానంచూచి ఆ పరమానందం అనుభవించి మళ్ళావచ్చి మనకు చెప్పినవారు కారని ఖండితంగా మనం అనుకోవడానికి ఆధారం ఆ వేదం లోనే కనపడుతుంది. ఆదియిది : 'న స పునరావర్తతే'. అట్టిస్థితిలో చూచి మళ్ళావచ్చి మనకు చెప్పడం యేలా సంఘటిస్తుంది? కనక ఆప్తవాక్యాలు విశ్వసించవలసిందే గాని లేనిపోని కుయుక్తులవల్ల ప్రయోజనం లేదు. ఆప్తుఁడంటే ? యథార్థవక్త. "ఆప్తవాక్యంబు విశ్వాస్యమంటివేని, ఆప్తుఁ డెవ్వండొ తెలియంగ నర్హమగునె." అని శంకించుకొని సమా ధానంకూడా పురాణకర్తలే వుపపాదించి వున్నారు.

"భ్రాంతేఃపురుషధర్మత్వాత్" అని వుండడంచేత యెంతటి మహాపురు షుఁడేనాసరే వొకానొకప్పుడు ప్రమాదం పడడం తటస్థించి తీరుతుందని చెప్పి అపౌరుషేయం గనక ఆశంక వేదానికి తగలదని యెంచి బ్రహ్మ ణ్యులైన పెద్దలు వేదాన్ని ఆధారంగా పెట్టుకొని తమతమ తర్కాన్ని వుపయోగిస్తూ వచ్చారు. కేవల శుష్క తర్కం ప్రమాణం కాదు. కనక దాన్ని నిరసించారు. వ్రాస్తే చాలా వ్రాయాలి. ఈ విషయం నావంటివా నికి లొంగేది కాదు.

"విబుధజనులవలన విన్నంత" లో నాకు తెలిసినంతలో యీనాలుగు మాటలూ వ్రాశాను.

"నాస్తిచేన్నాఽస్తి నో హానిరస్తిచే న్నాఽస్తి కో హతః"

యింతే తుట్టతుదిమాట. అంతేకాని పరమాత్మను తీసుకువచ్చి యెవ్వరూ కనపఱచలేరు. దృఢమైన భక్తి జ్ఞానవైరాగ్యాలుకల మహా పురుషులకు ఆ పరవస్తువు గోచరిస్తుంది. యెంతవ్రాసినా యింతే.

ఓం తత్సత్

---

# శాఖాద్వేషం

( 16—2—1938 సం॥ర ఆంధ్రపత్రికనుంచి )

యెవరిమట్టుకు వారయితే మాకు శాఖాభిమాన ద్వేషాలు లేనేలేవని చెబుతారు గాని ఆంతరంగికంగా సర్వత్రానున్నూ బహిరంగంగా క్వాచిత్కంగానున్నూ యీ ద్వేషాలు వున్నట్టే కొన్ని ఆధారాలు కనపడతాయి. వివాహాలు అక్కడక్కడ బ్రాహ్మణీకంలో అందులోనున్నూ "విదోసు హోము" బాపతు వాట్లల్లోనున్నూ మఱికొన్నిటిలోనున్నూ యీ పట్టుదల కనపడనంతమాత్రంచేత సంతోషించడానికి అవకాశంలేదు. యెప్పుడో మాంధాతల నాఁడు పుట్టిన యేర్పాట్లు వేళ్ళుపాతుకుపోయినవి బాహ్యసంస్కారాలవల్ల పొమ్మంటే చట్టన పోతాయా? "కడుపులో లేనిదే కౌఁగలించుకుంటే వస్తుందా?" అన్న సామెత అందఱూ యెఱిఁగిందే. కొన్ని విషయాలల్లోమాత్రం కొందఱు ఆయీ ప్రభేదాలు పాటింపకుండా కూడా వుంటూనూ వున్నారు. వున్నా తీఱా "వంగతోఁట దగ్గిఱికి వచ్చేటప్పటికి" మామోలుపాట తప్పదనే అనుకోవాలి. ఆమధ్య నేను పిండిప్రోలి లక్ష్మణకవిగారి రావణదమ్మీయాన్ని లేక లంకావిజయాన్ని గూర్చి నాకు తోఁచిన మాటలు కొన్ని వ్రాస్తూ అగ్రంధం ప్రాఁతప్రతి అచ్చుపడ్డదే నావద్ద వుందనిన్నీ దాన్ని మెవరేనా రీప్రింటు చేస్తే వారికి అప్రతిని సంస్కరించి నేను అందచేస్తాననిన్నీ కృష్ణాపత్రికలో కాఁబోలును వ్రాసివున్నాను. అది చదవడంచేతే అనుకుంటాను, శ్రీ వావిళ్ళవారు 1927 సం॥లో వారిప్రెస్సులో అచ్చువేసిన సదరు గ్రంథాన్ని నాకు పంపివున్నారు. సరే గ్రంథం ఉత్సన్నం గాకుండా పునరుద్ధారం చేసి పుణ్యం గట్టుకొన్నారుగదా? అని బ్రహ్మానంద భరితుణ్ణయినాను. ఆయన నాశాఖవాఁడు కాకపోయినప్పంటికీ కవితా శాఖాబాంధవ్యం వకటి వుండడంచేత "అస్మద్గోత్రం వర్ధతాం" అనే అభిమానం పొమ్మన్నా పోదుగదా? లోకం యెంతవఱకు విశ్వసిస్తుందో గాని నాకు కవిత్వ విషయంలోనే

రాదు; యితర విషయాలలో కూడా శాఖా పట్టుదల అంటే గిట్టదు అట్లని నేను బ్రాహ్మల్లోనే అనుకోండి, శాఖాంతరులతో వియ్యాలు వగయిరా అందలేదు సుమండీ! ఆలా అందకపోవడాని క్కారణం నాకు వుండుకున్న యితర రక్తసంబంధులు కలిసి రారనేవియ్యేవే. సరే, అమల్లో లేని బిల్లుల్లావుండే పైసందర్భాన్ని అలా వుంచి ప్రస్తుతానికి వస్తాను. అలా సంతోషించి యిదివరలో చర్విత చర్వణంగా చదివిందే అయినా మళ్లా మళ్లా అక్కడక్కడ తీసి మూలవ్యాఖ్యానాలు పారాయణ చేయడానికి ఆరంభిస్తినిగదా? యేంచెప్పేది? అక్కడక్కడ వ్యాఖ్యానంలో "కాళిదాసుగారి కవిత్వం కొంతా మా పైత్యం కొంతా" ప్రత్యక్షమయింది. ఆపట్లాన్ని యీ కొత్తవ్యాఖ్యాత యెవరో? అని పేజీలైతే తిరగేశాను గాని యెక్కడా పేరు కనపడలేదు. అయితే యెవరో వారి పాండిత్యానికి లొంగని విషయాలు తప్పులనుకొని వారికి తోఁచిన సిద్ధాంతోక్తులు వ్రాసి వున్నారనుకొని పీఠిక వల్ల యేమేనా తెలుతుందేమో? అనుకొని పీఠిక చదవడాని కారంభించే టప్పటికియీకింది మాటలు కనపడ్డాయి.

"విశేషించి విద్వజ్జన పరిశ్రమ మెఱిఁగిన రేచర్ల గోత్రజనితు లగు రావు వంశ ప్రభువులతో వైరము దెచ్చికొన్న యీకవి యెంతటి లౌకిక శిరోరత్నమో వేఱుగఁ జెప్పనక్కఱలేదు." యీ వాక్యానికి పూర్వం కూడా పీఠికా లేఖకులు వృధాగా యీకవిని ద్వేషించడానికి సూచకమైన అక్షరాలు కొన్ని కనపడకపోలేదు గాని యీవాక్యంతో నాఅనుమానం పూర్తిగా ధృవపడ్డది. రేచర్ల గోత్రీకులైన రావువారిలో సంస్థానప్రభువులుగా వున్నవారు విద్వాంసులనూ కవులనూ ఆదరించినమాట వాస్తవమే కాని పిండిప్రోలి కవిగారి "యేడు పందుముల మాన్యము" న్నా అపహరించిన యీ గమ్మన్నగారు యీ ఘనకార్యం తప్ప చేసిన మత్తో మంచిపని యేముందో? పీఠికా రచయితలు విచారించినట్టు లేదు; లేనేలేదు. యీయన గోత్రరీత్యా రాజబంధువులే అయినను జమీను కలవారుకారు.

కులాభిమానం ఆరోజులలో యెవరికన్నా వెలమ జమీందార్లకు హెచ్చుగా వుండేది. దాన్ని పురస్కరించుకొని అప్పటి పిఠాపుర ప్రభువు బహుశః శ్రీ రావు నీలాద్రి రాయణింగారే అనుకొంటాను ధర్మారావుగారికి పిండిప్రోలి కవిగారి నివాసగ్రామం కుద్యేరు వగయిరా కొన్ని స్వంత యెస్టేటు గ్రామాలు గుత్తగా యిస్తే యీఘనకార్యం స్వార్థపరత్వంచేత చేయడం తటస్థించింది. నోరూ వాయీ లేనివాళ్ళకింకా యీయన యెన్ని అపకారాలు చేసి వుంటారో! యిది గ్రంథస్థమయింది గనక బయటికి వచ్చింది. యీయనతో పిండిప్రోలి కవికుల పురుడు వైరం కోరి తెచ్చు కున్నట్టు వ్రాయడం చాలా పొరపాటు. యేమంటారా? యీయన భూమికి "కొక్కు పెడితే" కదా? యీతఁడు యీగ్రంథం వ్రాసింది. యీయన వృథాగా తీరికూర్చుని యీవైరం తెచ్చుకున్నాఁడని వ్రాసే యెడల శ్రీరాములు కూడా రావణాసురుఁడితో "గిల్లికజ్జా" తెచ్చు కున్నాఁడనే చెప్పవలసి వస్తుంది. మాటవరసకి బాగా ఆలోచిస్తే రాముల వారిని యీలా అంటే, అంతో యింతో సమర్థింప వచ్చునేమో? కాని లక్ష్మణకవిని యీలా అంటే సమర్థించడానికి అవకాశంవుండదు. రాముల వారు శూర్పణఖను అంతగా అవమానించకుండా యేదో మాదిరిని సాఁగ నంపే యెడల అంత "పుట్టిములక" లేకపోయేదేమో? పాపం! ఆమాత్రం అవకాశమేనా లక్ష్మణకవి వల్ల యేం కలిగింది? చిరకాలా న్నుంచి జీవనోపాధిగా వున్నభూమిని దురుద్దేశంతో పశుబలాన్ని పురస్క రించుకుని ఆక్రమించడంవల్ల విధిలేక లక్ష్మణకవి శాపాయుధత్వాన్ని అమల్లోకి తేవలసి వచ్చింది "నానృషిః కురుతే కావ్యం" కనుక ఋషిత్వం సార్థకం అయింది. దమ్మన్న గారు యేంకావాలో అలా అయారు. యీసంగతి లేశమున్నా కనిపెట్టక పీఠికాకర్త లక్ష్మణకవిని పొరపడి నెపపెట్టినట్టు తోఁచదు. యింకేమిటంటే? యిదివఱలో శ్రీగురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారున్నూ, కం. వీరేశలింగం పంతులుగారున్నూ వ్రాసిన కవిజీవితాలలో కొంచెం వైదిక నియోగ భేదానికిన్నీ కవిత్వాని

కిన్నీ ముడిపెట్టి శిష్టు కృష్ణమూర్తిగారినిన్నీ లక్ష్మణకవిగారినిన్నీ విమర్శిం చడం జరగడంచేత దాన్ని ఖండించే తలంపుతో యెవరో వైదికశాఖాభి మానులు యీ పీఠికను వుపక్రమించినట్టు తెలుసుకోఁ గలిగాను. ఆ యీ విషయాన్ని బలపఱిచేమాటలు యింకా కొన్ని కనపడ్డాయి. దిఙ్మాత్రంగా వుదాహరిస్తాను.

"పైవిధమున నితని యుభయ భాషావైదుష్యము వెల్లడి యగు చుండఁగా నాంధ్రకవి జీవితము, నాంధ్రకవుల జీవితచరిత్రయుఁ గూడ నితని చరిత్రమును, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి జీవితమును దెలుపు సంద ర్భమున నపస్తుతముగా వీరి నిరువురను బోల్చుచు నీతనిఁ బురస్కరించు కొని యీ విద్వత్కవియెడ నగౌరవమును జూపుట యెంతవఱకుచితమో? యిందులకుఁ గారణ మేమో? లోక మెఱుంగఁ గలదు. లోకమున నా వ్రాఁతయందలి విశ్వాసమును దొలఁగించుటకై యిందావిషయము నించుక చర్చించుట యప్రస్తుతము కాక యాహ్లాదకరమే యగును."

చాలును. యిక్కడికే చాలా వుదాహరించినట్టయింది. యిట్టివింకా ఆపీఠికలో మఱికొన్ని వున్నాయి. వలయువారు అందే చూచుకొంటారు. వెనుక శ్రీ శిష్టువారిని అధఃకరించి లక్ష్మణ కవిగారిని వున్నత స్థానాన్ని నిల్పినవారు నియోగులు కనుక యిప్పుడు లక్ష్మణకవిని సర్వవిధాలా తృణీకరించి అధఃకరిస్తే దానికి ప్రతి చేసినట్టవుతుందని యెవరో వైది కులు పూని "కృతేతు ప్రతికర్తవ్య మేష ధర్మ స్సనాతనః" అని అయిందీ కానిదీ చేర్చి తప్పులంటూ వెల్లడించినట్టు తోస్తుంది. అసలు ఉన్న కుల్లస్పేదో తేల్చడం జరిగింది కనక లక్ష్మణకవిగారిని యీపీఠికా కర్త అధఃకరించడానికి చూపిన తప్పు లేలాటివో కొంత విమర్శిస్తాను.

("ఇచ్చట 'మాఖ్య' యనునది 'మాఘ్య' యని యుండవలెను. "మాఘ్యం కుందం రక్తకస్తు" అని కలదు. రాఘవార్థములో శ్లేషలో "జాంబవత్సమాఖ్య" అని "సమాఖ్య" యను నర్థము గనుక "ఖ్య" యని యుండితీరవలయును")

అంటూ బ్రాకెట్టు పెట్టి పీఠికాకర్త—

"అలి భూతలంబునం దెలుఁగుల రాజాంద
వత్సమాఖ్య ప్రసిద్ధి వఱలెడి నిపుణుండు"

అనే పద్య వ్యాఖ్యానంలో తెలిసీ తెలియని తప్పు పట్టడం జరిగింది. పాపం! పీఠికాకర్త మాఖమాసమనిన్నీ మాఘ మాసమనిన్నీ రెండున్నూ అమర వ్యాఖ్యానంవల్ల పాఠాంతరాలుగా వ్యుత్పత్తి కూడా చూపి సమర్థింపఁబడ్డాయన్న విషయం తెలియక యీ పరిహాసాస్పదమైన ఆక్షేపణ చేయవలసి వచ్చింది. సదుద్దేశంతోనే వ్రాసే వ్రాఁతలో అయితే దీన్ని యింతగా గణించవలసి వుండదుగాని ఆ పీఠికలో యెన్నో వాక్యాలు సదుద్దేశ దూరాలు కనబడతాయి. కూచిమంచి జగ్గకవి యేదో కోపావేశంతో అమ్మనాలిసీ పట్టుకుని "బూతులం బూర్ణుఁడను" అని ప్రతిజ్ఞపట్టి వచ్చి బూతులు తిట్టి రచించిన చంద్రరేఖా విలాపాన్నిన్నీ దీన్నిన్నీ ఏకపంక్తిలో చేర్చి విమర్శించిన పీఠికాకర్తగారి సాహసం వర్ణనాతీతం. దానికిన్నీ దీనికిన్నీ పోలిక లవమున్నూ లేదు. శాపవిషయంలో పోలిక వుంటే వుండనియ్యండి. యిది ఋషిత్వాన్ని పోషించేది. అది గ్రామ్యత్వాన్ని బలపఱిచేది. దీన్ని మహా పండిత సభలోఁగాని అంతఃపురస్త్రీల సమక్షమందుఁ గాని చదివి నిరాఘాటంగా అర్థం చెప్పడానికి లేశమున్నూ కొంకవలసి వుండదు. అది దీనికంటే, ధారాశుద్ధి కలదిగానున్ననూ కాస్త నాగరికత గల మాల మాదిగల సమక్షంలో కూడా చదవడానికే కొంకవలసి వస్తుంది. కవి అలాచెప్పాలని సంకల్పించుకొని రచించి వున్నాఁడు. దాన్ని కాదంటే, యేలాగ? అంతటి కోపం ఆయనకు రావడానికి తగ్గపని ఆ నీలాద్రిరాజు చేసివున్నట్టు అనుమానించాలి. ఆ రాజు జగ్గకవిని కొట్టించినట్లు వినికిడి. అయినా అట్టి కవిత్వం చెప్పడం తప్పే అని ఆయన అన్న శివపూజా ధురంధరుఁడు శ్రీ తిమ్మకవిగారు చాలా గాఢంగా మందలించినట్టు యితిహాసజ్ఞుల వల్ల వినడం. అసలు యింట్లోకే రానియ్యలేదనిన్నీ పిమ్మట ఆగ్రంథాన్ని నైజాంవారి ఫర్మానా సహాయంతో కొంత

సిబ్బందీ తోడ్పాటు మీఁద నీలాద్రిరాజుగారి బావమఱఁది శ్రీ పూసపాటి మహారాజులుం గారి పండిత సభలో వినిపించాక అన్న తిమ్మకవిగారు తమ్ముణ్ణి యింటికి రావిచ్చారవిన్నీ వినడం. యింతే కాదు, యెన్ని పచ్చి బూతులు మాలమాదిగలు సమేతూ వుచ్చరించడానికి సందేహించేవి అందులో వాడినా యెక్కడా స్త్రీలను దూషించ లేదనే కారణమే కాక ఆ నీలాద్రి రాజుగారి భార్య విజయనగరం వారి ఆఁడుపడుచును కూడా వకసందర్భంలో భూషించి రాసినందుకు మహారాజులుంగారు సమేతూ చాలా సంతోషించి తమ బావమఱఁది గారిదే తప్పంతా అని ఆ సభలో అన్నారని కూడా వినడం. స్త్రీదూషణే వుంటే జగ్గకవిని చంపి నవాబు వల్ల తాము పొందే చిక్కును పొందడానికే సంకల్పించుకొన్నట్టు కూడా వినికిడి. ఆపుస్తకం వకటి శ్రీ మాముత్తాతగారి స్వదస్తూరీతో వున్నది మాయింట్లో మొన్న మొన్నటి దాఁకా వుండేది. ధారా శుద్ధికి లోపంలేదు. ఆ జగ్గకవిగారు వ్రాసిన యితర గ్రంథాల కన్న ఆగ్రంధమే సర్వోత్తమ ధారలో వుంటుంది. రాజుగారు మెచ్చుకున్న పద్యం వుదాహరిస్తాను.

క. ఖలుఁడైన నీల భూపతి
యిలలో విన్నాళ్ళు బ్రిదుకునే? నరసాంబా
గళ కలిత దివ్యతర మం
గళ సూత్రోత్కృష్ట మహిమ గాక కుమారీ.

(ఇది వేశ్యమాత చంద్రరేఖతో చెప్పే మాటల సందర్భంలోది.)

యీపద్యం తప్ప ఆగ్రంధంలో సభ్యమైన పద్యమే కనపడదు. రావణ దమ్మీయంలో యెంత వెదికినా కలికంలోకి కూడా అసభ్యపద్యం లేనే లేదు. అట్టి సందర్భంలో దాన్నిన్నీ దీన్నిన్నీ "శ్వానం యువానం మఘవా నమూచే" అన్నమాదిరిని వొకత్రాటిని గుచ్చి వైదికత్వాన్ని మహోన్నత స్థానంలో నిల్పడానికి ప్రయత్నించడం శోచనీయం కాక పోదు. ప్రతివారున్నూ స్వోచ్ఛస్థితికి పాఁకులాడడం సహజ ధర్మమే

కాని దానికై నిష్కారణంగా మఱియొక శాఖ అనే కారణంతో ఒక మహా కవిని తూలనాడడం అభినందనీయం కాదు. సంబంధ బాంధవ్యాలకు వుంటే వుండనివ్వండి గాని శాఖా భేదం కవిత్వానికి పుంజడం అపహాస్యాస్పదం. దీన్నిగూర్చి కీ॥ శే॥ కస్తూరి శివశంకర కవిగారు, సుమారు 25 యేళ్ళకిందట కొన్ని దీర్ఘవ్యాసాలు వ్రాసి వుండడంచేత నేను విస్తరించలేను. ప్రస్తుతం పీఠికా కర్తగారు యేపద్యంలో "మాఖ్యం మాఖ్యం" అనే పదాలకు వుండే అభేదాన్ని గమనించక లక్ష్మణ కవిగారిని వృథాగా ఆక్షేపించి అక్కసు తీర్చుకున్నారో, ఆ పద్యం వంటి పద్యమే యితర ద్వ్యర్థికావ్యాలలోనూ లేదని నేనే కాదు; చిరకాలా న్నుంచి మంచి కవిత్వాభిమానం కలిగి దానిలోనే మునిఁగి తేలుతూ వుండే శ్రీ జయంతి పంతులుగారు కూడా యెప్పుడో అన్నట్టు నాకు జ్ఞాపకం. ఆపద్యంలో వున్న సొగసు వ్యాఖ్యానించి చూపవలసి వున్నా పత్రికా పాఠకులు సర్వసామాన్యంగా గ్రహింప తగ్గదిగా వుండదని ఆ పనికి వెనుదీయు చున్నాను. ఆపద్యం మాత్రం వుదాహరిస్తాను.

సీ. లలి భూతలమ్మునం దెలుఁగుల రాజాంబ
వత్సమాఖ్య ప్రసిద్ధి వఱలెడు నిపు
ణుండు వాగను శాసనుఁడు తిమ్మఁడొకఁడు ధూ
ర్జటి రామలింగసంజ్ఞా ప్రథితుఁడు
బుధవరుల్ భాస్కర పోతన లాది క
వన చారులు మఱియు ననుపమాన
కృతి రామభద్రుండు శ్రీనాథుఁడు గణింపఁ
దత్సముల్ తదధికుల్ ధరణి లేరు

తే. గీ. కళల సోముండు పెద్దన్న కరణి వెలయు
చుండు రెండవ వీరఁ దమానమతి వి
రూపణము వేయఁ గుండలీంద్రుండు మమ్మ
లక్ష్మణాఖ్యుండు గానఁ జలమ్ము వలదు.

ద్వ్యర్థి కావ్యాలలో యింత తేలికగా రెండర్థాలూ యిమిడ్చిన పద్యం మృగ్యం. యిందులో రామాయణార్థంలో జాంబవంతుఁడు, ఆంజనేయులు, సుగ్రీవుఁడు, నలుఁడు మొదలైన వారి ప్రసక్తిన్నీ రామలక్ష్మణుల ప్రసక్తిన్నీ మిక్కిలి నేర్పుతో యిముడ్చఁ బడ్డది. లక్ష్మణకవి పక్షంలో తెలుఁగు కవులలో ప్రసిద్ధి వహించిన నన్నయభట్టు, తిక్కన్న, శ్రీనాథుఁడు, ధూర్జటి, తిమ్మన్న, రామలింగం, భాస్కరుఁడు, పోతన్న, రామభద్రుఁడు, సోముఁడు. పెద్దన్న, పినవీరభద్రుఁడు అనే కవుల ప్రశంస యెత్తికొని తాను వారిలో తిక్కన్న వంటివాఁడనని కవి చెప్పుకొన్నాఁడు, కాని ఆచెప్పుకోవడంలో అన్యముఖం చేత చెప్పించినట్టు యింది గాని తానే చెప్పుకొన్నట్టు కాదు, అందుచేత కవులందఱూ పోయిన పోకడే గాని యీపోకడ ఆక్షేపణీయం కాదు.

"భూతలమ్ము నందున్ ఎలుఁగులరా" అని రామాయణ పక్షంలో నున్నూ "భూతలమ్మునన్ తెలుఁగుల" అని తనపక్షంలో నున్నూ విఱిచిన విఱుపు పద్యాని కెంతో శోభను కూర్చింది. రాజమ్మగారి కొడుకు కనక లక్ష్మణ కవి 'రాజాంబవత్స,' పదం వుపయోగించింది. దానికి వెనకాల వున్న, రా, ఎలుఁగుల రా, గా మాఱి జాంబవంతుఁ డనే పేరుగా విఱుచుకోవడానికి వుపయోగ పడింది. యీ గ్రంథం రచించడానికే కవి పుట్టినట్టు రాజాంబ కొడుకుగా పుట్టడంవల్ల ప్రాజ్ఞులు అనుమాన ప్రమాణం చేత వూహించి సంతసిస్తారు. విజ్ఞుల వలన ఆయా విషయాలు జిజ్ఞాసువులు తెలిసికొని ఆనందించవలసిందే గాని కాస్తా కూస్తా రాస్తే తృప్తికాదు.

యిక్కడ "మాఖ్య" పదం "మాఘ్య" అనే రూపాంతరం కలదని యెఱిఁగి బహు లక్ష్యవేత్త యైన లక్ష్మణకవి విశేష సంస్కృత పండితుఁడు గాకపోయినా పరిశీలించియ్యేవే ప్రయోగించి వున్నాఁడు. యించు మించు సమకాలీనులే అయిన శ్రీ వోగిరాల వారు వ్యాఖ్యానంలో యీ రహస్యం యెఱిఁగిన విజ్ఞు లవడంవల్ల శంకించక వూరుకున్నారు. యీ వోగిరాల వారికిన్నీ నాకున్నూ కొంచెం సంబంధం వున్నది. ఆది

యేలాటి వంటే? వోగిరాల రంగయ్య, జగన్నాథంగార్లు అనే సోదర మహా కవులలో నెవరివద్దనో నా ప్రథమ కావ్య గురువులు శ్రీ కాసుకుర్తి భుజంగరావు పంతులవారు శ్రీమత్సంస్కృత భాగవతంలో పదకొండు శ్లోకాలు మాత్రం సంప్రదాయరీతిని చదువుకొన్నట్టు వారు చెప్పంగా విన్నాను. యింతమాత్రపు చదువుతో సంస్కృతమాత్రం సర్వమూ అన్వయించి శిష్యులకు పాఠంచెప్పిన నా ప్రథమగురువు గారి ప్రజ్ఞావిశేషం మనోవాచా మగోచరం.

పూర్వ కవుల మాదిరిగా కవిత్వం చెప్పే వారిలో ఆ వోగిరాల వారు తుట్ట తుది వారు. అనేక సంప్రదాయాలు వారికి తెలిసివున్నట్టు వారి గ్రంథాల వల్ల తెలుస్తుంది. వారు సంస్కృతంలో కూడా భగవత్ప రంగా చెప్పిన కీర్తనలు నీలపల్లిలో పాడుతూ వుంటే విని వున్నాను. అవి శ్రీనారాయణతీర్థుల తరంగాలతో సరితూఁగుతాయి. అందులో కొన్ని కీర్తనలు నాకు కూడా వచ్చును. కొంచెం మచ్చు చూపుతాను.

సావేరి రాగం — ఆట తాళం

నారాయణ! శౌరే! మురారే! నారాయణ!శౌరే॥

కళ్యాణి రాగం — ఆది తాళం

బ్రూహి ముకుందేతి, హే రసనే! పాహి గోవిందేతి.

అ ను ప ల్ల వి

కేశవ మాధవ! గోవిందేతి, కృష్ణా నంత సదా నందేతి.

చెప్పొచ్చేదేమిటంటే, అనేక ప్రజ్ఞ కలిగిన యిట్టి మహాకవి శిరో మణులచేత శిరసావహింపఁ బడిన పిండిప్రోలి కవివరుని కవిత్వాన్ని తెలిసీ తెలియని జ్ఞానంతో యీసడించిన పీఠికాకర్త యీపిదప కాలానికి కుకవినిగా ప్రదర్శించడం చూచి నేను సహించలేక యీ నాలుగు మాట లున్నూ వ్రాశాను. అమరంకూడా నాలుగు మూలలా పరిశీలించే జ్ఞానం లేనివారు కవుల గ్రంథాలకు పీఠికలు వ్రాస్తే వ్రాస్తారు గాక, వృథాగా

లేనిపోని ఆక్షేపణ లెందుకంటాను. ఆ ఆక్షేపించడంలో శాఖాభిమానం కాదు. ద్వేషం పొకటా ? శిష్టు కృష్ణమూర్తిగారిని అధఃకరించడానికి కవి మాత్రుఁ డెవఁడున్నూ ఆమోదించఁడు. ఆవిషయం ఖండించడానికి యిది మాత్రం మార్గంకాదనియ్యేవే నేను వ్రాసేది. ద్వ్యర్థికావ్యమైనా కృష్ణమూర్తిగారికంటే తక్కువ పాండిత్యం కల కవి రచించినదే అయినా యీ రావణదమ్మీయం గ్రంథకర్త పేరు చిరస్థాయి చేయ తగ్గదిగా వుంది. కృష్ణమూర్తిగారు సర్వాత్మనా మహావిద్వాంసులైనా మహా కవితా ధురంధరులైనా వారి గ్రంథాలు లోకోత్తరాలే అయినా వారికి కవితా ప్రపంచంలో తగిన స్థానాన్ని యిచ్చేవిగా యింతవఱకు బయలుదేఱలేదు. వారి చాటువులు కొన్ని కనపడతాయి. వారికి వ్యాకరణంలో మంచి ప్రతిభ వున్నట్టు శ్రీ భాగవతుల హరిశాస్త్రుల్లుగారు, అపర మహాభాష్యకారులు స్వయంగా చెప్పఁగా నేను విన్నాను. ఆ సందర్భం వివరిస్తాను.

గోదావరి డి॥ ద్రాక్షారామ శివారు వెలంపాలెంలో దినవహీ బుచ్చి రాజుగారికుమారుని వుపనయనంలో శ్రీహరిశాస్త్రుల్లుగారి దర్శనం మాకు లభించింది. అప్పుడు శిష్టు కృష్ణమూర్తిగారి ప్రశంస వచ్చి కౌముది మాత్రం చదివి మహాభాష్యాన్ని చక్కఁగా అన్వయించఁ గలిగారని వారు చెప్పివున్నారు. ఆ ప్రతిభ అనన్య సామాన్యమని చెపుతూ మళ్ళా ఆలాటి వాళ్ళు మీరఁటూ వాత్సల్యంచేత మమ్మల్ని వారు అభినందించారు. యిది ఆత్మోత్కర్ష ద్యోతకమే అయినా యథార్థం కనక వ్రాశాను. దాన్ని మేము ఆశీర్వచనంగా భావించుకొని "పరగుణ పరమాణూన్" అన్న భర్తృహరి శ్లోకాన్ని చదివి వారికి నమస్కరించి వున్నాము. అట్టి మహా విద్వాంసులచే ఆలా ప్రశంసింపఁబడి శ్రీ కూరాడ రామచంద్ర శాస్త్రుల్లు వారి వంటి విద్వన్మహాకవులకు కొందఱికి గురువులై "వ్యాకరణ షరాబు" అనే బిరుదాన్ని వహించిన యింజరగ్రామ వాస్తవ్యులు శ్రీ ద్వివేది నారాయణశాస్త్రుల్లుగార్కి వ్యాకరణంలో శిష్యులై కుల క్రమాగతంగా వస్తూవున్న వీణాగానంలో సుప్రసిద్ధులై జులుసు పాపయ్య శాస్త్రుల్లుగారి

వంటి భూలోక బ్రహ్మకు వేదశాస్త్రాలలో అంతో యింతో ప్రతిద్వం ద్విగా నైనా మాతృ వ్యాసాలపై వ్యాకరణానికి మూల సూత్ర కర్తయైన కృష్ణమూర్తిగారివి లోఁగడ చరిత్రకర్తలు లక్ష్మణకవి గారి దృష్ట్యా శాఖాభిమానాన్ని పురస్కరించుకొని అపకరించడానికి నేనున్నూ సమ్మతించేవాణ్ణి కాను, కాని యీపీఠికాకర్త లక్ష్మణకవిగారికి అంట గట్టే తప్పులకున్నూ అంగీకరించడానికి మనస్సు వొప్పేది కాదు. మిడిమిడి జ్ఞానంవారు పట్టే తప్పులుగాని యివి విశేషజ్ఞులు పట్టేవి కావు. అందుచేత యీ నాలుగు మాటలూ వ్రాయవలసి వచ్చింది. వొక ఆక్షేప ణను గూర్చి అంతో యింతో కాదు పూర్తిగా సమాధానం లిఖించాను గదా? యింకోటికూడా చూపి దీన్ని ముగిస్తాను.

ఇతఁడు నన్నయ్య భట్టారకునితోఁ దన్ను రెండు మూఁడు చోట్లఁ బోల్చుకొన్నందులకు నీ క్రింది పద్యములో "ఆతని తోడఁ బుట్టు వంతమ్మిహికాంశుఁడు" అన్నచోఁ "బ్రాసమును సమర్థించుకొనుటకుపలను పడునేమో కాని" అంటూ వ్రాయడాని కర్థ మేమేని కలదా? ఆప్రాసము అనఁగా "అంతన్ + మిహికాంశుఁడు" అనేచోట నకారము మకార ముగా మార్చి ప్రాసపెట్టుట కూడదనిన్నీ కూడకపోయినా నన్నయ్య భట్టుగారు పెట్టివున్నారనిన్నీ, వారు సర్వసమర్థులు కనక అది సహ్యమే కాని ఇతఁడు సర్వథా అసమర్థుఁడు గనుక ఆరీతిగా తాను వుపయోగించ కూడదనేనా అవ్రాఁత తాత్పర్యం? యీ ఆక్షేపణ యీ లక్ష్మణకవికేనా? యితర మహాకవులకున్నూ కూడా వుంటుందా? యీ అప్పకవిగారి ప్రయోగం చూడండీ! "ఇమ్మహిని మునులచే వెల వెమ్మను గావ్యములు" యిక్కడ పరమలాక్షణికుఁడు వైదిక కవిశిరోమణి లక్షణ విషయంలో చేదస్తుఁడు అప్పకవి అంతవాఁడు వెలసెన్ + మును = వెలవెమ్మను అని ప్రాసస్థా నంలో వాడుకున్నాఁడు గదా? యీ వాడడానికి అర్థం నన్నయ్యవంటి వాణ్ణని లోకానికి తెలుపుడు చేయడానికేనా? లేక నన్నయ్యగారి యందు తనకు వుండుకున్న ప్రామాణ్య జ్ఞానాన్ని లేక భక్తిప్రపత్తులను వెల్లడి

చేయడానికా ? నన్నయ్యా వైదికే, అప్పకవీ వైదికే కనక అప్పకవికి వున్నంత వారసత్వపు హక్కు నన్నయ్య ఆస్తి విషయంలో నియోగికవి కనక లక్ష్మణకవికి వుండదని చెప్పవలసి వుంటుందా ? "ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో, నేది వచింపఁగాఁ బడియె" అనే శాసనానికి గతేమిటి ? యెంతో నైపుణ్యంతో యిక్కడ పీఠికాకర్త ఆక్షేపించినట్టూ ఆక్షేపించనట్టూ నటించడానికి అభినందించ వలసి వున్నా హృదయం మాత్రం నిష్కల్మషమని వొప్పుకోవడానికి వీలులేక వుపేక్షిస్తే పాపం చుట్టుకుంటుందని కొన్నిమాటలు వ్రాయవలసి వచ్చింది. "మాఖ్య" అనేచోట మాత్రం ఆక్షేపించి "మాఖ్య ప్రసిద్ధి" అనేచోట ప్ర అనే దానికి పూర్వమందున్న ఖ్య అనేది లఘువేలా అవుతుందని ఆక్షేపించక వూరుకోవడంచేత యీపీఠికాకర్తకు కొన్ని ప్రీ. వి. కౌన్సిలు తీర్పులు కూడా తెలుసునని సంతోషింపవలసి వచ్చింది. లేకపోతే దాన్ని కూడా వెక్కిరించి లక్ష్మణకవిని అధఃకరించడమే జరిగేది. లక్ష్మణకవి ద్వ్యర్థి కావ్యంలో నన్నయ్యభట్టుతో తన్ను పోల్చుకొన్నందుకే పీఠికాకారులు అంగీకరించారు కారుకదా ? సాక్షాద్భగవ దవతారమైన శ్రీరామచంద్ర మూర్తితో తనకు సర్వత్రా అభేదాధ్యవసాయం చేయడానికి యేలా సమ్మతిస్తారో కదా ? ఆ పద్ధతిని యీగ్రంథ రచనకే పీఠికాకర్త సమ్మతించేటట్టు తోఁచదు. తుదకు "మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః" అనే ధోరణికి దిగినట్టయింది. శాంతం పాపం ! శాంతం పాపం ! యెంతటి మహాకవుల కవిత్వంలోనూ కూడా "భ్రాంతి పురుష ధర్మ" మవడంచేత తప్పులనేవి కొంచెం గొప్ప ఉండి తీరతాయి. అంతమాత్రం చేత ఆయనకు వచ్చే లోపం లేదు. "తల వున్నవాళ్ళందటికీ పే లుంటా" యంటారు కదా ? విమర్శకులు మాత్రం తమ బండారం యెంతటిదో తెలుసుకోక తప్పులు కాని వాట్లని తప్పులని వ్రాయడం మొదలు పెట్టడం, అందులో యేదో ద్వేషానికి పాల్పడి వెక్కిరించడం, తుదకు అపహాస్యాస్పదం కావడానికి తప్ప యెందుకూ కొఱగాదు. యెక్కడేనా సంశయింప వలసి నట్టు

కనపడితే యెక్కువగా గ్రంథ పరిశోధన చెయ్యాలి. తమకన్నా మిన్నలని తమకు విశ్వాసం కలిగిన పెద్దలని అడిగి తెలుసుకోవాలి. యెంత తగ్గినా యింకా క్వాచిత్కంగా అక్కడక్కడ కొంతవఱకు "సజీవ నిర్జీవ సాధనాలు" వున్నాయి కాని పూర్తిగా నశించలేదు. సజీవసాధనా లంటే: పండితు లన్నమాట. నిర్జీవ సాధనాలు భాండాగారాలు. దురుంగడ తప్పనం గూడ దనియ్యేవే నా విన్నపం. అప్పకవి కూడా యీ అంశాన్ని వ్రాసే వున్నాఁడు.

తే. గీ. "తనకుఁ దెలియనివన్నియుఁ దప్పులనుచుఁ
గుకవి హాస్యంబు గావించు; సుకవి వరుఁడు
తడవు చర్చించి తెలియు; నంతటను దెలియఁ
కున్నఁ దద్దయుఁ బెద్దల యొద్దఁ దెలియు."

యీ అప్పకవి వాక్యాన్ని అనుసరిస్తే తప్పు విమర్శకులకు పరిభవం తప్పదు. అయితే ప్రతీ కవీనిన్నీ యీలా వ్రాస్తూనే వుండడంచేత దీని యందు లోకానికి ఆదరం లేదు. అప్పకవి అల్లాటప్పావాఁడు కాఁడుగదా?

కవిత్వానికిన్నీ భాషాభిమానానికిన్నీ సంబంధం లేదు సరికదా! బ్రాహ్మణబ్రాహ్మణేతర భేదంకూడా అవసరం లేదు. బ్రాహ్మణేతరులు రచించిన వసుచరిత్రాదులను బ్రాహ్మణులు శిరసా వహించడాన్నిబట్టి చూస్తే తుట్టతుదిసంగతి తేలుతుంది. నన్నయ్య భారతభాగాన్ని తిక్కన్న శంభుదాసులు శిరసావహించడంవల్లనున్నూ తిక్కన్న శంభుదాసుల భారతాన్ని వైదికకవులు అప్పకవ్యాదులు శిరసావహించడంవల్లనున్నూ మొదటి సంగతి స్పష్ట మవుతుంది. దీనికి స్త్రీపురుషభేదంకూడా అవసరం లేదు. మొల్లకవిత్వాన్ని పురుషకవులు ఆమోదించడం లేదా? కొందఱు చేవస్తులు ఆయాభేదాన్ని పురస్కరించుకొని "వారికంటె వీరుగొప్పనీ వీరికంటె వారుగొప్పనీ" వాదించుకోవడమైతే లేకపోలేదుగాని వారు రసజ్ఞుల పట్టికలో చేరరు. ఆ యా గొప్పతనాన్ని వారివారి కవిత్వాలవల్లనే తెలుసుకోవలసి వుంటుంది. కవిత్వం యెంత శుద్ధశ్రోత్రియంగా స్వహస్త

పాకంలా వున్నా బాధంలేదు, రసం వుండాలి. అదే పేరు తెస్తుంది. అయితే ప్రాచీనుల్లోఁ గాని అధునాతనుల్లోఁ గాని కొందఱు పండితకవులున్నూ కొందఱు కేవలకవులున్నూ వుండడం కలదు. కవిత్వం రసవంతంగా వుంటే కేవలకవులకవిత్వంకూడా పైకి వస్తుంది. రసశూన్య మైనట్టయితే పండితకవులదేనా సరే ఆ కవిత్వం పైకి రాదు. ఇది సర్వానుభవసిద్ధమే. అడిదం సూరకవిగారి రోజుల్లోనే సోమకవిగారు (యింటిపేరు మఱిచాను) న్నూ వుండేవా రనిన్నీ సూరకవిగారు విద్వత్కవే అయినా సోమకవిగారు చాలా విద్వాంసుఁ డవడంచేత మఱీ విద్వత్కవి అనిన్నీ వీరిద్దఱికీ వక సభలో వాదం తటస్థపడ్డప్పుడు సోమకవిగారే పైచేయి అయినా రనిన్నీ వకయితిహాసం పరంపరగా వస్తూవుంది. కేవలం నోటిమాటలుమాత్రమే కాక దీనికి సంబంధించిన పద్యంకూడా వకటి చాలామంది చదువుతారు. దాన్ని వుదాహరిస్తాను.

క. "పలుకుల చిలుకలకొలికీ!
పలుగాకి నకారగుళ్ళ పాలయితివఁటే?
యిలలో వైదికవిద్వ
త్తిలకంబులకేమిదిక్కు తెలిపితివమ్మా?"

యీపద్య శైలినిబట్టి సోమకవి రసవత్తరంగా కవిత్వం చెప్పే వాఁడని తోస్తుంది. యీపద్యం బహుశః కవులచరిత్రలో వుదాహరించఁబడే వుందేమో? దీనికి సంబంధించిన చరిత్రకూడా పలువు రెఱిఁగే వుంటారు. అయినా వ్రాస్తాను. సోమకవిగారిని సూరకవిగారు "సూరునిముందఱనా? సోముఁడిగంతు" అన్నారట. దీని కర్థం, సూర్యునియెదుట చంద్రుఁడు ప్రకాశ హీనుఁడైనట్టే నాముందఱ సోమకవిన్నీ పరాక్రమించలేఁడనే తాత్పర్యాన్ని యిస్తూవుంది. యిందులోవున్న కొంటెతనానికి సహింపలేక సోమకవి మళ్ళా ఆ వాక్యాన్నే తిప్పి ప్రయోగించారట! యేలాగంటే? "సోముఁడిముందఱనా? సూరుఁడి గంతులు" అని, దీని కర్థమేమి టంటే? 'ఉమయాసహితస్సోమః' అనే వ్యుత్పత్తినిబట్టి సోముఁడంటే

సాంబమూర్తి. అతఁడు దక్షయజ్ఞధ్వంస సమయంలో సూర్యుణ్ణి పళ్ళు రాలఁగొట్టినట్టు పురాణప్రసిద్ధి వుండడంచేత సోమకవిగారి యుక్తే పయి దాఁటినట్టయింది. లేనిపోని శ్లేషలతో మాట్లాడడమే అసలు తప్పుగాని ఆలా మాట్లాడే వారికి తఱచు పరాభవం తటస్థిస్తూనే వుంటుంది. మన లక్ష్మణకవిగారున్నూ పైవిధంగా శిష్టు కృష్ణమూర్తిగారితో మాట్లాడే టప్పుడు శ్లేషవాక్యాలు వుపయోగిస్తూ వుండేవారని వినికి. యీయన సహజంగా ద్వ్యర్థి కవిగనుక అదేధోరణిలో వాక్కు నడిచే దనుకోవాలి. కాని నా అభిప్రాయ మేమిటంటే? ఆధోరణి గ్రంథరచనలోనే వుపయోగించాలి కాని యితరత్రా వుపయోగించ కూడదనియ్యేవే. పింగళి సూరన్నగారు అంతటి ద్వ్యర్థికవియై వుండిన్నీ కూడా కవిత్వరచనలోతప్ప యితరత్రా ఆధోరణిని వినియోగించినట్టు చెప్పుకొనే కథ లేవీ కనపడడం లేదు. కనక నే నీలా వ్రాయఁగలిగాను. కవులలోనేకాదు; యితరులలో కూడా కొందఱు తెలిసీతెలియని మిడిమిడిజ్ఞానంతో శ్లేషవాక్యాలు వుపయోగించి వొకానొకప్పుడు తీఱనిపరాభవాన్ని పొందుతూ వుండడం అందఱూ యెఱిఁగిందే. వొకాయన యిదేమోస్తరుగా తఱచు మాట్లడేవాఁడనిన్నీ దాన్నిబట్టి ఆయనమీఁద గ్రామస్థులందఱికీ ద్వేషం వుదయించిం దనిన్నీ ఆకారణంచేత ఆయన్ని బహిష్కరించడంకూడా జరిగిం దనిన్నీ ఆబహిష్కారదశలో వుండఁగా ఆయనకు యేదో ఆపత్తు వచ్చిందనిన్నీ అట్టిసమయంలో కూడా యెవ్వరూ ఆయన్ని చూడడానిక్కూడా వెళ్ళకుండా వుపేక్షించేటప్పటికి యెవరో వకాయనమాత్రం చొరవ చేసి ఆయన్ని పరామర్శించే వుద్దేశంతో వెళ్ళి "పాపం మంచి నిర్వాహకుఁడు (ప్రయోజకుఁడు) పోయాఁడు" అని విచారాన్ని సూచించేటప్పటికి ఆపత్తులోవున్న ఆగృహస్థు "అవును వీఁడు అప్పుడూ నిర్వాహకుఁడే (ప్రయోజకుఁడే) యిప్పుడూ నిర్వాహకుఁడే (వాహకులు లేనివాఁడే)" అని శ్లేషగానే జవాబిచ్చాఁ డనిన్నీ పరామర్శించడానికి వెళ్ళిన గృహస్థు ఆధోరణివల్లి ఆయన ఆంతరంగికతత్త్వాన్ని తెలుసుకొని వూళ్ళో నలుగురితోనున్నూ

యీ సంగతి చెప్పి "అది ఆయనకు సహజగుణం, అంతేనేకాని వొకరిని అవమానించే దురుద్దేశం కాదు, కనక ఆయన్ని మనం యీకారణంచేత ద్వేషించి బహిష్కరించడం అనాలోచనప్పని" అని చెప్పి వొప్పించే టప్పటికి అందఱు గ్రామస్థులున్నూ గతించినదానికి విచారిస్తూ అప్పుడు తటస్థించిన ఆపత్తులో పాల్గొని కర్తవ్యాన్ని నెఱవేర్చేవారనిన్నీ వొకయితి హాసం లోకంలో వుంది. లక్ష్మణకవిగారి ధోరణికూడా పైమాదిరిదే అని నేననుకుంటాను. అలాటిదే కాకపోతే "కుక్కముండా గుడ్డ వుతుక్కుంటాను బండముండా రాయియ్యవే" అనడం యేలాటిదో? చూడండి. ఆవలిమనిషిని తిట్టినట్టే ఆ మనిషికి గోచరిస్తుంది గాని యిందులో అర్థాంతరం వుందనిన్నీ యీయన ద్వ్యర్థికావ్యకర్త అనిన్నీ గోచరిస్తుందా? నిజమెంతో అబద్ధమెంతో తేల్చలేముగాని లక్ష్మణకవిగారికి సంబంధించినవి యీలాటికథలు చాలా వున్నాయి. కొన్ని యితరులవికూడా వీరికే అంటఁగట్టడమున్నూ వుండవచ్చునని గతంలో వేఱొకవ్యాసంలో వ్రాసే వున్నాను. క్రియలోమాట. యెవరికి దేనియం దభినివేశం మెండుగా వుంటుందో వారు దాన్ని సర్వకాలసర్వావస్థలయందున్నూ వుపయోగిస్తూనే వుంటారన్నది సిద్ధాన్తంగా వొప్పఁదగిందని నేను అనుకుంటాను. బందరులో శ్రీ కాశీనాథుని బ్రహ్మయ్యలింగంగారు సర్వదా శివపారమ్యాన్ని సమర్థించే పరమశైవులు వుండేవారు. అట్లని సామాన్య శైవులలాగ వీరెన్నఁడుగాని విష్ణుదూషణ చేసేవారు కారు. విష్ణుమూర్తికూడా లింగాన్ని కట్టుకున్నట్టు కొన్నిప్రమాణాలు చూపడం వుండేది. వారింట కార్తిక మాసంలో నక్తంభోజనానికి నన్నుపిలవకుండా వుండేవారు కారు. నేను శైవులతో విష్ణుపారమ్యాన్ని గూర్చిన్నీ వైష్ణవులతో శివపారమ్యాన్ని గూర్చిన్నీ వాదించే స్వభావం కలవాణ్ణి. అంటే స్మార్తుణ్ణవడంచేత శివకేశవులకు అభేదం చెప్పడమే నాకుతాత్పర్యం. దీనికి శైవులూ వొప్పరు, వైష్ణవులూ వొప్పరు. ఆమతాలు రెండూ వకటి వుత్తరధ్రువంలోనూ వొకటి దక్షిణ ధ్రువంలోనూ వుండేవికదా! మొత్తం బ్రహ్మయ్యలింగంగారు

మాత్రిం నన్ను విష్ణుపారమ్యవాదినిగా అభిప్రాయపడి తఱచుగా కలుసు కున్నప్పుడల్లా శివపారమ్యానికి వుపకరించే వుపపత్తులు చూపుతూ వుండే వారు. యీలా కొన్నాళ్ళు జరిగింది. అంతట్లో శ్రీబ్రిహ్మయ్యలింగంగారి సోదరులు పార్వతీశంగారు (కలౌ షష్టి దాఁటినవారే) లింగైక్యం పొందడం తటస్థించింది. ఆసమయంలో పరామర్శకోసం వెళ్ళినప్పుడు ఆబ్రిహ్మయ్యలింగంగారు చేసేప్రిసంగం చూస్తినిగదా! అదిన్నీ శివపా రమ్యాన్ని సమర్థించేదిగానే వుంది. యింకా సోదరుఁడు అక్కడనే వున్నాఁడు. ఆవిచారం మనస్సులో లేదని యేలా అనుకొనేది? వుందికాని చేసినప్రిసంగం నాతో యేమి టంటే? మహాభారతంలో ద్రోణపర్వంలో అశ్వత్థామ యేదో అస్త్రాన్ని ప్రియోగించి దానితో కృష్ణార్జునులు హతం కాకపోవడంతోటట్టే విరక్తుఁడై యుద్ధరంగాన్నుంచి పరాఙ్ముఖుఁడై వెడుతూ వుంటే వ్యాసులవారు చెప్పినమాటలను యెప్పుడేనా మీరు పరిశీ లించారా? అని నన్ను ప్రిశ్నించారు. ఆమాటలు శ్రీకృష్ణుఁడు పార్థివ లింగమందో లేక భావనాలింగమందో శివుణ్ణి పూజించి నట్టున్నూ అశ్వ త్థామ చేసిన శివపూజ అంతకంటె తక్కువతరగతిలో దైనట్టున్నూ బోధిస్తాయి. అందుకోసం వారు నాకు వాట్లను జ్ఞాపకం చేశారు. దానివల్ల విష్ణుమూర్తికూడా లింగధారి అనేసంగతి సమర్థింపఁ బడు తుందిగదా! చెప్పొచ్చే మాటేమిటంటే? సమయాసమయాలతో ఆవసరం లేదనిన్నీ ఎవరు దేనియందు అభినివేశం కలిగివుంటారో వారు సర్వదా దానికే ప్రియత్నిస్తూ వుంటా రనిన్నీ నేను ఆ బ్రిహ్మయ్యలింగంగారి అప్పటి ప్రివృత్తినిబట్టి తెలుసుకోఁగలిగాను. శైవమతం ఆయనతో అంతరించిం దంటే అతిశయోక్తి కాదు. అన్ని శైవసంప్రిదాయాలూ హృత్కవిలిగా వచ్చినవారిని నేనెక్కడా చూడలేదు. ఒక దాంభికకవి (పేరెందుకు) మొన్న మొన్నటివాఁడే కావిడి మోసే చాకలితో కవిత్వప్రిసంగం చేసే వాఁడు. దీన్నిగురించి మళ్లా వ్రాస్తాను. పిండిప్రోలి లక్ష్మణకవిగారి ధర్మమా అని ఆ మహాపురుషుణ్ణి బ్రిహ్మయ్యలింగంగార్ని యీవ్యాసంలో

స్మరింపఁగలిగి ధన్యుణ్ణయినందుకు సంతోషిస్తూన్నాను. బ్రహ్మయ్య లింగంగారికి శివపారమ్యస్థాపన యేలాటిదో, లక్ష్మణకవిగారికి ద్వ్యర్థివాక్య రచనకూడా అలాటిదే అనుకోవాలి. దీనికి అక్కడక్కడ పరానుభూతి ఏటస్థించడం వుంది. అది భగవద్విషయం కనక సర్వదా వాడినప్పంటికీ చిక్కు కనపడదు. వారిమాట కేంగాని సామాన్యంగా యీ అలవాటు కలవారు రచనలో తప్ప యితరత్రా దీన్ని ప్రయోగించ కూడ దనే నా సలహా. యిది విషయాంతరం. పీఠికలో లక్ష్మణకవిగారు ద్వ్యర్థివిష యంలో పద్దకర్త్తలు కొన్నిచూపి యీసడించి వున్నారు. అందులో కొన్ని పా్రచీనులున్నూ పొందేవున్నారు. అవి వారు బుద్ధిపూర్వకంగా యెఱిఁగి అవసరాన్నిబట్టి అలా వాడినవే. పీఠికవారు చూపే అనుపపత్తి వారున్నూ యెఱిఁగేవుంటారు. ద్వ్యర్థి కావ్యంలో అలాటివి సహ్యం కాక పోవు. కాకేపోతా యనుకుందాం, వాట్లనే చూపి వూరుకోక నిక్షేపంవంటి వాట్లను కూడా చూపించి పరిహసించడం యెందు కంటాను. అందుకుఁ గలకారణం అసలు వారిమాటలవల్లనే తెల్పివున్నాను కదా! కవిజీవితాలలో చూపిన పక్షపాతానికిన్నీ యీ గ్రంథపీఠికలో చూపిన పక్షపాతానికిన్నీకూడా నామనస్సు వొప్పుకుందిగాదు. యితరవిషయాలు వదులుకొని గ్రంథరచ ననే పురస్కరించుకొని మాట్లాడుకొనే పక్షంలో లక్ష్మణకవిగారికే ఉన్నత స్థానం వస్తుం దని నే ననుకున్నాను. కృష్ణమూర్తికవిగారిగ్రంథా లేవేనా పైకి వస్తేనేకాని వారిస్థానం కవిత్వాన్ని బట్టి నిర్ణయించడానికి అవకాశం కనపడదు. పాండిత్యంలో కృష్ణమూర్తిగారు నిరుపమానులని వ్రాసే వున్నాను. నేనున్నూ వైదికినే. అయినా లోకం విశ్వసించనిమాటలు వ్రాస్తే అవి ప్రయోజనకారులు కావనిన్నీ ఆ అభిమానాన్ని పురస్క రించుకొని యీ పీఠికలో చూపిన దోషాలుకాని దోషాలను సమ్మతిస్తే మఱొకరేవా తత్త్వం తేలుస్తారుగదా! అవిన్నీ వున్నంతలో వోపిక తెచ్చుకొని యీరెండు మాటలూ వ్రాశాను. యెంతధనం నిలవవున్న భాగ్య వంతుడేఁనా దానివినియోగాన్నిబట్టిగాని తగ్గస్థానం సంపాదించుకోలేనట్టే

యెంత పాండిత్యంవున్న మహాకవియైనా రచనవల్లఁగాని తగ్గస్థానాన్ని ఆర్జించుకోలేఁడంటే వొప్పనివా రుండరు. శ్రీదాక్కా సీతమ్మగారిమాత్రం భాగ్యవంతులు మాకోనసీమలో లేకేనా? ఆవిడకంతపేరు రావడాని కారణం. ఆవిడ వినియోగాన్నిబట్టి ఆలాటి పేరు వచ్చిం దనుకోకతప్పదు. శిష్టుకృష్ణ మూర్తి గారివంటివారో లేక యింకా వుత్కృష్టులో ? మాడభూషివారు. వారు అసలు కవిత్వానికి వారి జీవితంలో ప్రాధాన్యం యివ్వనేలేదు. కోర్టు లమ్మట తిరగడానికే యిచ్చి వుపేక్షించారు కవిత్వాన్ని. యెప్పుడో శ్రీపనప్పాకం అనంతాచార్లగారు బలవంత పెడితే యేదో చరచర వొక రాత్రిలోనో రెండు రాత్రులలోనో భరతాభ్యుదయమనే ప్రబంధాన్ని వ్రాసివున్నారు. అది మంచిధారాశుద్ధికలిగేవున్నా ఆయనకువున్న పేరు ప్రతిష్ఠలనుగూర్చి విచారిస్తే ఆగ్రంథం వాట్లను పోషించడానికి చాలదు. ఆగ్రంథంలో కొత్తపోకడ యేమేనా వుందేమో ? అని పరిశీలించి చూచాను. అమూల్యమైనది వకటి కొత్తది వజ్రంలాంటిది నాకు కనపడింది. దాన్ని చూపుతాను.

"ఉడుకుల నాయకుండ వగు టూరక పోదుసుమీ ! తమీపతీ." యిది చంద్రోపాలంభఘట్టంలోది. వసుచరిత్ర చదివినతరవాత చంద్రోపాలంభం మతే కవిదీ రుచించదు. ఆవిషయంలో "భట్టోచ్ఛిష్ట మిదం జగత్" అని చెప్పవలసిందే. అట్టిస్థితిలో యీ "ఉడుకులనాయక" శ్లేష యీయన స్వకపోల కల్పితమే అవడంచేత నేను "చాలురా ! జన్మకు వకమాటేనా కవిదంటూ స్వకపోలకల్పితం వుంటే" అని సంతోషిస్తూ వుంటాను. చాలాయేళ్ళనుంచి మళ్ళా చాలా పుస్తకాలు చూస్తూ వున్నాను గాని యిది యెక్కడా వుపలబ్ధం కాకపోవడంచేత దీన్ని ఆచార్యులవారి సొంతధనంగానే నేను భావిస్తూన్నాను. యిట్టిసూత్రాంశం వొకటి లేనిపక్షంలో యెంతగ్రంథం వ్రాసినా పేరు రావడం దుర్ఘటం. చంద్రపక్షంలో అసలు అర్థం : ఉడు = నక్షత్రములయొక్క, కుల = సముదాయానికి నాయకుఁడు అనేది. యిందులో తెలుఁగు శ్లేష యిమిడింది. ఉడుకు,

ఉడుకులు వేసవిలో యెండ తీక్షణంగా కాస్తే తటస్థించేవి. వాట్లకు నాయకుఁడు అవి చంద్రుని యందు ఆరోపితార్థం. దాన్నిబట్టి నీవు నాకు పరితాపాన్ని కల్పించడం యుక్తమే అని విరహిణి సమర్థిస్తూవుంది. అసలు చంద్రోపాలంభ మన్మథోపాలంభాలజోలికి పోక మరో మార్గంలో కవిత్వాన్ని నడిపించుకోవలసిందే కాని వాట్లజోలికి పోతే వసుచరిత్రకల్పనో మనుచరిత్రకల్పనో వచ్చి తీరుతుం దనేరోజుల్లో ఆచార్లవారు యీమాత్రం కొత్తపోకడ చూపించి ధన్యులైనారు. మేము యీ వుపాలంభాలజోలికి యీ భయంచేతే పోనేలేదు. మా సొంతకల్పనే అనుకొని వేగుఁజుక్కను గూర్చి శ్రవణానందంలో వకపద్యం "యామినీగోపకామిని" అనేది చెప్పి యెంతో సంతోషిస్తూ వుండేవాళ్ళం. ఆకల్పన అభినవదండి కృత దశకుమారచరిత్రలో యించుమించు భేదంతో కనపడింది. దానితో ఆ కొత్త సంతోషాన్ని మేము వదులుకున్నాము. లక్షణా పరిణయంలో కాఁబోలు మన్మథోపాలంభం మొదలెట్టినందుకు "రాజీవంబ యటంచు వైచెదవు" అనేదానిలో "రా, జీవంబ !, రాజీవంబు, అ" అనేది మా స్వకపోల కల్పితం అని సంతోషించతగ్గది కనపడుతూ వుంది. "జన్మానికల్లా శివరాత్రి" యీమాత్రానికేనా ? యింత సంతోషం అంటారేమో ? కవి కష్టాన్ని యెఱిఁగినవారెవరూ అలా అనరు. లక్షల కొద్దీ గ్రంథం వ్రాసికూడా ఈమాత్రం స్వకపోల కల్పన లేని వారు పలువురు వుంటారు. యిట్టిస్థితిలో మన లక్ష్మణకవి "లలిభూతలంబునం దెలుఁగుల రాజాంబవత్స" అనే పద్యంలో కనపఱిచిన నైపుణ్యానికి యెంతేనా సంతోషించవలసి వుండఁగా యింకా యీలాటివే ఆయన స్వకపోల కల్పితాలు యెన్నో వుండఁగా యెంతో అభినందించడానికి బదులు యేదో శాఖాద్వేషాన్ని మనసులో పెట్టుకొని (అదేనా అసలు గ్రంథకర్తయందు కాదు తచ్ఛాఖీయుల యందు) కవినిన్నీ కవిత్వాన్నిన్నీ కవి ప్రవృత్తినిన్నీ గర్హించి పీఠిక వ్రాసినందుకు నా విచారం అంతా యింతా కాదని పాఠక లోకానికి తెలుపుతూ వున్నాను.

లక్ష్మణకవి దమ్మన్నగారిని దూషించడం యుక్తం కానట్టు కూడా పీఠికాకర్త అభిప్రాయపడ్డట్టు తేలుతుంది. పీఠికాకర్తగారి ఆగ్రహాన్ని యెవరేనా అపహరిస్తే అప్పుడు శాంతిబోధ తెలుస్తుంది. వెలమవారి జమీను గ్రామంలో వుండి, ఆ జమీందారులకు దూరపు జ్ఞాతే అయినా దమ్మన్నగారు వారి అనుగ్రహానికి పాత్రులుగా వుండడం కొన్నిగ్రామాలు వారు గుత్తకివ్వడం వల్లనే తేలుతుంది గదా? అట్టి రాజానుగ్రహ పాత్రుణ్ణి ఘూరత్వానికి పేరుపడ్డ వెలమ బిడ్డణ్ణి శాపోక్తులతో దూషించి తన పూర్వజన్మపు ఋషిత్వాన్ని నిల్పుకున్న లక్ష్మణకవిని యెంత భూషించినా తనివి తీరదు. కవికి యెంత పౌరుషం వుండాలో అంత పౌరుషాన్ని ప్రకటించిన వాఁడు యిటీవలి కవులలో పిండిప్రోలి లక్ష్మణకవియ్యేవే. యితణ్ణి యితఁడు వ్రాసుకొన్నట్టు భీమకవి, అడిదం సూరకవి, తురగా రామకవి వగయిరా శాపానుగ్రహ దక్షులైన మహాకవుల పంక్తిలో చేర్చి అభిషేకించడానికి యేవిధమైన అభ్యంతరమున్నూ లేదని నా తాత్పర్యం. యీకవి యీగ్రంథాన్ని రచించినట్టు తెలిసి అప్పటి ప్రభువు నీలాద్రిరాయణింగారే అను కుంటాను కవిగారిని పిలిపించి "యేమిటి? మీరు మా ధర్మారావుని దూషించి గ్రంథాన్ని రచించారా?" అని అడిగినట్టున్నూ, "నేను రామాయణాన్ని క్లుప్తంగా "లంకా విజయం" మనే పేరుతో రచించా" నని కవి చెప్పి వినిపించినట్టున్నూ, దానిమీఁద "దీనిలో రెండోఅర్థం వుందంటారే? పండితులు" అని ప్రభువు ప్రశ్నించినట్టున్నూ దానికి చిఱునవ్వు నవ్వి లక్ష్మణకవి "అయ్యా! పండితులు 'బమ్మిని తిమ్మినీ, తిమ్మిని బమ్మినీ' చేస్తారు. వారిపాండిత్యం అసదృశం. వారు లేని అర్థాలు చెప్పఁగలరు; ఉన్నఅర్థాన్ని లేదనఁగలరు. కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థులు" అని జవాబు చెప్పినట్టున్నూ రాజుగారు గ్రంథంలో వున్న యథార్థాన్ని తెలుసుకుని కవిగారిని గౌరవించి పంపినట్టున్నూ వినికివలన తెలుస్తూంది. అప్పటి జమీందార్లంటే కోఱలు తీసినపాములు కారు. అలాటి సందర్భంలో లక్ష్మణకవిని యేమీ చేయ

లేడు. యింతటి కవితాభారుఁడు యిటీవలి కవులలో లేనేలేఁడు. యీయన మా ముత్తాతగారి రోజుల్లోవాఁడే. కొంచెం యీయనకన్న మా ముత్తాత గారు పెద్దలు కావాలి. యీయన యెప్పుడో మాముత్తాతగారిని—

శ్లో. "కచభారా త్కుచభారః కుచభారా ద్భీతిమేతి కచభారః
కచ కుచభారా జ్జఘనం, కోఽయం చంద్రాననే ! చమత్కారః "

(భోజచరిత్రలోదని జ్ఞాపకం) అనే శ్లోకంలో యేదో విషయాన్ని ప్రశ్నించి కొంత వివదించినట్లు పరంపరగా వినడం. మా ముత్తాతగారు సంస్కృత పాండిత్యం వ్యాకరణ మిళితమయింది కల విద్వత్కవిగాని అల్లాటప్పా కవులు కారు. అట్టివారితో డీడిక్కీలు కొట్టుకున్న లక్ష్మణ కవిని "తోఁటకూరలో పురుగు" మాదిరిని యేటిపాలువేయడాన్ని నేనే కాదు; కవిమాత్రులెవరూ వుపేక్షించతగ్గది కాదు.

"రావణ దమ్మీయం" అనే పేరు ఆక్షేపణీయంగా వుందంటూ పీఠికాకర్త కొంత వ్రాశారు. అది ప్రష్టవ్యం అయితే కావచ్చును గాని దానికి శాస్త్ర సమ్మతితో చేరిన మహాకవి సమ్మతి వుంది. భారవి ప్రథమ సర్గ "ససౌష్ఠ వౌదార్య విశేష శాలినీం" అనేచోట వ్యాఖ్యానంలో శ్రీపెద్దిభొట్లుగారు యీవిషయం శంకించి "లక్షణ హేత్వోః క్రియాయాః" అనే సూత్ర నిర్దేశాన్ని చూపించి సమర్థించి వున్నారు. అయితే "రావణ దమ్మీయం" అనేపేరు పెట్టక లక్ష్మణకవి "లంకా విజయం" అనే పేరుతో దీన్ని ప్రకటించడాని క్కారణమేమిటంటారేమో ? ఆ పేరులో శ్లేషార్థం రాదు. విషయం వున్నవిషయం బహిర్గత మయినట్టయింది. రెండవ దానిలో ఆసలు గోప్యంగా యిమిడింది. పనిపడితే తప్పుకోవడాని కిన్నీ వీలుగా వుంది. ద్వ్యర్థి కవిత్వానికి ద్వ్యర్థిగా వుండే పేరేవుంటే సొగసు కదా ? అంతేనే కాని అది వ్యాకరణ దుష్టమని మార్చలేదు. యిట్టి ప్రతీతిన్నీ లేదు. యీ శంక శ్రీశిష్టు కృష్ణమూర్తిగారివంటి లక్ష్యలక్షణ వేత్త చేసివుండరు. యిట్టి శంకలు చెట్టుకింది ప్లీడర్ల మాదిరి కవులవిగాని

విష్ణులవి కావని పాఠకలోకం తెలుసుకోవలసి వుంటుంది. శ్రీ వావిళ్ళవారు యీసారి ముద్రణంలో ఆపీఠికతోపాటు దీన్నికూడా ముద్రించి లక్ష్మణ కవికి దానివల్ల వచ్చే అపయశస్సును తొలఁగిస్తారని ఆశిస్తూ వున్నాను.

యీగ్రంథంలో చేరవిది దమ్మన్నగారికి సంబంధించినవి నాకు వక పద్యం వచ్చును. దాన్ని వుదాహరించి దీన్ని ముగిస్తాను.

క. కవి బుధ హితుఁడై పంగుఁడు
దివి నుండెను మంద నామధేయము తోడన్
గవి బుధ రిపుడై పంగుఁడు
భువి నుండెను మంద నామమునఁ దలక్రిందై.

యీపద్యం దమ్మన్నగారికిన్నీ శనికిన్నీ సంబంధించిన అర్థాన్ని యిచ్చేదే కాని రామాయణార్థం యిచ్చేది కాదు. ఆరోజుల్లో యెప్పుడో తోఁచి చెప్పింది మాత్రం అవును. దమ్మన్నగారికి కొంచెం పంగుత్వం అంటే? కుంటితనం వుండేదఁట! దాన్ని పురస్కరించుకొని శనికి పంగుశబ్దవాచ్యత్వం వుండడాన్ని బట్టి యీపద్యరచన నడిచింది. కవి వూహ యెక్కడినుంచి యెక్కడికో పోతుంది. అందుకే "రవిగాంచ నిచో కవి గాంచునే కదా" అన్నారు. యీముండాకొడుకులికి "పాటి మీఁది గంగానమ్మకి కూటిమీఁదే లోకం" అన్నట్టు యేవెఱ్ఱిపడితే అదే వెఱ్ఱి. అందుకే మొల్ల శ్రీరాములవారి ప్రభుత్వంలో కూడా కవుల మనస్సులు నిశ్చింతగా లేవని వ్రాసింది. ("చింత కవులందుఁ దపసుల చిత్తమందు" చూ) దమ్మన్న యెప్పుడయితే తన లంకమాన్యాన్ని అపహరించాఁడో, ఆక్షణం మొదలు ఆయన్ని స్వర్గారోహణానికి గుఱిచేయడమే లక్ష్మణకవికి పట్టుకున్న చింత. అది పుణ్యమా? పాపమా? అనే విచారం లేనేలేదు. వొక్కడికి యీలాటి ప్రాయశ్చిత్తం జరిగితే తక్కిన పశుబలాధికులకు బుద్ధి వస్తుందని కూడా ఆతని తలంపు. ఆసందర్భంలో యెప్పుడో దీన్ని హేలగా పలికివుంటాఁడు. అది యెవరో వినివుంటారు.

తద్వారా నా బాల్యంలో నా చెవిని ఒడివుంటుంది. చెవిని పడదమంటూ వచ్చి ఆపద్యం పట్టి యతిప్రాసలూ గణాలూ మాత్రంతో వుండేది కాక యేదో వక విశేషంతో చేరి వున్నదే అయితే మఱచి పోవడమంటూ లేని అలవాటు వుండడంచేత నేను యీ అఱవై యేనిమిదో వత్సరంలో యిందు వ్రాయఁగలిగాను.

శనిపక్షంలో కవి బుధు లంటే శుక్రాచార్యులున్నూ బుధగ్రహమున్నూ వీరిద్దఱికిన్నీ శనికిన్నీ మైత్రి జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధం. "అత్యంత మైత్రి బుధ శుక్ర శనైశ్చరాణాం" అని ఫలగ్రంథం. పంగుఁడు అంటే శని, వీరు ముగ్గురున్నూ ఆకాశమందు వున్నారు గదా? మన దమ్మన్నగారో కవి = కవులకున్నూ, బుధ = పండితులకున్నూ, శత్రువుగా వుండడం చేత "మంద" అనే పేరుతోకాక దానికి విలోమంగా అంటే తల్లక్రిందుగా వుంటే "దంమ" అనే పేరుతో ఆకాశంమీఁద కాక దానికి వ్యతిరేకంగా భూమిమీఁదనే వున్నాఁడనిన్నీ (కొద్దిరోజుల్లో ఆకాశంమీఁదికి పంపించి తీరతా ననిన్నీ) కవిగారి ఆంతరంగికాశయం. "మంద" తల్లక్రిందులైతే "దంమ" అవుతుంది. ఐతే మకార ద్విత్వం వుండాలిగాని అనుస్వారం వ్రాయకూడదనే శంక వస్తూంది. కాని ఇలాంటి చమత్కారాలలో ఆలాటి పిచ్చి శంకలు చేయకూడదని చాలామంది మహాకవుల పోకడలవల్ల తెలియవస్తుంది. ఆపోకడలు కూడా చూపవలసి వస్తే యింకా యీవ్యాసం పెరుఁగుతుంది. అదిన్నీ కాక అప్పటివారి వ్రాఁతల్లో ఆలాటి స్థలాలలో సర్వత్రా అనుస్వారమే వుండేది. అది శాస్త్రీయం కాదంటారా? కాదన్నమాట వారికిన్నీ తెలిసిందే, కాని వ్రాయడం ఆలా వ్రాసేవారు.

"యాచ్న" అని వ్రాయడం తప్పని యెఱక్కేనా యిప్పుడు వ్రాసేవారు వ్రాయడం. 'స్తంభం' అనేది తప్పని యెఱక్కేనా? పైది కూడా ఆకాలంవారికి యీతెగలోదే అనుకోవాలి. వారి పాండిత్యానికిన్నీ వ్రాతకున్నూ "యేతంపెట్టు" గా కనపడేవి యెన్నో వారి స్వదస్తూరీ

గ్రంథాల్లో దాపకుతాయి. యింకా శేషం మాయిండ్లో మామూర్తాత నరస కవిగారి స్వహస్త లిఖితాలు తాళపత్రి గ్రంథాలు కొన్ని భద్రంగా వుండ డంవల్ల నేనీసంగతి కనిపెట్టి వ్రాస్తూ వున్నాను. ఉపన్యాసకుల వుపన్యాసా లకున్నూ ప్రవర్తనకిన్నీ యెంత భేదం వుంటుందో, పూర్వకవుల పాండి త్యానికిన్నీ వ్రాంతకూ కూడా అంతభేదం వుంటుంది. కనక యీవిషయం శంకించతగ్గది కాదు. తప్పేదో తప్పుకానిదేవో తెలుసుకోవడానికి తగ్గ పాండిత్యం లేకుండానే పీఠికలంటూ వ్రాస్తూ తప్పులు పట్టే యీరోజుల్లో గ్రాంధిక కవిత్వం చెప్పడంకంటే వ్యావహారిక భాషలోనే వ్రాసుకుంటే యుక్తంగా వుంటుందేమో ఆలోచించండీ ?

శ్లో. "కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి మరు ద్వహతి సౌరభమ్"

అని యెవరో పూర్వం వ్రాశారు. దీన్నిబట్టే మేమున్నూ—

చ. "మతి గలవారి కేనియుఁ బ్రమాద మెలర్పక పోదు పుష్పస
మ్మిత కవితా లతాంగిని రమింపుఁడు కేవల శాస్త్రులార ! మీ
మతులకుఁ దోఁచినట్లు రసమాధురి గ్రోలుఁడుగాని వ్యర్థపుం
జతురిమఁ జూపి దానిస్తన శల్య పరీక్ష యొనర్పఁ బోకుఁడీ !"

అని లక్షణా పరిణయంలో కాఁబోలును వ్రాసినట్టు జ్ఞాపకం. రస జ్ఞత్వం లేనివారు కవిత్వం జోలికి పోకుండా యిప్పటి కాంగ్రెస్సు మంత్రు లేదేనా వకబిల్లు పుట్టిస్తే బాగుంటుందేమో ? గాని వారింతవఱకు శృంగార గ్రంధాలకు అన్యాయంగా తటస్థించిన ద్వీపాంతరవాస శిక్షనే తప్పించడా నికి పూనుకొన్నట్టు లేదు. అట్టిస్థితిలో దీనికి పూనుకుంటారా ? కవులూ కవులగ్రంథాలూ కట్టకట్టుకొని యేగంగలో దూఁకినా సరే ! వారికి నొప్పి పుట్టదు. అయినా మనవిచేయడం తప్పదు గదా ? యీనిషేధం పవరిం చడం యేలాటి దంటే ? " అయ్యవా రేంచేస్తూన్నా రంటే ? అబద్ధాలాడి దిద్దుకుంటూన్నా " రనడం వంటిది. యీనిషేధం కొన్నివత్సరాలనాఁడు

వ్యక్తిగత ద్వేషాన్ని పురస్కరించుకొని మనలో కొందఱు పెద్దలు తెచ్చి పెట్టిందే. దీన్ని యేలాగేనా రూపుమాపుదామని అప్పటి విద్వద్రాజు శ్రీ వేంకటగిరి ప్రభువు శ్రీరాజగోపాలకృష్ణ యాచేంద్రులు మిక్కలిగా ప్రయత్నించారు కాని కృతకృత్యత్వం లభించలేదు. శ్రీరాజావారి "పద్య రత్నావళి" భూస్వాహా అయింది.

"శ్లో. రత్నావళీ వినాశేన కనకస్య ప్రభాహతా
తదధారణతః పుంసాం జయస్యాపి స్థితిః కుతః"

అని చెదలవాడ శాస్త్రులవారు ఆవిషయాన్ని గానంచేశారని విన్నాను కూడాను. యిప్పుడు కాలానుకూల్యం వున్నట్టు తోస్తుంది కనక యీసం గతి యెత్తడం; భవతు. అంతటితో ఆయా గ్రంథాలు పోవు వాట్లయందు పాఠకలోకానికి మఱింత ఆదరం హెచ్చుతుంది. యిందులో స్వార్థం వుందని కొందఱు ప్రతివాదానికి దిగుతారేమో ?

యీమధ్య నేను మద్య నిషేధం తో పాటు నల్లమందును కూడా నిషేధిస్తే బొత్తిగా అపూఁటకాపూఁటే బియ్యపు నూకలతో పాటు పెసర గింజంతా కందిగింజంతా కొనుక్కొని వేసుకునే శుష్కదరిద్రులు చిక్కు పడుతారని యేవో తోచినమాటలు వ్రానేటప్పటికి త్రిలింగలో వార్తాప్రణా ళికలో ఆవిషయం నాపేరుతోకూడా సహాయెత్తుకొని "తప్పక నల్లమందు కూడా నిషేధింప వలసిందే" అనే అర్థమిచ్చే వాక్యం వకటి వెలువడింది. యేదో "కాదన్నవాఁడు కరణం" గా వ్రాయడమేగాని పత్రికా ప్రవర్తకు లలో కూడా పలువురు సాధక బాధకాలు విచారించక పోవడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. శృంగార గ్రంథాలు నిషేధిస్తే అది పేదసాదలను అంతగాని కొంతగాని బాధించే విషయం గాదు. అచ్చువేసిన వెప్పుడు లభించకుండా పోతాయో అప్పుడు వాట్లయందు ప్రీతికలవాళ్ళు కష్టపడి వ్రాసుకుంటారు. లేదా సమర్థులు ధనం ఖర్చుపెట్టి రాయించుకుంటారు. యీ అచ్చురావడంచేతనే యెన్నో మంచిగ్రంథాలు అడుగంటిపోయాయి.

యిప్పటికి ముప్పై యేళ్ళనాఁడు మృత్యుంజయ విలాసం కోసం నూజివీడు శ్రీనారయ్యప్పారావుగారు యెంతో ప్రయత్నించి తుదకి నాదగ్గిఱికి కబురు చేశారు. కేట్లాగులెన్నో గాలించి గాలించి విసికి విసికి చేసలోను కనపడక పోయేటప్పటికి బుక్కు దుకాణాలు వెదకడానికి ఆరంభించాను. మాంధాతల నాఁటి అచ్చుప్రతి వకటి చిక్కింది. ఆనాఁటి మంచికవిత్వానికి యీలాటి గతి పట్టడానికి కారణం ప్రస్తుతం అచ్చువచ్చిన తర్వాత పుస్తకాలయందు వచ్చిన అనాదరమే అనుకున్నాను.

శ్లో "అతిపరిచయా దవజ్ఞా సంతత గమనా దనాదరో భవతి
మలయే భిల్లపురంధ్రీ చందన తరు కాష్ఠ మింధనీ కురుతే"

అని పండితరాయలు చెప్పివున్నాఁడు. "నోఁటఁబడు తుంపురులేవియు నిప్పు డచ్చు వ, చ్చిన కతనన్ జగాన విలసిల్లెడి మేటికృతుల్ నశించెడిన్." అని దాన్నిబట్టే యేసభలోనో అవధానంలో మేం చెప్పవలసి వచ్చింది. అచ్చుయంత్రాలు గ్రంథాలవిషయంలో పరమోపకారం చేసినమాట నిజమే కాని అనాదరాన్ని కూడా కలిగించడంచేత గ్రంథాలయందు పూర్వం వున్నంత శ్రద్ధా భక్తులలో యెన్నో వంతున్నూ యిప్పుడు లేవు. మా ముత్తాతగారు మాయింట్లోవుండే పెద్దబోషాణాన్ని గ్రంథసంరక్షణకే విని యోగించేవారఁట, యిటీవల కూడా ఆబోషాణం అందుకే వుపయోగించడం నేనున్నూ కొంచెం యెఱుఁగుదును. మాయింటి పక్కనే వున్న కరణాలు ఆవసరాల రంగయ్యగారు మాముత్తాతగారికి పుట్టెఁడు భూమిని యిస్తామంటే అది వద్దుగాని వాల్మీకం వ్రాసిపెట్ట వలసిందని కోరినట్టున్నూ, ఆయన ఆలాగే చేసినట్టున్నూ, చెప్పుకుంటారు. యింకా ఆయన వ్రాసి మా ముత్తాత గారికి సమర్పించిన వాల్మీకం మాయింటివద్ద చెక్కుచెదరకుండా వుంది. ఆలిపి సొగసు చూసి తీరాలి. అది వ్రాయబడి యిప్పటికి 114 వత్సరాలు కావచ్చినట్టు దానిలోవున్న తేదీని బట్టి తెలుస్తూవుంది. చెప్పొచ్చే దేమిటంటే ? గ్రంథం రసవత్తరమయిందే అయి ప్రాజ్ఞలోకాన్ని ఆకర్షిం చేదే అయితే పదివేల గవర్నమెంట్లు కలిసి దాని ప్రచారాన్ని ఆపలేరవిన్నీ అట్టిది కాకపోయే యెడల దాన్ని వ్యాపింప చేయలేరవిన్నీ నేనునమ్ముతాను.

అందుచేత శృంగారగ్రంథ నిషేధాన్ని కాంగ్రెస్సుమంత్రులు తొలఁగించ దానికి పూనుకున్నా పూనుకోకపోయినా కవులకుఁగాని బీదసాదలకుఁ గాని వచ్చే చిక్కంతగా వుండదుగాని మద్య నిషేధంతో పాటు నల్లమందును నిషేధించడంలో శుష్కదరిద్రులకు యేదో సదుపాయం కనపరచక పోతే వచ్చే చిక్కుకు పరిమితి వుండదని మళ్ళా హెచ్చరిస్తూ వున్నాను. బీద సాదలు దీనికి అలవాటుపడడం వొళ్ళు పొగరెక్కి అనుకోవడం శుద్ధ పొరపాటు. యిది విషయాంతరం.

ప్రాచీనకవికృత గ్రంథాలకు ముద్రణాధికారులు తెలిసీ తెలియని పండితమ్మన్యులచేత పీఠికలు వ్రాయించి ఆకవుల గౌరవాన్ని భంగించడం మిక్కిలీ అన్యాయమని నేను యింతగా మొరపెట్టడం. యీలాటిపీఠికతో గ్రంథం ప్రకటించడం కంటె పీఠికలేకుండా ప్రకటించడం వుత్తమం. యీ లంకావిజయ వ్యాఖ్యాతలు వోగిరాలవారని నేను చిరకాలాన్నుంచి యెఱుఁగుదును. యీవిషయం నాకు యెవరి వల్ల తెలిసిందో అదిమాత్రం బొత్తిగా జ్ఞాపకం లేదు. ఫలానా వారు వ్యాఖ్యాతలని మాత్రం మన స్సులో నాటుకుపోయింది. యిప్పుడు వావిళ్ళవారి ముద్రణమేకాక నావద్ద నున్న పాఁతముద్రణం కూడా పరిశీలించాను. దానిలోకూడా వ్యాఖ్యా నాంతంలో వ్యాఖ్యాతల పేరు తెల్పే గద్య కనపడదు. కనపడదంటే చిరిగి పోయికాదు. అసలు లేనే లేదు. లేనిపక్షంలో నాకీ నిశ్చయం యేలా కలిగిందో అది విచార్యమేకాని అసత్యం మాత్రం కాదు. యీసంగతి బహుశః గురుజాడవారి కవిజీవితాల్లో వుంటే వుంటుందేమో? వుంటే సరే సరి లేకపోయినా రాఁబోయే ముద్రణంలో వ్యాఖ్యాతలు వోగిరాల జగన్నాథం గారని నిరభ్యంతరంగా చేర్చవచ్చునని నాసలహా.

శ్లో "జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాఽస్తి యేషాం యశఃకాయే జరా మరణజం భయమ్"

స్వస్తి

---

# శారదా బిల్లు

( 23-3-1938 సం॥ ఆంధ్రపత్రిక పత్రిక నుండి )

ఆర్యమహాశయులారా ! శారదాబిల్లు మరింత తీవ్రరూపాన్ని తాల్చ బోతుందనిన్నీ, తాల్చిందనిన్నీ పత్రికలలో వుండే వ్రాతలు ఘోషిస్తూ వున్నాయి. ఆవ్రాతలు నాకెంతో భయాన్ని కలిగిస్తూ వున్నాయి కనుక లోగడ వ్రాసినట్లే యీరెండు మాటలూ మళ్లా వ్రాస్తున్నాను. నేనైతే యజ్ఞ యాగాదులు చేయనూలేదు, అవి చేసిన శ్రోత్రియ కుటుంబంలో జన్మించనూలేదు. కాని నాకు వారి ఆచార వ్యవహారాలయందే యెక్కువ విశ్వాసం. నాకయితే మంత్రోపాసన యందు చిన్నప్పటినుంచీ యెంతో ఆదరం వుండేదికాని ఆ వుపాసనకూడా యెప్పుడూ తుద నెగ్గినట్టు లేదు. దానికి నాకు తెలిసినంతలో కారణం నాజాతకరీత్యా గురు రాహువులు కలిసి వుండడంచేత పట్టిన గురు చండాలయోగంగా కనపడుతుంది. మనుష్యులకే అకించిత్కరాలుగా నేడు కనపడే జాతిమతభేదాలు ఆకాశంమీద సంచరించే గ్రహాలక్కూడా మన ఆర్యులు కట్టిపెట్టారు. వారి జ్ఞానం యెంత మహత్తరమైనదో గాని అవి దృష్టాంతాన్ని కూడాయిస్తూవున్నాయి. మనవి చేసేదేమిటంటే, గురుచండాలయోగం వల్ల నేను మీవలె కర్మనిష్ఠాపరుణ్ణి కాకపోయినా మీసదాచారాల యందు నాకు నమ్మిక లేదని భావించవద్దని సాంజలిబంధంగా మిమ్ము ప్రార్థిస్తాను.

రజస్వలావివాహం లేనికారణంచేత తల్లిదండ్రులు పిల్లల్ని అమ్ముకోవడానికి యెక్కువ అవకాశం కలుగుతూ వుందనిన్నీ యింకా యేమో యేమో అనన్నీ చెప్పేమాటలలో కొంత సత్యం లేకపోలేదుగాని దాన్ని వారించడానికి సంస్కర్తలు యోగ్యులకుకూడా యీనిర్బంధాన్ని కలిగించడానికి విచారించేవాళ్ళల్లో నేను మొట్టమొదటివాణ్ణి. యీబిల్లు రద్దుచేయడమంటూ తటస్థిస్తే మీకంటేకూడా నేను సంతోషిస్తాను. అయితే ఆయోగం పట్టేటట్టు తోచడంలేదు. యేనైజామో, యే ఫ్రెంచిగ్రామమో వెళ్ళిచాలా

మంది చేసుకునేవారు. ఆ అవకాశమున్నా యిప్పుడు తప్పిపోయినట్టి తెలుస్తుంది. కాని శరపరంపరగా బిల్లుకు వ్యతిరేకించిన పెళ్ళిళ్ళు బ్రాహ్మ ణులలోనూ, ఇతరులలోనూ "శతాంధాః కూపం ప్రవిశంతి" అన్నట్టుగా జరుగుతూనే వున్నాయి. వొకరిని చూచి వకరు "ఫరవాలే" దనుకోవడమూ చేయడమూ జరుగుతూవుంది. యెవరికో తప్ప చిక్కురావడం లేదు. దొంగ తనం చేయకూడదనే నిషేధం దొంగలని యెంతవఱకు ఆఁపగలిగిందో యిదిన్నీ అంతే ఆఁపఁగలుగుతూ వుంది. అయితే తమతమ సంతానానికి శాస్త్రోక్తప్రకారం వివాహం చేసుకోవడం దొంగతనం చేయడంవంటిదే అవుతుందా అని ప్రశ్నించకండి. కాలమహాత్మ్యాన్ని బట్టి అలాకావలసి వచ్చింది. కనక గతానికి ఆలోచించకండి, ప్రస్తుతం చూచుకోండి. యే నిమ్నజాతివాళ్ళైనా చేస్తే కేసుపెట్టేవారికి అంతపట్టుదల వుండదు. కాని బ్రాహ్మలెవరేనా అందులోనున్నూ కాస్త నామరూపాలు వున్నవాళ్ళు బిల్లుకు వ్యతిరేకించే పెళ్ళి చేస్తే వాళ్ళపని అయిపోయిందన్నమాటే. వాళ్ళుకాస్త పచ్చిగా వున్నవాళ్ళయితే తప్ప అలాక్కాక యేదో అవేళకావేళ "తదన్నం తద్రసం"గా కాలక్షేపం చేయడంమాత్రం వసతివాళ్ళతో వున్నవాళ్ళయితే దానితో అడుగంటిపోవడం జరుగుతుంది. యీమాట బాగా ఆలోచించు కోండి. అమధ్య వక బ్రాహ్మఁడు పద్దాలుగేళ్ళా వచ్చీరానిపిల్లకేమోచేసి నట్టున్నూ, యెవరో దగ్గిరబంధువులే వారికీ వారికీవున్న విరోధాన్ని యీ ద్వారాగా తీర్చుకోవడానికి కేసుపెట్టినట్టున్నూ, దానితో ఆగృహస్థు ఆపెళ్లి కూఁతురుతోసహా కొన్నిమాసాలు కోర్టుకుతిరిగాక అధికారి దయతలఁచి కేసు కొట్టేసినట్టున్నూ, విన్నాను. యావత్తు ఖర్చులకిందా యెనిమిదివందల రూపాయీలయినాయన్నారు. నిర్దోషత్వం సిద్ధించేపక్షంలో మాత్రంయింత ఖర్చు భరించతగ్గ కుటుంబాలు బ్రాహ్మల్లో నూటికి యెన్ని వుంటాయో ఆలోచించండి. (యే భీమశంకరశాస్త్రులు గారివంటివారికో ఐతే యీ వ్యయం లెక్కలో వుండదనుకుందాం.) జరిమానా అంటూ పడవలసివస్తే పురోహితుఁడితోసహా మొత్తం పంచపాండవులు అయిదుగురు ముద్దాయీలు

వుంచవలసివస్తుంది. అధికారియెంతో దయచూపి విధించినా యీశయిదు గురికీ పడే జరిమానా అధమంయింకో వేయిరూపాయీలేనా వుండకపోదు. లాయరుఫీజు వగయిరా యింకా యెన్నో ఖర్చులు వుంటాయి. అధికారి రూలునుబట్టి శిక్షించడం తప్పదుగాని "అయ్యో వృథాగా నిరపరాధిని శిక్షిస్తున్నాంగదా!" అనే విచారం మాత్రిం వుండకపోదు. ఉంటేమాత్రం లాభమేమి? "వచనా త్ప్రివృత్తి ర్వచనాన్నివృత్తిః" అన్న వాక్యంమీకు తెలియనిదికాదు. సోమయాజులు గారికిఁగాని, సోమిదేవమ్మ గారికిఁగాని ఋత్విక్కులకుఁగాని యజ్ఞంలో మేఁకను నవరంధ్రాలూమూసి దుర్మరణంగా వధిస్తూవుంటే విచారం లేదనడానికి అవకాశంఁవుందా? యిదీ అలాగేఅను కోవాలి. ఆయా హింసనుగూర్చి యెన్ని శాస్త్రాలుతిరగేసినా హింసకాదనే బోధ చేస్తూవుంటాయి. ఆయీ శంకాసమాధానాలతో పనిలేదు. పద్నాలుగేళ్ళ వయస్సుకు లోఁబడ్డ ఆఁడపిల్లకుఁగాని, పద్దెనిమిదేళ్ళకు లోఁబడ్డ మొగ పిల్లవాఁడికిఁగాని పెళ్ళిచేయడం మహాపరాధంగా రాజకీయశాసనంపుట్టి వుంది. అదేమనకు వేదం. కనుక మనందాన్ని అనుసరించి వర్తించడం కన్న గత్యంతరంలేదు. "యెవరో చేశారు. వారిమీఁద యెవరూ కేసు పెట్టనే లేదు. మనమీఁద అంతకన్నా పెట్టరు" అనుకొని పెళ్ళి చేయడం యేలాటిదంటే? "ఆదొంగ ఆవూళ్ళో కన్నంవేశాఁడు; యీదొంగ యీ వూళ్ళోకన్నంవేశాఁడు. వాణ్ణిగాని వీణ్ణిగాని యెవరూ పట్టుకున్నట్టే లేదు" అనే భరోసాతో దొంగతనం చేయడంవంటిదే! సందేహంలేదు. యీకార్యం శాస్త్రీయమవడంచేత మనదృష్టిలో దొంగతనంవంటిది కాకపోవచ్చును. రాజకీయదృష్టిలో అట్టిదికాదుకదా! రాజులు మనమతస్థులు కారు అనేమాట తెలుసుకోండి. యెందరో అమాయికులతో నేను దీన్ని గూర్చి చాలా అదుర్దాతో మాట్లాడివున్నాను. వారందఱూ "యేదో బిల్లయితే పుట్టించవచ్చు కాని అందఱూ చేస్తూనే వున్నారు. మరేమి చిక్కూ రావడంలేదు." అనే వారేకాని పనిపడితే కొంప మునుఁగుతుందేమో అనే తాత్పర్యం వున్నవారే కనపడరు. (అయితే వీరేమైనా తప్పగడించిన సంపన్నులేమో అంటే

అట్టివారున్నూ కారు.) "లేకపోతే లేకపోతారుగాక వాళ్ళకర్మం వాళ్ళేఅనుభవిస్తా" రని నీవూరుకోరాదా ? నీకెందుకీ పరితాపమంటారేమో ? వినండి నాపరితాపకారణాన్ని. దొంగతనంగా బాల్యవివాహాలు సాగించేయీమహానుభావులు యెవరేనా శాసనానికి జంకి రజస్వలాకన్యకా వివాహం చేసేవాళ్ళుంటే వాళ్ళని వెక్కిరిస్తూవున్నారు. ఆయీ కారణంచేత నయితేయేమి పరమార్థానికి లోపంకలుగుతుందనే కారణంచేతనయితేయేమి వృద్ధులున్నూ, వృద్ధురాండ్రున్నూ, రజస్వల అయేదాఁకా కన్యకను వుంచడానికి వప్పుకోక వేధించడం జరుగుతూవుంది. ఆకారణంచేతనే కాంగ్రెసులో మెంబర్లుగా వుండడమే కాకుండా ఖద్దరుదీక్షసమాశ్రయణాది పంచసంస్కారపరులుగా వుండి హరిజనుల చేతినీళ్ళు తాగడందాఁకా వచ్చినవాళ్లకూడా రజస్వలాత్పూర్వమే కూఁతుళ్ళకి పెళ్ళి చేయడానికి కొందఱువరుళ్ళకోసం తిరిగితిరిగి తిప్పలు పడుతూవున్నారు. పైకేమో, "మాకు రజస్వలాకన్యకను చేసుకోవడానికి అభ్యంతరంలేదని చెపుతారు కానిచాలామంది రజస్వలాకన్యకను యేదో వంకపెట్టి నిషేధిస్తూన్నారు. యీకారణం చేత కట్నంలో రేటు హెచ్చవలసి వస్తూవుంది కొన్నిచోట్ల. పట్నవాసాలల్లో తప్ప యిప్పటికి పల్లెటూళ్ళలో నా యెరిఁగినంతలో శారదాబిల్లు ధాటీకి నీవా నేనా అని నిలవఁబడే పెళ్ళి వకటీ జరిగినట్టేలేదు. అపట్నవాసపుగృహస్థుల యింటికి పల్లెటూరిబంధువులు (అత్యావశ్యకులే) రావడం మానేశారని ఆ గృహస్థులవల్లనే విన్నాను. నేను ఆగృహస్థుల యింటిలో భోజనంచేస్తూనే వున్నాను. యింట్లో ఆచారవ్యవహారాలేమీ మాఅలేదు (యిప్పటికీ ఆఁడవాళ్ల విప్పు సమేతూ కడుగుతూనే వున్నారు) యిదిమాత్రమే మాఱింది. గవర్నమెంటుశాసనానికి వ్యగ్రించి దొంగతనంగా బాల్యవివాహం చేయడంకన్న దాన్ని అనువర్తించి వర్తించడమే నాబుద్ధికియుక్తంగా కనపడింది. పోనీ ఆదొంగతనానికే సమ్మతించినా అదిన్నీ తుదనెగ్గేటట్టు కనపడడం లేదు. (భక్షితేఽపి లశునే న రోగశాంతిః) నేఁడో రేపో యీబిల్లు యింకా బిగిస్తారనే వార్తలు కనపడుతూన్నాయి. బిల్లు తెచ్చిపెట్టినవారు సనాతను

లకు మతరీత్యా విపక్షులు గనక వారు అపకారంచేయడం యుక్తిసహమే. సనాతనులుకూడా "తాడూ బొంగరమూలేని ఆటగా" దొంగతనపుపెళ్ళిళ్ళకు సిద్ధపడుతూ తమసంఘాన్ని రాజకీయరీత్యా వచ్చేపీడకు గురిగా చేయడం నాకు మిక్కిలీ శోచ్యంగా కనపడుతూవుంది. జహ్వార్లాలుగారు కాఁబోలును సనాతనులందఱినీ హిమవత్పర్వత ప్రాంతాలకి వలస పొమ్మన్నారని యెవరో వ్రాశారు. ఆమాత్రం చేవ సనాతనులయందుఁగాని వారు కొలిచే రాతిదేవుళ్ళ యందుఁగాని వుంటే వారు అట్టిసలహా యివ్వడమే జరగదు. యీచిక్కు మతరీత్యా పూర్తిగా సనాతనులకు విపక్షులుగా వుండే కాంగ్రెస్సువారి వల్ల యెన్నఁటికీ తీరదు. మనలోమనమే తీర్చుకోవాలి. యీలాటి అవాంతరాలు కొన్ని పూర్వంకూడా వచ్చినట్టున్నూ, అప్పుడు ఋష్యాదులుకూడా దేవతోద్దిష్టాలుగావుండే హవిర్భాగాలు సమేతూఅన్యథాగానే వినియోగించి ఆకష్టకాలాన్ని దాఁటుకున్నట్టున్నూ గ్రంథప్రమాణం కనపడుతుంది. దానికన్న ప్రాప్తకాలజ్ఞులకు యీశారదాబిల్లు చిక్కులోది కాదు. యెదిరించి దీన్ని మాపుచేయఁదగ్గ సంఘబలం మనకి యిప్పుడే కాదు; యీక్లిష్టసమస్య యేధర్మరాజుగారి పరిపాలనలోనో వచ్చిందనుకోండి, అప్పుడేనా దీనివల్ల బాధకలిగేది యెవరికి? క్షత్రియులకుకాదుగదా! శూద్రులకు కాదుగదా! వారితరవాత వారినిగూర్చి వ్రాయనే అక్కఱలేదు. ఒక్క బ్రాహ్మలూ, కోమట్లూ, విశ్వబ్రాహ్మలూ మాత్రమే దీనికి గుఱి కాఁదగ్గ వారు. యీసంఘం మానవసంఘంలో యెంతదాఁకావుంటుంది జనసంఘ బలాన్నిబట్టి అప్పటి ప్రభువులుకూడా శాసననిర్మాణం చేసే యెడల అప్పుడేనా మనకు జయం లేకపోవడమే నిశ్చయం. ఇప్పుడు చెప్పేదేమిటి? బ్రాహ్మల్లో అంటే నామమాత్రబ్రాహ్మల్లోనే అనుకుందాం ఎందఱో దీన్నేకాకుండా వితంతూద్వాహాన్ని కూడా ఆమోదిస్తూ వున్నారు. వైశ్యులో? బ్రాహ్మల వృద్ధప్రపితామహులుగా మాఱి దీనికే కాకుండా యింకా యెన్నిటికో క్రొత్తసంస్కారాలకు అమితమైన వుత్సాహాన్ని చూపుతూ వున్నారు. (వారల్లావొక్క ఋణవివారకచట్టాన్ని ఆమోదించ

దంలో కొంత వెనుతీసినట్టు కనపడుతుంది.) ప్రాక్టికలుగా కూడాకనపడుస్తూ వున్నారు. ఆవుత్సాహాన్ని ఆలాటి వివాహాలుఅంటే వితంతు వివాహాలు పట్నవాసంలో వుండే బ్రాహ్మణ పురోహితులు వెళ్ళి కిక్కురు మనకుండా చేయిస్తూ వున్నారు. డబ్బాదస్కమూ, తెచ్చుకుంటూవున్నారు. వారితోనేను స్వయంగా మాట్లాడి వున్నాను. వృత్తి వదులుకుంటే తరవాత పొయిమీఁదకి కుండెక్కడానికి గత్యంతరం లేదని తేలింది. అథవా యే వేదస్తుఁడో బిఱ్ఱబిగిసి కూర్చుంటాఁడే అనుకుందాం; ఆతఁడు వెడదమేకాని ఆపని అంతమాత్రంతో ఆఁగిపోతుందా ? శుక్రాచార్యులుగారికి కన్ను పోఁగొట్టుకోవడమే జరిగిందిగాని బలిచక్రవర్తికి రాజ్యం నిలిచిందా ? భగవంతుని చర్యలు అనేక విధాలుగా వుంటాయి. వాట్లని నిరోధించడానికి సనాతనులకు కాని, మఱివకరికిఁగాని శక్యమవుతుందా ? ప్రస్తుత విషయం భగవదాదేశం కాదంటారా ? నాకు ఆలా అనిపించడం లేదు. ప్రతీ విషయానికీ సూదిలో దారంలాగ భగవత్సంబంధం వుండే తీరుతుంది. సంఘబలం లేని సనాతనుల ఆచారాలు యింతకాలం యేలా నిలిచి వుండఁ గలిగాయనే సంశయం కొందఱికి కలుగుతుంది. నాకు తోఁచిన మాట చెపుతాను. పూర్వం బ్రాహ్మణ్ని కాపాడడానికి అన్నివర్ణాలవారూ పూనుకొనేవారు. ఎందుచేత ? ఆజాతి సదాచారసంపత్తితో వుంటే తమరందఱూ సదాచారసంపత్తితో వుండడానికి కారణ మవుతుందనే వుద్దేశం చేతనే. యిప్పుడో ఆ అభిప్రాయం తొంటభై తొమ్మిదిపాళ్ళు నశించింది. పైవిషయాన్ని నేను యేలా తెలుసుకున్నానంటే ? వెనక సుమారు నలభైయైదేళ్ళకు పూర్వం కోమట్లకు వేదోక్తవిషయపుతగాయిదాలలో బ్రాహ్మలతోపాటు శూద్రాదులుకూడా యెదురుతిరిగారు. నిజానికి శూద్రాదులకు అందులో కలుగఁజేసుకో వలసిన ప్రశక్తి లేశమూ కనపడదు. దాన్నిపట్టి యీ రహస్యం నాకు గోచరించింది. ఇప్పుడో అట్టి సహాయం బ్రాహ్మడికి యితరవర్ణాలద్వారా కలగడం లేదు సరికదా, పైపెచ్చు వ్యతిరేక పక్షానికి పూర్తిగా కలుగుతూ వుంది. సనాతనులు వక్క బ్రాహ్మల్లోనే

కాదు; అన్నికులాలలోనూ ఇప్పటికి అధమం నూటికి దెబ్భైవంతులదాఁకా వుంటారు. ఉన్నా వారికి సంబంధించిన వ్యక్తులు శాసనసభలలో వున్నట్టు లేదు. అందుచేత యేశాసనంగాని నిరాతంకంగా ప్యాసయి అమల్లోకి వస్తూవుంది. యింట్లో కూర్చుని సనాతనులు కుయ్యో, మొర్రో అంటే యేంప్రయోజనం? అట్లని శాసనసభా ప్రవేశాన్నికూడా సంపాదిస్తేనో? అప్పుడుమాత్రం వీరితరవున చేయెత్తే దెవరు? కాఁబట్టి ఆశాసనప్రకారం విధిలేక నడుచుకొనేవాళ్ళని వేధించడం వక్కాటే యిప్పటికి సనాతనులకు చేతనైనపని. అదేనా ఆవలివ్యక్తి "పికట్" చర్యలోకి దిగేపక్షంలో అంతరించవలసిందే. పూర్వం సనాతనులకు రాజకీయమైన సహాయం పూర్తిగా ఉండేది. (ధర్మశాస్త్రం పురస్కృత్య ప్రాడ్వివాకమతే స్థితః) యిప్పుడు అది యేలేశమూలేదు. అందుచేత వృథాగా స్వసంఘీయులని అనాలోచనగా వేఁపుకుతినడం మిక్కిలీ ఘోరంగా కనపడుతుంది. కాఁబట్టి నావిజ్ఞాపన మేమి టంటే? మీరు మీమీగ్రామాలలో సభలు చేసుకుని "రాజశాసనం ద్వారాగా యేయే ఆచారాలు అవలంబించవలసి వస్తుందో వాట్లను శాస్త్రీయములైనా, కాకపోయినా అవలంబించవలసిందే కాని అతిక్రమించ కూడదు. యెవరేనా శాస్త్రమందు వుండే గాఢవిశ్వాసంచేత అతిక్రమించేయెడల వారిని మనం అభినందించకూడదు" అనే సిద్ధాంతాన్ని ప్రకటించవలసిం దని ప్రార్థిస్తాను. యీలా ప్రకటించడంవల్ల మీయెడల భగవంతునికి లేశమున్నూ ఆగ్రహం కలగదు. యెందుచేత? మీయంతట మీరు భగవదుద్దేశ మనుకోఁబడే శాస్త్రానికి భిన్నంగా ప్రవర్తించడం లేదుకదా! ఈలా వర్తించడం శాస్త్రసమ్మతం కాదనికూడా మీరు భయపడ నక్కఱలేదు. యిది ఆపద్ధర్మాలకిందకి రావచ్చు ననుకుంటాను. శ్లో. "ఆపద్ధర్మతయా మనోశ్చ కృషిగోరక్షాదికం సమ్మతమ్." అని కుట్టిమహాకవి వక్కాణించి వున్నాఁడు.

యిప్పుడు సనాతనులకు వచ్చిన ఆపత్తేమిటని శంక కవకాశం లేదు పూర్తిగా ఆపత్తు వచ్చివుంది. ఆగమప్రకారం యేర్పడ్డదేవాల

యీలు ఆగమాలని "తోసిరా" అని వర్తించవలసివచ్చిందికదా! కర్మం చాలక యేధర్మకర్తగాని, యేఅర్చకుఁడు గాని ఆగమాన్ని అనుసరించి హరిజనప్రవేశాన్ని అడ్డగించేయెడల గాఢంగా శిక్షించవలసిం దని శాసనం యేర్పాటవుతుం దనికూడా తెలుస్తూ వుందాయె. శారదాబిల్లు సరేసరి యిదివఱకే కొంత తీవ్రస్థితిలో వుందికదా! యింకా ఆమంత్రానికి పురశ్చర్య జరిగి తీవ్రస్థితికి వస్తుందనికూడా తెలుస్తూవుంది. యింతకన్న ఆపత్తేమి వుంటుంది? యీఆపత్తులో స్వసంఘీయులను ముంచి పీడించడం మీకు ధర్మం కాదు. మీచేతనైనంతలో సహాయం చేసి ఔదార్యాన్ని ప్రకటించండి. ప్రతిపక్షులేమో, ఆయీసంస్కారాలు యుక్తములే అనుకొని అవలంబిస్తారు. మీరేమో, అయుక్తములే అనుకుంటూ అవలంబించండి. వారికీ మీకూ యింతే తేడా. యింతకన్న వుపాయం నాకుకనపడక యీలా వ్రాశాను. దీన్ని శల్యసారథ్యంగా భావించకండి.

యింకొకమాట వ్రాయడం మఱిచాను. అశాస్త్రీయంగా వుండే యేనవీనాచారాన్నికాని మీరు శాసనబాధ తగిలేదాఁకా యెందఱెన్నివిధాల బోధించినా అవలంబించవద్దు. దీనివల్ల భగవంతుఁడికి శాసనకర్తలే జవాబుదార్లు కావలసివుంటుంది గాని మీకు లేశమున్నూ ఆపూచీ వుండదని నాతలఁపు. అసలు భగవంతుఁడంటూ వకఁడు లేకేపోయి పరమనేదిన్నీ లేకే పోయేయెడల యేచిక్కూ వుండదుకదా! "గజం మిథ్య పలాయనం మిథ్య." యీచిక్కు మీరు తీర్చవలసిందే కావి అన్యథాగా తీరదు. దేవాలయపుచిక్కు అందఱినీ బాధించేది కాదు, అర్చకులనీ ధర్మకర్తలనీమాత్రమే. శారదాబిల్లుచిక్కు ప్రతిగృహస్థునీ బాధించేదే. దీనిలో వున్నలోపం పెద్దది కనపడుతూ వుంది. శాసనమేమో నాలుకలు కోశ్రిలుతూ వజ్రాయుధంలాగ వెలుగుతూ వుంది. అమాయిక లోకమేమో "అసలే లే" దనే వారు కొందఱున్నూ, "వున్నాభరవాలే" దనే వారు కొందఱూగా కనపడుతూన్నారు. ముసలమ్మలకున్నూ తత్తుల్యులే అమకోఁదగ్గ కొందఱు గృహస్థులకున్నూ వారూవారూ దొంగతనంగానో, పల్లీకు

గానో చేస్తూవున్న బాల్యవివాహాలే మార్గదర్శకాలుగా పుంకపుంకల్లో బిల్లుకు జంకి యేగృహస్థేనా పద్దాలుగేళ్ళదాఁకా కన్యకను వుంచే యెడల వాఁడు పిచ్చిపుల్లయ్యగానో అప్రాజ్ఞుఁడుగానో కనపడుతూ వున్నాఁడు. "చేసేస్తే సరి. యేచిక్కూ లేదు" అనేమాటే సర్వత్రా కర్ణతాడితంగా వినపడుతూ వుంది. తీరా కేసువస్తే చెప్పుకోదగ్గ జవాబు కనపడదు. "యెవరు పెడతారు కేసు మనమీఁద? మనం యెవరికి యేమిద్రోహం చేశాం" అను కుంటూ శాసనవ్యతిరిక్తంగా పలువురు పెళ్ళిళ్ళు చేస్తూన్నారు. బ్రాహ్మ ణులూ, కోమట్లూ వగయిరా అగ్రవర్ణస్థులు యీమాత్రం మాటేనా అనుకొని సమాధానపడి పెళ్ళికార్యం నెఱవేర్చు కుంటూ వున్నారుగాని నిమ్నజాతులలో యెవరూ అసలు యీశాసనం వుందంటూ యెఱఁగా యెఱఁగరు, వాళ్ళని యిది బాధించేటట్టున్నూ లేదు. యేదో కులంద్వారా గానో, ఉద్యోగమూలంగానో విద్యామూలకంగానో కాస్త తలతిప్పుకొనే వాళ్ళకే యిది తృణచ్ఛన్న కూపంగా వుండి బాధిస్తుంది.

లోకంచాలామట్టుకు ఆచారాన్నిపట్టి నడుస్తూవుంటుందిగాని శాస్త్రాన్ని పట్టి నడవడం వుండదు. అందుకే మనవారు శాస్త్రంకన్నాకూడా ఆచారానికే ప్రాధాన్యం యిచ్చి "మహాజనో యేన గత స్స పంథాః" అనడం తటస్థించింది. శాస్త్రవేత్తలుకూడా వొక్కొక్కసందర్భంలో ఆచారానికే ప్రాధాన్యం యివ్వడం శ్రీబులుసు పాపయ్యశాస్త్రుల్లుగారు మొదలైన వేద వేత్తల ప్రవృత్తివల్ల తెలియఁబడుతుంది. ప్రస్తుతం శాసనమేమో శాస్త్రం అనుకోవాలి. ఆచారం వారువారు "శతాంధాః కూపం ప్రవిశంతి" గా చేస్తూవున్న సాహసపు బాల్యవివాహాలు. యీ వివాహాలు పూర్వధర్మ శాస్త్ర విరుద్ధాలు కాకపోయినా యిప్పటి రాజకీయధర్మశాస్త్రానికి పూర్తిగా విరుద్ధా లన్నమాట మనం మఱవకూడదు. పూర్వం మనకీ రాజులకూ వొకటే ధర్మశాస్త్రం. యిప్పుడో? ఆలాకాదు. యీమాట మఱవ కూడదు. వీట్లవల్ల వచ్చే ఆపత్తు పరలోకానికి సంబంధించేది కాదన్నమాటకూడా మనం మఱవకూడదు. యీఆపత్తు అమాయికులగు మనమన బంధుజాతా

నికి తగలకుండా చేయడానికి సాధనం మన మాలోచించుకోవాలి. అట్టి సాధనం ఆ శాసనానికి మన మందఱమూ దాసానుదాసులుగా వుండి వర్తించడమేతప్ప మఱోటి కనపడదు. కాఁబట్టి పూర్వాచార పరాయణులలో ప్రముఖులైనవారు సభలద్వారాగానున్నూ, వ్యాసాల ద్వారాగానున్నూ యీ ఆపద్ధర్మాన్ని తోడి అమాయికులకు బాగా బోధించి వారిని ఈ ఆపత్తు నుండి తప్పించడం కర్తవ్యంగా నాకు తోస్తుంది. యింతకన్న ధారాళమైన మార్గం వుంటే యెవరేనా తెలిపితే నేనుకూడా దాన్నే అవలంబించవలసిందిగా నాకు సంబంధించిన అందఱికీ తెలుపుతాను; నాఅభిప్రాయాన్ని మార్చుకుంటాను. నాబుద్ధికిమాత్రం యింతకన్న మార్గం కనపడడం లేదు. "నాన్యః పంథా విద్యతేయనాయ, నాన్యః పంథా విద్యతేయనాయ" "సర్వేజనా స్సుఖినో భవంతు."

కాదు కూడదు, యీలాగే చాటునా మాటునా శాసనానికి విరుద్ధంగా పెళ్ళిళ్ళు చేసుకుంటూనే వుందా మంటారా? "కాఁదగ్గపని గంధర్వులే తీర్చా" రన్నట్లు శాసనమే తీరుస్తుంది. కాఁబట్టి మీరు త్వరలో మేలుకొని తోడివారిని మేలుకోపెట్టండి. కన్యకలనీ, కన్యాదాతలనీ, పెళ్ళికొడుకులనీ, వారి తల్లిదండ్రులనీ కోర్టుపాలు కానీకండి.

మీకు రజస్వలా వివాహం సర్వథా అనుచిత మని తోఁచే యెడల "అత ఊర్ధ్వం రజస్వలా" అనే వయస్సు అతిక్రమించకుండానే యే వరుఁడికో నచ్చినవాఁడికి మానసికంగా ఆదానవిధిని నిర్వర్తించుకోండి. కాని దేశకాలపాత్రల ననుసరించి వివాహం జరిగే లోఁగా పెళ్ళికూఁతురు లోపిస్తే అంత చిక్కు లేదుగాని పెళ్ళికొడుకు లోపించేయెడల ఆకన్యకకు తరవాత పెళ్ళికావలసివస్తే కొంత చిక్కు కలుగుతుందేమో అనే ఆక్షేపణ యీమానసిక వివాహాలలో కలుగుతుంది. కాని ప్రత్యక్షంగా పూర్తి వివాహం జరిగినకన్యకకు ఆలాటిదైవలోపం వస్తేనే ప్రస్తుతం చిక్కు కలగడం లేదు. అట్టిస్థితిలో మానసికవివాహానికి అట్టిబాధ కలుగుతుందా?

అవన్నీ అనకట్టకు పూర్వపువిషయాలు, ఇప్పటివికావు. బాగా ఆలోచించు కోండి. కలుగుతుందే అనుకోండి. అప్పుడు ఆకస్మిక సావిత్రిలాగ పట్టు పట్టేదే అయితే దైవికంగా స్వర్గస్థుఁడైన భర్తను బ్రతికించుకోలేకపోవచ్చును గాని యావజ్జన్మ బ్రహ్మచర్యాశ్రమంగా కాలక్షేపం చేసేది కాకపోదు. అట్టి అసిధారావ్రతం కల బ్రహ్మచారిణులు మనభారతీయులలో అన్నివర్ణాలలోనూ పలువురు వున్నారు. యీకాలంలో అట్టి అసిధారావ్రతాలు అసంభవ మంటారా? ఆపక్షంలో "ఉపనయనమునాఁటిమాట" అంటే పునర్వివాహాధారం కూడా వుండనేవుంది కదా! అయితే, రజస్వలావివాహానికే వప్పుకోని సనాతనులకు పునర్వివాహం యేలా సమ్మత మవుతుందంటారా? వినండి. దానిక్కూడా వకబిల్లు పుడితేనేనా అంగీకారం అవుతుందా, కాదా? యీలోఁగా ఆబిల్లు కూడా పుట్టి తీరుతుందని నానమ్మకం.

పర్యవసాన మేమిటంటే రాజకీయశాసనం ద్వారాగా రద్దయిన యేపూర్వాచారాన్ని అవలంబించినా మీరు భగవంతునికి ఉత్తరవాదులు కారుగాని గవర్నమెంటుకు కాకపోరు. విడాకులచట్టంగాని, వితంతూద్వాహచట్టంగాని వచ్చినా అవి ఐచ్ఛికాలుగా అంటే? యిష్టంవస్తే చేసుకోవచ్చు. లేకపోతే మానవచ్చు ననేమార్గంలో వుంటా యనుకుంటాను. ఆపద్ధతిని అవి శారదాచట్టంలాగ జరిమానావగైరా బాధలకు లోఁబఱిచి నోరూ వాయీ లేని సనాతనులను దుఃఖపెట్టవు. అందుచేత వాట్లకుఁగా తయారు కాఁబోయే "బిల్లులకు" మీ రంతగా భయపడవలసి వుండదు. అదిన్నీకాక విడాకు లిచ్చే సాధ్విగాని, పునర్వివాహాన్ని చేసుకొనే సతీమణిగాని తల్లిదండ్రుల అనుమతిని అపేక్షించేదిగా వుండదు కనక ఆకృత్యానికి సంబంధించిన మంచిచెడ్డలతోఁగాని, పుణ్యపాపాలతోఁగాని, మీకు లేశమూ జోక్యం వుండదు. మనస్సులో విచారం తప్పుతుందా అని అంటారేమో? అలాటి స్వల్పవిచారాలకుకూడా భయపడేవారు సంసారానికే అంగీకరించకూడదు. యీమధ్య వక అగ్నిహోత్రింవంటి కుటుంబంలో పుట్టిన సాధ్వి దైవోపహతురాలై వెంటనే పునర్వివాహం చేసుకుంది.

తల్లిదండ్రులు దుఃఖించి వూరుకున్నారు. సోదరులున్నూ అంతే చేశారు వీరి దుఃఖానికి జంకి ఆమె స్వసౌఖ్యాన్ని వదులుకుంటుందా అనే అంశ మున్నూ విచారణీయమే. "ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి' యీలాటి అవకాశం కలిగివున్నా కొందఱు స్త్రీలు పూర్వరీతిని లేచిపోవ డాన్ని యింకా అమలు జరుపుతూనే వున్నారు. ఆలాటివాళ్ళకు యేసం ఘంలోనూ నిలవడానికి నీడ వుండదు. అట్టివాళ్ళు యిఁకనేనా ఆ దురుద్య మాన్ని వదులుకుంటే కొంత బాగుండును. కాని యెన్ని సదుపాయాలు యేర్పఱచినా అన్నితోపలూ అమలు జరుగుతూనే వుంటాయి. రైళ్ళు వచ్చాయి, మోటార్లు వచ్చాయి, వస్త్రేమాత్రం కాలవపడవలమీఁద ప్రయాణాలు ఆగిపోయాయా? యేకొందఱో వాట్లకీ ఆలాయపడుతూనే వున్నారు. యిది లోకస్వభావం. అందఱికన్నా లోకప్రకృతినిగూర్చి కవు లకు యెక్కువ అనుభవం వుంటుంది.

యీమధ్యనే నేను కనిపెట్టిన వకవిషయాన్ని వ్రాసి దీన్ని ముగి స్తాను. ఆమధ్య యీతిబాధలనుగూర్చి వక వ్యాసం ప్రచురించి వున్నాను. ఆయీ పందికొక్కులబాధను హింసలేని పద్ధతిని వారించు కోవడానికి బోను చేయించవలసిం దని మాపిల్లలు నన్ను వేధిస్తూ వచ్చారు. దాని వల్లకూడా అది నివర్తించదు సరికదా, పాపానికి వెఱవక వాట్లని చంపడా నికి అంగీకరిస్తేకూడా ఆపీడవదలనే వదల దని మనస్సా నాకు తెలిసివుం డిన్నీ వాళ్ళ సంతుష్టికోసం వకబోను సంపాదించాను. కొన్నిమాత్రం ఆబోనులో పడ్డాయి. వాట్లను దూరంగా జాగ్రత్తగా వదలిపెట్టించడం జరిగింది. కాని యిల్లు మామోలుగా గుల్లచేసేవి చేస్తూనే వున్నాయి. యీబోనులో తినుబండారం యేలాటిది పెట్టినా ముట్టుకోకూడదనే జ్ఞానం తక్కినవాటికి కలిగిందని నాకు గోచరించింది. అందుచేత యెన్నిసదుపా యాలు మనం యేర్పఱచినా వాట్లవల్ల కొందఱే దుర్వ్యాపారాన్ని వదిలి బాగుపడతారు గాని అందఱూ బాగుపడరు. అశ్వత్థామ నారాయణాస్త్రప్ర యోగం చేసి శత్రుసేన సర్వమూ నశించిం దనుకున్నాఁడు. కాస్త సేప

టికి మళ్ళా మామోలుగానే వున్నట్టు కనపడింది. యే మాత్రిమో నశించక పోనూ లేదు. అలాగే మన మన వుపాయాలు కొంతవఱకు పనిచేస్తూ వుంటాయి. అంతమాత్రానికి భగవచ్ఛాసన మనుకొనే వేదశాస్త్రాలను అతిక్రిమించడం యెందుకని సనాతనులు వుపేక్షిస్తారు. యేకొంచెమేనా లాభం వున్నప్పుడు అతిక్రిమిస్తే వచ్చిన చిక్కేమిటని నేఁటివారు సాహసిస్తూ వున్నారు. వారికీ మీకూ సామానాధికరణ్య మంటూ యెన్నఁటికీ కుదిరేది లేదు. నేను చేసేప్రియత్నమల్లా వారు సంఘబలాన్నిబట్టి చేయించిన రాజశాసనాలకు మీరు శిరస్సు వొగ్గవలసిందే కాని "అన్యథా శరణం నాస్తి" అని తెలపడానికియ్యేవే. యేదేనా మీరు శాస్త్రీయంగా వాదిస్తారనుకోండి, దాన్ని ప్రితిపక్షులు వినరు. పయిగా మీయందు వున్నదాన్నో, లేనిదాన్నో అనాచారాన్ని వుద్ఘాటించి గేలి చేస్తారు. ఈమధ్య ఆలా వకరికి జరిగినట్టు కూడా విన్నాను. మీకు కొన్ని ఆపత్తులు న్యాయమైనవే కనపరుస్తారు. కాని అవి మీప్రితిపక్షులమతంలో దోషాలు కావు; గుణాలే. కనక వారు సంతోషపూర్వకంగా అంగీకరిస్తారు. అప్పుడు వారివాదం "అభ్యుపగమ్యవాదం" గా పరిణమిస్తుంది.

మీకు బోధపడవవి కాదుగాని యీమాటలు సామాన్యులకు బోధపడవనే సంశయంకలిగి వ్యాఖ్యానప్రాయంగా కొన్ని మాటలు వ్రాస్తూ వున్నాను. శారదాబిల్లుగాని, విడాకుల చట్టంగాని వితంతూద్వాహం కాని పురికొల్పేవారి వుద్దేశం యేలాటిదంటే, స్త్రీస్వాతంత్ర్యాన్ని బలపరిచేదిగా కనపడుతుంది. మీరేమో "స్త్రీ స్వాతంత్ర్యం వల్ల యెన్నో యిబ్బందులు వున్నాయి కనక అది పనికిరా" దంటారు. "ఆయిబ్బందులు యిబ్బందులు కావు, పునర్వివాహం చేసుకోవడానికిఁగాని, విడాకులిచ్చుటకుఁగాని పురుషుడికి అధికారం వున్నప్పుడు స్త్రీ కెందు కుండకూడదు"? అని వారంటారు. దీనిదాఁకా యెందుకు? ప్రిస్తుతకాలంలో లేచిపోయిన స్త్రీకి కూడా తగిన ఆలంబన మంటూ దొరికితే సంఘంలో గౌరవం లేకపోలేదు. ఆదీనురాలికి యేగర్భదరిద్రుఁడో తటస్థిస్తే మాత్రం ప్రియోజనం లేదు.

అలాటి సంఘగౌరవానికి తగ్గప్రాపకం సంపాదించిన వక యిల్లాలు ఆ ద్వితీయభర్తతోనూ, అదాపతు సంతానంతోనూ, రంగూన్నుంచి సుమారు సంవత్సరంనాఁడు దేశానికి వచ్చి రక్తసంబంధులచేత పంక్తిభోజనాది సత్కారాలు పొంది యిచ్చిపుచ్చుకొనే మాటలుకూడా జరిగించి వెళ్ళినట్టు విన్నాను. ఆపెను యీవిధంగా సత్కరించిన వారెవరూ సంఘసంస్కర్తలు కారు. రాఁబోయే మార్పులు ఆయాసందర్భాలను పూర్తిగా ఆమోదిస్తాయి. అందుచేత మీరు తాటాకుపుస్తకాలల్లో వుండే శ్లోకాలు యేకరువు పెట్టిన ప్రయోజనంలేదు. భవతు.

తక్కిన విషయాలమాట తరవాత చూచుకుందాం. యిప్పుడు సిద్ధంగా బాధిస్తూవున్నది "శారదాబిల్లు". యిది వచ్చి సుమారు యెనిమిదేళ్ళయింది. యీయెనిమిదేళ్ళల్లోనూ యానాం గ్రామంలో కొందఱిని చాలాభాగం ఐశ్వర్యవంతులని చేసింది. నైజాములోకూడా కొంతవఱకు వివాహాలైతే జరిగాయి గాని అక్కడివారు యానాంవారివలె లాభం పొందారో లేదో తెలియదు. యిప్పటికి యజ్ఞంలో పశువులాగ నవరం థాయిలా బిగించారు. యింకా మనంకళ్ళు తెఱవకపోవడం అనాలోచనకాదా? సుమారు యిరవైయేళ్ళనాఁడు శృంగారగ్రంథనిషేధ మంటూ వచ్చింది. అప్పుడు లేటు శ్రీవెంకటగిరి మహారాజావారు చెన్నపట్నంలో పండితుల నందఱినీ పిలిపించి ఆనిషేధాన్ని అరికట్టడానికి పెద్దసభచేసి బోలెఁడు సొమ్ము వ్యయపఱచారు. వృథాకంఠశోషా, వృథావ్యయమూతప్ప దానివల్ల లేశమూ ప్రయోజనం జరగలేదు. (యీమధ్యజరిగిన సనాతనసభ కూడా దానివలెనే నిష్ప్రయోజనమే అని నేననుకుంటాను.) యిన్నాళ్ళకి మళ్ళా ప్రభుత్వంవారికి దానిని మార్చాలనే వుద్దేశం కలిగింది. తొలగించారు. అలాగే భవిష్యత్కాలంలో యెప్పుడేనా యీశాసనాలు మాఱితే మాఱవలసిందేకాని మన మన ప్రయోజకత్వాలు మాత్రం ప్రస్తుత సందర్భాలకు లేశమూ పనిచేయవని నానమ్మకం. మనకు సంఘబలం లేదు. "జయేన యామ్మఖ్య తరంతరోహి" అందుచేత యీలా వ్రాస్తూవున్నాను.

నాబంధుజాతంలో చాలామందికి నేను సలహాయిస్తున్నాను "యీ బిళ్లను అతిక్రమించవద్దు. ముప్పుమూఁడి తీరుతుం" దనే యిస్తూవున్నాను. మీరు కూడా మీమీ ఆప్తులకు యీలాగే సలహా యివ్వవలసిందని ప్రార్థిస్తాను. "తాఁజెడ్డకోఁతి వనమల్లాచెఱిచిం"దని నన్ను గేలి చేస్తారా? చేస్తే నాకు విచారంలేదు. తల వొగ్గుతాను. యేదేనా ఘంటాపథం వుంటేచూపించండి. "సందులు దూరడం" వంటిదైతే ప్రయోజనంలేదు. ఆ "సందులు దూరడం" వల్ల యెవరికో ఆపత్తు తప్పిపోయిందన్నా అది అనుసరణీయం కాదు. మీకు తెలియని ధర్మాలు లేవు. మీకు బోధించతగ్గవాణ్ణికాను. లోపా లోపాలు మన్నించండి. మీమీ బంధుజాతాన్ని కాపాడండి. యింతకన్న యేం వ్రాసేది? "సర్వేజనాస్సుఖినో భవంతు."

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాంన్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు ......... ..జగన్నాథాయ మంగళమ్"

---

# నిజమైన శ్రేయస్సంటే ఏది?

( 24—7—1940 సం॥ర ఆంధ్రవీక్లీనుండి )

నిజమైన శ్రేయస్సు అంటే యేది? అనే సందర్భాన్ని గూర్చే మన పూర్వులు యెంతసేపూ చర్చిస్తూ వచ్చారు. వారికి దాన్నిగూర్చి యెంతచర్చించినా కేవలం ఐహికానందాన్ని మాత్రమే సంపాదించే వేవైతే వున్నాయోస్రక్చందనాదిభోగాలు, అవి నిజమైన శ్రేయస్సాధనాలుగా తోఁచాయే కావు. కాని యెన్నివిధాల "తోపిరా" జందామని ప్రయత్నిం చినా అందులో స్త్రీపురుష సంబంధం తోసిరా జనడానికైతే వీలులేనిదిగా కనపడిందిగాని కనపడితే కనపడనివ్వండి గాని దాన్నికూడా యెన్నోకట్టుఁ బాట్లతో వదిలపఱిచి యిహానికే కాకుండా పరానిక్కూడా సాధనోపాయంగా చేసి అప్పటికీ అవకాశమున్నంతలో యేకొందతో వదులుకోవాలంటే

పడుటకోవడానికి తగ్గ ఆశ్రమాన్ని బ్రహ్మచర్య మనే పేరుతో కల్పించి యేర్పాటిచారు. యీ ఆశ్రమంలో యెందఱోవుండి కృతార్థులైనవారు కన పడతారు. కాని యీ ఆశ్రమంలో పూర్వాచార పరాయణులలో యెక్కువ మంది స్త్రీలే వున్నట్టు కనపడుతుంది గాని పురుషులు వున్నట్టు కనపడదు. దానిక్కారణం పురుషులకు యెన్ని వివాహాలేనా చేసుకోవడానికి అభ్యనుజ్ఞ శాస్త్రసమ్మత మైనది వకటి వుండడమున్నూ, స్త్రీలకు అట్టి ఆధారం లేక పోవడమున్నూ అని కనపడుతుంది. యిప్పుడు అనేకులు బుద్ధిమంతులు "వుంటే ఆ సమ్మతి వుభయులకూ వుండాలి, లేకపోతే వుభయులకూ లేక పోవాలి గాని వకరికి వుండడ మేమిటి? వకరికి లేకపోవడ మేమిటి?" అని ప్రశ్నిస్తూన్నారు. వారిప్రశ్నకు వుపోద్బలకంగా యూరోపియనులలో విశేషంగానున్నూ మహమ్మదీయులలో విరళంగామన్నూ పురుషులతో పాటు స్త్రీలకు కూడా అలాటి అవకాశం విశేషంగా వుండడం వకటి కన పడుతూ వుంది. మహమ్మదీయుల పరిపాలనా కాలంలో యెందుచేతనో యీప్రశ్న మన భారతీయులలో బయలు దేఱలేదు గాని బ్రిటిషు ప్రభు త్వంలో యిది బయలుదేఱి చాలా ఆందోళన కలిగిస్తూ వుంది. శాస్త్రీయ మైనా కాకపోయినా పూర్వకాలంలో స్త్రీలుకూడా భర్తృమరణానంతరం కన్న సంతానం కొంతవుండే దన్నట్టు మన్వాదిస్మృతులలో జాతాశౌచ మృతా శౌచాది నిర్ణయాలు చెపుతూ వున్నాయి. ఆజాతాశౌచ మృతాశౌచాది నిర్ణయం అనాదిగా నిమ్నజాతులలో వున్న (మాఱుమనువు) అనేపేరు గల వివాహంవల్ల పుట్టినవాళ్ళకు సంబంధించిందేమో? అగ్రవర్ణస్థుల కది అన్వయించదేమో అని చెపితే చెప్పవచ్చునుగాని అదికేవలమూ యుక్తిమాత్రంగా కనపడేదే గాని నిలిచేది కాదు. యెందుచేతనంటే? ఆ నిమ్నజాతులకు అసలు సరియైనవాళ్ళకే ఆపట్టుదల వుండీ వుండనట్టు వుండే సందర్భంలో యీలాటి సంతానానికి వేఱుగా అంటూ చెప్పడం తటస్థించదని చెప్పనక్కఱ లేదు. వున్నదేదో ఆలాటివాళ్ళకీ యీలాటి వాళ్ళకీ వొకటే మాదిరిదే వుంటుంది. ఆకారణంచేతే ఆ నిమ్నజాతుల్లో

ఆలాటి సంతానం బాపతువాళ్ళనీ యీలాటి సంతానం బాపతువాళ్ళనీ యేర్పాటు వున్నట్టు లేదు. అంతా కలగా పులగంగానే యీవన్నీ వ్యాపారాలూ జరుగుతూ వున్నాయి. అందుచేత యీ కర్మం అగ్రిపక్షాలల్లోనే ప్రాచిత్యంగా వుండేదనిన్నీ ఆబాపతు సంతానం హవ్యకవ్యాదులకు అనర్హంగా వుండవలసివచ్చే దనిన్నీ కేటాయింపుగానే వుండేదనిన్నీ అనుకోవాలి. పూర్వం అన్నిటికన్నా పెద్దమర్యాద హవ్యకవ్యాలకు అర్హత వుండడమే. అందుచేతే ధర్మశాస్త్రాలల్లో "హవ్యకవ్యేషు గర్హితః" అని తఱచు వ్రాస్తూవుంటారు. అందుకు అర్హతంటూ లేనిపక్షంలో ఆప్రాణికి యెంత ఐశ్వర్యం వుండినా యెంత విద్య వుండినా లేశమున్నూ సభ్యత లేనేలేదు. రాజులు వుద్యోగా లివ్వవలసి వచ్చినా ఆలోపాన్నే పెద్దచేసి బహిష్కరించేవారు. కులీనులు పిల్లనివ్వవలసి వచ్చినా అదే కర్మం అడ్డుతగిలేది. దానిపేరే తెలుఁగులో "వెలి" అనేది. దాన్నే మతగురువుల ద్వారా కూడా శాంక్షన్ కాఁబడ్డదాన్నైతే "ఆంక్ష" అంటారు. మతగురువులకు పూర్ణమైన అధికారం యీవిషయాలలో పూర్తిగా నిన్న మొన్నటివఱకున్నూ వుండేది. యిప్పుడున్నూ ఆ అధికారం చెక్కుచెదరకుండా నిలిచే వుందిగాని ప్రజలు తెలుఁగుమీఱి యెదిరిస్తూ వున్నారు. వెనక చాలాకాలం నాఁడు తనకులేని అధికారాన్ని గలిగించుకొని యజ్ఞమో యాగమో చేశాఁడని స్వాములవారు వక గౌరవ వ్యక్తికి మతరీత్యా ఆంక్షను పూర్వాచార ప్రకారంగా జారీచేసేటప్పటికి ఆమహావ్యక్తి "లీగల్"గా మతగురువు మీఁద బ్రిటిషుకోర్టులో అభియోగం తెచ్చినట్టున్నూ, దానిమీఁద తీర్పు కర్త స్వామివారికున్న అధికారాన్నంగీకరిస్తూకూడా ఆజారీచేయడం కార్డు మీఁద జరగడంలో మామూలు అమర్యాదకంటే మఱికొంత అగౌరవంగా వుందికనక అది బ్రిటిషురాజ్య తంత్రరీత్యా దోషమనిచెప్పి పదిరూపాయీలు కాఁబోలును జరిమానా విధించినట్టు చెప్పుకోఁగా విన్నాను. పూర్వ రాజుల కాలంలో మతగురువుల శాసనం యెప్పుడూ యీలాటి అవమానాన్ని పొందినట్టు లేదు. అది మొదలు మెల్లిమెల్లిగా మతగురువులంటే

ప్రపంచానికి భయం తగ్గడానికి ఆరంభించింది. ఇంఁడాంతరాలలో మనకంటె యీ మతగురుత్వం కొంత వాఁడి కలిగి వుందని వినికి. వెలిఅంటే పూర్వ కాలంలో వున్నంత కాదుగదా! యేమాత్రం విలువా వుండకుండా పోయింది. మనదేశంలోనే యీపోవడం. అగ్రజాతులవారికి మాత్రమే- పీఠాధిపతులంటూ యేర్పడి వారిశాసనాన్ని శిరసావహించేవార మనుకొనే వారికే. యింక కులపెద్దఅంటూ వకణ్ణి యేర్పరుచుకొని అతని ఆజ్ఞకు కట్టుఁ బడి వర్తించే నిమ్నజాతుల్లో చెక్కుచెదరకుండా ఆ కులపెద్ద శాసనం అమలు జరుగుతూనే వుంది. వెలి అంటే యేలాటిదో? యిప్పటివారికి తెలియనే తెలియదన్నా తప్పులేదు.

నాచిన్నతనం నాటికి దేశమింకా యింత బరితెగించలేదు కనక దాని"ఫోర్సు"ను గూర్చి నేను కొంత యెరుఁగుదును. యింకా ప్రాచీన కాలంలో వెలిని గూర్చి పురాణాల్లో చదివితే తెలుస్తుంది. అశ్వనీదేవ తలకి దేవతల్లో వెలి వుండేది. యెందుచేత? వారు వైద్యంచేసేవారనే కారణంచేత. వైద్యం చేయడం అంటా? బొంకా? తాగడమా? జూదమాడడమా? అనిప్రశ్నిస్తారేమో? అలాప్రశ్నించకండి. వైద్యం సర్వజనోప యోగమైన మహాకార్యమే అయినా యేవో కొన్ని మతరీత్యా అనుచితంగావుండే వ్యాపారాలు దానిలో నాంతరీయకతయా వున్నాయని చెప్పి ఆకాలంలో ఆవైద్యవృత్తిని దేవతలందఱూ హేయంగా చూస్తూ వచ్చారనుకోవాలి. ఆకారణంచేత వారికి వెలి, అన్నారు. దానికి అర్థం "హవ్యకవ్యాల" లోకి రానీయక పోవడమే. ఆలాగే చిరకాలం జరిగాక చ్యవనుఁడికి వారు వైద్యంచేసి తద్వారాగా ఆవెలినుంచి వారు విముక్తులై నట్టు పురాణాల్లో వుంది. కావలసినవారు చదువుకోండి.

యిటీవల యీవెలిబాధను అనుభవించినవాఁడు సుప్రసిద్ధులలో వేములవాడ భీమకవి వకఁడు వున్నట్టు అతని చరిత్రవల్ల కనపడుతుంది. ఆతఁడికి తల్లిమాత్రమే వుందిగాని తండ్రిలేఁడు. అతని తల్లి నిష్కళంక

బ్రహ్మచారిణిగానే వున్న పుత్రోత్పత్తిని బట్టి ఆపెచరిత్రికు సామాన్యలో కలు సందేహపడి వెలివేశారు. తరవాత మనభీమకవి తాను సాక్షాత్తుగా దాక్షారామ భీమేశ్వరుని కొడుకునని ఋజువుచేసి ఆవెలినుండి విము క్తుండైనట్టు యితిహాసంవల్ల తెలుస్తూవుంది. దానికి వుపోద్బలకంగా భీమ కవిగారి "ఘనుడన్ వేములవాడ వంశజుండ దాక్షారామ భీమేశనంద నుండన్" అనే పద్యం కనపడుతూ వుంది.

సరే, ఆయాకథలు నమ్మతగ్గవా కావా అనే విచారం మనకిక్కడ ప్రస్తుతం కాదు. వెలి అనేదానికి మనుష్యులలోనేగాక దేవతల్లోగూడా యేలాటి స్థానంవుండేదో తెలుసుకోవడమే. అయితే కొందఱు దీన్ని మిషగా పెట్టుకొని యోగ్యులకు అపవాదలు కల్పించి చేసిన అపకారాలు వున్నట్టు విన లేదుగాని అయోగ్యుల విషయంలోనే గోఅంతలు కొండం తలుగా పొలిపి పీఠస్థులకు వ్రాసి ఆంక్షలు తెప్పించడమున్నూ వుండేది. ఆలాటిమోసాన్ని అవలంబించి రాజకీయాధికారులను కూడా కళ్ళుకప్పి దుర్మార్గుల సంఘాలు నిషధయోగ్యులనుసహా దండింపజేయడం యెప్పుడూ వుంటూనేవుంది. క్రియమాట పీఠస్థులభయం అగ్రవర్ణాలవారికి పూర్తిగా నశించిందని తేలింది. అందుచేత అందఱూ కాకపోయినా కొందఱు చిన్న వర్ణాలవారి ఆచారాలను అవలంబించి సుఖిద్దామనే అదుర్దాలో వున్నారు. యెప్పుడూ లోకానికి జంకి కొంతహద్దులోవుండే వ్యక్తులే విస్తారంగా వుంటారు కాని, పరలోకానికి జంకి కట్టుంబాట్లలో వుండే వ్యక్తులు చాలా తక్కువగానే వుంటారు. వారు దేశమంతా తల్లక్రిందులయినా సరే వారి వారి సదాచారాలను జరిగినంతలో జరుపుకుంటూనే వుంటారు. శైవులలో తమకు గురుముఖతః సంప్రాప్తమైన లింగం దొంగలుకొట్టి అపహరించిన సమయంలోకూడా మళ్ళా ఆలింగంసంప్రాప్త మయ్యేవఱకూ పచ్చిమంచి నీళ్ళుకూడా ముట్టక తుదకు ప్రాణత్యాగం చేసినవారు చిన్న మొన్నటి వఱకున్నూ వుండేవారు. యేదో లింగం తెచ్చియిచ్చి వారిని అవుద్యమా న్నుంచి మళ్ళిద్దామని ప్రయత్నించి కూడా విఫలులయినట్టు శతశః

సహస్రశః వినడం. యేవరిలింగం వారికి ఆనవాలుగా వుంటుందట! కొందఱికి ఆదీక్షాకాలంలో యేదోవిధంగా అసలులింగమే సంప్రాప్తమయి జీవించడమున్నూ తటస్థించినట్టున్నూ వినికివుంది. యీలాటి అసిధారా వ్రతస్థులు వారంతటవారు నియమపరివర్తనను కాపాడుకొనే వారేగాని యితరుల భయంవల్ల కాపాడుకొనే వారిలోనే చేర్చతగ్గవారు కారు.

ఆలాగే స్త్రీలలో పతివ్రతలున్నూ, పురుషులలో యేకపత్నీవ్రతస్థులున్నూ, సత్యసంధులున్నూ పలువురు వుంటారు. గవర్నమెంటు భయానికి జంకి దొంగతనం మానేవాళ్ళుంటూ వుండనే వుండరుగదా? దొంగతనం చేసేవాళ్ళు ఆశిక్షకు సిద్ధపడే చేస్తూవుంటారు. తక్కిన యోగ్యులందఱున్నూ వారిశీలాన్ని బట్టే సత్ప్రవర్తనలో వుండేవారే. యిప్పుడల్లా వచ్చిన చిక్కేమిటంటే? యితర ఖండాలలో స్త్రీలకు పునర్వివాహం వుండడమున్నూ, ఆవివాహం భర్తగతిస్తే సరేసరి. భర్తజీవించివున్నా వాఁడికీ పెండ్లానికీ యేకారణంచేత సరిపోకపోయినా సరే? మరొకణ్ణి కట్టుకోవడందాఁకా కూడా అధికారం కొలఁదిగా వుండడమున్నూ ఆలా వివాహితలైన స్త్రీలకు సంఘంలో యేవిధమైన అగౌరవమున్నూ లేకపోవడము చూచి యిహలోకానందమే ముఖ్యంగా ఆలోచించుకొనే కొందఱు పురుషులున్నూ, క్వాచిత్కంగా స్త్రీలున్నూ ఆ ఆచారానికి చాలా ప్రీతి పడుతూ వున్నారు. పురుషులకు భార్యవుండఁగానే మఱొక భార్యను పెండ్లాడడాని కధికారం వున్నప్పుడు స్త్రీకి మాత్రం ఆలాటి అధికారం లేకపోవడ మేమీ అనేది ఆపాతరమణీయంగా కనపడుతుంది. దీనిమీఁద "పురుష ప్రకృతి వేఱు, స్త్రీ ప్రకృతి వేఱు స్త్రీలే పిల్లలను ప్రసవించడమేమి? పురుషులు ప్రసవించకపోవడ మేమి?" అంటూ మాట్లాడడానికెవరేనా మొదలుపెడితే ఆది కుతర్కంగా తోసివేస్తారు. పైఁగా భగవదుద్దేశం అట్టిది కాదనిన్నీ, పురుషుఁడు గర్భధారణానికి తగ్గవాఁడు కాఁడనిన్నీ, కూడా జవాబు చెబుతారు. భగవదుద్దేశము వకపురుషునికి బహుభార్యలు వుండడానికే గాని వకస్త్రీకి బహుభర్త లుండడానికి సమ్మతించ

నట్టు వేదంలో ఆలాటి శ్రుతివుంది. భారతంలో ఆ శ్రుతిననుసరించిన స్మృతివుంది. అనిచెపితే అవన్నీ పురుషకృతాలే, స్త్రీలు రచించినట్టయితే దానికి తల్లక్రిందుగానే వుండేవేమో అనేవాదం వస్తుంది.

పోనీ లోకానుభవాన్ని పట్టి చూచుకొందాం. బహుభార్యాత్వం రసాభాసుగా కనపడదనిన్నీ, యేకకాలంలోఁగాని, భిన్నకాలంలోఁగాని బహుభర్తృకత్వం రసాభాసుగా వుంటుందనిన్నీ, యీవిషయం కావ్యనాటకాదుల వల్లనేగాక అనుభవంవల్ల గూడా కనపడు తుందనిన్నీ యెవరేనా అంటే, యీపైని "కవులు కొన్ని దీనికిన్నీ అనుకూలంగా వ్రాస్తే యిదిన్నీ రసాభాసుగా వుండకపోవచ్చు" నంటూ వాదంవస్తుంది. "తల్లీ! వెలినేల నన్నుగంటివి? కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో" అనే మాదిరిగా "రెండోరకం దంపతులకు జన్మించిన సంతానానికి తలవంపులుగా జీవించవలసి వస్తుం" దంటే "అది క్వాచిత్కంగా వుంటేనే ఆలాటి తలవంపుల క్కారణ మవుతుంది గాని సార్వత్రిక మయితే ఆలాటి అవకాశం వుండ" దంటూ పకవాదం. యీవాదాలకు అంతూ పొంతూ అంటూ వున్నట్టు కనపడదు.

అందుచేత శ్రుతివిరుద్ధమైన తర్కాన్ని ప్రమాణంగా పట్టేది లేదన్నారు ప్రామాణికులు. మన్వాదులు స్త్రీకి యేర్పరిచిన కట్టుబాట్లల్లో యేవీ న్యాయమైనవి కావనిన్నీ, అథవా న్యాయమైనవే అయినా యీకాలానికి అవి అనుకూలించవనిన్నీ పకవాదం. అయితే యేకాలమైనా యిహపరాలు చెడకుండా వర్తిద్దామనే వుద్దేశం కలవారికి ఆచారాలు మార్చుకోవలసిందని తోఁచదు. సంసారమతం వేదాంతులమతంలో చాలా దూరమైన అర్థాన్ని యిచ్చినా సామాన్యంగా భార్యాభర్తలూ, పిల్లాజెల్లా, గొడ్డూగోదానికి చేరిన కూటానికి వర్తిస్తుంది. అట్టి సంసారాన్ని నడపడానికి ద్రవ్య సంపాదకుఁడు పురుషుఁడనిన్నీ, వీధిలోన్నుంచి తెచ్చిన పదార్థాన్ని జాగ్రత్తపెట్టి పిల్లలకూ, భర్తకూ ఆహారాదులు అమర్చిపెట్టేది స్త్రీ అనిన్నీ పకమార్గంగా పూర్వులు అభిప్రాయపడి తదనుగుణంగా భర్త

అనే పేరున్నూ, భార్య అనేపేరున్నూ అనుగతార్థంగా వాడుతూ వచ్చారు. వకవేళ స్త్రీ స్వయంగా సంపాదించిన ద్రవ్యంతో కాకపోయినా పుట్టింటి నుంచి వారసత్వరీత్యాగాని లేక వారు ప్రేమపూర్వకంగా యిచ్చిన ద్రవ్య రీత్యా గాని స్త్రీద్రవ్యంతో పురుషుఁడు కుటుంబ భరణాన్ని నిర్వర్తించుకో వలసివస్తే ఆపురుషుని జీవనాన్ని అధమాధమంగా పరిగణించారు. "స్త్రీవిత్త మధమాధమమ్" అనేది యీ భావాన్నే బోధిస్తుంది.

యిప్పుడు స్త్రీలుకూడా తమపోషణకు పురుషులమీఁద ఆధారపడి వుంటడానికి సంస్కర్తలు పలువురు వొప్పరు. యుక్తమవనివ్వండి కాకపో నివ్వండి, గాని స్త్రీ తనకన్న యెంత వ్యక్తికలదైనాసరే పురుషుఁడు ఆమె మీఁద పూర్ణంగా అధికారాన్ని చలాయిస్తున్నాఁడు.

దీన్ని అయుక్త సందర్భాలలో సహించడం పాతివ్రత్యానికి భంగం కలుగుతుందనే భయంచేతతప్ప అన్యథాగా అయితే తటస్థించదు. యెవ్వఁడో కొంత తప్ప వ్యక్తిగల భార్య చెప్పే సలహాని వినకపోవడమున్ను లేదు. కొందఱు ఆలాటి దంపతులలో సర్వాధికారాలు భార్యకే వప్పజెప్పేవా రున్నూ వున్నారు. (నారీ రజ్జుః పశుః పురుషః) త్రాగుఁబోతులూ, జూద గాళ్ళూ, రిజాలావాళ్ళూ స్వయంనిర్ణయసూత్రాన్ని పట్టిపోయేవాళ్ళు లేక పోరు. వాళ్ళని పట్టి సంఘం సర్వమూ ఆలాటిదే అనుకోవడం తప్పు. మర్యాదగల ప్రతిగృహంలోనూ సంసారమనే రాజ్యానికి "పురుషుఁడు రాజూ, భార్య మంత్రీ" అన్నట్టుగానే కనపడుతుంది. "శ్లో. కార్యేషు దాసీ కరణేషు మంత్రి" అనేది యీభావాన్నే వ్యక్తీకరిస్తుంది. మర్యాదకు లోఁగని కుటుంబాలకు యెన్ని సదుపాయాలు కల్పించినా ప్రయోజనం లేదు. వాత్స్యాయనంలో వక ప్రకరణంలో గృహాధికారం యావత్తున్నూ స్త్రీదిగానే నిర్దేశించారు. వ్యావసాయకుల స్త్రీలు విత్తనాలు భద్రపఱచడం దగ్గిఱనుంచీ చేయవలసి వుంటుందని కూడా ఆవాత్స్యాయనంలో చదివినట్టు జ్ఞాపకం. గుంటూరు ప్రాంతంలో విత్తనాలు చల్లేవఱకే పురుషుని వ్యాపారం గాని తక్కినయావత్తు వ్యావసాయక కృత్యాలున్నూ యింటికి ఫలితం చేరే

పటకూ పూచీ స్త్రీమీఁదే వుంటుంది. మావైపున యింత భారం స్త్రీమీఁద వ్యావసాయకులు పెడుతూ వున్నట్టు లేదుగాని యింటికి వచ్చేదాఁకానే పురుషుఁడికి అధికారంగాని యింటికివచ్చిన తరవాతమాత్రం ఆఫలితం మీఁద అధికారం అంతా స్త్రీదిగానే వుండడం అంటూ యెఱుఁగిందే. యీవిషయం విశేషించి కమ్మటూళ్ళల్లో యిప్పటికీ అమల్లోనే వుంది. బ్రాహ్మణ వ్యవసాయాల్లో ఆ యీ విషయాలు అంతగా గమనించ వలసి వుండదు.

చెప్పేదేమిటంటే ? యిప్పటివారు స్త్రీ కేవిధమైన అధికారాన్నీ యివ్వక పిల్లలను కనడానికి మాత్రమే యేర్పఱిచినట్టు వ్రాసేవ్రాఁతలు యెంతవఱకు సత్యమో ? తెలుసుకోవడానికే. వీధిలో పురుషుఁడికెంత అధికారమో యింట్లో స్త్రీకిన్నీ అంతే అని కాని అంతకన్న హెచ్చనిగాని చెప్పక తప్పదు.

నేను వ్రాసింది బాహుళ్యంగా కనపడేది. క్వాచిత్కంగా వుండేవి లెక్కలోకి రావు. కొందఱు భర్తలు భార్యలను నమ్మక బియ్యం దగ్గఱ నుంచీ కొల్చియిచ్చే వాళ్ళున్నూ వుంటారు. కొందఱు భార్యలు వుప్పూ పప్పూ బియ్యమూ లోపాయికారీగా అయినకాడికి అమ్మి వుట్టింటికి చేర్చ డంగాని, స్వయంగానే మూటకట్టుకోవడం గాని చేసి యిల్లు గుల్లచేసే వాళ్ళున్నూ వుంటారు. అందఱూ మంచిగానే కాని చెడ్డగానేకాని వుంటా రని కాని, వుండేలాగ చేదామని కాని అనుకోవడంలో తప్పయితే లేదు కాని అపని అసాధ్యం. అందుచేత మన ఆర్యులు స్త్రీలకు చేసిన అన్యాయం కనపడదు. యీవిషయం యిదివఱలో చాలామంది వ్రాసే వున్నారు యిప్పుడు నేను మళ్ళావ్రాయడం పునరుక్తి ప్రాయమే.

యిప్పుడు క్రొత్తగా మనవారు స్త్రీలకు సంపాదించా లనుకొనే నూతనహక్కులను గూర్చి పురుషులమాటలా వుండగా యేవకరో తప్ప ఆస్త్రీలే సర్వసాధారణంగా యేవగించు కొంటారు. పురుషులతోపాటు

సినీమాలలో పాత్రలుగా వున్న స్త్రీలు వున్నారనిన్నీ వారికి యేంలోపం వచ్చిందనిన్నీ అడిగే సంస్కర్తలు పలువురున్నారు. పూర్వంలాగ యిప్పుడు అగ్నిపరీక్షలు వగయిరాల్లేవు. అగ్నిపరీక్ష వున్నకాలంలో ఆలాటి పరీక్షకూడా యిచ్చిన పరమపతివ్రతా శిరోమణినే మనరాముఁడు లోకారాధనార్థం దుర్భరగర్భవతిగా వున్నసమయంలో పరిత్యజించినట్టు కనపడుతుంది. ఆలాటి పరమోత్కృష్టుల చరిత్రలకు అలవాటుపడ్డ భారతీయులు సుఖ సుఖాల విడాకుల చట్టాలు వగయిరా రసాభాసాలకు ఆలాయ పడఁగలరా? రసాభాసమాట ఆలావుంచుదాం, నిజమైన శ్రేయస్సుకు యీచట్టం యేమి సాయ పడుతుంది? వొకవిధమైన దుర్నీతిని తొలఁగిస్తుం దనుకొంటే, యింకో విధమైన దుర్నీతిని పుట్టిస్తుందాయె. "యిది ముల్లువచ్చి కొట్టుడఁచిన చందం" కాక యేమవుతుంది? ఆచట్టం వచ్చినా యేచట్టం వచ్చినా "అంబ ఉేరొచ్చింది అత్తా అంటే, కొలబుట్ట నాచేతులోనేవుంది కోడలా?" అందన్నట్టు కాపట్యం లేని ప్రవర్తన వున్నప్పుడుగాని యేవీ దేవుఁడికి జవాబుచెప్పే స్థితిలో వుండవు. కొట్టి బాధించడమో యేదో ఆలాటిదే భరింపరాని చిక్కోవుండి భర్తనువదలి పెడితే అది కపటంలేని కృత్యమే కనక చట్టాన్ని దుర్వినియోగం చేసినట్టు కాదే అనుకుందాం. యింకా కొన్ని వాంఛలు కారణాలుగా కలిగి భర్తను వదిలిపెట్టి అన్యభర్తను స్వీకరిస్తేనో? అప్పుడు చట్టం దుర్వినియోగ పఱిచినట్టే కదా? యీచట్టాన్ని ఆమోదించే సోదరీమణులను అభినందించడానికి యెన్నివిధాల యత్నించినా మనస్సు వప్పుకోవడం లేదు.

నిజంగా యీచట్టం వచ్చినా భారతదేశ నారీమణులు యేకొలఁది మందో తప్ప దీనివల్ల కలిగే ఫలితాన్ని పొందనే లేరు. ఆ రకం స్త్రీలలో నూటికి యాభైమంది యిదివఱలో కూడా స్వయంనిర్ణయసూత్రప్రకారం ధన్యత్వాన్ని సంపాదిస్తూనే వున్నారు. అయీ కొత్తతోవలన్నీ ద్రవ్యాన్ని బట్టి వస్తూవున్నవేమో అనుకొందామా? యింతకు మించినవాళ్ళు బంగా రపు పాత్రలలో తాము భుజించడమే కాకుండా యితరులకుకూడా భోజనం

పెట్టినవారు మహాసంపన్నులు వుండేవాళ్ళు కాని యీవిశేషాలు అప్పుడు వుత్పన్నం కానేలేదు. అప్పుడు ఉత్పన్నం కాకపోవడానికిన్నీ యిప్పుడు వుత్పన్నం కావడానికిన్నీ కారణం యితర ఖండాలవారి సానుభూతి అని మాత్రమే తోస్తూవుంది. ఆసానుభూతి అగ్నిహోత్రంకూడా కడిగే మహాసదాచార సంపన్నుల పిల్లలకి శారదాబిల్లుకు లోబడి కూడా వివాహం చేయక యింకా కాలపరిమాణాన్ని పొడిగించి అట్టేపెట్టే స్థితిలోకి తెస్తూవుంది. పూర్వకాలపు సంపన్నత్వం కన్న యిప్పటికాలపు సంపన్నత్వం నానావిధాలా బాధకంగా కనపడుతూ వుంది. యిప్పటిది యెక్కడో తప్ప యిహపరాలు రెంటినీభంగిస్తూ వున్నట్టే కన్పడుతుంది. వెనకటిది వుభయలోకాలకూ అవిరోధంగానే నడిచేది. అయి యీ కొత్తతోవలు తొక్కేవారు పయికైతే అనరు గాని వారికి పరలోకం అంటూ వకటి వుందనే నమ్మిక లేనట్టే కనబడుతుంది. నిజమైన శ్రేయస్సంటే, యీనాలుగు రోజులూ స్వేచ్ఛగా అనుభవించడమే అనుకుంటే యేమీ చిక్కులేదు గాని ఆనమ్మకం మనభారతీయులకేకాదు యితర ఖండవాసులకున్నూ పూర్తిగా లేదు. యీసంధి సమయం పూర్వాచారాలవారిని పూర్తిగా పరీక్షించి చూస్తూవుంది. "కఱవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకోపం" అన్నట్టువుంది. అందుకే సనాతనాచార పరులు "కిమన్నాస్తి" గా వూరుకొన్నారు. వూరుకోక యేమేనా వ్రాస్తే ఆవ్రాత కొత్తవారికి విరోధించేదిగా వుంటుంది. దానితో ఆవ్రాత రద్దుకావాలంటూ ఆందోళన ప్రారంభమవుతుంది. సాధారణ ఆందోళనతో పనిజరక్క పోతే యెవరో వుపవాసాలు మొదలెడతారు. గాంధిగారు యీవుపాయాన్ని యెంతో సదుద్దేశంతో కల్పించి వున్నప్పటికీ అది క్రమంగా దుర్వినియోగ పఱుస్తూ వున్నారు కొందఱు. యీపద్ధతి చూస్తే నారోజుల్లోనే జరిగిన వక యితిహాసం జ్ఞాపకం వస్తూవుంది.

వక బ్రాహ్మడికి యేలా పట్టుపడిందోగాని ప్రాణయామం పట్టుబడింది. ఆప్రాణాయామం పట్టి ఆయన వెల్లకిత్తులా పడుకుంటే శవానికిన్నీ ఆయనకిన్నీ భేదమే వుండేది కాదు. ఆశక్తిని ఆయన పరానికి వుప

కరించే జపతపాలకు లేశమున్నూ వినియోగించక బండతనంగా సంపాదించడానికి వుపయోగించేవాఁడు. యేంచేసేవాఁడంటే? కోమట్లయింట్లో వివాహమైతే అక్కడికి వెళ్ళి "నా సంభావనయి" మ్మని అడిగేవాఁడు. ఆ సంభావన అణా బేడా కాదు. నాలుగురూపాయీ లివ్వాలి. యిస్తేనే పుచ్చుకొంటాఁడు. లేకపోతే పుచ్చుకోఁడు. పుచ్చుకోక చక్కాపోతే చిక్కులేదు, గుమ్మానికి అడ్డంగా ప్రాణాయామంపట్టి పడుక్కుంటాఁడు. ఆయనికి నలుగురు కాఁబోలును కొడుకులు, వాళ్ళు వెనకాల హాంగుదార్లుగా వుండేవారు. వాళ్ళ ఆయింటి యజమాని తమతండ్రిని కొట్టడంవల్ల ముసలివాఁ డవడంచేత ఆలాపడిపోయి నట్టున్నూ, ప్రాణంపోయినట్టున్నూ అల్లరిచేయడానికి ప్రారంభించే టప్పటికి ఆగృహస్థు "పెళ్ళియింట్లో యిదేం కర్మం మన" కని తెచ్చి నాలుగురూపాయలూ బొడ్డుమీఁద పెట్టేటప్పటికి లేచి కూర్చునే వాఁడు. యీలోఁగా డాక్టరువచ్చి యెంతపరీక్షించినా అష్టస్థానాలూ కూడా చలనంలేకుండానే వుండేవని అందఱూ యేకవాక్యతగా చెప్పుకొనేవారు. అది హఠయోగంలో చేరుతుంది. దాన్ని సక్రమంగా వినియోగిస్తే క్రమక్రమంగా ఆత్మసాక్షాత్కారానికి ఉపకరిస్తుందని యోగశాస్త్రజ్ఞులు చెపుతారు. ఆయన దాన్ని నాలుగురూపాయీలు సాక్షాత్కరించడానికి వినియోగించడమే కాని అన్యథా లేశమున్నూ వినియోగించినట్టు లేదు. ప్రాణాయామం పట్టివున్నప్పుడు ఆయన్ని నేను చూడలేదు గాని వట్టిగా మామూలు మనిషిగా వున్నప్పుడు చాలాసార్లు చూచాను.

ప్రస్తుతం కొందఱు చేస్తూవున్న వుపవాసాలున్నూ అదే ధోరణిలోకి వస్తూవున్నాయి. వేదాలనీ, శాస్త్రాలనీ కూడా యీవుపవాసాలే మార్చడానికి పనిచేసే టట్టు తోస్తూవుంది. నానాఁటికి యివి "వేలంవెఱ్ఱి" గా అన్నిటికీ పనికివస్తూన్నాయి. "మనయిష్టం వచ్చినట్టు మనం వర్తించడానికి వేదాలూ శాస్త్రాలూ వచ్చి అడ్డుతగులుతాయా? వాళ్లకర్మం వాళ్లదీ. మన కర్మం మనదీ" అనుకుంటే యింతకంటే బాగుంటుందేమో?

మనం యేలా ప్రవర్తించినా ఆవేదశాస్త్రాలు అడ్డు తగులవు. యేవో పిచ్చాపాటీగా "అల్లా సంచరిస్తే నరకంవస్తుం" దనీ, "యిల్లా సంచరిస్తే స్వర్గం వస్తుం" దనీ మాత్రం చెపుతాయి. "నరకే సతికో దోషో - మరణే సతి కిం భయమ్?" అనేవాళ్ళకు అవి లేశమున్నా అడ్డు తగలవు. అందుచేత వుత్పథచారులు వాట్లని రద్దుచేయించడాని కంటూ చేసేప్రయత్నాలకు ఫలితం గోచరించదు. యెక్కడో పదిమంది చేరడం, వొక తీర్మానమంటూ పెట్టడం. వేదంలోనో, ధర్మశాస్త్రంలోనో వున్న దేనినో "రద్దుచేయడమైనది" అని తీర్మానం ప్యాసుచేశారనే అనుకుందాం. అంతలో అది రద్దయి పోతుందా? మనం కొందఱం నిజమైన శ్రేయస్సంటే యేలాటిదో విచారించక "కల్పనా రచనలకు" దాసులమై వర్తించినా యెవళ్ళో చాదస్తులు కొందఱింకా వున్నారుగా. వారికోసం అవి వుంటాయనుకోవడం యుక్తంకాదా? వొకవేళ మనకే కొన్నాళ్ళకు బుద్ధి తిరిగి "మనమిప్పుడు అనుభవించేది నిజమైన శ్రేయస్సు కాదు" అని తోఁచి దానికోసం ప్రయత్నించవలసి వస్తే, పూర్తిగా మూలచ్ఛేదమై, భస్మీపటలమైన ఆ వేదశాస్త్రాలు మనకప్పుడు రమ్మంటే యేలా వస్తాయి? అందుచేత అందుకోసం విరళన ప్రతాల పరిశ్రమ చేయడం కన్న వాట్లతోవ వాట్లదీ, మనతోవ మనదీ అనుకొని స్వేచ్ఛగా వర్తించడమే మంచిదని నేననుకొంటాను. "నిజమైన శ్రేయస్సంటూ వకటి లేనేలే" దంటే చిక్కులేదు గాని, వుందని యేమాత్రంగాని నమ్మకో, లేక సందేహమో వుండేటట్టయితే దానికి అనుకూలించే మార్గాలేవైతే పెద్దలు నిర్ణయించారో అలాంటి "చక్కని రాజమార్గాలనే" పట్టడం యుక్తంకాని, వంకరటింకర మార్గాలు ఆశ్రేయస్సుకు మనలను కొనిపోజాలవు.

"ఆహార నిద్రాభయాదులు" మాత్రమే పరమపురుషార్థ మనుకొనేయెడల అంతవఱకు అవి పశువులకుకూడా సమానమే. అవి అసలే

లేనిదీ దేహయాత్రి నడవదు కనకనున్నూ, సమస్త పురుషార్థాలున్నూ సాధించడానికి ఆ దేహమే సాధనం కనకనున్నూ ( శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్ ) ఆదేహాన్ని వీలయినంతలో ధర్మావిరుద్ధంగా పోషించు కుంటూ నిజమైన శ్రేయస్సేదో దానికోసం యత్నించాలి. యీ విష యాన్ని చిరకాలంనాఁడే వక పద్యంలో యిమిడ్చి వున్నాను.

శా. " ఆధివ్యాధిపరీతమైన తనకాయం బర్థిఁ బోషించుచు౯
శోధింపన్ వలె వేదశాస్త్రములు సం శోధించి యద్దానిచే
సాధింపన్‌వలె ముక్తిమార్గమదియున్ సాధించి మోక్షార్థికిన్
బోధింపన్ వలె జన్మ మన్న నదియే పో ! దేవి ! కామేశ్వరీ !"

యీ మానవ దేహం అల్లాటప్పాగా సంప్రాప్తమయ్యేది కాదు. దీన్ని వొక నౌకగా భావించారు మనపూర్వులు. సముద్ర ప్రయాణానికి నౌక యేలాటి సాధనమో, సముద్రంకన్నా దుస్తరమైన సంసారాన్ని తరించడానికి యీ శరీరంకూడా ఆలాటి సాధనమన్నారు. యీ నౌక మనకి తేలికలో లభ్యమైనది కాదు కూడాను. " శ్లో. బహునా పుణ్య పణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా." యెంతో పుణ్యమనే ద్రవ్యం ఖర్చుపెట్టి యీనౌక మనం కొనుక్కున్నా మనేమాట మఱవరాదు. " అనయా తర్తు మిచ్ఛా చే త్తర యావ న్నభిద్యతే " దీన్ని సాధనంగా చేసుకొని తరించడానికి కోరికే వుండేయెడల యీనావ పగిలిపోకుండా గట్టిగా వున్నప్పుడే ప్రయత్నించ వోయి. వెఱ్ఱికొడకా ! అని అభియుక్తులు గొంతెత్తి నిర్వ్యాజమైన దయతో మనలను సంబోధించి బోధిస్తూన్నారు. మనం వారిమాటలు లక్ష్యం చేయమని కూడా వారికి తెలియకపోలేదు. తెలిపీన్నీ యేకొందఱికో వారి సదుపదేశం లాభకారి కాకపోతుందా అనే నమ్మకంతో వారి కర్తవ్యాన్ని వారు నెఱవేర్చుకున్నట్టు తోస్తుంది. వారి వుపదేశా లనుకొనే పురాణ వాక్యా లెంత పరిశీలించినా " స్వధర్మే నిధనం శ్రేయః " అనే మూలసూత్రాన్ని అనుసరించే వుంటాయి. వారువారు వారి

వారికి అనుశ్రితంగా వస్తూవుండే వృత్తిధర్మాలల్లో వుండికూడా ఆస్తిక్య మున్నూ, దయాధర్మములున్నూ నెఱవేస్చుకుంటూ కాలక్షేపం చేస్తే నిజమైన శ్రేయస్సుకు వారు అర్హు లౌతా రని కనపడుతుంది.

కొన్నివృత్తులయందు హేయత్వం, కొన్నిటియందు నీచత్వం, కొన్నిటియందు ఘోరత్వం యీవిధంగా అన్నివృత్తులూ యేదో వక దోషానికి తావలంగానే కనపడడంచేత "త్రిదోషహరం తిప్పఁతీఁగ" అనేమాదిరిని పూర్వపు ఋషులు శిలోంఛవృత్తులమీఁద ఆధారపడి దేహధారణాన్ని నిర్వర్తించుకుంటూ అప్పుడు కూడా యేమాత్రమో నాంతరీయకతయా సంభవించే దోష లేశానికి వైశ్వదేవాదులు ప్రాయశ్చిత్తాలుగా పెట్టుకొని యీ యిహాన్ని అప్రధానంగా చూచుకొని పరానికి ప్రాధాన్యమిచ్చి వర్తించినట్టు కనపడుతుంది.

దేనికేనా తప్పుకొని జీవయాత్ర గడిపితే గడుస్తుందేమోకాని ప్రాణిహింసకు తప్పుకొని జీవయాత్ర సాగించడం మాత్రం యేవ్యక్తికిన్ని సాగేటట్టు లేదు. ఆ హింసలో తారతమ్యం వుంటే వుంటుంది. అహింసాతత్త్వం తెలుసుకోవడం చాలా దుర్ఘటం. కూరగాయలు తినడం కూడా హింసకిందకే వస్తుందని విశేషజ్ఞుల తాత్పర్యం. అంతలోఁతుకు పోక వకవిధంగా స్థూలదృష్టిని విచారిస్తే దశవిధ బ్రాహ్మణులలోనున్నూ అయిదు విధాల బ్రాహ్మణులున్నూ, వారినే అనుసరించి ఆచార వ్యవహారాలు జరుపుకునే కోమటులున్నూ, కొందఱు విశ్వబ్రాహ్మణులున్నూ దీన్ని చేయకుండా జీవయాత్ర గడుపుకుంటూ వున్నారని చెప్పవచ్చును. యిఁక తక్కినవా రందఱూ స్వయంగా హింస చేయక పోయినా చేసినవారిలోకే చేరతారు. యిది మన భరతఖండాన్ని గూర్చి వ్రాసింది. యితర ఖండాల్లో ధాన్యాద్యాహారం లేకుండా వున్నప్రదేశాతే కొన్ని వున్నట్టు చెపుతారు. ఆఘోరం వ్రాయడానికి తరం కాదుగదా! అకృత్యాన్ని వృత్తిగా పెట్టుకొని జీవించేవాళ్ళు కూడా పిల్లా జెల్లా అంవజీతోటీ దోసతోఁటలాగు వృద్ధిగా వున్నట్టే కనపడుతుంది. కాని యితరఖండాల వారి

అనుభవం యేలాటిదో కాని మన భారతీయుల దృష్టిలో యీలాటివృత్తులు అనాదిగా చేస్తున్నవారైతేనే తప్ప యెవరేనా కొత్తగా మొదలెడితే వాళ్ళని చెడిసికొడతా యంటూ పెద్దలు చెపుతూవుంటారు. హింసాప్రధానమైన కటిక వ్యాపారాన్ని అలా వుంచుదాం, అంత్యకర్మ చేయించే పురోహితుఁడికి హింసతో లేశమున్నూ సంబంధ మంటూ లేకపోయినా అనాదిగా చేసే కుటుంబీకులు కాక కొత్తవారు దాన్ని అవలంబిస్తే అది వారిని చెడిసికొట్టి తీరుతుందని చెపుతారు.

మొత్తం ఆయా వృత్తులన్నీ కష్టనిష్ఠురాలన్నిటికీ వోర్చి "పొలుపగు కోటివిద్దెలును పొట్టకుఁ బట్టెడుఁ కూఁటికేకదా" అన్న వాక్యానుసారం యెవరో అవలంబిస్తూనే వున్నారు. అట్టివారిని వుచితమైనంత గౌరవంతో తదితరవృత్తులవారు చూస్తూనే వున్నారు. ఆక్షేపించడాని కంటూ మొదలు పెట్టుకొనేయెడల "త్వం శుంఠా త్వం శుంఠా" కిందకి రావడమేగాని ప్రయోజనం కనపడదు. భారతంలో కర్ణశల్య సంవాదంవల్ల యీ సంగతి స్పష్టపడుతుంది. అందుచేత యెవరినిన్నీ యెవరున్నూ ప్రాజ్ఞులు స్వ స్వ కుల వృత్తులలో వుండేవారని ఆక్షేపించరు. "యెవరూ చేయకపోతే ఆ వృత్తివల్ల జరిగేపని యేలా జరుగుతుం?" దని సరిపెట్టుకుంటూ వుంటారు. ప్రాచీనంగా చేస్తూ వున్నవాళ్ళవిషయంలోనే యీ సరిపెట్టుకోవడం. కొత్తగా అవలంబించే వాళ్ళనయితే కొన్ని వృత్తుల విషయంలో "నీకర్మ మేమి కాలి యీవృత్తిలోకి దిగా" వంటూ వాళ్ళశ్రేయస్సును కోరినవాళ్ళు అనక మానరు. అవలంబించడంలోనే యీచిక్కుగాని ఆ యా వృత్తులలో వుండే కొన్నిదోషాలు వాళ్ళ మనస్సుకు బాధగా వుండిగాని వదులుకొనే పక్షంలో "యెందుకు వదిలి పెట్టా" వని వాళ్ళని యెవరూ మందలించరు సరిగదా పైఁగా అభినందిస్తారు కూడాను. అట్టివాళ్ళు తమతోపాటు మఱికొందఱినికూడా ఆ వృత్తిలోనుంచి తప్పించడానికి ప్రయత్నించడమున్నూ యుక్తమే. కాని అంతమాత్రంచేత ఆవృత్తి యీ లోకంలో యెక్కడా వుండకుండాపోతుం దనుకోవడం మాత్రం

యుక్తిసహం కాదు. అందులోవుండే లాభా న్నభిలషించి పన్ని యెవళ్ళో దానికి సిద్ధపడతా రనేది పరమసిద్ధాంతం. అందుచేతే దొడ్లతుకుపు దగ్గిఱ నుంచి ఆయావృత్తులు యథాపూర్వంగా కొన్ని ఖండప్రళయాలకూ కొన్ని అఖండప్రళయాలకూ కూడా నురిఁగిపోక నిల్చివున్నాయి. యెవరో ఆ యా వృత్తిదోషాలకు గుఱి గాకుండా కృష్ణా రామా అనుకుంటూ తరిం చినా సార్వత్రికంగా తరించడానికి వుపాయం వకటివుండాలి. ఆవుపాయం వృథాగా అశాస్త్రీయమైన వివాహాదులకు పాల్పడక అనూచానంగా వచ్చే మార్గంలో సంచరించడమే. ఆలా సంచరించక విలోమవివాహాలు వగ యిరాలకు సిద్ధపడినవారు తమ సంఘాన్ని దుఃఖపెట్టిన వారు కాకతప్పదు. భగవంతునికి వా రేమి చెఱుపు చేశా రని కొందరు స్థూలదృష్టు లంటారు కాని భగవద్వాక్యములే అని వేదాలను త్రికాలజ్ఞులైన మునులు నమ్ముతూ వున్నారు. అట్టి వేదవాక్యములను అనుసరించి పుట్టిన స్మృతులకు వ్యతిరే కించి వర్తించడం, పయిగా నిస్పృహులయిన ఆ ఋషులను స్వార్థపరు లనడం యిదంతా ఆ భగవంతుణ్ణి తిరస్కరించడమే కాని మఱోటి కాదు. యిహలోకంలో రాజశాసనం యేలాటిదో, పరలోకంలో భగవచ్ఛాసనం ఆలాటిదే. యేదో ప్రమాదంవల్ల కాక ప్రత్యేకించి కావాలని చెప్పి ఆభగవ చ్ఛాసనాన్ని అతిక్రమించి చేసే పనులవల్ల "నిజమైన శ్రేయస్సు"కు దూరం కాక తప్పదు. సంఘసంస్కార మన్నప్పుడు "నిజమైన శ్రేయ స్సుకు" మనలని దూరంగా తీసుకుపోయే దోషాలు యేవేనా వుంటే వాట్లను సంస్కరించుకోవడం యుక్తంగాని అట్టివికాని సజాతీయవివాహాలు మొదలైనవాటిని "తోసిరా" జని అన్యజాతివివాహాలున్నూ, విలోమ వివాహాలున్నూ, విడాకులచట్టాలున్నూ ప్రవేశపెట్టుకోవడం యుక్తంకాదు.

"అంగవ్రాతములో చికిత్సకుఁడు దుష్టాంగమ్ము ఖండించి" అన్న ట్టుండాలి గాని సంస్కారమన్నప్పుడు అన్యథాగా వుండరాదు. స్వధర్మాన్ని త్యజించినా, బ్రాహ్మణేతరజాతులు వుత్కృష్టత్వాన్ని సంపాదించే ప్రియ త్నంతో వుంటూ వున్నారు. శాస్త్రరీత్యా అదిన్నీ "నిజమైన శ్రేయ

స్సుసు" భంగించేదే అయినా బ్రాహ్మణులు చేసే పని వంటిది కాదు. బ్రాహ్మణులంటే గౌరవం లేని యీరోజుల్లో కూడా కొందఱు సుకార్యాలకు మార్గదర్శకులై నడిపించక పోవడంలో శోచనీయత్వం అంతగా కన పడదు గాని అకార్యాలకు మార్గదర్శకులై తమ తమ గురుత్వాన్ని చలామణీ చేసుకోవడం మిక్కిలీ శోచనీయ మనక తప్పదు. జాతిభేదం అంతరిస్తేనే గాని రాజకీయంగా కలిగే భావాలు మనకి సిద్ధించవంటూ కొందఱు "నిజమైన శ్రేయస్సును" భంగించే మార్గాలు బోధించి మనధర్మాలు మంటఁగలుపుతూ వున్నారు. కాని జాతి మత భేదాలు లేని దేశాలు కూడా వాకళ్ళని వాకళ్ళెప్పుడు మింగుదామా అన్న స్థితిలో వుండడం తెలిసిన తర్వాత వారివుద్యమం వర్ణసాంకర్య మాత్ర ఫలకమే గాని తుదకు వ్రతం చెడ్డప్పటికీ ఫలాన్ని దక్కించేది కాదని అందఱికీ విస్పష్ట పడింది. యెంత వఱకు స్వజాతి ధర్మాలకు కట్టుఁబడుతూ భారతీయులు వుద్యోగాదులకు ప్రయత్నిస్తూ వచ్చారో అంతవఱకే ఆ యా వుద్యోగాలలో నిజమైన లాభాన్ని పొందఁగలిగారు గాని, ఆకట్టుఁబాట్లు వదలుకొన్న తర్వాత ఆ లాభమూ అంతరించింది, పారమార్థిక శ్రేయస్సున్నూ దానిలాగే అన్నిటికీ సిద్ధపడేపక్షంలో అంతరించక పోతుందా! "ఇతోభ్రష్ట స్తతోభ్రష్టః" అనేగతి పట్టుతుంది. యింకా యెన్నివిధాల భ్రష్టత్వం పట్టవలసి వుందో నిర్ణయించ డానికి వీలుకనపడదు. "వివేకభ్రష్టానాం భవతి వినిపాతశ్శత విధః"

అయితే మనపెద్దలు మనకు "నిజమైన శ్రేయః ప్రాప్తికి" యెన్ని సదుపాయాలైతే అవసరమో అన్నీ చేశారు. కాని వాట్లనన్నిటినీ కూడా మనం బుద్ధిపూర్వకంగా చెడఁగొట్టుకుంటూ వున్నాము. చెడఁగొట్టుకుంటామని మాత్రం తెలుసుకోవడం లేదు. కన్లమూసుకున్నంతమాత్రంలో ప్రత్యక్షమవుతూ వుండే పారమార్థిక సౌఖ్యాన్నికూర్చి మనకు బొత్తిగా విశ్వాసం లేకపోవడమే మనపతనానికి ముఖ్యకారణం. తుదకు సర్వసాధారణమైవున్న స్వప్నాన్ని గూర్చి తెలిసేటంతవఱకేనా మనం పెద్దల శుశ్రూషచేసి వుంటే మనకీలాటి పతనం సంభవించక

పోయేది. పోనీ, యిప్పటి సంస్కర్తల నూతనాభిప్రాయాలను అనుస రించి సంచరిస్తే "నిజమైన శ్రేయస్సు" కష్టాలమవుతామేమో, అసందర్భం తెలుసుకుందామని అనుకుంటే వారు మొదటినుంచీ ప్రాచీనాపేత మార్గం గానే మాట్లాడుతారు. నిన్నమొన్న పకరితో మాట్లాడిచూశాను. మాట్లా డిన విషయం సంసారిణులుగా వుండిన స్త్రీలు నాట్యాభినయాలు పెండ్లి పేరంటపు వూరేగింపులు వగయిరాలలోనున్నూ ప్రదర్శించడం యుక్త మేనా అనేదాన్నిగూర్చి. ఆయనకున్నూ, నాకున్నూ జరిగిన ప్రశ్నోత్త రాలు యిక్కడ వుటంకిస్తాను.

ప్రశ్న: ఏమండీ బావగారూ! మీరు సంస్కర్తలే కాక అందులో అగ్రేసరులు కూడాకదా? సంసారిణులు నాట్యాభినయాలు మహాసభల లోనూ, వూరేగింపులలోనూ ప్రకటించడం యుక్తమేనా?

ఉత్తరం: యేం, యెందుకు ప్రకటించకూడదూ! మాళవిక సంసారిణి కాదా? ఆమెకు నాట్యాభినయాలు చెప్పించినట్టు కాళిదాసు వ్రాయలేదా? పైగా ఆమె రాజుగారి భార్యకు పినతండ్రి కూతురు కూడా కనక సామాన్యపు సంసారిణి కూడా కాదు. నాట్యాభినయాలూ, చిత్రలేఖనమూ అనాదిగా సంసారిణులు నేర్చుకుంటూనే వున్నారు, ప్రద ర్శిస్తూనూ వున్నారు.

ప్రశ్న: చిత్రలేఖనాన్ని అలా వుంచండి. నాట్యాభినయాలను గూర్చే మాట్లాడుకుందాం. మాళవిక రాజదాసీకుటుంబంలోది గాని మీరను కొన్న మాదిరిదిగాదు. నాటక సంప్రదాయానుసారంగా కాళిదాసు (అన్యథావా ప్రకల్పయేత్) ఆమెను రాజకుటుంబంలోకి చేర్చివుంటాడు. దాన్నల్లా వుంచండి. నాట్యాభినయ ప్రదర్శనంగాని, యితర "యేక్టర్ల" తోసహా సినీమాలో తెయితెక్కలాడడాలు వగయిరాలు గాని కులస్త్రీలకు అర్హ మేనా? ఆత్మవంచనం లేకుండా సెలవియ్యండి.

ఉత్తరం: యేం యెందుకు అర్హంకాదు? ఎందఱో మర్యాద కుటుంబంలో వుండేస్త్రీలు అలాటి సంస్థలలో యిప్పుడు పాల్గొనడంలేదా?

ప్రశ్న : ఈపాఠ్గానడం శీలభంగానికి పుపోద్బలకం గాదా అని మిమ్మల్ని అడుగుతూ వున్నాను.

ఉత్తరం : ఇలా పాఠ్గానకుండా వున్నస్త్రీలు శీలభంగాన్ని చేసుకోవడం లేదా ? పురుషులకే కానివ్వండి, స్త్రీలకే కానివ్వండి మనోనిబ్బరం అంటూ వొకటివుంటే యివేమీ చేయవని నాఅభిప్రాయం. వెనక మాచుట్టాలలో వక హాస్యంచెప్పే ఆయన వుండేవాఁడు. ఆయన భాంవేషకత్తెతో కూడా వుండి హాస్యం చెప్పేవాఁడు. కాని ఆపె మాత్రం తనమీఁద చేయి వేయడం సుతరాం వల్లకాదు. వొకప్పుడు యీ నియమం మఱచిపోయి కాఁబోలు, భాంవేషగత్తె పొరఁబాటున "అయమ్మా మాధవీ !" అని తనమీఁద చేయివేసేటప్పడికి వెంటనే ఆసభలోనే చెంపవిఱిగేటట్టు వక దెబ్బ కొట్టాఁడు. అలాటి నియమనిష్ఠలు వుండాలిగాని వుంటే.........

ప్రశ్న : అయ్యా ! మనోనిబ్బరం పోవడానికి తగ్గ సదుపాయాలన్నీ కల్పించి మనోనిబ్బరం వుండాలంటే, యేంప్రయోజనం ? యింతబాధెందుకు ? యేగుణమయితే స్త్రీకి యిహపరాలు రెంటికీ పనికిరాదో ఆగుణానికి నిషేధం మీమతంలో లేదందుమా దానితో సర్వమూ తేలిపోతుంది.

యింతటితో మాప్రశ్నోత్తరాలు ముగిశాయి. నేనెవరితో యీ మాటలు మాట్లాడివున్నానో ఆయన కేవల సంస్కర్తృ మతంలోవారు మాత్రమే కారు; మంచి స్వతస్సిద్ధమైన కవియై జీవితమంతా దానికొఅకు వినియోగించినవారు కూడాను. నాకన్నా కొంచెం పెద్దలు రసమంటే యేమిటో; దానికి స్థాయి భావమేదో సాత్త్వికాది - భావాలేమిటో ఆయనకు పూర్తిగా తెలుసును. యితర ఖండాల మాట మనకు వద్దుగాని మనఖండంలో సుందరులై గానాది విద్యాప్రవేశం కలిగి వుండి మంచివయస్సులో వున్న స్త్రీపురుషుల పరస్పర స్పర్శ సాత్త్వికోదయాన్ని కలిగించకుండా వుంటుందని యెవ్వరేనా చెప్పఁగలరా ? యీసందర్భమంతా ఆయన యెఱిఁగివుండిన్నీ మొదటినుంచీ అమతంలో వారికి అమయాయులుగా

వుండి గ్రంథాలు రాయడమూ, వుపన్యసించడమూ, తన్మతాభిమానులుగా
వుండడమూ కారణమయి ఆరెండుమాటలూ ఆలా మాట్లాడి వున్నారు.
కాని యీనాట్యాభినయ ప్రదర్శనం సంసారిస్త్రీలకు సర్వనాశన హేతు
వనిన్నీ, దీనితో పాతివ్రత్య మడుగంటడమే కాకుండా వీరమాతృత్వం
కూడా మిక్కిలీ మృగ్యావస్థలో వచ్చితీరుతుందనీ ఆయన మనస్సాక్షికి
రాక కాదని నాకు పూర్తిగా తోచింది కాని యిది మహాప్రళయ మనిన్నీ,
దీన్ని ఆపడానికి ప్రయత్నించినా ప్రయోజనం లేదనిన్నీ ఆయన తాత్పర్య
మని స్పష్టపడింది. సంగీతం కానిదానికే అంగాలుగా వుండే నాట్యాభి
నయాలుగాని మహారాజకుటుంబాలలో వుండే అంతఃపురస్త్రీలు కాలక్షే
పార్థం క్వాచిత్కంగా నేర్చుకోవడం మట్టుకు పూర్వకాలంలో వున్నట్టు
ప్రమాణాలు వుపలబ్ధమయినా, వారికి ఆయా విద్యలు యితరులవద్ద ప్రద
ర్శించవలసిన ఆవశ్యకత లేశమున్నూ లేక పోవడంచేత వారిని వరవడిగా
పెట్టుకొని సామాన్య సంసారులు వర్తించడానికి అవకాశం లేదు. వారితో
బాటు జరుగుబాటువున్న సంపన్న గృహస్థులు వినోదార్థం నేర్చుకోవచ్చునా
అంటూ వక ప్రశ్న యీపైని వస్తుంది. నేర్చుకో వచ్చునని విధిలేక
వప్పుకోవలసి వస్తుంది. కాని యేవిద్యకైనా ముఖ్యఫలం జ్ఞానంగదా!
అట్టి జ్ఞానానికి సంగీతంగాని, నాట్యాభినయాలు కాని లేశమున్నూ తోడు
పడవు. అయితే సాహిత్యంకూడా మంచి ప్రవేశం వుంటేనేకాని నాట్యాభి
నయాలకు ఆనుకూల్యం లేనట్టు భరతముని స్పష్టంగా వ్రాసివున్నాడు.
కాని యీకాలంలో అట్టి సాహిత్యప్రవేశం కలవాళ్ళు నటీవర్గంలో కాని
నటవర్గంలో కాని, తుదకు కేవల గాయకులలో గాని అరుదు. కాబట్టి
జ్ఞానాభివృద్ధికే అయితే భాషాకృషి చేయించడం యుక్తంగాని నాట్యాభి
నయ కృషి యుక్తంగాదని చెప్పవలసి వస్తుంది. కాదుకూడదు. కొందఱు
జరుగుబాటు కలవాళ్ళు యీరెండూ నేర్చుకో కూడదని అంటారా, నేర్చు
కున్నా ధనాపేక్షతోగాని, వూరికేనే గాని, శుభ శోభనాలలో గాని,
నాటకరంగాలలో గాని వినియోగించడానికి పూర్వుల సమ్మతి వున్నట్టు

లేదు. యెంతగా మనస్సును చంపుకొని పైవిషయాన్ని ఆమోదిద్దామని ప్రయత్నించినా పూర్వాచార పరాయణులకు పైవిషయం సమ్మతంగా తోఁచదు. వారు——

శా. పూర్వాచార పరాయణత్వమున నే వోవంగ మీకిచ్ఛయే
నర్వాచీను లొకళ్ళ జోలి యిది యేలామీకు, మీయంత మీ
గుర్వర్థమ్ములు సాఁగఁజేసికొనుఁ డేఁగుండు త్తమంపున్ గతుల్
గర్వమ్ముంగని యొడ్ల నెంచకుఁడిదే కార్యమ్ము కాకుండెడిన్.

అనే పద్యార్థప్రకారం సంచరించడమే కర్తవ్యం. పూర్వాచార పరాయణత్వమంటే చాలూమూలమూ లేని ఆచారాల విషయం మనస్సులో పెట్టుకోవాలని కాదు నాతాత్పర్యం. ఆలాటి ఆక్షేపణలు నిరాధారాలు. నాచిన్నతనంలో వక విధవరాలు కొంచెం చదువుకున్నది వుండేది. ఆవిడ ఆకాలంలో తఱుచు వ్యాప్తిలోవుండే ప్రహ్లాదనాటకమూ, రామనాటకమూ, యింకా యీలాటి పుస్తకాలే చదువుకుంటూ, కాలక్షేపం యుక్తంగా జరుపుకుంటూ తీరికైనప్పుడు జంధ్యాలు వడికేది. ఆవడకడాన్నికూడా ఆక్షేపించే వారు బంధుగులు. చాలూ మూలమూ లేని ఆక్షేపణలంటే యీలాటివి.

ఈలాటివాట్లకు గూడా భయపడవలసి వుండదు. ఇవి "నిజమైన శ్రేయస్సును" సంపాదించుకొనే వారికి లేశమున్నూ అడ్డుతగిలేవి కావు. కాలం యిప్పుడు బాగామాఱిందికనక ఆజంధ్యాలవడుకు బట్టలకు పనికివచ్చే నూలుదాఁకా దేఁకినా దానివల్ల యిహానికి గాని పరానికిఁ గాని లేశమున్నూ హాని కనపడదు. అంతేనేకాని, బహుభార్యాత్వంతో పాటు బహుభర్తృకత్వము వగయిరాలు హానికరము కావనుకోవడం యేలాగ? యిహం మాటకేమి? పరానికి రెండూ వకటే అంటారేమో? పరానికికూడా సమానంకావు. కానేకావు. పురుషుఁడు వక్కఁడూ బయలుదేఱి యేయే వూళ్ళు ప్రయాణం చేసినా హానిలేదు. స్త్రీ ఆలాగు చేయగలదా? చేస్తే ఆమెకు మాట దక్కుతుందా? ఆమె యెంత శీలవంతురాలయినా ఆమె

సుశీలానికి అనుగుణమైన శీలంగలదే సర్వప్రపంచకమూ అవుతుందా? అట్లు యేపరిభుత్వంలోనూ కూడా ప్రపంచకం యావత్తూ మాఱడమనేది అసంభవమేకదా? ఆలా మాఱడమంటూ వస్తే పోలీసుడిపార్టుమెంట్లు మేజస్ట్రీటు కోర్టులు. యివన్నీ అక్కఱలేదు.

కాఁబట్టి పురుషులతోపాటు స్త్రీలు సంచరించడం సర్వథా అనర్థదాయకం. దీన్ని సాధించడానికి ప్రతిపక్షులు చెప్పే యుక్తులన్నీ ఆపాత రమణీయాలుగా వుంటాయి. కాని విమర్శనకు ఆఁగవు. దమయంతి వంటి మహాపతివ్రత అరణ్యమధ్యంలో వంటరిగా వున్నప్పుడు యెఱుకలవాఁడి ద్వారా జరగడానికి సిద్ధమైన ఆపత్తు అందఱూ చదివే వుంటారు. లోకమంతా నీతిధురంధరమై, అనీతి అనేది యెక్కడాలేని పక్షంలో స్త్రీ యెక్కడికి పడితే అక్కడికి ప్రయాణాలు వంటరిగా చేయావచ్చును. రంగస్థలాల్లో యితర యాక్టర్లతో భార్యాది భూమికలు ధరించి "యాక్షన్" చేయావచ్చునని కూడా అంగీకరిద్దాం. అట్టి భాగ్యం యీయుగంలో కాదు కదా నాలుగు పాదాలమీఁదా ధర్మం నడిచే కృతయుగంలో కూడా పట్టినట్టు లేదు. యేక్టర్లందఱూ మనోనిబ్బరం కలవారుగా వుండడానికిన్నీ లోకప్రకృతి అంగీకరించదు. సభ్యాదులందఱూ శ్రీశుకులు వంటివారుగా వుండడానికిన్నీ లోకప్రకృతి అంగీకరించదు. అందుచేత ఆయీ కొత్త పోకడలన్నీ స్త్రీజాతి శీలాన్ని నాశనం చేయడానికిన్నీ, తద్ద్వారాగా భారతీయులలో యెంతో గొప్పఁగా పరిగణింపఁబడే పాతివ్రత్యధనాన్ని కోల్పోవడానికిన్నీ తప్ప మఱెందుకూ పనికిరావు. ఆనాట్యాభినయాలు నశించిపోతే పోనివ్వండి, వాట్లకోసం యేజాతీ స్వతంత్రమైనది వుండకపోతే పోనివ్వండి, యిదివఱలో స్వాతంత్ర్యంతో సంచరిస్తూ ఆవిద్యలను ప్రకటించే వారున్నప్పుడు ఆవిద్యలు అవినీతికరాలని నిశ్చయించుకొని వదులుకుంటూ వున్నప్పుడు యితరుల కవి వుపాదేయా లవుతాయా?

"సానివా, సంసారివా?" అనేవాక్యం కొత్తది కాదు! ఆరెండు స్థానాలకూ యెంతో భేదంవుందని వ్రాయనక్కఱ లేదు. యేపిల్లకేనా

అక్షరాభ్యాసమంటూ జరిగితేనే ఆపిల్లని పెళ్ళాడడానికి ఆజాతిలో పురుషులు నిషేధించడం సుప్రసిద్ధం. దీన్నిపట్టి సానిసంసారి భేదాన్ని మనకంటే కూడా అనాదిగా ఆజాతిన్నీ పాటిస్తూనే వుందని తేలుతుంది. అట్టి స్థితిలో మనజాతి పురుషుల సభలో గజ్జెకట్టి ఆడివచ్చిన యిల్లాలిని గృహిణిగా అంగీకరించకలరా ! అంగీకరిస్తారే అనుకుందాం, అది నిజమైన శ్రేయస్సును భంగించే దవుతుందిగాని, మతోమాదిరిది గాదు. యీమధ్య వక యువకుఁడు నిక్షేపంవంటి భార్యావుండఁగా ఆపె సౌందర్యం తనకి నచ్చింది కాదని, బ్రహ్మచారినని చెప్పి మోసగించి వక వితంతువును పెళ్ళి చేసుకున్నాఁడు. భార్య వుండంగా వేఱొకవివాహం చేసుకోవడానికి సంస్కర్తలున్నూ వొప్పనివారే అయినా యీ వివాహానికి మోసంలోపడి సమ్మతించా రనుకోవాలి. యిప్పు డతఁ డంటాఁడు కదా ? మొదటి భార్యనుకూడా యేలుతా నంటాఁడు. రెండోభార్య కూడా చాలా యోగ్యురాలు కావడంచేత యిందుకు అంగీకారాన్ని చూపుతూ వుంది. అయితే సంఘం వదిలి యీకాపరానికి మొదటిపిల్ల పెళ్ళలేకుండా వుంది.

ఆయీ సందర్భాలన్నీ విచారిస్తే కొత్తపోకడలు సర్వథా శ్రేయోభంజకాలుగా కనపడుతూ వున్నాయి. కనపడ్డప్పటికీ మంటలోదూఁకే మిడుతలలాగ యెందరో దానికి యెగఁబడుతూ వున్నారు. వారిని వారించడానికి యెవరికీ తరంకాదు. యెందుచేత ? యేవోకొన్ని సంఘాలు వారిని ఆమోదిస్తూ వున్నాయి. కాని యీనవీనాచారాలు యెంతవఱకు శ్రేయస్సాధనగా వుంటాయి, యెంతవఱకూ వుఁడవు. అని తటపటాయించే వారికోసం యీనాలుగు మాటలూ వ్రాయడం. అంతకంటే యీమాటలకు ప్రయోజనం లేదు. యీమాటలుపొంగి చెలియలికట్ట దాఁటివస్తూవున్ననూ తనసంసారసముద్రాన్ని నిలవరిస్తా యేమోనని కొందఱు భయపడి ఆందోళనకు మొదలుపెడుతూ వున్నారు. "వీట్లయందు అంతటి 'వాల్యూ' వుఁచవలసి వుండదు. భయపడవలసిన్నీ వుండదు." అని ఆ భయ భ్రాంతులకు తెలుపుతూ వున్నాను. యెందఱో మహామహోపాధ్యాయ బిరుదాం

కితులైన మహావిద్వాంసులు దక్షిణాదిని ఆయా నవీనసంస్కారాలు శ్రేయ స్సాధనాలు కావని తెల్పడానికి ప్రయత్నిస్తూ వున్నట్టు పత్రికలలో కన పడుతూ వుంది. అస్మదాదుల కూరగాయ మాటలకన్నా వారు చెప్పేమా టలు యెక్కువ శాస్త్రీయంగా వుండడానికి సందేహమైతే లేదుగాని, యిప్పుడు "కల్పనారుచులకు" మఱిగిన యీప్రపంచానికి వారిమాట లేల వచ్చుతాయి? కల్పనారుచులంటే యేలాటి వంటారేమో? మునుపు తోలుబొమ్మలు వకమాదిరిగా వుండేవి. అవే యెక్కువగా నాగరికత లోకివచ్చి "సినిమా" లనిపించుకుంటూ వున్నాయి. యీలాగే యిత రాలుగూడా చూచుకొంటే సరిపోతుంది. సినిమాలను ప్రేమించినట్టు తోలుబొమ్మలను ప్రేమించడం సర్వధా అసంభవం. అందుచేత యెందఱు మహామహులు యెంతెంత పరిశ్రమచేసి యెన్ని విధాల "నిజమైన శ్రేయ స్సాధనం యిట్టిది" అని బోధించినా, యీ పిదప లోకానికి యెక్కదు. మఱి యిప్పటివారు చెప్పేమాటలో? యెంతో ధర్మబోధకాలుగా కనపడతాయి.

సంపూర్ణం



# దేనికి తెలివెక్కువుండాలి?

( 15—5—1940 సుధ పత్రిక నుండి )

దేనికి తెలివెక్కువుండాలి?— అని ప్రశ్నించుకుందాం. లోకంలో అనేక విషయాలున్నా సత్యాసత్యాలను ప్రస్తుతంగా నేర్పరచుకొని చర్చిం చుకుందాం. యిక్కడ మనం సిద్ధాంతీకరించవలసింది పుణ్యమూ పాప మూ కాదు. తెల్వే మాత్రమే అంటే? నైపుణ్యం మాత్రమే. వన్నడి గితే అసత్యాన్నివాడడానికే యెక్కువ తెల్వివుండాలని చెప్పడమే కాకుండా లోకంలో యిదంటూ వొకటి అవతరించి వుండడంవల్లనే అనేకులకు జీవనోపాధి కలుగుతూవుందనికూడా చెపుతాను. కొన్నిటిలో యిది పూర్తి

గాసుస్నూ మఱికొన్నిటిలో కొంత భాగస్వామిగానున్నూ యీ అసత్యం వుంటూవున్నట్లు అభియుక్తోక్తులు కనపడతాయి. చూడండీ ? మనకందరికీ రక్షకంగావుండే రాజనీతినిగూర్చి భర్తృహరి మహాకవి యేలాగు వర్ణించివున్నాడోను "శ్లో. సత్యానృతా చ పరుషా మృదుళా ..................... వారాంగనేవ నృపనీతిరనేకరీతిః " శ్లోకంలోవున్న తక్కిన విశేషణాలతో మనకు పనిలేదు. "అనృతా" అన్నదే కావలసింది ప్రస్తుతం; లోకాన్నంతనీ అనృతాది దోషాలనుండి కాపాడేది యేది ? రాజనీతికదా ; అట్టి రక్షకసూత్రములోనే అసత్యం యిమిడి వుంటుందన్నప్పుడు యిక యితరత్రి దానికి ప్రవేశముంటుందా ? వుండదా ? అని విచారించ నవసరం లేదు. ఉప్పు చేరని పదార్థాలు కొన్ని (మిఠాయివగైరాలు) వున్నాయిగాని అసత్యం చేరని వ్యాపారాలు వున్నాయనడానికి అవకాశంలేదు. సత్యంవల్ల పుణ్యలోకాలే రానివ్వండి. అసత్యంవల్ల నరకమేరానివ్వండి గాని చతుష్షష్టికళలలో పూర్వులు అసత్యాన్ని యెందుకు చేర్చలేదోగాని తప్పక చేర్చవలసేవుంటుందని నే నభిప్రాయపడతాను. దొంగతనాన్ని కళలలో చేర్చడానికి హేతువేమిటి ? ఆ పని చాలా చెడ్డపనే అయినా దానిలో పేరుప్రతిష్ఠలు గణించి నాయకత్వం వహించవలసి వస్తే యెంత సాహసం, యెంతత్యాగం, యెంత శౌర్యం, యెంత వోర్పు. యెంత నైపుణ్యం యింకా యెన్నో యిలాటి పరమోత్కృష్ట గుణాలు యేకరు పెట్టవలసివస్తుంది. మృచ్ఛకటికలో " శర్విలకుణ్ణి " పట్టిచూచుకోండి. ఆర్యకుడనే గొల్లపిల్లవాడికి రాజ్యం సంపాదించడంలో యీ శర్విలకుడే ప్రధానుడు. పూర్వోక్త గుణా లాలావుంచండి. వొక్కప్పు మహాయోగులలో యేకొందరికోగాని సాధ్యపడనంత ' ఇంద్రియ నిగ్రహం ' కనపఱచవలసివస్తుంది. యిన్ని సుగుణాలతో చేరిన ' దొంగతనం ' యెందుకు నింద్యం కావలసి వచ్చిందంటే ? ( నిక్కముగ నొక్కనిం గొలుచుకన్నను దొంగతికమ్మ తక్కువే ? ) దానికి పరివార సామగ్రియందే అభ్యర్హితత్వం వుందిగాని అసలుదానియందులేదు. అందుచేత యీ గుణాలన్నీ ' శవాలంకారాలు ' కావలసి

వచ్చింది. యిది విషయాంతరం. దొంగతనాన్ని కళలలో జేర్చి గౌరవించిన మనపూర్వులు 'అసత్యాన్ని' కళలలో యెందుకు చేర్చలేదో? అన్నదే ప్రస్తుతం కావలసింది. సూర్యచంద్రాదుల గమనాలు వగైరాలు భూమి కుంగి పోకుండా నిల్చివుండడం వగైరాలు సమస్తమున్నూ సత్యమూలకాలే అని కవులు వర్ణిస్తూవుంటారు. కాని యీలాటి ప్రయోజనాలెన్నో మునుపటివారికి కనపడ్డాయోలేదో గాని యిప్పటివారికి అసత్యమందున్నూ చాలాసదుపాయాలు కనపడతాయి. కోర్టులను పుచ్చుకుందాం, లోకంలో అసత్యమంటూ లేకపోతే కోర్టులతో అవసరముంటుందా? కనక వాట్లని నిల్పికాపాడేది అసత్యమే. ఆకోర్టులవల్ల యెందరికి జీవనం కల్పితమవుతూ వుందో వ్రాయవలసివుండదుగదా! అక్కడికెళ్ళి కాస్తసేపు కూర్చుంటే అసత్యంలో యెంతెంత నైపుణ్యంకలవారు ప్రపంచకంలో వుంటారో? ఆసంగతీ తెలుస్తూవుంటుంది. యెంతెంత తెలివి తక్కువగా అసత్యాన్ని పలికి అధికారిచేత చీవాట్లుతింటూ వుంటారో? అదిన్నీ తెలుస్తూవుంటుంది. ప్రభోధ చంద్రోదయనాటకంలో "వేశ్యావేశ్మని సీధుగంధిలలనా ... దివాధూర్తైర్జగద్వంచ్యతే" అనే శ్లోకంలో విటులైన విద్వాంసుల పగటి వేషాలను చక్కగా వర్ణించాడు కృష్ణమిశ్రుడు. ప్రస్తుతం అసత్యాలాపులు కూడా (అందరూ కాదు గాని) కొంచెం వేదమో? శాస్త్రమో? కవిత్వమో? సంగీతమో? సాహిత్యమో? నేర్చినవారు కోర్టుకురావలసివస్తే ప్రబోధచంద్రోదయంలో వర్ణించినవేషాలతోటి ప్రత్యక్షమవుతారు. దీన్ని చూడాలంటే? కోనసీమకు సంబంధించిన కోర్టులు చూడాలి. మనపూర్వులు మగవాళ్ళకంటె ఆడవాళ్ళని ప్రస్తుతవిషయంలో యెక్కువగా పేర్కొనివున్నారు. కాని యిప్పుడా పేర్కోవడం విశ్వాసార్హం కాదనిన్నీ ఆడవాళ్ళే ఆగ్రంథాలువ్రాస్తే అవి అలావుండక మరోలాగే వుండవలసి వచ్చేదనిన్నీ వ్రాసినవ్రాతలు చూడడం తటస్థిస్తూవుంది. ఆయీవ్రాతలేలాటివైనప్పటికీ వీట్లని "అవునూ కాదూ" అని చర్చించడానికి మనకి ధైర్యం చాలదు. కొంచెం యెత్తుకొనే యిప్పటికల్లా (అసలువాళ్ళు) ఆడ

వాళ్ళమాట అలావుండగా వాళ్ళకన్నా యినుమిక్కిలిగా కొందరుమొగవాళ్లే యెదురుకొని ఖండనవ్యాసాలు కుప్పతిప్పలుగా కుటీపిస్తారు. ఆనైపుణ్యం వర్ణనాతీతం. కళలను గూర్చి అమధ్యనేను యేదోకొంచెం పూర్వులఅభి ప్రాయానుసారం స్వతంత్రింగావుండే స్త్రీలు వుండాలని వ్రాసేటప్పటికి యెందఱో ప్రతివాదులు తిరగబడ్డారు. దానితో భయపడి నేను యీపాఠం (ఆడవాళ్ళకి సంబంధించినకట్లు బొట్లు యిట్టివి అనివ్రాయడానికి అవకాశం లేదనేది) నేర్చుకున్నాను. యిప్పుడెంతసేపు స్త్రీలనుగూర్చి వ్రాసినా వారు యుద్ధంచేయడంలో చాలాపమర్థులనిన్నీ (కాళికవుదాహరణం) సినీమాలలో వారునటించడంవల్ల పాతివ్రిత్యం పెంపొందుతుందనిన్నీ, ప్రధానంగా సంసారిస్త్రీలు నాటక రంగాలలో పాల్గొనకపోవడం చేతనే లోకంలో వ్యభి చారం విస్తరిస్తూవుందనిన్నీ వ్రాసేవ్యాసాలనే పత్రికాధిపతులు (వారేం చేస్తారుపాపం? లోకంలో నూటికి తొంభైపాళ్ళు జనం అలా మాఱిపో యింది. అలాంటివ్యాసాలువుంటేనే కాని పత్రికకు చందాదార్లు చేరరాయె) ఆదరించి ప్రచురిస్తారు. విషయం విషయాంతరంలోకి దూకిందికాబోలును. అసత్య మాడడంలో పురుషులకన్నా స్త్రీలుయెక్కువగా అగ్రిస్థానాన్ని వహిస్తారని మనపూర్వులభిప్రాయపడ్డప్పటికీ మనం ప్రస్తుతకాలంలో దాన్నిపురస్కరించుకొని యేమీ వ్రాయగూడదనిన్నీ అలావ్రాస్తే మాట దక్కదనియ్యేవే "భవతు తత్తథాస్తామ్". ప్రస్తుతం మనకు కావలసింది సత్యాసత్యాలవల్ల వచ్చే పుణ్యపాపాలూ గావు, గౌరవాగౌరవాలూ కావు. యికనేమిటంటే? యిందులో దేనిక్కి నేర్పెక్కువుండాలనేదే. నామట్టుకు తోస్తుందిగదా? సత్యంచెప్పేవాడికి యేమాత్రమూ తెలివితేటలతోగాని నేర్పుతోగాని అవసరమే వుండదనిన్నీ "శాస్త్రుల్లుగారూ? మీకు యిప్పుడు స్కూలులో యెంతయిస్తున్నారండీ" అని అడిగితే "ట్వెంటీఫైయవు" అని చెప్పడానికి పయిసందర్భాలతో అవసర మేముంటుంది? "అసత్యం చెప్పవలసివస్తేనే" యెక్కువనేర్పు, ఓరిమి, వగయిరా గుణగణం వుండ వలసివస్తుందనిన్నీ తోస్తుంది. అసత్యం చెప్పేవాళ్ళకి ఓరిమి యెందుకు

అవసర మవుతుందంటారేమో? అవసరం అవుతుంది. యింకా కలియుగం యెంతప్రబలినా అసత్యం చెప్పేవ్యక్తిని ముఖంముందు గాకపోయినా కాస్త చాటునా మాటునా దూషించడం జరుగుతూనేవుంది. ఆదూషణ యెవళ్ళ వల్లనో వచ్చి చెవులలో పడుతూనే వుంటుంది. అలాపడ్డప్పుడు దులపరించుకొని స్థాణువులాగ "అనుమూ మినుమూ" అనకుండా "విమ్మకు పీరెత్తినట్లు" వుండగలగడం పేరే ఓరిమి. అందుచేత వోరిమి ఆవశ్యకమని వ్రాయవలసివచ్చింది. నేర్పునుగూర్చి వ్రాయనక్కరేలేదు. ఆనేర్పు యింతా అంతాకాదు. యెంతేనా వుండాలి. సౌభాగ్యకామేశ్వరిలో దీన్ని గూర్చి కొంచెం ప్రసక్తి తగిలి యిలా వ్రాశాను. వుదాహరిస్తాను.

మ. అనృతంబాడుటకూడ బాండితియ సుమ్మా? తల్లి! పెల్వెల్లనై
చనుమోరన్ విడితేజమెల్ల నెటకో? సత్యేతరం బాడుప
ట్టున నొక్కొక్కని కొక్కడో? వృషభమట్టుల్ తాకి గర్జించి చె
ప్పు ననేకానృతముల్ పురాకృత మటుల్ పుట్టించుఁ గామేశ్వరీ.

యీపద్యం చాలానాళ్ళకిత్రం వ్రాసింది కాకపోయినా యిప్పుడు వ్రాయబోయే వ్యాసంలో దేనికి ప్రాధాన్యం యివ్వడానికి సంకల్పించానో? అట్టి అసత్యాన్ని "కూడ" అనేపదంతో చేర్చడంచేత సామాన్యంగా సత్యం చెప్పడమూ పాండిత్యలక్షణమే. అసత్యం చెప్పడమూ "పాండిత్యలక్షణమే" అనిచెప్పినట్టవుతూంది. అసలు ఆయీ తాత్పర్యంతో కూడన్ అన్నది దానిలో ప్రయోగింపబడలేదు. దాన్ని వివరించవలసివస్తే చాలా వ్రాయాలి కనక, అసత్యం చెప్పడమనేది సామాన్యంగాదు. అది పెద్దపాండిత్యం అవియ్యేవే నాతాత్పర్యం. యిక్కడ పాండిత్యపదానికి తాత్పర్యం "నైపుణ్యం" అని తెలుసుకోవాలి. అసత్యం చెప్పి మొగం కళతప్పకుండా నిర్భయంగా నలుగురిలో తలయెత్తికొని తిరగడంఅంటే? సామాన్యమా? కాదు. యింతటి అసాధారణ చాకచక్యాన్ని మనపూర్వులు చతుష్షష్టి (64) కళలలో యెందుకు చేర్చారుకారో? అనినేను అనుకుంటూ వుంటాను. గౌరవార్హమయింది కాదని చేర్చలేదనుకొందామా? అంటే?

జూదం, దొంగతనం వగయిరాలన్నీ గౌరవార్హాలేనా? వాట్లల్లో యేదోకొంత శిల్పం వుండడంచేత ఆగుణాన్నిబట్టి కళలలో చేర్చివున్నారన్నది నిర్వివాదాంశం. ఆమధ్య నేను యీకళలపేర్లు శ్రీ పెద్దిభొట్లుగారు రఘువంశపు వ్యాఖ్యానంలో వుదాహరించిన జాబితానుసరించి "గృహలక్ష్మి" పత్రికలో వుదాహరించాను. అవికావని వొకసోదరీమణి యింకోవిధమైన జాబితా కనపఱచినది. ఆజాబితాలోగాని యీజాబితాలోగాని యీ అసత్యవాద చాతుర్యాన్ని కళలలో పెద్దలు చేర్చినట్టులేదు. నాకుమాత్రం దీన్ని చేరిస్తే బాగుండునని వుంది. దీన్నికూడా చేరిస్తే చతుష్షష్టి "పంచషష్టి" గా మారవలసి వస్తుంది. లేదా? పూర్వపుజాబితాలో దేన్నో వొకదాన్ని వూడబెఱికి ఆపోష్టు దీనికిస్తే యేచిక్కూ వుండదనుకుంటాను. యిపుడు చాలామంది వుద్యోగప్రదాతలు తమకు ఆవశ్యకమైనవాడి కేదేనావుద్యోగం యివ్వవలసివస్తే యీమోస్తరుగానే చేస్తూన్నట్టు వినికి. లేదా? ప్రసిద్ధగ్రహాలురవ్యాదులు తొమ్మిదిమాత్రమే అయినా కొందఱు విద్వాంసులు వారివారి అనుభవాన్ని పురస్కరించుకొని ఆయాగ్రహలక్షణాలు అల్లుళ్ళయందుకూడా వున్నట్టు కనిపెట్టి అల్లుణ్ణి ఆజాబితాలో యిరికించారు.

"శ్లో. తృతీయైకాదశే దృష్టిః కన్యారాశిస్థితిః పునః
సదా వక్రగతి శ్చేతి జామాతా దశమో గ్రహః."

యిది తెలుగులాగే బోధపడుతుంది గాని కొంచెం సంప్రదాయం మాత్రం తెలపాలి. రాసులు పన్నెండు. అందులో తృతీయం మిథునం, ఏకాదశం కుంభం. ఆరాసులయందు దృష్టి కలిగివుంటుంది ప్రకృతగ్రహం. అసలు సుప్రసిద్ధగ్రహాలకు వేట్లకీ యీసంఖ్యగల రాసులయందు దృష్టి వున్నట్టు జ్యోతిశ్శాస్త్రం చెప్పదు. వొక్కశనిగ్రహానికిమాత్రం విశేషదృష్టిని చెపుతూ తృతీయదృష్టిని చెప్పివున్నారు. (అట్టిశనిదృష్టినే జామాతకు చెప్పడంచేత తత్తుల్యత్వం ధ్వనితం) సప్తమదృష్టి యావద్గ్రహాలకూ సామాన్యం. చతుర్థాష్టమస్థానదృష్టి కుజుడికి విశేషదృష్టి. తక్కిన పదాలకు వ్యాఖ్యానం అక్కరలేదు. కొన్ని గ్రహాలకు యేదోకారణాన్ని పుర

స్కరించుకొని వక్రగతి రావడం వుంది. కాని రాహుకేతువులకుమాత్రం యెప్పుడూ వక్రిగమనమే. ఆయీగుణం జామాతృగ్రహానికికూడా పూర్తిగాపట్టింది. యింకా దీనికి వ్రాయవలసిన వ్యాఖ్యానం "శ్లో. రాహో: కన్యాగృహం ప్రోక్తం రాహూచ్చే ర్మిధునమ్" వగయిరా శిష్టసంప్రదాయాలనుబట్టింది చాలా వుందిగాని ప్రస్తుతవ్యాసం అసత్యాన్ని బహూకరించే నిమిత్తంగదా? ప్రవర్తిస్తూవుంది అందుచేత ప్రస్తుతం ఆందుకుంటాను. పూర్వులు చతుష్షష్టికళలలో అసత్యచాతుర్యానికి తావివ్వక పోయినా దానియందువున్న క్వాలిఫికేషన్నుబట్టి మనంస్థానాన్ని కల్పిస్తే అందఱూ కాకపోయినా కొందఱేనా ఆమోదించి తీరతారన్నది వక్తవ్యాంశం. మఱిచాను, దీనికి కళలలోస్థానం సంపాదిస్తే వచ్చేది యింకో లాభంవుంది. యేవిధమైన తెల్వితేటలుగాని గానంగాని గీనంగాని కళగాని గిళగాని లేని వేశ్యాపుత్రికలను (కేశవనామాలుకూడా రానివాణ్ణి బ్రాహ్మణ పదంతో వ్యవహరించినట్లే అనుకోండి) కళావంతురాండ్రుఅంటూ వ్యవహరించడం పూర్వకాలంలో అంతగా లేదుగాని యిప్పటి కొత్తనాగరికతలో పూర్వంవాడుకొనే పేరునచ్చక యీ కళావచ్ఛబ్దాన్ని స్త్రీపుంలింగాల్లో తఱచుగావాడడం పత్రికలలోనేకాదు వారివారివాక్కులలోకూడా కనపడుతుంది. యీ అనృతవాదచాతుర్యానికి కళలలో స్థానంసంపాదిస్తే అజాతివారు (అవృత్తిలో వున్నవారుమాత్రమే అనుకోండి) నేతిబీరకాయలుకాక దీనిద్వారా (యితరపాండిత్యంలేని లెక్కలలో నేర్పుగలవారు సంఖ్యావచ్ఛబ్దాన్ని ధరించి సమన్వయించుకొన్నట్టే) సార్థకనామం గలవాళ్ళవుతారని నాకుతోస్తుంది. వేదందగ్గఱనుంచి గొల్లసుద్దులదాకా గౌరవం యివ్వడం సత్యానికే కాని అది నేర్పుతో చేయవలసిన పనికాదు. నేర్పేమో? యావత్తూ అసత్యాన్ని ఆశ్రయించివుంది. సత్యం యిల్లాలువంటిది. అసత్యం వేశ్యవంటిది. పుణ్యపాపాలా? యిక్కడ మనకుకావలసింది తెల్వితేటలా? "వేఱురీతుల దానిసంసారి యనరె?" అని శ్రవణానందంలో యెందుకు వ్రాయవలసివచ్చింది? సంసారస్త్రీ వేషభాషాదులలో

సానివలెవుంటే సంసారులు గర్హించినట్లే సాని సంసారివేషంతోవుంటే సానులున్నూ గర్హిస్తారని వేఱే చెప్పనక్కరలేదు. బుద్ధుడు యెవరో మునులను వొకప్రశ్న వేశాడు. వారు యిచ్చినజవాబు (బుద్ధచరిత్రలో వుంది) చూచుకోండి. యితరవిషయాలకేమి? అసత్యం చాలాతెలివితేట లకుగుఱుతు. దీనిలో యీకాలంలో చాలానేర్పరులు వున్నారని ఇటీవలి చర్యలో వొకపద్యం వ్రాశాను. దాన్ని వుదాహరిస్తాను.

"క. ఉన్నా రసత్యరచనలు
పన్నంగలవారు బట్టబయట నెదురుగా
నున్నట్టి విషయములలో
బన్నంగలవారు కంటబడ లే దెందున్."

సత్యం తెలివితక్కువకు గుఱుతు. సూర్యచంద్రాదుల దగ్గిఱనుంచీ సత్యాన్ని ఆశ్రయించే వున్నాయనీ, ఆఖరికి భగవంతుడుకూడా (1) (భవిష్యతి కలౌ సత్యవ్రతరూపీ జనార్దనః) అనీన్నీ (2) సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యిత్యాదులన్నీ సత్యానికే యెక్కువయోగ్యతను ఆపాదిస్తాయనీన్నీ యెఱుగుదును. పాండవవిజయం వగైరాలనాఁటికి యింకా యీఅసత్యమందు నాకు యింతమహత్తు వుందని తెలియనే తెలియదు. తెలిసేవుంటే సత్యాన్ని వుద్దేశించి—

చ. బ్రతికిననాల్గునాళ్ళు ఋతవాది యుధిష్ఠిరుడన్న మేటికీ
ర్తి గలవాడనై ధరజరించి తుదిన్నృపకోటిమెచ్చ దు
ర్గతి గనకుండ స్వర్గమున గాపురముండదలంచు నాకు నీ
యతుకొనరించితే? కటకటా? యదునందను పేరుమీదుగన్.

అంటూ వ్రాయడం తటస్థిస్తుందా? యిక్కడ యింకోవిశేషం. అదినాటకసంప్రదాయాన్ని అనుసరించిచేసిందికాని అసలుభారతంలో వున్న ధర్మరాజు యీలాటివాడు కాడుపాపం. అతడికి "లా" బాగా తెలుసును. అవసరమైతే అసత్యమాడడానికీ సంశయించేవాడుకాడు. తరువాత దాని

వల్ల వచ్చే పాపాన్ని నివారించుకోవలసివస్తే యేఆశ్వమేధమో? గోమేధమో? చేసుకోవచ్చునని శ్రీకృష్ణభగవానుడు చెప్పకుండానే అయా ఆప ద్ధర్మశాస్త్రాలన్నీ (శ్రీ బుల్సు పాపయ్యశాస్త్రుల్లుగారిలాగ) ధర్మరాజుకు వాచోవిధేయాలే. పుస్తకాపేక్ష లేనేలేదు. వొకవేళ ధర్మరాజు శ్రీకృష్ణ భగవానుడు ప్రోత్సహించినప్పుడు ద్రోణవధవిషయంలో "అశ్వత్థామా హతః కుంజరః" అనే అసత్యాన్ని ఆదేసందర్భములో "యింతపాపిష్ఠపు కూత" యేలాఆడేది? యిది ఆడి ద్రోణాచార్యుల్ని చంపినమరునాడో మూడోనాడో? యుద్ధంలో చావు తటస్థించేయెడల పావనివారకమైన అశ్వ మేధం చేయడమే తటస్థించదుకదా? అపక్షంలో (వాపక్షంగానే అను కుందాం) యీపాపం మూటకట్టుకు పరలోకానికి వెళ్ళవలసివస్తే గతే మిటి? అని తిరగబడి గట్టిగా ప్రశ్నిస్తే కృష్ణమూర్తి యేంజవాబు చెపు తాడో? అని నాలో నేను చర్చించుకున్నాను. అప్పుడు యీసామెత స్ఫురించినది.

"పిల్లినిచంపినపాపం మీది. బియ్యమియ్యనిపాపం మాది." దీనికి సబంధించిన యితిహాసం చాలామంది యెఱిగిందే. అయినా టూకీగా వుటంకిస్తాను. వ్రాయబోయేకథ కోమట్లనుగూర్చి వుంటుంది............

---

# స్త్రీల స్థితిగతులు

( 1—9—1948 సం॥ర ఆంధ్రవీక్లీనుండి )

వీట్లనిగుఱించి సవిమర్శంగా వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి పురాణకాలంనాటి వొక గాధను బట్టి చూస్తే అప్పటి స్త్రీలకన్న ఇప్పటి స్త్రీలే కొంత అదృష్టం పెట్టి పుట్టినట్లు అవగత మవుతుంది.

భారతంలో వున్న జరత్కారు ముని పితృదేవతల కోర్కె ననుసరించి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాక యేవో కొన్ని వత్సరాలు, కాదు కాదు, కొన్నిమాసాలే జరిగాక వొకానొకరోజు అపరాహ్ణ (సుమారు నాల్గు గంటల వేళ) కాలమందు భార్యతొడ తలదిండుగా చేసుకొని నిద్రిస్తూ వుండగా అంతలో సాయంసంధ్యాసమయం ఆసన్నమయింది. అప్పుడు ఆ యిల్లాలికి యెటూ తోచక పచ్చి వెలక్కాయ గొంతుక బడ్డట్టయింది. యేం జేస్తుంది పాపం ?

"నిదుర లేపిన భర్తకు నెదురుసేత
లేపకుండినచో కర్మలోప మొదవు;
కర్మలోపమ్ము సల్పుటకన్న భర్త
కెదురుసేతయె లగ్గని యెంచి యింతి"

"వెనక్కి వెడితే నుయ్యి; ముందుకు వెడితే గొయ్యి" గా వున్న ఆ సంకటంలో, ఆ శ్రోత్రియురాలు కర్మలోపభయంచేత మెల్లగా "సంధ్యాకాలం; సంధ్యాకాల" మంటూ భర్తను లేపింది పాపం. అంత మాత్రంతో ఆ నిష్కారణకోపి "ఔరౌరా! నన్ను లేపి నిద్రాభంగం చేస్తావా ? నీ కింత స్వాతంత్ర్యమా ?" "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి". ఇట్టినీతో నాకు పొత్తు కుదరదు. నా సంధ్యాకాలపు అర్ఘ్యాన్ని స్వీకరించకుండా వొక్క అంగుళమేనా అతిక్రమించడానికి సూర్యుడికిమాత్రం యెన్నివేల గుండెలున్నాయి ?" అంటూ లేచి ప్రయాణం కట్టడం చూచి ఆ యిల్లాలు వివాహకాలంనాడు తనసోదరుడికీ భర్తకీ జరిగిన సమయం (అపత్యం కలిగే వఱకు) మెల్లిగా జ్ఞాపకం చేసింది. భర్త "అస్తి" అన్నాడు. ఆయీ సూత్రానికి రహస్యార్థం "నీకు గర్భం అయివుంది. నీ అన్నకూ నాకూ ఆదికాలం జరిగిన సమయం (కంట్రాక్టు) చెల్లించినట్లయింది, యిదిగో, నే వెడుతూన్నాను" అని "లేడికి లేచిందే ప్రయాణం" గా చక్కా ముక్కుకు సూటిగా పోయాడు. ఆ యిల్లాలికి భర్తప్రకృతి తెలుసును గనక ప్రయోజనం వుండ దని కాళ్ళా వేళ్ళా బడి బతిమాలడం

వగయిరా ఆచారాలు జరపలేదు. ఆమెకు జనించిన కొడుకే ఆస్తీకుడు. యీపేరు ఆస్తికుడుగా కొన్ని పురాణాలలోవుంది. యతించిద్వేనానికేం? “అస్తి” అనే అసధాతురూపంచేత సూచింపబడ్డవాడు గనక ఆపేరు అతనికి సార్థకమయిం దన్నమాట.

ఈయన పుట్టుకతోనే ఋషి. యావజ్జీవమూ బ్రహ్మచారిగానే (పరశురామాదులవలె) జీవితం గడుపుదామని నిశ్చయించుకున్నాడు. ఆ యీ నిశ్చయం పితృదేవతలు సాగనిచ్చారు కారు. వారికోర్కె తిరస్క రింపనేరక యేదో హిరణ్యాక్షవరం అడ్డుపెట్టి తుదకి గృహస్థాశ్రమంలో ప్రవేశించాడు. “ప్రజాయై గృహమేధినాం” గనుక సంతానసూచన కావడంతోటట్టే యేదో వంకపెట్టి, “యదహరేవ విరజేత్” అనే శ్రుతి ననుసరించి యతిగా తయారైనాడు.

అంతా బాగానే వుంది. కర్మప్రధానమైన గృహస్థాశ్రమంలో వున్న యీ శ్రోత్రియుడు (జరత్కారు) సర్వథా నిషిద్ధమైన దివాస్వాపం (పగటినిద్ర) యేలా అంగీకరించాడు? అందులోనూ భార్యతొడమీద తలపెట్టి పరుండడ మనేది. యిదంతా గవడగొయ్యగా కనపడుతూవుంది. తన తపస్సు కర్మసాక్షినికూడా భయపెట్టేటంత ఘోర్సు కలదిగదా? అట్టి తపస్వి యిట్టి అనుచితం చేయవచ్చునా? అని యెవరేనా విమర్శిస్తే కర్మఠులు యేలా సమర్థిస్తారో? తప్పులు చేయడం యుక్తమనుకుంటాను. ప్రకృతకాలంలో ఆయీ జరత్కారుముని వంటి ముక్కోపి గృహస్థులు వెదికితే అక్కడక్కడ కనపడకపోరు గాని వారికి ఆయీ ముక్కోపి తనం తప్ప తక్కిన సుగుణా లుండవు. నా చిన్నతనంనాటికి గిరజాల జుట్లూ, తివాసీ కత్తిరింపులూ మాత్రం వుండేవిగాని క్రాఫింగులు లేవు. క్రొత్తలో ఒక కుఱ్ఱవాడు గిరజాలు పెట్టించుకున్నాడు. శిరస్సు యావత్తూ పొడుగాటి కత్తిరింపు కాకపక్షాలతోటీ నడినెత్తి పాపిటితో అలంకరించడం గిరజాల మర్యాద. యిది రాజులలో తప్ప యితరులలో మృగ్యం. కాను

కూడ దని యెవడేనా శరించి ఆయీ గిరజాలు వుంచుకుంటే, చాలా తప్పుగా పరిగణించేవారు.

రాజులలో యీ గిరజాలు విన్నా నేడూ వచ్చినట్లు తోచదు. వాల్మీకి రాముణ్ణి "కాకపక్షధరం" అనే విశేషణంతో వర్ణిస్తూ వుంటాడు. రాజులకు ముఖ్యచిహ్నమైన యీ కాకపక్ష (కాకిరెక్కలు) చిహ్నాన్ని యెవరి పిల్లవాడో పెట్టించుకొనేటప్పటికి యింకొకడు ఆక్షేపించాడు. దానికి వాడు "కావలిస్తే విజయనగరం మహారాజులుంగారి నడుగు" అని జవాబుచెప్పేటప్పటికి యింకొకడు ఆ జవాబు విని "వోరి వెఱ్ఱివాడా విజయనగరం మహారాజులుం గారిమాదిరి జుట్టు అణాకో, అర్ధణాకో వచ్చేది కనక పెట్టుకోకలిగావు. ఆయనకు ముప్పయి లక్షలు రాదగిన యెస్టేటు వుంది. దానిమాట యేం చెపుతావు?" అని ప్రశ్నించాడు. దానితో ఆ "గిరజాల యువకుడు" నిరుత్తరు డైనాడు.

ప్రాకృతం జరత్కారుమునికంటే గాని, అంతకు అధికంగానేగాని పెళ్ళామ్మీద అథార్టీ లేదా! అధికారం అమలుపఱచడం సుళువేకాని ఆయనకు వున్న తపశ్శక్తి రమ్మంటే వస్తుందా? యీ దాంపత్యంవంటి దాంపత్యాలు యిప్పుడే కాదు, పూర్వమూ వుండేవన్నందుకు ఆయీ భారతగాథ మనకు బోధకం. పౌరాణికుడు ఆయీ భాగం చదివి వ్యాఖ్యానం చేస్తూ వుంటే అతడు తపస్వి కావడంచేత యెవళ్ళూ తిట్టరేమోగాని, ఆలాగే కాకపోతే (ఆవిడ మొగం చూచి వూరుకుంటే యేమో గాని, తిట్టడమేకాదు "శుద్ధన్నాం" కూడా జరిగే తీరుతుం దంటాను. అయితే ఆ ముక్కోపి, దురహంకారి, నిర్హేతుకకోపి. ఆ సభలో లేడుగదా; వినండి. ఆ పౌరాణికుడికే అభేదబుద్ధ్యా అట్టి మర్యాద జరిగితీరుతుంది. "జేండ్రిహాస్యం"చెప్పే పగటివేషగాండ్లు ఆ కులస్థులు విస్తరించివున్న వూళ్ళల్లో ఆవేషం కట్టరు. కొందఱు ఆకులస్తులు "అయ్యా! మాకేం యిబ్బంది లేదు. మాజాతి వేషం కూడా కట్టి గ్రామస్థులను సంతోషపెట్టండి" అని కోరి ఆ వేషం కట్టించి తరవాత కోపం ఆవుకోలేక, కొట్టడానికి తయారైనట్లు వినడం,

అయినా జరత్కారుని చర్య సర్వధా హేయంగా కనపడడంచేత యే "సంపన్నగృహస్థున్నూ" ఆమోదించడు. ఆమోదించడుకాదు, ఆమోదింపజాలడు. ఒకవేళ ఆమోదిస్తేనో, వాడూ వీడివంటివాడే కనక వాణ్ణి "నాన్సెన్సు" గా నాగరికులు పరిగణించి మందలించాలి. ఆకాలంలో పెద్దలేనా అతణ్ణి గాఢంగా మందలించే వుంటారు. కాని ఆ మందలింపు గ్రంథస్థంగా గోచరించక పోవడాని క్కారణం, ఆ కథ అక్కడ వుదాహరించడం గృహస్థాశ్రమ స్వీకారం చేయకపోతే పితృదేవతలు దుఃఖిస్తారు కనక ప్రతివాడూ " ఆదిని బ్రహ్మచర్యమూ, అనంతరమందు గృహస్థధర్మము. ......" "ఆశ్రమాదాశ్రమం గచ్ఛేత్. " అయినా శాసనాలను వుల్లంఘించరాదని బోధించడానికే కాని వేఱుకాదు. గృహస్థాశ్రమం అన్ని ఆశ్రమాలకన్నా మిన్న అని మన గ్రంథాలు ఘోషిస్తూ వున్నాయి. " తస్మాజ్జ్యేష్ఠాశ్రమీ గృహీ ".

క్రమంగా ఆశ్రమచతుష్టయాన్ని అవలంబించడంలో ప్రమాదం లేదుగాని, చిన్నతనంలోనే తుర్యాశ్రమం అవలంబిస్తే అది ఉభయతో భ్రష్టుణ్ణి చేసితీరుతుంది. యెవడో ఒకడు పతితుడు కాకుండా నెగ్గినప్పటికీ అది గణనీయం కాదు. "న హ్యేకం లక్ష్యం యోగారంభం ప్రయోజయతి ". విషయాంతర మేతత్.

స్త్రీల స్థితిగతులు భారతకాలానికి పూర్వం యేవిధంగా వుండేవో జరత్కారుడుగారి చరిత్ర వల్ల కొంత మనకు గోచరిస్తుంది. పురుషుడు చేసే తప్పులను దేవతలుకూడా సమ్మతించి వూరుకుంటారనిన్నీ స్త్రీలు చేసే తప్పులను దేవతల మాటకేం, భర్తలే క్షమించేటట్టులేరనిన్నీ అయినా జరత్కారుని ప్రవర్తన మనకు బోధిస్తూవుంది. ప్రస్తుతగాథలో తప్పు యావత్తూ భర్తదిగాని, భార్యది కాదు. యథార్థ మీవిధంగా వున్నప్పుడు కర్మసాక్షిగా వుండే సూర్యుడేనా సాహసించి కలగ జేసుకొని ప్రత్యక్షం కాకపోతే మానె, పరోక్షం (ఆకాశవాణి) గా నేనా గాఢంగా మందలిస్తే బాగుండేది. కాని. యేకారణంచేతనో అలా జరగలేదు. యిటీవల అయినా గాథలు

చదువుకొని స్త్రీలు క్రమంగా బడితెగి బాగా యెదిరించి మొట్టమొదటికే (విడాకులు) మోసం తేవడానికి సిద్ధపడడం జరిగింది. రేపో నేడో ఆచట్టం కూడా అమల్లోకి వస్తుంది. " మీ పిల్లలు, మా పిల్లలు, మన పిల్లలు " అనే అపహాస్యాస్పదపు గాథ మనమే వినబోతాం.

ఎప్పటికప్పుడు మాత్రం కవులు నిష్పక్షపాతంగానే తమ అభిప్రాయాన్ని బయటబెడుతూనే వున్నారుగాని, ఋషులుమాత్రం వున్నదున్నట్టే గాని అన్యథాగా రచించినట్లు లేదు. చూడండీ, యీ విషయం భవభూతి యెంత బాగా స్ఫురింపజేశాడోను.

"విసృజ శూద్రమునౌ కృపాణమ్;
రామస్య హస్త మసి దుర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే? "

ప్రస్తుతం రాముడు మునిగా వున్న శంబుకుణ్ణి వధిస్తూన్నాడు, యెందుకంటే, వర్ణాశ్రమ ధర్మాన్ని అతిక్రమించిన కారణంచేత, యీధర్మాతిక్రమణాన్ని శిక్షిస్తేనేకాని విప్రసుతుడు జీవించడు. శాంతం పాపం, ఆకాలంలో ఆరీతిని ప్రత్యక్షంగా ధర్మాధర్మాల ఫలితాలు గోచరించేవి కాబోలును. అందులో సహస్రాంశమేనా యీకాలంలో గోచరిస్తే. నైజాం ప్రభువు తన రాష్ట్రంలో జరుగుతూవున్న ధర్మవ్యతి క్రమాన్ని వుపేక్షించగలిగేవాడా? ఆఖరికి ఆ భగవదంశసంభూతుడికినల్లి కుట్టినట్లుకూడా కనపడడంలేదు.

ఆయీ ధర్మవ్యతిక్రమం పురాణాలలో కూడా వున్నట్టే లేదు. (1) హిరణ్యాక్షుడు, (2) హిరణ్యకశిపుడు, (3) రావణుడు, (4) కుంభకర్ణుడు వగైరాలు యిట్టి ధర్మవ్యతిక్రమాన్ని సహించి, బెల్లంగొట్టిన రాయిమాదిరివి వూరుకున్నట్టున్నూ చదవలేదు. వాళ్ళు శివార్చన చేసే భక్తులేకాని పరదారాపహరణం వగయిరా దుష్కార్యాలు కూడా చేసే వారని వాళ్ళ చరిత్రలో గోచరిస్తుంది, యీ సుల్తాను నమాజు చేయడం,

ఆ శివార్చనకు సరిపోతుంది. యీ పాటికేనా తగిన దృష్టాంతం కనపడితే ఆస్తికులకు కొంత భగవత్సహాయంమీద విశ్వాసం వుండేది. లోగడ తులసి, దూలగొండ వగయిరాల గాఢలమాత్రమేనా దృష్టాంతం కనపడడంలేదు.

నా కొకటి తోస్తుంది. భగవంతుడు వున్నాడు. ఆయీ దస్యులు చేసే దుండగాలు పరిశీలిస్తూనే వున్నాడు. ధర్మశాస్త్రాలు తిరగేస్తూనే వున్నాడు కాని వీళ్ళ దుండగాలకి తగ్గ శిక్ష యెంత వెదకినా కనపడడమే లేదు. యెంత కఠినంగా ఘోరంగా శిక్షించినా యీ దుండగులు ఒక రోజు ఒక సాధ్వీమణిని హింసించిన (బలాత్కారించిన) పాపంలో సహస్రాంశానిక్కూడా సరిపోతే, అట్టి శిక్ష, తక్కువ శిక్ష వేసి యేమి? వేయకపోతే యేమి? అని యేమీ తోచక వూరుకున్నాడేమో అని నావుత్ప్రేక్ష. నేనే భగవంతు ణ్ణయితే ఆయీ ఘోరాలను సమ్మతించినట్లే ప్రకటించి వూరుకునేవాణ్ణి. భగవంతుడికే తగిన శిక్ష గోచరించని పక్షంలో వాని సృష్టిలో ఒక పరమాణువూ కూడా కాని సుల్తానుకుమాత్రం గోచరిస్తుందా? దిక్కుమాలిన సంసారాన్ని పోషించడానికి ఒకడు మేకల గొంతుకలు కోస్తే, యింకొకడు మనుష్యుల గొంతుకలు కోస్తూన్నాడు; లేదా కోయిస్తూన్నాడు. వాడికీ తృప్తి కనపడదు. వీడికీ కనపడదు. వాడూ భార్యాపిల్లలతో దోసతోటలాగ అభివృద్ధిగా వున్నాడు, వీడూ వున్నాడు. కరుణ అనేది వాడికీ వుంది, వీడికీ వుంది. అది లేనిపక్షంలో అభివృద్ధి శూన్యం కావాలి. యెందుచేత? యెప్పుడో పెద్దపులి మాదిరిని వీడూ వాడూ చేయక వుపేక్షిస్తారా? యీ ప్రపంచకంలో నాస్తికుని జీవితానికి వున్నంత హాయి ఆస్తికుని జీవితానికి లేదు కాని, నాస్తి అవడం సుఖమైనా, అంతకన్న ఆస్తిఅనడమే తరణోపాయం. యీగాథ ఆస్తిఅనేదానికి సంబంధించినదే.

ఆస్తి అనే క్రియాపదంవల్ల జరత్కారుని కొడుకు ఆస్తికుడు, లేదా ఆస్తీకు డైనాడు (ఈషద్వైషమ్య మవివక్షితం). అతడు తల్లివంక చుట్టాలైన తక్షకాది సర్పరాజులను జనమేజయుని సర్పయాగంలో నశించ

కుండా కాపాడినాడు. యిట్టి యాగమే యిప్పుడు, నైజాం రాష్ట్రంలో జరుగుతూ వుంది. ఆస్తికునివంటి మహానుభావుడు ఆపుచేయాలి.

స్త్రీల స్థితిగతులు పూర్వంకన్న యిప్పుడెంత మార్పు చెందినదీ కూడా దీనివల్ల గోచరిస్తుంది, నన్నడిగితే అందరికీ స్వాతంత్ర్యం వుండడం అపేక్షణీయమని అంగీకరిస్తానుగాని, జరత్కారునివంటి భర్త (ప్రారబ్ధతః) తటస్థించిన సాధ్వీజీవితంమాత్రం చాలా దుర్భరమే అంటాను. ఆపె పాతివ్రత్యానికి పరలోకంలో ఫలితం వుండకపోదుగాని ఆపె భర్తను లోకం దూషించి తీరుతుం దనే చెప్తాను.

ప్రస్తుతవిషయంలో హిందూగృహస్థులలో నూటికి 90 మంది "జరత్కారులే". అయీ జరత్కారువుగారి చర్య యించుమించు, రజాకారుని చర్యతో పోల్చవచ్చునేమో ? భార్య విషయంలో బొత్తిగా అనుచితంగా వర్తించి నంతమాత్రంచేత ఆ మహానుభావుణ్ణి అంత తేలికచూపు చూడడం యుక్తంకాదు కనక, గౌరవంగానే చూద్దాం. యిక యెన్నాళ్ళు ? బిల్లు ప్యాసు కాబోతూ వుంది. పీర్లు గుండాన్ని బడతాయి. స్త్రీల స్థితిగతులు ఆ బిల్లువల్ల తిన్నబడతాయని నేటివా రభిప్రాయపడుతూ వున్నారు. నాకు మాత్రం ఆ త్రోవా నచ్చడంలేదు, యిప్పటివారి త్రోవా నచ్చడం లేదు. జరత్కారునివంటి భర్తలను మందలించడం మట్టుకు ఆరంభమయితే యితరులకు బుద్ధివచ్చి కొందఱు గృహిణుల స్థితిగతులు తిన్నబడతాయనిన్నీ, పిమ్మటిసంగతి పిమ్మట చూచుకోవచ్చు ననిన్నీ వుంది. "సహసా విదధీత న క్రియామ్."

---

# అ ను న యం

( 23–4–1938 సం॥ర కృష్ణాపత్రికనుండి )

చెపితేమాత్రం వింటుందా కోడలు? అందుచేత చెప్పడం యెందుకు? వినకేం, బుద్ధిమంతురాలే అయితే అత్తగారు మంచిదికాకపోయినా కోడలు వినే తీరుతుంది. అందులోవున్న కష్టసుఖాలు యెఱిఁగే చెపుతూం డను కుంటుంది. తండ్రి సిగరెట్లు పీలుస్తూనే వుంటాఁడు; కొడుక్కి బుద్ధిచెపు తూనే వుంటాఁడు. యెక్కడో కాని యెదిరించడమంటూ వుండదు. అందు చేత యిందులో కలిగించుకోవడానికి అంతగా నాకు సంశయించవలసి వుండదనుకుంటాను. ఇంకొకటి. నన్ను లోకం యెంత కలహప్రియుణ్ణిగా యెఱుఁగునో, అంతకు అంతా శాంతిప్రియుణ్ణిగాకూడా యెఱిఁగి వుంటుం దని నానమ్మకం. ఆ నమ్మకను పురస్కరించు కొనియ్యేవే బొత్తిగా అస మర్థస్థితిలోవున్న నేను వ్రాయలేక వ్రాయలేక యేలాగో యీనాలుగు మాటలూ వ్రాస్తూన్నాను. నేను మళ్ళాయిరవై రోజులనుంచి పూర్తిగా జబ్బుగా వున్నాను. నావ్యాసా లేవేనా ఆంధ్రవారపత్రిక వగయిరాలలో వస్తూవున్నా అవి నేనుయిదివఱలోనేవ్రాసి పంపినబాపతుగాని యిప్పటివి కావు. వాట్లనే వారు మహమ్మదుగారి గెడ్డంలో వెంట్రుకలలాగు దాఁచి పెట్టి అవకాశంవెంబడిని అప్పుడప్పుడు ప్రచురిస్తూ వుంటారు. (నన్ను జవాబిమ్మని వ్రాసేమిత్రులు ఆయీమాటలు బాగా గమనించాలి) కాఁబట్టి వాట్లను బట్టి నా ఆరోగ్యాన్ని నిర్ణయించుకోవద్దని లోకులకు నా మనవి.

ఇంతగా దీన్నిగూర్చి యెందుకు యీ వ్యాసంలో అప్రస్తుతంగా వ్రాస్తూన్నానంటే, యెందరో వారిలో వారు విద్యావిషయంలో వాదాలు పెట్టుకొనిన్నీ పుస్తకాలు రచించిన్నీ ఆయావిషయమై నాకు వ్రాసేవుత్త రాలకు యీమధ్య జవాబే యివ్వలేకుండా వున్నాను. అట్టిస్థితిలో యీ దీర్ఘ వ్యాసం లోకానికి విడ్డూరంగా తోచక మానదు. నేను యేమాత్రం వోపిక వున్నా యేదో వ్రాస్తూనే వుంటాను. అందులోనున్నూ నాకు కవిత్వ

రచన అనారోగ్యస్థితిలోనే యెక్కువగా దొర్లుతుంది. ఈసంగతి అనేకు లెఱుఁగుదురు.

ఇప్పుడు నాఆరోగ్యం యేమాత్రం వీలుగావున్నా, బెజవాడలో రేపళ్లుట జరుగబోవు శ్రీ విస్సా అప్పారావుపంతులుగారి కుమారునికి కాబోయే వివాహానికి అవశ్యంగా వెళ్ళవలసివుంది. ఆయన నాకు మిత్రులనేకారణంచేతనే కాదు యీఆవశ్యకత్వం. ఆయనకు కోడలు కాబోయే శ్రీమతి నాముఖ్యశిష్యులలో వొకరైన వేటూరి ప్రభాకరశాస్త్రి కొమార్తె. ఈరెండుహేతువులుమాత్రమే చాలవు. నేను వెళ్ళవలసి వుండడానికి అసలు కారణం వేఱే వుంది. అప్పారావుగారు విద్యావయోవృద్ధు. పూర్వాచార పరాయణుఁడు. వేదశాస్త్రాలు చదువుకోకపోయినా చదివినది హూణ విద్యే అయినా వాట్లను "నాన్సెన్సు" అని "తోసి రా" జనేవాడు కాఁడు. స్వచ్ఛమైన ఆర్వేల నియోగి. ఇంకా యీయన్నిగూర్చి వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి. అది పొగడ్తగా లోకం భావిస్తుంది. యిఁక నా శిష్యుణ్ణిగూర్చి వ్రాయాలి. అందుకు బొత్తిగా నా కధికారం లేదు. స్వచ్ఛమైన వెలనాఁటి బ్రాహ్మఁడు అనిమాత్రం వ్రాసి వూరుకుంటాను. నెలకు రమారమి 1000 రూపాయీలదాఁకా జీతం పుచ్చుకుంటూ గవర్నమెంటు కాలేజీలకు ప్రిన్సిపాల్ పదవిని సమర్ధిస్తూ వున్న అప్పారావుగారితో బీదలలో నొకఁడైన ప్రభాకరశాస్త్రికి వియ్యమందడానికి తగ్గ అధికారం స్థూలదృష్టిని విచారిస్తే కనపడదు. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" వ్రాస్తే చాలా వ్రాయాలి. వోపికనాస్తి. యిక్కడ ముఖ్యముగా గమనించ తగ్గది నియోగి వైదికులు పూర్వాచార పరాయణులు లేనిపోని అశాస్త్రీయ సంస్కారాలకు వొప్పనివారు వియ్యమందుతూ వున్నారన్నదియ్యే వే.

నన్ను ఆహ్వానించడానికి పదిరోజులనాఁడు వియ్యంకులిద్దఱూ వచ్చారు, ఆహ్వానించారు, వెళ్ళారు. తరువాత పెద్దలు మా మామగారన్నారు కదా? "అన్నా! మన ప్రభాకరం యెంత సాహసం చేశాఁడూ?" అన్నారు.

యేమిటన్నాను. నియోగులతో సంబంధం చేస్తున్నారన్నాడు. చేయ కూడదా ? అన్నాను. చేయకూడదకేంగాని అంటూ నిశ్శబ్దమిలి పూరు కున్నారు. వారు పండితులైతే కారుగాని పూర్తిగా పూర్వాచారపరాయ ణులు. పండితులైనా నిశ్శబ్దమిలి వూరుకోవలసిందేగాని యీ విషయం అంతకంటె చేయవలసినదేదీ వున్నదికాదు. వైదీకులకీ నియోగులకీగాని, స్మార్తులకీ వైష్ణవులకీగాని, వైష్ణవులకీ మాధ్వులకీగాని, యింతా ఇదేమా దిరిని పంచద్రావిడంలో ఒక్క ఘూర్జరులను మినహాయించి తక్కిన నాలుగుతెగలలో వుండే యావత్తు బ్రాహ్మణావాంతరశాఖలవారికీ పుంస ప్రాప్తు (పెళ్ళి) లేశమున్నూ శాస్త్రదూష్యంకాదు. అందుచేత పండితులు వొప్పుకుంటారు. దశవిధ బ్రాహ్మణులలో అంటే :

శ్లో. ఆంధ్ర ద్రవిడ కర్ణాటా మరాటా ఘూర్జరా స్తథా
సారస్వతాః కాన్యకుబ్జా గౌడా ఉత్కల మైథిలాః.

అనేవారిలో మొదటి అయిదుగురిలోనున్నూ ఘూర్జరులను మినహా యించడాని క్కారణ మేమిటంటే వారి స్త్రీలు వ్యక్తులైన తరువాత కూడా లంగాలు కట్టడం మానరనే కారణంచేత పూర్వులు వారితో పంక్తి భోజనం కూడా నిషేధించినట్టు మా పరమగురువులు చెప్పగా విన్నాను. కాని పంక్తిభోజనం జరగడం శ్రీకాకుళంలో చూచిన్నీ వున్నాను. గౌడు లు అయిదుగురున్నూ మత్స్యభుక్కులు కనక వారికీ వీరికీ అనాదిగా సంబంధ బాంధవ్యాలు లేవు. తదితర బ్రాహ్మలలో సార్వత్రికంగా కాకపోయినా క్వాచిత్కంగా వివాహాలు జరుగుతూనే వున్నాయి. ఆ యీ వివాహాలు లోగడ జరిగినవి ప్రత్యేకించి వివరించవలసి వస్తే వ్యాసం చాలా పెరుగు తుంది. అందుచేత నియోగులూ వైదీకులూ వియ్యమందడంలో శాస్త్ర దూష్యమేమీ లేదని మాత్రం వ్రాసి వూరుకుంటాను. లేకపోయినా యెవరూ చొరవ చేయలేక ప్రచారంలోకి తీసుకురాకుండా వున్నరోజుల్లో ప్రాజ్ఞులైన వీరిద్దరూ మార్గదర్శకులై వుభయశాఖలవారికీ బోధించినం దుకు ఆపెళ్ళిసభలో కూర్చుని (లేవడానికి వోపికలేక) తోచినమాటలు

వుపన్యసించి అభినందించి ఆశీర్వచించాలని బోలెడు కుతూహలమైతే వుంది. అయితేమాత్రం యేం చేసేది ?

"కూచుండి కూడాండలేదు, వంగుండి తీర్థం వెడుతుందట" అన్నట్టుంది నా ప్రస్తుతస్థితి. అందుచేత యీ వివాహానికి వెళ్ళలేకపోయాను. అయితే యీ వివాహం "శారదాబిల్లు" వివాహంకదా ! నీకు అభినందనీయమేనా అని అంటారేమో ? అది నాకు సమ్మతంలోది కాకపోయినా "దెబ్బకు దెయ్యం జంకుతుంది" అనేమాదిరిది కవక నాకే కాదు సాక్షాత్తూ బ్రహ్మదేవుడువంటి కర్మఠులక్కూడా యీకాలంలో అభినందనీయమే. రాజశాసనం పూర్తిగా బిగిసింది కదా ! అయినా నేను అభినందించే విషయం భిన్నశాఖలవారి వియ్యమే. కావి అది కాదు కూడాను ప్రస్తుతం.

ఈ అభినందనవిషయానికి యీవ్యాసం మొదటపుట్టలేదు. యెందుకు పుట్టిందో యింకా వక మాటకూడా దాన్ని సూచించేది పడనే లేదు. నా ఆరోగ్యలోపాన్ని తెల్పడానికే యింత చాదస్తం వెళ్ళబోశాను. దీనివల్ల నాకు కలిగేలాభం లోకులు నేనెందుకు వారి వారికి ప్రత్యుత్తరం వ్రాయడంలేదో తెలుసుకోవడమే. కాని దైవాత్తూ వివాహవిషయం కావడంచేతనే వ్రాసేదానికి యిది మంగళార్థం వుపయోగించి నా వుద్యమాన్ని ఫలింపచేస్తుం దనుకుంటాను. యింతటి అసమర్థస్థితిలో వుండి శాంతిని కోరుతూ యీవ్యాసం పడుకొ్కని వ్రాస్తూన్నా నన్నది ఫలితార్థం. దీన్నిబట్టి యిది యెంతో ఆవశ్యక మనేవిషయం ధ్వనిత మవుతుంది.

యెవరినిగురించింది యీ శాంతిబోధ అంటే పోట్లాడడానికి సిద్ధంగా వున్నవారినిగూర్చి. వారెవరు ? వొకరు సుప్రసిద్ధతరులు నారాయణదాసుగారు, రెండు సుప్రసిద్ధులు నాగభూషణంగారు. వీరిద్దఱినీగూర్చి ప్రపంచం బాగా యెఱుగును. వుభయులున్నూ నానావిద్యలలో ప్రవీణులు. కాని ప్రస్తుతం వీరికి సంబంధించిన వివాద, గానవిద్యకు సంబంధించింది.

దాసుగారు మహాగాయకులే అయినా హరికథకులై పేరు ప్రతిష్ఠలను ఆర్జించి వున్నారు. యిది శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారు వేద శాస్త్ర కవిత్వ గాన ముఖ్యవిద్యలలో వుత్కృష్టులైవుండిన్నీ పౌరాణికులై కవులయి పేరు ప్రతిష్ఠలను ఆర్జించడం వంటిది. లేదా, శ్రీ బులుసు పాపయ్యశాస్త్రుల్లుగారు వేద శాస్త్రాలు చక్కఁగా వ్యాసంగం చేసినవారే అయిన్నీ వేదార్థం చెప్పడంమాత్రంవల్ల పేరుప్రతిష్ఠలు ఆర్జించడం వంటిదేనా అనుకోవాలి. భూలోకబ్రహ్మగావున్న పాపయ్యశాస్త్రుల్లుగారిని కొందఱు కేవలంవ్యాకరణ శాస్త్రంలో బాగా కుస్తీపట్లు పట్టేవారు "చిల్లరదుకాణం" అని యీసడించడం వుండేదఁట! నారాయణదాసుగారిని యెవరేనా యీసడించే యెడల అదిన్నీ యీలాటిదే.

మేము శ్రీ విజయనగరం మహారాజావారి దర్శనానికి వెళ్ళినప్పుడు నేను శ్రీ కట్టు సూరన్నగారి (వైణికులు) గానపాఠశాలకు తఱచు వెడుతూ వుండేవాణ్ణి. వొకరోజున నారాయణదాసుగారున్నూ వచ్చారు. సూరన్న గారికిన్నీ దాసుగారికిన్నీ లలితవసంతలకు భేద మేమిటి అంటూ కొంత ప్రసంగం నడిచింది. క్రమంగా పాకం ముదిరింది. ఆపట్లాన్ని సూరన్న గారు కళ్ళెఱ్ఱచేసి "నీవు సంగీతంలోకి రావద్దు. యిదేం హరికథ కా" దన్నారు. అంతదాఁకా కోపంగానే వాదిస్తూ వున్న దాసుగారు పకాలున వొక్కనవ్వునవ్వి "యేమోయి! నీవేమో సంగీతం జోలికి రావద్దంటా వైతివి, వెంకటశాస్త్రుల్లు కవిత్వం జోలికి రావద్దంటాఁడాయె; వేఱొకరు యింగ్లీషుజోలికి, యింకొకరు మఱోదాని జోలికి రావద్దంటారుగదా? యిఁక నేను యే విద్యజోలికి వెళ్ళాలో నీవే చెప్పు" మన్నారు. యెంతో ధ్వనిప్రధానంగా వున్న ఆవాక్యం నాకు యెంతో సంతోషాన్ని అప్పుడేకాదు, యిప్పటికీ కలిగిస్తూవుంది. "ఏకవిద్యా సురక్షితా" అన్న మాదిరిని వీణనే అభ్యసించినవారు కట్టు సూరన్నగారు. దాసుగారు అప్పటికింకా వీణలో బాగా కృషిచేసి వుండరు. కాని అసలే ప్రవేశంలేనివారుమాత్రం కారనుకుంటాను. ఈసంగతి మన్మథసంవత్సర ఆశ్వయుజములో జరిగింది.

మఱిపధ్ధాలుగేళ్ళకు సౌమ్య సంవత్సరంలో దాసుగారున్నూ మేమున్నూ ఖాసింకోట సంస్థానంలో మీటయినాము. అప్పుడు రాత్రి అంద రము ఒకచే బసలో వుండేవారం. దాసుగారు వీణ "ప్రాక్టీసు" చేస్తూ వుండేవారు. అందుచేత సూరన్నగారితో వాదం జరిగేనాఁటికి విశేషప్రవేశం లేదనుకోవచ్చును. యిటీవల వీణలో కూడా దాసుగారు మంచి ప్రవేశాన్ని సంపాదించే వుందురు. కాని ఆయన్ని వీణ కచ్చేరీ చేయడాని కంటూ ప్రత్యేకించి యెవరూ ఆహ్వానించినట్లు వినలేదు. యీలోపం ఆహ్వానించని వారియందు ఆపాదించడంకంటె దాసుగారి వివిధ విద్యా పరిశ్రమమందే ఆపాదించి "సతు గుణగణానా మవగుణః" అనే మురారివాక్యాన్ని స్మరించుకొని వూరుకోవాలి. వీణకచ్చేరీకి ఆహ్వానించనివారిమీద దాసు గారున్నూ కోపం కనపరచకూడదు. గీరతంలో ప్రత్యేకించి "క. నారా యణదాసనియెడి ధీరు నెఱుంగుదుమకాదె" అని వకపద్యం ఖర్చుపెట్టి వున్న పరమమిత్రుణ్ణి నన్నుకూడా దాసుగారు యేమీ అనకూడదు. (యేమేనా అనేయెడల పడడానికి సిద్ధమే.) దాసుగారికిన్నీ మాతిరపతిశాస్త్రి కిన్నీ బొత్తిగా యెటామొటీగా వుండేది కాని, నాకున్నూ దాసుగారికిన్నీ యెటామొటీ లేశమూలేదు. కాని బొత్తిగా వొకరిని వొకరు వెక్కిరించు కోనివాళ్ళంమాత్రం కాదు. దీన్ని తెలిపే వకముచ్చటమాత్రం యిక్కడ వుదాహరిస్తాను.

వికారి సం॥రంలో ఖాసీంకోటసంస్థానంలో ఒక వివాహం జరిగింది. దానికి తి॥ శా॥ అనారోగ్యంగా వుండి రాలేదు. నేనుమాత్రమే వెళ్లాను. శ్రీ పోలవరం, కిర్లంపూడి, లక్కవరం వగయిరా జమీందార్లున్నూ వచ్చారు. నారాయణదాసుగారు చెప్పిన "వేయునేటికి బంగారు బెంగు ళూరు" అనేపద్యాన్ని యెవరో చదివితే మాజమీందారుగారుఆక్షేపించారు. ఆక్షేపణకు అవకాశం లేనిదాన్ని ఆక్షేపించడంచేత నేను దాన్ని సమర్థిం చాను. జరిగిన వాస్తవ మింతే. దాసుగారితో యెవ రేమి చెప్పారో మరునాడు నా బసకువచ్చి నన్ను "శాస్త్రీజీ! నాకువున్న ప్రజ్ఞలలో దేన్ని

నీవు ఆమోదిస్తా" వని మృదువుగానే ప్రశ్నించారు. అన్నిటినీ ఆమోదిస్తానని నేను యథార్థాన్నే చెప్పాను. దానికి సంతుష్టిపడక యేదో వక దాన్ని నిర్ధారణచేసి చెప్పాలి అంటూ నిర్బంధించి బాధించారు. సుమారు నూఱుసార్లైనా అలాగే చెప్పానుగాని అన్యథా చెప్పలేకపోయాను. తుదకు నాకు విసుగెత్తించి నాచేత "నీకు గానంలో వున్నంత విలక్షణత్వం కవిత్వంలో వున్నట్టు లోకం విశ్వసించదు" అనేమాట అనిపించితీరినారు దాసుగారు. అనిపించి వూరుకున్నారా? లేదు. ఆ పట్టాన్ని దొరికించుకున్నారు. అడ్డమైనమాటలూ అనడానికి ఆరంభించారు. మరేమీ తిట్లూ తిమ్మలూ గావుసుమండీ, నీకు కవిత్వం చేతకాదు, భట్రాజుకవిత్వంనీది, నీకు పాండిత్యమంటే నిండుసున్న, యీ మాదిరిపే అనుకోండి కసితీరే దాకా అన్నారు. యేమీ అనలేను, వూరుకున్నాను. యెందుచేత? ఆయనయందు నాకు మిక్కిలి అభిమానం. తొందరమనిషి అనియెఱుగుదును. యథార్థం కాకపోయినా "నీకు కవిత్వంవల్లనే లోకంలో మంచిపేరు వచ్చింది" అంటే సంతోషించడం జరిగేదేమో. అయితేమాత్రం బుద్ధిపూర్వకంగా అసత్యాన్ని ముఖప్రీతికోసం యెలా ఆడేది? సరే నాకుకోపం తెప్పించలేకపోయారు అప్పటికి. దీనివల్ల లోకం నన్ను కోపం లేనివాడనుకోకూడదు. ఆయన బోళావాడని నావూహ. ఆనాడు మధ్యాహ్నం మళ్ళా తారసపడ్డాం. మళ్ళా "పూర్వేతి పూర్వా" గా ప్రారంభమయింది. అప్పటికి వొళ్ళు మండింది నాకు. సరే, రాత్రి నీ హరికథగదా; అప్పుడు నాశక్తి చూపిస్తానులే అన్నాను. అన్న పేరన్నగారు మాత్రం మావాడి మాటలు మనసులో పెట్టుకోవద్దని ప్రీతిగా నొక్కి నొక్కి నన్ను అనునయించారు. సరే రాత్రి యేదో జరిగిందనుకోండి, ఆ మఱునాడు కలుసుకున్నప్పుడు "శాస్త్రీజీ, మీ శాంతానికి నేను మిమ్ములను మిక్కిలిగా అభినందిస్తూన్నాను" అని పలువురు చూస్తూవుండగా అనీఅనడంలోనే రెండు చేతులూ రెండుచేతులతో కలుపుకున్నాము. స్నేహితులమైనాం అంతటితో.

మఱి రెండేళ్ళకు విజయనగరం యేదో మార్గవశాత్తూ నేనువెళ్ళడం జరిగింది. కలుసుకున్నాం. వకసీసపద్యం శాస్త్రప్రవేశాన్ని సూచించేది చదివి నాకు వినిపించారు దాసుగారు. దానివల్ల తేలేదేమిటంటే: నాడు ఛాసింకోటలో మీరు హరికథాసమయంలో వ్యాకరణతప్పులుగదా పట్టితలం చుకొని పెన్సలూ కాగితమూ చేత పట్టుకు కూర్చున్నారు, యిప్పుడు దానిలోకూడా మీకు దొరికేదిలేదని తెల్పడమే దానితాత్పర్యం. దొరికినా దొరక్కపోయినా అప్పటికి దాసుగారు పాణినీయంలోకూడా తగుమాత్రం ప్రవేశం సంపాదించారన్నది సత్యదూరం కాదు. అయితే అందులో యెవరిశిష్యులు, అంటే: అందులోనేకాదు, యెందులోనూకూడా యెవరి శిష్యులూ కారు. "ప్రాపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అనే వాక్యానికి దాసుగారు ప్రథమలక్ష్యమనుకోవాలి. విజయనగరం అంటే సర్వవిధాలా కాశీగా వుండేది. సర్వవిధాలా అనేదానిలో భంగుకూడా చేరవలసివుంటుంది. దీన్నిగూర్చి అన్యత్ర విస్తరించినట్లు జ్ఞాపకం. దాసుగారి అన్న పేరన్నగారు నన్ను అనునయించడంలో దీనిమాహాత్మ్యాన్ని కొంత నాఁడు సూచించే వున్నారని తెలివిడి. అలాటి అపరకాశీలో వున్న దాసుగారు పూర్వజన్మసుకృతంకూడా కలిసిరావడంచేత అన్నిటినీ అశ్రమంగా ఆర్జించఁ గలిగారు. అయన ఆర్జించలేనిదల్లా యీవయస్సులోకూడా వక్కటిమాత్రమే. ఆవిద్య యేదో అందఱూ యెఱిఁగిందేకనక గ్రహించు కోండని లోకానికే వదిలిపెడతాను. ఆయన వయస్సిప్పటికి దాదాపు యెనభైకి యేమాత్రమో తక్కువ అనుకుంటాను. యిన్ని విద్యలలో ప్రవేశం కలిగి యీమాదిరిగా హరికథ పండిత పామరరంజకంగా మహా గాయకులున్నూ మహాకవులున్నూ మహాలౌకికశిరోమణులున్నూనిండివున్న సభలో చెప్పి మెప్పు సంపాదించినవ్యక్తి మనకిఁక దొరకదు. చేతనైతే యీవయస్సులో వున్న తెల్లముంగురులు వగయిరా కీర్తిస్ఫోరకమైన పోషక్కతోనే యీలోకంలో అమరుణ్ణిగా చేసి నిల్పుచేయవలసిందని మనదేశస్థులంతా భగవంతుణ్ణి ప్రార్థించవలసివుంటుంది.

యీయన సంస్కృతంలోకూడా కవి. ఆంధ్రం చెప్పనే అక్కఱలేదు. " తాండవముదిరితే పూసరపెల్లి " అవుతుందన్నట్టు యిటీవల యీయన కవిత్వం పేర్లవగ్గల నుంచిన్నీ (వెన్నుని వెయిపేర్ల పిలిచి అని వాడోయను ఒక పుస్తకం వేసు) అప్పు తెలుఁగులోకి మారీ కొంత రచిస్తూ పోతూ వుండికాని హరికథారచనాకాలంనాఁటికి యీ చేవ త్తం యీయనను వృష్టలేదు. అది అదృష్ట మనుకోవాలి. లేకపోతే యీయనరచనలు యీయనలోనే అంతరించిపోయేవి, సంశయంలేదు యీయనకు యెన్ని విద్యలేనా వచ్చును. అన్నిటిలోనూకూడా ప్రత్యేకించి కృషిచేసినవారితో పోట్లాకి విగ్రహించగలశక్తికూడా వుంటే వుంటుంది గావి లోకం యీయన్ని హరికథకుడుగానే కాని అన్యథా వాడుకోదు. సార్వభౌమబిరుదు సంపాదించినా, " మహామహోపాధ్యాయ " సంపాదించినా వృథాపరిశ్రమేకాని " ప్రాప్తేఽపి సోమయాజిత్వే సంబిశట్టో నముంచతి. "

యింత వరకు వ్రాయడానికి అంతో యింతో నాకు అర్హత వుంది గాని యీ పైని వ్రాయడానికి నేనే లేదనుకునేటప్పుడు లోకం లేదంటే ఆగ్రహపడవలసి వుండదు. నేను గాయకుణ్ణికాను, యెందుచేత? చెప్పుకోక పోవడంచేత. చెప్పుకుంటేనో? అయేవాణ్ణే. యిప్పుడు నాగ భూషణంగారు ప్రత్యర్థిగా నిలబడ్డారుగావి అప్పుడు నేనే నిలబడేవాణ్ణేమో? కానివ్వండి. దాసుగారు లయబ్రహ్మ, అవి అందరూ చెప్పుకుంటారు. నాగ భూషణంగారు లయబ్రహ్మకారని యెవరూ చెప్పరుగదా. అందరు గాయ కులూ యేమహాగాయకుల రచనవల్లనో సభను రంజింపఁజేస్తే దాసుగారు స్వంతరచన చేతనే అద్భుతంగా రంజింపఁ జేస్తారు. కేదారమీదా బిలహరి మీదా ఝుంఝూటిమీదా యింకా కొన్ని రాగాలమీదా సీసపద్యం చదవడానికి దాసుగారే మార్గదర్శకులు. యిట్టి దాసుగారు వన్నొకరోజున విజయ నగరంలోనే అయ్యకోనేటిగట్టుమీఁద, శాస్త్రీజీ నీవు చదివేశైలి వినా లన్నారు. దురుద్దేశంతోకాదు సదుద్దేశముతోనే యీలా అనడం తటస్థిం చింది. అప్పటికి నావయస్సు 24 వత్సరాలు. దాసుగారు ముప్పయికి లోగానో

పయిగానో వుంటారు. చదివాను. (చదివిన పద్యం శ్రవణానందంలోది) సంతోషించారు. అప్పుడు నేను యిదేకాబోలును "పొరుగింటి పుల్లగోంగూర రుచి" అంటారు పెద్దలు అనుకున్నాను. యీయన్ని గూర్చి యింకా యెంత వ్రాసినా తనివి తీరదు. అయితే వోపిక లేదు యేంచేసేది? "అనుక్త మన్యతో గ్రాహ్యమ్."



# దురన్యాయం

(22—7—1944 సం॥ర ఆంధ్రవాణినుండి)

నిన్న మొన్నఁటిదాకా బ్రాహ్మణుల యిండ్లలో (సంపన్నుల యిండ్లలో) అయ్యే పెండ్లి భోజనాలప్పుడు భోజనకాలే గోవింద నామస్మరణ నిమిత్తం ఆ యీ తరంగ పాఠకులను ఆహ్వానించి వారిని గౌరవించడం వుండేది. యేలూరు మ॥ రా॥ రా॥ కీ॥ శే॥ శ్రీరాజా భుజంగరావు జమీందారుగారి కొమార్తెల వివాహంలో ఆయీ తరంగాల సంగతి వుండఁగా స్వయంగా చూచాను. ఇటీవలవివాహాలు యేదో పండుగుమాదిరిగా లఘువుగా (సదస్యాదులు లేకుండా) జరగడం చేత పూర్వంవంటి సంతర్పణలూ లేవు సమారాధనలూ లేవు, కనక ఆ, భోజనకాలే గోవింద నామస్మరణలతో అవసరమేలేకుండా పోయింది, శారదాగారు బాల్య వివాహం వద్దన్నారుగాని, సదస్యం వగయిరాలు వద్దనలేదు. అయితే ఆ శాసనం తుదకు, "అయ్యవారిని చేయఁబోతే కోతి" గా పరిణమించినట్లయింది. జరగడమేమో బాల్యవివాహాలు జరుగుతూనే వున్నాయి. అందరు చేస్తూవుండడంచేత కేసు లెట్టడానికి యెవరిమట్టుకు వారే జడిసి వూరుకుంటూ వున్నారు. యిఁకనల్లా బిల్లుకు ఫలితం యేమిటంటే 5 రోజులు జరిగేపెండ్లి యిప్పుడు 1 రోజున జరగడం చేత గాంధర్వ వివాహంగా పరిణమించింది.

చదువుకున్న విద్వాంసులను పూర్వం పెళ్ళిళ్ళలో సత్కరించేవారు. ఆయీ పద్యం, కీ. శే. దాసు శ్రీరామకవి గారిది ఆసత్కారాన్ని కొంత వివరిస్తుంది,

ఉ. లేవరు రెండు రెండనిన లేచినవారయినం దటాలునన్
బోవరుపొందు పొందనినఁ బోదుము పోదుము పోదుమంచుఁ దా
మీవరుసందు, గేస్తువలయింతురు పెండిలిలో సదస్యసం
భావనవేళఁ జూడవలె బాపన సాముల సాములన్నియున్.

ఆయీ పద్యార్థం చదువు సంధ్యలు లేని నామమాత్ర బ్రాహ్మణుల కిచ్చే దొడ్డి సంభావన బాపతు. శ్రీరాములుగారు నేటి నాగరికామాత్యులు గారు "స్వర్గస్థుఁడయ్యే విస్సనమంత్రి" అనేరకంలో వారు. యీయ నకు చాలామంది కొడుకులు. ఆ వివాహాలన్నీ "సదస్యసంభావన" కలిగే జరిగాయిగాని అన్యధాజరుగ లేదు. అప్పటి అనుభవమే ఆమహాకవి తెల్గునాడులో చిత్రించారు. ఆయన యిప్పటి కాలపు కవిగా వుంటే ఆమా దిరి పద్యం వ్రాయలేరు. భవతు. యేదోవ్రాస్తూ దేనిలోకో వచ్చాం. వస్తేవచ్చాంకాక యిప్పటి సంపన్నుల వివాహాలనుగూర్చి పదిలో పది నాల్గుమాటలు వ్రాస్తే శుభంలో శుభం కలిసివస్తుం దనుకుంటాను. శ్రీరా ములుగారివాఁటి మర్యాదలు యిప్పుడు లోపించాయి. కట్నాలు మునుపు ఆడక్కుండానే వియ్యాలవారు మాకువద్దు మొఱ్ఱో అన్నా యిచ్చేవారు. యిప్పు డల్లాకాదు, ప్లీడరుల ఫీజులాగ, డాక్టరుల బిల్లులాగ, లీగలుగా కూడా వసూలు చేస్తూన్నారు. యింకోకన్యక సత్సంప్రదాయంలోది, అంద కత్తె, అంతో యింతో చదువుకుంది, కట్నం అడిగినంతా యివ్వడానికి తండ్రి సిద్ధంగానే వున్నాఁడు, యిట్టి కన్యకకు కూడా పెండ్లి చేయలేక తల్లిదండ్రులు బెంగ పెట్టుకోవలసి వస్తూంది. ఆయీ కన్యకు, యింగి లీషురాదు, పునస్సంధానపు గదిలో మాట్లాడుకోవడానికి యిప్పటి నాగరికా నికి మాతృభాష పనికిరావడం లేదు. యజ్ఞయాగాదులకు వివాహాది శుభా లకూ, అబ్దికాది పితృకార్యాలకు మనశిష్టులు తెలుఁగుభాషను మ్లేచ్ఛభా

షాంతఃపాతి కనుక పనికిరాదని నిషేధించారు. యిప్పటివారు, శృంగార రసానికి కూడా పనికిరాదన్నారు. నాకయితే యింగిలీషు రాదుగాని మన వారు చదివే యింగిలీషు పొట్టపోసుకోవడానికే కాని అంతకంటే యితరానికి (యేవొక్కవ్యక్తికోతప్ప) పనికి రాదనే చెపుతాను. యెవరికి యేభాష వచ్చు ననవలసివస్తుందో అప్పుడు చేసే పరీక్ష యీవిధంగా చేయాలని యెవరో యెప్పుడో చెప్పఁగా విన్నాను.

(1) భోజనం చేసినప్పుడు ఆ పదార్థాల పేళ్ళు తడుముకోకుండా చెప్పఁగలడా ? లేదా ?

(2) తా నేభాషలో పండితుఁడో ఆభాష మాతృభాషగా గల పెళ్ళికూఁతురితో రహస్యంలో వ్యవహరించి యీాయన తెలివితేటలుగా మాట్లాడఁగలఁడని సర్టిఫికట్టు తెచ్చుకోఁగలఁడా, లేదా? యింకోటి యేదోవుండాలి, సమయానికి జ్ఞాపకం రాలేదు.

యిట్టి భాషాపరిజ్ఞానం పుస్తకాలు బట్టీపెడితే వచ్చేది కాదు. వుగ్గుబాలతో రావాలి; మనలో విద్యాధికులు (వ్యాకరణయుక్తంగా) మాట్లాడే యింగ్లీషును ఆ దేశీయులు విని యేవగించుకుంటారని నే విన్నాను. భవతు; యీా కృతకభాషకు అలవాటు పడడం అవసరాన్నిపట్టి అవశ్యకమే కాని భార్యకుకూడా ఆభాష "కంపల్‌సరీ" గా వచ్చివుండాలనుకోవడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. యిక ప్రస్తుతం వుపక్రమిస్తాను

అష్టపదుల తర్వాత ప్రసిద్ధి గడించినవి తరంగాలు. మన ఆంధ్రదేశంలో తరంగాలకు వున్నంత వ్యాప్తి అష్టపదులకు లేదు, కారణం వాట్ల సంప్రదాయం యెఱిఁగిపాడే గాయకులు యీ దేశంలో లేరు. యీమధ్యనే "ధీరసమీరే యమునాతీరే" అనేది సంప్రదాయ సిద్ధంగా గ్రామోఫోనులో వినడం తటస్థించింది, తెలుగులో చాలా హాయిగావుండేటట్టు, సిద్ధేంద్రుల వారు సన్న్యాసం పుచ్చుకున్నాక శృంగారభక్తి మయంగా రచించిన భామాకలాపం, వొకటి వుంది. అది యిటీవల యితరుల ప్రక్షిప్తాలతో

మిళితమై వ్యవహరింపబడుతూ వుంది. యీయన వాడి చాలా మధుర మయినది—

" భామనే, సత్యభామనే వయ్యారి సత్యభామనే, సింగారి సత్యభామనే॥ పదియాఱువేల, కోమలు లందఱిలోన, ప్రేమకు శ్రీకృష్ణ మూర్తికి ప్రేమలు నింపేటి సత్య॥ భామనే॥"

వీట్లను దరువులని వ్యవహరిస్తారు. త్యాగరాయ కృతులు పాడే గాయకులు వీట్లనైతే గౌరవింపరు గాని, యెన్నో సంగీతాలు వినివిని వున్న మాబోటి ముసలి వాళ్ళకు తుట్టతుదకు ఆ యీ భాగోతపు దరువుల మీదకే మనస్సు పోవడానికి కారణం మృగ్యం. సంగీతశాస్త్రానికి సంబంధించిన కట్టుఁబాట్లకు ఆ యీ దరువులపాట చాలా దూరంగా వుంటుందంటారు గాయకులు. సత్యమే కావచ్చును, గాని, సంగీత సంప్రదాయానికి దూరంగా కొందఱు గాయకులు ఆరోహణంలోనో అవరోహణంలోనో తగలరాని నిషాదాదులు వగయిరా సాహసించి తగిల్చి పాడుతూనే వున్నట్టు వారివారి వివాదాలలో వినివున్నాను. అలాగే యీ భాగోతపు పాటకులున్నూ కట్టుబాటుకు దూరంగా పాడతారనుకుంటే సరిపోతుందేమో కాని దానిలో యెక్కువ ప్రజ్ఞగలవారుగాని యీవిషయం నాబోటి గాలిపాటకులు నిర్ణయించతగ్గది కాదు. పండితులమాటకేంగాని " భామాకలాపం " పామరులకు బాగా రుచిస్తుంధి. తోలుబొమ్మల వికృతి సినీమాలు. భాగోతకలాపానికి వికృతి కంపెనీనాటకాలు. వికృతులు యెప్పుడుగాని ప్రకృతిని భంగించలేవు. అన్నివిధాలా నాగరికత పెచ్చుపెరిఁగిన యీకాలంలో మునుపటిలాగే భాగోతాలూ, భాం వేషాలూ అమలుజరుగుతూనే వున్నాయి. భక్తుడు తన్ను విరహిణీస్త్రీగా భావించుకొని పరమేశ్వరు సాంగత్యరూపమైన ముక్తికై యత్నించడాన్ని గూర్చి భామాకలాపం చాలా బాగాబోధిస్తుంది. రచించినకవి, సిద్ధేంద్రయోగి. యీయన్నిగూర్చి చెప్పేయితిహాసం వుదాహరిస్తే వ్యాసం చాలా పెరుఁగుతుంది. యీయన నివాసం కూచిపూడి ( కృ. డి. ). ఆయూరి బ్రాహ్మణులు ( వెల్నాటివారు )

యీ మహానుభావుని గౌరవచిహ్నంగా అవచ్ఛేదకావచ్ఛేదేనా నాట్యం చెప్పుకోవడం వేషాలు కట్టడం అంతా యెఱిఁగిన యీయన మంచి నడియావనంలో సన్యసించ వలసివచ్చింది. ఆకారణాన్ని పురస్కరించుకొని ఆయీ భామకలాపం శృంగార రసభూయిష్ఠంగా రచించి గ్రామస్థులకు చెప్పి కృతార్థులైనారు. క్రమంగా యీ భామాకలాపం వేశ్యలుమాత్రమే గాని మొగవాళ్ళల్లో దేవాంగులు మొదలైనవాళ్ళు పలువురు నేర్చుకొన్నారు. (1) దాసరి పీరాస్వామి (2) నాసుకు పుల్లయ్య మొదలైన సుప్రసిద్ధుల భాగోతాలు నేను చిన్నతనంలో యెఱుగుదును.

ఉ. భూతలమందు ధాతకు నపూజ్యత గల్గెను రెంట మూట భా
గోతుల బుచ్చిగాని కొక కొంచె మనంగగృహంబు చేయమిన్
………………నల్పొనరించినందుకున్ ……………

అనే తురగా రామకవిగారి పద్యంలో వున్న బుచ్చిగాఁడు శతవిధాల నాన్‌బ్రామినే అయివుంటాడు. అతని స్త్రీవేషం యెంతమాత్రమూ మగవాఁడు కట్టిం దనుకోడానికి అవకాశంగా వుండేది కాదని పైపద్యంవల్ల తెల్లం. ఆయీపద్యం శ్రీనాథుని వీథీనాటకంలో యిటీవల యెవరో చేర్చి ముద్రించడం చేత యీపద్యంలో వుటంకింపఁబడ్డ—

1. పెండెల నాగి ( నాగసాని )
2. గేదగి గంగి ( గంగాసాని )

అనువాళ్ళు తురగా రామకవిగారి వేశ్యలుగాని, (శ్రీనాథుని ప్రియురాండ్రని పాఠక లోకం భ్రమపడుతూ వుంది) నిజానికి శ్రీనాథునితాలూకు వారుకారు.

యీవిషయం నాకు తెలియడానిక్కారణం పాలెపు పళ్ళంరాజుగారు. యీయన కీ॥ శే॥ శ్రీ పిఠాపురం రాజావారి తాణేదారుగా వుండి అపర బ్రహ్మావతారం కీ॥ శే॥ శ్రీ బులుసు పాపయ్యశాస్త్రులుగారికి శ్రీ రాజావారు 12 పుట్లభూమి యిచ్చినప్పుడు 18 పుట్లు పెంచి యిచ్చినట్టున్ను

ఆ అవినయాన్ని సదరు శాస్త్రిలవారు తమ పాండిత్య బలంచేత సమర్థించి సదరు పళ్ళంరాజు గారికి మాటరాకుండా కాపాడినట్లున్నూ మావైపున చెప్పుకుంటారు. దీన్ని బాగా వివరించవలసివస్తే చాలా పెరుగుతుంది. ప్రస్తుతం కావలసింది మనకు శ్రీనాథుఁడికి అంటగట్టిన సానిమేళం తురగా రామకవిగారిది గాని శ్రీనాథుఁడిదికాదని నిగ్గు తేల్చుకోవడమే.

ఆయీ పళ్ళంరాజుగారి ఆఖరువయస్సులో (మరణశయ్యమీద వున్నప్పు డన్నమాట) నేను వారియింటికి అతిథిగ వెళ్ళడం తటస్థించింది. యీ ఆతిథ్యాన్ని వివరించవలసివస్తే గ్రంథం చాలా పెరుఁగుతుంది. పయిగా యిప్పటి నాగరికలోకానికి ఆయీ విశేషాలు (అప్పటి వుద్యోగుల చర్యలు) నచ్చవుకూడాను. యివి తోలుబొమ్మల జాతిగాని, సినీమాల జాతివికావు. కనక వుపేక్షిస్తాను. నన్నుఁగూర్చి పళ్ళంరాజుగారు యేక సంథాగ్రాహిగా విన్నారఁట? ఆయన శిష్యు కృష్ణమూర్తిగారిని బాగా యెఱుఁగుదురు. కృష్ణమూర్తిగారు యేక సంథాగ్రాహులే యేమో. నాకు యీ పేరు రావడాని క్కారణం లోకాదరమేకాని నియమంగా యేక సంతలో నేను ప్రతిపద్యాన్నీ చదువుతాననే ప్రతిజ్ఞ నాకుగాని, మా తి. శా. కిఁ గానిలేదు. సుళువుగా అర్థమయే పద్యమయితే యేకసంతలోనేకాదు. అఱ సంతలోకూడా చదివేవాణ్ణి చిన్నవయస్సులో; పళ్ళంరాజు గారిని నేను కలుసుకొనేటప్పటికి నావయస్సు 32 వత్సరాలు. అప్పటికి నాబుద్ధి తీవ్రత తగ్గి "ప్రాయపుఁ బ్రొద్దంతఁ గొంత పడమటఁ దిరిగెన్." అనే స్థితిలో వుంది. పళ్ళంరాజుగారిలో నేను వున్న యథార్థాన్ని చెపితే నమ్మక, నాకు యీ క్రింది పద్యం వినిపించారు. యేక సంథా గ్రాహిత్వానికి—

ఉ. పెండెల నాగి చెక్కులను పెద్దికటిస్థలి గంగిగుబ్బ చ
న్గొండలనుండు రామకవి కుంజరు హస్తము క్రిందు చేసె హా!
పండక బంటుమిల్లి; అది పండిన సీకసుమాల ధారుణీ
మండల నాథుఁబోలు నొక మానవనాయకు వేడ నిచ్చునే.

ఆయీ పద్యంలో వున్న నాగమ్మ గంగమ్మలున్నూ "భాగోతుల బచ్చిగాఁడు" పద్యంలో వున్న నాగమ్మ గంగమ్మలున్నూ వొక్కరే అని వేరే చెప్పనక్కఱ లేదు. శ్రీనాథుఁడుగారి సానులు వీరు కారు అని పళ్ళంరాజు గారిచ్చిన పద్యంవల్ల నేను తెలుసుకున్నాను. శ్రీనాథుఁడు యింత మాత్రించేత యేకపత్నీవ్రతుఁడు కాఁడుగాని వృథాగా ఆయన నెత్తినిరుద్దిన అపవాద తొలఁగించినట్లయింది. శ్రీనాథుని శృంగారం చాలా భాగం "ద్రాక్షారామపురీ విహార వరగంధర్వాప్సరోభామినీ వక్షోజాలకు" సంబంధించి వుంటుంది. కాని, రామకవిగారికి యీపద్యం పెద్దిసాని అనే యింకో శృంగారిణి వున్నట్టు బోధిస్తూ వుండడంవల్ల కొంత అపచారం చేసినట్లయింది. అయితే యేంచేసేది? ఆయీ పద్యం యేసంస్థానంలో చెప్పిందో యెందుకు చెప్పవలసి వచ్చిందో? వ్రాయవలసివస్తే చాలా పెరుఁగుతుంది. మఱొక్కప్పుడు చూచుకుందాం. యిప్పటికి బంటుమిల్లి తురగా రామకవిగారి అగ్రహారగ్రామమని చెప్పి ప్రస్తుతాన్ని అందుకుంటాను.

భామకలాపం చాలా మధురమైన కవిత్వమనిన్నీ దాన్ని రచించినది ఆంధ్రవైదికబ్రాహ్మణుఁడేననిన్నీ అందుచే మనం గర్వించవలసి వుంటుందనిన్నీ చెప్పకుండానే చెప్పినట్లయింది. ఒక్కజయదేవుఁడు తప్ప భక్తకవులుగా పరిగణింపఁబడే—

(1) లీలాశుకుఁడు (కృష్ణకర్ణామృతకర్త)
(2) నారాయణతీర్థులు (తరంగకర్త)
(3) పోతన్న (భాగవతాంధ్రీకరణకర్త)

యీ ముగ్గురూ మనవారే అవడంకూడా ఆంధ్రులభాగ్యమే. భామకలాపకర్త కవిత్వంలో యితరుల ప్రక్షిప్తాలు చాలా చేరినట్లు వేశ్యల భాగవతం చూస్తే అనుమానం కలుగుతుంది. ఆ సాంకర్యం అసలు కూచిపూడివారి భాగోతం చూస్తే తీరుతుందేమో కాని నాకాభాగ్యం పట్టలేదు.

యింకా యీ, పదకవులలో క్షేత్రయ్య, త్యాగరాజు, సుబ్రహ్మణ్యకవి, రామదాసు - వీరందఱూ చాలా మృదువుగానూ మధురంగానూ కవిత్వం చెప్పిన మహాభక్తులు యేవిధంగానూ పద్యకవులకు తీసిపోయే వారు కారు. కావి వీరిని కవులు బొత్తిగా తమపంక్తికి చేరనిచ్చారుకారు. సంఘసంస్కర్తలలో అగ్రగణ్యులు, వీరేశలింగంపంతులుగారు, కవిజీవితములలో పదకవుల నెత్తికోలేదనే నే ననుకున్నాను. యిందేమైనా ప్రమాద ముందేమో?

యీపదకవులు పద్యకవిత్వం చేతగావివారు కారు. రామదాసుగారి దాశరథిశతకం అందఱూ యెఱిఁగిందే. సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మరామాయణాన్ని నూఱుకీర్తనలలో అనువదించాఁడు. పద్యకవికి పద్యం వొక్కంటికి నాల్గు ప్రాసాక్షరాలు దొరికితే చాలును గాని పదకవికి అంతమాత్రం చాలవు. అందులోనూ "అధ్యాత్మకీర్తనలలో ఒక్కొక్కచోట ముప్పైవలభై ప్రాసలు దొరికితేనే కాని తుదనెగ్గదు కాపరం - వుదాహరిస్తాను.

కీర్తన

ఈసంశయము వారింపవే? జగదీశ; నన్ను మన్నింపవే?

పల్లవి

శ్రీసదాశివ? ప్రశ్న చేసెద వివరింపు వాసుదేవ తత్త్వము, మహత్త్వము, భాసమానవిలాస? సేవిదె వీసత్కృపావలోకనమున, వీసమయమునఁ, దెలియవలసినదే సమస్త మిదే ప్రశస్తము.

యీమహాకవిత్వం వుదాహరించవలసివస్తే యావత్తు కీర్తనలూ వుదాహరించ వలసిందే. వేదం యేమాదిరిగా యెనభై రెండు ప్రశ్నలూ గురుముఖతః కష్టించి వల్లించాలో యీ కీర్తనలూ ఆలాగే.

నా చిన్నతనం నాటికి కొందరు—

(1) ఉపమాక బ్రహ్మన్నగారు
(2) ముక్కామల జోగయ్యగారు
(3) వేదుల శంకరదాసుగారు

మొదలైనవారు మా గోదావరి డి॥లో ఆయా కీర్తనలు సక్రమంగా శిష్యులకు పాఠం చెప్పేవారుండేవారు; యేవో కొన్ని తప్ప యితి శ్రీగా ఆయా అధ్యాత్మకీర్తనలు పాడేవారు గాని, తరంగాలు పాడేవారు గాని ఆ కాలమందునూ అరుదే. యిప్పుడు చెప్పనే అక్కఱలేదు. నామట్టుకు పద్యకవిత్వం కంటే పదకవిత్వం రచించడమే కష్టసాధ్యంగా కనపడుతుంది. పదకవికి సంగీతంలో యేస్వల్పంగానేనా ప్రవేశం వుండితీరాలి. అందులోనూ వొకరి కీర్తనను అనుసరించి చెప్పే కవికన్న స్వంతంగా గమనికను కల్పనచేసి రచించే కవి ప్రతిభ మఱీ వర్ణనీయం. అధ్యాత్మ కీర్తనారచన సర్వమూ స్వకపోల కల్పితమైన పోకడగానే కనపడుతుంది. యీలా వూహించడానికి క్కారణం కవి యేకీర్తనలను వరవడిగాఁ బెట్టు కొన్నాఁడో ఆకీర్తనలు పాడేవారెవరూ వున్నట్లులేదు. యింకో విశేషం పదకవిత్వం యెవరు చెప్పింది పరిశీలించినా దానిలో మెత్తఁదనమే కన పడుతుందిగాని పెళుసుదనం యేకొంచెమూ వుండదు.

భైరవి — ఆట

పల్లవి॥ జాడలు తెలిసిన నాఁటికె కాదా? దండింపఁబోయేరు మీ వారలు. లంకాద్వీపము నంటు సంకేతస్థల మమరె? అంకాడ నేర్చి నది బొంకాడనేరదె!

యిది బహుశః క్షేత్రయ్యదే అయివుండాలి. చూచారా? యెంత మృదువుగావుందో? యతిప్రాసలు లేకపోలేదు, వుండనూ లేదు. వారికి (పదకవులకు) రసమే ప్రధానం పద్యకవులవలె డిగి, వెస, పొరి, ఏద్దెఱ యీలాటిపదాలు యెంత వెతకినా పదకవులరచనలో దొరకవు. యిది బాగా గమనించతగ్గ విషయం. యీపదాలు (తోవాసాలు) పద్య కవులకోసమే పుట్టినట్టు తోస్తుంది ఆఖరుకు—

(1) మల్లిమొగ్గలచీర, మగువ? నీకిష్టమా?
(2) చెట్టు యెక్కఁగలవా నరహరి........?

యీ చరణాలు గరుడాచల నాటకంలోవి. సంధుల ప్రకారం కీర్తన పాడితే రుచించదు. అందుచేత చాలాభాగం పద కవిత్వంలో వాటిని పాటించరు. చెట్టునెక్కకలవా? అంటే రుచించదు. యీ చిక్కు లేనిచోట సంధినీ మన్నించడం వుంటుంది.

యెందు దాఁగినాఁడో? శ్రీరాము డెందు - అచ్చుతో పంపు అని ప్రారంభిస్తే బాగుండదు. చివర సంధి చేసినా అందం చెడలేదు. సంగీతానికి ముఖ్యంగా కావలసింది శ్రవణసుఖమే. పదకవిత్వం చెత్తా భాసి రచనలో చూచినా శ్రుతి కటువుగా వుండే అక్షరాలు పదకవికి దొర్లవు.

పల్లవి

“అగ్గితిరుణాళ్ళంట; అర్జున కతలంటి సుగ్గివ యిజయము దీనె సుట్టూ బలాదూరు” యీమాదిరి రచనలో కొన్ని కీర్తనలున్నాయి, యివి చంద్రశేఖరశతకం మాదిరిని జాతీయానికి పెట్టింది పేరు.

ఉ. సీ: దగిడీలు బాపలపసిద్దిసరే? పొగనిప్పకంట, సో
మాదుగులింటిపోయి బతిమాలితి మూఁడు నెగళ్ళ మండుతై
లేదనితిట్టె పాపపుకలిగ్గము యింతివరాదె? దాంట్లొ యీ
రాదట? యండ్రి మూర్ఖులు దురాత్మ లసహ్యాలు చంద్రశేఖరా

యీమాదిరిని శతకమంతా రచించినకవిని యెంతమెచ్చినా తనివి తీరదు. పైని చూపినపల్లవి యీమాదిరిభాషే యింతగా కాదుగాని మధ్య రకంగా కొందఱు కవులు రసాభాస శృంగారాన్ని గూర్చి కీర్తనలు రచించారు.

పల్లవి “నీవేనా? శాస్త్రము నాచేత కాసుంటే నీయక్క మఱియొక్కతే అది గాకుంటే దానక్క మఱియొక్కతే, (అనుపల్లవి) పోపోవె యెవతైన పుణ్యానికి రాదు దేవరంభయైన, తేతెమ్మనక పోదు” నీవేనా॥ యీదేవరంభ ప్రయోగందగ్గఱ చాలా మంచి వ్యంగ్యం (యజ్ఞాదికం) ఉంది, జాగ్రత్త.

సమకాలీనులలో పదకవిత్వం చెప్పఁదగువారు చాలామంది వున్నారు, వారిలో నారాయణ దాసుగారు కొత్తపోకడగా హరికథలలో కొన్ని కీర్తనలు రచించారు మఱికొందఱు దాసుగారినీ మఱికొందఱినీ, వరవడిగాఁ బెట్టుకొని రచించేవారున్నారు. గబ్బిట యజ్ఞనారాయణగారొకరు కొంత కొత్తపోకడగా కవిత్వం రచించేవారు.

శ్రీరామచంద్రా? నరేంద్రా? అనేకీర్తన ఆయనదే! దాసు శ్రీరాములుగారు "అత్తవారింటికి, అంపేరు మావారు" ఇత్యాదులు క్షేత్రియ్య పదానుకరణంగా వ్రాశారు. కొన్నాళ్ళ క్రిందట ప్రతీ భోగం మేళంలోనూ దాసువారివే అభినయించడం వుండేది. యిటీవల బొత్తిగా మాఱిపోయి "అపనా తనామనా మారోరి బైరన" మాది లొల్లాయి పదాల కిందకి అభినయం మాఱింది. పదకవులందఱూ పనిపడితే పద్య కవిత్వం చెప్పఁగలరు గాని పద్యకవులలో నూటనాఁట తప్ప పదకవిత్వం చెప్పలేరు. దీన్నిబట్టి చూచినా పద్యకవులు.... .... .... .... .... .... .... ....

అంతదాఁకా యెందుకు? మనదేశంలో ముసలమ్మలు పాడేపాట లలోకూడా వున్నాయి. రామాయణం విడివిడి భాగాలుగా (ఖండకావ్యాల మాదిరిని) మగకవులో ఆఁడకవులో తేలికగా తెలిసే శైలిలో వ్రాసిన ట్లగుపడుతుంది.

(1) సీత ఆనవాళ్ళు (2) ఊర్మిళాదేవినిద్ర (3) సీతవేవిళ్ళు (4) కుశలవకథ.

యీలా భిన్నభిన్న శీర్షికలతో రామాయణగాథ ముసలమ్మలు పాడేవారు. పండితులవద్ద శిష్యులున్నట్లే ముసలమ్మలవద్ద శిష్యురాం డ్రుండేవారు. ఆయీపాటలు శ్రీ నందిరాజు చలపతిరావుగారు చాలాభాగం ముద్రించారు. యిప్పుడు స్త్రీవిద్య మార్గాంతరంగానే కాక భాషాంతరంగా కూడా పరిణమించడంచేత, ఆయాపాటలప్రచారం చాలాభాగం తగ్గిందని తోస్తుంది. రాజభాషలో స్కూలుఫైనలు వఱకేనా చదవని కన్యకకు వరుఁడు

దొరకడం కష్టం, ప్రతీ యింట్లోనూ "హార్మోనియం" వుండి తీరాలి. పురుషులకన్న స్త్రీలలో చాలామందికి గానంలో ప్రవేశం కలగడం కొంత హెచ్చేగాని వాళ్ళలోకూడా కొందరికి "గార్దభస్వర వైస్వర్యంబు కలుము కొంత శంఖనీథామకుటిలవాచాల" అన్న కాకోక్తికవాక్యానికి లక్ష్యంగా వుండే కంఠస్వరాలు లేకపోవు. గృహస్థులు (సంపన్నులే అనుకోండి) ఆలాటి కన్యలకుకూడా సంగీతం చెప్పిస్తేనేకాని పెండ్లి కూతురుకు వుండే క్వాలిఫికేషన్సు పూర్తి కావుకదా యిప్పటి నాగరికతకు! భవతు. యిది విషయాంతరం. సీత ఆనవాళ్ళనుంచి కొంచెం మచ్చుచూపుతాను——

(1) అది యొక్క ఆనవాలని చెప్పు హనుమా?

(2) యింక నొక్క ఆనవాల్ కలదుసుమహనుమా మఱియొక్క ఆనవాల్ వుందిసుమ హనుమ; ఆ ఈపాటలలో విశ్రామాలు వుంటూ వుంటాయి. వుండనూ వుండవు. తానవర్ణాలువగైరా గేయాలకు చాలా భాగం యతులు పెట్టడానికి అవకాశం చిక్కదు. కారణం వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి. ఆ సాహిత్యాలు స్వరాన్ననుసరించి నడవవలసి వస్తుంది. దీర్ఘపూర్వానికి దీర్ఘపూర్వమే ప్రాసయతి పెట్టవలసివస్తే స్వరంలో ఆలా వుండకపోతే సాహిత్యరచనలో యేలా కుదురుతుంది? ఆయీ రచనలో స్వరకవి వేఱుగానూ సాహిత్యకవి వేఱుగానూ వుండడమే తఱుచుగా సంభవిస్తుంది. మేము గాయకులం కాముకాని గాయకులు కోరితే కొన్ని సాహిత్యాలు రచించాం. అందుచేత యీ సంప్రదాయం వ్రాయవలసి వచ్చింది. (మేము రచించిన సాహిత్యాలు ఇతరులు రచించిన స్వరాలకే) కుశలవకథ (దీనికి కుసలాయకం అని ప్రసిద్ధనామం) ఉత్తరరామాయణగాథ ననుసరించిపుట్టింది. కాని నాటకాలలో మాదిరిని క్రొత్తపోకడలు చాలావున్నాయి. వొకటి మచ్చుచూపుతాను; శూర్పణఖ అయోధ్యకు వచ్చి అంతఃపురంలో కౌసల్యాదులతో యేదో కపటప్రసంగం చేసినట్లు ఆపాటలో కనపడుతుంది. కొంచెం చూపుతాను——

(1) ఆవగించ మోకాట విఱవఁగ నేర్తు

(2) ఆలుమగల నెడఁబాపఁగ నేర్తు

యిందులో మోకాటన్=మోకాలన్ అనడానికి బదులుగా పడింది. కాలుశబ్దం ఔప విభక్తికమే కాని టి, ంటి, వర్ణకములు చేరే తెగలోది కాదు. ఆయీ ప్రయోగం ఛాందసత్వాత్సాధుః అనుకోవాలి. యీఔప విభక్తిక వికారాలకు వొకతోవా తెన్నూ లేదు. దీనిసాధుత్వం పృషోదరాది సాధుత్వంలాగ చూచుకోవాలి. ఆయీ పాటలుకూడా వేదంవలె చెప్పుకో తగ్గవే. రెండవ చరణంలో వున్న ఆలు మగల నెడఁబాపుటకే శూర్పణఖ యేదో మాయవేషంతో వచ్చి సీతారాములకు వియోగాన్ని కల్పించినట్లు ఆపాటలో వుంటుందని తోస్తుంది.

ఊర్మిళాదేవి నిద్ర అనేపాటలో లక్ష్మణుఁడు అన్నగారితో వనవా సానికి వెళ్ళినతేదీ మొదలు ఆయనభార్య ఊర్మిళ నిద్రారూపమైన తప స్సులో వున్నట్లుకూడ కథనడచినట్లు తోస్తుంది. మనభారతీయులు యెన్ని గ్రంథాలు వ్రాసినా పురుషులకు తపస్సున్నూ స్త్రీలకు పాతివ్రత్యమున్నూ వీట్లనే ప్రతిపాదిస్తూ వచ్చారు. యముడంతవాడుకూడా పతివ్రతకు జంకు తాఁడు. ఆమెకు సంగీతం రానక్కఱలేదు. సాహిత్యం వుండ నక్కఱ లేదు. యే పరీక్షా ప్యాసుకానక్కఱలేదు. పాతివ్రత్యమే అన్నిటికీ (పిడుక్కీ బియ్యానికీ) అట్టి పతివ్రతపేరు చెపితే త్రిమూర్తులూ హడలి బేజారై దాసోహమన్నారు. యీ పిదపకాలంలో కూడ యీమన భరతఖండంలో యెందఱో పతివ్రతలు వున్నారు. యెప్పటికేనా మనం తరించవలసివస్తే ఆపతివ్రతలే ఆధారం. తారలు తారల్లాగ 'దళము వేసుక పుట్టిరి తారలైరి' అన్నాడు స్వయంవ్యక్తుడు. ఆచంద్ర తారంగా ప్రకాశింతురుగాక. గృహ మేధి ధర్మానికీ తారాత్వానికీ చుక్కెదురు? నవనాగరికులుకూడా పాతివ్ర త్యాన్ని నిషేధించరుకాని, దాన్ని భంగించే మార్గాలు కల్పిస్తూన్నారు. నీరు నిలవాలంటారు గట్టు తెగగొడతారు; యిది విషయాంతరం, పదకవులు లోకానికి చేసిన వుపకారం సాధారణమైనది కాదు. గొల్లసుద్దులు వగయి రాలుకూడా పదకవిత్వం లోనే చేరతాయి. తోహరాలుకూడా డిటో. యివి

యితరదేశస్థులవల్ల మనకు వచ్చాయి. తేవారములంటూ కొన్ని యక్షగానాల్లో వుంటాయి. చూర్ణికలు వచనంగా వుంటాయి. వాట్లకు యీ పేరెందుకు వచ్చిందో పెద్దలని కనుక్కోవాలి ద్విపదను పద్యాత్మకంగా గేయాత్మకంగా వాడడం వుంది. కాని పదకవిత్వం కింద జమకట్టదగ్గవే........

గాయకులకో...."కొత్తకొత్త కొమ్మన్న" అన్నమాదిరిని కొత్త కీర్తనలమీఁద మోజెక్కువ. మా చిన్నతనం మొదలుకొని యిప్పటిదాకా పరిశీలిస్తే యెన్నో త్యాగరాయ కీర్తనలు మిక్కిలి చక్కఁగా వుండేవి.

వాసాంసి జీర్ణాని యధావిహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి

అన్నమాదిరిగా మూలఁబడ్డాయి. కొత్తవి పయికివచ్చాయి. యిది గాయకుల ఆచారమేకాదు. గానం వినేవారి ఆచారంకూడా అని తోస్తుంది. "పాడిందే పాడరా? పాచిపళ్ళ దాసరీ" అనేలోకోక్తికూడా నవీనానికే వారి గౌరవాన్ని బోధిస్తుంది.

"పృధివినధిపులు నూతన ప్రియులు గారె"

క. పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగములున్
మరగి హరి మనలనొల్లఁడు
నరవరు లోయమ్మ? నూతన ప్రియులుగదే

గానప్రియులుకూడా నూతనప్రియులే. భవతు. వారిజోలి మన కెందుకు? యే సంస్కృత కవులు గాని యే తెలుఁగు కవులుగాని పోలేని పోకడలు పోయిన రచన సాఁగించిన మహాకవులను పదకవులు గబ్బిలు గారనడం దురన్వాయంగా కనపడుతుంది. దక్షిణదేశంలో అరవంలో యీ పద్విషయాలు (వేదంసహా) వున్నట్టే మన తెలుఁగులో పదకవిత్వం లోనూ వున్నాయి.

(1) గూటి చిలుకేదిరా? చిన్నన్నా? గూడుచినఁబోయెరా,

(2) అన్నతో సంసారము చేసేనన్నాదీ
నను c గన్నవా రీభువిలో లే రన్నాదీ

యీమాదిరి తత్త్వబోధకమైన కీర్తన లెన్నో వున్నాయి. వీట్లకి అర్థం చెప్పవలసివస్తే యేకొంచెమేనా వేదాంతజ్ఞానం వుండాలి. షడ్దర్శనీ పారంగతులు నిజమైన మహా మహోపాధ్యాయులు శ్రీ పరవస్తు రంగాచార్లంతటి మేటి కిరీటాలుకూడా కొంత పదకవిత్వరచన చేశారంటే దానికి గౌరవం లేదని యెవ్వరంటారు ?

కీర్తన

(1) స్వాంతమనెడి చంచరీకమా ? స్వామిచరణ సరసిజముల పైని వ్రాలుమా ? ॥చంచరీకమ॥ సరసిజముల....రంగుగ నీ వెల్లప్పుడు మంగళకరు శ్రీనివాసు....రంగార్యావన ? యనుచును ॥స్వాంత॥

(2) ఆదిదేవ ? యఖిలనాథ ? వేదాంత వేద్యరూప నీదయయే దిక్కుమాకూ. యింకా వున్నాయి యెప్పుడో వినడంచేత చెప్టెక్కి చాలా కాల మయింది. పదకవిత్వం యీసడించతగ్గదే అయితే అట్టి వుద్దండులు ఆమోదిస్తారా ? శ్రీ మాడభూషి వేంకటాచార్యులు (అభినవ పండిత రాయలు) భరతాభ్యుదయంలో లాలిపాటలు చెప్పిచేర్చారు. బాగా పరిశీలిస్తే గణనియమంవంటిదే లయ. లయానుగుణంగా వ్రాసినదానికి అగౌరవం యెక్కడనుంచి వస్తుంది ? శబ్దాలంకారాలు వగయిరా పద్యాలతోపాటు పదకవిత్వానికీ వున్నాయి. యింకా అంతకన్న యెక్కువగా ఆశబ్దవైచిత్ర్యాన్ని చూపవచ్చును పద్యకవిత్వంలోకన్న. ఆ వైచిత్ర్యానికి అందం యెక్కువ కనపడుతుంది. ఆకెళ్ళ శంకరయ్య, నీబ్రతుకు వంకరయ్యె. యిత్యాదులు చూచుకోండి. భక్తికి పదకవిత్వం చేసినంత సహాయం పద్యకవిత్వం చేయనేలేదు చూడండీ ?

కీర్తన

మాధవు c దలcచే మానసమైతే మానవజన్మం బెత్తవలెన్, మదమున c జెడి తిరిగేటట్లయితే మహిషంబై జన్మింపవలెన్.

పద్యంలో యీభావం యిమిడిస్తే యింత స్ఫూర్తిలో మనస్సును ఆకర్షిస్తుందా ?

దరువు

(1) జన్మజన్మమున సఖ నామట్టుకు మన్మథుండైనా మగండాట్టమ్మా,

హాస్యపు దరువు

(2) కాపూ కరణం నాపట్టయితే యెట్లా కొడతావు కొట్రా? మగండా ?

వొక రసమేమిటి ? అన్ని రసాలకూ పదకవిత్వం తోడ్పడుతుంది. దీనికలా వచ్చినచిక్కు వేదంతోపాటు అభ్యసిస్తేనేకాని పుస్తకంచూచి అభ్యసిస్తే స్వాధీనపడేదికాదు. యిది ప్రచారకులకు వుండే చిక్కు. అసలు రచయితలకో ? యేదో అల్లేశక్తి భగవంతుండిచ్చినా కీర్తనలో పదాలో రచించడానికి పూర్వులువెళ్ళిన మట్లుకాక కొత్తమట్లు సృష్టించే శక్తి వుండాలి. ఆశక్తి అంతో యింతో నారాయణదాసుగారికి వుంది. చాలాభాగం ఆయన పాడే మట్లు యెక్కువ కష్టంగా వుండవు. గాయకులలో సుప్రసిద్ధ కవులు రచించిన వాట్లకు దీటుగానూ వుండవు. త్యాగరాయల కీర్తనలకో పాఠాంతరాలు (పఠాంతరాలు)నూ కావు. కొన్ని పంబమట్లుకూడా వుంటే వుంటాయేమో? తక్కిన మనదేశంలో వుండే నేంటి గాయకులలో సృష్టికర్త లంతగా కనపడరు. పద్యకవులలాగ పదకవులు రచనకి సిద్ధపడితే పప్పువుడకదు. వ్రాస్తే చాలావ్రాయాలి. హరినాగభూషణంగారు తగినంత సాహిత్యం వున్న కవి అయివుండిన్నీ పదకవిత్వం అంతో యింతో రచించిన్నీ సృష్టికర్తగా పరిణమించకుండా అంతంతలో ఆగడానిక్కారణం కొత్తమట్లు స్ఫురించకపోవడమే అనినాతలంపు.

ఒక్కొక్క శతాబ్దానికి వొక్కొక్కండేనా పదకవులలో సృష్టికర్తవుండునా ? అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడానికి నీళ్ళు నమలవలసి వస్తుందనే నాతలపు. బాణోచ్ఛిష్టమిదం జగత్ అన్నట్టు యేగాయకకవి కొత్త మట్టు రచించినా, దేనికో పాఠాంతరంగా పరిణమిస్తుంది. యిదేపెద్ద

చిక్కు. త్యాగరాయల చరిత్రలో యేవో కొన్ని కీర్తనలు నాగభూషణం గారు వ్రాసి వుండిన్నీ పదకవిగా పేరు పొందక పోవడంచేత యీలా అనవలసి వచ్చింది. అసలే క్షేత్రరచన జోలికి వెళ్ళనినాయఁడుగారికిఁ గాని గాయకసార్వభౌములు శ్రీరామ కృష్ణయ్యగారికిఁగాని యీచిక్కు లేదు. వారు కేవల గాయకులే. అయితే పూర్వం గాయకులు విశేషించి వాడని వాగ్గేయకారక పదాన్ని మన నాగభూషణంగారే పైకి తెచ్చారు. పిమ్మట దాన్ని చాలామంది వాడుకుంటూ వున్నారు. దాని అర్థంనాకు బాగా తెలియదు. అది యెవరికి వాడాలో యెవరికి వాడకూడదో నాకు తెలియదు. నాగభూషణం గారు తదేకనిష్ఠగా గానంలో కృషిచేసిన మహా విద్వాంసుఁడే అయినా ప్లీడరుకూడా అవడంచేత శిష్యవర్గం ఆయనవల్ల విశేషించి తయారు కాలేదు ఆయీ లోటు రామకృష్ణయ్యగారు తీర్చి ఆంధ్రలోకానికి చాలా వుపకరించారు. గానమేకాదు, కవిత్వమేకాదు, వీట్లలో ప్రవేశించిన వారికి యితరకృషి (సంసారానికి సంబంధించిందన్న మాట) యేమాత్రం వున్నా ప్రధానానికి కొంత లోటును చేకూరుస్తుంది అది. వీళ్ళు లోకానికి పిచ్చివాళ్ళుగా కనపడే స్థితిలో వుండాలి. నా చిన్న తనంలో నేను యింట్లో వున్నప్పటికి యెవరేనా యేదేనా పనిమీఁద వచ్చి ప్రశ్నిస్తే మా అమ్మగారు మొగాళ్ళింట్లో లేరు అని జవాబు చెప్పడం నే నెఱిఁగిందే. నాస్థితి అప్పుడు అప్పుడేకాదు యిప్పుడూను “దున్నే టప్పుడు దూడల్లోనూ, మేసేటప్పుడు యెద్లల్లోనూ” అనే లోకోక్తికి వుదాహరణగా వుండేది. చెప్పేదేమిటంటే యే విద్యలోనేనా కృతార్థుఁడు కావాలంటే వాఁడికి సర్వమూ అదే అయి వుండాలన్నమాట.

క. క్షణమును వృధ సేయక ల
క్షణసంగతులున్ బురాణగాధలు దగవీ
క్షణ మాచరించు క్షణశః
కణశశ్చైవ యని చెప్పగా విందుమకా

యీ రోజులలో రామకృష్ణయ్యగారు గాన విషయంలో ఆరాటి దీక్ష పెట్టుకోవడంచేత పలువురు శిష్యులు దక్షిణదేశం వెళ్ళకుండానే యిక్కడనే తయారైనారు. ప్రసక్తాను ప్రసక్తంగా మరో సంగతులు చాలా నడిచాయి. వేదశాస్త్రాదులు అభ్యసించవలసివస్తే అవి బ్రాహ్మ విద్యలైనా గురువులు దయాశాలులు దొరుకుతారు. కాని సంగీతానికి తఱ చుగా దొరకరు. యెన్నిసంవత్సరాలు తఱుచుగా అఱవాకిళ్లుచేస్తూ శుశ్రూషించినా యేతానవర్ణాలవఱకో చెప్పి అంటతప్పాలు తోమిస్తూ వెనకాల తంబురా మీటిస్తూ తిప్పడమేగాని రాగాలాపనవిధానం వగయిరా మెఱుఁగులు దాక్షిణాత్యులు శిష్యులకు నేర్పనే నేర్పరని పలువురు చెప్పఁగా వినడం మాత్రమేకాదు, కొందఱిని చూచాను కూడాను. చిదంబరయ్య గారు (మహావిద్వాంసుడు, రాయలవారిశిష్యుఁడు) వొకప్పుడు చెప్పారు కదా ? తానేమో సదాశివరాయలవారివద్ద సుమారు పదేళ్ళపాటు అధ్య యన బ్రహ్మచర్యాలుచేస్తూ వున్నాననిన్నీ వారు "నీ వెవ్వరు ? యెందుకు వచ్చావు ?" అని అడగనే లేదనిన్నీ అక్కడి శిష్యులతో కలసి మెలసి వుండడంచేత యేదో ప్రవేశం మాత్రం కలిగిందనిన్నీ యిఁక మన కెన్నాళ్ళు వున్నా యిక్కడ ప్రత్యేకించి పాఠం చెప్పే భాగ్యం పట్టదని నిశ్చయించుకొని చేతులు జోడించి మహాశయా ! సెలవు దయచేస్తే యింటికి వెడతానని మనవి చేసుకునేటప్పటికి అప్పుడు నీవెవరు ? యెందుకు వచ్చావు ? అని ప్రశ్నించడం జరిగిందనిన్నీ, అనంతరం విద్యాభ్యాసం నిమిత్తం వచ్చాను. పదేళ్ళు కావచ్చింది అనేటప్పటికి రాయలవారు చిఱునవ్వునవ్వి సరే నీవు పదేళ్ళనుంచీ యిక్కడనే వున్న ట్టయితే నీకు వేఱే చెప్పనక్కఱలేదు. నీవు గాయకుఁడవే, అని ఆశీర్వ దించి పంపేరనిన్నీ ఆయన స్వయంగా చెప్పితేవిన్నాను. యిందులో అతిశయోక్తి యేదేనా వుంటే ఆయనదేకాని నాదికాదు. రాయలవారు మహారాష్ట్రులు. ఆయన అత్తవారు రెండుమూడు లక్షలువచ్చే జమీందార్లు, ఆయనకూడా అలాంటివారి అల్లుఁడవడంచేత ఐశ్వర్యవంతులే అయివుంటా

రని చెప్పనక్కఱలేదు. కొన్ని కృతులు సామ్రాజ్యదాయ కేళ శ్రీకామేశ సామ్రాజ్య॥ అనేది, మొదలుగాఁ గలవి రచించిన పదకవి. యీలాటి మహానుభావులను పద్యకవులు యీసడించడం దురన్యాయంగా తోఁచి యీనాల్గుమాటలు వ్రాశాను. స్వస్తి.

---

# యెందుకీ చేదస్తం?

( 26—8—44 సం॥రం ఆంధ్రవాణి నుండి )

శ్రీయుతులు హరి నాగభూషణంగారు కీ॥ శే॥ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రులవారి శిష్యులా, కాదా? అనేవిషయం తెల్పడానికి సదరు నాగభూషణంగారి శిష్యుని పేరుతో యేదో వక పుస్తకం వెలువడింది, అది చాలా చేదస్తంగా వుంది. శిష్యుడు పేరుతో వున్నదాన్ని గురువు యెఱక్కుండా వుండరు. నాగభూషణంగారు పాటకచేరీలోగాని, ఉపన్యాసం యివ్వడంలో గాని చాలా విపులంగానేగాని క్లుప్తంగా నెఱవేర్చడం యెఱగనివారని నాఅనుభవం. (యీయన ఫిడేలువాద్యం వాలాగ్ర శతభాగం అంటూ మును పెపుడో కృష్ణలో వ్రాసిన జ్ఞాపకం ) నేను సుమారు యేడెనిమిది యేళ్ళ నాడు కృష్ణాపత్రికలో అనునయం అనే వ్యాసంలో యీనాగభూషణం గారికి సంగీతంలో గురువేలేరని వ్రాస్తే దానికి జవాబిస్తూ (అవసరం లేకపోయినా) తమ తండ్రిగారివద్దనే చెప్పుకొన్నట్టు వ్రాసినట్లు జ్ఞాపకం. అప్పటికి యీ గురుశిష్యవిషయిక చర్చరాలేదు గనుక తండ్రిగారితో పాటు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రులవారిని కూడా పేర్కొనే వచ్చునని నేననుకుంటాను (యితరులూ అనుకుంటారని నా నమ్మిక) కొంతమంది బ్రాహ్మణేతరులనుకూడ గురుకోటిలో పేర్కొన్న నాగభూషణంగారు, దక్షిణామూర్తి శాస్త్రిల వారిని పేర్కొకపోవడానికి కారణం మృగ్యం. అయితే తఱచు దక్షిణామూర్తి శాస్త్రిలుగారి సన్నిధికి రాకపోకలు కలిగివుండడంచేత లోకానికి

అట్టి ఆపోహ కలగడానికిన్నీ అవకాశం లేకపోలేదు. శ్రీ శాస్త్రులవారి వద్ద కొన్ని కృతులు (త్యాగయ్యగారివి) స్వరయుక్తములు వ్రాసినాన్నట్లు నాగభూషణంగారి వ్రాత చెపుతూనే వుంది. శ్రీ శాస్త్రులవారు నాకు "గురుతుల్యులు" అని నాగభూషణంగారు చెపుతూనే వున్నారు. నాగభూషణంగారి తండ్రిగారు స్వర్గతులైన కొలదిమాసాలలో నేను బందరు టీచరుగా 1903 లో ప్రవేశించాను. ప్రవేశించిన కొలఁది నాళ్లలోనే శ్రీపుచ్చా సీతారామయ్యగారియింట నాగభూషణంగారితో పరిచయం. అప్పటికే నాగభూషణంగారు స్వర్గమర్త్య పాతాళలోకాలు మూడింటిలోను రెండులోకాలు వదిలిపెట్టి యీ మధ్యలోకంలో తనతో సమానుఁడు మన ఆంధ్రదేశంలోనే కాదు దక్షిణదేశంలోకూడా లేఁడని చెప్పడం నేనే కాదు, శ్రీ కే. టి. రామారావుగారు (ప్రస్తుతం సన్న్యాసులు) కూడా యెఱుఁగుదురు. మేమిద్దరమున్ను మఱికొందఱితోపాటు (కీ॥ శే॥ భాగవతుల పిచ్చయ్యగారు వగైరా) నాగభూషణంగారికి ప్రతిపక్షకోటిలో వాళ్లం. (అట్టి పద్యాలుకూడా కలగూర గంపలో వున్నాయి). శ్రీ గడికపర్తి కోటయ్య దేవరగారిని అభిమానించే తెగలోవాళ్లం. ఆ గొడవఅంతా వ్రాస్తే చాలా పెరుగుతుంది. క్రియలో నాగభూషణం యేమాత్రం గురుత్వం వున్నవారినేనా దాచిపెట్టే స్వభావం కలవాఁడు కాఁడు. నావద్ద యెన్నఁడో యేదో చదివినట్టు చెపుతాఁడు. నాకు యింతవఱకు జ్ఞాపకం లేదు. నాకు జ్ఞాపకం లేని శిష్యత్వాన్ని పైకితీసి పేర్కొనే నాగభూషణంగారికి, నాకంటె అనేక విధాల శిష్టులు, సప్రతిగ్రహీతలు, అగ్రహారీకులు పరమ పూజ్యులూ అని లోకమంతా యేకవాక్యతగా వొప్పుకోఁదగ్గ శ్రీదక్షిణామూర్తి శాస్త్రులవారి శిష్యత్వాన్ని (ఉన్నదాన్ని) కప్పిపుచ్చడానికి కారణం కనపడడం లేదు. షష్టుగోష్ఠు ప్లీడరైనా నాగభూషణంగారు ఛాందసులు. ఆయన వ్రాసేది తదనుగుణంగానే వుంటుంది. నాయెఱిఁగినంతలో అసత్యవాదిగా తోఁచడు. పూర్వాచార పరాయణుఁడు ఏకాక్షర ప్రదాతృన్యాయానికి దోసిలి వొగ్గేవాఁడు. అట్టి నిషధ యోగ్యుఁడు అమా

యికసార్వభౌముఁడు, వున్న గురుత్వం కప్పిపుచ్చి సంపాదించే యశస్సులేదు.

నాగభూషణంగారి బాణీ మనదేశంలో యెవరి బాణీ కూడా కాదని గాయకులు చెప్పుకుంటారు. వృథాగా. నీలాప నింద కట్టిన వాక్యాలు ఆయన్ని గుఱించి వెలువడడం నాకు (తత్వం తెలియడం చేత) యిబ్బందిగా తోచింది. నాగభూషణం వయస్సు షష్టిపూర్తికి అతిక్రమించింది; లోఁగడ వయస్సులో అసత్యవర్తన కలవాఁడికి కూడా యీవయస్సు సత్యవర్తనాన్ని నేర్పుతుంది. అట్టిస్థితిలో జన్మమొదలు సత్త్రవర్తనకల నాగభూషణం యిప్పుడు అసత్యమాడి గురుద్రోహ పాతకాన్ని మూట కట్టుకొని దేహయాత్రకు పాథేయంగా వుపయోగించుకుంటాఁడంటే, అదివిశ్వాస్యంకాదు. అయితే ఆవిధంగా చరిత్రకారులు శ్రీయుతులు శర్మగారు యెందుకు వ్రాయవలసి వచ్చిందోకూడా కొంచెం వ్రాయడం ఆవశ్యకమే. శర్మగారు యితరులవల్ల వినివుందురు. ఆ చెప్పినవారుకూడా తఱచు శ్రీ శాస్త్రులవారి గృహానికి రాకపోకలు జరగడం చూచి గురుత్వం వున్నట్లు భావించి చెప్పి వుందురు. కోటయ్యగారిని శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిలుగారు బొత్తిగా అంగీకరించేవారుకారు; నాగభూషణంగారున్నూ డిటో. యిది నేనేకాదు శ్రీరామారావుగారున్నూ యెఱుగుదురు. నావలెనే వారు యెఱిగిన విషయం నాలుగుమాటలలో వ్రాస్తే యీ వివాద యింతలో చల్లారుతుం దని నా ఆశయం. శర్మగారున్నూ దోషులుకారు. వారు విని వ్రాసివుందురు. ఆవలి వారు అపోహపడుటకు పూర్తిగా అవకాశంవుంది. కనక వారున్నూ దోషులుకారు, బాగా ఆలోచిస్తే యీదోషం నా నెత్తిని భరిస్తే యుక్తంగా వుంటుంది. నాగభూషణంగారి శిష్యుఁడు తనవ్యాసానికి "అసత్ప్రలాప నిరాసము" అని పేరు పెట్టడం కంటే సత్యనివేదనం అని పేరుపెట్టితేబాగుండేది. ఆ వ్రాతలో యీపాపం నామీఁదకే వచ్చేటట్లు తేలిచారు. సంతోష పూర్వకంగా శిరసావహిస్తూ యింతతో యిది చల్లాఱడాన్ని కోరుతూన్నాను. నేనేనా ఆనాలుగు పంక్తులూ వ్రాయడావి

త్కారణం నిర్దోషికి ఆపలివారివాక్యాలు దోషాన్ని ఆపాదిస్తాన్నాయి గదా అని భయపడుతూ భయపడుతూ వ్రాశాను. నాగభూషణంగారి తండ్రిగారి స్వర్గతి 1902. నేను బందరు టీవరీకి వెళ్ళినదేటు 1903 వ ఫిబ్రవరి. శ్రీదక్షిణామూర్తి శాస్త్రిలవారు బందరు ప్రవేశించినదేటు 1907. 1904 మొదలు నేను శ్రీ శాస్త్రిలవారితో పూర్ణమైన పరిచయం కలవాణ్ని. నా యెఱిఁగినంతలో నాగభూషణం శ్రీ శాస్త్రిలవారివద్ద గురుశుశ్రూషమః అని కూర్చుండి ఫిడేలుమీఁద గాని గాత్రింమీఁదగాని చెప్పుకోవడం నేనెఱుఁగను. శిష్యునివలె వినయవిధేయతలతో ప్రవర్తించడం పూర్తిగా యెఱుగుదును. నేను శ్రీరామకృష్ణయ్య పంతులుగారి కంటే పూర్వం శుశ్రూషచేసిన శిష్యులు—

(1) వేదుల లక్ష్మణశాస్త్రుల్లుగారు
(2) నరసింహశాస్త్రుల్లుగారు
(3) దుడ్డు సుబ్బయ్యగారు
(4) సీతారామయ్యగారు

వగయిరాల (మాబంధుగులు)ను కూడా యెఱుగుదును. ఆయీ కారణంచేతనే, "అందు శ్రీరామకృష్ణయ్య ఆద్యుఁడయ్యె, మధ్యతరగతి వాఁడయ్యె మతికతాన," అని వ్రాశాన్నాను. అనఁగా శ్రీవారి శిష్యులలో శ్రీ మన రామకృష్ణయ్యగారు మొట్టమొదటి బాచ్ (batch) లోవారు కాకున్నను, బుద్ధి విశేషంచేత మొదటివారుగా పరిగణింపఁబడుచున్నారని నా తాత్పర్యం. సరే. ఆయీ నావ్రాతవల్ల యెవరికిగాని మనస్సంశయము లుండకుండునట్లు భగవతి తోడ్పడి శాంతిని ప్రసాదించుఁగాక! శర్మగారు యోగ్యులు. నాగభూషణంగారు యోగ్యులు. వండ్లగింజలోది బియ్యపు గింజ, యిఁదేమీ! వివాద బీజంలేదు; కల్పించుకుంటే ప్రతిదానిలోనూ వుంటుంది. యెందుకీ చేదస్తం?

ఆ యీ వ్యాసంలో నేను వాలాగ్రశతభాగ అనిమేత్తికొని కొంచెంగా నాఅనుభవాన్ని యెప్పుడో వ్రాశాను. కానియింకా నాకడుపులోదాన్ని

సుజించి వ్రాయవలసిన సంగతి చాలావుంది. (అంతర్గుడ గుడాయతే బహిర్వక్తుంనశక్యతే) నేను యిప్పటికి 40 యేండ్లకు పూర్వం సదరన్ మరాటారైలుమీఁద ప్రయాణం (గద్వాల వెడుతూ) చేస్తూన్నప్పుడు ఆ కొండలు యెక్కడం దిగడం దగ్గిఱ కనపడే దృశ్యం చాలా అసాధ్యంగా కనపడేది. రైలు మార్గానికి వొకవైపు చూస్తే రమారమీ అరమైలు లోతు అగాథం, యింకోవైపు చూస్తే అంతో అంతకంటే కూడా కొంత హెచ్చో యెత్తుప్రదేశం, కనపడేది. యీమధ్యనుంచి రైలు వెళ్ళడంలో యేమాత్రం బెడిసినా అధఃపాతాళం చూడవలసిందే రైలు! భారతంలో జరత్కారుఁడుగారి పితృదేవతలు యేదో మహాగర్తంలో పడుతూ పడుతూ యే లతల బాపతు వేళ్ళనో పట్టుకొని నిల్చి తమవంశీకుఁడైన జరత్కారునితో మాట్లాడడం యేలాటి దృశ్యమో నాగభూషణంగారి ఫిడేలు పీఁట సమీపంలో నడిచేవాద్యం అలాటి దృశ్యం. లేదా? శ్రీవ్యంగా నాకుతోఁచేది. గానంలో పాండిత్యం బొత్తిగాలేని నేను చూపిన యీపోలిక నాగభూషణంగారికిఁ గాని యితర గాయకులకుఁగాని నచ్చకపోవచ్చును. నేను ఆయన వాద్యంలో కనిపెట్టఁగల్గిన విశేషం సంగ్రహించి వ్రాశాను. గానంగాని కవిత్వంగాని కవిగాయకులు కష్టించిన కష్టాన్ని బట్టి లోకామోదాన్ని పొందనేరవు. ప్రస్తుతం దానికి వ్యతిరేకంగా కనపడడం చేత నేనింతగా వ్రాశాను, మహారక్తిలో వున్నప్పుడు ఆయన ఫిడేలు మీఁద కమానువేయడం మానినా వాయిస్తూన్నట్లే కనబడుతుంది. ఆ యీ రహస్యాలు ఆవిద్యలో కృషిచేసినవారు విమర్శించవలసినవి. అస్మదాదులు "మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః" అనే కాళిదాసోక్తికి గుఱి కాతగ్గవారే.

నాగభూషణంగారు చెన్నపురి వెళ్ళివచ్చినపిమ్మట అంతకుపూర్వం యీసడించేప్రత్యర్థులంతా మెచ్చుకొనే స్థానానికి వచ్చాడన్నది నిర్వివాదాంశం. కాని యీ సంగీతం యీయనకు చాలా అపకారం చేసింది. కష్టించి చదువుకున్న యింగ్లీషులోనే వుంటే చాలా బాగా వుండేది.

సంగీతంగాని కవిత్వంగాని జీవితానికి స్వాతంత్ర్యాన్ని కలిగించ డంకో అంచెవేసినవే గాని, వీట్లవెంట దారిద్ర్యం దీపానికి నీడలాగు ఆశ్రియించడం అనుభూతం. దానికి తోడు అనారోగ్యంకూడా యేర్ప డింది, అసలు సంగీతవిద్యకు జంత్రములు యేర్పడిన కారణం, గాత్రమా ధుర్యం, లేదా పాటవం, వయస్సునుబట్టిగాని ఆరోగ్య లోపాన్నిబట్టిగాని లోపిస్తే, అంతతో వారివారి గానశక్తి అంతరిస్తుందేమో అనే భయమే అనుకుంటాను. అయితే నాగభూషణంగారి విషయంలో ఆజంత్రంకూడా విరోధించడం శోచనీయం. కాలికి వచ్చినజబ్బు జంత్రానికి ప్రతిబంధిం చదు. చేతికి కూడా వచ్చింది అనితరసాధ్యమైన తన మార్గాన్ని కొడుకు లకు నేర్పడానిక్కూడా అవకాశం లేదనే అనుకోవాలి. ఆయీ సందర్భంలో బాణమహాకవికొడుకు చెప్పినశ్లోకం జ్ఞప్తికి వస్తూవుంది.

శ్లో. యాతే దివంపితరి తద్వచ సైవసార్ధం
విచ్ఛేదమాప భువియస్తు కథాప్రబంధః
దుఃఖం సతాం తదసమాప్తికృతం విలోక్య
ప్రారబ్ధ ఏష తు మయా నకవిత్వ దర్పాత్.

అక్కడ స్వర్గతి జరిగింది యిక్కడ జరగలేదుగాని ఆయన ప్రధానవిద్యకు కులక్రమాగత విద్యకు స్వర్గతి జరిగినట్లే పరిణమించింది. "సోఽప్యన్యఏవ భవతీతి విచిత్రమేతత్"

ఈ నాగభూషణం, ఆనాగభూషణమేనా? అంటే యెవరో యెరి గినవాళ్ళకు తప్ప యెట్లు గోచరిస్తుంది?

"పటచ్చరీభూతా ఖల్వియం కీర్తిపతాకా నన్విదానీమేవ ద్రష్టవ్యమ్" అన్నాడు పరశురాముణ్ణి రఘురాముడు. యేదో భగవంతుడు పెద్ద అపకారాన్నే చేసినా యింకా కొంత అనుగ్రహాన్నే చూపినట్లు తలుస్తాను; అనావశ్యకమైన ఆయీవాదాలకూ మీవ్యాధికీ, బొత్తిగాపడదు. మీశిష్యుని పొత్తం వ్రాత చేదస్తంగా వుందని నేను వ్రాసినందుకు మీరు నన్నుకినిసి

యేదో నా్రిస్తారేమో? ఆ ప్రియత్నం వద్దు, యేవో నాల్గుమాటలతో తేలిపోయేదానికి అంత వా్రఁతెందుకని నేనావిధంగా వ్రాశాను. మీరు నావా్రితనుబట్టి యీ వివాదలోకి దిగడం నాకు చింతాకరం. అందుచే నేను మిమ్ము అనునయింపవలసివచ్చింది. మీరు మంచిసంస్కృతాంధ్రిసాహిత్యం కలవారు. మీవ్యాధి సంగీతానికే కాని తక్కినవిద్యలకు అడ్డదు; "ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాంతచింతయా" అన్న అభియుక్తోక్తి మీ రెఱుగనిదికాదు. మీస్వభావ మెఱిఁగిన వారెవరుగాని మిమ్ము కృతఘ్నులని అనరు; వినరు. మీరిందులకై భయపడి వృథా వాదాలకు దిగి ఆరోగ్యాన్ని చెడగొట్టుకోవద్దు, ఇంతే నా ఆదేశం.

---

# నిజమాడితే నిష్ఠూరమా?

(హరినాగభూషణంగారి శిష్యత్వపు తగాయిదా?)

(23—3—1946 సం॥ర ఆంధ్రివాణినుండి)

క్షమాపణ చెపితే బాగుంటుందేమో! ఎవరికి? శ్రీయుతులు శర్మగారికి. ఎందుకు? వూరికేనే. వారు యెఱిగో యెఱక్కో హరినాగభూషణంగారిమీఁద వృథాగా (హృదయే కిమపి కృత్వా) కృతఘ్నత్వాన్ని ఆపాదించే అక్షరాలు వా్రిస్తే "తీరికూర్చున్న సామెతగా" నాయెఱిఁగిన సత్యాన్ని (యెవరుగాని నన్ను అడగనిదే) తెల్పే అక్షరాలు పత్రికలో లిఖించినందుకు! ఇందేమి తప్పుంది? యెవరేనా పొరబడి యేదేనా వా్రఁత పూజ్యులను అవమానించేది వా్రిస్తే యెఱిఁగినవారు దాని సత్యాన్ని తెల్పవచ్చునే! అంటారేమో? వినండి. అదిప్రమాదప్రియుక్తం అయితే అప్పుడు తెల్పడమూ యుక్తమే. ఆవలివారు సవరించుకోవడమూ యుక్తమే. ప్రిస్తుతం వా్రఁత అట్టిదికానప్పుడు "నాఽపృష్టః కస్యచిద్బ్రూయాత్త" ని వుండడంచేత వూరుకోవడమే యుక్తమనేదికూడా

కేచిన్మతంగా లేకపోలేదుగాని తథాపి అత్యంత యోగ్యుఁడు అమాయికుఁడు విద్వాంసుఁడు సత్యవాక్యతత్పరుఁడూ అయిన వొక సత్పురుషుని కీర్తికి నిర్హేతుకంగా కళంకాన్ని ఆపాదించే వ్రాఁత వెలువడినప్పుడు, దానితత్త్వం తెలిసినవాళ్ళు దాన్ని ప్రచురించడానికి విజ్ఞులు సమ్మతింపక పోరని విశ్వసించి అనాలుగుమాటలూ ఆంధ్రిలో వ్రాశాను. అందులో షూడుగాని పేరుగాని లేశమూ యెత్తలేదు. పంక్తులూ అక్షరాలుగా నడిచినట్లు జ్ఞాపకం. ఆవ్రాఁత ఆ యీ నావుద్యమాన్ని శర్మగారు చాలాగర్హించారు. అది యుక్తమే. వారివ్రాఁతకు యిది బాధకంగా వుందికదా! తేభ్యో మహద్భ్యో నమః జటాయురహం నాఽయం వృథాపవాదం సహతే సత్యమేవ జయతి. తరవాత నాగభూషణంగారి శిష్యుని పేరుతో ప్రకటితమైన వ్రాఁత విపులంగా విషయాన్ని (కీ॥ శే॥ లు దక్షిణామూర్తిశాస్త్రిల వారికి భూషణంగారు సాక్షాచ్ఛిష్యులా? లేక యేవిధమైన శిష్యులుకారా? అనికాఁబోలును దానిలో వుంటుంది. నాకిప్పుడు బాగా జ్ఞాపకంలేదు.) బోధించేదైనా నాకు చేదస్తంగా తోఁచి నిరసించాను గాని అందులో భూషణంగారు వారికి శిష్యులని నేను వాచ్యంగాగాని వ్యంగ్యంగాగాని నిరూపించినది లేదు. శర్మగారికి (అబద్ధంవా సుబద్ధంవా) శిష్యులే అని సాధించడం కామ్యం గనుక భూషణంగారికి కృతఘ్నత్వదోషాన్ని ఆపాదించినట్లే నాకు యీదోషాన్ని కుయుక్తిచేత ఆపాదిస్తున్నారు. యిది పరీక్షాసమయం. సత్యం తేల్చవలసి వుంది. యుక్తులు పనికిరావు. దైవం కలఁడనిన్నీ, అసత్యం యిహపరలోకాలకు బాధకమనిన్నీ తెలుసుకొని ప్రసంగించాలి. అంతేనే కాని నైపుణ్యాన్ని గాని పాండిత్యాన్నిగాని వుపయోగించడం పనికిరాదు. ముక్కుకు సూటిగా నడవాలి. శ్రీయుతులు శర్మగారు వ్రాసేది శ్రీగాయక సార్వభౌములనుగూర్చి ప్రధానంగా వ్రాస్తున్నారు. ఆ రచనలో ప్రకరిగా శ్రీదక్షిణామూర్తి శాస్త్రిలవారి చరిత్రకు ప్రసక్తి కలిగింది. శ్రీశాస్త్రిల వారి శిష్య ప్రశిష్యులపేర్లు వ్రాయవలసి వచ్చింది. తమకుతెలియడంలో నాగభూషణంగారు కూడా శిష్యులు అని తెలిస్తే అందఱితోపాటుగా సంఖ్యా

పూరణంచేసి పూరుకోవడం వఱకే అవసరం గాని ఆవాౕతకు అనుబంధంగా వారిమంచినిగూర్చి గాని చెడ్డనుగుఱించిగాని వ్యాకరించవలసి వుండదు. మఱికొందఱిని గూర్చికూడా అలా కొన్ని విశేషాలు యేవో వ్రాయడం పెట్టుకొంటే భూషణంగారిని గూర్చికూడా వ్రాయడం కొంతేనా సమర్థనీయం అదేనా మంచికే అవుతుంది గాని యిప్పుడేలా అవుతుందో నాకు అగమ్యగోచరంగా వుంది. ప్రకరణమేమో ? శిష్యులజాబితా. నిజంగా నాగభూషణం వారి శిష్యుడై వుండిన్నీ ఆశిష్యత్వాన్ని అపహ్నవించి కృతఘ్నుఁడుగా వర్తించినా ఆదోషాన్ని వ్యాకరించడం ప్రస్తుతంగాదు. అట్టి స్థితిలో అసత్యమైనదాన్ని అంటగట్టి వ్యాకరించడానికి యేసహృదయు లొప్పుకుంటారు ? శాంతంపాపం మాటవరుసకి భూషణంగారిమీఁద శర్మగారికి చాలా అభిమానం వుందనుకొందాం కొంతసేపు; యీప్రకరణంలో దాన్ని పురస్కరించుకొని భూషణంగారి ప్లీడరీని సాహిత్యాన్నీ శిష్టాచార సంపత్తినీ వ్యాకరించడం అవసరమౌనా ? కాదనే నేననుకొంటాను. లాభమున్నా లేకున్నా భూషణంగారిని అయోగ్యుఁడుగా అపవదించడమే శర్మగారి ఆశయ మనుకోకతప్పదు. శ్రీయుతులు శర్మగారు లౌకికజ్ఞాన ధురంధరులు. పైఁగా "ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రం" అనే అభియుక్తోక్తికి లక్ష్యంగా వుండదగ్గవారు అయితేయేమి ! స్వార్థనిర్వహణాసక్తి కొంత వారిని ప్రమాదప్రాఁతకు పురికొల్పిందంటే (స్వార్థం సంపాదయేత్ ప్రాజ్ఞః ! స్వార్థ భ్రంశోహి మూర్ఖతా) దానియందు అట్టి గుణం వుండడంచేత అది సమర్థనీయ మవుతుందిగాని అన్యథా సమర్థనీయం కాదనే నాతలపు. యేదోవిధంగా నాగభూషణాన్ని దోషిగా సమర్థిస్తేనే గాని శర్మగారికి నిద్రపట్టనేఁ ట్టదనే అంశాన్ని వారి యిప్పటి వ్యాసరచనలోని కొన్నిమాటలు (ధూపముపై చినట్టులై వగయిరా చూ.) వ్యాకరిస్తాయి. వారి తాత్పర్యం యిది. యేదంటే ? నేను సమర్థుణ్ణి, నాకు అవసరమైయేదో వ్రాసుకుంటాను. దానికివిరుద్ధంగా వుండేమాటలు వ్రాయడానికి నువ్వెవ్వరు ? ముసలాడవు కృష్ణా ! రామా ! అనుకోతగ్గ వయస్సులో

నీకీ గోలతో యేంపని? యింతటితోనేనా కట్టిపెట్టు అని నామీఁదకి మాతే రీతిని బోధించే వాక్యాలు కొన్ని వున్నాయి. నేను ఆరోజులలో బందరులో నివసిస్తూ వున్న కారణంచేత నాకు బాగా తెలిసిన సంగతికి విరుద్ధమైన వ్రాఁతచూస్తే వెగటుగాతోఁచి యెంతో మృదువుగా గూఢంగా పేకీసంఖ్యా కూడా పుటంకించకుండా ప్రధానాంశాన్ని యెన్నడో సూచించడానికి అబ్బ! యెంతఆగ్రహం! యెంతకోపం! యెంతటి బోధ! నాకు గురువులుకూడా యీవిధంగా బోధించినవారు కారు. శర్మగారి సాహసం వర్ణనీయం వందనీయం. నందనీయం యింతకన్న యేమి వ్రాసేది? సుమారు రెండేళ్ళ నుంచి ప్రయత్నించి నేటికి దండుపెడలడానికి నిశ్చయించుకున్నారు. సపాదలక్షగ్రంథంతోటి యీ స్వల్పానికి అంతగ్రంథం యెందుకో!

"మహతా ప్రయత్నేన లబ్ధ్వాకృష్యతే" అన్నారు మహాభాష్య కార్లు "అయ్యా! మీరు యెంతగ్రంథం సంపాదించి ప్రచురించినా అది శబ్దప్రమాణంలోకి చేరుతుంది. నా అనుభవం ప్రత్యక్షప్రమాణానికి సంబంధించినది. మీకంటేకూడా నాకు దక్షిణామూర్తి శాస్త్రుల్లువారు మిత్రులు, పూజ్యులు, వారేవుంటే యిప్పుడు యీసమస్య వారిచేతనే పూర్తిచేయించే వాణ్ణి. (త్రుటిలో) మీశబ్దప్రమాణం నాప్రత్యక్షప్రమాణాన్ని భంగించ డానికి సమర్థం కానేరదు. ఆశక్తి వాక్కు అపౌరుషేయ వాక్యాలకు (వేదవాక్యాలకు) తప్ప యితరులవాక్యాలకు (వారు సన్యసించినాసరే స్వాభిమానం దేహమున్నంత వఱకు వదలదనియ్యేవే) శాస్త్రకర్తలు అంగీకరించలేదు. కనక మీ సపాదలక్షగ్రంథం నాప్రత్యక్షప్రమాణ జ్ఞానాన్ని లేశంగాని లవలేశం గాని, దానిలో శతాంశం గాని తొలగించేది కాదు. నేను నా సత్యాన్ని త్యజించేది లేదు. "గజం మిథ్య పలాయనం మిథ్య." అనే త్రోవలోకి దిగితే నాప్రత్యక్షానుభవం అంతరిస్తే అంత రిస్తుంది యేమిలాభం! ఆ పక్షంలో శాస్త్రుల్లుగారూ లేరు శిష్యులూ లేరు, నేనూలేను, మీరూలేరు. (బ్రహ్మసత్యం జగన్మిథ్య) గదా! (ఉ. సీతయు లేదు....కైకయ పుత్రియు లేదు, సర్వము న్నూతనసృష్టి....పద్యం చూ.)

మీరు నాలుగేళ్ళ నాగభూషణంగారు శ్రీశాస్త్రిలవారి శుశ్రూష చేసినట్లు వ్రాయుచున్నారు. దీన్ని ఖండించేమాటలు యెందుకీ చేదస్తం అనే నాపూర్వవ్యాసంలో వుంటాయి. పనిపడ్డప్పుడు వాట్లని పైకితీదాం. క్షమాపణ చెప్పబోతూ అవి యిప్పుడెందుకు బైటపెట్టడం? యీనాలుగుమాటలూ శ్రద్ధగా వినండి. నాగభూషణం వొక్కరోజుకూడా నావద్దగురుభ్యో నమః అని యేరఘువంశంలో శ్లోకమో చదివాఁడో లేదో నాకు బాగా గుర్తులేదు. అట్టి సందర్భంలో నాయందు గురుత్వం వున్నట్టు చాటుకుంటాఁడే? దక్షిణామూర్తి శాస్త్రుల్లుగారు నాకంటే కులంలోగాని గోత్రంలోగాని యింకా యింకా "నప్రతిగ్రహీతృత్వం" వగయిరా సదాచారాలలోగాని యెన్నోరెట్లు అభ్యర్హితులే. అట్టి మహనీయుణ్ణి గురువుగా చెప్పుకుంటే యేంలోపమని అపహ్నవిస్తాడో! మీరే శెలవియ్యాలంటాను. నాగభూషణం ప్లీడరీరోజుల్లో వృత్తిధర్మాన్ని పట్టి యేమేనా అసత్యం ఆడితే ఆడివున్నాడేమో కాని యితరత్ర ఆడేతెగలో అతనికి సీటువున్నట్టు నేను యెఱుఁగను. నిషధయోగ్యుఁడు గురుభక్తుఁడు చేదస్తుఁడుకూడాను. వైష్ణవులు స్వయమాచార్యులమని చాలామంది చెప్పడంవుంది. ఆవిధంగా నాగభూషణ మేమేనా చెప్పుకుంటూ వున్నాఁడా? దక్షిణాదిని యెవరి వాద్యాలో (వినడమేకాని గురుభ్యోనమః లోవికావు) విని తన బాణీ మార్చుకున్న కారణంచేత వారిపేర్లు (వారిలో నానుబ్రామిన్సు) కూడా వున్నారు. గురుపరంపరలో చేర్చి ప్రకటించి వున్నాఁడు. యీసందర్భం యెందుకు వచ్చిందంటే సుమారు యిప్పటికి యేడెనిమిదేళ్ళ కిందట నారాయణదాసుగారున్నూ యితఁడున్నూ యేదో లయ జ్ఞానవిషయంలో పట్టింపులు పట్టించుకుంటూ వుంటే నేను అనునయం అనేశీర్షికతో వకదీర్ఘవ్యాసం వ్రాసి (కృష్ణాపత్రిక చూ.) రాజీచేసాను. అందులో నారాయణదాసు మాదిరిగా యితఁడున్నూ స్వయం గురుకుఁడు అనివ్రాశాను. దాన్నిమాత్రంయితఁడు అంగీకరించక తనకు ఫలానా ఫలానావారు గురువులున్నారని వారిపేర్లు వుదాహరించివున్నట్టు జ్ఞాపకం. ఆజాపితాలో దక్షిణామూర్తిశాస్త్రుల్లుగారి

పేరులేదు. శాస్త్రుల్లుగారివద్ద కుక్కూష్రచేసేవుంటే ఆపేరు కప్పిపుచ్చేటంత దుర్బుద్ధి వాడు నాగభూషణం అని చెప్పటానికి నోరుగాని వ్రాయడానికి చేయిగాని నాకు రాదు. అదిగాక బందరులో నాబసకు శాస్త్రుల్లుగారి బసకు చాలదగ్గిర. వారింట యేస్వల్ప ప్రసక్తివచ్చినా నన్ను భోజనానికి పిలవకుండా వుండేవారు కారు. శాస్త్రుల్లుగారు. సంగీత సభంటూ యేగాయకులదేనా అయితే శాస్త్రుల్లుగారూ నేనూ కలిసివెళ్ళేవారం. నాగభూషణం చెన్నపట్టణం బి. యల్. చదవడానికి వెళ్ళినకాలం నేను బందరు టీపరీకి వెళ్ళినకాలం యివన్నీ రిజిష్టరయి వున్నవే. శర్మగారు వ్రాసే నాలుగేళ్ళో అయిదేళ్ళో దేనిలో యిముడుస్తారో నాకు బోధపడడం లేదు. పత్రికల్లో వ్రాయవలసివస్తే చాలా పెరుగుతుంది. గదిలో వారూ నేనూ కూర్చుని మాట్లాడుకుంటే స్వల్పంతో యధార్థం తేలుతుంది. వారు నన్ను తూలనాడినందుకు సంశయింపక దర్శనమిస్తేసంతోషిస్తాను. ముఖాముఖీని యీసమస్య తేలుతుంది. కాదూ కూడదూ నాగభూషణాన్ని కృతఘ్నుణ్ణి చేస్తేనే గాని రామకృష్ణయ్య పంతులుగారి చరిత్రకు వన్నె కలగదంటే మనవి చేయలేను. నావార్ధక్యాన్ని యుక్తంగా నడుపుకోవలసిందన్న మీ ఆదేశాన్ని శిరసావహిస్తాను, కాని అసత్యప్రచారం (మీరేకాదు యెవరేనాసరే) చేస్తూ వుంటే సహించలేను. ఆయీ నాదుర్గుణమే మీమనస్సుకు నొప్పికలిగించే అక్షరాలు నాచేత నాడు వ్రాయించింది తద్ద్వారా నేను మీకు అపరాధం చేసినట్లు పరిణమించి మీచేత "చీవాట్లు" తినవలసి వచ్చింది. నాగభూషణాన్ని గుణించిగాని వేజాకరిని గుణించిగాని పొరబడిగాని బుద్ధిపూర్వకంగా గాని మీరు యెట్టిప్రచారం చేసినా నాకెందుకని వూరుకుంటే బాగుండేది. యిప్పుడు తోచి యేం లాభం "విప్రాః పశ్చిమబుద్ధయః" "బుద్ధిజాడ్య జనితోన్మాదుల్గదా శ్రోత్రియుల్"

మీరు మీగ్రంథానికి యెంతో గౌరవాన్ని ఆపాదిస్తుందనే నమ్మికతో లిఖించిన విశేషానికి భంజకమైనవ్రాఁత నేను యెఱిఁగివున్నా వ్రాయడం నా తప్పే అని క్షమాపణ చెబితే మీహృదయానికి శాంతి కలుగుతుందా? యింకా

సపాదలక్ష "సపాదకోటి" గా పెరుగుతుందా! గ్రంథం. యీ అంశం తెలిపితే "తాటికాయలంత" పెద్దక్షరాలు హెడ్డింగు పెట్టవలసిందని పత్రికవారిని కోరి క్షమాపణ పంపుతాను. లోగడ పెద్దక్షరాలతో పెట్టిన హెడ్డింగు పత్రికా సంపాదకులదిగాని నాది గాదు. మీరు నాదిగా భావించి యీ వ్యాసంలో దానికికూడా నన్ను మందలించి వున్నారు. దీన్నిబట్టి చూచినా మీరు సత్యనిర్ధారణకు తగినంత శ్రద్ధపుచ్చుకోరని తెల్లమౌతుం దేమో? పత్రికా సంపాదకులను అడిగి చూడండి! కొంచెం వారేమం టారో; యింకొకటి నాలోపాన్ని మీరు సూచించారు. నేనేమో వెఱ్ఱిమొఱ్ఱి దీర్ఘవ్యాసాలు వ్రాస్తానని అవి చదువరులకు పరమాసహ్యంగా వుంటా యనిన్నీ వ్యక్తపఱిచే అక్షరాలు కనపడతాయి. మీతొందరపాటు వ్రాంతలో మీరు వ్రాసిన అన్నిసందర్భాలకంటే గూడా అంతో యింతో సత్యానికి కట్టుపడేది యీ సూచనే. నా యీ చేదస్తాన్ని నేను యేవగించుకుంటూనే వుంటాను. అయితే యేంలాభం, లేఖిని చేతపట్టేటప్పటికల్లా అవి వెఱ్ఱిగా నడచి మీవంటి విజ్ఞులచే చీవాట్లు తినిపిస్తుంది. యీ అంశాన్ని యేడెనిమి దేళ్ళనాడు యెవరో మహనీయులు పత్రికవారికి వ్రాంతపూర్వకంగా తెలిపి వున్నారు. ఆమందలింపు పత్రికవారు ప్రచురించి దాన్ని ఖండించి యేవో రెండువాక్యాలు దానిక్రిందనే ప్రకటించి వున్నారు. అవి తాముచూడలే దేమో? దానికి పత్రికవారు వుత్తరవాదులు కనుక ఆయీ దీర్ఘవ్యాసరచనా పిచ్చితనానికి మీకు నాక్షమాపణ అవసరంలేదు. (భిన్నరుచిర్హి లోకః) యెన్నివిధాల పరిశీలించినా మీరు నాగభూషణాన్ని అంటకట్టిన కృతఘ్న త్వానికి అడ్డపడడమనేదే నా అపరాధం. దానికే నేను క్షమాపణ చెప్పాలి. పిమ్మట శేషించిన వార్ధక్యాన్ని యీలాటి అధర్మకార్యాలకు ఖర్చుపెట్టక మీ ఆదేశప్రకారం ఖర్చుపెట్టాలి. యింతటితో మీఅనుగ్రహానికి నేను పాత్రుణ్ణికాగలుగుతాను. నాకు నన్నయ్యభట్టారకుని—

చ. సుతజలపూరితంబులగు నూతులు నూరిటికన్న........
తత్సుతశతకంబుకన్న నొక్క సూనృతవాక్యము మేలు చూడగన్.

అనే పద్యమందు చాలా గౌరవంగాను. నేను ఆ పత్రికా ద్వారంగా మీకు సూచించిన అంశం ఆయా పద్యానికి అర్థమై నాకేమా పుణ్యలోకానికి మార్గదర్శకమౌతుందనుకున్నాను కాని మీచేత యమలో కంలో చీవాట్లు తినవలసి వస్తుందనుకోలేదు. "నాఽనృతం బ్రూయాత్" అనే వాక్యానికి అనృతం న బ్రూయాత్ అనియ్యేవే అర్థమనుకున్నానుగాని నాఽమనుజః అనృతం బ్రూయాత్ అనే విపరీతార్థాశ్రయణం యుక్తమనుకోలేదు. అయితే "ప్రాణవిత్త మాన భంగమందు బొంకవచ్చు వధము బొందదు" అని వుంది కనుకనున్నా యిందులో మీరు నాగ భూషణాన్ని కూర్చి ఆపాదించిన కృతఘ్నత్వాన్ని సవరించుకోవలసి రావడం మూడవదానికి భంజకంగా వుండడంచేత మీ ఆగ్రహానికి నేను గురికావలసి వచ్చింది గాని మీవెనకాల నేనుకూడా అనుకూలంగా దాంగు చేస్తే మీ ఆగ్రహాగ్నికి నేను శలభం కాకపోయేవాణ్ణి సుమండీ? మళ్ళీ పొకసారి సింహావలోకనంగా మీవ్యాస వాక్యాలు (నాగభూషణంతో నన్ను జోడించి వ్రాసినవి) పర్యాలోకనం చేయండి యేమైనా పశ్చాత్తాపాన్ని కలిగిస్తాయేమోను. అది కలిగితే ఆదోషం నివర్తిస్తుంది గాని అన్యథా నివర్తించదని నావెఱ్ఱి. నావార్ధక్యాన్ని నమశ్శివాయ జపంతో చాలాభాగం వెళ్ళిస్తున్నాను. సత్యనిర్ధారణంకూడా అట్టిదే అనుకున్నాను. అది విప రీతమై మీకు నొప్పిని కలిగించింది. (చెళ్ళపిళ్ళకు సరస్సుకు మార్గాన్ని చూపిన గతి పట్టింది) మీతో వాదోపవాదాలు చేసేశక్తి లోపించి నాకు చాలాకాల మయింది. అందుచేత క్షమాపణ చెప్పి మీఅనుగ్రహాన్ని పొందదలిచాను. సమ్మతిని తెలిపితే వెంటనే వ్రాసి పంపుతాను. శుభస్య శీఘ్రం. త్వరలోతెల్పండి లేదా ? దీన్నే క్షమాపణగా అంగీకరించినావరే !



# ము ష్టి

(15—4—46 సం॥ర జన్మభూమి నుండి)

యీ పేరుతో వొక వృత్తి విశేషించి భరతఖండంలో అనాదిగా వుంది. యేయితరవ్యాపారమూ లేనివాళ్ళు దీనికి అధికారులు. దీనికిన్నూడా కొన్ని ఉపాంగాలు ఉండాలి. 1. తంబురా 2. చిరతలు వగైరా. అంతో ఇంతో సంగీతం వచ్చినవాళ్ళకి గాని పయిని ఉదాహరించినవి యేమీ చేతఁగాని (బ్రాహ్మణేతరులకు) వాళ్ళకు జోలి, బ్రాహ్మణులకో చెంబూ పంచాంగమూ "సీతారామాభ్యాం నమః" యింతే. యీ వృత్తికి యీపేరు గుప్పెఁడుతో పెట్టడంవల్ల వచ్చిందని తోస్తుంది. దోసెఁడు తోకూడా కొందఱు దీన్ని పెట్టడం వుందికాని అది ఆనకట్టకు పూర్వపు సంగతి. అందఱూ యీవృత్తిలోకి దిగినతర్వాత గుప్పెడుతో కూడ పెట్టడం సకృత్తుగానే కనపడుతూ వుంది. కొందఱు బ్రాహ్మలు యీపదం (ముష్టి) యింటి పేరుగా వున్నవారు మన తెలుఁగు దేశంలో ఆకువీడు ప్రాంతంలో కనబడుతారు. ఆపేరు వారికి రావడాని క్కారణం ముష్టి ఎత్తడంచేతనే వచ్చిందో శ్రద్ధాభక్తులతో ముష్టి పెట్టడం చేతనే వచ్చిందో విజ్ఞులైన పెద్దలవల్ల తెల్సుకోవాలి బ్రాహ్మణజాతిలో విశేషించి స్మార్తులే గాని దీనివల్ల వైష్ణవులు కుటుంబం గడుపుకొనే వారు కనపడరు. వారికి వారిమతగురువు రామానుజులవారు. "శిష్యసంచారం" వొకటి (కొన్ని దివ్యదేశాలుకూడా) ఆధారం చూపించడంచేత చాలా భాగం దానిద్వారా జీవనం జరిగిపోతుంది. అందుచే సాతానులుతప్ప శ్రీవైష్ణవులు యీవృత్తి చేత జీవించడం కనపడదు. వైష్ణవపదం విష్ణుభక్తులందరికీ వాచకమే అయినా బ్రాహ్మణులలో చక్రాంకణధారులకే వాడఁబడుతూ వుంది. శ్రీకారం చేరిస్తే యేశంకా వుండదు. సాతానులలో నూటికి నూర్గురూ భిక్షాటకులే పూర్వకాలంలో. యిటీవల చాలాభాగం సంఖ్య తగ్గివుండినా సగంమందేనా బిక్షాటకులుగా వుంటారు వీరు. అక్షయపాత్ర శబ్దంతో యీవృత్తిని వాడతారు. "అక్షయపాత్రకు వచ్చినాము మమ్మాదరింప

రమ్మా? ముక్కులు విఱవక మూతులు విఱవక ముష్టి పెట్టరమ్మా" అంటూ వొక కీర్తనకూడా వీరికి సంబంధించింది వుంది. కీర్తనంటే జ్ఞాపకం వచ్చింది జీవనార్థంగాని అన్యార్థంగాని యెంత నికృష్టమైన వృత్తిని ఆశ్రయించినా దానికి వుపాంగాలు కొన్ని వుండాలి. యీసంగతిన్నీ వ్యాసారంభంలో కొంచెం సూచించే వున్నాను.

తంబురా యీవృత్తికి వ్యావసాయకునకు నాగలియేలాటి సాధనమో ఆలాటి సాధనం. లేదా యుద్ధభటులకు ధనస్సువంటిదేనా కావచ్చు. యేదో తనరాక గృహస్థులకు తెలపడానికే యీసాధనాలన్నీ. యేమీ చేతకాని వాళ్ళు (బ్రాహ్మణులలో) పంచాంగం ధరిస్తారు. ఆనకట్టకు పూర్వం బ్రాహ్మలు మాత్రమే వుండేవారు. క్రమంగా యిప్పుడిప్పుడు వుద్యోగాలలో మాదిరిగానే యీవృత్తిలోనూ నాన్‌బ్రాహ్మిన్సుకూడా ప్రవేశించారు. రోజు 1కి కుంచెడు బియ్యం ముష్టిపెట్టేవాళ్ళకుకూడా యిప్పుడు అందులో వొక గుప్పెడుకూడా బ్రాహ్మణ వినియోగం కావనే చెప్పవచ్చు.

"బ్రాహ్మణస్య ధనం భైక్ష్యం" అంటూ శ్రుతమయేదాన్నికూడా కాలం మార్చేసింది. తోళ్ళపనిదగ్గిఱనుంచీ బ్రాహ్మలు అవలంబిస్తున్నారు. దీన్ని యితరులకు వదిలి పెడుతున్నారు. జందెం వేసుకునే జాతులలో వొక్క కోమట్లు తప్ప క్షత్రియులు దేభీలు (కొత్తలంక రాచకొమాళ్ళు) దీన్ని అవలంబించినట్లే కోమట్లు ద్విజులలో చేరినా యీవృత్తికి ఆలాయపడడం లేదు. కంసాలులు ద్విజపదంతో వ్యవహరింపబడరు కాని విశ్వబ్రాహ్మణపదంతో వ్యవహరింపఁబడతారు. యీకారణంచేతే అనుకుంటాను క్వాచిత్కంగా యీభిక్షాటనంలో వీరుకూడా భాగస్వాములుగా వుండడంవుంది. కొందఱు యీవృత్తి చేయకపోతే పూర్తిగా బ్రాహ్మణత్వం సిద్ధించదనుకొనేవారుకూడా యజ్ఞోపవీతధారులలో వున్నట్లువినికి. వారు దేవబ్రాహ్మలు. అన్నోదకాలు పుష్కలంగా అనాదిగా వున్న జాతులలో యీ దేవబ్రాహ్మణజాతి మొట్ట మొదటిది. ప్రపంచకంలో యీజాతికి

ముఖ్య జీవనంగా యేర్పడిన వస్త్రనిర్మాణమందు యెంతటి మహాత్మ్యం వుందో ? యీ రోజులలో అందఱికీ గాంధీ మహాత్ముఁడు తెలియఁజేసే వున్నాఁడు గనక వివరించ నక్కఱ్లేదు. శ్రీమహావిష్ణువునకు చక్రం యెంతటి సాధనమో గాంధీకి వస్త్రనిర్మాణవృత్తిన్నీ అంతటి సాధనమే.

యూరపుఖండం యావత్తూ రాట్నం పేరుచెపితే గడగడ వణుకు తుందని చెప్పనక్కఱ్లేదు. దిగంబరుఁడు శివుఁ డెందుకయినాఁడో శ్రీమహా విష్ణువు పీతాంబరుఁడు యెందుకయినాఁడో ? విచారిస్తే ఆయీ పని చేత కాకనే అనిన్నీ చేతనయి అనిన్నీ జవాబు చెప్పుకోవలసి వుంటుంది. దేవ బ్రాహ్మణులకు మొదటిపేరు దేవాంగులు. యీపదం దేవ — అంగ అనే రెండు పదాల కూడికచే నిష్పన్న మయింది. దేవతలకు అవయవాచ్ఛా దనం వీరివల్లనే సంపన్నమయి వుంటుందని తోస్తుంది.

విష్ణువు లక్ష్మీవంతుఁడు కనక వెలగల పీతాంబరాలు నేసుకున్నాఁడు లేదా ? నేయించుకున్నాఁడనిన్నీ, శివుఁడు భిక్షాటకుఁడు కావడంచేత దిగం బరుఁడు గానూ చర్మాంబరుఁడు (చలికాలంలో) గానూ వుండేవాఁడనిన్నీ ఊహించడానికి అవకాశం కనపడుతుంది. యూరపుఖండానికి నిన్న మొన్నటినుంచి కాని అంతకు ముందు రొట్ట కట్టుకోవడమే అని చెపుతారు చరిత్రజ్ఞులు. కొంతకాలంకిందట మనదేశాన్నుంచి బట్టలు కొనుక్కోవడం ఆరంభించి ఆఖరికి యంత్రనిర్మాణంద్వారా మననోట్లో దుమ్ముకొట్టినట్లు చెప్పుకుంటారు. యిది విషయాంతరం. దేవతలకు వస్త్రములు యిచ్చి పేరుప్రతిష్టలు సంపాదించుకొన్న దేవాంగులు దేవబ్రాహ్మణులుగా మాఱి నప్పుడు ఆ బ్రాహ్మణత్వానికి ప్రధానసాధనం లేదా ! చిహ్నం భిక్షాటనం లేకపోతే కొంత కొఱతగా వుంటుందని కొందఱు (అవసరం లేకపోయినా) పంచాంగం చేతబుచ్చుకొని భిక్షాటనం చేసినట్లు చెప్పగా విన్నాను. యిటీవల బ్రాహ్మలు మానడంచేత కాఁబోలు వారున్నూ మానేశారని ఊహకు వస్తూవుంది. జందెపోఁచ భిక్షాటనానికీ యేర్పడ్డ సాధనాలలో ప్రధాన సాధనం కాదుగాని, వుపనయనంలో మహారాజ పతున్ [illegible]

మెత్తాలి కనక "వుపనయనము నాఁటిమాట వున్నది సుమతీ" అనేది లోకవాడు కయిపోయింది. దీనిలోకూడా కొన్నిభేదా లేర్పడ్డాయి—

(1) వైదీకపు ముష్టి (2) నియ్యోగపు ముష్టి (3) వెలమవారి ముష్టి. యిందులో మొదటిముష్టి నిస్సంశయంగా నిరాఘాటంగా సీతారా మాభ్యాం నమః లేదా ? రామచంద్రపరబ్రహ్మణే నమః. యీవిధంగా వుంటుందనిన్నీ యీవాక్యోచ్చారణవల్ల బియ్యం తేవడానికి లోపలికి వెడుతూ వుంటే రెండోనెంబరు ముష్టివారు రెండో గుప్పెడుతోకూడా బియ్యం తేవలసిందని చెపుతారనిన్నీ యిఁక నెంబరు త్రీవారో ? "మేమి క్కడ పచారు శిక్తగిస్తూన్నాం అని మీసం దువ్వుకుంటూ నిలబడతారనిన్నీ వొకటి లోకంలో వ్యాప్తిగా వుంది. దీనివల్ల బ్రాహ్మణులలో భిక్షటనం వైదికులకు సహజం గనక వారు మెత్తేరీతి, స్వభావోక్తి రసొచారకంగా వుంటుందనిన్నీ రెండో నెంబరువారు క్వాచిత్కంగా మెత్తవలసివస్తే మెత్తు తారు గాని వారిది స్వభావోక్తి అలంకారానికి ఉదాహరణంగా వుండక దైన్యానికి అవకాశం యివ్వకుండా కార్యాన్ని సాధించుకొనే పద్ధతిలోకి చేరుతుందనిన్నీ యిఁక మూడోఁదో; అనిర్వచనీయంగానూ అయోమయం గానూ వుంటుందనిన్నీ తేలుతుంది. బాగా పరిశీలిస్తే మనవాళ్ళు జాతిభేదా నికి యెంత ప్రాధాన్యం యిచ్చిందీ యీచిన్ని యితిహాసం బాగా వ్యాఖ్యా విస్తుంది. వొకలోకోక్తి "యేయింటిచిలక ఆయింటిపలుకు" అంటూ వుంది. దానికి వ్యాఖ్యానప్రాయమే పైత్రిమూర్తుల ముష్టికథ. రాజు కళింగగంగు భీమకవి శాపంచేత భిక్షాటకుఁడై రాత్రి మాధోకబళం మెత్తు కుంటూ చీఁకట్లో కాలుజాఱి గోతులో పడ్డప్పుడు యేమన్నాఁడు ? "అన్నా? కాలి కాగడా అయినా లేకపోయింది గదా ?" అనికదా ? అన్నాఁడు మహారాజు చట్టన భిక్షాటకుఁడుగా మాఱితేమాత్రం సహజ భిక్షాటకుల చెయ్యిలు గాని మాటలుగాని యెక్కడనుంచి వస్తాయి. వొకకంసాలి వొకక్షామకాలంలో బ్రాహ్మణులతోపాటు ఆకలిబాధచేత సత్రంలోకి తయారైనాఁడు. దేశం తూర్పుదేశం. గ్రామం ఖాంసీంకోట భోజనం

చాలావఱకు అయింది మజ్జిగలోకి వణ్ణం పట్టుకొచ్చాఁడు వంటబ్రాహ్మఁడు. యీవిశ్వబ్రాహ్మఁడు "అంతొద్దు కోడిగుడ్డంతచాలు" అన్నాఁడు. తూర్పున ఓడ్రబ్రాహ్మణులు మత్స్యభుక్కులు వారితోపాటు యజ్ఞోపవీత ధారులు కొన్ని యితరజాతులుకూడా మత్స్యాలు (జల పుష్పాలు) ఆహ రించడం ఆచారం. కొందఱు మాంసంకూడా ఆహరిస్తారు. చెప్పొచ్చే దేమిటంటే ? ఆవిశ్వబ్రాహ్మడికి అదివఱలో అలవాటన్నమాట.........

...........................................................................

రఘువంశం ప్రారంభించిన శ్రీకానుకుర్తి భుజంగరావు పంతులు గారికిన్నీ వ్యాకరణశాస్త్రం సిద్ధాంతకౌముది ప్రారంభించిన శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రులవారికీ మాత్రమే. ప్రతీవిషయానికీ అంతో యింతో గురుశుశ్రూష వుండి తీరాలనే మనపూర్వుల తాత్పర్యం. "గురువులేని విద్య గుడ్డి విద్య" కదా ? అందుకే అనుకుంటాను కాళిదాసు "శిక్షితం యువతి నైపుణం తయా య త్తదేవగురుదక్షిణీకృతమ్" అన్నాఁడు పూర్వార్థం జ్ఞాపకం లేదు కుమార సంభవం అష్టమసర్గలో చూచుకోండి. "శిష్యతాం రహసి శంకరస్య" అని ప్రథమపాదం. పార్వతీపరమేశ్వ రుల గర్భాధానం వర్ణిస్తూ అంతదాఁకా అస్ఖలిత బ్రహ్మచారిగా వున్న శంకరునివద్ద శిష్యురాలై కొన్నిరహస్యాలు పార్వతి నేర్చుకొన్నందుకు గురుదక్షిణగా స్త్రీనైపుణ్యాన్ని శంకరునికి నేర్పిందని చమత్కరిస్తూ "అథవా విద్యయా విద్యా" అనే అభియుక్తసమయాన్ని వ్యాకరించిన ట్లయింది. విద్యాభ్యాసానికి మూడే సాధనాలు.

శ్లో. గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా
అథవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే.

కవికిమాత్రం యింతమాత్రంతో కాపరం తుదనెగ్గదు నిమిత్త మాత్రం గురుశుశ్రూషాదికం గాని స్వంతకృషి చాలా వుండాలి అదంతా వివరించవలసి వస్తే చాలా పెరుగుతుంది గ్రంథం.

క. క్షణమును వృథసేయక ల। క్షణసంగతులం బురాణగాథలు తగన్
క్షణమాచరించు క్షణశః। కణశశ్చైవ యని చెప్పఁగా వింటిమిరా?
( [illegible] )

యిది నా విద్యార్జనపద్ధతి యిప్పుడు కూడా యేరోజుకు ఆరోజు యేదో విద్యాధనం సంపాదించుకోవడం మానలేదు "విద్యాయాం వ్యసనమ్" అన్నాఁడు భర్తృహరి. తత్తథాస్తామినాము

మ. జననాథావ మనుగ్రహింపు మది నీశక్యమ్మె గాదేని పై
జననమ్మందును నా కొసంగుమెటులో సంగీత సాహిత్యముల్.

ప్రకృతం ముష్టి. యీవృత్తికి ప్రతాపం లేదంటూ కొందరు కవులు యీసడించారు "బడుగుతనమున కొక ప్రతాపంబు కలదె?" అన్నాఁడు శూద్రకుడు (మృచ్ఛకటికచూ) అంటే అన్నాఁడుగాని దీనికీ ప్రతాపం వున్నట్టే కొన్ని ఆధారాలు కనబడతాయి.

ఉ. నీమగఁడంత యెక్కుడె మనీషులు భూసురులింత తక్కువే? కోమలి?
( భారతం )

శ్లో. నాస్మాకం శిబికా....విద్యానవద్యా స్తినః (భవభూతి)

శ్లో. ....సర్వజ్ఞత్వ మధీశ్వరత్వ మగమత్త్వాం మాంతు భిక్షాటనమ్.
( కాళిదాసు )

సీ. గీ. ....మీకు యాచబిరుదు మాకును
యాచక బిరుదుగలదు వర్ణభేదమాత్రి
ముండె దీని నెన్న కొసఁగుమీ? వేంకట
కృష్ణయాచభూప; యిపుడు సమత. ( వేము )

"కిందబడ్డా మీదవాళ్ళమే" అన్న సామెతగా కవులు వ్రాసుకొని "నీఅంతవాడవు నీవూ మాఅంతవాళ్ళం మేమూ" అని యేవో శ్లోకాలూ పద్యాలూ వ్రాసుకున్నా పోతరాజుగారు చెప్పిన "కరంబు క్రిందగుట

పోఁచై నాకరంబుంట మేల్గాదే?" అనే మాటప్రకారం ఆలోచిస్తే ముష్టి పట్టేవాఁడికన్నా ముష్టి పెట్టేవాఁడే పయివాఁడని ఒప్పుకోక తీరదు. యెంత మహాదాతయినా, యెంత నిర్వ్యాజదాతయినా యాచించేవాఁడు "సగం చచ్చి సంగీతమూ అంతా చచ్చి హాస్యమూ" అన్న లోకోక్తి కన్నా పయిదాఁటుతుంది అడగడం. అందుకే అనుకుంటాను చాలాకాలం "భిక్షాటకులు" గానే వుండివుండి బ్రాహ్మలు శ్వవృత్తిలోకి (నశ్వవృత్త్యా కదాచన) కొందరు దిగినట్లు కనపడుతుంది. పండితులకూ కవులకూ రాజుగారు నమస్కరించినా వీరిని వూరికే కూర్చోపెట్టి మేపడంచేత నిక్కచ్చిగా రాజును అడగడానికి వీరికి హక్కువుండదు. మంత్రిత్వ వగయిరా వుద్యోగాలు లేకపోతే రాజ్యస్యందనం నడవదు. అందుచేత వారిపోషణ ప్రతిఫలశూన్యంకాదు. నెలాఖరుకు జీతం యివ్వకపోతే ఖచితంగా అడగడానికి ధైర్యం వుంటుంది. యింక వారికి లేనిదల్లా నమస్కారం వొకటే వారికి దానమ్మకడుపు కాలిన నమస్కారం దానికేం, రాజుగారు తప్ప తక్కినయావన్మందీ పెడుతూనే వుంటారు మంత్రికి యాచ్నాదైన్యదోషం తప్పుతుందని "శ్వవృత్తి" గా మనువు యీసడించాఁడని యెఱిఁగిన్నీ కొందఱు లౌకికవ్యాపారంలోకివచ్చి పాఱులు వ్యాపారులుగా మొట్టమొదట మాఱివున్నారు శకట రేఫతప్ప పాఱులకూ పారులకూ భేదంలేదు యిఁక వ్యా వొకటి అదనంగా రథశబ్దానికి తద్భవంలో అకారాగమం వచ్చి అరదంగా పరిణమించినట్లు వచ్చి చేరింది. అంతే మఱికొంత కాలానికి యోగులుగా కాలక్షేపం చేసే బ్రాహ్మణులలో కొందఱు 'ని' అనే ఉపసర్గకు అవకాశంయిచ్చి నియోగులుగా పరిణమించి యాచ్నా దైన్యానికి స్వస్తి చెప్పి సుఖపడ్డారు మఱికొంత కాలానికి సీతారామాభ్యాం నమః తరగతి వారుకూడా నూటికి యాభైమంది ఆగ్నేయంతికి స్వస్తి చెప్పి పైతరగతిలోకి చేరి వేషభాషలు మార్చుకున్నారు క్రమంగా విశ్వబ్రాహ్మలు, కళింగ బ్రాహ్మలు, కాపులు వగయిరా దీనికే యెగఁబడ్డారు వొక్క కోమట్లుమాత్రం యెక్కడో యెవ్వరో (నహ్యేకం లక్ష్యం

సాగారంభం ప్రయోజనంటిని మహాకావ్యం) చెప్పుడా నాటికి అనాడు పరమ భగవంతుఁ చెప్పబడిన స్మృతులన్నిటిలోనే స్త్రీలను చేయరాత్తి చెప్పబడ్డది. క్షత్రియులు వెలివాడు వారా రాలం పుట్టింది పుట్టింది ......స్వపరాయాదికి స్త్రీ చెప్పి ధర్మాలు ఆచరాన్ని ఉన్నాయి. యీనాటికీ వృత్తిని యోగ్యతాయయా అవలంబించడం మరేమి పైగా స్త్రీలు కూడా మాకేనా అంత చేతగాక పోవడం యుద్ధం వచ్చినప్పుడు మేం చేస్తాం చేయడమే కాదు మీరు వధించలేని మారులను కూడా మేం వధిస్తాం మహిషాసురుణ్ణి మీరేం చేయఁగలిగారు !

ఉ. తెప్పిరి వీయసర్థమును దేవతలందఱుఁ బరంబు మ
మ్మిచ్చి; యింకేమి చేయనగు నెవ్వనికేనియు వాఁడమర్త్యుఁడౌ
నవ్వపలున్ వధింపఁగల యంగన లెవ్వరు ? సీతలోపలిన్
బుట్టెనో; మత్తలోపలిని బుత్రునొ ? పుత్త్రము వానవాంగనన్.

అంటూ త్రిమూర్తులు వొకరిని వొకరు సణుక్కోవడం పగలు రాలు మాకూ తెలుసు. మహాకాళి ఆఁడత్తే గాని మొగపురుషుఁడు కాఁడు గదా ? అంతవఱకేనా మీకు తెలుస్తే మాకు చాలు. సలక్షీము పాకాలు అనడంవల్లకూడా పూర్వం భార్యాభర్తలిద్దఱిలో వంటవూచి మొగపురుషుఁడిదే అని స్పష్టం. పైఁగా వేదాలు అపౌరుషేయాలా ? కాదా ? దానివల్ల యేం తేలుతూ వుంది ? అవి రచించినవాళ్ళు ఆడవాళ్ళే అని స్పష్టం. ప్రపంచానికి విజ్ఞానప్రదమైన వేదాలను నిర్మించిన ఆడవాళ్ళు మొగాళ్ళతో పాటు వుద్యోగాలు నిర్వహించలేరా ? అంటూ స్త్రీలు కూడా యెగబడుతూ వున్నారు. 45 కోట్లజనాభాలో మూడువంతులలో రెండు వంతులు ఆఁడ వాళ్ళే వుంటారేమో ? లేదా సగమే అందాం వీళ్ళందఱికీ యేప్రభుత్వం వుద్యోగాలిస్తుందో! యేడుకోట్లు గాంఁబోలును యిప్పుడు భారతీయులు బిచ్చ గాళ్ళుగా వున్నారని వినికి. క్రమంగా వీళ్ళుకూడా వుద్యోగాలకే ఆలాయ పడితే “ అంతా పల్లకీయెక్కితే మోసేవాళ్ళెరి ? ” అనే లోకోక్తి జ్ఞాపకం వస్తుంది. మంగలిచేసే పని మంగలి, చాకలి చేసేపని చాకలి చెయ్యనక్క

ర్లేదు మళ్లాకడేనా ఆపని చేయాలా; దానికి సమ్మతిస్తే "యే రాయైతేయేం పళ్ళు రాలగొట్టుకోవడానికి" అసలు యీభిక్షాటనం పరమ విరాగులుగా వుండే విద్వాంసులు యేవృత్తీ నచ్చక "తదన్నంతదర్శనం"గా కాలం గడపడానికి పుట్టినట్టు తోస్తుంది. "ఋతామృతాభ్యాం జీవేత" అన్న మనువాక్యం యించుమించుగా యీ వృత్తినే బోధిస్తుంది. ఉంఛవృత్తి ఉంఛః కణశ ఆదానం.... ....... .... ... ........................................

ఒక బ్రాహ్మణయువకుఁడు మంచితేజస్వి, యిరవైలోపు వయస్సు. కులక్రమాగతంగా వస్తూ వున్న విద్య వేదం చెప్పుకున్నాఁడు. షోడశ కర్మాధికారి స్వగ్రామంలోనే వుంటే రో 1కి ఒక రూపాయిగాని పట్నం లోనే వుండి సైకిలు సహాయం కూడా వుంటే తహస్సీలుదారు జీతాని కభ్యంతరంలేదు. ఆవృత్తికి క్రాఫింగు ఔచిత్యభంజకంగా వుంటుందని క్రాఫింగు తగ్గించి తివాసీ కత్తిరింపు జుట్టు పెట్టించుకున్నాఁడు. పెళ్ళాం అందుకు అంగీకరించింది కాదు. క్రమంగా అయిదారు శవరాలదాకా నిరీక్షించింది. పిమ్మట మనోవర్తికూడా అక్కర్లేదని కాగితం వ్రాసియిచ్చి పుట్టింటి కెళ్ళిపోయింది. యీలాటి కాలపరిస్థితిలో యింకా సంతానానికి వేదాలూ శాస్త్రాలూ చెప్పించడమే కాదు అందుకోసం పాఠశాలలు స్థాపించడం ఏగయిరాలుకూడా వొకవిధమైన అపరాధంగానే పరిణమిస్తా యనుకుంటాను. ధనం లేని భర్తలను భార్యలు అనాదరిస్తారని సుమతీ శతకంలో వున్న "గడనుడుగు మగనిఁ జూచిన నడుపీనుఁగు వచ్చె ననుచు నగుదురు" అనే పద్యం బోధిస్తూవుంది. దీన్ని మనస్సులో పెట్టు కొనియ్యేవే యెవరో పూర్వమహాకవి "వ్యర్థం నిర్ధనికస్య జీవనమహో దారైరపి త్యజ్యతే" అంటూ శివుణ్ణి వదలి గంగ సముద్రుణ్ణి పరిగ్రహించిందని వుత్ప్రేక్షించాఁడు. శివుడికి కట్టుకోవడానికి బట్టగాని పెట్టుకోవడానికి నగలుగాని పూసుకోవడానికి అత్తరువగైరా పరిమళద్రవ్యాలుగాని లేవు. వ్యవసాయమేనా (పోతరాజుగారివలె) చేసుకోవాలంటే రెండో యెద్దేనా లేదు, వున్న గిత్త వొకటే. అది యెక్కితే మోస్తుందిగాని దుక్కి

వెలవాయి పద్ధతి గావని శంకరపక్షే (సుఖకరుడైనా అనిష్టార్థ్యం) వదిలి రత్నాకరపక్షే (సముద్రంలో రత్నాలంటే ముత్యాలు పుడుతాయి) వరించిందని చమత్కరించాడు వొకకవి ఆశ్లోకం

శ్లో. వాస శ్చర్మ విభూషణాని ఫణినో భస్మాంగరాగో ఘనా
గౌ రేక స్సచ కర్షణే సకుశల స్సంపత్తి రేతాదృశీ
ఇత్యాలోచ్య విముచ్య శంకర మగా ద్రత్నాకరం జాహ్నవీ"

నాలుగోచరణం లోఁగడ వ్రాయనే వ్రాశాను. ముఖ్యతాత్పర్యం కూడా వ్రాసినట్టే. దీన్ననుసరించిందే యేదో అవధానంలో సమస్యాపూర్తి మీద వొకపద్యం వుంది.

ఉ. నాకు విభూతిరాయఁ డొకనాయకుఁడా ? అని నీసుభార్య ర
త్నాకరు చెట్టపట్టుటది యారసియుంటియు సిగ్గులేక ర
త్నాకరు జంకఁ బెట్టుకొని యక్కలటుం దలఁదాల్చి తౌర భా
మాకులదాస ! యెంత యభిమానము లేదర ? చంద్రశేఖరా !

తాత్పర్యం సుగమం. శివుఁడు గంగను ధరించడం గంగ సముద్రంలో కలియడం సముద్రం శివునకు అంబులపొది కావడం శివుఁడు భస్మోద్ధూళితసర్వాంగుఁడు కావడం యివి సుప్రసిద్ధాలే. ఆయీ ముడిపదార్థాలు పుచ్చుకొని యీరత్నభూషణం తయారు చేశారు తి॥ వెం॥ కవులు. కవిత్వమంటే యేమిటో ? యేదో " శుష్కో వృక్ష స్తిష్ఠత్యగ్రే " అనే రచనకూ ఆయీరచనకూ వుండే తేడా పాడా లేలాటివో కనిపెట్టేవారింకా క్వాచిత్కంగా వున్నారు. కనకనే ఆయీ జంటలో వొకఁడేనా యింకా జీవించడానికి క్కారణం. లేకపోతే " కవియై పుట్టుటకన్నఁ బాపపరిపాకం బుండునే ?"(నానారాజ చూ.) వాళ్ళని లోకము యెందుకు అంతగా ప్రేమించాలి? యితరులని యెందుకు ప్రేమించకపోవాలి? అనేవారు తమరచనలో ఒకపద్యమేనా " విభూతిరాయఁడు " మాదిరిది వుందో ? లేదో ? చూసు

కుంటేక్షణంలో బోధ పడదా? అనుకుంటాను. "భరతఖండంబు చక్కని పాడియావు" పద్యం నిజంగా పాడియావే, కామధేనువే. యీకవి యీపద్యం తప్ప యింక యేపద్యాన్ని వ్రాయనే లేదనుకుందాం; యెందుకు వ్రాయాలి? చచచచ అని యీకవి కవిత్వాన్ని నేను దూషించడాని కారంభిస్తే నాకొడుకు భూషించడానికి ఆరంభిస్తాఁడాయె: వెనకాల హంగుదారులు లేని భాగోతం యేం రాణిస్తుంది? ఆయీచిలకకి సుమారు పుష్కరం దాటిందను కుంటాను యేదో సన్మానసభలో పండిత బిరుదాన్ని ప్రిపోజు చేశారు, ఆమో దించారు కూడాను. అంతా జరిగాకో? లేక మధ్య భాగంలోనో "ఆబిరుదు నాకు వద్దు" "మల్లియార్యుండు నామేనమామ" అంతే చాలు నాకని త్యజించినట్లు వినికిడి. మేనమామ మల్లయ్యశాస్త్రుల్లుగారు కవిత్వం చెప్ప లేరా? చిలకమర్తి రఘువంశం సరాజ్యం చెప్పలేరా? అంతమాత్రాన ఆయన కవీకారు యీయన పండితుఁడూ కారు. యిచ్చిన బిరుదుకు అర్థం ముందుముందు తనకు బాధకమో సాధకమో చిలకకు తెలుసు కనక వెంటనే పరిహారాన్ని ప్రకటించడంచేత యెవరేనా "నువ్వు దేనికేనా వాక్యశ్లో కానికి సంప్రదాయసిద్ధంగా బద్ధంగా సుద్ధంగా పాఠం చెప్పఁగలవా అయితే నేను వింటాను యీ విద్యార్థికి పాఠం చెప్పు" అని ప్రశ్నిస్తే రసాభాసు కావడంకంటే పరాభవ మంటూ వుంటుందా? అభిమానశాలికి నిజంచెబు తాను. నాకు "మహోపాధ్యాయ" శబ్దానికి విగ్రహం చెప్పడం చేతనవు తుందిగాని మహామహోపాధ్యాయ శబ్దానికి విగ్రహం చెప్పడం పుస్తకా పేక్ష. యిట్టిస్థితిలో యెఱుగనివాళ్ళు కొందఱు ఆబిరుదం తగిల్చి నాకు వుత్త రాలు వ్రాస్తూవుంటారు. మహామహాలంటే గొప్పవారు, దేనిలోను? అనే పృచ్ఛితాకాంక్షకు జవాబు ప్రకృతం విద్యావిషయం గనక తర్కవ్యాకరణాదు లలో గొప్పవారని అనుకుంటే సరిపోతుంది గాని అట్టివారికి నేను ఉపాధ్యా యుణ్ణి కాఁగలనా? తర్కంలో సప్తపదార్థజ్ఞానంగాని వ్యాకరణంలో సంధి పంచక జ్ఞానంగాని నాకు నిష్కర్షగావుందా? యిట్టి నాకు ఆబిరుదంతో సంబో ధించడం సన్మానించడమని వారు అనుకొనుచున్నారు గాని నేను అవమానిం

పదంగా వాడుతున్నానని వారికి [illegible] [illegible] [illegible] అడుగుతున్నాను. మహామహ శబ్దానికి [illegible] [illegible] [illegible] శబ్దాలమాదిరిగా వ్రాశాను. అది సమస్తపదం. మహాన్ మహా అనే రెండు శబ్దాల కూడికచేత తయారయింది. మహాశబ్దం తేజోవాచకమైనప్పుడు సకా రాంతం నపుంసకం, ఉత్సవవాచకమైనప్పుడో అకారాంతం పుంలింగం. యీ పుంలింగరూపంవల్లనే మహామహ శబ్దం నిష్పన్నమయిందనుకుంటే [illegible] తం సమాసం కుదురుతుంది. సకారాంతశబ్దం వల్ల నిష్పన్నమయిందనుకుంటే స్వారస్యం [illegible]. మూకవృమ్మడిఅర్థం గొప్పవారు గదా! వానికి ఉత్సవార్థకంకన్న తేజోర్థకమే సహాయపడుతుంది. అప్పుడు మహామహసాం ఉపాధ్యాయః అని విగ్రహించెపితే మహామహ ఉపాధ్యాయః అని షష్ఠీని ష్ఠితరూపం కావలసి వస్తుంది. సంధిబిక్కు తప్పించుకోవడానికి ప్రయత్ని స్తేనో? ఉపాధ్యాయుఁడు అవాధ్యాయుఁడై పోతుంటాఁడు. కనక అకా రాంతమై మహాశబ్దానికి తేజోర్థకత్వం వుందేమో చూడాలి. ఫలానా అని పేరు చెప్పలేనుగాని యేదో నిఘంటులో యింగిలీషుకూడా వుండాలి. దానిలో తేజోర్థకం పులింగం అకారాంతం మహాశబ్ద (1912 సం॥లో) చూచినట్లు జ్ఞాపకం. మహామహానాం ఉపాధ్యాయః అని సమాసమయితే కుదిరిందిగాని ధరించేవాళ్ళు కుదరాలి. మహామహులు వచ్చి శిష్యులుగా కూర్చుంటే వారికి పాఠంచెప్పే శక్తిసామర్థ్యాలు వున్నవారే గానితదితరులు ఆయాబిరుదానికి వకదణ్ణం పెట్టవలసి వుంటుంది. "చిత్రం వటతరో ర్మూలే శిష్యాస్తు చ్ఛిన్నసంశయాః." నాచిన్నతనంలో శ్రీ పరవస్తురంగాచా ర్యుల వారికి యీ బిరుదం వుండేది. దాన్ని యెవ్వరూ విమర్శించినవారు లేరు. యెందుచేత? ఆచార్లవారిశక్తి షడ్దర్శనీపారంగతం, కనక యిటీవల వానివైఖరి "అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ." సరే యిప్పుడీప్రసక్తి యెందుకు వచ్చింది? చిలకమర్తివారి "ధరతఘం డంబు చక్కని పాడియావు" పద్యంమీఁద వచ్చింది. కవిశబ్దమూ పండిత శబ్దమూ పర్యాయాలే కాని లోకంలో భిన్నభిన్నంగానే వాడు

కుంటూ వున్నారు. కాళిదాసును కవిగా చెప్పుకుంటారు. పండితుఁడుగా భట్టోజీదీక్షితుల్ని చెప్పుకుంటారు. వీరెవఁడు గ్రంథం వ్రాయనక్కఱలేదు. "లోకుల రసనసే యాకులుగా నుండునట్టిది" యేవొక పద్యం వ్రాసినా చాలు యీవుద్దేశంతోచే "ద్విత్రాణ్యేవ కావ్యాని" అన్నాడు ధ్వన్యాలోక కారుడు. "ఊరికుక్కలు పదివేలు చేరనేల చాలదే వేఁటకై యొక్కజాగిలంబు" వొక్కొక్కని వాక్కులో వొకవిధమైన సారస్యం వుంటుంది. అది అనిర్వచనీయం. గద్వాలాది సంస్థానాలు తిరిగేరోజుల్లో చాలామంది అవిద్వత్కవులు కలిసేవారు. వారుభాషాజ్ఞానం లేనివారైనా రచన అందంగావుండేది.

ఆ భాగ్యం చాలవరకు కొండవీటి సీమకు అనాదిగా వున్నట్టు కనపడుతుంది. పూర్వకాలంలో మాట చెప్పలేం గాని యిటీవల ఆయా సీమలో విద్వత్కవులు సుప్రసిద్ధులు బయలుదేరనే లేదేమో ! చాలామంది పూర్వం కూడా వుండేవారనీ వారు విద్వత్కవులు కాకపోవడం చేతనే

"కొండవీటిలో గాడిద ! నీవునుం గవివి
కావుగదా ? తలపోసిచూడగన్"

అని శ్రీనాథవిద్వత్కవి యీసడించవలసి వచ్చిందనిన్నీ వూహించడానికి అవకాశం కనపడుతుంది. శ్రీనాథుఁడు యెంతటి విద్వత్కవినేనా ఆవిధంగా యీసడించ గలఁడు. ఆతనిదృష్ట్యా యెవడూ విద్వత్కవి కాకపోవచ్చు అంతమాత్రంచేత యీ కాలంలోవలెనే ఆకాలంకూడా యీసీమ అవిద్వత్కవిభూయిష్ట మనుకోవడం యుక్తిసహం కాదు. గోదావరి జి॥ లోకన్న అనేకరెట్లు ఆంధ్రకవిత్వానికి కృష్ణా జి॥లో గౌరవ ప్రపత్తులు వున్నాయి. చెప్పేవారు విస్తరించి వున్నారు. గో॥జి॥ లోనల్లా వేదమన్నా శాస్త్రమన్నా శ్రౌతమన్నా పెద్దగౌరవం. బాలశాస్త్రిల్లుగారు యజ్ఞంచేసే సందర్భంలో శ్రౌతులు గో॥ జి॥ నుండి వెళ్ళవలసి వచ్చింది. నిజమైన బ్రాహ్మణ్యమన్నా వేద శ్రౌతాలన్నా పేరు గోదావరికే, రెండు కృష్ణకు. ఆయా జిల్లాలు శాస్త్రానికి తీసిపోవుగాని యేమేనా ఆవిషయం మహారాష్ట్రకూ బంగాళీలకూ వదలిపెట్టాలి. దక్షిణదేశంకూడా గో॥జి॥కు పాజీలాలకు

వేదశ్రోత్రాలకూ శాస్త్రులకూ లేదుపోయె. పూర్వమీమాంసావిషయం వేదం దాక్షిణాత్యులకే వదిలిపెట్టాలని మాపరమగురువులు సెలవిచ్చేవారు. బెంగాళీ వంతసేపూ తర్కానికి పెట్టింది పేరు. వారిలో అసలైనా వేదం లోపించి వుండాలి. మత్స్యభక్షణం వుండేచోట వేదం వుండనే లేదేమో? దానికి ఆసిమవాసన గిట్టదేమో? అని తోస్తుంది. అందుచేతనే వేదాంగాలలో ప్రధానంగా వుండే వ్యాకరణశాస్త్రం కూడా బెంగాళీలు చదవరు. వ్యాకరణ శాస్త్రంమీద గ్రంథాలు వ్రాసినవారందరూ యించుమించు మహారాష్ట్రులు. తర్కం వేదాంగాలలోది కాదు దర్శనాలలోది. వేదాంగ బహిష్కారమైనా తర్కం వేదాంతానికి బాగా తోడ్పడుతుంది. అదేనా "లక్ష్యానికి లక్ష్యం వాదానికే" కాని బ్రహ్మపదార్థాన్ని తెలుసుకోవడానిక్కాదు. శ్రుతికి వ్యతిరేకించే శుష్కతర్కం యెందుకూ పనికి రాదు. సరే వెనకటి రోజుల్లో యీశాస్త్రాలన్నీ యీవ్యాసానికి పెట్టిన శీర్షికకు పనికి వచ్చేవి. బరోడా మైసూరు వగయిరా పెద్దసంస్థానాలలో వీట్లకు పరీక్షలు వుండేవి. శాశ్వతమైన వార్షికాలు విపులంగా యివ్వడం వుండేది. క్రమంగా ఆ యీ సందర్భం అంతరించిందని తోస్తుంది. ఉర్లాం జమీనుదార్లు వేదాన్ని అంతగా సన్మానించడాని క్కారణం. వ్రాయడం తరవాత వుంది. వుర్లాముకున్నూ టెకలామున్నూ పూర్వం కన్నేపల్లివారివనిన్నీ ఆ యీ కన్నేపల్లివారు గొప్ప విద్వాంసులుగా వుండడంచేత పూర్వం రాజులు (పేరు తెలియదు) వారికి యిచ్చారనిన్నీ యేదో చిక్కువచ్చి వారు కందుకూరు బసవరాజుగారి చాటుననో బసవరాజుగారి పూర్వులచాటుననో దాగినారనిన్నీ ఆచిక్కు సవరణ అయినపిమ్మట మళ్ళా ఆ కన్నేపల్లివారు యెన్ని విధాల ప్రార్థేయపడినా యీకందుకూరివారు యివ్వకపోయేటప్పటికి ఆబ్రాహ్మఁడు బలవంతంగా ప్రాణత్యాగం చేసి బ్రహ్మరక్షస్సుగా పరిణమించి అపహర్తలను బాధించడం జరిగిందనిన్నీ తుదకు ఆబ్రహ్మరక్షస్సుకున్నూ అపహర్తకున్నూ యీవిధంగా (వేదం చదువుకొన్నవారిని సన్మానించడం) రాజీ కుదిరి ఆపీడ తగ్గిందనిన్నీ చెప్పఁగా వినడం. యీలాటి గాథ గద్వాల

సంస్థానానికే వుంది. అది కేశవభొట్లు అనే బ్రాహ్మణబాలుణ్ణి ధననిధానానికి బలిపెట్టడానికి సంబంధించి వుంటుంది. కోటలో వున్న ఆలయంలోవున్న దేవుడిపేరు కేశవస్వామి. ఆదేవుఁడు ఆకేశవభొట్లే. ఆకేశవభొట్లు పెట్టినశాపం (సంతానాభావం) యేడు తరాలవఱకూ అమలు జరిగి యెని మిదో తరంలో స్త్రీసంతానం కలగడం ఆరంభించింది. తద్వారా సంస్థానం అన్యకుటుంబంలోకి వెళ్ళినా దత్తత చేసుకోవడం వుంది గనక యింటిపేరు ముష్టిపల్లివారనేది మాఱలేదు. అది గ్రామ నామం. అనేకమంది విద్వాంసు లకు ముష్టి దోసెళ్ళతో (బియ్యం కాదు) రూపాయీలు ముష్టి పెట్టడం వల్ల ఆయింటిపేరు సార్థకంగా ప్రకాశిస్తూ వుంది. వేంకటగిరి చరిత్రలో కూడా యీవిధంగా బలిప్రసక్తివుంది "మీకు యాచబిరుదు మాకును యాచకబిరుదు గలదు" (నానారాజసం. వేంకటగిరిచూ.) అనేపద్యంలోవున్న యాచబిరుదు ఆబలిని పురస్కరించుకొని కల్గినదే కాని ఆ మాలవాణ్ణి బలియివ్వడంలో లేశమూ యజమాని దౌర్జన్యం లేకపోవడంచేత ఆ సంస్థా నానికి శాపబాధగాని పిశాచబాధ గాని తటస్థించలేదు. గద్వాలవారు సంస్థా నానికి వచ్చే పరిమానంలో సగం వేదశాస్త్రాలకూ సంగీత సాహిత్యాది విద్యలకూ వత్సరానికి రెండుసార్లు కార్తీక మాఘమాసాలలో ధర్మఖర్చు ఆదికాలంలో 50 వేలు చేయడం అప్పటి నైజాం విని ఆసొమ్ము ముజరా యివ్వడానికి ఆర్డరిచ్చినట్లు చెప్పఁగా వినడం. ముష్టిసందర్భంలో చాలా సంగతులు నడిచాయి. శాస్త్రకర్తలు బ్రాహ్మలే చాలామంది. మనువు క్షత్రియు డని చెప్పవలసి వస్తుంది వీరందఱూ యేకవాక్యతగా బ్రాహ్మణుఁడికి "బ్రాహ్మణస్య ధనం భైక్ష్యమ్" అని నిర్ణయించారు. ఆకాలంనాఁటికే వున్న వృత్తులు అన్నీ యితరకులాలకి పంచిపెట్టి పాకీ వృత్తినిగూర్చి మాత్రం ధర్మశాస్త్రాలు స్పృశించినట్లు లేదు. కారణం ఆలోచించాలి. శనగలు తిని చేతులు కడుక్కున్నారు. వైద్యుడు బజారుకెళ్ళి కూరలు కొనవలసివస్తే గుణపాఠప్రకారం యేదీనచ్చక తుదకు త్రిదోషహరం తిప్పతీగ దొరకినట్లు బ్రాహ్మడికి సర్వదోషహరం ముష్టి మిగిలింది.

ఆయా ముష్టిలోకూడా అనేక భేదాలున్నా ముఖ్యంగా రెండు విధాలుగా దీన్ని మనం విభజించుకోవచ్చు. యేమని ? 1. చిన్నముష్టి 2. పెద్దముష్టి. వడ్లూ, జొన్నలూ, బియ్యం యీజాతి వస్తువులు యాచించడం చిన్నముష్టి. డబ్బా యేగాణీ అణా బేడా మొత్తం రూపాయికి మించని ముష్టి కూడా నెంబరు ఒన్ లోదే. యీచిన్న ముష్టికి శుక్లవృత్తి అనేనామాంతరం నా చిన్ననాఁడు విన్నాను. యిటీవల యీపదం భాషలో వినఁబడడం లేదు. శుక్లవృత్తి శబ్దానికి అర్థం పరిశుద్ధమైన వృత్తి అనికదా। అయా వృత్తిలో వ్యవసాయ వాణిజ్య ప్రభృతులైన వృత్తులలో వున్న దోషాలేవీ కనపడవు. వ్యవసాయాదులలో కొన్ని దోషాలు నాంతరీయకతయా సంఘటించి నప్పటికీ కూపఖానక న్యాయాన్నిబట్టి అవి పిమ్మట వచ్చే పుణ్యంవల్ల వర్తిస్తాయి, ముఖ్యంగా యీ వృత్తికి కావలసిన గుణమల్లా లజ్జాత్యాగం

"అడుగుట యెన్ని జన్మముల కాఱడి నెవ్వగునో ! తలంపగన్"

ఆని మహాకవులు యీసడించినా నిర్దోషత్వం యీ వృత్తిలో వున్నట్లు మఱోవృత్తిలో లేదు కదా ! సోమరులైన పామరులు దీనిలో ప్రవేశించి దీని గౌరవాన్ని చెడగొట్టడం చేతఁ గాని అట్లే కానిచో యీ వృత్తి పారమార్థికానికి యేవిధమైన హానీ కలిగించేది కాదు. యేమాత్రం జ్ఞానం వున్నా మనుష్యజన్మ యెత్తినవ్యక్తి యెంతసేపూ పరమార్థాన్నే ప్రధానంగా పెట్టుకొని జీవయాత్ర గడపాలి, అలాటి వ్యక్తులు కోట్లలోఁ గాని వందలలోనూ పదులలోనూ వుండరు. అట్టి మహావిద్వాంసుడు దీన్ని అవలంబించేవారు నా బాల్యగురువులలో శ్రీమాన్ ప్రతివాది భయంకరం రాఘవాచార్యులవారు వొకరు. వీరు గో॥ జి॥ చామర్లకోట వాస్తవ్యులు.

సీ. చామర్ల కోటలోఁ జదివితి రాఘవా
చార్యు సన్నిధిని మాసత్రియంబు (గీరతం చూ.)

.......................................... ..........................................



# టెంకాయ పిచ్చి కొండ

( 19—10—46 సం॥రం ఆంధ్రవాణి నుండి )

అనే లోకోక్తికి స్మారకంగా వుండే వొకానొక వ్యాసం నన్ను గూర్చి ఆంధ్రవాణీ పత్రికలో పడింది. అది వ్రాసినవారు కీ. శే. శ్రీ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిల వారి తాలూకు పుత్రిలలో నొకరైనటు వంటి శ్రీ కృష్ణబ్రహ్మశాస్త్రిలవారు. దాని ముఖ్యాభిప్రాయం ఆలోచిస్తే హరినాగభూషణం వంటి తెలివి తక్కువ వ్యక్తి గాయకులలో యెక్కడా వుండడనిన్నీ, అతనిగానం గాడిద గత్తరగా వుంటుందనిన్నీ, అయినా అతడు తమ తండ్రిగారి శిష్యుడేకాని అన్యుడు కాడనిన్నీ, చెళ్ళపిళ్ళ, నాగభూషణం మాతండ్రిగారికి శిష్యుడు కాడని చెప్పడం పొసగదనిన్నీ, యిది ప్రధానాంశం. యింతవఱకు మృదుధోరణిలో వ్రాసుకుంటే బాగానే వుండేది, సత్యాసత్య విచారంమాట వేఱు. దాన్ని తెలిసినవారు పలువురుంటారు. వ్రాసిన వ్రాతలో అనౌచిత్యం కనపడకపోయేది. కోపోద్రేకంచేత వ్రాసిన యీ మాటలు చూడండి

"చెళ్ళపిళ్ళవారీ వృద్ధవయస్సున జన్మభూమియందు ముష్టి కుపక్రమించి........" యీ అక్షరాలు వ్యాసారంభం లోనివి వ్యాసాంతంలో కూడా యీ ముష్టికి సంబంధించిన ప్రసంగమే కనపడుతుంది. దానికిగాని దీనికిగాని సంబంధం లేశమూ కనపడదు. నేను జన్మభూమి అనే పత్రికలో "ముష్టి" అనే శీర్షికతో వొకవ్యాసం కొలది నాళ్ళ క్రితం వ్రాసివున్నాను. ఆ వ్రాయడానికి యీ "వుపక్రమించడానికీ" వున్న సంబంధం యెట్టిదో ఆ ముష్టిని అభేదంగా యీ ముష్టిగా అపలపించడం వల్ల తమరువ్రాసుకొనే దానికి కలిగే లాభమేమో ? కృష్ణబ్రహ్మశాస్త్రుల్లుగారే సెలవియ్యాలి సదరు శాస్త్రుల్లుగారు యేదో రాయడానికి వుపక్రమించి అంతలో కోపోద్రేకం పట్టజాలక యీ అసంగతపుమాటలు వ్రాసి నాయందున్నూ నాగభూషణంగారి యందున్నూ తమకు అహేతుకంగా జనించిన ఉద్రేకాన్ని

ప్రస్ఫుటస్పష్టము కనపడుతుంది. ఆ యీ వ్యాసధోరణి మాత్రగా అసంగతంగా వుండడం చేత దీనికి అనుగుణమైన శీర్షిక "పెండాపు పిల్లిగాండ్ల" అని తోటి వాన్నెపుంచి యీనాలుగుమాటలూ వ్రాశాను. కాని యేమీ వ్రాయక పోతేనే మంచిది. మాటకు మాటతెలియా నిక్కచ్చు నాకు తెలియా దరా? జన్మభూమిలో ముష్టి (వ్యాసం) కి ఆంధ్రవాణిలోని విషయానికీ కల సంబంధాన్ని లోకానికి వ్యాసకర్తగారే తెలుపగలరు. వ్యక్తి.

---

## కీ॥ శే॥ ఆదిభట్ల నారాయణదాసుగారు

(13–1–1945 సంగర ఆంధ్రవాణి నుండి)

యీ పరమ భక్తాగ్రేసరుఁడు హరికథ అంటే యేమిటో తెలియని కాలంలో మన ఆంధ్రదేశానికి దాన్ని రుచి చూపడమేకాక పలువురికి వుప దేశించిన మహోపాధ్యాయుఁడు. హరి కథలకు సంస్కృతాంధ్ర సాహిత్య ముండాలి. మంచి శ్రుతి లయ జ్ఞానంతో మిళితమైన గాన ప్రవేశ ముండాలి. యీయనకు పూర్వోక్తమైన శక్తులేకాక ఉభయభాషలయందు మంచిగా కవిత్వంచెప్పే నైపుణ్యంకూడా వుంది. యీయన యెన్నోహరి కథలు రచించారు. ఇంగ్లీషు పారసీ లోనైన దేశాంతరభాషలలోకూడా ప్రవేశం వుంది. ఇన్నిశక్తులు యేకత్రవుండడం చాలాఅరుదు.

తే. గీ. ఆదిభట్టీతఁడయ్యేను హరికథలకు
ఆదిభట్టీతఁడయ్యె గేయపు ఫణితికి
ఆదిభట్టీతఁడయ్యె నాట్యంపుగళకు
ఆదిభట్టీతఁడయ్యె లోకాద్భుతులకు.

యీయనతో నాకు ప్రథమపరిచయం నేటి 50 సంగనాఁడు శ్రీవి జయనగరం మహారాజావారి దర్శనార్థం వెళ్ళినప్పుడు కలిగింది. అప్పు

శ్యోనే యీయన హరికథ విన్నాను. అంత వఱకు నేను సీసపద్యం రే గుప్తిరాగంమీఁదా ఆనందభైరవి రాగంమీఁదా చదవడమే విన్నాను గాని యితర రాగాలమీఁద చదివిన వారిని యెఱఁగను. యీయన ఆవేళ కేదార బిలహరి జంఝూటి యీరాగాలమీఁద చదవడం విన్నాను. యీయన మనదేశపు గానానికే కొన్నిమార్పులు కలిగించి వన్నెపెట్టిన స్వతంత్రుఁడు. యీయన గాత్రం చాలాగంభీరమైనది. చాలామంది గాత్రాలు విన్ననాకు యెక్కఁడా యీయనగాత్రంమాదిరి గాత్రం తటస్థంకాలేదు. యీయన దినచర్య ధీరోదాత్త లక్షణాని కుదాహరణంగా వుండదుగాని ధీరోద్ధతలక్షణానికి ఉదాహరణంగా వుండును. తృణీకృత బ్రహ్మపురందరుఁడు. గానమేకాదు. సంస్కృతాంధ్ర సాహిత్యమేకాదు, నాట్యమేకాదు. అదియిదీ అనడమెందుకు? యీయనకు వశమైన సర్వవిద్యలున్నూ గురూపదేశంవినాగా లభ్యమైనవే. విజయనగరంలో అప్పుడు సర్వవిద్యలూ తాండవిస్తూ వుండేవి. యీవరప్రసాదునకు శ్రుతిమాత్రంచేత అవన్నీ స్వాధీనపడ్డాయి. వీణ గురుశుశ్రూషవినాగా లభించదని నాకుతోస్తుంది. యీయనకు ఆవిద్యకూడా అలాగాక స్వాధీనపడ్డవి. ఆ సంస్థానప్రభువులు యీయన్ని యేలాగౌరవించవలెనో ఆవిధంగా గౌరవించి చరితార్థులైనారు. సంగీతపాఠశాలా ప్రధానాధికారిగా నేర్పఱిచి పూజించినారు. యీయన వంటి సరస్వత్యావతారులు యేకాలంలోనో గాని అవతరింపరు. వార్ధక్యంలో కూడా యీ పుంభావ సరస్వతి హరికథ అంటే వేలకొలదిగా జనంవచ్చేవారు. ఆవయస్సులో (70 యేండ్ల దాదాపులో అన్నమాట) గాత్రం పలకమంటే పలుకుతుందా? దగ్గిఱవాళ్ళకే వినపడనిస్థితిలో దూరస్థులకు చెప్పేదేమిటి? కాని యెప్పుడో శంభో అని తన సహజమేఘ గంభీర ధ్వనితో వొకగర్జింపు గర్జిస్తే దానికే సంతోషించి తృప్తిపడేవారు.

బాలాజీదాసుగారు యీయనకన్న సుమారు పదేళ్ళేనా పెద్దలు. ఆయనశైలివేఱుగాని అదిన్నీ జనరంజకమైనదే. యింతసామగ్రిగల హరికథకులు యింతకుపూర్వం లేరు. భవిష్యత్తులోనేనా బయలుదేరతారనడం

ప్రత్యక్షావేశే. యీయన వయస్సిప్పుడు 81 సంవత్సరాల మించుమించు. యింతటిఘనమూర్తి యింతటి అదృష్టశాలి మరియుండడు. ధన్యః ధన్యః ధన్యః. నారాయణుని నారాయణుఁడు గౌరవించుగాక.

---

## ఆదిభట్ట

( 29–1–1945 సంగు ఆంధ్రదినపత్రిక నుండి )

ఈపేరు నిన్నమొన్న కీర్తిశేషులైన జగద్విఖ్యాతకీర్తిమూర్తులైన హరికథాప్రక్రమావతారులైన నారాయణదాసుగారి గృహనామం. భట్టశబ్దం పండితవాచకం. ఆదిభట్టవారిలో అజ్జాడ ఆదిభట్టవారు విశిష్టులని తెలియనగును. (ఈమాట దాసుగారివల్ల నేను విన్నాను.) ఆదిశ్చాసౌభట్టశ్చ ఆదిభట్టః. మొట్టమొదట యీగోత్రికులకు యీపేరు వచ్చుటకు కారకు డేమహాపురుషుఁడో దాసుగారి బంధువులకు తెలిసియుండునేమోకాని మనకుమాత్రం తెలియదు. యీపేరు సంపాదించిన పురుషోత్తములు మహావిద్వాంసులై యుండుట నిర్వివాదాంశము.

" భరతునిబట్టి యిందుజులు భారతులైరి రఘుండు హేతువై
పరగిరి రాఘవాఖ్య నల భానుకుల ప్రభువుల్."

అన్నరీతిగా ఒక్కొక్క మహాపురుషుని పేరుతో కొంతకాలమునకు ప్రసిద్ధి జెంది మరల కొంతకాలమునకు ఎవరో మహాపురుషులు బయలు దేరినచో ఆయనపేర ఆవంశం ప్రసిద్ధికెక్కుచూ ఉంటుంది.

సూర్యవంశము, మనువంశము, ఇక్ష్వాకువంశము, కాకుత్స్థవంశము, రఘువంశము ఇత్యాదులు చూడుడు. అట్లే ఆదిభట్టవంశం నారాయణ వంశముగా ప్రసిద్ధికెక్కుటకు యీ నారాయణదాసుగారు కారకులగుచున్నారు. ఈయన భవిష్యత్కాలమునందు నారాయణునకు దాసుడు.

శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుండరీక....పరమభాగవతాన్ స్మరామి. అన్న శ్లోకమునందలి పరమభక్తులలో నొక్కఁడుగా పరిగణింపదగ్గవాఁడు కాఁగలఁ డని తెలిసియే నారాయణనామధేయ మీతనికి తలిదండ్రులు పెట్టియుందురు. యీయన బాహ్యావర్తనము యేదోమాదిరిగా కానవచ్చినను అంతరంగము బహు నిర్మల మైనది. భక్తుఁ డనగా, నారాయణ దాసుగారు అని నేను బాహువు లెత్తి చెప్పఁగలను. యీయన చదవకుండగనే సమస్తవిద్యలను (సంస్కృతాంధ్రములు లోనైనవి) సాధించెను. ఒక్క యింగ్లీషుమాత్రము పాఠశాలా ప్రవేశమువలన సంపాదించెనుగాని ఆవిద్య యితనికి ప్రధానము కాదు. గానము, కవిత్వము యితఁడు మాతృగర్భమునందే సంపాదించుకొనెను.

ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః అను కాళిదాసోక్తి యీతనియందు సమన్వయించినట్లు మరియొకరియందు సమన్వయించదు. యీయనకు జన్మ వంశమునకు సంబంధించిన జ్ఞాతులకన్నా విద్యావంశమునకు సంబంధించిన జ్ఞాతులే విస్తరించియుందురని చెప్పుటలో అతిశయోక్తి లేదు. యీతడీ హరికథాప్రణాళికను యెవరిని గురువుగా పెట్టుకొని (ఏకలవ్యునివలె) అభ్యసించెనో కాని ప్రస్తుత మాంధ్రలోకమున హరికథ చెప్పు ప్రతివ్యక్తియు ప్రత్యక్షముగానో, పరంపరగానో యీయన శిష్యులో ప్రశిష్యులో కాకతీరదు.

ఈయనకు మించిన గాయకుడుండవచ్చును గాని యీయన గాత్రము వంటి గాత్రము (మేఘగంభీరనిస్వనః) ఆగాయకులలో ఒక్కరికిని భగవంతుడు యివ్వలేదనియే నానిశ్చితాభిప్రాయము. త్యాగరాయల తరువాత యీమహాపురుషుడు సంగీతసాహిత్యములకు వన్నె కల్పించినాడని నేను చెప్పగలను. ఇతనిగానము దాక్షిణాత్యగానము ననుసరించునదిన్నీ కాదు, ఉత్తరదేశగానము ననుసరించునదిన్నీ కాదు. యీగానము లన్నింటిని కలియదొక్కి పెట్టినకషాయమిది. శిష్యులలో చాలామంది కొంత వఱకనుకరించినను, కొన్నిపోలికలు దాసుగారితో అంతరించఁదగినవేగాని

శాశ్వతముగా నిల్చిపోఁదగినవికావు. యీదోషము ప్రతిగాయకులగానము నకూ తగిలేదే. ఒక్కొక్క గాత్రమందు ఒక్కొక్క వైలక్షణ్యముం డును. అవి ఆగాత్రమునుండి వినవలసినవే గాని అనుకర్తగాత్రముల నుండి వినఁదగినది కాదు. ఏదో మేనమామ పోలికగా అనుకరించువారు మాత్రముందురు. యీయనకు గానమందువలెనే కవిత్వమందుగూడ విశిష్ట స్థానము యీయకతప్పదు.

కీర్తన (పున్నాగతోడి. త్రిపుట)

ప. బాలాచంద్రమౌళి, పాదాముల్ విడకా బాలునోర్చివేగమె రక్షుకొనుకా.
చ. అంగము శైత్యపైత్యములంటానీయకా గంగాధవాని విన్రాపాతుగాక.
చ. పవలురేయి తాపము చెందనీయకా రవిచంద్రములునిన్ను రక్షింత్రుగాక.

ఆ యీ కీర్తన మార్కండేయోపాఖ్యానములోనిది. యిది ఆయన గానము చేయుచున్నప్పుడు విన్న నాకు (సంగీతజ్ఞానము లేకపోయినప్ప టికీ) ఆ కవిత్వమునందును ఆ గానమునందును గల మాధుర్యముచే కంఠోపాఠము చేయాలని బుద్ధిపుట్టింది. ఎవ్వరు లేనప్పుడు నాలో నేను పాడుకొని ఆనందించు చుందును. అదినేఁడు జ్ఞాపకమువచ్చి యిట్టికీర్తన చెప్పిన దాసుగారికి పరమేశ్వరుఁడు మార్కండేయునివలె స్థిరాయుష్యము నియ్యక పండ్రెండేళ్లు మాత్రమే (పండ్రెండుయేళ్లు యెనుబదినాళ్లు) యిచ్చి బాలారిష్టజాతకులలోఁ జేర్చినాడుకదా యని చింతింపవలసిన వాఁడ నైతిని. హరికథకులలో యిట్టి సన్మానము పొందినవారుగాని యిన్ని విద్యలు వచ్చినవారుగాని యింత విరాఘాట ప్రవర్తకులుగాని యిట్టి శిష్యు లను తయారు చేసినవారుగాని మన ఆంధ్రదేశమందేకాదు, యితరదేశము లందుగూడా లేరనియే చెప్పవచ్చును. యీయన సంస్కృతంలో రచిం చిన గ్రంథము పండితులెల్ల శిరసావహించినదిగా నుండుటచే అందలి పాండిత్యమును గూర్చి వేఱే వ్రాయనక్కరలేదు. తెనుఁగు మాతృభాష యేగదా. గురుశుశ్రూషాలభ్యమగు సంస్కృతమునందే యీయన నిరా

ఘాట పరిజ్ఞానకలవాఁడై నప్పుడు మాతృభాషయైన తెలుఁగులో యీయనకు గురువుండవలసియుండునా? అయీ విషయాలు సుమారు అయిదాఱు యేళ్ళ నాఁడు యీయననుగురించి కృష్ణాపత్రికలో నేను వ్రాసిన అను నయం అనే వ్యాసంలో చర్చింపఁబడినవే గనుక యిందు మరల పున రుక్తం చేసేదిలేదు. యీయనతో పోల్చుటకు నాకు తెలిసినంతలో ఒక్క రును గోచరించుటలేదు. యీ దారిద్ర్యము తప్ప యీయనకు యేవిధమైన దారిద్ర్యమూలేదు. అఖీతమద్యాపిత మార్జితంయశః

తే.గీ. బ్రతుకఁదగినంత కాలమ్ము బ్రతికి కులము
వన్నెకెక్కించి జగతికిఁదన్నుఁ దెలిపి
అరిగె మత్సోదరుండు నారాయణుండు
తనదుపేరి దేవునిఁజూచు తలఁపు వొడమి.

యీయన పరిజ్ఞ అనన్వయాలంకారానికి ప్రథమలక్ష్యం. సరః పతితకాయోపి యశః కాయేన జీవతి.

ఉ. గాయకమాత్రుఁడన్న నటుగాఁడితడందమెలర్ప సత్కృతుల్
సేయఁగలాఁడు వాక్పటిమచే నుతికెక్కినవాఁడు భాషలే
వోయయిదాఱు నేర్చిన మహోదయుఁడక్కట పోయెనేమినా
రాయణదాసు ముక్తుఁడతఁడిట్టిడు భూస్థలి పుట్టబోడిఁకన్.

క. శ్రుతిసతి "నసపునరావ
ర్తతే" యనుచుఁబలుకుపలుకు తథ్యమయేనిన్
హితుఁడల నారాయణదా
సు తరించెన్ మరలనతనిఁ జూచుట యెట్టుల్.

---

# కృత్యాద్యవస్థ

(భారతి సంచిక)

ప్రతివారూ యేదేనా యెక్కువ కష్టపడి సాధించిన కార్యాన్ని గురించి మాట్లాడవలసి వస్తే "కృత్యాద్యవస్థ" అనే మాటవాడుతూ వుంటారు. ఇది కవులు యేదేనా గ్రంథం వ్రాయవలసివచ్చినప్పుడు ఆరంభపద్యాన్ని వ్రాయడం విషయంలోపుట్టినమాటగా వున్నా యితరులు యితరకార్యాలవిషయంలో కూడా వారితోపాటు వాడుకుంటూ వున్నట్టు తోస్తుంది. ఇతరులు వాడేవాడకం లాక్షణిక మనుకోవాలి. లోకములో నూటికి యాభై పదాలు యీలాటి లాక్షణికాలే కనపడతాయి. అందుచేతే లక్షణ అనేవృత్తిని శాస్త్రజ్ఞులు అంగీకరించి వున్నారు. ఆ లక్షణావృత్తి సహాయంలేకపోతే యెన్నో పదాలకు అర్థం కానేకాదు. ఆ లక్షణావృత్తిని గూర్చి యిక్కడ వ్రాయను. అది పత్రికా పాఠకులకు దురవగాహంగా వుండేవిషయం మొత్తం యేపనిగాని మొట్టమొదట చాలాకష్టంగా వుంటుం దనేది సామాన్యంగా తెలుసుకోవాలి. కవి కావ్యారంభం చేసేటప్పుడు యెన్నో సందర్భాలు ఛందశ్శాస్త్రానికి సంబంధించినవీ, జ్యోతిషంతో సంబంధించినవీ చూడవలసివస్తుంది. అక్షరాలలో అల్పప్రాణ, మహాప్రాణాదిభేదం, పృథివ్యాది బీజభేదం, స్త్రీ పుం నపుంసకభేదం వగయిరాలే కాక యిప్పుడు బొత్తిగా పాటించ నక్కరలేదనుకొనే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతిభేదంకూడా వుంది. ఆయీభేదాలను పట్టి కృతినాయకునికి యేది అనుకూలమో ఆలోచించి అట్టిగణంతో పద్యంమొదలు పెడదామంటే, "కప్పల తక్కెడి" లాగా "పీతలమంగం" లాగా యెన్నటికీ అది కుదరనేకుదరదు. వకటి అనుకూలిస్తే వేరొకటి ప్రతికూలిస్తూ వుంటుంది. అందుచేత గుణదోషాలు రెండున్నూ ప్రతికృత్యాది పద్యమందున్నూ, వుండి తీరతాయని వేరే వివరించవలసి వుండదు. అట్టిస్థితిలో గుణాధిక్యాన్ని ప్రధానంగా చేసుకొని కవులు కృత్యాది పద్యరచన సాగించు

కోవలసిందే గాని కేవలం సర్వవిధాలా నిర్దోషంగా రచించవలసివస్తే యెన్నటికీ కృతిప్రారంభమే కొనసాగదు. వక చేదస్తుఁడు సముద్రస్నానికి వెళ్ళి కెరటాల అడావడి తగ్గినతరువాత స్నానంచేదా మని కూర్చున్నాఁడఁట! అట్టి అవకాశం యెప్పటికేనా తటస్థిస్తుందా? ప్రస్తుత విషయంకూడా అలాటిదే. "సముద్రే శాంతకల్లోలే స్నాతు మిచ్ఛతి మూఢధీః" అనే అభియుక్తోక్తివల్ల మనం తెలుసుకోవలసిన ముఖ్య విషయం కవుల కృత్యాదిరచనకే కాక, వివాహాది శుభముహూర్తాలకుకూడా వున్నంతలో మంచిని చూచుకొని ప్రవర్తిస్తే తప్ప సంవత్సరానికి కాదు గదా, యెన్నో సంవత్సరాలకుకూడా సుముహూర్తాలు, అందులోనున్నూ గర్భాధాన ముహూర్తాలున్నూ, ఉపనయనముహూర్తాలున్నూ కుదరనే కుదరవు. యీ ముహూర్తాలకు సంబంధించినవి రెండు యితిహాసాలు కనపడుతూ వున్నాయి. అందులో వకటి కృష్ణా డి. కూచిపూడి గ్రామానికి సంబంధించింది. యెవరో వకరు ఆ గ్రామాన్నుంచి కాశీకి వెళ్ళి మహావిద్వాంసులై దేశానికి వస్తూ అంతకు పూర్వమే యీడేరి తనరాకకు నిరీక్షిస్తూవున్న భార్యా ప్రథమసమాగమానికి నిర్ణష్టమైన సుముహూర్తం వకటి మహోదయం లాగనో, గోవిందద్వాదశిలాగనో యెప్పుడోగాని సందర్భపడనిది కనపడేటప్పటికి ఆసుముహూర్తానికి కొంత వ్యవధివుండఁగానే స్వగ్రామం చేరుకొనే వుద్దేశంతో వచ్చి, తీరా గ్రామందగ్గిఱ వుండే కృష్ణ పాముమీసాన్ని తెగఁగొట్టేటంత వడితో ప్రవహిస్తూ వుండడమున్నూ, యీకాలంలోలాగ ఆకాలంలో దాటించే సాధనాలు లేకపోవడమున్నూ, తటస్థించి అప్పటి నదీతీరవాసులు యీఁతలోకూడా మంచిశక్తిసామర్థ్యాలు కలవాళ్ళే కనక ఆ బ్రాహ్మణుఁడు యీఁతకుఁ బడి యేటి మధ్యభాగానికి వచ్చి అలయిక వచ్చి యిఁక లాభం లే దనుకొని "యోగే నాన్తే తనుత్యజామ్" కనక ఆతుర సన్న్యాసం తనంతట తానే స్వీకరించి ఆ మంత్రాలు యేకరుపెట్టుకుంటూ వుండేటప్పటికి ఆ బ్రాహ్మఁడి మనోనిశ్చయాన్ని పరీక్షించే తలఁపో యేమో? శ్రీకృష్ణపరమాత్మ,

శా. "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణమ్ములున్
ఠావుల్ దప్పె....నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపంగదే దీనునిన్"

అన్న గజేంద్రుని స్థితిలో వున్న ఆ బ్రాహ్మఁడికి ఆయిదోనాటికి చేరవానికి తగ్గంతబలపరాక్రమాలు అనుగ్రహించడం జరిగింది. సుఖంగా యిల్లు చేరుకున్నాఁడు. పిమ్మట అత్తవారు సంతోషించి యేర్పఱచుకున్న సుముహూర్తానికి, శుభకార్యం జరిగించడానికి పీఁటలమీఁద కూర్చోఁ బెడుతూ వుండఁగా ఆ బ్రాహ్మఁడిభార్య కళ్ళకి ఆయన యెవరో సన్న్యాసి లాగ కనపడుతూ వచ్చేటప్పటికి ఆమె "యితఁడు నాభర్త కాఁడు, యెవరో సన్న్యాసి" అని చెప్పి యెంద రెన్నివిధాల బోధించినా వినక పీఁటలమీఁద కూర్చోవడానికి వచ్చింది కాదు. అది పెంకెతన మని కొందఱూ, పేదో పిశాచమో అని కొందఱూ ఆయా సందర్భాలకుతగ్గ చికిత్సలకు యత్నిస్తూవుండఁగా, ఆ మహావిద్వాంసుఁడు గతంలో యేటి మధ్యలో జరిగిన ఆతురసన్న్యాసస్వీకరణ విషయాన్ని అందఱికీ చెప్పి భగవంతుని యెడల నేను మిక్కిలీ అపచారం చేశానన్నీ అకారణబాంధ వుఁడు కనుక ఆ శ్రీకృష్ణపరమాత్మ నా కపటాన్ని యీరీతిగా బయటఁ బెట్టి నన్ను అనుగ్రహించినాఁ డనిన్నీ చెప్పి క్రమప్రకారం సన్న్యా సాన్ని స్వీకరించాఁ డనిన్నీ, ఆయనే సిద్ధేంద్రయోగి అనే పేరుతో వుండి వయస్సులో సన్న్యసించిన కారణంచేత శృంగారరసమందు పూర్తిగా భావం విరక్తం కాక శ్రీకృష్ణపరమాత్మకున్నూ, సత్యభామకున్నూ సంబం ధించిన శృంగారాన్ని యక్షగానంగా రచించి పాడుకుంటూ వుంటే, గ్రామ స్థులు ఆయనయందు వుండే భక్తిప్రపత్తులనుబట్టి అందఱూ యేకవాక్య తగా ఆ భామాకలాపాన్ని ఆమోదించి ఆ రోజులలో సత్యభామవేషాన్ని మంచి ప్రఖ్యాతికి తేవడమే కాకుండా యిటీవల కూడా ఆ గ్రామస్థులైన బ్రాహ్మణులందరూ జన్మమధ్యమందు వకపర్యాయమేనా వేషంవేసి తీరాలి అనే నియమాన్ని పెట్టుకొని అప్పటికీ యిప్పటికీ ఆ నియమాన్ని పాటిస్తూనే వున్నందుకు ఆ గ్రామవాస్తవ్యులయిన బ్రాహ్మణులే సాక్షులు.

(ఆ గ్రామంలో ప్రతీ బ్రాహ్మణపిల్లవాఁడికీ ముక్కు_కుట్టువుండి తీరుతుం దంటారు.) ఇటీవల వేశ్యలూ, సానిజాతిస్త్రీలూ ఆ భాంవేషాన్ని వినికిడి చేస్తూ వున్నప్పటికీ సంప్రదాయం అక్కడనుంచి వచ్చిందేగాని మరోటి మాత్రం గాదు. ఆ సిద్ధేంద్రులవారి కవిత్వంలో వున్న దరువులు, ఆన వాలు తెలుస్తూనే వుంటాయి. ఇతరులుకూడా యిటీవల కొన్ని దరువులు చేర్చి వున్నారు కాని, యేమైనా పునాదిమాత్రం ఆ సిద్ధేంద్రులవారి దే. జయదేవుఁడూ, లీలాశుకుఁడూ, నారాయణతీర్థులూ యేలాటి శ్రీకృష్ణ భక్తులో యీ సిద్ధేంద్రులుకూడా అట్టివారే అని ఆయనరచన బోధిస్తుంది. ప్రసక్తానుప్రసక్తంగా చాలాదూరంవచ్చాము. సుముహూర్తం నిర్దుష్ట మైనది కుదరడం కష్ట మనేది మనకు ప్రస్తుతం. దీన్నిగురించే యింకో యితిహాసంకూడా వుంది. అది వకటి శాలివాహనుఁడి పుట్టుకకు సంబం ధించింది, కుమ్మరిగురునాధుఁడి జననానికికూడా అదే అంటఁగడుతూ వున్నారు కొందఱు. యేది యేలాగైనా సుముహూర్తం అనేది నూటికో కోటికో యెప్పుడోగాని మంచిది కుదరదనేది వక్తవ్యాంశం. ఆలాగే కవికి గ్రంథారంభపద్యమున్నూ అనుకోవాలి. ఛందస్సంబంధమైన చిక్కే కాకుండా ఇతరశుభకార్యాలతోపాటు సుముహూర్తపు చిక్కు_కూడా కవికి లేకపోలేదు. అదిగాక పయిఁగా "వర్ణగణాధిశుద్ధి" వగయిరాలు గ్రంథా రంభంలో కవికి కావాలి. అందుచేత యివన్నీ యెంతకాలం నిరీక్షించినా యేకవికిన్నీ కుదరడం అసంభవం కావడంచేత

క. "శ్రీకారము కృత్యాదిని
ప్రాకటముగ నున్నఁ జాలు బహుదోషములన్
బోకార్చి శుభము లొసఁగును"

అని ప్రాచీనలాక్షణికులు వక హైరోడ్డుమార్గాన్ని సూచించారు. అప్పకవికూడా దీనికి సంబంధించిన కష్టాలూ సుఖాలూ వ్రాసివ్రాసి

తే. గీ. "ఇపుడు చెప్పినదోషంబులెల్లమాని
గుణములన్నియుఁ గలుగంగఁ గూర్పనగు నె?
స్రష్టకైనను ..............................."

అంటూ అసాధ్యత్వం వ్యక్తపరచి యింకా వ్రాయవలసిన పనే కాని వ్రాసివ్రాసి తుద్దకుదకు ప్రాచీనలాక్షణికమార్గానికి వచ్చి

"తే. గీ. వేదముల కెల్ల నోంకార మాదియైన
కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది"

అని వ్రాసి, ఆ శ్రీకారమందుకూడా గుణదోషాలు కలుగుతూ వున్నాయని వ్యాఖ్యానించి గుణాధిక్యం వున్నట్టు స్పష్టపరిచి

"శ్రీయనునక్షరమున
నిండియుండుదోషంబు లన్నియునెడలింగి
సంయుతంబనియును శుభశబ్ద మనియు
నదియ నిల్పె నన్నయ భారతాదియందు"

అని మహాకవిప్రవృత్తిని తెలిపి శ్రీకారం మాత్రమే కాదు మరి కొన్ని శబ్దాలుకూడా మంగళవాచకాలు వగయిరా ఈలాటి వున్నాయని వ్యాఖ్యానించి పిమ్మట కొన్ని అక్షరాలు కొన్ని స్థలాలలో వుండేటట్టు చెప్పఁగూడ దని తెల్పి వాట్లకు వుదాహరణాలు చూపి మరో ప్రసక్తిలోకి దిగియున్నాఁడు. యేయే స్థలాలలో ఆ నిషిద్ధాక్షరాలు వుండకూడ దన్నాఁడో ఆయాస్థలాలలో ఆయా అక్షరాలు వున్నప్పటికి శ్రీకారం పద్యాదియందు వున్నట్టయితే ఆదోషాన్నికూడా పోఁగొడుతుందనే నమ్మకం మహాకవులకు వున్నట్టున్నూ యిది సర్వాపవాదక మైనట్టున్నూ వారివారి ప్రయోగాలవల్ల స్పష్టపడుతూ వుంది. ఆప్రయోగాలు కొన్ని చూపుతాను.

(1) శ్రియఃపతి శ్శ్రీమతి (మాఘము)
(2) శ్రియః కురూణామ్ (భారవి)
(3) శ్రీవైకుంఠ (భాగవతము)
(4) శ్రీభూపుత్రి (వసుచరిత్ర)

యెన్నని చూపుదును? సర్వత్రా ఈలాగే శ్రీకారాన్ని సంరక్షకంగా భావించి మహాకవులు నిస్సంశయంగా ప్రవర్తించివున్నారు. "శమ్యాష

స్సర్వదోషఘ్నమ్" అనే శాస్త్రాన్ని పురస్కరించుకొని శస్యుషస్సుతో అమావాస్యా కొత్తమంగళవారంనాఁడేనా సరే విషఘటికలలోనేనా సరే ప్రయాణం చేయవచ్చు ననడం యేలాటిదో, యిదిన్నీ అంటే శ్రీకార సంరక్షకత్వమున్నూ అలాటిదే అని ఆయా మహాకవుల పోకడ వలన స్పష్టపడుతూ వుంది. యిది కేవల శ్రీకారానికి మాత్రమే కాదు; దేవతా వాచకశబ్దా లన్నిటికీ వుండడమే కాకుండా "కావ్య ముఖలక్షణంగా" చెప్పిన యితరానికికూడా అంటే, వస్తునిర్దేశానికికూడా వర్తిస్తుందని కాళి దాసుగారి కుమారసంభవంలో వున్న మొట్టమొదటిశ్లోకం "శ్లో. అస్త్యుత్త రస్యాం దిశి దేవతాత్మా" అనేది చెపుతూవుంది. యీ శ్లోకంలో తకారం రెండుచోట్ల నిషిద్ధస్థలాల్లో ప్రయుక్తమై వుంది. తెలుఁగుకేకాని యీ అక్షరాలబాధ సంస్కృతానికి లేదని కొంద అంటారేమో? అపాోబలుఁ డేమి, అప్పకవియేమి అట్టి అభిప్రాయాన్ని పొందలేదు, పొంద నక్కఱ యున్నూ లేదు. పనిపడితే ఆయీవిషయం విస్తరిస్తాను. అక్షరమాత్రా నికి ప్రతిభాషయందున్నూ మంత్రిత్వం వున్నట్టు తెలుఁగు మళయాళం వురుదు వగయిరా భాషలలో వున్నమంత్రాలవల్ల స్పష్టపడుతుంది. శ్రీకా రంతోఁ గాని దేవతావాచకశబ్దాలతోఁగాని అసలు మంగళాచరణం చేయ వలసిందని వేదంలో ఆధారం యెక్కడా వుపలబ్ధం కావడం లేదు కనక యిష్టం వచ్చినట్టల్లా చెప్పకోవలసిందే గాని మంగళాచరణ నిర్బంధంతో పనిలే దనేవారు యిప్పు డున్నారో లేదో గాని పూర్వం నాస్తికవాదులలో కొందఱున్నట్టు కొన్ని గ్రంథాల వ్యాఖ్యానాలవల్ల అవగత మవుతుంది. ఆ వ్యాఖ్యాతలే ప్రత్యక్ష శ్రుతి లేకపోవడానికి అంగీకరిస్తూ అనుమానిక శ్రుతులు

"సమాప్తికామో మంగళ మాచరేత"

"విఘ్నధ్వంసకామో మంగళ మాచరేత"

అంటూ వుదాహరించి మంగళాచరణానికి ఆవశ్యకత్వాన్ని నిరూ పించి వున్నారు. అనుమానికశ్రుతు లేమిటి? ప్రత్యక్షశ్రుతు లేమిటి?

అని శంకించుకొని కొంత వ్రాయవలసివున్నదనే గ్రంథవిస్తరభీతిచే విరమిస్తాను. ఆయీవిషయం పూర్వమీమాంసా శాస్త్రంవల్ల తెలుసుకొన లసి వుంటుంది. మా పరమగురువులు శ్రీబ్రహ్మయ్యశాస్త్రులుగారు వ్యాక రణం పాఠం చెపుతూ వున్నప్పుడు షష్ఠ్యర్థాలూ కారకాలూ చెప్తూ వుండేవారు. అప్పుడు విన్న ముక్కలలో యింకా కొన్ని జ్ఞాపకంలో వుంచవలసిందే. అక్కడక్కడ యితరశాస్త్రాల ప్రసక్తి వుదాహరించడం గాని నానాశాస్త్రా లలో ప్రజ్ఞవుండి కాదని విజ్ఞులు తెలుసుకోక పోరు. మహాగాయకశిరో మణి కీ.శే. శ్రీచిదంబరయ్యగారివల్ల మహావిద్వాంసులవద్ద చేసిన శుశ్రూ షాఫలితం యెట్టిదో నేను వినివున్నాను. పనిలో పని ఆవిషయంకూడా మంగళార్థంగా వుదాహరించి దీన్ని ముగిస్తాను. యీ చిదంబరయ్యగారు సదాశివరాయలవారివద్దకె సంగీతాభ్యాసానికి వెళ్ళి సుమారు పుష్కరకాలం వున్నట్టున్నూ, ఆయన వకరోజునా వక స్వరంగాని వక గీతంగాని చెప్ప కుండానే యిన్ని సంవత్సరాలూ కాలంగడిచినట్టున్నూ అప్పుడు యిక వీరివద్ద తనకు విద్యాభ్యాసం జరగదని తోఁచి చిదంబరయ్య "అయ్యా! నేను యిన్నివత్సరాలనుంచి దేవరవారికటాక్షానికి ఆశించి యీపూర్వో ఆధశ్శయన బ్రహ్మచర్యాలతో కాలక్షేపం చేస్తూ వున్నాను. నాయందు దేవరవారికి కటాక్షం ప్రసరించిందే కాదు. యిఁక ఆజ్ఞయిస్తే వెళతాను" అనిమనవి చేసుకొనేటప్పటికి శ్రీరాయలవారు "అబ్బాయీ! నీవు యిన్ని వత్సరములున్నూ ప్రతిరోజూ నావద్దకు వస్తూపోతూనే వుంచే నీకు వేరే నేను సంగీతశాస్త్రోపదేశం చేయనక్కఱలేదు. నీవు చాలా నాళ్ళకిప్రతిమే సంగీత విద్వాంసుఁడవై వుంటా" వని చెప్పి ఆయన జ్ఞానాన్ని పరీక్షించి సంతోషించి ఆశీర్వచించి పంపినట్టు ఆయనవల్లనే నేను శ్రీసోమంచి భీమ శంకరంగారిగృహంలో వినివున్నాను. యీచిదంబరయ్యగారిస్థానం గాయ కులలో సామాన్యం కాదు. పట్నం సుబ్రహ్మణ్యయ్యరు వైద్యనాథయ్యరు మొదలైన సుప్రసిద్ధులలో యీయన వొకరు. యీయన వార్ధక్యంలో నేనూ యీయనా కొన్నాళ్ళు యేలూరులో భీమశంకరంగారిగృహంలో

వుండడం తటస్థించింది. అందుచేత నీయనకున్నూ నాకున్నూ మైత్రి యేర్పడ్డది. యీయన గురువు సదాశివరాయలవారిస్థానం శ్రీ త్యాగరాయల వారితోపాటుది. యీయన అత్తవారు మైసూరు సంస్థానాధిపతులకు కొంత పన్ను చెల్లించే సామంతప్రభువులో పెద్ద జహగీరుదారులలో అని చిదంబరయ్యరుగారివల్లనే విన్నాను. అట్టివారి అల్లుఁడు అనడంచేత సదాశివ రాయలుకూడా మహదైశ్వర్యసంపన్నుఁడనడంలో అత్యుక్తి వుండదు "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అట్టియైశ్వర్యంలో వుండి అంత మహాగాయకుఁడై వుండి పయిఁగా అందులో త్యాగరాయాదులవంటి కవికూడా అయిన మహామహునియింట యెందఱు శిష్యులో వుండివుందురు గదా! ఆశిష్య ప్రశిష్యవర్గం యెల్లప్పుడూచేసే గానవ్యాసంగం వినడం వల్ల కూడా గానం అలవడుతుందంటే ఆశ్చర్యమేముంటుంది? యిది విషయాంతరం. మహామహుల శుశ్రూషామాహాత్మ్య ప్రసక్తిలో వచ్చింది. మంగళాచరణం ఆస్తికులకేకాక నాస్తికులకుకూడా అవశ్యాచరణీయ మని చెప్పేప్రసక్తికి దిగుతూ మధ్య పుణ్యపురుష ప్రశంసకూడా మంగళాచరణమే అని తెల్పడానికి దీన్ని అందుకున్నాను. అమరకోశ గ్రంథకర్త జైనమతస్థుఁడై కూడా మంగళాచరణాన్ని చేసివున్నాడు.

శ్లో. "యస్యజ్ఞాన దయాసింధోః" అనేశ్లోకం పైవిషయాన్ని స్థిరీకరిస్తుంది. తెలుఁగుకవులు యెక్కువగా శ్రీకారానికి ప్రాధాన్యం యిచ్చి రచన కారంభం చేస్తూ వచ్చారు గాని సంస్కృతకవులతాత్పర్యంలో దేవతావాచకశబ్దాల కన్నిటికీ సమప్రాధాన్యమే కాని అందులో శ్రీకారాని కంటూ ప్రత్యేకత వున్నట్టు కనపడదు. అథవా సంస్కృతకవులుకూడా శ్రీకారాన్ని యెక్కువగా గౌరవించారన్నా నేను ప్రస్తుతం వ్రాసే విషయానికి అది భంజకంగాదు. శ్రీకారంతో గ్రంథారంభం చేసినపుడు యెక్కడ యేనిషిద్ధాక్షరం పడినా శంకించవలసిన ప్రసక్తి లేదని మహాకవులతాత్పర్యమని భావికవు లందఱూ తెలుసుకుంటా రని యీవ్యాసం వ్రాశాను. ఉద్దేశం సదుద్దేశం కానప్పుడు శ్రీకారంతో మొదలుపెట్టినా అదిఅన్యథాగానే అంటే

వృద్దేశానుసారంగానే పరిణమిస్తుం దనడానికి చంద్రిరేఖావిలాపంలోవున్న "శ్రీకంఠుండు భుజంగ భూషణుఁడు భస్మభూత పంచాస్త్రుఁడు" అనే పద్యం సాక్ష్యమిస్తుంది. ఇందులో వున్న శ్రీకారం విషార్థకం కావాలనే వృద్దేశంతో గ్రింథకర్త వాడి వున్నాఁడు. దానికి మంగళార్థకల్పన చేదా మన్నా శక్యంకాదు. యెక్కడ శ్రీకారం పృథాగా ప్రయుక్తమైనట్టు కనపడుతుందో అక్కడనే మంగళార్థక మవుతుందనిన్నీ అనుకో నక్కరలేదు. శ్రీ మహాలక్ష్మీవాచకమైనప్పుడు మంగళార్థకమని చెప్పనే అక్కఱ లేదు. విషార్థకం కాకుండా వుంటే మంగళార్థకమే.



# శ్రీ కృష్ణభగవానుఁడు

(30—11—1938 సం॥ర ఆంధ్రపత్రిక వీక్లీ నుంచి)

భగవంతుని యవతార మని అందఱూ భారతీయులు శ్రీకృష్ణభగవానుణ్ణి యేకవాక్యతగా అంగీకరిస్తూ వున్నారు. కాని యే కొందఱో విమతస్థులుకారు ; స్వమతస్థులే. కొందఱు భారతీయులలోకూడా అన్యథాగా అపవదించేవారు యీకాలంలోనేకాక ఆకాలంలోనున్నూ లేకపోలేదు. యీకాలంలో బ్రిహ్మసమాజికులు లోనైనవారున్నూ, ఆకాలంలో శిశుపాలాదులున్నూ ప్రితివాది కోటిలోకి చేరతారు. ఆస్తికకోటిలో చేరికూడా కొన్ని విషయాలని పురస్కరించుకొని సకృత్తుగా శ్రీకృష్ణభగవానుని యందు మానవ మాత్రుఁడే అనే అభిప్రాయం కలవారున్నూ కొందఱు న్నారు. వారివారికి శ్రీకృష్ణుణ్ణి పరమాత్మయొక్క అవతారంగా సమర్థించే భాగవత గ్రింథమే క్వాచిత్కంగా అన్యథాత్వానికికూడా ఆధారాలు చూపుతుంది. ఆయీ విషయాలు పురాణకర్తల చేతనే శ్రీదేవీభాగవతంలో అక్కడక్కడ స్పృశించి యేదో విధంగా సమాధానాలు చూపఁబడ్డాయి.

దేవీభాగవతం ప్రాధాన్యేనా శక్తియందు పారమ్యాన్ని సిద్ధాంతీకరించేది. తద్ద్వారా అంతో యింతో శివునియందు ఆధిక్యాన్నికూడా అంగీకరించే స్వభావం కలది. యీ యిద్దఱికి వక విధమైన అభేదంకూడా కనపరుస్తుంది. విష్ణువుయందుకూడా గౌరవాన్ని చూపడం లేకపోదుగాని ఆపురాణానికియేమైనా అది అంత ప్రధానంకాదు. కాఁబట్టి దాన్నిబట్టి శ్రీకృష్ణుని పారమ్యాన్ని నిశ్చయించడం యుక్తంకాదు. సరికదా యీాయన యెవరి అవతారమో ఆవిష్ణు దేవుని పారమ్యం కూడా దేవీభాగవతంవల్ల నిశ్చయించడానికి అవకాశం లేదు. నేఁటివారు కొందఱు భారతకృష్ణుఁడనిన్నీ భాగవత కృష్ణుఁడనిన్నీ విడఁదీసి వారివారికి తోఁచినమాటలు వ్రాస్తూవుంటారు. కాని వారి తాత్పర్యంకూడా యిద్దఱు కృష్ణు లున్నారనికాదు. రాజకీయానికి సంబంధించిన చరిత్ర భారతకృష్ణుఁడి దనిన్నీ, విలాసాదులకు సంబంధించింది భాగవత కృష్ణుఁడి దనిన్నీ తెలపడమేవారి పృథక్కరణానికి తాత్పర్యం. అంతేకాదు. భారతకృష్ణుఁడు గౌరవార్హుఁడనిన్నీ. భాగవత కృష్ణుఁడు అట్టివాఁడు కాఁడనిన్నీ వారి ఆంతరంగికాభిప్రాయమైనట్లుకూడా కొంత వ్యంగ్యమర్యాదవల్ల స్పష్టపడుతుంది. ఆ వూహ అంతగా ఆదరణీయం కాదు. భాగవతంలో వున్న శ్రీకృష్ణచర్యలు అన్నీ అంగీకరిస్తూ శ్రీకృష్ణునియందు భగవదంశాన్ని చూచుకోవడమే తరించే మార్గంకాని తదితరం కాదు. ఆయన చేసిన కృత్యాలన్నీ మనంకూడా చేయరాదు గాని వాట్లను మనం ఆక్షేపించకూడదు. ఆలా ఆక్షేపిస్తిమా, శ్రీకృష్ణునియందు మనకు సామాన్యమానవభావనయే కాని భగవంతుఁడనే తాత్పర్యం లేనట్టేకదా ! ఆయన గోపికా స్త్రీలయందు రాగి కాడనిన్నీ, ఆయనయందు ఆ గోపికలు మాత్రం రాగం కలవారనిన్నీ, భాగవతం వల్లనే తెలుతుంది. పరిశీలించిన కొలఁదిని అభావమే సిద్ధాంతిత మవుతుందిగాని అన్యథాభావం సిద్ధాంతితం కాదు. కాని సుఖసుఖాలమాత్రం యీ నిశ్చయం కలగదు. భక్తి భావనలు యెన్నో విధాలుగా వున్నట్టున్నూ అన్నీకూడా భగవదనుగ్రహ ప్రాపకాలే అయినట్టున్నూ

భాగవత తాత్పర్యంగా కనపడుతుంది. ఆతాత్పర్యాన్ని పురస్కరించు కొనియ్యేవే శిశుపాలాదులకు ముక్తిని చెప్పవలసి వుంటుంది. కేవలం త్యజీకరణ తాత్పర్యం తప్ప శిశుపాలాదులకు శ్రీకృష్ణునియందు వే విధమైన గౌరవమున్నూ కల్పించడానికి అవకాశం లేదుగదా! లేకపోయినా ద్వేషతాత్పర్యంవల్ల తుట్టతుదవఱకున్నూ మనస్సు తదేక లక్ష్యంగా వుండడం చేత "యాంతే మతి స్సాగతిః" అనే సిద్ధాంతానుసారంగా ఆభావన కూడా ముక్తిప్రద మయినట్టు తేలుతుంది. యింతదాఁకా వూహ ప్రసరించని వారికి శత్రుత్వమే ముక్తిప్రదమైనప్పుడు మిత్రత్వం ముక్తి ప్రదం కాకపోతుందా అని "కైముత్య" న్యాయంగా తెలుసుకోవడానికి అవకాశం కల్పిస్తూవుంది. యీ "కైముత్య" న్యాయాన్నిబట్టి మనం యింటి వ్యవహారాలుకూడా చక్కఁబెట్టుకోవలసి వస్తే చిక్కు రాకమానదు. యిది వక్క భగవద్విషయమందే సమన్వయించుకో వలసి వుంటుంది. వ్యవహారావస్థకున్నూ, పరమార్థావస్థకున్నూ సర్వత్రా యీలాటి భేదమే వుంటుంది. కనక విస్తరించ నక్కఱలేదు. అందుకే "అద్వైతం పరమార్థతః" అని అభియుక్తులు చెప్పి వున్నారు. ఆ చెప్పడం దీన్ని గుఱించి కాకపోయినా దీనిక్కూడా సమన్వయించుకుంటే తప్పులేదు. నిజంగా శ్రీకృష్ణుఁడు స్త్రీలోలుఁడే అయితే అష్టవంకరంగా వుండీ అష్టావక్రుణ్ణి పెళ్ళి చేసుకోవడానికి అర్హత కలిగిన కుబ్జనుకూడా ప్రేమించడ మంటూ వుంటుందా? గోపికా స్త్రీ లందఱూ కృష్ణుఁడితో వినోదిస్తూ వుంటారనే మాటలు కర్ణాకర్ణికగా విని ఆ కుబ్జకూడా స్త్రీస్వభావసులభమైన చాపల్యంతో చాలా రోజులు ఆ భాగ్యం తనకుకూడా సంఘటించాలని తద్గతమనస్కగా వుండడమే యిక్కడ తపస్సు. యిది శృంగారాన్ని పురస్కరించుకొన్న భక్తిలోకి చేరుతుంది, సర్వాంతర్యామిగా వుండే ఆదినారాయణుని అర్చావతారమైన శ్రీకృష్ణభగవానుఁడు కుబ్జకు తన యందుఁగల ప్రేమభావనను గుఱితించి స్పర్శమాత్రంచేత ఆపె వంకర టింకరలన్నీ తీర్చి తాను అస్ఖలిత మనస్కుఁడే అయినను భక్తపరాధీనుఁడు కనక ఆపె మనోరథ పూర్తిచేసివున్నట్టు సమన్వయించుకోవడమే ఆస్తి

కుల తాత్పర్యం. రసభేదం వున్నా యీ విందు రామావతారంలో శబరి యెంగిలివిందు వంటిది. ఆయీసందర్భాలన్నీ మానవావతారం కనక తల్లక్ష ణాలుగా సమన్వయించుకోవలసి వుంటుందని దేవీభాగవత పంచమస్కంధా దులలో సమన్వయించారు. మనుష్యావతారంగా అవతరించినప్పుడు యెంత భగవంతుఁడైనా వాళ్ళతో పాటు కలిసి మెలిసి వుండకతప్పదన్న అభియు క్తుల సమాధానం యుక్తియుక్తమే. యితరమతస్థులుకూడా వారువారు నమ్మే పరవస్తువుయందు ఆయాలీలలు కొన్ని మనలాగే విశ్వసిస్తూనే వున్నారు. కాని మనం విశ్వసించేవాట్లనుమాత్రం ఆక్షేపిస్తూ వుంటారు. వాద దౌర్బల్యమే కాని వాదిదౌర్బల్యమంటూ వుండదు. వొకప్పు డెవరో వకక్రైస్తవుఁడు "మీ కృష్ణుఁడు వట్టిజారుఁడు. ఆయన్ని మీరు భగవంతుఁ డంటారు" అంటూ యీసడించడానికి మొదలెట్టేటప్పటికి మాకృష్ణుఁడు జారుఁడని మీరేలా నిర్ణయిస్తారని ప్రశ్నించాను. దానికి ఆయన "మీరు ప్రమాణంగా శిరసావహించే భాగవతంలోనే ఆయన జారుఁడని వుందికదా? దానికి మఱోప్రమాణ మెందుకు?" అని నేను ముందేమి చెప్పఁదలఁ చానో ఆసందర్భాన్ని గమనింపక వుత్తరం యిచ్చారు. "మా భాగవతం మీరు విశ్వసించేయెడల ఆ భాగవతమే ఆయన భగవదవతార మనికూడా చెపుతూవుంది కనక దాన్నికూడా విశ్వసించండి సరిపోతుం" దని జవాబు చెప్పి అంతతోకూడా సరిపెట్టక, "అతఁడు మనుష్యమాత్రుఁడే అయితే వేలకొలఁది స్త్రీలతో వుండికూడా చెక్కు చెదరని బలపరాక్రమాలతో శత్రుభీకరుఁడుగా జీవించఁగలఁడా చెప్పండి. మీరు యేదోషాన్ని ఆపా దించి భగవంతుఁడుగాఁడు శ్రీకృష్ణుఁడంటూ వున్నారో ఆ దోషమే వక మహోన్నతమైన గుణమై అతఁడు భగవదావతారమని సమర్థిస్తూ వుంది" అనేటప్పటికి "మీరు యుక్తిపరులు" అంటూ ముసిముసినవ్వు నవ్వు కుంటూ వూరుకున్నారు. భగవద్విషయకమైన విచారమంటూ వచ్చి నప్పుడల్లా కొంతపారమార్థిక చింతతోవున్న వారికితప్ప తదితరులకు యెన్నఁడూ నచ్చచెప్పడం సంఘటించదు. అందుకే "నావిశ్వాసాయ

క్వచిత్" అని ప్రతిపాదించిన విషయంకూడా వుంటూ వుంటుంది. భక్త
మహాగ్రేసరుఁడైన త్యాగరాజుగారు "కర్మపద్ధతివారికి కష్టము కర్మను మొదలిడిన
పెద్దలబుద్ధులు నేఁడబద్ధమాయెనె" అని గానంచేశారు. మొదటినుండి మనకి
భగవంతుఁడనే భావన వుంటుందో వారిచర్యలను సామాన్య మానవుల
చర్యలతోపాటు విధినిషేధాలు కల్పిస్తూ విచారించేపక్షంలో మెన్నఁటికీ
తరణోపాయం కలగదు. లీలాశుకుఁ డేమంటూ వున్నాఁడో చూడండి:
"జగదాచరణీయ జారభావం జలజాపత్యవచో విచారగమ్యమ్" అన్నాఁడు.
జారత్వం నింద్యమే అయినా యెవ్వని జారత్వం జగత్తుచే అభినంద్య
మయిందో, వాఁడు భగవదవతారంకాక యేమవుతాఁడు? మహాయోగు
లందఱూ వారియథార్థస్వరూపాన్ని గోప్యంగానే వుంచి చరిస్తారు. అలా
కాకపోతే మూఢప్రపంచకంలో వారిని నిలవ నివ్వరు. "రెట్టియూ పట్టి
చామి" అనే అజపమంత్రాన్ని పురశ్చరణచేసి సిద్ధుఁడైన ఒకమహాపురు
షుఁడు నేఁటికి నలభైయేళ్ళకు పూర్వం ఫ్రెంచిటవును యానాంగ్రామానికి
వచ్చి యున్నాఁడు. ఆయన యెన్నోలంఘనాలు చేసినవాఁడివలె వుంటాఁడు.
ఒక అరఁటిపండులో సగం కాఁబోలును తింటే తింటాఁడు. మూఁడుపుడి
సిళ్ళు పల్చనిమజ్జిగతాగుతాఁడు. యింతకన్న ఆహారం లేదు. మలమూ
త్రాలకు వెళ్ళినట్టు లేదు. గూడకట్టు గుడ్డ తప్ప పైమీఁద బట్టలేదు.
చేతులో ఒకకఱ్ఱమాత్రం వుంటుంది. పాదుకలు వుంటాయి, ఇంతే ఆయన
పరికర మంతా. "రెట్టియూపట్టిచామి" అనేమంత్రం వుపదేశించడంవల్లా
ఆకఱ్ఱతో స్పృశించడంవల్లా, ఆపాదుకలు నెత్తిని పెట్టడంవల్లా యెన్నో
దీర్ఘరోగాలు ఆయన కుదర్చడం నేను చూచాను. తరవాత తండోపతండా
లుగా జనం పోగయింది. యానాంగవర్నమెంటు ఆవూరినుంచి యిరవై
నాలుగు గంటలలో వెళ్ళిపొమ్మని "వార్నింగ్" గిచ్చారు. ఆవూరినుంచి
వెళ్ళినా ఆయన్ని జనసంఘం వదిలిపెట్టింది కాదు. "వూరువిడిచి పొరు
గూరికి పోతే పూనినకర్మం మానేనా?" యేవో కొన్నివూళ్ళు తిరిగి
యేలాగో విజయనగరంమకాంలోనుంచి కాఁబోలును యీ సంఘబాధని

తప్పించుకొని పరారీ అయినట్టు వినడం. యీయన అంత్యజాతివాఁడంటూ కొందఱనఁగా విన్నాను. యెవరైతేయేమి మంత్రసిద్ధుఁడు. యోగి, ధనాపేక్ష లేదు. యింతవఱకు సత్యం; వెనకటి యోగులలాగ అణిమాది అష్టసిద్ధులూ కలవాఁడుమాత్రం కాఁడు. ఆ యోగులు ఆలాంటి సిద్ధికలవా రవడంచేత యెక్కడ అంతర్ధానం కావాలంటే అక్కడ అంతర్ధానం అయేవారు. చెప్పొచ్చే దేమిటంటే ? శ్రీకృష్ణభగవానుఁడు యోగిమాత్రుఁడు కాఁడు. యోగేశ్వరుఁడని ఋషు లంతా వొప్పుకున్నారు. అతనిచర్యలు మానవమాత్రులు విమర్శించి మవచర్యలతో పోల్చుకుని ఖండనమండనాల కుపక్రమిస్తే సమన్వయ మవుతాయా ? కావు. నారదుఁడు, యిందుృఁడు, బ్రహ్మ వీరందఱూ విమర్శించి పరాభవంపొందినట్టు ఋషిప్రోక్త గ్రంథాలు సాక్ష్యమిస్తూ వున్నాయి. ఆయా గ్రంథతాత్పర్యం మనస్సులో పెట్టుకొని య్యేవే పాండవవిజయంలో యీపద్యం మేము వ్రాసింది.

"భగవంతుం డితఁ డంచు స్పష్టపడియెన్ బాహాబల ప్రౌఢిచే
నగధారిత్వముచే విశిష్టమునిమాన్యత్వమ్ముచే విశ్వరూ
పగతిన్ జూపుటచే ననేకగతులన్ బ్రహ్మాదు లర్చించు లో
కగురున్ గృష్ణు జయిష్ణు నక్కటకటా ! కైకోఁడు వీఁ డంధుఁడై "

నే నీలా వ్రాసినా విమతస్థులలాగే శ్రీకృష్ణుణ్ణిగురించిన్నీ, రాముణ్ణి గూర్చిన్నీ మానవులే అనిన్నీ, మానవులలోనే అగ్రగణ్యు లనిన్నీ భ్రమ మాత్రం కలుగుతూనే వుంటుంది. ఆలా భ్రమ కలిగినప్పుడల్లా నాబుద్ధికి నేనే బుద్ధిచెప్పుకుంటూ వుంటాను, యేమనంటే ? " మహాఋషు లందఱూ శ్రీరామనామాన్ని మంత్రంగా పఠిస్తూవున్నా రాయె. కలి సంతారణో పనిషత్తులో

"హరేరామ హరేరామ రామరామహరేహరే,
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే,

ఇతిషోడశకం నామ్నాం కలికల్మషనాశనం,
నాఽతఃపరతరోపాయస్సర్వవేదేషుదృశ్యతే"

అని స్పష్టంగా వుండాయె. దాన్ని కాదని రామకృష్ణులను మానుష మాత్రులుగా గణించడం తెలివితక్కువ గాదా, ఆయుషులలో ఎన్నోవంతు జ్ఞానం నీకు వుంది అని యెన్నోసార్లు నాబుద్ధిని నేనే మందలించుకుంటూ వుంటాను. కాని నామనస్సుకుమాత్రం పుట్టిన సందేహం పూర్తిగా వదిలి నట్టు లేదు. "పుట్టినబుట్టిన బుద్ధి" సామెతగా ఆసందేహం యేమాత్రమో శేషించేవుంది. అందుచేతే నాభక్తి విశేషించి శివుడిమీఁద ప్రసరిస్తూవుం టుంది. అట్లని విష్ణుద్వేషంమాత్రం నాకు లేదు.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,
శివస్యహృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయగ్ం శివః.
యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయ శ్శివః,
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తి రాయుషి"

అంటూ చిన్నప్పుడు చెప్పుకొన్న సంధ్యావందనంముక్కలు అప్పుడు అర్థంకాకపోయినా యిటీవల అవడంచేత నాకు శివకేశవులయెడల అభేద భావమే వుందిగాని పట్టుపటాంగం వస్తేమాత్రం "తథాఽపి భక్తిస్తరు ణేందు శేఖరే" అని కొంచెం శివునివైపుగా మొగ్గుతుంది. ఈకర్మం నాకే కాదు వైష్ణవేతరులైన కవులు కాళిదాసాదులలో యేవక రిద్దఱోతప్ప అంద ఱికీ అని వారివారి మంగళాచరణాలవల్ల తేలుతుంది. భాగవతాగ్రగణ్యు డైన పోతరాజుకూడా విష్ణుపారమ్యాన్ని బోధించే గ్రంథాన్ని అంగీకరి స్తూకూడా——

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నొడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు"

అంటూ సమత్వబుద్ధినే వ్యక్తీకరించాఁడు. కాని గ్రంథంలో వున్న విషయాన్ని అన్యథాకరించడానికి అవకాశం లేదు. కనక విష్ణుభక్తియందే మొగ్గడం కనపడుతుంది. మొత్తం స్మార్తులైన కవు లందఱూ ఉభయత్రా సమానబుద్ధిగా ప్రవర్తిస్తారు. శంకరాచార్యులవారి అద్వైతానికి శివకేశవాది నామాలు లేశమూ బాధింపవు. త్రిమూర్త్యతీతమైన వస్తువుమీఁద సర్వాధికారం వున్నట్టు తేలుతుంది. కాని ఆయనకూడా స్మార్తుఁడవడంచేతనో యేమో వ్యవహారావస్థ ననుసరించి చేసిన స్తోత్రాలల్లో శివపరాలైన స్తోత్రా లెక్కువగా కనపడతాయి. దక్షిణాదిని శివస్థలాలే యెక్కువ. సుప్రసిద్ధ క్షేత్రాలు కాశీరామేశ్వరాలున్నూ శివస్థలాలే అయినా సమత్వమే మంచిది. కేవలశైవులకున్నూ, కేవలవైష్ణవులకున్నూ మాత్రం యీ సామరస్యం కుదరదుగాని స్మార్తుల కందఱికీ కుదురుతూవున్నట్టే వారివారి గ్రంథాల వల్ల తేలుతుంది. క్వాచిత్కంగా శైవులై పుట్టుకతో యేర్పడ్డవారిలో విష్ణుభక్తి పరాయణులున్నూ కవులలో వున్నారు. వారిలో లీలాశుకుఁడు తన కర్ణామృతగ్రంథంలో యీలా వ్రాసుకున్నాఁడు

"శైవా వయం నఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీజపపరా నితరాం తథాఽపి,
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్."

ఆ విష్ణుభక్తిపారమ్యంలోకూడా యీలీలాశుకునకు యింకోచేవస్తం వుంది. శృంగారభక్తుఁ డవడంచేతే అనుకుంటాను, యీయన కృష్ణుణ్ణి ప్రేమించినదానిలో యెన్నో వంతున్నూ రాముణ్ణి ప్రేమించఁడు. "ఆకో దండము వగైరా నీపరికరాలు వొకచోటఁ బెట్టి నాకు దర్శనమిస్తేనా, అప్పుడు నీకు నమస్కరిస్తాను లేకపోతే నావల్లకాదని వొకశ్లోకంలో చమత్కారంగా తన తాత్పర్యాన్ని వ్యక్తీకరించాఁడు. కోనసీమలో సుప్రసిద్ధపండితులు బులుసు రామనాథశాస్త్రుల్లుగారు వకకోర్టుమునసబుకు సూత్రభాష్యపాఠం చెప్పడానికి "నీ మునసబీని మావీథిగుమ్మంవగ్గఱ

వదిలిపెట్టి వచ్చేరు" మన్నారని చెప్పఁగా విన్నాను. ప్రస్తుతం ఆమాట జ్ఞాపకం వస్తుంది. శ్రీకృష్ణభక్తులలో యితఁడు శుకుఁడికన్నా శుకుఁడంత వాఁడనే కారణంచేతే కాఁబోలు యితణ్ణి లోకం అంతా లీలాశుకుఁ డని వ్యవహరించారు. యితఁడికి యీ పేరు తల్లిదండ్రులు పెట్టిన నామ కరణంకాదు. అది యేదో యెవరున్నూ యెఱిఁగినట్టు లేదు. కాళిదాసుగారి పేరుకూడా అంతే. "ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాఁడి" అనే సామెతగా కొందఱికి పుట్టుపేర్లకంటె పెట్టుపేర్లే లోకవాడు కలో వుంటాయి. అవి విద్యాసంబంధాలుగానే వుండనక్కఱలేదు. కొన్ని అగ్రహారాల్లో ప్రతిమనిషికీ యేదో పెట్టుపేరు వుండడమున్నూ దస్తావేజుల్లోను, నోట్లలోను, సంధ్యావందనాదులలోను తప్ప ఆ పెట్టుపేరు తోనే వ్యవహరించడమున్నూ మా ప్రాంతాలలో వుంది. యిది విషయాం తరం. లీలాశుకుఁడు శృంగారభక్తుఁ డన్నది మన కిక్కడ వక్తవ్యాంశం. తెలుఁగు కవులలో క్షేత్రయ్యకూడా శృంగారభక్తుఁడే.

1. "అపురూపదర్శనం బాయెఁగదా! నేఁడు,
   కృపగలదా? మా మువ్వ గోపాలబాలా"
2. ఎటువంటివాఁడమ్మా? వాఁడు, ఎన్నఁడూ యీ వీథి రాఁడు"

యింకా యెన్నో ఆ క్షేత్రయ్యగారిగేయా లిలాటి వున్నాయి. యివి యెంతో పచ్చిగా వుండికూడా కవియొక్క భక్తిని బాగా వెల్లడిస్తాయి. శృంగారరసంలో యీయన చూపినన్ని భావాలు యే కాళిదాసున్నూ చూపనే లేదని నేననుకుంటూవుంటాను. యీయనపదాలకే "మువ్వగోపాలపదా" లని పేరు. యీ పదాలు తగినంత వ్యక్తిగలవేశ్యలు (అంతాకాదు; భరత ముని చెప్పిన గణికాపద భాక్కులు ఆలాటివా ళ్లెకాలంలోనూ తక్కువ గానే వుంటారు.) అభినయిస్తూవుంటే ఆకృష్ణుఁడు వచ్చి యెదటకన బడ్డట్టే వుంటుంది. యిది చాలామంది యెఱుఁగుదురు. ఆ లీలాశుకుఁడికి కృష్ణుఁడు ప్రత్యక్షమే అని ఆయనరచనే చెపుతుంది.

"మా మాలింగన్ మరకత మణి స్తంభ గంభీర బాహూః" యిత్యాదులు ఆయనకు స్వప్నసాక్షాత్కారానికి ప్రమాణాలు. కేవల సాక్షాత్కారానికి స్వప్న సాక్షాత్కారాన్ని పూర్వరంగంగావిజ్ఞానులు వుద్ఘాటించి వున్నారు. ఆ శకునితో యీ క్షేత్రియ్యను తుల్యంగా నేను తలుస్తాను. భాషలోమాత్రమే భేదం. యింతేకాదు యీపదాలు తన్మయత్వంతో అభినయించే పాత్రలను కూడా ఆ కవులతో పాటుగా భగవత్సాక్షాత్కారానికి అర్హత కలవాళ్ళనుగా భావిస్తాను. సిద్ధేంద్రులవారి సత్యభామాకలాపాన్ని విసికి చేసేపాత్రకు తన్మయత్వం; అంటే తాను సాక్షాత్సత్యభామనే అనే అభిమానం వకటి లేకపోతే ఆమె జనరంజనాన్ని చేయనేలేదు. అట్టిఅభేద జ్ఞానంతో ఆకృష్ణవిరహాన్ని వినికి చేస్తూ—

"కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!
అప్రమేయ! వరద! హరి! ముకుంద!
మిమ్ముఁ జూడఁగంటి మీకృప గనుఁగొంటి
నఖిలసౌఖ్యపదవు లందఁగంటి"

అంటూ తానేకాక తన చెలికత్తెచేతకూడా పలికిస్తూ వున్నవ్యక్తికి ముక్తి కరతలామలకం కాకపోతే యింకెవరి కవుతుంది? యీ భాగవత కలాపాన్ని దీనితో జీవనానికి అవసరంలేని పెద్దపెద్ద వుద్యోగస్థులు కూడా అభ్యసించేవారు. అంతతో తృప్తికాక యెందఱికో విద్య చెప్పి తద్ద్వారా ఆనందించేవారు. అట్టివారిలో శ్రీ జూలూరి కృష్ణారావుపంతులుగా రొకరని చెప్పఁగా విన్నాను. వా రెంతోకాలంనాఁటివారు కారు; నిన్న మొన్నటివారే. వారి వుద్యోగస్థానం ధవళేశ్వరమే. వా రెందఱినో యీ భాగవత కలాపంలో తయారు చేసినట్టు వినడం. అందులో కొల్లూరి నారాయణం గారిని స్వయంగా యెఱుఁగుదును. యీ నారాయణంగారు అఖండశివ పూజాధురంధరులు. యీయన ఆ కృష్ణారావుపంతులుగారిని తండ్రినిగాను, వారిభార్యను తల్లినిగాను ప్రేమించడమున్నూ, యీయన్ని వారు పుత్రుఁడుగా ప్రేమించడమే కాకుండా వారి ఆస్తిలో కొంతో యావత్తూనో

ఆస్తిని సంక్రమింప చేయకమున్నా అనేకులు మెలిగినవున్నారు. బహుశః వారికి సంతానం లేదనుకుంటాను. ఆ నారాయణంగారిని శ్రీపిఠాపురం లేటు గంగాధరరామారావుగారు సవారీ బోయీలనుపంపి ఆహ్వానించి భాగవతం కట్టించి సమ్మానించడాలు వగయిరాలు మెలిగినవారింకా అక్కడక్కడ వున్నారే అనుకుంటాను. ఆ భాగవతం జరిగేటప్పుడు కృష్ణారావుపంతులుగారు కూడా సవారీబోయీలతో వెళ్ళి సభలో హర్షాహంగు చేస్తూ వుండడమే అనిన్నీ విన్నాను. ఆ కాలంలో కృష్ణవేషం వేసేవారు వుల్లాపంతులవారు వుండేవారంట! ఆయన ఆ వేషంవేసేరోజున వుపవాసం. అంతేకాదు; సర్వదా శ్రీకృష్ణోపాసనాపరుండుగా వుండేవాడంట! ఆయన మా పరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారికి దగ్గిర బంధువులే అనికూడా వారివల్లనే విన్నాను. యివన్నీ తలుచుకుంటే వొళ్ళు గరిపొడుస్తుంది. ఆ యీసందర్భాలను పెక్కరించేవారిప్పుడు పలువు రున్నారు. వారికంటె వుత్తమగతులు వారి కున్నాయన్నందుకు ప్రమాణ మేమీ కనపడదు. వారి కున్నట్టు వారివారి మరణకాలాలు దృష్టాంత మిస్తాయి. నిట్టల ప్రకాశంగారు మొట్టమొదట భామవేషగాండే; యీయన కొంత వయస్సు జరిగాక వకనాండు పదిమంది పెద్దలనీ పిలిచి అన్నాట్ట! నేను 15 రోజులలోనో వారంరోజులలోనో వకకవి నౌతానన్నాట్ట. సరే! యేదో పిచ్చిమాట అనుకున్నారు ఆ పెద్దలు. తరవాత యేమిటో చూదా మని ఆ యేర్పాటైన తేదీని దేవాలయంలో సభ చేశారు. యెవరేది కోరితే దానిమీంద (పద్యకవిత్వంకాదు) కవిత్వంచెప్పేటప్పటికి అత్యాశ్చర్యం కలిగింది అందరికీనిన్నీ. ఆయన తన్మయత్వంలో వుండి యింటిగొడవ బొత్తిగా చూడక ఆడుకుంటూ పాడుకుంటూ ఉండేటప్పటికి ఆయనభార్య ఆ ధోరణిని పిచ్చిగా భావించి ఖయిదులో పెట్టించింది. ఖయిదులో వుండికూడా రామదాసులాగ భగవన్నామస్మరణతో కాలక్షేపం చేస్తూ వుండేవాండు. అంతట్లో యేదో పర్వం వచ్చింది. "నన్ను గోదావరీస్నానానికి తీసుకువెళ్ళ" మన్నాండు. యిదేమైనా దొంగతనంవగయి

రాలు చేయడంవల్ల వచ్చినఖయిదా, రాజద్రోహపు ఖయిదా ? అందుచేత తీసుకువెళ్లారు బంట్రోతులు. సంకెళ్ళు సంకెళ్ళలాగే వున్నాయి. పక్క మునుఁగు మునిఁగాఁడు. ఫర్లాంగు మేరదూరంలో తేలాఁడు. వ్రాసిన పట్టేసు కొని ఆ మహాప్రవాహంమీఁద చాపమీఁద కూర్చున్నట్టు కూర్చున్నాఁడు ఆపట్లాన్ని యీవిధంగా రచన కారంభించాడు.

> "గౌతమి నేఁ గనుఁగొంటిని, కన్నుల పండువుగాను
> రాతి నాతిగఁ జేసిన సీతారాముల కరుణారసమున ॥గౌత॥
> అంగజారి శిరముపైని. ఆడుచునుండేటి గంగ
> పొంగి తరంగములతోడ భూమినిండుచు
> అంగలింగ భంగవరుల, సంగమునఁ జెలంగు కోటి
> లింగములను............................"

యీ పైభాగము జ్ఞప్తికి వచ్చింది కాదు. ఆధార యెంతమధురంగా వుందో పరిశీలించండి. అది భగవత్కటాక్షలబ్ధ మయింది కాకపోతే అలా వుంటుందా ? రసజ్ఞులు పరిశీలించాలి. తరవాత జవానులు తమనెత్తిమీఁద కెక్కడ వస్తుందో అని భయపడ్డారు, ప్రార్థించారు. వాళ్ళకొంపెక్కడ మునుఁగుతుందో మనమూలాన్ని అని మనప్రకాశంగారు కీర్తనపాడు కుంటూ వడ్డుకు వచ్చారు. తరవాత యేరెండుమూఁడు రోజులో వుంచి ఖయిదులోనుంచి విడిచిపెట్టారు. క్రమంగా హరినామస్మరణ చేసుకుంటూ కాలక్షేపానికి ప్రారంభించారు. కొన్నాళ్ళు బ్రాహ్మణగృహాల్లోనే ప్రసాద స్వీకారం. క్రమేణా యెవరు ఆదరిస్తే వాళ్ళయిళ్ళల్లోనే కడజాతి వినాగా ఆరీతి ప్రారంభం కావడంతోటట్టే సారాకూడా యెవళ్ళో అలవాటుచేశారు. సర్వసమతత్వంలో వున్న అవధూతకు విధినిషేధాలతో అవసర మేముం టుంది ? యెప్పుడేనా యీనాంరావడం వుండేది. వస్తే సారాకొట్టులోనే మకాం. యెవరేనా సందర్శించ తలచుకుంటే అక్కడే. నేను అక్కడే సందర్శించాను. యేకీర్తనేనా యెవరేనా అడిగితే చెప్పేవాఁడు. అది ఆశు కవిత్వమే. యీవలివాళ్లు వ్రాసుకోవలసిందేగాని ఆయనకు రికార్డంటూ

లేదు. ఆకీర్తనలు చాలా వున్నాయి. నాచిన్నతనంలో విని నేర్చుకున్నవి కొద్దిగా యిప్పటికిన్నీ నాకు జ్ఞాపకం వున్నాయి. ఒకటి రెండుమాత్రం వుదాహరిస్తాను.

1. సీతామనోహర రారా ? సేవకుని, నమ్ముకొన్న
వేరా ? రాతి నాతిగఁ జేసె నీపద రజ మటం
చును ఖ్యాతిగావినిప్రీతితో నినువేఁడితిని నా,
పాతకము లెడఁ బాపు మిఁక శ్రీసీ."

యింకా కొన్ని చరణాలు వున్నాయి, జ్ఞాపకంలోలేవు. పక రెవరో శృంగారరసంలో చెప్పవలసిం దని కోరేటప్పటికి వ్రాసుకోమని చెప్పారఁట! దాన్ని కొంచెం చూపుతాను :

2. జాలిమాలి వనమాలి రాఁడాయెనే. జాలిమాలి. అనేపల్లవి మాత్రమే జ్ఞాపకం వుంది గాని అనుపల్లవి వగయిరాలు జ్ఞాపకంలేవు. సంగీతానికి వొత్తక్షరాలు లేకుండావుండడం ముఖ్యగుణం. అందుకే అచ్చ తెలుఁగుమాటలున్నూ అచ్చతెలుఁగులాగే వుండే సంస్కృతంమాటలున్నూ దానికి యెక్కువ వన్నె తెస్తాయి. యీపరికాశంగారి కవిత్వంలో అలాటి మాటలే తఱుచు పడతాయి. యీయన లీలాశుకాదులవలె కృష్ణభక్తుఁడు కాఁడు. రామభక్తికే ప్రాధాన్యం యీయవకవిత్వంలో కనపడుతుంది. బహుశః వందలకొలఁదిగా రామకీర్తనలు యీయనవి వుంటాయి. యెవ రేనా కోరితే శివకీర్తనలుకూడా చెప్పేవారు. ఆకీర్తన వకటి నా కిప్పటికీ జ్ఞప్తిలోవుంది.

"హరా ! నిన్ను నే నమ్మినాను గదరా : కరుణా
కర పురహరః, హరా నిన్ను ॥హరా॥
నమ్మినానురా ! కరుణఁ జూడరా మ్రొక్కు
చుంటిరా ! ముదమ్మున ॥హరా॥

వరాలతండ్రి: నా, మొఱాలకించవు
నిరాదరణకే, మిరా కారణము ॥హరా॥
కరుణతో నిట్టల పర్రికాళు నేలిన దొర"
వని నిను నే, శరణుఁ జొచ్చితిని ॥హరా నిన్ను॥

యింత ముద్దుగా, తేలికగా యెవరికోగాని రచన సాఁగదు. కవులు పుట్టుదురుగాని చేయఁబడరు" అనే పెద్దలవాక్యసమన్వయం యీలాటి వారి విషయంలోనే తార్కాణ మవుతుంది. యీయన నాకు సుమారు పద హాఱేళ్ల వచ్చేదాఁకా అంటే, నేను చామర్లకోట విద్యార్థిత్వం చేసేవఱకున్నూ బాగానే వున్నారు. తఱుచు కాకినాడ జగన్నాథపురంలోనే మకాంగా వుండేవారు. యీయనకు ఖేచరగమనంకూడా వుండేదని చెప్పుకొనేవారు. అదియెంతసత్యమో నాకు తెలియదు. యీయనరోజుల్లోనే రాంభొట్లు అనే వక అవధూత వుండేవాఁడు. ఆయన కేవల మౌనంగా వుండేవాఁడు. వేఱొకప్పుడు ఆయన్నిగూర్చి వ్రాస్తాను. యీయన మఱునాఁడు దేహం చాలిస్తాఁ డనఁగా గంటలూ నిముషాలతో దేఖీలుగా ఆయన్ని ఆశ్రయించు కొని వుండే భక్తులకు చెప్పడమూ, ఆసమయానికి పూర్వమే వేలకు వేలు జనం చేరడమూ పెద్దవుత్సవం హరినామస్మరణతో జరగడమూ నేనేకాక యెందఱో యెఱుఁగుదురు. యీయన జీవితంలో కనపడిచిన మహత్త్వాలు యెన్నో వున్నాయి, విస్తరభీతిచే వుదాహరించలేదు. యీయన సమాధి జగన్నాథపురానికి పశ్చిమంవైపున వూరివెలపట యిప్పుడున్నూ వుంది. యీయనతరవాత మళ్ళా యింతటిజ్ఞాని అని చెప్పవలసిన వాఁడు యెడ్ల రామదాసుగారు. యితరవిషయాల్లో యీయిద్దఱికీ పోలిక లేదుగాని భక్తి లోమట్టుకు పోలిక వుంది. యెందఱో యీయనకు శిష్యులు వున్నారు. రామభక్తుఁడు, స్వయంభూతజ్ఞానశాలి, ఆజానుబాహువు, సంసారమందే వుండి రామనామజపంచేసి తరించిన పుణ్యపురుషుఁడు. యీయన సుమారు నేను 49 వత్సరాల వయస్సులో వుండఁగా పరమపదించి వుంటారు.

యీమధ్యనే వేదాన్ని కాకినాడనుంచి రాజమండ్రికి తీసుకువచ్చారు. కడియంస్టేషను దగ్గిరనుంచి రాజమండ్రి వూరువిడుపుకు వెళ్ళేపర్యంతమూ పరచేసారు. యిది నేను కళ్ళారా చూచినదే. యీమధ్య శిష్యులతో తమ సమాధిని సారంగపర్వు(డి మెట్టపద్ద యేర్పాటవవలెనంటని చెప్పినందున శిష్యులు అలాగే చేశారు. బందరు "ఢుంఢుం" గారికన్న యీప్రకారం నాకున్నూ. రామదాసుగారున్నూ వేదాంతజ్ఞానంలో చాలా వెనక చెప్పవల సినవారు. మూఢభక్తివల్లనే తరించినవారు. అందులో పరికాకంగావు శృంగారభక్తితో తన్మయత్వాన్ని పొంది క్రిమంగా విరక్తులైనవారు. వీరందరికీ పూర్వజన్మసంచితం చాలా వుండితీరవలసిందే. వొక్కజన్మలో యింత యోగం పట్టదు. వీరందఱూ భద్రాచలరామదాసుగారి త్రోవనే అనుసరించిన భక్తులు. యిప్పటి సంఘసంస్కర్తలు కొందఱు భద్రాచల రామదాసుగారి భక్తినికూడా ఆమోదించరు. ఆయన ప్రభుద్రవ్యాన్ని అపహరించికదా శ్రీరాముని కైంకర్యాన్ని నెఱవేర్చుకున్నా(డు. అయితే క్రిమంగా కాంగ్రెస్సు సిద్ధాంతాలమీ(ద విశ్వాసం కుదురుతూ వుంది కనక ప్రభుద్రవ్యమేమిటి ? ఆద్రవ్యమంతా ప్రజలదేకదా ! అనే "థీరీ"ని బట్టి రామదాసుగారి కైంకర్యాన్నికూడా అంగీకరిస్తారేమో ? మన భారతీయుల మతంలో భగవదారాధనకింద వినియోగించిన చోరత్వాన్నికూడా తరచో పాయాలకిందే జమకట్టారు. దాన్నిబట్టే—

"చోరు(డనంగరా దొరులసొమ్ములు ముచ్చిలినం బ్రిపన్నునిన్"

అంటూ పన్నిద్దరాళ్వారిచరిత్రల్లో వకరైన తొండరడిప్పొడియాళ్ళ వారిచరిత్రలో సారంగు తమ్మయ్యమహాకవి వ్రాసి వున్నా(డు. దాన్ని శ్రీ. కం. వీ. పంతులుగారు విమర్శించి దుర్నీతి బోధకంగా తేల్చారు. మనవేదంగాని, పురాణాదులుగాని భగవద్విషయమందున్నూ, తద్భక్తుల విషయమందున్నూ విధినిషేధాలు వుపయోగిస్తూ మనం చర్చించకూడ దనియ్యేవే అభిప్రాయపడ్డాయి. యెందుచేత ? మనకంతటి తెల్వితేటలు

చేపనే హేతువుచేతే. "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" అనే శ్రుతి యీఅర్థాన్నే బోధిస్తుంది. శ్రీ శంకరులవారి—

"త దయం కరోతు హయమేధశతా
న్యమితాని విప్రహననా న్యథవా
పరమార్థవి న్న సుకృతై ర్దురితై
రపి లిప్యతేఽ స్తమితకర్తృతయా."

అనే శ్లోకార్థం యిప్పటి విమర్శకులకు బొత్తిగా రుచించదు. వీరికి తోఁచినమాట లేవో వీరు వ్రాస్తారు. పూర్వులను గుఱించిన్నీ, వారిప్రవర్త నాన్నిగుఱించిన్నీ ఆమాటలు అందఱికీ అందుఁబాటులో వుండడంచేత ఆమాటలకు వ్యతిరేకించే మాట లెవరేనా వ్రాస్తే వారిని బట్టుకొని తోఁచి నట్లల్లా తట్టాబాజీలు వగయిరా చేయడానికి మొదలు పెడతారు యిప్పటి నవనాగరికులు. యిది విషయాంతరం. ప్రస్తుతం భక్తివిషయంలో కథ నడుస్తూ వుంది. ఆ శృంగారభక్తి మఱోభక్తిగామాఱి తరించినవారు కొందఱు మాఱకుండా ఆలాగే వుండి తరించినవారు కొందఱు. గోపికలు మాఱకుండానే తరించినట్టే చెప్పవలసి వస్తుంది. అందులో పాతివ్రత్యా నికి భంగంగా కూడా గోపికలు ప్రవర్తించా రని భాగవతమే చెపుతుంది. ఆ జారత్వం యితరవిషయంలో అయితే ఆ గోపికలు తరించడానికి అవ కాశంలేదు. భగవద్విషయం కనక అది దూష్యం కాకపోయింది. యీ అంశం యెంతో విశ్వాసంవున్నవారుగాని యితరులు విశ్వసించరు. ఆ భాగ వతగ్రంథాన్నే యీసడిస్తారు. ముక్కముక్కలుగా ఖండిస్తారు. అయితే ఆగ్రంథం మహాఋషి చేసిందిగాని అస్మదాదులకవిత్వం గాదు. దాని యందు ప్రామాణ్యబుద్ధికలవా రెందఱో యిప్పటికిన్నీ తరిస్తూ వున్నట్టు ప్రత్యక్షదృష్టాంతాలు కొన్ని కనపడుతూ వున్నాయి. తక్కినమా టల్లా వుంచుదాం, చావడానికి సర్వసిద్ధమైన పరీక్షిత్తు వట్టి అంకుపురాణమైతే వింటాఁడా? నిన్న మొన్న బహుశః కొన్నిమాసాలకన్న యింకా యెక్కువకాలం కాలేదనుకుంటాను. రాంభొట్ల అప్పన్నశాస్త్రుల్లుగారు శ్రీమ

వ్యాసపీఠం మిక్కిలి ఆవేశంతో తన్మయులై పురాణం చెప్పేవారు. వారికి భగవంతుఁ డేదో యింత వుపాధి అన్నోదకాలకు పుష్కలంగా యిస్తూవుం డేది యెవరిచ్చినా యేమీ స్వార్థమై పరిగ్రహించేవారు కారు. భగవదా రాధనార్థం కొన్నివేలు సంపాదించి ఉత్తిగ అనేగ్రామంలో వుండే దేవా లయానికి ప్రాకారం నిర్మింపచేసినట్లు విన్నాను. యీయన నన్ను చూచ డానికి ఏకపర్యాయం మాగ్రామం దయచేశారు. చామర్లకోటలో శ్రీసి ప్పారి బాలకృష్ణమూర్తిగారు వుద్యోగరీత్యా వున్నప్పుడు మార్గవశాత్తూ వస్తూ ప్రత్యేకించి వారి బసలో వీరి సందర్శనం చేశాను. ఈ రెండు శ్లోకా లాచదువు వారికి వినిపించడమే వారికోరికను బట్టి జరిగించడంగాని వారి భాగవతపురాణధోరణి నేను వినడం తటస్థించనేలేదు. తరవాత యిప్ప టికి సుమారు పదేళ్ళనాఁడు వ్యాఘ్రేశ్వరంలో మంగిపూఁడి గవర్రాజు గారియింట్లో జరిగినవివాహంలో అనేకపండితమండితమైన మహాసభలో వీరిపురాణకథనం వినేభాగ్యం తటస్థించింది. కుడుఁచే వచ్చి చెపుతూ వున్నట్టు ఆయాఘట్టాలలో పండితపామరులకు గోచరిస్తుంది. అర్థాలమాట లేమి? సార్వత్రికంగా కాకున్నా మఱికొందఱు విద్వాంసులుకూడా చెప్పే వారుంటే వుంటారు. తన్మయత్వం దుర్లభంకదా! అట్టితన్మయత్వం యీ అప్పన్నశాస్త్రుల్లుగారియందు పూర్తిగా గోచరించేది యేకొంచెమో తప్ప. యీ శాస్త్రుల్లుగారికి సంగీతధోరణి వున్నట్టు లేదు, వట్టితన్మయత్వమే వుండేది. దానికి తథ్యంగా యీయన యేకాదశీమరణాన్ని పొందివున్నారు. యీ మరణం నిష్కల్మషమైన భక్తికి తార్కాణంగా భారతీయులలో ఆస్తికులందఱూ అంగీకరిస్తారు.

మాతండ్రిగారు యేవిద్యలోనూ పండితులైతే కారుగాని ఒకవిధమైన భామాకలాపం అంతా కంఠోపాఠంగా వచ్చినవారు. చిన్నప్పుడు మామిడి పళ్ళరోజుల్లో తోటలో సమవయస్కులతో సరదాగా ఆయావేషాలు కట్టు కొని భాగోతం ఆడుకొనేవార మని ఆయన చెపితేనే విన్నాను. ఆరివాటి వినికివల్లనే ఆయనకు మంత్రపుష్పం మట్టుకు కొంత హెచ్చుతగ్గులుగా

వచ్చేది, తరంగాలుకూడా కొన్ని వచ్చేవి. ఆయన 83 వత్సరాలు పరాపేక్ష లేకుండా జీవించి స్వర్గతులైనారు. ఆరోజునకూడా యింట్లో యిటూ అటూ తిరుగుతూనే వున్నారు. ఆయనకు అవసానకాలం వచ్చినట్టు గోచరించిందో యేమో మా కెవరికీ చెప్పలేదుగాని—

"నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
స బ్రహ్మ స శివ స్సోఽక్షరః పరమస్స్వరాట్"

అనేవాక్యాలు అసకృదావృత్తిగా జపించడాకి మొదలు పెట్టారు. ఆవేళ ఆశ్వయుజశుద్ధ ఏకాదశి. "యాంతే మతి స్సా గతిః" చెప్పే దేమిటంటే? సాక్షాన్మూలవిరాట్టునందే కాని, అర్చావతారాలయందేకాని తెలిసి భక్తి చూపినవారికి సరేసరి; తెలియక భక్తి చూపినవారికికూడా ముక్తి యేదోవిధమయినది కలిగేతీరుతుం దనడానికి ఆయీ యేకాదశీమరణాలు కొంతవఱకు తోడ్పడుతూ వున్నాయి. "చావడానికి యేకాదశేమిటి, అమావాస్యేమిటి?" అని తుండూ తుపాకీ యెగరఁగొట్టేవారికి చెప్పఁ దగ్గ జవాబు లేదు.

యిటీవల బ్రాహ్మణులు స్వార్థపరులై కొన్ని సంగతులు యితరులకు అపకరించే తాత్పర్యంతో ఆయాగ్రంథాల్లో చేర్చారనిన్నీ, అవి నమ్మడానికి వల్లకాదనిన్నీ పలువురు సాహసించి ప్రతిదినమున్నూ పత్రికలో తల దిమ్మెత్తేటట్టుగా వ్రాస్తూవున్నారు. వారివాదంకూడా శిరసావహించే పక్షంలోకూడా యీ యేకాదశీ మరణం ముక్తిదాయకమని వ్రాసేవ్రాఁత తుడిచిపెట్టుకు పోయేదికాదుగదా! యిది యెవరిని మోసగించే దవుతుంది? అని నేను యిందులో వుదాహరించాను. పూర్వగ్రంథాలు ప్రమాణాలు కావనిన్నీ, కృష్ణుఁడు మనుష్యమాత్రుఁడే అనిన్నీ తాము విశ్వసించడమే కాకుండా పలువురిని విశ్వసింపచేసినవారి మరణాలలో యీలాటి విశేషాలు కనపడకపోవడమున్నూ, క్వాచిత్కంగానేనా వాట్లయందు మూఢవిశ్వాసం

కలవాళ్ళ మరణాలయందు యీలాటివిశేషాలు కనపడదమున్నూ చూస్తే తరించడానికి యిప్పటి మార్గాలకంటె వెనకటిమార్గాలే మంచివేమో అనిన్నీ, యిప్పటి మార్గాలకు దారితెన్నూ అంటూ బొత్తిగా కనపడక యెవరియిష్టం వచ్చినట్టు వారు స్వసంఘౌన్నత్యమే లక్ష్యంగా పెట్టుకొని ప్రవర్తించడం వల్ల యిది అధఃపతన హేతువవుతుందేమో అనిన్నీ భయంవేస్తూవుంది కొందఱికి. "అవిధినా కృత మకృతం" గదా! అలాటిదానివల్ల శ్రేయస్సుకుబదులు ప్రత్యవాయంకూడా కలుగుతుంది. ఏ రేదేనా చెప్పఁబోతే పదిమందీ కలిసి యెదురుకుంటారు, అందుచేత చెప్పరు. చెపితే మాటా దక్కదు. యీ యుగంలో యీలా జరుగుతుం దంటూ ఆపురాణాల్లోనే వ్రాశారుగాని అవిన్నీ యిటీవల బ్రాహ్మణపండితుల ప్రక్షిప్తాలే అంటూ వకవాదం. వకదాని కేమిటి, బ్రాహ్మణులకు తప్ప యితరులకు అపకరించేటట్టు వున్న వ్రాఁతలన్నీ ప్రక్షిప్తాలంటూ వకపేవాదం, పిడివాదం. కొలఁదికాలంనాఁడు దయానందసరస్వతులనేవా రొకరు మహాపండితులై వుండికూడా యిదేత్రోవను అవలంబించి వేదాలనుమాత్రం ప్రమాణంగా పడతామని చెపుతూకూడా యేవి వారివాదాన్ని భంగిస్తాయో అవి యిటీవలి వారికల్పనలని కాశీపండితులతో వాదించడానికి మొదలు పెట్టేటప్పటికి ఆపండితులు "అయ్యా! యేవేవి మీరు వప్పుకుంటారో మొదటనే సెలవియ్యవలసిం" దనినారనిన్నీ, వారు "ఫలానా ఫలానా" అని నిరూపించారనిన్నీ. తరవాత ఆభాగంలోనే వారివాదానికి విరుద్ధించేవాక్యాలు చూపి కాశీపండితులు వారిని వోడించారనిన్నీ మాపరమగురువులు చెప్పఁగా విన్నాను. అయితే వారు పండితులు గనక ఆలా జరిగింది. వీరో? పండితులూ కారు, పామరులూ కారు. యిప్పుడు వుత్తరహిందూస్థానంలో కొంత ఆమతమున్నూ ప్రచారంలో వుంది. యీమధ్య సనాతనమత మంటే యిది అని వక రెవరో శాస్త్రినామంతో వున్నవారే నిరూపించి వకవ్యాసం వ్రాశారు. అది మఱీసాహసాన్ని ప్రకటిస్తూ వుంది. రష్యాలో వుండే సామ్యవాదం మతవిషయంలో వారి వ్యాసంలో గోచరిస్తూవుంది. యిది విషయాంతరం.

శ్రీకృష్ణుణ్ణి శృంగారభక్తితో ఆరాధించి తరించినవారివిషయం నడుస్తూవుంది. శ్రీమదానందగజపతిమహారాజులుంగారిని విననివారు మన దేశంలో యెవరూ వుండరనుకుంటాను. ఆయన రెండో భోజుని అవతారమే అని విద్వాంసులందఱూ అంగీకరిస్తారు. ఆవిద్వద్రాజశిఖామణి తన అవసానకాలాన్ని జ్ఞానబలంచేతనే గుఱితించి వెలగాడకొండమీఁదకి తగిన పరివారంతో వెళ్ళి అక్కడ శ్రీకృష్ణుని దశమస్కంధంలో వున్న చర్యలను అనుకరింపచేస్తూ కాలక్షేపంచేసి ఆతుదిరోజులు వెళ్ళించి స్వర్గతులైనారని ప్రత్యక్షంగా ఆ సంఘంలో వకపాత్రగా వున్న వకవిద్యాధికుఁడు చూచి యిప్పటికి సుమారు 35 యేళ్ళనాఁడు చెప్పఁగా విన్నాను. అయితే వీరందఱూ యేదో విధమైనముక్తినే పొందినట్టు సాక్ష్యమేమేనా వుందా అంటే, చెప్పఁదగ్గ జవాబు కనపడదు. "మహాజనో యేన గతస్స పన్థాః" అనే మూఢవిశ్వాసమే, భగవంతునియెడల యేకారణంచేతనేనా మనస్సు నిలవడమనేదే కావలసింది. ఆనిల్పడానికి దయాసత్యశౌచాలు తోవాసాలు. యివిమాత్రమే వుండి ప్రధానం లేకపోయినమతం నాస్తికమతం. కొందఱంటారుకదా "నాస్తికమత మంటూ వేఱేలేదు. యిప్పుడు అద్వైతమనేదే నాస్తికమతం. బౌద్ధమతానికే దేవుఁ డున్నాఁడనే కాస్తమాటా కలిపితే సరి అద్వైతమత మవుతుం" దంటారు. యిది ప్రతిపక్షులు చెప్పేమాట, ప్రతిపక్షులు ప్రతీమతానికీ యీలాటి ఆక్షేపణలు కనపరుస్తూనే వుంటారు కనక వాట్లను మతవిశ్వాసంకలవా రెవరూ పాటించక వారివారి మతాచారాలను పాటిస్తూ తరణోపాయాన్ని అన్వేషిస్తూ వుంటారు. కాని యెంత సరిపెట్టుకుని మూకీభావంవహించి వూరుకుందామన్నా యిప్పటివారి వ్రాఁతలు చూస్తే మనస్సుకు యిబ్బందిగా వుంటుంది. వేదం అధ్యయనం చేయడానికల్లా వొక్క యజ్ఞోపవీతం మాత్రం వేసుకోవడంమాత్రమే నఁట కావలసింది!

"యజ్ఞోపవీత్యేవాధీయేత" అనేశ్రుతికి అదే అర్థం అని ఆయన తాత్పర్యంగా తేలిచారు. అవురా! రాజ్యస్వాతంత్ర్యంమాట పుస్తకాపేక్ష

లోనే వున్నా వేదం అర్థం చేయడానికి అప్పుడే పూర్తిస్వాతంత్ర్యం వచ్చేసిందని సంతోషించవలసివచ్చింది. కాని వొకందుకు సంతోషించాలి. బ్రాహ్మలకు వేదమంటే పూర్తిగా అనాదరంకలిగినా తక్కినవారికియెంతో ఆదరంవున్నట్టు తోస్తుంది. అధికారానధికారవిచారాని కేంగాని. వారేనా సక్రమంగా అభ్యసించి అర్థనిర్ణయానికి యేర్పడ్డ సామగ్రిని సంపాదించి ఆధనాన్ని చక్కఁగా కాపాడితే బాగుండును. కాని ఆమార్గం కనపడడం లేదు. అయితే అందుకు వేదవేత్తలైన బ్రాహ్మలసాయం ఆవశ్యకం. కాని వారింకా అట్టిసహాయానికి అనుకూలురుగా లేరు. యిది విచార్యం. యెవరైతే అనుకూల్యాన్ని కనపఱుస్తూ వున్నారో, వారికీ వేదానికీ చుట్టరికం లేశమూ లేదు. యిది యేలా కుదురుతుంది ? సజీవసాధనాలద్వారా సంఘటించేటట్టు లేదు. యిఁక నిర్జీవసాధనాలవల్ల వేదాన్ని ఆర్జించాలి. అది శ్రుతి. అంటే ? వినికివల్ల సంపాదించుకోవలసిం దంటారు. అలా విని నేర్చుకోవడానిక్కూడా అన్ని వ్యక్తులకున్నూ అది సాధ్యపడేది కాదని నేఁటిదాకా వున్న ప్రాజ్ఞులెల్లా అంటారు. దానికి స్వరబాధ వకటి వచ్చిపట్టుకుంది. యిప్పటి సంస్కర్తలు యితర నియమాలతోపాటు దాన్ని కూడా తొలఁగిస్తారు. సందేహంలేదు. ఆపద్ధతిని దాన్ని అభ్యసించడానికి యజ్ఞోపవీతంమాత్రం యెందుకో ?

యెందు కీవిచారం ? యిది వొక చిత్రమైనకాలం. యేసంస్కారానికీ వకహద్దంటూ లేదు. వూరికే పరుగులు వాఱడమే యీకాలానికి స్వభావం. అది యీకాలానికి సహజగుణంగా త్రికాలజ్ఞులైన ఋషులు కనిపెట్టి వ్రాసేవున్నారు. అందుచేత ఆఋషుల అభిప్రాయాలను సార్థకపఱచి గౌరవించువారిని మిక్కిలిగా అభినందించడం కన్న వేఱొకమార్గం కనపడదు. వొక్కక్షత్రియులుతప్ప, అంతో యింతో వెలమవారుతప్ప, సర్వులకూ మనదేశంలో బ్రాహ్మలంటే ఋషులదగ్గిఱనుంచీ పూర్తిగా స్వార్థపరులనే అభిప్రాయం వుదయించింది. దానికి చాలామంది బ్రాహ్మలే కొందఱు మార్గప్రదర్శకులుగా కనపడుతూ వున్నారు. అట్టిబ్రాహ్మలని

అభినందించినట్టు లేదుగాని తక్కినబ్రాహ్మలని పూర్తిగా దూషిస్తూవుంది ప్రపంచకం. అడిగినవాళ్ళకు లేదనకుండా, కొంచెము ప్రతిఫల మేమీ అపేక్షించకుండా తోఁచినముక్కలు చెప్పినా ఆ ముక్కలుకూడా వ్యతిరేక ప్రచారానికే పనికివస్తూవున్నట్టు వారివారివ్రాఁతలు తెల్పుతూ వున్నాయి. యిప్పుడు నిజమైనశక్తికల బ్రాహ్మ్యమంటూ వున్నట్టయితే వారు వారంతట ముక్కుమూసుకునేపనిలో వుంటే యెంతేనా లోకకల్యాణంగా వుండేది. అంతటి సుయోగం కలిగే సూచనలు బొత్తిగా కన్పడవు. ఆహా! ఆకాల మెంత ధన్యమైనకాలం! ముక్కుమూసుకున్న బీదబాపఁడంటే, చక్రవర్తి జంకాఁడుకదా! చక్రవర్తిత్వం నీకిస్తా మంటే తృణీక రించాఁడుకదా బీదబాపఁడు!

"అన్నిటికి సిద్ధమై విప్రుఁ డరిగినప్పు
డాత్మగౌరవ మెటు నిల్చు?"

బ్రాహ్మణపుత్రుఁ డైనంతలో బ్రాహ్మఁడు కాఁడని యథార్థతాత్ప ర్యంతో బ్రాహ్మలు వ్రాసినమాటనే పుచ్చుకొని బ్రాహ్మలయం దితరు లారోపించే దోషాన్ని ప్రాజ్ఞులెవరూ కాదనరు కాని యేజాతికేనా ఉపన యనం చేస్తే సరి బ్రాహ్మఁ డవుతాఁ డన్నదానికి ప్రాజ్ఞులుగాని, శాస్త్ర ములుగాని అంగీకరించవు. యెన్నో వత్సరాలు కృషిచేసి పాణిన్యాదిదర్శ నాలు స్వాధీనపఱుచుకొన్న తర్వాతఁగాని బోధింపని వేదశ్రుతుల సమన్వ యాన్ని అక్షరజ్ఞానమాత్ర సంతుష్టులు చేయుటకున్నూ ప్రాజ్ఞులు అంగీక రించరు. యింతటి కూరగాయబేరంలోనే వేదార్థసమన్వయం వుంటే పూర్వులు దానికోసం జీవితమంతా కర్చు పెట్టరు. ఆ యీవిషయం ప్రస్తుతం వ్రాసే వ్యాసంలో యెందుకో చేరిందిగాని చేరఁదగ్గదికాదు. అయితే యీవ్యాసం వ్రాస్తూవుంటే యేదో పత్రికవచ్చింది. ఆపత్రికలో వున్నవిషయాలు కేవలవిపరీతంగా కనపడ్డాయి. ఆకారణంచేత ప్రసక్తి గాని ప్రసక్తిగా "సరాజుపెళ్ళిలో గురాజు కొకపోఁచ" యీనాలుగు మాటలున్నూ యిందులో దొర్లడాని క్కారణమయింది.

వైదికంగా తరించడానికి కర్మశ్రద్ధ వకటి ముఖ్యంగా వుండాలి. అది నానా కట్టుఁబాట్లతోనూ చేరి వుంది. దాన్ని సక్రమంగా నిర్వహింపడం చాలా దుస్తరం యేమాత్రం దానిలో లోపంవచ్చినా అది అయ్యవారిని చేయబోతే కోతిగా పరిణమించినమాదిరిగా ప్రతిఘటిస్తుంది. యేలోపమూ లేకుండా దానిలోనుంచి నెగ్గించుటకు బయటఁపడ్డా నిరపాయమైన పదవిని ఆ కర్మకర్త సంపాదించుకో లేఁడనియ్యేవే శాస్త్రాలు చెపుతూ వున్నాయి. ధర్మరాజంత వాఁడికూ్కాఁడా కర్మ వ్యతిరేకఫలాన్నే యిచ్చినట్టు గ్రంథాలు చెపుతూ వున్నాయి. మహాగాయకునికి స్వరాది సాధనం సభాస్థలాల్లో యెంతపనిచేస్తుందో అదిన్నీ అంతే. పూర్వవేదమంతా కర్మపరంగాన్నూ, ఉత్తరవేదమంటే, ఉపనిషద్భాగం జ్ఞానపరంగానున్నూ ప్రవర్తించింది. పురాణాలన్నీ కొంత తికమకగా వున్నట్టు కనపడ్డా వేదార్థానువాదాలే కాని అన్యాలు కావు. శంకరాదులు పూర్వవేద ప్రతిపాదితమైన యజ్ఞాదులను బొత్తిగా తోసివేస్తే ఉత్తరవేదంమాత్రం యేలా నీకు ప్రమాణ మయిందనే ప్రశ్న వస్తుం దని చెప్పి కర్మభాగాన్ని కొంత అంగీకరిస్తూ జ్ఞానాన్ని సిద్ధాంతపఱిచారు. ఆ జ్ఞానంకూడా కర్మకాండకంటే తేలికలో వున్నట్టు కనపడదు. అందుచేత భక్తిమార్గం అంటూ వున్నంతలో తేలికమార్గం యేర్పఱిచారు. భగవద్గీతలో పన్నెండో అధ్యాయం ప్రత్యేకించి భక్తికోసమే శ్రీకృష్ణభగవానుఁడు చెప్పినట్టు విస్పష్టమే. ఆభక్తివల్లనే యెందఱోతరించినట్లు పురాణాలు ఘోషిస్తూవున్నాయి.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీషశుకశౌనక భీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి."

అని నారాయణతీర్థులవారు తరంగాలలో ప్రాచీనభక్తులను కొందఱిని పేర్కొని వున్నారు, వారితోవనే అనుసరించి తరించినభక్తులు యీ కలియుగంలో యెందఱో వున్నారు. కొందఱిని నే నిందులో వారి

వారి చరిత్రలతోసహా సంగ్రహంగా పేర్కొని వున్నాను. ఆ భక్తులలో కలియుగం సమీపించే రోజుల్లో గోపికలు శృంగారభక్తిని అవలంబించి తరించినా రనిన్నీ లీలాశుకాదులుకూడా అట్టిరీతిభక్తిచేతనే తరించినట్టు వారివారికవిత్వాలు సాక్ష్యమిస్తా యనిన్నీ చూపి వున్నాను. లీలాశుకుఁడి కంటేకూడా యెక్కువగా శృంగారంలో మునిఁగి తేలినట్టు కనపడుతుంది జయదేవుఁడు. యీ జయదేవుఁడు గేయాలతో శ్రీకృష్ణుణ్ణి ఆరాధించి తరించినట్టు అష్టపదులనే సంస్కృతగ్రంథంవల్ల విస్పష్టమవుతుంది. "రాధామాధవయో ర్జయంతి యమునాకూలేరహఃకేళయః" అంటూ రాధామాధవుల ప్రేమను పారకీయకంగా యీ మహాకవి వర్ణించి వున్నాఁడు. పరకీయాప్రేమయందు వకవిధమైన ప్రబలదోషంవున్నా ప్రేమయొక్క యాథార్థ్యాన్ని నిరూపించవలసివస్తే దానిలో తేలినట్లు స్వీయాసామాన్యలయందు తేలదనేకారణముచేత కొందఱు కవులు తమ తమగ్రంథాల్లో పరకీయనే నాయికగా కల్పిస్తూ వచ్చారు. శ్రీ దేవీభాగవత రీత్యాచూస్తే రాధ కృష్ణుఁడికి మేనత్త అనేఅంశం కనేపడదు. ఆరాధవేఱూ, యీరాధ వేఱూ అనుకోవాలి. యీ రాధాకృష్ణుల శృంగారాన్ని అవలంబించి కవిత్వాన్ని నడిపించి తరించిన జయదేవుణ్ణి గుఱించి చెప్పుకోగా విన్న మహత్త్వాలు కొన్ని వున్నాయి. యీయనభార్యపేరు పద్మావతి. యీపె మహాపతివ్రత. వకసంస్థానంలో యీయన ఆస్థానపండితుఁడు. భార్య అంతఃపురంలో రాజభార్యల కేవేనా పాతివ్రత్యానిక సంబంధించిన గాథలు చెపుతూ వుండేది. యెప్పుడో వొకప్పుడు ప్రశంగవశంగా భర్తకు అపాయం వచ్చిందని వినేటప్పటికి నిజమైన పతివ్రతప్రాణాలు వాటంతట అవే యెగిరిపోతాయని చెప్పిందఁట! అపట్లాన్ని అసంగతికి యీవిడ యేమాత్రం లక్ష్య మవుతుందో చూదా మని అంతఃపురం ఆలోచించి జయదేవకవి రాజుగారితో యెక్కడికో ప్రయాణంచేసి వున్న సందర్భంలో వట్టిదే "జయదేవకవి యేదో వ్యాధివలన హఠాత్తుగా పరమపదించి నట్లు" ఆమెకడకు వార్తవచ్చేటట్టు చేశారఁట! ఆ వార్త వినేసమయానికి

ఆమె తులసీపూజ చేసుకుంటూ వుంది. వెంటనే ప్రాణాలు విడిచింది. యీ సంగతి అంతఃపురానికి తెలిసి గాబరాపడి "అయ్యో యేలాటి తెలివి తక్కువ పని చేశా" మని పశ్చాత్తాపపడి వెంటనే జయదేవకవిగారికి క్షమాపణోక్తులతో వున్నయథార్థాన్ని కబురు చేశారు. ఆ మహాభక్తకవి "ఫరవాలే" దని చెప్పి అప్పుడు ఆయన యీ అష్టపదులు రచించి గానం చేస్తూ వుండఁగా, పదునెన్మిదో అష్టపది కాఁబోలును పాడుతూ వుండఁగా ఆ శవం సచేతనమై లయానుగుణంగా తాండవం చేయడానికి ఆరంభించిం దని చెప్పఁగా పెద్దలవల్ల విన్నాను. యీశ్లోకంలో రెండోచరణంవల్ల పైసంగతి కొంత సూచిత మవుతుంది.

"వాగ్దేవతాచరణచిత్రితచిత్తసద్మా
పద్మావతీ చరణచారణచక్రవర్తీ,
శ్రీవాసుదేవరతికేళికథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్."

పైని నేను వ్రాసినకథని కల్పితమనితోసేస్తేనేకాని, అసలు ఆపె చావనేలే దని డబాయిస్తేనేకాని కొట్టుకుపోవడాని కభ్యంతరం లేదు. ఆలాటివారికి భారతభాగవతాదు లేవీ నిలవవు. వారికే కాదు పూర్తిగా వేదార్థతాత్పర్యం తెలిసినవారు సర్వథా సర్వజ్ఞులైనప్పటికీ వారుకూడా యీలాటికథలే కాదు, యేలాటికథలూ విశ్వసించక అన్నీ అర్థవాదాలని తోసేస్తారు. భక్తులుమాత్రం విశ్వసిస్తారు. భక్తితత్పరులు ప్రతిబైరాగి యందున్నూ యెంతో భక్తితాత్పర్యంతో వర్తిస్తారు. ఆబైరాగులలో యెందఱో "ఉదరనిమిత్తం బహుకృతవేషం" గాళ్ళుంటారు. వుంటే వుండ నివ్వండి. వాళ్ళను సేవించేవాళ్ళకు యేవిధమైన లోపమూ వుండ దనిన్నీ, అందులో యేవాఁడేనా తరణోపాయాన్ని తెల్పేవాఁడు వుండితీరతాఁ డనిన్నీ అనేకులు విశ్వసిస్తారు. "ఖానికుఁ డెన్నిజాళ్ళ వడపోయున్ రత్నమొక్కఁటికై" అన్నారు దాసు శ్రీరాములుగారు. గనిలో అన్నీ

రత్నా లెప్పుడూ దొరకవు గదా! ప్రవరాఖ్యుఁడు యెందఱినో సేవించఁగా సేవించఁగా వొకానొకసిద్ధుఁడు తటస్థించాఁడు.

యీ భక్తివిషయంలో శైవమతాని కున్నంత విశ్వాసం మనభారతీయమతాల్లో దేనికీ వున్నట్టుతోఁచదు. యీ విషయం యిప్పటికీ కొంత నైజాంలో ప్రత్యక్షంగా గోచరిస్తుంది. ప్రతాపరుద్రునిరోజుల్లో యెంతగా వుండేదో? ఆ రాజ్యం తురుష్కాధీనమై యెంతోకాలం కావచ్చినా యింకా శైవమతప్రపత్తి జనులలో పాదుకొనే వుంది. వొకనాఁడు శ్రీముదిగొండ శంకరారాధ్యులవారున్నూ నేనున్నూ గుఱ్ఱపుబండిమీఁద సికిందరాబాదా హైరోడ్డుమీఁద వస్తూ వున్నాము. తోవలో యెవళ్ళో (వుప్పర్లని నేను అనుకున్నాను) సుమారు వకవందమంది యెదురుపడ్డారు. సారట్లో వున్న శ్రీ శంకరారాధ్యులవారిని చూచీచూడడంతోటట్టే హైరోడ్డు కడ్డంగా వాళ్ళందఱూ సాష్టాంగపడ్డారు, వాళ్ళందఱికీ స్వహస్తంతో విభూతి వుంచడానికి వక అరగంటకంటే తక్కువకాలం పట్టలేదు. యీలోఁగా ఆరోడ్డున వచ్చిన సారట్లన్నీ ఆఁగిపోయాయి. యెన్నివిధాల పరిశీలించినా సర్వసామాన్యంగా తరింపచేసేమార్గం భక్తిమార్గమే. జ్ఞానమార్గంవల్ల అపునరావృత్తికమైన మోక్షమే రానివ్వండి, దీనివల్ల పునరావృత్తితో చేరిన వుత్తమలోకావాప్తి కభ్యంతరం లేదు. క్రమేణా కొన్నిజన్మాలలో అలాటి మోక్షాన్నికూడా పొందుతాఁడు భక్తుఁడు. తొందరెందుకు? నానాఁటికీ వుత్తమత్వం భక్తివల్ల కలుగుతుంది. అది లేని శుష్కకువాదపరులకో! "శ్లో. జనిశ్చ మరణం మృతిశ్చ జనిరిత్యధోగతి రధోగతిం దిశతితే, నమశ్శివాయోమ్" అని నేను "శ్లో. పునరపి జననం పునరపి మరణం పునరపి జననీజఠరే శయనమ్." అనే శ్రీశంకరాచార్యశ్లోకాన్ని అనుసరించే వ్రాసివున్నాను. యీలాటి భక్తిమార్గం సర్వసాధారణంగా కనపడుతూ వుంటే మనకు యెన్నటికీ కొఱకఁబడని వేదంకోసం యత్నించే కొందఱివ్రాఁతలు చూస్తే వారిహృదయం సరియైనదని తోఁచదు. పాశ్చాత్యవిద్యావాసన కలిగిన వివేకానందాది మహామహులుకూడా తరణోపాయానికి మన

మతమే శ్రేష్ఠ మైనదని వారు మనస్పా నమ్మడమే కాకుండా యెందఱో పాశ్చాత్యవిజ్ఞానులనుగూడా నమ్మించి తరింపచేసినట్టు విన్నాను. యితర భక్తుల విషయంలో శంకించేవా రంతగా వుండరుగాని గోపికలు వగయిరా శృంగారభక్తులవిషయంలో యితర మతస్థు లాలా వుండఁగా మనభారతీయులలో కూడా విశేషించి తటపటాయించేవారు వుంటారని వ్రాసే వున్నాను. చట్టన చూచేటప్పటికి దీనిలో కొంత దుర్నీతి భాసిస్తూ వుండడమే దాని క్కారణం. అది దుర్నీతే అయినప్పటికీ వుభయత్రా లేదు కనక ఆ దోషం తగలదని ఆ భాగవతంలో వుండే కొన్ని విశేషాంశాలవల్ల గోచరిస్తుంది. లీలామానుషవిగ్రహుఁడైన శ్రీకృష్ణుని ఆకారమందు మాయామర్మమూ యెఱగని ఆ గొల్లపల్లి సుందరీమణులకు చాంచల్యం కలిగిందనడంలో ఆశ్చర్య మేముంటుంది? మాయామానుషవిగ్రహుఁడైన శ్రీరామచంద్రమూర్తిని సర్వసంగపరిత్యాగులైన ఋషులుకూడా మోహించినట్టున్నూ, వారే యీగోపికలుగా జనించినట్టున్నూ వకగాథ వుంది. యింకొకగాథ నరనారాయణావతారంలో అప్సరసలు మోహించినట్టున్నూ యీయవతారంలో వాఁడికోరికను నెఱవేర్చినట్టున్నూ కనపడుతుంది. వకటే విషయానికి సమర్థనాలు నానావిధంగా చేయడంకూడా విమతస్థులు శంకించడానికే ఉపకరిస్తాయి. కాని సర్వకారణకారణుఁడైన భగవంతునిలీలలు ఋషుల శంకాసమాధానాలకే లోఁబడనప్పుడు యితరులమాట లెక్కేమిటి? యెందఱో ఆ కృష్ణునిచర్యలు యిప్పటికిన్నీ యెన్నోవిధాల గానంచేస్తూ వున్నారు.

(1) "యశోదాభాగ్యమే భాగ్యము మన ॥యశోదా॥ సర్వేశ్వరునకు, చన్నిచ్చుటకును ఉర్వినేమినోఁచెనో ॥మన॥ యశోదాభాగ్యమే"

యీలాగ నేఁటిహరికథకుఁ డొకఁడు గానంచేశాఁడు. కొంచెం పూర్వీకుఁడే అనుకుంటాను, వకభక్తుఁడు యీవిధంగా గానంచేసి వున్నాఁడు.

(2) "అంటున్నారు, అంటున్నారు లే!, గోపాలకృష్ణ! అంటున్నారు అంటున్నారు. అంటున్నారు. జంటలేక యింటింటికీ వొంటిపాటున నేఁగి, కాంతల, చంటిపై చెయివేశావని॥ అంటున్నారు."

వకరేమిటి ? మహాఋషులదగ్గిఱనుంచి మద్దుమనుష్యులదాఁకా ఆ శ్రీకృష్ణుఁ డంటే యేదోవిధంగా భజించడమే గాని త్యజించడ మంటూ లేనేలేదుగదా ! సాక్షాన్నిర్గుణపరమాత్మధ్యానం యెవరికోగాని అందుబాటులో వుండదు. ఆపరమాత్మయొక్క లీలావతారాల వుపాసన సర్వసామాన్యంగా అందుఁబాటులో వుంటుంది. తత్రాపి దశావతారా లంటూ చరిత్రతో సంబంధించినవి కనపడతాయి గాని అందులో యెక్కువగా పండితపామరసాధారణ్యేనా భజించేవి రామకృష్ణావతారాలు రెండుమాత్రమే. నరసింహావతారాన్ని యెవ్వరో వుపాసకులు తప్ప అంతగా భజించడం కనపడదు. అందులోనూ లీలాశుకుఁడువంటి నిర్మార్గమాటి అయేటట్టయితే రాముణ్ణే నీకోదండం అవలపెట్టి రమ్మన్నాఁడు. అట్టిస్థితిలో యీవికృతావతారాన్ని మన్నించడం బొత్తిగా సంఘటించదుకదా ! దేవుఁడై తే అయినాఁడుగాని ఆ లీలాశుకుఁడికి శృంగారరసానికి అనుగుణంగా వుంటేనేకాని పనికిరాఁడు కాఁబోలును ! ఔరా ! భక్తకవులపట్టుదల !!! అయితేమాత్రం వచ్చిన చిక్కేమిటి? ఆకృష్ణపరమాత్మ వక అభ్యనుజ్ఞ నిచ్చివున్నాఁడుకదా!

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"

యేవో లీలావిశేషాలు ఆధారంగా వుంటే తప్ప సామాన్యులు "తురక మసీదు నా బ్రతుకు తొయ్యలి ! యేమనిచెప్పుకొందునే" అన్నమాదిరిగా నిర్గుణాకాశమందు బుద్ధి నిల్పుకోలేరు. అందుకే ఆ యీ లీలలు నిర్గుణ బ్రహ్మమందు ఋషులు కల్పించి వుంటారు. వాట్లను భక్తులు మఱింత విపులీకరించారు. అంతే కాకపోతే తనచేత కల్పితమైన సృష్టియందు భగవంతునికి యితరులతోపాటు వ్యామోహ మేమిటి ? మచ్చుకు వకటి చూపుతాను. సంస్కృతభాగవతంలో శ్రీకృష్ణుని బాల్యచేష్టలనుగూర్చి గోపికలు యశోదతో వచ్చి మొఱ్ఱపెట్టుకొనే ఘట్టంలో "మేహనాదీని కురుతే" అని కాఁబోలును సూత్రప్రాయంగా వకవాక్యం వుంది. మేహనం అంటే ? "మిహ" సేచనే అనేధాతువువల్ల వచ్చిన రూపం కనక "సేచనం", ఆదిశబ్దంవల్ల మొత్తం తేలిన తాత్పర్యం "మీఁఅబ్బాయి

మాయిళ్ళకువచ్చి మేము అలికి ముగ్గుపెట్టుకొన్న ప్రదేశాలల్లో అల్పాచమానాధికాచమానాలు చేస్తూ వున్నాఁడు" అనేగాని అంతకన్న అధికార్థం రాదు. ఆమాటను సూత్రంగా పుచ్చుకొని భాగవతాగ్రగణ్యుఁ డగు పోతన్నగారు యెన్నో వన్నెలూ చిన్నెలూ కల్పించి జోరేఁడు పద్యాలు వ్రాశారు. కాని అసభ్యంగా లేకుండామాత్రం లేఖినిని నడిపించారు. కొందఱు యిటీవలివారు అసభ్యంగా కూడా ధార నడిపించారు. యితర మతస్థులు ఆయీ అసభ్యకల్పనలు పట్టుకొని కొంత శంకిస్తూవుంటారు. వారిలో వొకరున్నూ అసలు మూలగ్రంథాన్ని చూచినవారు కానేకారు. అందుఁబాటులో వున్న తెలుఁగు వదలుకొని "డెడ్లేంగ్వేజీ" అని కొందఱు తెలిసీతెలియక అంటూ వున్న సంస్కృతగ్రంథందాఁకా అనుధావనచేసే దెవరు? యీ అంశం నిన్నమొన్నటిదాఁకా నాకుకూడా తెలియదు. పోతరాజుగారు యథామూలంగా తెలిఁగించలే దంటూ "మూకవుమ్మడి" గా అనుకొనేమాటమాత్రమే నాకున్నూ తెలిసినది. యీమధ్య యింకోవిశేషం బయలు పడింది. గోపికాజారత్వం కృష్ణుఁడికిమాత్రమే వుందని సర్వసామాన్యంగా అనుకోవడం. అంతేకాని బలరాముణ్ణిగూర్చి యీప్రవాద లేదు. మాఘకావ్యం ద్వితీయస్సర్గలో "శ్లో. రేవతీ వదనోచ్ఛిష్ట" అనేశ్లోకాన్ని పట్టికూడా అతఁడు యేకపత్నీ వ్రతస్థుఁ డనే స్ఫురిస్తుంది. కాని భాగవతం శ్రద్ధగా చదివి చూస్తే బలరాముఁడు గూడా యీ విషయంలో కృష్ణునివంటివాఁడే అని స్పష్టపడుతుంది. యింకో విశేషం. కృష్ణుఁడు రాగి కాకుండా ఆయాగోపికలమనోరథానికి అనుకూలుఁడుగా నటించినట్టేనా వుందిగాని బలరామునివిషయంలో అదిన్నీ కనపడదు. కాని యీ విషయంలో కృష్ణునికే సర్వత్రా చెడ్డపేరో మంచిపేరో వచ్చింది. యెవళ్ళేనా రిజాలాగా తిరుగుతూ వున్నవాణ్ణిగూర్చి మాట్లాడవలసి వస్తే "వాఁడా? అబ్బో గోపాలకృష్ణుఁ" డంటారే కాని "బలరాముఁ" డనడం లేదు. కొన్ని ప్రదేశాలలో "వాఁడికేం? చెళ్ళపిళ్ళరాయుఁ" డనడమున్నూ వుంది. ఆమాటక్కూడా అర్థం యిదే.

కృష్ణావతారానికి దరిమిలా బయలు దేఱిన విష్ణ్వాలయాలన్నీ కృష్ణునివే. వేంకటేశ్వరుఁడు, జనార్దనుఁడు లోనైనపేళ్ళన్నీ ఆకృష్ణుని పేళ్ళే. చెల్వప్పిళ్ళరాయఁ డనే దేవుఁడు మైసూరురాజ్యంలో మేలుకోటలో వుండే దేవుఁడు* చెల్వము అంటే సొగసు, పిళ్ళ అంటే బాలుఁ డనుకుంటాను. యింకేదేనా ఆభాషలో అర్థంవుందో? సొగసైన బాలురలో రాయఁడు అగ్రేసరుఁడు. అనఁగా విలాసలాలసుఁడు, అని ఫలితార్థం. యీవిషయం అన్యత్రకూడా వివరించే వున్నాను.. మళ్ళా ప్రసక్తి వచ్చింది కనక వ్యాఖ్యానం చేశాను. మాయింటిపేరు యీదేవుణ్ణిపట్టి వచ్చిందే అని మా ముత్తాతగారు వారి వేంకటేశ్వర విలాసంలో "ప్రవరుల్ గొందఱు మేలుకోటఁ గల చెల్వప్పిళ్ళరాయండు" అని యెత్తుకొని "వారు సర్వ విశేషంబుల వృద్ధిఁ బొంది రిలఁ జెల్వప్పిళ్ళవారం చనన్" అని ముగించి మళ్ళా లోకవాడుక ననుసరించి చెళ్ళపిళ్ళవారైనా రని—

"అది మొదలు గాఁగ సకలజనానుమతిని
వినుతిఁ దగెఁ జెళ్ళపిళ్ళవా రనుసమాఖ్య."

అని స్పష్టపఱిచినారు. మా పూర్వులు ఆ "చెళ్ళపిళ్ళరాయఁడికి" యేవిధమైన కైంకర్యం చేసేవారో నాకు తెలియదు. మాముత్తాత నరసకవి గారికిన్నీ తెలిసినట్టులేదు. తెలిస్తే వ్రాయనే వ్రాస్తురు. ఆ కృష్ణుని పేరుతో సంబంధించిన యింటిపేరు గలనాకు శివభక్తివైపు కొంచెం మనస్సు మొగ్గడాని క్కారణం యిదివఱకే వ్రాసివున్నాను. బాల్యదారభ్యా తఱచుగా అనారోగ్యంగానే నేను కాలంగడపడం వకటి దీనిక్కారణం. "శ్లో. అరిష్టవారక శ్శంభురిష్టస్య ప్రాపకో హరిః" అని వొకచోట జాతకగ్రంథంలో వుంది. దానా దీనా నాకు లింగధారణంలేని శైవమతం లభించింది. బందరులో వున్నప్పుడు శ్రీ కాశీనాథుని బ్రహ్మయ్యలింగంగారు బోధించే బోధకూడా కొంత కారణం. వారితో కొంత వ్యతిరేకంగానే

* అఱవములో "శెల్వప్పిళ్ల — సంపత్కుమారుఁడు" అని మేలుకోటదేవుని పేరు.
— సంపాదకుఁడు.

మాట్లాడేవాణ్ణి కాని ఆయన చెప్పేయుక్తులు కొన్ని దురుద్ధరాలుగా వుండేవి. శ్రీదేవీభాగవతం ఆంధ్రీకరించడం సరేసరి, పైఁగా భారత ద్రోణపర్వస్థమైన అశ్వత్థామకుసంబంధించిన శివపూజకున్నూ, కృష్ణార్జునుల శివపూజకున్నూ కలభేదం వకటి నన్ను శైవుణ్ణిగా మార్చివేశాయి. కాని నాకు యేపూర్వపుణ్యంవల్లనో విష్ణుద్వేషంమాత్రం లేదు.

హరిం భజ హరం భజాఽత్రన భిదా
విపత్ప్రశమనే భిష క్పురహరః."

అని కొద్దివత్సరాల క్రిందట నేను వ్రాసిన "శివాయ నమః" స్తోత్రంలో వ్రాసివున్నాను. ఓంకారార్థనిర్వచనం అనేకులు అనేకవిధాలుగా చేసి వున్నారు. శ్రీ దేవీభాగవతంలో శక్తికి ప్రాధాన్యం వచ్చేటట్టు దాన్ని నిర్వచించారు. త్రిమూర్తులలోనున్నూ శివునికే ప్రాధాన్యం కనపఱిచారు. ఆభాగానికి ఆంధ్రీకరణమే—

"ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యం డయ్యెజుం, డయ్యుకా
రాంకుం డాతనితండ్రి విష్ణువు, మకారాంకుండు శంభుండు త
త్సంకేతమ్మున నుత్తరోత్తరము ప్రాశస్త్యమ్ము వాట్లు ని
శ్శంకన్ బైఁ దగునర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్."

అనే మాపద్యం. కొన్నిపురాణాలు విష్ణుపారమ్యాన్ని, కొన్ని శక్తి పారమ్యాన్ని యీ విధంగా బోధిస్తూవున్నాయి. దీన్నిబట్టిచూస్తే యథార్థం అస్మదాది సామాన్యులకే కాక, సర్వజ్ఞులయిన ఆయా ఋషులకున్నూ, స్వయంవ్యక్తం అనుకొనే వేదానికిన్నీ కూడా గోచరించనే లేదేమో అని సంశయమైతే కలుగుతుంది కాని యేదో విధంగా భగవద్భక్తియందు విశ్వాసం కలవారు తరించినట్టుగా యితరులు తరించక పోవడంచేత ప్రసిద్ధంగా వున్న ఆ మార్గాలలో యే మార్గమో పట్టి సంచరించడంకన్న మార్గాంతరంలేనట్టు తేలఁతుంది. అందులో శృంగారభక్తియెడల అభినివేశం కలకవులకు కృష్ణునిచరిత్ర వుపయోగించినంతలో యెన్నోవంతున్నూ

శివునిది వుపచరించదు. కృష్ణలీల లన్నట్టు శివలీలలున్నూ యెన్నో వునట్టు పురాణాలలో కనపడుతుంది. కాని యీలీలలయం దున్నంత ప్రేమ లోకానికి ఆ లీలలయందు కనపడదు. కథ శివకథ అయినా మార్కండే యోపాఖ్యానానికి పేరు హరికథ అనే వస్తుంది. కాఁబట్టి హరికథల క్కూడా శ్రీవిష్ణుగాథలే విశేషించి అనుకూలిస్తాయి. యితరజాతుల్లో వంట చేసేప్రముఖులకు ఆ జాతిపేరు రాక వంటబ్రాహ్మఁ డనేపేరు రావడంవంటిదే పైసందర్భమున్నూ. అది ఆలా వుంచుదాం. మొత్తం భరతఖండంలో శివభక్తిన్నీ విష్ణుభక్తిన్నీ యించుమించు సమానంగానే వుంటా యనుకోవాలి. శాక్తేయులు చాలా తక్కువగా వుంటారు. మహా రాష్ట్రులలో గాణాపత్యం యెక్కువ వున్నట్టు కనపడుతుంది. శాక్తేయగాణా పత్యాలు శివభక్తిలోనే అంతర్భూతాలుగా వుంటాయి. శాక్తేయం బంగా ళీలలో యెక్కువగా వున్నట్టు తోస్తుంది. శ్రీస్వామిరామకృష్ణపరమహంస శాక్తేయమతంలో వుద్భవించినవాఁడే కాని ఆయన శుద్ధ అద్వైతిగా మాటి నట్టు ఆయనచేసిన బోధవల్ల కనపడుతుంది. యీ శాక్తేయంలో కలకత్తా ప్రాంతంలో నవరాత్రిలలో పూర్వకాలంలో నరబలి యివ్వడంకూడా ఆచారంగా వుండేదని చెప్పఁగా వినడం. ఆబలియివ్వడంలో వక తెలుఁగుదేశపు బ్రాహ్మఁడు చిక్కుకుని తుదకు బయటికి వచ్చినట్టున్నూ ఆయన ఆసందర్భం చెప్పఁగా విన్నట్టున్నూ మాగురువుగారు బ్రహ్మయ్య శాస్త్రుల్లుగారు చెప్పఁగా విన్నాను. బంగాళీ "టోళా" లలో చిక్కుకోక పోవాలి గాని చిక్కుకున్న తరవాత మళ్ళా యీవలికి రావడానికి అవకా శమే వుండదని వినడం. ఆ బలిదినం వచ్చేవఱకూ చక్కఁగా యీనరుణ్ణి పశువును మేపినట్టే మేపేవా రనిన్నీ తుదకు ఆరోజున బలి యిచ్చేవా రనిన్నీ వినడం. యిది యెంత సత్యమోకాని కళాపూర్ణోదయంలో కొంత వుంది. శాక్తేయమతంలో నరబలి వున్నట్టు శ్రీదేవీభాగవతంలో అయితే కనపడదు గాని యెక్కడో యితర శక్తిపురాణాల్లో వున్నట్టు తోస్తుంది. బహుళః యిది వామాచారులుచేసే పనిగా కనపడుతుంది. ప్రతీమతం

లోనూ వామాచారుల పూజాపురస్కారాలు యీలాటి దూష్యపు పనుల తోఁటే చేరి వుంటాయి. ఆ మతాల్ని అందుకే వేదమతంవారు దూష్యంగా చూడడం తటస్థించినది. ఆ దేశాచారాలల్లో కూడా యిటీవల ప్రభుత్వం వ్యాపించాక యీ దురాచారం తగ్గినట్టే వినికి. యీలాటివి సంస్కరించడం అభినందనీయం. కర్మపరులలో నరమేధం యేలాటిదో శాక్తేయులలో యిదిన్నీ ఆలాటిదే అని తోస్తుంది. నరమేధవిధానం వేదంలో వుండడమే కాని "ప్రాక్టికల్" గా యెవరూ చేసినట్టు కనపడదు. హరిశ్చంద్రుఁడు జలోదరవ్యాధి నివారణకై దాన్నిచేయడానికైతే ఆరంభించాఁడు కాని అది తుదవాఁకా జరగలేదు. యెవరో వకరాజు తాను కన్నకొడుకును పశువుగాఁ జేసి యాగం చేసినట్టున్నూ దానివల్ల నూఱుగురుభార్యలకూ నూఱుగురు కొడుకులూ కలిగినట్టున్నూ భారతంలో అయితే కనపడుతుంది గాని ఆయాగాన్ని వుపదేశించి నడిపించిన పురోహితుఁడికి తద్వారా నరకం వచ్చినట్టుకూడా ఆభారతమే సాక్ష్య మిస్తుంది. ఆయీధర్మసూక్ష్మాలు తెలుసుకొని ప్రవర్తించడం పూర్వయుగంలోనే కష్టసాధ్యంగా వుంటే యీయుగంలో చెప్పేదేమిటి? అందుచేత తరణోపాయం భక్తిమార్గమే అని తోస్తుంది. యీమార్గం వర్ణాశ్రమాచారాలతో సంబంధించిన కట్టుబాట్లలో లేదు. యిట్టిసుగమమైన మార్గాన్ని మనకు పూర్వఋషులున్నూ యిటీవల త్యాగరాజాదిభక్తులున్నూ ప్రసాదించి వుండఁగా "మాకు వేదం కావాలి, వేదోక్త కర్మలే కావాలి" అంటూ ద్విజేతరులు పట్టుపట్టి అవి శాస్త్రీయంకాదని యెవరేనా పూర్వగ్రంథ విశ్వాసం కలవారు చెపితే వారిని పట్టుకొని దూషించడం పరమార్థానికి భంజకమేమో? అని నే ననుకుంటాను. ఆచెప్పేవారేనా వాకరియందు ద్వేషబుద్ధితో చెప్పేవారు కారు. ఆయాగ్రంథాలనుపట్టి కాదా? వారు చెపుతారు. మనకు నిత్యమూ వచ్చే వుత్తరాలలో కొన్ని లాభదాయకాలు వుంటాయి. కొన్నో నష్టం కలిగించేవిన్నీ వుంటాయి. ఆ వుత్తరాలు తెచ్చి యిచ్చే పోష్టుబంట్రోతుమీఁద కోప్పడడం యెంత కార్యకారి అవుతుందో

యిదిన్నీ అంతే అని నే ననుకుంటాను. ఆ వేదాధికారం ఆచండాల బ్రాహ్మణపర్యంతమూ వుందంటూ వకాయన వ్రాస్తారు. సరే. ఆపద్ధతిని "లేప్టుఫ" ష్టన్నట్టు ఆ పెద్దజాతివారికే వేదాన్ని చెప్పించి వారిచేతనే యజ్ఞయాగాలు చేయించి క్రమంగా తదితరజాతులవారు ఆ మహాభాగ్యాన్ని అనుభవిస్తే బాగుంటుందేమో? స్వజాత్యుద్ధరణానికంటూ పత్రిక ప్రారంభిస్తే దాన్ని చిరస్థాయి చేయడానికి ఆయా జాతులలో వున్న ధనాఢ్యులు వేలకువేలు విరాళం యిస్తూవున్నారు గదా! ఆలాటివారు సాక్షాత్పరంపరయా యెల్లకులస్థులకున్నూ వేదాధికారాన్ని బలపఱిచే యీహరిజన వేదపాఠశాలా నిర్వహణానికి విరాళా లివ్వకపోతారా? ఉపాధ్యాయులు దొరక రనుకొందామా?

"గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా,
అథవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే."

యిందులో రెండో మార్గాన్నిబట్టి ఆ వుపాధ్యాయుఁడికి వక వంద రూపాయిలు మాసవేతనం యేర్పఱిస్తే వారిఅగ్రహారంలోనే ఆయన వేదోపదేశం చేస్తారు. ద్రవ్యంవల్ల కొండమీఁది కోతిని కిందకి దింపవచ్చునుగదా! లేదా? యిప్పటి కొత్తయేర్పాటునుబట్టి దేవాలయాల్లో కూడా అట్టి పాఠశాలలకు అవకాశం కలిగితే కలుగుతుంది కదా! యిన్ని వుపాయాలు కనపడుతూవున్నా పూర్వాచారాన్నిబట్టి ఛాందసులు భీష్మించుకొని మూతి బిడాయించుకుని కూర్చుంటేనో? అచ్చుపుస్తకా లేమవుతాయి? "కోడి కుంపటి లేకపోతే తెల్లవాఱదా?" అంటాను. వూరికే ఆ అధికారం బ్రాహ్మణాళ్ళకే యెందు కుండాలనే కడుపుదుగ్ధ తప్ప తీరా చెపుతాం రండి నాయనలారా! అంటే వేదం చెప్పుకొనేవారు బ్రాహ్మల్లోనే కనపడని యీరోజుల్లో యితరులలో యెక్కడ వుంటారు? వ్రతం చెడ్డా ఫలం దక్కక పోవడమే సిద్ధాంతం. వేదంపైపైని లేదు. క్రమాంతమేనా అయితేకాని అది నిలిచేది కాదు. క్రమాంతం అయేటప్పటికి అధమం యెనిమిదేళ్ళేనా కావాలి. యిన్నాళ్ళూ పరిశ్రమచేసి చదువుకుంటే

దానిలో యేముందో తెలియదు. అందుకోసం దానిఅంగాలల్లో పరిశ్రిమ చేయాలి. వాట్లల్లో సామాన్యపు తెల్వితేటలేనా కలగడానికి పదేళ్ళకు తక్కువ పట్టదు. యింకోచిక్కు. కర్మాంతం వేదం గుడ్డిపాఠంగా వల్లించేటప్పటికి వున్నబుద్ధికాస్తా మొఱపోయి అర్థప్రధానమైన సాహిత్య మందున్నూ శాస్త్రిలయందున్నూ యెంత కొట్టుకుచచ్చినా ఆబుద్ధి ప్రస రించనే ప్రిసరించదు. అందుచేతే వొక్కొక్క కాలానికి వొక్కొక్క వంతునకూడా వేదార్థం తెలిసినవా రంటూ వేలెట్టి చూపడానికి కనేపడడం లేదు. యిన్ని చిక్కులతో వున్న వేదం సర్వులకూ కావాలనే పట్టుదల వకటి యిప్పుడు బయలుదేఱింది. "ఏక స్స్వాదు నభుంజీత" అనడంచేత తమకే కాకుండా అది హరిజనులక్కూడా కావాలని చాతుర్వర్ణ్యంలోవారు కొందఱు వ్రాస్తూవున్నారు. యెవరేనా వకవేదపండితుఁడు సాహసిస్తే బాగుండును. యీవ్యాసకర్తలుగాని హరిజనులుగాని యెందఱు శిష్యులుగా చేరతారో యెందఱు కృతార్థు లవుతారో లోకానికి బాగా బోధపడేది. దాని వల్ల ఆ సాహసించిన వేదపండితుఁడికి వచ్చే నరకాన్ని యేమహానుభా వుఁడో అనుభవించడానికి అంగీకరించకపోఁడు. ఆఱుశాస్త్రాలు వచ్చిన మాపరమగురువులు ఆ వేదమంటే యెంతో చెవికోసుకునేవారు యెక్కడో కొన్నిపనసలు మాత్రిం వృద్ధాప్యంలో వల్లించి స్వాధీనపఱుచుకున్నారు. అందులో చిన్నప్పటినుంచీ నలిగిన నోరు కాకపోవడంచేత అపస్వరాలు వస్తాయేమో అని యెంతో భయపడేవారు. అట్టివేదం సర్వసామాన్యమైన హక్కు కావా లంటే, యేలాగ? అదిన్నీకాక దేన్ని యెవరు అభ్యసించినా దానికి వుండేశాసనాలకు లోఁబడక తప్పదు. ఆశాసనం యేజాతికి అది అంగీకరించదో ఆజాతి అభ్యసించి ఆర్జించే శ్రేయ స్సేమిటి? శ్రేయ స్కరం కానిపనికి ప్రియత్నించడంకన్న అనాలోచన వుండదు. ప్రితిమని షిన్నీ యీలోకంలో తనకు మంచి కలగాలనిన్నీ ఆ కలిగే మంచి పరలోక శ్రేయస్సును విరోధించేదిగా వుండకూడదనిన్నీ అనుకుంటాఁడు. కాని యెవరికో గాని యీవూహ నెఱవేఱదు. భక్తితత్పరులకుమాత్రిం చాలా

వఱకు యీవూహ నెఱవేఱుతుంది. యమలోకం అంటూ వకటి వుందనే పద్ధతినిగూడా వారు దానికి భయపడరు.

"భజనపరులకేల? దండపాణి భయము మనసా" అన్నారు త్యాగరాయలవారు. యుక్తప్రవర్తన కలవాళ్ళకు మేజస్ట్రీటు కోర్టువల్ల భయంలేకపోవడం అంతా యెఱిగిందేకదా? వేదంద్వారా తరించవలసి వస్తే "అది ద్రావిడప్రాణాయామం" గా వుంటుంది కనక చాలా దూరపుత్రోవ "వకశ్శపంథాః" భక్తిమార్గమో? దానికన్న అనేకవేల రెట్లు సుళువు. జారులు చోరులు వకరేమిటి? అందరినీ ఆమార్గం తురుష్క-మతం అన్నిజాతులనీ చేర్చుకున్నట్టు చేర్చుకుంటుంది! నీవు భజించడానికి అర్హుడవు కావనదు. ఆగమరీత్యా ఏర్పడ్డ దేవాలయాలు మాత్రం అందుకు అంగీకరించవు పోనివ్వండి. జాతిబాధ వుంటే యెవళ్ళ జాతిలో వాళ్ళే వకభజనసంఘం యేర్పఱచుకోవచ్చునుగదా? అందుచేత ఆమార్గంకంటే యితర తరణోపాయం కనపడదు. "ప్రాతర్ద్యూత ప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రశంసయా రాత్రౌ చోరప్రసంగేన కాలోగచ్ఛతి ధీమతామ్" అని వక మహాకవి చమత్కరించి వరసగా భారత రామాయణ భాగవతాలు పఠించేవార్కి సద్గతి కరతలామలకమని వ్యంగ్యమర్యాదయా బోధించాడు. అయితే యిది ఐకమత్యానికి వీలైనత్రోవకాదంటారా? దీనిమీద వ్రాస్తే చాలా రాయాలి రాసేది లేదు. యీ వ్యాసంలో చాలావిషయాలు మధ్య మధ్య నడిచినా ప్రధానంగా భాగవత ప్రసంగమే నడిచింది. దానిలోవుండే గాధలే పరీక్షిత్తుని తరింపజేశాయి. పరీక్షిత్తుకూడా శ్రీకృష్ణుడికీ గోపికలకూ వున్న శృంగారబాంధవ్యాన్ని గూర్చి "జారుడనికాని కృష్ణుడు భూరి పరబ్రహ్మమనుచు బుద్ధితెలియరు" అంటూ యెత్తుకుని "ఏరీతి బంధముక్తిని (మోక్షాన్ని) పొందగలిగా?" రంటూ నిలవదీసి శంకిస్తూనే వచ్చాడు. శ్రీశుకులవారు తగిన సమాధానాన్ని చెపుతూవచ్చారు. శ్రీశుకుడంటే? గర్భయోగులలోవాడు కాని సామాన్యుడుకాడు. అట్టివాడు తరణోపాయాన్ని గూర్చి ఆసన్నమరణుడైన పరీక్షిత్తుకు చేసేబోధలో

ఆ గోపికాజారత్వం యెంత విలువకలదీ కాకపోతే దాన్ని వుపన్యసిస్తాడా? సామాన్యతః గోపికలు కృష్ణుణ్ణి జారుడనే బుద్ధితో ప్రేమించినట్టే వున్నా కొన్నిస్థలాల్లో పరమపురుషుడనే బుద్ధికూడా వాళ్ళకువున్నట్టే గోచరిస్తుంది.

"నఖలు దేవకీనందనో భవా । నఖిలదేహినా మంతరాత్మదృక్
విఖనసార్థితో విశ్వగుప్తయే । సఖ! ఉదేయివాన్ సాత్వతాంకులే"

యిందులో "అఖిలదేహినా మంతరాత్మదృక్" అనే గోపికాగీతా వాక్యంవల్ల పైని నేనుచెప్పిన తాత్పర్యం గోచరిస్తుంది. మొత్తం కృష్ణుణ్ణి గాని రాముణ్ణిగాని పరాత్పరుణ్ణిగా భావించి చెడిపోయినవారు లేనట్టే మన గ్రంథాలవల్ల తెలుపుడవుతుంది. "నమ్మిచెడినవారూ లేరు" అంటూ త్యాగరాజు గానం చేసివున్నాడు. యిదిన్నీకాక భగవంతునికి వకరూప మంటూ లేనేలేదనిన్నీ యెవళ్ళు యేస్వరూపునిగా నమ్మి భజిస్తే వాళ్ళకు ఆస్వరూపంలోనే స్వప్నాదులయందు గోచరించడం తటస్థిస్తుం దనిన్నీ అనుభవజ్ఞులు చెపుతూ వున్నారు. భాగవతరీత్యా గోపికలు మాత్రమే ఆ దివ్యమంగళవిగ్రహమందు మోహం కలవారనిన్నీ ఆకృష్ణపరమాత్మ వారిమనోవృత్తులకు అనుకూలంగా నటించినా అనురక్తుఁడు లేశమున్నూ కాడని తేలుతుంది కాని శ్రీకృష్ణకర్ణామృతరీత్యా పరిశీలిస్తే ఉభయతా అనురక్తివున్నట్టే కనపడుతుంది.

"రాధా పునాతు జగదచ్యుత దత్తచిత్తా
మంథానమాకలయతీ దధిరిక్తపాత్రే
తస్యాస్స్తనస్తబక చంచలలోల దృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్"

"ఏకత్రైవానురాగశ్చేత్" అనేదోషంతగలని పద్ధతిగా యీవిషయం యీలాగున ఆమహాకవి కల్పించినట్టు తత్త్వజ్ఞులు సమన్వయించుకొంటారు. కవులకవిత్వాలలోగాని ఋషులపురాణాల్లోగాని అపౌరుషేయాలనుకొనే వేదాలలోగాని అస్మదాది ప్రాకృతబుద్ధులకు పరస్పరవిరోధాలుగా

కనపడేవి యెన్నోవుంటాయి. వాట్లవాట్ల సమన్వయానికే మీమాంసాది శాస్త్రిలు వున్నాయి. వాట్లపేర్లుకూడా వినకుండానే "వేదంలో అలా వుందీ, యీలావుందీ, పూర్వపండితులు కొందఱికి అన్యాయంచేశా" రంటూ వ్రాసేవారి సాహసం చూస్తే యెంతో ఆశ్చర్యంగా వుంటుంది. ఆబుషులలో వేదవిభజన చేసినవాడు వ్యాసులుగదా? ఆయనతండ్రి పరాశరుఁడు. బ్రాహ్మడే అయినా తల్లి బ్రాహ్మణికాదు గదా? అట్టిస్థితిలో క్షేత్రసంబంధమైన అభిమానం ఆయనకు కొంతేనా వుండకపోవడాని క్కారణమేమో? విదురాదులు బ్రహ్మజ్ఞానులై సర్వసమర్థులై వుండి కూడా వేదమంటే భయపడడానికి హేతువేమో? కొంచెం వెనకటివారు ఆలోచించుకొనేవారు. యిప్పటివారికట్టి ఆలోచన కలగడంలేదు. పయిగా సూతాదులు అలా చెప్పనే లేదనిన్నీ చెప్పినట్టుగా బ్రాహ్మణులే వ్రాశారనిన్నీ వకవాదం. దానితో సర్వమూ ఎగిరిపోతుంది. భవతు. యేదోకాని వ్వండి. యిది తేలేదికాదు. యిది యెప్పుడేనా కొంతవిశ్వాసంవుంటేనే గాని శుష్కతర్కంవారికి నచ్చేదికాదు. భీష్మాదులందఱూ శ్రీకృష్ణుణ్ణి పురాణపురుషుడుగా నమ్మి తరించినట్టు గ్రంథప్రామాణ్యం కనపడుతుంది. క్షత్రియధర్మా న్ననుసరించి మొదటి పక్షంగా వచ్చిన కృష్ణుణ్ణి భీష్ముడు బాణాలతో గాఢంగా కొట్టికూడా "మద్బాణవృష్టిఁ దెరలి చనుదెంచు కృష్ణుండు దిక్కునాకు" అన్నాడు. కృష్ణుడు సాక్షాత్తూ ఆదినారాయణ మూర్తే పరాత్పరుడే అని యెఱిగివుండికూడా బాణాలతో వొళ్లు జల్లెడ తూట్లు పడేలాగ కొడుతూవున్న భీష్ముఁడు పనిపడి పరలోకములో భగవంతుడికి ఉత్తరవాది కావలసివస్తే గతి యేమిటి? "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనే శ్రీకృష్ణునివాక్యాన్నే శ్రీకృష్ణుడికి వప్పచెపుతాడు. యెప్పుడు పయిసూత్రాన్ని అతిక్రమిస్తారో వారిని యెవరూ వినిపించనేలేరు. "వచనాత్ప్రవృత్తిః, వచనాన్నివృత్తిః" కులాచార ధర్మాలు వదలుకొని స్త్రీ పుంసమర్యాదలు వదలుకొని మాకు విడాకుల చట్టం వచ్చిందనిన్నీ, వితంతూద్వాహచట్టం వచ్చిందనిన్నీ, సంతోషిస్తూ

చంకలు తాటించుకొనే మనం చెప్పే జవాబో? యేమిన్నీ కనపడదు గదా? వకాయన "విడాకుల" చట్టమవసరమంటూ వ్రాస్తూ కొన్ని కష్టాలూ సుఖాలూ వివరిస్తూ "స్త్రీ పురుషుల తత్త్వాలు యేకీభవించడం కష్టంగనుక అలాటి వ్యత్యయ సందర్భాలలో విడాకులచట్టంయొక్క ఆవశ్యకత్వాన్ని నిరూపించారు. మంచిది. ఆత్మైక్యం కలిగేవరకు యెందరినో మార్చుకోవలసిందేనా? యింకోమాట వ్రాశారాయన. నిర్బంధ కారణంచేత బ్రహ్మచారిణులుగావుండే వితంతువులుగాని, అననుకూల దాంపత్యంతాలూకు స్త్రీలుగాని సంఘకట్టుబాట్లకుజంకి అసిధారావ్రతంగా వున్నా మానసికమైన తలపోతలకు లోబడడం యేలాగా తప్పదట? భవతు. యీమానసికాన్ని స్వేచ్ఛయిచ్చిన పద్ధతిమీదకూడా నివారింపడం తటస్థింపదు. లోకంలో సుందరులున్నూ ప్రయోజకులున్నూ అయిన పురుషులు చాలా విరళంగా వుంటారు. తాను అందకత్తెకాకున్నా అంద గాణ్ణిచూచి మానసిక వ్యభిచారానికి లోబడడంయేలాగాతప్పదు. "భక్షితేఽపి లశునే న రోగశాంతిః" (వుల్లిపాయ తిన్నప్పటికీ రోగం కుదరనేలేదు) అన్నట్టు మామూలు కర్మం మామూలుగానేవుంది. దాన్ని వారించేదల్లా వాక్యసంతుష్టే. ఆసంతుష్టి స్వరూపాన్ని పోతరాజుగారు వ్యక్తీకరించారు.

"వ్యాప్తిన్ జెందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచున్
దృప్తింజెందని మనుజుఁడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే?

"ఆశాపాశము తాఁ గడున్నిడుపు లే దంతంబు రాజేంద్ర? వా
రాశిప్రావృత సర్వభూవలయ సామ్రాజ్యమ్ము చేకూరియున్
గాసిన్ జెందిరిగాక వైన్యగయ భూకాంతాదు లయ్యర్థకా
మాశన్ బాయగజాలిరే? మునునిజాశాంతమ్ములన్ ముట్టిరే!"

"మనోరథానా మతటాః ప్రవాహాః" హిట్లరేమో మునుపువుండి యిటీవల కోలుపోయిన కాలనీలు రాబట్టుకోవడానికి సింహనాదం చేస్తూ

వుంటే జపాను కొత్తగానే దేశాన్ని సంపాదిద్దామని ప్రయత్నిస్తూవుంది. నేటి నీతిజ్ఞులు యీ రెంటికీ సమ్మతి చూపడంలేదు. కాని రాజులకుసంతుష్టి అనేదే వుండరాదని మనవారు చెప్పుతూ "రాజ్యాంతే నరకం ధ్రువం" అని నిర్మోగమాటంగా వ్రాసేశారు. అట్లే పైనిచూపిన రెండుసందర్భాల కున్ను శాస్త్రులున్నూ శాస్త్రజ్ఞులున్నూ సమ్మతి చూపలేకుండావున్నారు. అథవా సంఘబలం ఎక్కువగా వుండడంచేత వీరుకూడా తలవూడినా మానసికదోషాన్ని స్త్రీలలోగాని పురుషుల్లోగాని లేకుండాచేయడం యెన్ని విడాకుల చట్టాలు వచ్చినా యేలాగ తటస్థింపదు. "అష్టవిధ మైథునాభావః ప్రశస్తిః" అనే పరిష్కారానికి లక్ష్యంగావుండే స్త్రీగాని పురుషుడుగాని యేకాలమందున్నూ మృగ్యులే. లోకానికి వెఱచే కొంత యుక్తంగా నటించడమనేది సర్వసామాన్యమైన విషయం. ఆ వెఱవడంకూడా యెక్కడో ప్రదేశంలో లేదనిన్నీ అదే మనక్కూడా కావాలనిన్నీ కొందఱు స్త్రీలూ, విశేషించి పురుషులూ ప్రయత్నిస్తూ వున్నారు. అప్పుడే దగ్గిరసా రానేవచ్చిందని అందులో కొందరు సంతోషాన్ని వెలిబుచ్చుతూనేవున్నారు, యిది యేలావుందంటే? వెనక సుమారు 40 యేండ్లనాడు బుద్ధిరాజు యీశ్వరప్పగారు కాబోలును పత్రికలనుగూర్చి హాస్యంగా కొన్నిమాటలు వ్రాస్తూ అందులో వార్తలనుగూర్చి యీలా వ్రాశారు. "మావూళ్ళో వచ్చేసంవత్సరం యింకోకల్లుదుకాణం పెట్టిస్తారట"

యీలా సంతోషించడం యేలాటిదో ప్రస్తుతానికి సంతోషించడ మున్నూ అలాటిదే. మానసికదోషం లేకుండా గవర్నమెంటు చట్టా లున్నూ చేయలేవు. యేవిచేసినా బాహ్యానికే. శూరులుగాని ధీరులుగాని పతివ్రతలుగాని యేయుగంలోనున్నూ విరళంగానే వుంటారు. వాళ్ళవంటి వాళ్ళం అవుదామని తక్కిన సంఘంలో అందరూ కాకపోయినా కొందరేనా ప్రయత్నిస్తూ వుంటారు. ఆ ప్రయత్నించినవారిలో యేకొందరికోతప్ప కృతార్థత్వం కలగదుకాని కలక్కపోయినా వారిని లోకం అభినందిస్తుంది.

"స్పృహణీయ గుణై ర్మహాత్మభి
శ్చరితే వ_ర్త్మని యచ్ఛతాం మనః
విధిహేతు రహేతు రాగసాం
వినిపాతోఽపి సమస్సమున్నతేః"

అభిమానంగల స్త్రీలకు వక జన్మమందు అనేక భ_ర్తృక_త్వం అంటే యిష్టం వుంటుందని తోచదు. నిర్బంధించి "నీవు పెళ్ళిచేసుకు తీరాలి నీకిదివఱలో వున్న భ_ర్తకూ నీకూ ఆంతర్యం కలవక పోట్లాడు కొంటూ వున్నట్టు మాకు తెలుస్తూవుంది." అని బలవంతపెట్టినా అభిమాన వతి రాజకీయ శిక్షనేనా అనుభవిస్తుంది గాని యింకో భ_ర్తను కట్టుకోవ డానికి అఁగీకరించదనే తోస్తుంది. (మానాభిమానాల విషయంవస్తే అవి స్త్రీలకే జన్మహక్కు) అగ్రివర్ణాలల్లో లేదుగాని విడాకులపద్ధతి యేచట్టమూ రానిరోజుల్లోనే నిమ్నజాతుల్లో వుండనేవుంది. యే ఆచారాలు దూష్యాలని అగ్రివర్ణాలవారు దూరంగా వుంటూ వున్నారో, అలాటివే మాకుకావాలని యిప్పు డగ్రివర్ణాలవారు కోరుకొంటున్నారు. యిది సంఘానికి మహా న్నత్యం తెస్తుందనిగూడా మనఃపూర్వకంగా నవనాగరికులు వ్రాస్తారు. అవి పూర్వాచారాలవారికి నచ్చకపోవడం వారితలతిక్క అనుకొని వూరు కోవడమే మంచిదనుకొంటాను. యిది విషయాంతరం. భీష్ముఁడంతటి వాడు శ్రీకృష్ణుణ్ణి పరాత్పరుడుగా మనస్సానమ్మి తరించాడన్నది ప్రస్తుతం. శ్రీకృష్ణనామంకూడా మంత్రాలలో లగించినట్టు కొన్నిటివల్ల గోచరిస్తుంది గాని రామనామానికి వున్నంత ప్రాముఖ్యం కృష్ణనామానికి లేనట్టు కన పడుతుంది. రామనామం శివకేశవుల అభేదాన్ని తెలిపేదిగా త్యాగరాయలు వారు వ్యాఖ్యానించి వున్నారు. వుపనిషత్తులలో గూడా యీ విషయం చూచినట్టు జ్ఞాపకం.

"శివమంత్రిమునకు మా బీజము, మాధవమంత్రిమునకు రా బీజము" అంటూ "ఎవరని నిర్ణయించేదిరా!" అనే కృతిలో ప్రస్తు

తాంశాన్ని యెత్తుకున్నారు. అంటే? " ఓన్నమశ్శివాయ " అనే పంచాక్షరీమంత్రంలో "మ"కారం బీజమనిన్నీ " ఓంనమో నారాయణాయ " అనే మంత్రంలో "రా"కారం బీజ మనిన్నీ యీ రెండున్నూ కల్పితే " రామ " శబ్దం అయిందనిన్నీ అందుచేత సంధ్యావందనంలో వున్న " శివాయ విష్ణురూపాయ " అనే అభేదం కుదిరిం దనిన్నీ మంత్రవేత్తలు చెపుతారు. వైయాకరణులు రముధాతువునుండి పుట్టినట్లు చెపుతారు. త్రికాలజ్ఞుఁడైన వసిష్ఠమహాముని యెంతో అభిప్రాయం మనస్సులో పెట్టుకొనియ్యేవే యీ నామకరణం చేసి వుంటాఁడు. యీ "రామ" నామం అంతకు పూర్వం భార్గవునకున్నూ వుంది. కాని ఆయన కున్నరోజుల్లో యింత మాహాత్మ్యం దీనియం దున్నట్లు గ్రంథదృష్టాంతాలు కనపడడంలేదు. తరవాత బలరాముఁడికిన్నీ యీ "రామ" నామం వుంది. దానికిన్నీ యింత ఖ్యాతి లేదు. లోకంలో యితరులు పెట్టుకుంటే యెంత గౌరవమో అంతే గౌరవం వున్నట్టు కనపడుతుంది. దశరథపుత్రునికి వుంచిన రామనామానికే అపారమైన మహిమ కనపడుతుంది. శృంగారభక్తులు తప్ప యితర విష్ణుభక్తు లందఱూ " రామనామ తారకం భుక్తిముక్తిదాయకమ్ " అని జపించి తరించినవారే. లోకంలో " రామదాసు " అనేపేరులో యెన్నో వంతున్నూ " కృష్ణదాసు " అనేవి కనపడవు. యిప్పటిలాగ యితరఖండాలకు బాహాటంగా రాకపోకలు సాఁగేరోజులేఅయి ఆ కాలంనాఁటికి కూడా పాశ్చాత్యదేశా లంటూ మనుష్యులతో యే కొంచెం నాగరికం కలవాళ్ళతో నేనా వుండేయెడల యీ రామదాసుపేళ్ళు ఆయా ఖండాలలోకూడా వుండ వచ్చేవి ఆశ్చర్య మేమి? గాంధిమహాత్ముని పేరు ఖండ ఖండాంతరాల దాఁకా వ్యాపించిందా లేదా? యెవరో కొందఱుమాత్రం తప్ప ఆయన పేరు వినీవినడం తోటస్టే వినమ్రులవుతూ'వున్నారా, లేదా, అయితే రాముఁడు గాంధివలెనే మనుష్యమాత్రుఁడుగానే సంచరించాఁడు. యెవరేనా నీవు భగవంతుఁడవని అన్నట్టు అంతగా వాల్మీకంలో స్ఫురింపదు. అంతరార్థాలు తీస్తే " అహం వేద్మి మహాభాగం రామం సత్యపరాక్రమమ్ "

ఇత్యాదులలో పరాత్పరత్వాన్ని వసిష్ఠుడు తెలుసుకున్నట్టు కనపడుతుంది. యేమేనా ఆయనరోజుల్లో మనుష్యమాత్రుఁడుగానే వున్నట్టు తేలుతుంది. కృష్ణుఁడో ఆలాకాదు. "నేను పరాత్పరుణ్ణి" అనికంఠోక్తిగా చెప్పు కున్నాఁడు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" ఇత్యాదులు చూస్తే తేలుతుంది. విశ్వరూపప్రదర్శనంవంటి అద్భుతాలు రాముని జీవితంలో వున్నట్టు లేదు. లేకపోయినా రామనామం కృష్ణనామంకంటె యెంతో హెచ్చు విలవకలిగి పండితపామరులకు తారకంగా వుంది. "రాముఁడు దేవుఁ డేమిటి? మనుష్యమాత్రుఁడే. కాకుంటే విశేషమేమిటంటే? సచ్చరిత్రకలవాఁడు, మహాపరాక్రమశాలి, కనక పురుషోత్తముఁడనుకోవాలి" అనుకుందా మనేవాళ్ళనుకూడా రామనామం కొంత ఆకర్షిస్తుంది. విశ్వామిత్ర ప్రోక్తమైన అధ్యాత్మరామాయణరీత్యా రాముఁడు తనజీవిత కాలంలో దేవుణ్ణని వప్పుకున్నట్టే స్పష్టపడుతుంది. అన్నిటికన్నా ప్రబలాధారం "కాశీ మరణాన్ముక్తిః" అనిచెపుతూ దానికి కారణం సదాశివుఁడు తాను సర్వకాలసర్వావస్థలయందున్నూ రామనామాన్ని జపించడమే కాకుండా ఆపంచక్రోశమధ్యంలో జీవనాన్ని విడిచే ప్రతిదేహికిన్నీ అవసానకాలంలో రామనామాన్ని వుపదేశించడమే అని యావద్విజ్ఞులున్నూ యేకరీతిగా వప్పుకుంటారు. దీన్నిగూర్చి పరీక్షకూడా జరిగినట్టు వక గ్రంథానికి సంబంధించినకథ వుంది. "యితరులు ముక్తికాములై రామనామజపాన్ని చేస్తారుగాక శివుఁడెందుకు చేయా" లనే ప్రశ్నకు జవాబు కనపడదు. శివునికంటేకూడా రాముఁడే వుత్కృష్టుఁడనుకోవడమే అక్కడ ప్రధానం. కొన్నిచోట్ల శివనామాన్ని విష్ణువు జపించినట్టున్నూ వుంది. కృష్ణుఁడు శివోపాసకుఁడైనట్టున్నూ కనపడుతుంది. ఆ యీ సందర్భాలు విచారించి ఎక్కువతక్కువలు నిర్ణయించలేకే వుభయులూ సమానులే అని వకమూఁకవుమ్మడి నిర్ణయానికి వచ్చారు పూర్వపుబుధులలో నూటికి తొంభై తొమ్మండుగురు. మిగతావారు

యిద్దఱు దేవుళ్ళేమిటని "ఏకో దేవః కేశవో వా శివో వా" అని యెవ రినో ఒకరిని ఆశ్రయిస్తా మన్నారు. వారే శైవులున్నూ వైష్ణవులున్నూ. కొందఱు దేవుఁడికి పేరేమిటి? అని యీ భేదంతో పనేలేదు పొమ్మ న్నారు. ఆ యీ మతస్థు లెవరికిన్నీ యిప్పటి నాగరికుల ఆచారాలు నచ్చవు. ఆయీ మతాలవారిలో మతవిషయంలోనే కాదు నడవడి విష యంలోనే కాదు కొన్నిలోపాలు లేకపోలేదు. ఆలోపాలు యెత్తుకొని గోరంతలు కొండంతలు చేసి నవనాగరికులు వారిని ఆక్షేపించి యేవో కథలూ కారుణ్యాలూ వ్రాస్తూ పునర్వివాహాల ఆవశ్యకత్వాన్ని సభర్తృకల కున్నూ గత భర్తృకలకున్నూ సాధించడానికి జీవితాన్ని ధార పోస్తూ వున్నారు. వారికృషి అభినందనీయమే కాని అయ్యవారిని చేయఁబోతే కోఁతికావడంమాత్రం శోచనీయం. మనకృష్ణుఁడు నానాధర్మవేత్తయై వుండికూడా వకసందర్భంలో ప్రసక్తి కలిగి యిఁక ధర్మాలు క్రమంగా నడవవని సూచించేవున్నాఁడు.

"ప్రవిష్టం కలియుగం విద్ధి" అనేశ్లోకం భారతంలో వుంది. దుర్యోధనుణ్ణి తొడలు విఱగఁగొట్టేనాఁటికే కలియుగం ప్రవేశించినట్టు కనపడుతుంది. అది మొదలుకొని క్రమంగా ధర్మవ్యత్యయాలు ప్రారంభ మైనాయి. అవి నానాఁటికి హెచ్చవుతూ వున్నట్టు కనపడుతుంది. వీలై నంతవఱకు పూర్వాచారపరాయణులు వీట్లనుంచి తప్పుకొని చరిస్తూ అక్క డికీ స్పృష్టాస్పృష్టంగా సంక్రమించేదోషాలకు ప్రాయశ్చిత్తంగా లోఁగడ వుదాహరించిన "హరే రామ హరే రామ" అని జపించుకుంటూ కాలాన్ని నెట్టుకోవలసి వుంటుం దనుకుంటాను. కృష్ణుఁడు జారుఁ డనీ, రాముఁడు మనుష్యుఁడే అనీ అనుకునేవారు తరించడం కష్టం. "నాఽతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతే" అనే వుపనిషద్వాక్యం తోసివేయ తగ్గది కాదు. యీ గందరగోళ సమయంలో వాదాలు పనిచేయవు. యీ మంత్రం పనిచేస్తుంది. నే యెఱిఁగినంతలో యీ "హరేరామ" మంత్రంవల్ల తరించిన మహాపురుషుణ్ణి విం జరంలో వేదుల నారాయణ

శాస్త్రుల్లుగారి కుమారుణ్ణి వకరిని చూచాను. ఆయన తొంభై రమారమీలో అనాయాసమరణాన్ని పొందివున్నారు. ఆయన పండితులైతే కారుగాని మహాపండితుని కొమారుఁడు. యెన్నిలక్షలజపం జరిగిందో ఆయనజీవితంలో ఆయనకే తెలియదు. మళ్ళా యిప్పుడు మామామగా రొకరు సుమారు 84 సంవత్సరాల వయస్సులో అంధులై వున్నారు. యీజపాన్ని సర్వదా సాగిస్తూ వున్నారు. లేశమున్నూ చూపు లేకపోయినా ఆవలీవలికి యీజపప్రభావంవల్లనే యితరాపేక్ష లేకుండా వెళ్ళి రాఁగలుగుతూ వున్నారనిన్నీ అవసరమైనంత వోపికతో వుండఁగలిగా రనిన్నీ నామూఢవిశ్వాసం. యింకొక బ్రాహ్మఁడు రాజమండ్రిలో అందఱికీ నీళ్ళకావిళ్ళు మోసి తద్ద్వారాగా కుటుంబపోషణ చేసుకుంటూ వుంటాఁడు. యింతకన్న యీయన్నిగూర్చి నాకు తెలియదు. ఈయనికి యెవరు వుపదేశించారో ? యీ "హరే రామ" ఆపని చేస్తూ దీన్నే విధీ విరామం లేకుండా జపిస్తూ వుంటాఁడు. యీయన్ని చూచినప్పుడల్లా నాకు యెంతో సంతోషం కలుగుతుంది. రాత్రి సుమారు 4 గంటలవేళ మొదలుకొని ఆయన ఆ వ్యాపారంలో వుంటాఁడు. నోరు "హరే ! రామ ! హరే ! రామ" జపం చేస్తూనే వుంటుంది. "నోరు నొవ్వంగ హరికీర్తి నొడువుట" అంటే ? ఆయనకే చెల్లింది. అవశంగా నారాయణస్మరణ చేసిన అజామీళుఁడే మహాభక్తులు పొందిన మోక్షానికి అర్హుఁడైనట్టు గ్రంథప్రామాణ్యం వుంది. యెల్లప్పుడూ స్మరణాభ్యాసం చేస్తూ వుండేవాళ్ళకు తుట్టతుదకాలంలోకూడా ఆభాగ్యం పట్టకపోదు. మొదటినుంచీ యీమాదిరిగా వుండే పూర్వగ్రంథాలు చదువుకోవడంవల్లనో యేమో ? నేనేది వ్రాసినా ఆయీ చేదస్తానికే అనుగుణంగా వుంటూ వుంటుంది. ఆయీధోరణి యిప్పటివారిలో అనేకులకు నచ్చదు. యేమంటే ? యెందఱో లోకంలో మహామహు లుంటే నీళ్ళకావిళ్ళు మోసేబ్రాహ్మణ్ణిగూర్చి యింత గొప్పచేసి వ్రాయడ మేమిటని కొందఱనుకుంటారు. కొందఱో ? యే అస్పృశ్యతానివారణానికేనా పనికివచ్చేటట్టు వ్రాయరాదా ? అనుకొంటారు. యెవరో వకమహావిద్వాం

సు.డు హరిజనులకు గాయత్రిని వుపదేశించి కృతార్థు.డైనట్టు యేపత్రిక లోనో చదివి వున్నాను. ఆలాటి సందర్భాన్ని అన్నిపత్రికలూ అభినంది స్తాయి. అది శ్రేయస్సాధనమా? కాదా? అని విచారిస్తే మనశాస్త్రా లల్లో ప్రమాణం కనపడదు. యేమంత్రాన్ని యెవరు వుపదేశం పొందినా దానివల్ల యేదో శ్రేయస్సంపాదన మవుతుందనేకాని అన్యాయానికి కాదు. బ్రాహ్మల్లోమాత్రం అందఱికీ అట్టిఅర్హత వుందా? అనేశంక వస్తుందని యెఱు.గుదును. లేని బ్రాహ్మలు యెందఱో ఆమంత్రాన్ని జన్మనుబట్టి వుపదేశం పొందుతూ వున్నారు. (అంతవఱకూ అర్హత యివ్వడానికి జన్మకు అధికారం వుంది) సత్యమే. యింతమాత్రంచేత అన్నివర్ణాల వారూ దానికి అధికారులు కారు. ద్విజు లనిపించుకొనే వారు ఆమంత్రాన్ని వుపదేశంపొంది సక్రమంగా మననంచేస్తే దానివల్ల వచ్చే ఫలితాన్ని పొందుతారు. లేదా నామమాత్రబ్రాహ్మల్లో చేరుతారు. తదితరులు (క్షత్రియ వైశ్యులువినా) ప్రయత్నించినా శ్రేయస్సుకు బదులుగా అన్యమే ప్రాప్తి స్తుందని గ్రంథప్రామాణ్యం కనపడుతుంది. "వచనా త్ప్రవృత్తి ర్వచనా న్నివృత్తిః" "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం" అని భగవద్గీత.

యితర శాస్త్రాలన్నీ బ్రాహ్మణుల కుకల్పన లనుకొన్నా గాంధి మహాత్మునివంటి సంస్కర్తయు, తిలకుమహాశయునివంటి పండితోత్తము డున్నూ సమ్మానించిన భగవద్గీతనేనా యిప్పటివారు ప్రమాణంగా పుచ్చు కొని లోకాన్ని సంస్కరిస్తే బాగుండును, యీలాగే ప్రస్తుతలోకపు తాఱుమాఱు మార్పులనుగూర్చి చూస్తూ వూరుకోలేక యేదేనా తో.చింది వ్రాస్తే దానితత్త్వాన్ని గమనించో గమనించకో నాకు బాగా బోధపడదు గాని యెందఱో ఖండనకు వుపక్రమిస్తారు వారి కందఱికీ సమాధానం చెప్ప.గలపాటి శక్తి నాకేకాదు వెనకటి చేదస్తవుతోవలో వారి కెవరికీ వుండ దనుకోవాలి. అందుచేత వారితోవ వారిదీ నాతోవ నాదీ అని వూరు కోవడమే కర్తవ్యమని తెలుసుకున్నాను. ఆమధ్య మద్యనిషేధాన్ని అభి నందిస్తూ నల్లమందునుగూర్చి కొంత స్పెషల్‌గా ఆలోచిస్తే బాగుంటుం

దేమో అని కొన్ని తదనుకూలమైన మాటలు, వ్రాసేటప్పటికి యెందఱో యెన్నివిధాలో యెదురుకున్నారు. కొన్ని విషపదార్థాలు కొన్నివ్యాధులకు అవసరమనిన్నీ కొన్ని నికృష్టవ్యాపారాలు కొన్ని పుత్కృష్టవ్యాపారసంర క్షణానికి ఆవశ్యక మనిన్నీ అందుకే భగవంతుఁడు వాట్లనీ వీట్లనీ కల్పించి వున్నాడనిన్నీ సూక్ష్మదృష్టులకు స్పష్టమే. భగవంతుఁడు కల్పించలేదు. ప్రజలే కల్పించుకున్నారంటే చిక్కు వస్తుంది. సృష్టికూడా మనదేకావ లసి వస్తుంది. దేశకాల పరిస్థితులనుబట్టి కాకపోతే ఖండాంతరవాసులు మద్య నిషేధాన్ని యెందుకు అమల్లో పెట్టలేకపోయారు ? మనవారేనా యీనిషేధంలో వారిని మినహాయించడ మెందుకు ? ఒకాయన రేగటి మట్టిన్నీ కుంకుడుకాయజిగురున్నూ కలిపి యిస్తే నల్లమందుచేసేపనినే చేసిం దంటూ వ్రాశారు. దానికే వొప్పుకుందాం. అప్పుడు ఆరెండుపదా ర్థాలూకూడా నిషిద్ధాలే అని ఆచట్టంలో చేర్చఁబడవా ? అందుచేత మన దేశంలో బాలవృద్ధాతురుల విషయం కొంచెం ఆలోచించతగే వుంటుంది. చుట్ట, సిగరెట్టు, బీడీ లోనైనవి దుర్వ్యసనాలేకాని నల్లమందు ఆలాటి దుర్వ్యసనాలలో చేరదు. యెందఱో దీర్ఘరోగాలకోసం గత్యంతరం లేక దీన్ని డాక్టర్లసలహామీఁదనే అలవాటు చేసుకొని తత్సహాయంవల్ల శేష జీవితాన్ని గడుపుతూ వుంటారు. సరే ! "రామాయణంలో యీపిడకల వేట్లాట" యెందుకు ? శ్రీకృష్ణభగవానుఁడు సంసారరోగనిమగ్నుల నుద్ధ రించడానికి వొకానొక అనిర్వాచ్యమైన నల్లనిమందే కనక నల్లమందు ప్రసంగంకూడా ప్రస్తుతోపయోగమే అనుకుందాం. నల్లమందుకు "అహి ఫేనం" (అఫిని) అని పేరుకూడా వుంది. అహి అంటే ? పాము. దాని కాటుకు సంబంధించినది వకటి వ్రాస్తాను. వొకణ్ణి ఒకయెలకకన్నంలో చెయిపెట్టేటప్పటికి పాము కఱిచిందఁట. వాడుమాత్రం ఆకఱచింది పా మనుకోలేదు; యెలకే అనుకున్నాఁడు. మామోలుగా పనిపాటలు చక్కఁ బెట్టుకుంటూ తిరుగుతూనే వున్నాఁడు. ఒకటి రెండు రోజులు ఆలా జరి గాక యెవరో వచ్చి చూచి "అది యెలక కాదు, పామేమో" అన్నా

రఁట. ఆమాట వినీవినడంతోటబ్టే విఱుచుకుపడి ప్రాణం విడిచాడఁట!
"కుంకుడుకాయగుంజూ రేగడిమట్టీ" కల్పి నల్లమందని మఱిపించినకథ
యీలాటిదే కావాలి, కథల కేమి? యెన్నైనా వ్రాయవచ్చును. మందుగా
వుపయోగించే సందర్భాలలో యివి పనిచేయవు. "దీపం దీపం" అని
యెందఱు యెన్నిసార్లు జపంచేసినా చీఁకటి పోదుగదా! ఆలాటిదే
ప్రస్తుత విషయమున్నూ. నేను దేన్నిగూర్చి వ్రాసినా పూర్వగ్రంథాల
మీఁద ఆధారపడిన్నీ పూర్వాచారాలమీఁద ఆధారపడిన్నీ వ్రాస్తాను.
పుణ్యసంపాదనకుఁగా పూర్వరాజర్షులు చేసిన ధర్మకార్యాలు నిందించేవారి
వ్రాఁతలు నాకు రుచించవు. యిప్పుడు ఆగ్రంథాలయందు అందఱికీ
ఆదరం లేకపోయినా కొందఱికేనా వుండకపో దని నానమ్మకం. అయిదు
వేల సంవత్సరాలు కలియుగం భుక్త మయ్యేటప్పటికే పూర్వుల ఆచారా
లున్నూ వారికట్టుఁబాట్లున్నూ ఖిలమైపోతాయని కొన్ని పురాణాలల్లో వున్నా
పదివేలదాఁకా యింకా అక్కడక్కడ ఆయాపూర్వాచారాలున్నూ దేవస్థా
నాలల్లో కొన్నిటియందు మహత్తున్నూ యింకా గంగాది నదులయందు
వుండేమహత్తున్నూ యేకొంచెమో కొనవూపిరితో వుండఁగలుగుతుం దని
కొందఱు మహర్షులు వ్రాశారు. దాన్నిబట్టి యెక్కడేనా యీపిచ్చిమాటలు
కూడా పాటించేవా రుండకపోతారా? అని వ్రాయడమేకాని యేసంస్కా
రాన్నికాని అడ్డేతలఁపుతో కాదని చదువరులు తెలుసుకోక పోరు. ఆయా
సంస్కారాలన్నీ యథేష్టంగా జరిగేవేకాని ఆఁగేవి కావు. నావయస్సల్లా
యిప్పటికి డెబ్బదికి లోపు. యీలోఁగా జరిగిన మార్పులకు పరిమితి కన
పడదు. యెందుకు మార్చవలసి వచ్చిందో? అంతట్లోనే మళ్ళా దాన్ని
యెందుకు తుడుపెట్టవలసి వస్తూవుందో? అని విచారిస్తే జవాబు కనఁబడ
నివే యెన్నో మార్పులు కనపడతాయి. స్త్రీలడ్రెస్సునుగూర్చి చూడండీ.
రవికలు మోఁచేతిదాఁకా దిగాయి మొదట. యిప్పుడు మళ్ళా యజ్ఞోపవీత
స్థానాన్ని అలంకరించాయి. మొదటిమార్పుకి కొంచెం అర్థమేనా వుంది.
దీనికేముంది? యిది విషయాంతరం. యింకొక్క భక్తుణ్ణిగూర్చి వ్రాసి

యీవ్యాసం విరమిస్తాను. ఆయన నారాయణతీర్థులవారు. లీలాశుకుఁడూ జయదేవుఁడూ కేవలం శృంగార భక్తులు కాని యీాయనభక్తి వేఱు. యీాయన రచించినగేయాలనే తరంగా లనేపేరుతో వాడతారు. సన్న్యాసం పుచ్చుకొన్న పిమ్మట, "వేదశాస్త్రపురాణాని పదపాంసుమివత్యజేత్" అని వుండడంచేత కవిత్వాన్నికూడా వదలిపెట్టవలసే వున్నప్పటికీ భాగవతంలో వున్న "శ్లో. నివృత్తతర్షై రభిగీయమానాత్" అనే శ్రీశుకులవారి వాక్యా న్ననుసరించి కాఁబోలును! యీాయన శ్రీకృష్ణభగవానుఁడికి సంబంధించిన దశమస్కంధంలోని పూర్వభాగకథలను గేయాలుగా రచించారు. విజ్ఞులశాస్త్రారితిక్రిమణం యీాలాగే సమర్థనీయంగా వుంటుంది. కొన్నిగేయాలల్లో యీాయన యశోదయందున్నూ మఱికొన్నిటిలో వసుదేవాదులయందున్నూ దాఁగి వున్నట్టు పరిశీలిస్తే స్పష్టపడుతుంది.

(1) "ఏహి! ముదం దేహి శ్రీకృష్ణా! కృష్ణ! మాం పాహి గోపాలబాల కృష్ణా! కృష్ణ!. నంద గోపనందన! శ్రీకృష్ణా! కృష్ణ!, యదునందన! భక్తచందన! కృష్ణా! కృష్ణ!"

(2) "రక్ష రక్ష, అసురశిక్ష!, రాజీవదళాయతాక్ష!"

(3) "కలయ సఖి! సుందరం బాలకృష్ణం, కలయ సఖి! సుందరం"

(4) "ఆయాహి మాధవ! కృష్ణ! ఆయాహి మాధవ! కృష్ణ!"

యిత్యాదిగేయాలు పరిశీలనాతాత్పర్యంతో చూస్తే పయి విశేషాలు గోచరిస్తాయి. సంసారంలో వుండీకూడా తరించవలసివస్తే యీాలాటి మహానుభావులు చక్కని రాజమార్గాలు చూపించి వున్నారు, ప్రతీవారికీ వేదమే అక్కఱలేదు. దానివల్ల తరించడానికి అర్హత కలిగించుకోవడానికే యెంతో కాలం పడుతుం దనియ్యేవే కదా! వ్యాసభగవానుఁడు వేదసారాన్ని మహాభారతంలో యిమిడ్చివున్నాఁడు. "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అని వ్రాయడం అనుగ్రహమే కాని ఆగ్రహం గాని కుచోద్యంగాని కాదు. స్త్రీశూద్రద్విజబంధువులు

వేదాభ్యాసానికి ప్రయత్నిస్తే ప్రయత్నిస్తారుగాక ! యెంతవఱకు కృతార్థు లవుతారో ? అది వేఱేవిషయం. ఆ వ్యాసులవారిశ్లోకం దురభిప్రాయ ద్యోతక మనికాని అసలు అది వ్యాసులవారిది కానేకాదు, యిటీవల స్వార్థ పరులు ప్రక్షిప్తంగా దానిలోచేర్చా రనికాని అనడం యుక్తిసహం కాదు. యథార్థం అంతకన్నా కాదు యెన్నో యీలాటి శ్లోకాలు ప్రస్తుతం సంస్కర్తలకు బాధించేవి వుంటాయి. తుదకు యేగ్రంథమున్నూ ప్రమాణం కాకపోవలసివస్తుంది. కాఁబట్టి యిప్పటివారి మార్గాలు వారివారి ఆత్మ సిద్ధాంతాన్నిపట్టి నడిచేవేకాని శ్రేయస్కాములు ఆమోదించతగ్గవి కావు. శ్రేయ స్సనఁగా యిప్పటి "మూన్నాళ్ళ ముచ్చట" మాత్రమే కాదు.

(1) మూన్నాళ్ళ ముచ్చటకు మురిసేవు తరిసేవు ముందు గానవు నీవు మనసా !".

(2) "వస్తావు పోతావు నాకొఱకూ, వచ్చికూకున్నాఁడు నీకొఱకూ"

భిక్షుకులు పాడేవే అయినా "భిక్షుణా కక్షనిక్షిప్తః కిమిక్షుర్నీరసో భవేత్ ?" పైగేయాలలోవుండే సారం బాగా విచారించతగ్గది. గాయత్రిని యెవరికో యెవరో వుపదేశించినా వారు వుపదేశాన్ని పొందినా పై గేయాలలోలాగ ఆ మంత్రార్థం వారికి బోధపడదు. గాయత్రి అంటే ? యేమిటో దాన్ని యేలా వుపాసన చేయాలో యెఱిఁగి కృతార్థత్వం పొందినవాఁడు వొక్క గౌతమమహర్షి కాఁబోలును వున్నట్టు పురాణ వాక్యాలు చెప్తూ వున్నాయి. అట్టిస్థితిలో దానివల్ల తరించడం సుఖసుఖాల లేదు. హిట్లరు మునుపు వున్నకాలనీలకొఱకు యత్నించడం యుక్తిసహం. అట్టిప్రయత్నం చేసేవారిని అభినందించవచ్చును గాని కేవలం క్రొత్తదానికోసం పాటు పడుతూవున్న జపానుప్రయత్నం, అభినందనీయ మేలా అవుతుంది ? నేఁటి వేదాధికార ప్రయత్నా లీవిధంగానే వున్నాయి. ఆఖరు వారికికూడా ఉపదేశింపఁబడే వేదానికి అగ్రవర్ణులలోవారేమని యత్నించడం ? అనే ప్రశ్నకు జవాబు కష్టం. అందుచేత దాన్ని వకచోటవుంచినను దానిమర్యాద,

కాపాడుతూ తదర్థాన్ని బోధించే భక్తులగేయాలూ, ఋషుల గ్రంథాలూ యథాధికారంగా పఠించి భక్తిమార్గంలో తరించడం సుఖవని తోస్తుంది. అయితేవ సమంజస మనుకొనేవారికే నేనీవ్యాసం వ్రాయడం. యితరులు దీనిలో నాకు స్వార్థమేమో వుందని వ్రాస్తే వ్రాస్తారు. నాకున్నూ వేదం యేకొంచెమో తప్ప విస్తారం రాదు. నేనిప్పుడు దానికోసం ప్రయత్నించినా ప్రయోజనం కనపడదు. పైని వివరించిన మార్గంలోనే నేనున్నూ పూర్వకాలపు "స్త్రీశూద్రద్విజబంధువుల" తోపాటు కృషి చేస్తూన్నాను. కాని ఆవేదంవల్ల తరిద్దామనే ప్రయత్నం పెట్టుకోలేదు. "నాకు ఆపూర్వ ఋషులు అన్యాయం చేశా" రని స్వప్నంలోకూడా అనుకోవడం లేదు. నాకు యీజన్మకు వున్న అధికారం యింతేఅని సంతుష్టి పడుతూవున్నాను. యిప్పటిసంస్కర్తలు వేదవిషయంలో అందఱికీ అధికారం వుందంటారు. కాని ఆయా పెద్దవుద్యోగాల విషయంలో డిగ్రీలువగయిరాలు అవసరమే అంటారు. అయితే జాతి వాట్లకు అవసరం లేదు. దీని కెందుకని పిడివాదం వుపక్రమిస్తారు. ఆవాదం ఆపాతరమణీయమే కాని ఆజాతి భగవత్సృష్టం కాని గుణకర్మలవల్ల వచ్చేది కాదని వేదవాక్యాలున్నూ ఘోషిస్తూ వున్నాయి. గుణకర్మలవల్ల జాతిసంపాదన క్వాచిత్కంగా, విశ్వామిత్రాదులు సంపాదించినా అది సార్వత్రికం కాదని వేఱే చెప్పనక్కఱలేదు. "నఖలు సర్వోఽపి వత్సరాజః." గీతలలోకూడా "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" అన్నారుగాని శ్రీకృష్ణులవారు అన్యథా నిరూపించ లేదు కనక యెవరేనా "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనే శ్రీకృష్ణవాక్యానికి ప్రాధాన్యం యిస్తూ అందే వేఱొకచో వున్న "స్త్రీషు దుష్టాసు కౌంతేయ! జాయతే వర్ణ సంకరః" లోనైనభాగాన్ని బాగా ఆలోచించి వర్ణసాంకర్యకార్యాలకు లోఁబడక, లోఁబడేవారికి ప్రోత్సాహకులు గాక యింకా కొన్నాళ్ళు పోనిస్తే మన భరతఖండగౌరవం యితరఖండవాస్తవ్యులకు స్తోత్రపాత్రమవుతుందని నాఅభిలాష. మన భరతఖండంలో ఆయావర్ణాలవారికి

యేర్పడ్డ వృత్తులుకూడా ప్రపంచచక్రాన్ని నడపడానికి తగ్గట్టుగా యేర్పడి అన్యోన్యసహాయకారులుగా సూర్యాదిమండలాల పరస్పరాకర్షణకు స్ఫోరకాలుగా వున్నట్టు తోస్తుంది. అందుచేత యెవ రేస్థానంలో వున్నారో వారు ఆస్థానంలోనే వుండి తరించడం యుక్తం. గాయత్రిని వుపదేశం పొందినా అది తరింపచేయదు. ప్రత్యుత, చేస్తే అపకారం చేస్తేచేస్తుంది. కాని అట్టి దృష్టాంతం కనపడక పోవడం చేతనే యెవరికి యిష్టం వచ్చినట్టు వారు తోవలు తొక్కుతూ వున్నారు. యిక్కడ దృష్టాంతరం కనపడకపోయినంతలో లేదనుకోవడానికి మన మతసంప్రదాయాలు అంగీకరించవు. మన సంప్రదాయా లన్నీ యీజన్మం యేదో మహాప్రవాహంలో కొట్టుకుపోతూ మధ్య యేదో చిన్న తిప్పమీఁద కాస్త విశ్రాంతికి యేర్పడ్డ స్థానంగా బోధిస్తాయి. యీవిశ్రాంతిసమయంలోనే మళ్ళా మంచిగతిని చూచుకోవలసి వుంటుందనిన్నీ బోధిస్తాయి. అన్ని వర్ణాలవారున్నూ జరిగినంతలో వారివారి కట్టుఁబాట్లల్లో వుండి తరించినట్లు విదురాది మహాజ్ఞానుల ప్రవృత్తులు స్పష్టపరుస్తూ వున్నాయి. ఆప్రవృత్తులకన్న మనకు మంచివుపదేష్టలు దొరకరు. శ్రుతిస్మృతులు పరస్పర విరుద్ధంగా వున్నా సమన్వయం చేసుకోతగ్గపాండిత్యం వున్నవారికి వకటేలక్ష్యాన్ని యేకవాక్యతగా బోధిస్తాయి. అట్టిపాండిత్యం చిరకాలసాధ్యం. దాన్ని సాధించినవారు తద్ద్వారాగా తరిస్తారు. తదితరులు వారివుపదేశాలు ప్రకటించే భాగవతాది గ్రంథాలద్వారా తరించడం తప్ప గత్యంతరం సున్న. దేవాలయాదులవిషయమై ఆగమా లంటూ యేర్పడ్డాయి. ఆగమరీత్యాగానే రాయి దేవుఁడు కావడం తటస్థించింది. ఆ ఆగమాలలోనే కొన్నికట్టుబాట్లున్నాయి. వాట్లను అతిక్రమించేయెడల ఆ దేవుఁడు తాయే కావలసి వస్తుంది. "మూలచ్ఛేదీ తవపాండిత్య ప్రకర్షః" అవుతుంది. యీఅర్థం యిచ్చేమాటలు లోఁగడ వ్రాసేవున్నాను. దేవుఁ డందటికీ సమానంగా సేవించ తగ్గవాఁడేకాదా? అనేమాట ఆపాత రమణీయంగా వుంటుంది. వేద విషయం కూడా డిటో. కాని యింకా దాన్ని విమర్శించవలసి వుంటుంది. పురుషుఁడు స్త్రీని వివాహం చేసుకోవచ్చును అని అంటే యింకా యెన్నో

అవాంతరాలు విచారించవలసివుంటుంది, దాంపత్యానికి వర్ణవిచారం వదులు కుందాం. అప్పుడుమాత్రిం యింకా అవాంతరా లెన్నో వుంటాయి కదా! అలాగే సంసారులకు ప్రీతివిషయంలోనూ ఎన్నోభేదాలు పాటించక తప్పదు. సర్వసమత్వంగా ప్రివర్తిద్దా మనుకొనేవారికి కూడా "సంసార" మనేటప్పటికి ఆయాభేదాలు కొన్ని అంగీకరించక తప్పదు. ఇవన్నీ యిత రత్ర ఋషులు ప్రపంచించే వున్నారు, నూతనాలు కావు.

"ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసు లట్టె భ్రష్టులై
రెందఱు రాజు లేఁగిరి మఱెందఱు యోగులు జోగులైరి గో
విందుని పాదపద్మములు వీడనిభక్తి భజింపనేర కా
చందము నొంద కీవు మనసా! హరిపాదము లాశ్రయింపవే!"

అన్నాఁడు వకకవి. "నాఽతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతే" "శ్లోకార్ధేన ప్రివక్ష్యామి యదుక్తం గ్రింథ కోటిభిః, పరోప కారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" యెంతెంతో విలవకలిగిన యీలాటిమాటలు మనకోసం వ్రాసిపెట్టిన ఋషులను మనం తిరస్కరించ రాదు. కొందఱు చాతుర్వర్ణ్యంలో స్వేచ్ఛామార్గం తొక్కేవా రున్నా యింకా సర్వేసర్వత్రి అట్టిసాహసం వ్యాపించ లేదు. కాని దేవుఁడే వుంటే, వేదాలు ఆయనఆజ్ఞలే అవడం నిజమే అయితే వాట్లని (ప్రమాదం చేత కాదు) బుద్ధిపూర్వకంగా అతిక్రిమించేవారిని యేం చేస్తున్నాఁడని ప్రిశ్నించడానికి అవకాశం కలుగుతూ వుంది. యిప్పటి కుఱ్ఱలకు ప్రాచీన గ్రింథాలు పాఠం చెప్పడం చిక్కుగా కనపడుతూ వుంది. "అన్నిటికీ దేవుఁడు కలిగించుకోఁడు, యెప్పుడో కలిగించుకుంటాఁడు" అన్నంతలో వారికి విశ్వాసం కలగడం లేదు. యిది అనుభవంమీఁద వ్రాస్తూ వున్నాను. నిజానికి బాగా ఆలోచించండి. భగవంతుఁడు ప్రితీస్వల్పవిషయానికీ కలిగించుకున్నట్టు గ్రింథాలల్లో కనపడుతుందా? యేవో ప్రిళయాలల్లో తప్ప కలిగించుకున్నట్టు కనపడదు. సంస్కర్తలు కూడా దేవుఁడు లేఁడనే వారు కారు. కాని "ఖండాంతరాలల్లో వకదేవుఁడున్నా మనఖండంలో

వకదేవుఁడూ వున్నాఁడా ? అక్కడివారి ఆచారాలు అవలంబిస్తే మనలని శిక్షిస్తే మనం యెదురు తిరిగి అడగలేమా ?" అనుకుంటారు. యీవ్యూహ యేలాటిదైనా ఆపాతరమణీయమే ! కాని ఆ దేశంలో సూర్యోదయానికి నిద్రలేచి స్నానం చేయవలసివస్తే ఆమనిషి బిఱ్ఱబిగిసి అప్పుడే పైన లవుతాఁడు. కనక మనదేశంలో "శ్లో. నవచ్ఛిద్రయుతం కాయం స్రవత్యేవ దినేదినే, ప్రాతఃస్నానం విశుద్ధ్యర్థం...." అనేమాదిరి విధులు పుట్టినట్టు ఆదేశంలో పుట్టకపోవచ్చును. ఆయా నవచ్ఛిద్రశుద్ధి వారున్నూ గమనిస్తూనే వున్నారు కాని మనలాగు అక్కడివారు అవలంబించడం లేదు. వారికి పుట్టినవేదం ధర్మాధర్మాలు తదనుకూలంగానే బోధిస్తూవుందనుకోవాలి. అంతేనేకాని అది మనవేదంవంటిది కాదనడం సాహసం. జ్ఞానవిషయంలో దానికిన్నీ మనవేదానికిన్నీ కావలసినంత పోలికవుంటుంది. వ్రాస్తే చాలా వ్రాయాలి. యెంతవ్రాసినా భక్తిమార్గంకన్న సర్వులనూ తరింపనేచేమార్గం కనపడదు. దీనిలో విధినిషేధాలబాధ కనపడదు. యెన్నో యితిహాసాలు యీ విషయాన్ని బోధిస్తాయి. పూర్వాచారాలు పూర్తిగా పాటిస్తూ వ్రాసినవారుకూడా యీ భక్తిమార్గంలో వారు అర్హులనీ వీరు అనర్హులనీ యెక్కడా వ్రాసినట్టు కనపడదు. తరణోపాయమే గమ్యస్థాన మయితే అందఱికీ యీ భక్తిమార్గమే ఆశ్రయణీయం, శంకాసమాధానాలకు అంతమంటూ వుండదు శాస్త్రాలు వాట్లకోసమే పుట్టాయి. అందులో యెవరికోగాని ప్రవేశం కలగదు. కలిగీ కూడా పరవస్తు వేదో తేలదు. ఆఖరికి పరమాణువులు పరవస్తువు వాకరికీ, వేఱొకరికి మఱివకటీ; చర్చించినకొద్దీ యీలా తేలుతుంది గాని వేదంలో వున్న నారాయణుఁడూ పరశివుఁడూ పరవస్తువుగా తేలరు. అందుచేత ఆయామహాపండితుల కన్నా కూడా త్యాగరాయాదుల మార్గమే మంచిది. శ్రీమద్భాగవత మంతా ఆమార్గాన్నే బోధిస్తుంది. పోతరాజుగారు దానివల్లనే తరించారు. మనంకూడా ఆమార్గాన్నే పడదాం. స్వస్తి.

—❧—

# "కులవృత్తికి సాటిరాదు గువ్వలచెన్నా"

( 15—2—1940 సం॥రం సుధ నుంచి )

"కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా" అంటూ వకవాక్యం చాలా కాలాన్నుంచి వినపడుతూవుంది. యీ "గువ్వలచెన్న" శతకం కర్నూలుప్రాంతంలో తఱచు వ్యాప్తిలోవుంది. కవి యెవ్వరో? "గువ్వల చెన్నయ్య" యెవ్వరో? యేకాలపువారో ఆప్రాంతంవారికి తప్పకుండా తెలుసునేమో కాని నాకు తెలియదు. యీకవి చెప్పిన మాటమాత్రం యెక్కువ ఆదరణీయంగా కనబడుతుంది. యీవాక్యం "స్వధర్మే నిధనం శ్రేయః" అనే గీతావాక్యాన్నే భంగ్యంతరంగా బోధిస్తూ వుంది. పూర్వం ఆయీగీతావాక్యమందు యెక్కువ ప్రామాణ్యం వుండేది. ఆకారణంచేత నిర్దుష్టంగావుండే వృత్తులవారే కాక దోషభూయిష్ఠమైన వృత్తులవారుకూడా స్వవృత్తి త్యాగానికి సాహసించేవారు కారు. బ్రిటిషుప్రభుత్వం వచ్చిన తరువాత కూడా చాలాకాలం వారివారివృత్తులను వదులుకోకుండానే నూటికి తొంభైతొమ్మండుగురు కాలక్షేపం చేస్తూవచ్చేరు. ఆరోజులలో యింగ్లీషు స్కూళ్ళలోకి సంస్కృతపండితులుగాని తెలుగుపండితులుగాని కావలసివస్తే దొరకడం చాలా కష్టసాధ్యంగా వుండేది. యేసామాన్యులోతప్ప భృతకోపాధ్యాయత్వానికి ఆమోదించేవారే కారు. అంతదాఁకా యెందుకు? శివాలయాలలో అర్చకులు కావలసివస్తే అందుకోసం పుట్టిన ఆదిశైవు లనిపించుకొనేవారు తప్ప యితరబ్రాహ్మణులు అందులో ప్రవేశించడానికి ఆమోదించేవారు కారు. విష్ణ్వర్చనవల్ల దోషం లేదని విఖనోమహాఋషి ధర్మశాస్త్రం యేర్పఱచడంచేత వైఖానసులు విష్ణుపూజకులుగానున్నూ ఆదిశైవులు శివార్చకులు గానున్నూ వుంటూ వచ్చారుగాని తదితరబ్రాహ్మణులు యీసత్కార్యాన్నికూడా చేయడం నింద్యంగానే భావించేవారు. కారణం ప్రతిఫలం పుచ్చుకొని చేసేది కావడమే. యిటీవల వెల్నాట్లలోనుంచి కొన్ని గోత్రాలవారు సాహసించి శివాలయాలకు పూజకులుగా యేర్పడ్డారు.

అంతమాత్రంచేత వారితో మిగిలినశాఖాబంధువులు సంబంధాలు మాను కున్నారు. దేవుణ్ణి పూజించడం సుకృతకార్యమే అయినా అది నిర్వ్యాజంగా వుంటేనే అట్టి సుకృతం కలుగుతుంది. కాని ప్రతిఫలంతో చేరినప్పుడు అట్టిసుకృతం కలగదని పూర్వులతాత్పర్యం. "శ్లో. ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" అనే గీతావాక్యంలో వున్న నాలుగుతరగతులలో యీఅర్చకులు అర్థార్థులలోకి వస్తారు. అర్థార్థులుకాకుండా భగవదారాధన చేసే గృహస్థులే లోకంలో కనపడరు. సత్యనారాయణవ్రతం వగైరాలన్నీ యేదో ప్రయోజనాన్ని పురస్కరించుకొనే వారువారు చేస్తూవుంటారు. అట్టిస్థితిలో తమజీవనానికి యేతృషితమో పుచ్చుకుంటూ భగవదారాధన చేసేవారిని మనపూర్వులు నిరసించడం కొంత అన్యాయంగానే కనబడు తుంది. కాని వారి దేవతార్చన పరాధీనవృత్తిగా నానాటికి పరిణమించడం చేత తుదకది గ్రామసేవకావృత్తిగా మారిపోయిందనిన్నీ "న శ్వవృత్త్యా కదాచన" అన్న మనువుగారి నిషేధానికి గురి కావలసి వచ్చిందనిన్నీ సీహారలేశాలు తీసి విమర్శిస్తే తేలుతుంది. యీతేలడంవల్లనే కులక్రమా గతంగా చేసేవారు తప్ప యితరులు ఆవృత్తిలోకి ప్రవేశించడానికి వెనుక తీసేవారు. అక్కడక్కడ క్వాచిత్కంగా యితరశాఖీయులుకూడా వున్నారు కాని వారు మిక్కిలీస్వల్పం. యితరశాఖీయులేకాదు. యితరజాతీయు లున్నూ వున్నారు. కాని వారున్నూస్వల్పమే. యింతవఱకు మనప్రాం తాలలో విష్ణ్వర్చకులు వైఖానసులే. శివార్చకులు ఆదిశైవులనిపించుకొనే వారే (కొలందిమంది వెల్నాటివారున్నూ). వీరిని దక్షిణాదిని "గురుకులు" అని వ్యవహరింతురు. బహుశః ఆశబ్దం "గురుకుల" శబ్దభవ మని తోస్తుంది. ఆదికాలంలో వీరు పలువురు శివమతస్థులకు గురుస్థానంగా వుండి పంచాక్షరీ మంత్రాన్ని వుపదేశించేవారనికూడా వూహకు తట్టుతుంది. యిప్పటికీ దక్షిణాదిని యీశాఖవారిలో గొప్పగొప్ప విద్వాంసులు వున్నట్టు వినికి. ఆవిద్వాంసుల సదాచారసంపత్తి మిక్కిలీ అభినందనీయంగా వుంటుంది. వారు తమశాఖ కానివారి యిళ్ళకు భోజనభాజనాదులకు వెళ్ళరు.

కాని యితరశాఖీయులు వారియిళ్ళలో భోజనం చేస్తారు. మనదేశంలో మాత్రం వారికీ వీరికీ భోజనాదికం కనపడదు. ఇది విషయాంతరం. ఆయా అర్చకులకుకూడా యింగ్లీషు రాజ్యంలో స్వవృత్తిత్యాగం అవసరమైనప్పుడు యితర నికృష్టవృత్తులవారినిగూర్చి యెత్తుకోవడం యెందుకు? యింగ్లీషు చదువుకుని చేసేనౌకరీకన్న వేదమంత్రాలు అభ్యసించి దేవునికి నౌకరీచేయడం పరమోత్కృష్టంకదా? అయితే దీనిలో వుండేవారికి స్నానసంధ్యాద్యనుష్ఠానాలేకాని కోట్లూ బూట్లూ వగైరాలు అక్కఱలేదు. పయిగా అవి విరోధిస్తాయికూడాను. వాట్లను ధరించడం "తగినవేషంబు" అనేదానికిందకు రాదుకదా? ప్రస్తుతకాలంలో లోకంయొక్క వ్యామోహం యెంతసేపూ కోటూ బూటూ వగైరాల మీఁదే ప్రసరిస్తూ వుంది. అది బాలకులకుమాత్రమే కాదు, బాలకుల తల్లిదండ్రులకుకూడా సమన్వయిస్తూ వుండడంచేత వాట్లని ధరించడానికి తగ్గవృత్తిమీఁదకే ప్రతీవారి మనస్సూ పరిగెడుతూ వుంది. అందుచేత లోకంలో వున్న ప్రాచీనవృత్తులలో పరమపవిత్రమైన వృత్తి కలిగిన అర్చకులుకూడా "శ్వవృత్తి" అనిపించుకొనే వృత్తికోసం క్వాచిత్కంగానే అనుకుందాం స్వవృత్తిత్యాగం చేయవలసి వచ్చిందని స్పష్టమవుతూ వుంది. అయితే యిటీవల వారివారివృత్తులకు భంగం కలిగించే బిల్లులు పుట్టడంచేత కోర్టులమ్మట తిరిగి పాట్లుపడలేక స్వవృత్తిత్యాగం చేయడమే సుఖమనిపించి వారువారు అలా సాహసించారేమో అనుకుంటే? ఆయీబిల్లులు రావడానికి పూర్వమే జరిగిన లక్ష్యాలు కనపడడంచేత ఆవూహ సమన్వయించదు. అందఱికీ నౌకరీమూలంగా గౌరవజీవనం జరుగుతుందనేదే స్వవృత్తిత్యాగానికి ప్రోత్సాహకం. మొట్టమొదటిరోజుల్లో యేకొంచెమో పరిశ్రమచేసి "ఏ, బీ, సీ, డీ" లు నేర్చుకుంటేనే నౌకరీ దొరికింది. దానితో యెందఱో సుఖజీవనాన్ని సంపాదించుకున్నారు. వారిని చూచి వారూ, వారిని చూచి మఱికొందరూ ఆవిద్యకు యెగఁబడ్డారు. అన్యోన్యసహాయంవల్ల కొందఱూ, స్వయంసహాయంవల్లనే కొందఱూ పైకివచ్చారు. వారివారిగృహాలలో

వుండే వెండి విస్తళ్ళు బంగారువగలూ చూచేటప్పటికి యితరబంధువులకు కళ్ళుకుట్టడం తటస్థించింది. దానితో అవధాన్లుగారి కొడుకుదగ్గిఱనుంచీ అంత్యజుఁడు కొడుకుదాఁకా వకటే వ్యామోహానికి గుఱికావలసివచ్చింది. ప్రతీజాతిలోన్నుంచీ అధమం నూటికి పదిమందేనా యీవిద్యవల్ల లాభాన్ని పొందడం కలిగింది. స్వస్వవృత్తులలోనేవుండి కొందఱు నూతనవృత్తులలో అప్పటికి ఆక్షేపణీయాలుగా వుండే వృత్తులు అవలంబించేవారిని యీస డించడానిక్కీ మొదలుపెట్టడమూ వుండేది. మచ్చుకు వకటి చూపుతాను. వకనియోగి వంశీయుఁడు నాటకంలో స్త్రీ వేషం వేయడానికి ప్రారంభిం చాఁడు. ఆయువకుణ్ణి స్వశాఖీయులు కులానికి అప్రతిష్ఠ తెస్తూవున్నాఁడని మాతులూ ముక్కాలూ విఱవడానికి మొదలుపెట్టారు. అతఁడు తన వ్యాపారాన్ని తాను సాగిస్తూనే వచ్చాఁడు. అతఁడు బీదవాఁడవడంచేత అప్పటికి పెళ్ళికాలేదు. అదృష్టకాలం దాదాపవడంచేత ఆ స్త్రీవేషంలో అతనికి మంచిపేరు వచ్చింది. ధనసంపాదనకూడా అయింది. మాతులూ ముక్కాలూ విఱిచినవారే కట్నమూ కానుకా యిచ్చి పిల్లనిచ్చారు. క్రమంగా నాటకాలు కంట్రాక్టు ప్రకరణంలోకి దిగి వక్కొక్కరోజుకే నూర్లూ నూటయాభైలూ వక్కొక్కపాత్రకు ఇచ్చేరోజులు వచ్చాయి. దానితో ఆయన ఐశ్వర్యం మఱీ హెచ్చింది. ఆయన సంతానానికి పిల్ల నివ్వడానికి వార్లోజమీందార్లవంటివారే రాయబారాలు పంపవలసి వచ్చింది. భగవదనుగ్రహంవల్ల ఆయన సుఖజీవనం చేస్తూవున్నారు. పట్నవాసాలలో కొన్నిమేడలు పల్లెటూళ్ళలో కొన్నిభూములు సంపాదించడం జరిగింది. ఇటీవల "కళోపాసకు" లంటూ వీరికి వక బిరుదు పేరు కల్పించి పత్రి కలు గౌరవస్థానాన్నిగూడా యిచ్చి వందిమాగధస్తవాలుకూడా ప్రారంభిం చాయి. దానిక్కారణం లేకపోలేదు. యితరజీవనాధారం కల ప్రముఖులు కొందఱు దీన్నవలంబించడమే. అంతతోకూడా ఆపత్రికలు విరమించ లేదు. ప్రతిగృహస్థున్నూ నాటకపాత్రగా వుండడానికి తగ్గనాట్యాభినయ ప్రజ్ఞ కలవాఁడుగా వుండి జనరంజకత్వాన్ని కలిగించేవాఁడే అయితే

అతఁడేగాక ఆతనిభార్యాపుత్రులతోటిన్నీ పుత్రికలతోటిన్నీ కోడళ్ళతోటిన్నీ యీవృత్తిలో వుండడం చాలా అభినందనీయమని వ్రాయడానికి మొద లెట్టాయి. దానికి వక పెద్దకుటుంబాన్ని వుదాహరణంగా చూపడం కూడా జరిగింది. మనపూర్వులు ఆయానాట్యాభినయాలను ఆమోదిస్తూకూడా సంసారిస్త్రీలకేకాక సంసారులైన పురుషులకుకూడా వీట్లని అంగీకరించి నట్టు కనపడదు. కాళిదాసాదుల నాటకాలు ప్రదర్శించేవారు బ్రాహ్మణ శాఖాకుటుంబాలవారు క్వాచిత్కంగా వున్నా వారికి ఆ స్టేజీమీఁదేతప్ప యితరత్ర గౌరవప్రపత్తులు వున్నట్టు కనపడదు. యిప్పుడింతటిమార్పేలా వచ్చిందని నేను ఆశ్చర్యపడ్డాను. యితర ప్రసిడెన్సీలలో సంసారులైన స్త్రీలు పలువురు రంగస్థలంలోకి వచ్చినట్టు వినడం, ఆభాగ్యం యింకా మనరాష్ట్రంలో అంతగా వ్యాప్తిలో లేదు. యిదివఱలో బాహాటంగా రంగ స్థలంలో ఛాంవేషం వగయిరాలు వినికి చేసేవారిలో అంతా కాకపోయినా కొందఱేనా యిప్పుడు వీనియందు అగౌరవం వుందని వదలుకుంటూ వున్నా రన్నది అందరూ యెరిగిందే. వారు వదలుకోవడానికి ఆవిద్యయందు వుండేయేవం కారణం గాదు. అన్యకారణాన్నిబట్టి కులస్థులలో కొందరు పట్టుఁబడితే అది యథార్థమే అవడంచేత మానుకుంటూ వున్నారు. యిట్టి స్థితిలో సంసారుల కది వుపాదేయం యేలా అవుతూవుందో! అనేశంక తోచకపోదు. నేను ఆకుటుంబీకులలో వొకరితో యీవిషయం ప్రసంగించి చూచాను. ఆయన నాకు చెప్పిందేమిటంటే "అయ్యా! మాపూర్వులు తరతరాలనుంచి యీ వృత్తిలోనే వుండి అప్పటికాలంలో వ్యాప్తికలిగి వుండే వీధిభాగవతాలున్నూ తోలుబొమ్మలున్నూ జీవికగా పెట్టుకొని దేశాల వెంబడిని సంచరిస్తూ వుండేవారు. నేనుకూడా చిన్నతనంలో వాట్లలోనే వుండి క్రమంగా యీకంపెనీ యేర్పరచి నాకు సంబంధించిన స్త్రీపురుష సంతతికిన్నీ వాళ్ళవాళ్ళకు సంబంధించిన చుట్టాలకున్నూ దీన్నే నేర్పి యీస్థితికి తెచ్చాను" అని కపటం విడిచి ఆకుశీలవవృద్ధు వక్కాణించి నాడు. అది ఆతనికి కులవృత్తే కావడంచేత నామనస్సుకు యెంతో

తృప్తికరంగా కనపడింది. "స్వధర్మే నిధనం శ్రేయః" అనే గీతావాక్యానికి ఆయన ప్రథమోదాహరణంకదా! అనుకున్నాను. యెందరో యెన్నోవిధాలుగా యితరవృత్తి స్వీకారానికి పాటుపడుతూ స్వవృత్తులను వదులుకుంటూ వున్నకాలంలో యిట్టి పురుషుఁడు వుండడమనేది అభినందనీయమనుకుని ఆనందించాను. యిప్పటికీ ఆనందిస్తూనే వున్నాను. "కులవృత్తిగదా" అని యాయవారాన్నే యెత్తుకొమ్మనికాని దొంగతనమే చేయవలసిందనికాని వ్యభిచారపుదుకాణమే పెట్టుకోవలసిందని కాని మనపూర్వుల తాత్పర్యం కాదు. ఆయాసంఘాలలో కొందరు ఆయావృత్తులయందు వుండే నైచ్యాన్ని తెలుసుకొని దానినుండి తప్పించుకోవడం మిక్కిలీ అభినందనీయం. అంతేకాకుండా తోటివారికికూడా యితరసదుపాయాలు చూపించి తనతోపాటు వుద్ధరించడంకూడా ప్రశంసనీయం. కాని యెంతమందికని అట్టిసదుపాయాలు చూపించడం జరుగుతుంది? అందుచేత యితరసదుపాయాలు లేనివారు వారివారి వృత్తులలోనే వున్నప్పటికీ వారిని నిర్బంధించి బాధించకూడదు. ఆయావృత్తులు వదలుకొన్నవారిని వదులుకోనివారున్నూ బాధించకూడదు. భటరాజులకు అనాదిగా క్షత్రియాదుల గృహాలలో జరిగే వివాహాలకు వెళ్ళి దీవనపద్యాలు చదివి వారిచ్చే సమ్మానం పొందడం ఆచారం. వారిలో కవులూ వున్నప్పటికీ తరుచు యితర కవులపద్యాలనే వారు చదువుతూవుంటారు. పూర్వకాలంలో కవిత్వవ్యాప్తి కావాలంటే భట్రాజులవల్లనే అని తెలుస్తుంది.

క. "కవితాకన్యకు నలుగురు। కవి జనకుఁడు భట్టు దాది" అన్నే శ్రీనాథుడిగారి పద్యం పైసందర్భాన్ని బోధిస్తుంది. యిప్పటికిన్నీ పెళ్ళిళ్ళల్లో భట్రాజులను స్వశక్త్యనుసారం క్షత్రియాదులు గౌరవిస్తూనే వున్నారు. సుమారు నలభైయేళ్ళనాఁడు శ్రీకిర్లంపూడి జమీందార్లు బుచ్చితమ్మయ్యగారి కుమార్తె వివాహానికి వేయిమందికిపైగా భట్రాజులు వచ్చారు. ఆసంస్థానంలో అంతకుపూర్వం జరిగిన వివాహాలల్లో భట్రాజులకు జోటివరహాలు యిస్తూవుండేవారట. అంటే మనిషివక్కంటికి

2 రూపాయలు మామోలు. సంస్థానమయితే అంతపెద్దరాబడికలది కాదు కాని ధర్మ సంస్థానమనే పేరు దానికివచ్చినంత మాపైపుసంస్థానాలలో మరివకదానికి రాలేదు. అందులో ఆబుచ్చితమ్మయ్యగారి పినతల్లికొడుకు శ్రీచిన్నారావుగారి శౌర్యాదార్యాది గుణాలు అనన్యలభ్యాలు. భటాశ్రిజులకు వుండే అధికారం అప్పటి కింకా పూర్తిగా అమల్లోవుంది. వారిమామోలు యిచ్చి తీరవలసిందే. అప్పటికి సంస్థానస్థితి చాలా లుగసానుగా వుంది. అంతసొమ్ము వారికిచ్చి రూపాయీ అర్ధా బ్రాహ్మణసంభావన యిచ్చి వీట్లతోపాటుగా యితరలాంఛనాలు అన్నీ జరిగించేపద్ధతిని భరించే స్థితిలో లేదు. అప్పుడు ఆచిన్నారావుగారు వచ్చి భటాశ్రిజులకు దర్శన మిచ్చి మామోలులో చెరిసగానికి సంతోషించ వలసిందని చెపితే ఆయనమాట యందు వుండే గౌరవంచేత ఆభటాశ్రిజులు రాజీపడ్డారు. చెప్పొచ్చే దేమి టంటే మనజమీందార్లున్నూ మనలో వుండే సంపన్నగృహస్థులున్నూ భటాశ్రిజులను యెంతగా గౌరవించేవారో ఆజమీందార్లు నాఁడు వారితో జేసికొన్న రాజీనిబట్టి విస్పష్టమవుతుంది. రాజీయెందుకు? జవానులను పెట్టి గెంటేస్తే తీరిపోదా? అంటారేమో? అంతటిబుద్ధిమంతు లప్పటికి లేరనుకోవాలి. యిటీవల ఆయీవిషయం అన్నిటితోటిపాటూ సన్నగిల్లే వుండివుండును. చెప్పొచ్చే దేమిటంటే? వకటేముహూర్తాన్ని చాలా చోట్ల వివాహాలు కావడంవస్తే భటాశ్రిజులలో కొందరు కొన్నిచోట్లకున్నూ మరికొందరు మరికొన్నిచోట్లకున్నూ వెళ్ళడమున్నూ వారూ వీరూ సంపాదించింది యెక్కువతక్కువలువున్నా సరిగానే పంచుకోవడమున్నూ వారి కులాచారం. యెక్కడికో వకచోటికి వెళ్ళితీరాలిగాని వెళ్ళకుండా భీష్మించి కూర్చోవడానికిమాత్రం వల్లకాదు. ఇది వారి కులమర్యాద. అసమర్థత్వంలో వుండి వెళ్ళకపోతే అట్టి బాలవృద్ధాతురులకు యీకట్టుబాటు అభ్యంతరపెట్టదేమో? నేనీసంగతి కనుక్కోలేదు. యిట్టిస్థితిలో వకభటాశ్రిజు యేవో "యే బీ సీ డీ" లు చదువుకొని వుద్యోగము సంపాదించి ఆసంభావనలకు వెళ్ళడం మానివేసాట్ట! మానేసి తనకు సంభావన పంచిపెట్టవల

సిందని మాత్రం కోరలేదు. కోరకపోయినా తమతో రాలేదనే కారణం చేత కులస్థులు ఆయన్ని సంబంధబాంధవ్యాలలో బహిష్కరించేరట! దానితో ఆయన వారితో రాజీపడడం తప్ప గత్యంతరము లేకపోయింది. రాజీస్వరూపం చూపుతాను. కులస్థులేమన్నారంటే? నీవు మాతోపాటు "జయ విజయీభవ" అంటూ పద్యాలు చదువనక్కరలేదు. నీకు అందుబాటులోవున్న వివాహస్థలానికివచ్చి యేరెండునిమిషాలో కూర్చునినీవ్యాపారానికి నీవు వెళ్ళిపో, చాలును. మేం తెచ్చినదానిలో నీకున్నూ తృణమో తృషితమో అందరితోపాటుగా పంచిపెడతాం. దాన్ని నీవు వద్దనడానికి వల్లకాదు. అని రాజీ. తరవాత "కులంతో పాటు గోవిందా" అని ఆలాగే ఆవుద్యోగి సంచరించేవాడట. యిది నావద్ద చదువుకున్న భటరాజు విద్యార్థి చెప్పగా విన్నాను. కొద్దికాలంనాటిదేకాని యెన్నాళ్ళనాటిదో కాదు. కులవృత్తులయందు వాళ్ళవాళ్ళకు అంతంతపట్టుదల వుండేదన్నమాట. పట్టుదల వుండదే అనుకుందాం. వదులుకుంటామే అనుకుందాం. అందరికీ మతోవృత్తు లెక్కడ దొరుకుతాయి? కులాభిమానంకల సంపన్నులేనా యెందరిని పోషిస్తారు? నైజాంవంటి మహాప్రభువు పరిపాలించే దేశంలో మిక్కిలి బీదలు మహమ్మదీయు లెందరు లేరు? ఆలాగే యింగ్లీషు, జర్మన్, రష్యా మొదలైన రాజ్యాలల్లోను వుంటారు. కాబట్టి కులవృత్తులను చట్టన వదులుకోరాదు. వదులుకున్నా మళ్ళా వెంటనే అవసరమయితే అవలంబించడానికి వీలిచ్చేవైతే అంతగా చిక్కులేదు. అట్టివికాకుండా వుండే వృత్తులు కొన్ని వుంటాయి. వాట్లను వదులుకోవడం బాగా ఆలోచించి మరీ వదులుకోవాలి. భటాగ్రజులు పట్టినపట్టు కొంతకులాచారసాధకంగా కనపడ్డా సర్వులూ దాన్ని అనుకరించడం యుక్తంకాదు. యాయవారమే కులవృత్తిగా వున్నవారిలో వకయదృష్టశాలి బయలుదేరి యేవున్నతోద్యోగమో చేస్తూవుంటే ఆయన్ని ప్రతిరోజున్నూ కొన్ని యిళ్ళకు ముష్టికి వెళ్ళవలసిందని కులస్థులు శాసించడం యుక్తంగా వుంటుందా? ఆలాగే మతాకవృత్తివిషయాన్ని గూర్చిన్నీ మనం చూచుకోవాలి.

యిక నేమిటంటే ? యీవుద్యోగి తెలివైనవాడే అయితే గత్యంతరంలేక కులవృత్తిలోనే వున్నబంధుజాతాన్ని తిరస్కరించకుండా నేర్పుగా కాలక్షేపం చెయ్యాలి. తనతోపాటుగా అందరికీ వుద్యోగాలు దొరికే విద్యాబుద్ధులు వుండడంగాని వున్నవారికేనా అందఱికీ లభించడంగాని యెన్నటికీ సంఘటించ దనేసంగతి జ్ఞప్తిలో వుంచుకొని ఆవ్యక్తి ప్రవర్తించడమే యెక్కువ గడుసుతనం. యెవరోతప్ప నిమ్నజాతులలో మహాపదవులలో నుండేవ్యక్తులు యీగడుసుతనంతోటే ప్రవర్తిస్తూ మర్యాద దక్కించుకుంటూ వున్నట్టు వినడం. యెవరేనా తనపూర్వవృత్తం యెరిగినవారు తటస్థిస్తే వారితోటి ముందుగా తనకువుండే గోప్యాతిగోప్యములను గూర్చిన చుట్టరికాలనుగూర్చియ్యేవే. వొకమహావ్యక్తి ప్రసంగిస్తాడని చెప్పగా వినడం. ఇది అప్పటి తన పదవినిబట్టి అంత అవసరంకాకపోయినా జాతిస్మరత్వంవంటి వుత్తమగుణం. యిది యేఅదృష్టశాలికోగాని సంఘటించదు.

కొందఱు తనజాతిలోవున్న నికృష్టవ్యాపారాన్ని చేసుకుంటూవున్న దీనులను యితరజాతులవారు యీసడించి మాట్లాడినట్లే మాటలాడేవారున్నూ వుంటారు. పదవినిబట్టి అలామాటలాడవలసిన్నీ వస్తుంది. అట్టిస్థితిలో కులస్థులు ఆయన్ని యేమీ అనుకోకూడదు. యీవిషయం బాగా విడదీసి వ్యాఖ్యానంచేస్తే చాలామందికి తెలుసుకోవడానికి యెక్కువ వీలుగా వుంటుందిగాని అందులో కొందఱికి మనస్సుకూడా నొచ్చుతుందేమో అని గూఢంగానే వుంచాను. కులవృత్తినివదలి అన్యవృత్తిలోవున్న వ్యక్తి వక నాటకపాత్రవంటివాడు. అతడు మహారాజు భూమికను ధరించి నటించేటప్పుడు ఆరాజత్వాన్ని పోషించే సంభాషణ వగయిరాలు వాడడం తప్పదు. పిమ్మటగూడ అలాగే మాటలాడుతూవుంటే పరిహాసపాత్రుడు కావలసివస్తుంది. పూర్వపురాజులకాలంలో వున్నతపదవులలో నిమ్నజాతులకు అర్హతవున్నా నిల్పడమే తటస్థించేదికాదు. నిలిపినా మాటదక్కించుకోకపోతే——

(1) క. కనకపు సింహాసనమున
శునకము గూర్చుండ బెట్టి శుభలగ్నమునం
దొనరగ బట్టముగట్టిన
వెనుకటిగుణ మేలమాను వినురా సుమతీ.

(2) సీ. కుక్క నందలముపై గూర్చుండ బెట్టంగ
గూర్చుండునే తోళ్ళు గొఱుకుగాని

(3) తే. గీ. హేయమగు నెమ్మనొక్కిన నిందుగాని
యెందు శునకమ్మునకు నేయియిందుపెట్లు

యీలాటివెన్నో పూర్వకవులసూక్తులు పుట్టినట్లు కనపడతాయి. ప్రాచుర్యంగా వారివారిమాటలు సమన్వయ మవుతాయిగాని "తులసి వనంలో గంజాయిమొక్క" లాగున్నూ "గంజాయితోటలో తులసి మొక్క" లాగున్నూ ఉత్తమకులస్థులలో నీచోద్దేశంగల వ్యక్తిన్నీ, నీచ కులస్థులలో ఉత్తమోద్దేశంగల వ్యక్తిన్నీ సంభవించడం సత్యదూరంకాదు. అట్టిసందర్భంలో నిమ్నజాతిని గౌరవించడమున్నూ, అధికజాతిని అధఃక రించడమున్నూ అభినందనీయమే కాని డిగ్రీనిబట్టే ఆయాపదవుల నివ్వడం తటస్థిస్తూవుంటుంది కాని ఆయావ్యక్తుల వుద్దేశాలదాకా పరిశీలిం చడం తటస్థించదు. తటస్థించడానికి అవకాశమున్నూ కనపడదు. అయినా ఆకాలప్పట్టుదలలు యిప్పుడు యేకాలంలోను దృశ్యంకావడంలేదు. అవన్నీ కథలకింద చెప్పుకోవలసే కాలం వచ్చింది. కాని ఆకథలు విశ్వసించే మనుష్యులుకూడా లేనే లేరేమో? ఒక బ్రాహ్మడు తనకొడుకుని "చదువు కోకపోతే గాడిదెలను కాసుకొస్తావా?" అని మందలిస్తే గాడిదెలయజ మాని తనకొడుకుని "గాడిదెలను కాయవుకదా బ్రామ్మల్లాగ యేదం చదువుకుంటావా?" అని మందలించినట్లు చెప్పుకుంటారు. యీసందర్భా లన్నీ వాళ్ళవాళ్ళ వృత్తులు యేలాటివైనా జనులు వాట్లయందే అభిమానం మెండుగా గలిగివుండేవారని బోధిస్తాయి. కొందఱు గాయకులు తమ సంతా నానికి గానవిద్యాభ్యాసము చేయక అన్యవిద్యాభ్యాసమే పట్టుదలగా చేయిం

చినా తుదకు వారివారిపిల్లలు గానంలోనే ప్రజ్ఞాశాలులై పేరుప్రతిష్ఠలు సంపాదించడం అనుభూతంగా కనబడుతూవుంది. అయితే యీగానవిద్య వారికి కులవిద్యమాత్రం కాదుకాని తండ్రులు దానిలో చాలాకృషిచేసిన వారు. యీగానంమాత్రం కొడుకులకేకాక కూతుళ్ళకుకూడా అప్రయత్నంగా రావడం అనుభూతంగా కనబడుతుంది. కవిత్వం వారివారి సంతానాలకు అంటడం దృశ్యాదృశ్యం. పాండిత్యం కొంతప్రయత్నిస్తే వారివారి సంతానానికి కూడా అంటడం కలదు, కాని కవిత్వంమాత్రం అట్టిదికాదు. గానంగాని కవిత్వంగాని యివి కులవిద్యలుగా భావించవలసి వుండదు. ఈరెండు విద్యలున్నూ నానాజాతుల్లో పూర్వకాలంనుంచిన్నీ కనబడుతూ వున్నాయి. యితరవిద్యలమాటకేంగాని యింగిలీషు యేజాతికైనాసరే అభ్యాసంవల్ల లభించేటట్టు కనబడుతూవుంది వేదశాస్త్రాలుమాత్రం ద్విజేతరులకు యెంతప్రయత్నించినా వాట్ల స్వస్వరూపాన్ని ప్రకటిస్తూవున్నట్టు లేదు. ద్విజులనగా బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు. యీమూడుజాతులలోను మొదటిజాతివారిలో వేదశాస్త్రాలు అభ్యసించదగ్గవ్యక్తులు నూటికి అధమం యేభైమందేనా కనపడతారు. క్షత్రియులలో నూటికి అయిదుగురుకూడా దొరకడం కష్టసాధ్యం. వైశ్యులలో ప్రస్తుతం వుత్సాహం విస్తరించి కనపడుతూవుంది గాని తీరా అభ్యసించవలసివస్తే ప్రారంభించిన విద్యార్థులలో నూటికి సుస్వరంగా రాదగ్గవ్యక్తులు యెందరువుంటారో పరీక్షించి చూచినప్పిమ్మటగాని నిర్ణయించడం దుర్ఘటం. వేదానికి స్వరనియమం చాలాబాధకంగా కనబడుతూంది. యిప్పుడు దానికోసం వుత్సాహపడేవారు ఆనియమాన్ని తొలగించినట్టే భావించవలసివుంది. వారు కొన్నినియమాలు వుల్లంఘిస్తేనేకాని దాన్ని అభ్యసించడమే పొసగదుకదా ? వాట్లతోపాటు స్వరాదినియమాలుకూడా అతిక్రమిస్తేమాత్రం తప్పేమి ? యీలా సరిపెట్టుకుంటేతప్ప ద్విజేతరులు లేదా బ్రాహ్మణేతరులు వేదాభ్యాసానికి తగివుండరు. తగడంమాట దేవుడెరుగును. ఆవేదం యెనభైరెండుపన్నాలున్నూ (సుస్వరం అక్కరలేదు.) అపస్వరంతోనైనా వల్లించే దెవరు ?

యింకా యిప్పటికీ యేపిచ్చిబ్రాహ్మలో కొందఱు వర్లిస్తూవున్నారు. అట్టి వారిని స్వకులస్థులలో పెద్దపెద్దపదవులలో నున్నవారు ఆదరిస్తే బాగుం డును కాని క్వాచిత్కంగా తప్ప అట్టిఆదరణ కనపడదు. ఆదరణలేదు సరికదా ? పైగా కొందఱు వీరిని తిడతారు. ఎందుచేత ? నూతనసంస్కా రాలకేమో వీళ్ళు ప్రతిబంధకులని ఆలాతిట్టేవారి ఆశయం. మొత్తం కులాభిమానం బ్రాహ్మణజాతిలో కనపడదు. తక్కినజాతుల్లోమాత్రం సవ్యాపసవ్యవిచారం ఉందోలేదోగాని పెచ్చుపెరుగుతూవుంది. మళ్ళా కులభేదం పనికిరాదంటూ ఒకమూలనుంచి సంస్కారుల వుపన్యాసాలు. ఇదంతాచూస్తే గవడగొయ్యగా కనపడుతుంది. యెప్పుడుకూడా కులం వొక్కంటికి వొకరో ఇద్దరో (నిమ్నజాతుల్లో) అగ్రజాతిశీలం కలవాళ్ళు పూర్వజన్మవాసనావశంవల్ల వుంటూనే వచ్చారు. అట్టివారు తమజాతిని యావత్తూ తమవంటిదాన్నిగా చేయాలని ప్రయత్నించినట్టుగాని కులమర్యా దను అతిక్రమించి వర్తించినట్టుగాని గ్రంథాధారం కనపడదు. యిందుకు విదురాదులు వుదాహరణం. అట్టివారు ఆమోదించకపోయినా అగ్రజాతుల్లో సామాన్యులమాటకేమి కొమ్ములుతిరిగిన మహామహోపాధ్యాయులు కూడా వారికి నమస్కరిస్తారు. కృష్ణుడు జాత్యా క్షత్రియుడు. పెంపకపురీత్యా గొల్ల. ఈరెండుహేతువులున్నూ నమస్కారార్హతను అంటే ? బ్రహ్మర్షులు నమస్కరించే అర్హతను కలిగించేవికావు. ఆయనయందువున్న భగవత్క ళకు దాసానుదాసులై బ్రహ్మర్షులు నమస్కరించి సేవించారు. ఆయన తన పెంపుడు తల్లిదండ్రుల జాతికివున్న కులాచారాలను సంస్కరించడానికి ప్రయత్నించినట్టు లేదు. నిజంగా ఆ శ్రీకృష్ణుడే పూనుకుంటే ఆగొల్లలు ఇప్పుడు అన్నివర్ణాలవారికీ శిరోభాగాన్ని అధిష్ఠించేవారు. యెంతో జారు డుగా ఆయన వర్తించినా ఆజారత్వం అంతా పెంపుడుమాతా పితలకు సంబంధించిన జాతియందే. వివాహమేమో ? యెందరిని పెళ్ళిచేసుకున్నా పుట్టినజాతిలోనే. ఆయన కులమర్యాదను అతిక్రమించేయెడల యెందరు బ్రాహ్మణకన్యకలనేనా పెళ్ళాడియుండును. ఆలా పెండ్లాడకపోవడాని

క్కారణం ధర్మసేతూల్లంఘనానికి యిష్టపడకపోవడమే. యీమధ్య వక సంస్కారిమిత్రుడు తనకుమారునికి పెండ్లిచేసుకోవడానికి బ్రాహ్మణ కన్యకేనా సరే పనికివస్తుం దన్నాడు. నేనన్నానుగదా? నీవు నూత్న సంస్కారాభిలాషివిగదా? నీకన్న తక్కువజాతి కన్యక పనికిరాదా? అన్నాను. దానికేవో సాకులుకొన్ని చెప్పి నిషేధించా డాయన. ఆయన బ్రాహ్మణేతరుడే కాని ద్విజుడే. ఈలా వున్నాయి యిప్పటి సంస్కారాలు. చాతుర్వర్ణ్యంలోనల్లా యిప్పటికింకా ధర్మసేతూల్లంఘనానికి జంకుతూ వున్నది కాపుజాతిగా కనబడుతుంది. ఆమధ్య మహదైశ్వర్య సంపన్నులైన కాపులు వకపిల్లను తమపిల్లవానికి నాద్వారాగానే సత్కుటుంబంలోన్నుంచి పెళ్ళిచేసుకున్నారు. పిల్లనిచ్చినవారూ సంపన్నులే కాని పుచ్చుకొన్నవారిదృష్ట్యా యెన్నోవంతు భాగ్యవంతులున్నూ కారు. యీపిల్ల గుణగణాలు చూచి అత్తగారు మురిసిపోయి యీపిల్ల చెల్లెలినే రెండో కొడుక్కి జేసుకోవాలని ముచ్చటపడింది. అక్కడక్కడ అప్పచెల్లెళ్ళను అన్నదమ్ములు చేసుకుంటున్నారని గొప్పమర్యాదకుటుంబాలు దృష్టాంతాలు చూపి ఆపె కబురుచేసింది కూడాను. నాకున్నూ ఆవలికుటుంబానికిన్నీ యెక్కువ చుట్టరికం వుంది. నాపెళ్ళి ఆకుటుంబంవారే అత్తవారుగావుండి చేసారు. నాభార్యను ఆ కుటుంబంవారు తోబుట్టువుగా చూసేవారు. నన్ను బావగారూ అనే యిప్పటికీ పిలుస్తారు ఆ అన్నదమ్ములందరూ. యిట్టి సంబంధంవల్లఆకాపులకోరిక నిరాకరించలేక నేనుకూడా ఆవలివారి కనుకూలించే మాటలే చెప్పవలసివచ్చింది. యెందరెన్నిచెప్పినాసరే ససేమిరా అన్నారు కన్యాదాతృ కుటుంబంవారు. తుదకేలాగేనాసరే యీకన్యకనే చేసుకోవాలనే కోరికతోవున్న ఆమహదైశ్వర్య సంపన్నులు ఆపిల్లవాణ్ణి వేరొకరికి యిందుకోసమని దత్తుడుగచేసి కార్యసానుకూలం చేసుకుంటూవున్నారు. చతుర్థులలో యెందరో యీలాటివారున్నా యేకొందరో ధర్మసేతూల్లంఘనానికి ఆమోదించినంతలో వారినే యెత్తుకొని పత్రికలు కోలాహలం చేస్తాయి. యిటున్నసూర్యు డటుపొడిచినా అసిధారావ్రతంగా సంచరించే

వాళ్ళు ధర్మోల్లంఘనం చేయరు. యీలాటి పెళ్ళిళ్ళు యెన్నో జమీందారు లలో జరిగివున్నాయి. ఆడపిల్లను దత్తతయిచ్చి కార్యం జరిగించారని చెప్పాను నేను. ఆకన్యక ముత్తవ్వ అందికదా? "శాస్త్రుల్లుగారూ! ఆడ పిల్లకు దత్తతేమి?" అంది. సిగ్గుపడి వూరుకున్నాను. ఐశ్వర్యాన్నే ప్రధానంచేసుకుంటే ఆవలివారు వల్లమాలిన సంపన్నులవడంచేత అడిగిందే చాలు అని పెళ్ళిచేయవలసిందే. యేకొందరో ధర్మసేతూల్లంఘనాన్ని ద్రవ్యానికిన్నీ యిహసౌఖ్యానికిన్నీ లోబడిచేసినా యింకా కొంత కాలం దాకా చాలామంది ఆసదాచారాలకు లోబడేవాళ్ళుంటారని తోస్తుంది. అటువంటివాళ్ళనే కాళిదాసాదులు "మానధను" లంటూ వారివారి గ్రంథాలలో వాడుతూవచ్చేరు. అట్టిమానానికి యిప్పుడంతగా గౌరవం లేదుగాని అస్థానాన్ని దేశాభిమానపదం వచ్చి ఆక్రమించింది. దేశాభి మానంకూడా కులాభిమానం వంటిదే. సంశయం లేదుగాని యిది వచ్చి దాన్ని "తోసిరా" జనడంమాత్రం శోచనీయం కాకపోదు. యిప్పుడు కొన్నిజాతులు వారివారివృత్తులు వదులుకోవడంలో కూడా వొకవిధమైన అభిమానానికి స్ఫోరకమేకాని అది సర్వేసర్వత్ర సంఘటించేది కాకపోవ డంచేత అపహాస్యాస్పదం కాకతప్పదు. ఆలా వదులుకున్న కుటుంబాలు యేవకటి రెండుతరాలో జఋపుకున్నప్పటికీ మళ్ళా అవసరం పట్టడంతో టట్టే "పూర్వేతిపూర్వా" అని పూర్వవృత్తిలోకి దిగుతాయి. అప్పుడెవ రేనా వారిని ప్రశ్నిస్తే చెప్పేజవాబు "కులవృత్తికి సాటిరాదు గువ్వల చెన్నా?" అనేదే అని నాకు తోస్తుంది. ఖండాంతరాలలో కులక్రమాగత వృత్తులనేవి లేవని చెప్పగా వినడం. తండ్రి గవర్నరుగావుంటే కొడుకు చెప్పులుకుట్టుకుంటూ వుండడంకూడా కలదని పలువురు ఆయాదేశవిశేషాలు ప్రత్యక్షంగా చూచివచ్చినవారు చెపుతారు. యిది సత్యదూరంకాదు. కాని మనదేశంలో యింతవ్యత్యాసాలు పూర్వంవున్నట్టు లేకపోయినా తండ్రి మహావిద్వాంసుడుగా వుంటే కొడుకు వంటబ్రాహ్మడుగావున్న యితిహా సాలు కనపడతాయి. మచ్చుకొకటి ఉదాహరిస్తాను. వక బ్రాహ్మణుడు

ఁహావిద్వాంసుడై లోకాతీతమైన యశస్సు గణించేడు. ఆయన నిరాడం రమైన వర్తనకలిగి ఋషిచర్యతో యేమహారాజులనున్నూ చూడక మీకొంచెమో పూర్వార్జితవృత్తివుంటే దానిలోపండే తనుమాత్రం ధాన్యం గోటిన్నీ, అందులోనేవున్న చింతచెట్టు ఇచ్చే చింతపండుతోటిన్నీ, దొడ్లో వేసి పెంచుకొన్న కూరగాయలతోటిన్నీ, "తదన్నం తద్రసం" అనే అభియుక్తోక్తికి ప్రథమలక్ష్యమై కాలక్షేపం చేస్తూవుండగా శ్రీ పెద్దాపుర సంస్థానాధిపతి ఆమహాపండితుణ్ణి దర్శించడానికి స్వయంగా రావడం తట స్థించింది. అప్పుడు ఆయన చేస్తూవున్న పనేమిటంటే? దొడ్లో కూరల పాదుల్లో గొప్పు తవ్వుకుంటూ శిష్యులకు పాఠం చెపుతూవున్నారు. దానికి తగ్గ పుట్టగోచి వగయిరా వేషంతోవున్న ఆమహావిద్వాంసుణ్ణి సందర్శించి ఆమహారాజు తనజన్మకృతార్థంగా భావించి "శ్లో. అద్యమే సఫలం జన్మ భవత్పాదాభివన్దనాత్" అంటూ నమస్కరించి ఆయన ఆశీర్వచనాన్ని పొంది కొంతసేపు తత్కాలోచిత ప్రసంగంతో కాలక్షేపంచేసి ఆయనకే దేనా భూరూపకమైన దానంచేసి తరిద్దామనే వుద్దేశంతో రాజుగారు ఆప్ర సంగంతెస్తే ఆపండితుడు దాన్ని నిరాకరించడం జరిగింది. యెందుకు నిరాకరించాలని పలువురు ప్రశ్నిస్తారు. బ్రాహ్మణులలో "నప్రతిగృహీ తృత్వం" అనేది యెక్కువ గుణంగా పలుచోట్ల ప్రశంసించబడి వున్నది. ఆగుణాన్ని కాపాడుకోవడానికి మనభారతీయవిద్వాంసులు పలువురు పలు కష్టాలు పడుతూవచ్చారు. కొలదికాలంనాడు గణేశ్వరశాస్త్రి, సుబ్రహ్మణ్య శాస్త్రి అను భూలోకబ్రాహ్మలు తరుచు శుష్కోపవాసాలతోడనే కాలం గడపినట్లు మా పరమగురువులు చెప్పగా విన్నాను. త్యాగరాయలవా జీవితంగూడా యిట్టిదే. "నిధి చాలసుఖమా? రాముని సన్నిధి చా సుఖమా?" అనే కృతివల్ల పైసంగతి తెలుతుంది. వేదాంతదేశికులవా వకమహారాజుకు వ్రాసి పంపిన శ్లోకపంచకంవల్లకూడా నాటిపండితు ప్రవర్తన కొంత బోధపడుతుంది. ఆశ్లోకాలు కొన్నిమాత్రం వుదాహ రిస్తాను—

"శ్లో. కాచాయ నీచం కమనీయవాచా
మోచాఫల స్వాదుముచా నయాచే
స్థితేకుచేలే శ్రితహూకుచేలే
దయాకుచేలే ధనదత్కుచేలే. ॥1॥

శరీరపతనావధి ప్రభునిషేవణా పాదనాద
భింధనధనంజయప్రశమదం ధనం దంధనమ్
ధనంజయ వివర్ధనం ధనముదూఢగోవర్ధనం
సుసాధనమబాధనం సుమనసాం సమారాధనమ్. ॥2॥

సిలం కిమనలం భవేదనలమౌదరం బాధితుం పయః
ప్రసృతిపూరకం కిము న ధారకం సారసమ్
అయత్నమలమల్లకం కిము పటుచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధా హ్యాహాకుక్షితః కుక్షితః" ॥3॥

ఆయీ వేదాంతదేశికులవారి శ్లోకాలు కఠినశైలిలో వుండడంచేత సుళువుగా అర్థం కావు. ఇందులోవున్న తాత్పర్యం యేదోవిధంగా ఉదర పోషణ చేసుకుంటూ భగవదారాధన ప్రధానంగా కాలక్షేపం చేసుకోవడమే విద్వాంసులకు కర్తవ్యంగాని రాజులనాశ్రయించి ధనసంపన్నులు కావాలనే కోరిక యుక్తమయింది కాదని తేలుతుంది. ప్రస్తుతం పెద్దాపురంరాజుగారు స్వయంగా తనయింటికివచ్చి కోరుకోవలసిందంటే? నిరాకరించడాని క్కారణం పైశ్లోకాల తాత్పర్యంవల్ల గతార్థమయింది. కనక విస్తరించేది లేదు. ఆయన నప్రతిగృహీతకనక రాజువచ్చి యిస్తానన్నాడు కాని ఆకాస్తమర్యాద యేకొంతో పరిగ్రహించేక వుండదుకదా? ఆయీపండి తుణ్ణి మనస్సులో పెట్టుకుని య్యేవే నేను కొన్నిపద్యాలు వ్రాసివున్నాను. అవి అన్యత్ర అచ్చయి వున్నాయి. అందులోదే వకటి యిక్కడ వుదాహరిస్తాను.

ఉ. రాజరుదెంచునప్పటి కరంటులతోటకు గొప్పద్రవ్వు త
మ్మాజనపాలుడోజగని "ఆర్య కృతార్థుడనైతి మీకున్వ
ర్యాజము లెక్కలేదయిన భూమియు ద్రవ్యము స్వీకరించి మా
తేజము నిల్పు" డన్న గణుతింపని సూరుల నాశ్రయించెదన్.

యిప్పటి బ్రాహ్మణులు అప్పటి ఋషులుకాకుంటె కాకపోతారు గాక ఆఋషులవంశస్థులేనా కాకపోరుగదా? అయితే యెందుకు వీరి కీఅధికారవాంఛ? అధికారం దొఱికిందనే సంతోషమేకాని అసలు తమ కున్న ప్రధానాంశము మట్టికొట్టుకుపోతూందనే విచారం వకరిక్కాకపోతే మఱివకరికేనా వున్నట్టు కనపడ దదేంకర్మమో? పోనీ యీఅధికారానికి వచ్చే ముఖ్యఫలితం యెన్నివిధాల చూచినా దుర్గతితప్ప వేఱొకటి వున్నట్టు కనపడదుకదా? "అధికారాంతము నందు జూడవలదా? ఆయయ్య సౌభాగ్యముల్" అనేది ఐహికవిషయమనుకున్నా "రాజ్యాన్తే నరకం ధ్రువం" అనేది అట్టిదికాదుకదా? యింతోటి భాగ్యానికి కులాన్ని కాదని శీలాన్నికాదని పరిశ్రమచేయడం యెందుకోకదా? మహాపండిత వంశస్థులైన బ్రాహ్మణులు అధికారంఅంటూ చేతికివచ్చాక యెంత అసి ధారావ్రతంగా వర్తించినప్పటికీ యెందఱినో (సహేతుకంగాకాదు అహేతు కంగానే) సాధువులను (బుద్ధిపూర్వకంగాకాదు యాదృచ్ఛికంగానే) యేడ్పించవలసివస్తుంది. "సాధుసజ్జనసంతాపః కిమాశ్చర్యం కులక్షయమ్" దీనికోసం పెద్దప్రయత్నం కూడా యెందుకో? అనిపిస్తుంది. బ్రాహ్మణ ద్వేషం ప్రబలింది ప్రపంచకంలో అంటూ అంటారు. నిజమైన బ్రాహ్మణు లంటూవుంటే ద్వేషం యెందుకు కలిగేది?

శ్లో. వారాం శ్రీనఖిషణ్వతే వివధతే వన్యాశ్శరీరస్థితి
రైణేయ్యాం త్వచి సంవిశన్తి వసతే చాపి త్వచస్తారవీః
తత్పశ్యన్తి చ ధామనాభిపతతో యచ్చార్మణే చక్షుషి
ధన్యా వీతరజస్తమా భగవతీ చర్యేయమాహ్లాదతే.

యీరీతిగా పూర్వపుబ్రాహ్మణులనుగూర్చిన వర్ణనలు కనపడతాయి. యివి అసత్యములేమో యనుకుంటే నిన్న మొన్నటిదాకా అధమం యిప్పుడు కూడా వీట్లవాసన కొంచెంగా వున్నవారు కనపడతారు. కాని యిప్పుడు వారిని మనుష్యులుగాకూడా పరిగణించేవారు బొత్తిగా కనపడరు. పైశ్లోకములోవున్న అర్థం సుగమంగాలేని కారణంచేత కొంచెంతాత్పర్యం వ్రాస్తాను. రోజుకు మూడుమాట్లు స్నానంచేసుకుంటూ కందమూలాదులతో శరీరపోషణం నిర్వర్తించుకుంటూ లేడిచర్మాలమీద కూర్చుండి (జపతపాలతో) కాలక్షేపంచేసుకుంటూ (ఆచర్మాలే వస్త్రాలుగా వాడుకుంటూ) లేదా చెట్లతాలూకు పట్టలుబట్టలుగా వాడుకుంటూ చర్మదృష్టికి గోచరించని పరమాత్మను యోగదృష్టచేత దర్శిస్తూ పూర్వపుబ్రాహ్మణులు వర్తించేవారు. ఐశ్వర్యాన్ని అభిలషించడం యెప్పుడయితే ఆరంభమయినదో అప్పటినుంచీ అట్టి స్వతంత్రజీవనం నశించి బ్రతుకంతా పరాధీనమయిపోయింది. పోనీ! అదేనా తుదనెగ్గిందేమోఅంటే ఆఖరికి అదీ లేకపోవలసివచ్చింది కొన్నాళ్ళనుంచి. యీకర్మం ప్రతిజాతికిన్నీ అంతోయింతో తటస్థించిందికాని బ్రాహ్మణజాతికి మఱీ తటస్థించింది. "కహా జాతే బొమ్మన్" అని ప్రశ్నిస్తే "ఉత్తమే శిఖరే జాతే" అని జవాబుచెప్పే రోజుల్లో బ్రాహ్మణజాతికి యింతటిదుర్దశ పట్టినట్టులేదు. యిప్పుడు ఆవలి ప్రశ్న యేభాషలోవుందో ఆభాషలోనే జవాబుచెప్పేశక్తి కలిగిందనే సంతోషంతప్ప అన్యం కనపడడంలేదు. వేదశాస్త్రపురాణాలేమో యెంత పరిశీలించినా మానవజన్మ అన్నిజన్మాలకంటె తరించడానికి ముఖ్యసాధనమని చెపుతాయి. ప్రస్తుతం యీజన్మయెత్తడం మరింత అధోగతికి మూలంగా కనపడేకాలం వచ్చిపట్టుకుంది. పూర్వం యెవడేనా అప్పుపుచ్చుకుంటే ఆవలివాడు వత్తిడిచేయకపోయినా పుచ్చుకున్నవాడు తీర్చేదాకా నిద్దరపోయేవాడు కాడు. యిప్పుడో? దాన్ని తలపెట్టనే తలపెట్టడు. సుఖంగా వుపేక్షిస్తాడు. యేదో ప్రళయం రాకపోతుందా? "సర్వరోగాలు మసూచకంతో గతార్థంకాకపోతాయా?" అని ధైర్యం. పూర్వం

దేవుడన్నా, దేవాలయమన్నా, దేవాలయాది ధర్మసంస్థలకుపుట్టిన సొత్తు లన్నా భయం, యిప్పుడో? నిర్భయం. గాయత్రీమంత్రజపాన్ని పూర్వం యితరులకు వినపడకుండా చేసుకోవడం ఆచారం. యిప్పుడో హరిజను లకు దాన్నివుపదేశిస్తేనే వారిని పండితులుగా గౌరవించడం. ఐహిష్మైన స్త్రీలువున్నచోట్ల వేదాధ్యయనానికి అధికారంలేదనిచెప్పిన ధర్మశాస్త్రాలే ద్విజేతరులకు వేదాధ్యయనాధికారాన్ని నిషేధిస్తూవున్నాయి. వారివారి స్త్రీల యెడలకూడా ఋషులు పక్షపాతులే యనుకోవాలి కాబోలును. కొన్నిభా గాలు బ్రాహ్మణులు తాముకాపురముండేగృహాలలో శిష్యులకు సంత చెప్పరు. పొలాలలోనో దేవాలయాలలోనో చెప్పుదురు. వాట్లనే ఆరణ్యా కములంటారు. సాధారణులవాడుకలో ఆరుణములనడం కూడా కలదు. యిన్నినియమాలతో చేయవలసిన వేదాధ్యయనానికి నేటిబ్రాహ్మణులు కొందరు తెచ్చిపెట్టిన దురవస్థ శోచ్యంకాదా? ప్రతీదానికి బ్రాహ్మలు పక్షపాతులనేదే జవాబాయె. సరే వృత్తులనుగూర్చివ్రాస్తూ యింతదూరం దాకా దేకడమయింది. బ్రాహ్మడికి యేవృత్తీ వున్నట్టు లేదు. "వడ్డించి నమ్మకు తెడ్డుదెబ్బ" అన్నట్టుఇంది. కాని అన్నివృత్తులకూ బ్రాహ్మలే ఆలాయపడ్డారు. మేడలు కట్టారు. బోర్లాపడ్డారు. అసలుపేరు నశించింది. కాని ఆపేరంటే మాత్రం జగత్తుకు పట్టరానికోపం మాత్రం యింకా పెచ్చుపెరుగుతూనే వుంది. యిప్పుడేనా మించింది లేదు. అందరూకాక పోతే కొందఱేనా పూర్వరీతికివస్తే బాగుండును. కాని అట్టిభాగ్యంపట్టే సూచన కనేపడడం లేదు. ఓహో మాచిన్నతనంలో కోనసీమకువెడితే యేలావుండేది?

"సీర్కావిదోవతుల్ నియతిగా ధరియించి
సవరించి పింజపింజలుఘటించి
నారికేళకటాసనములగూర్చుండి జం
దెపుసవరణల్ సలుపుకొంచు"

అంటూ మేము శ్రీవణానందంలో వ్రాసినవ్రాత అప్పటికాలపు బ్రాహ్మణాగ్రహారాలదే. నేడో? కొత్తనాగరికతవ్యాపించింది. "అహో పేరూరిదౌర్భాగ్యం" అనేశ్లోకం జ్ఞప్తికి రావలసివచ్చింది. పైగా సూచన లేలావున్నాయంటే? "యిదో మార్పుగాదు. యింకా ముందుంది ముసుళ్ళపండుగ" అన్నట్టున్నాయి. యిట్టిపరిశయంలో కులవృత్తులు నిలిచేటట్టులేదు. కులాలూ నిలిచేటట్టులేదు. మళ్ళా రాజకీయంగా జరిగే యేర్పాట్లేలా వున్నాయంటే బొత్తిగా అవినీతిపరులను నీతిలోకి తిప్పేటట్టున్నాయి. కాని నీతిపరులు అవినీతులుకాకుండా వుండడానికి లేశమూ కూడా ప్రయత్నం కనపడదు. పూర్వులు అసాధ్యములజోలికి వెళ్ళేవారు కారు. సాధ్యములకే యత్నించేవారు. ప్రస్తుతం అసాధ్యాలకే విజ్ఞులు యత్నిస్తూవున్నారు. సాధ్యాలు వదులుకుంటూ వున్నారు. బ్రాహ్మణులు జీవనార్థం యేదేనావృత్తిని అవలంబించినా యేకొంచెమో స్నానసంధ్యా వందనాద్యనుష్ఠానాలు కూడా చేసుకుంటూఉండాలని రాజకీయంగా శాసనం పెడితే అది సాధ్యంకాకపోతుందా? పోదుకాని దీన్ని శాసనసభలో ప్రవేశపెడితే అంతా నవ్వేస్థితిలోకి వచ్చివుంది యిప్పటి ప్రపంచం. యీలావ్రాసే నన్నున్నూ నవ్వుతుంది. నవ్వడానికేం. కులస్త్రీలు నాటక రంగాలున్నూ సినీమారంగాలున్నూ యెక్కడం అనుచితమనిన్నీ దానికిగా ప్రత్యేకించి యిదివరలోవున్నట్టే వకజాతివుండవలసిందే అనిన్నీ వ్రాస్తే యెందఱో నన్ను గేలిచేస్తూవున్నారు. అలాగే దీనికిన్నీ చేస్తారు. అంతతో జరిగేదేముంటుంది? మధ్యమధ్య యెన్నిఅవాంతరాలు వచ్చినా మంచీ చెడ్డా అనే విచక్షణతతో పనిలేకుండా అన్నివృత్తులూ యేదోవకమూల వుంటూనేవుంటాయి. అసలేరూపుమాసిపోవడమంటూ వుండనేవుండదు. ఆయీసందర్భం ప్రపంచచరిత్రవల్లనే ధ్రువపడుతుంది. తాగుడు, జూదం, వ్యభిచారం, దొంగతనం, అబద్ధపుసాక్ష్యాలు, లంచాలు, రోగాలు, పాములు తేళ్ళు, క్రూరమృగాలు యివన్నీ లోకానికి బాధకాలే. యివిలేకుండా చేయ డానికి యెప్పుడూ ప్రయత్నాలు జరుగుతూనేవున్నాయి. కొంతభాగం నశి

ష్టూనూ వున్నాయి. చేలల్లోకలుపులాగ మళ్ళా పెచ్చుపెరుగుతూనూ వున్నాయి. ఋణాలు కూడా యీతరగతిలోకే చేరతాయి. అబాధలేకుండా చేయడానికి యెవరితరం? సంసారికి మొట్టమొదట అప్పిచ్చేవారంటూ వుంటేనేకాని యేపనీ జఱగనేజరుగదని తెల్పడానికే అనుకుంటాను.

"క. అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగకపాఱు నేరును ద్విజుడుం
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ."

ఆనేపద్యంలో మొట్టమొదటే ఋణదాతను పూజించవలసివచ్చిందనుకుంటాను. అట్టి పరమోపకారిని యెంతేనా గౌరవంగా చూడవలసి వుంది. వారిలో కొందఱు కఠినులు లేరా? అంటే వుంటారు. దయాశాలులు మాత్రిం యెందఱు లేరు? వారినీ వీరినీ యేకరీతిగాచూడడం మాత్రిం ధర్మమా? యీసందర్భంలో యెందఱో నలిగిపోయారుపాపం! అసలుఅనుకొన్న పనేనా జరుగుతుందేమో? అంటే? అదిన్నీ సంశయాస్పదమే. యిది చేలోకలుపుతీతవంటిది. వరిమొక్కలు అట్టేపెట్టి తుంగ మొక్కలు పీకించేయడం కలుపుతీత అనిపించుకుంటుంది. వరిమొక్కలు పీకించి తుంగమొక్కలేనిల్పడం యేమనిపించుకుంటుందోకదా? యిది విషయాంతరం. దేన్నికాని మూలచ్ఛేదంచేయడానికి యెవరితరమూ కాదన్నది పరమార్థం. అట్టిస్థితిలోకూడా ప్రియత్నంచేయడం మానకూడదుగాని దానిలో సాధుబాధకు చోటివ్వకూడదు. యీకాలంలో ప్రతిసంస్కారంలోనూ సాధుబాధ అంతర్లీనంగా పూర్తిగాకనపడుతుంది. స్వకులాభివృద్ధికి కొందఱు పాటుపడుతూవున్నారు. సంతోషిద్దామంటే? దానినిండా పూర్వగ్రింథాలనీ గ్రింథకర్తలనీ దూషించడంతప్ప అన్యం కనపడదు.

"శ్లోకం త్వేకం పరిపఠతి యస్స స్వయం వ్యాస ఏవ" అన్నట్టుగా ఆమాత్రింఅక్షరాలు వచ్చీరాని స్థితిలో వున్నస్వకులస్థుణ్ణి పెద్దచేసి పొగడడంలో వ్యత్యాసం కనపడదుగాని యీదూషణ దానిలో వుండకపోతే

బాగుండును. పాండిత్యమనేది స్వకులస్థులుపదిమంది పోగయి పొగిడితే లభించేదికాదు. చిరకాలగురుశుశ్రూషాసాధ్యం. యీసంగతి యిప్పటి కులాభిమానులు లేశమున్నూ గమనిస్తూన్నట్టేలేదు. యేయితరవృత్తిలో వున్నవారికి గాని పాండిత్యం సాధ్యంకాదు. అందుకే దీన్నిసాధించతగ్గ వారు అనాదిగా యేవృత్తిన్నీలేని బ్రాహ్మణులు కావలసివచ్చింది. అట్టి రహస్యం తెలుసుకోక మనోదౌర్బల్యాన్ని పురస్కరించుకొని ఆయా విద్వాంసులను తూలుపాలుబట్టడం నిష్ప్రయోజనం. అలా తూలుపాలు బట్టే వ్యక్తికి నిజంగా అక్షరాలుకూడారావు. వచ్చిన అక్షరాలేనా యిప్పు డెవరిని దూషిస్తూవున్నాడో వారిపాదసేవవల్ల వచ్చినవే. తీరా సమయంవస్తే "టెంకాయపిచ్చికొండ" గా పరిణమించవలసిందేకాని అంతకన్న యెక్కువస్థితిలోవి కావు ఆఅక్షరాలు. అయితేయేమి ఆపాటి అక్షరజ్ఞానంతో యేదోపుస్తకమంటూ వ్రాయడం. అది యిహానికేకాక పరానికికూడా పూర్తిగా బాధకంగా వుండడం. అది యెవ్వరూ ఆమోదించకపోవడం. దానికి బోలెడు అడ్వర్టైజుమెంటు. దానిలో యెందఱెందఱో ఆమోదించి నట్లు వ్రాయడం. పనిపడితే ఆ ఆమోదించినవా రెవరున్నూ అందులో వుండే నిరపరాధి దూషణకు ఆమోదించేవారుగా వుండరని చెప్పనక్కర లేదు. కాలస్థితి యీలామారింది. అభిలాషేమో ఆత్మాభ్యుదయమందు. దానికోసంచేసే ప్రయత్నమంతా ఆత్మాధోగతికితప్ప లేశమూ వుపకరించేదిగా వుండకపోవడం; యిప్పటికులవృత్తిత్యాగాలవైఖరి యీలావుంది. యీ యిరవయ్యోశతాబ్దానికి పూర్వమే యీస్థితికొంత ఆరంభమయింది. కాని అది ఆరంభావస్థకనక యింతశోచ్యస్థితిలో వుండేదికాదు. క్రమ క్రమంగాముదిరి తుదకు యెవరిఆచారవ్యవహారాలు అనుకరించాలని అభిలషిస్తున్నారో వారినే పడదిట్టడందగ్గరికి వచ్చింది. అయితే వారో? యీతిట్టేవారి ఆచారవ్యవహారాలను అనుకరించడానికి ఆరంభించారు. యిక వీరికీవారికీ భేదం యెక్కడంటే? వొకరు దూషిస్తూ ఆయీపరి వర్తనలోకి దిగుతూన్నారు. వేఱొకరేమోభూషిస్తూ ఆయీ పరివర్తనలోకి

దిగుతూవున్నారు. యేలాగైతేయేమి ? నేటికాలానికి బ్రహ్మశ్రీ బిరుదం సర్వవర్ణాలవారికీ సామాన్యమైపోయింది. యెందుకు ఆకాకూడదు ? అందరూ ఆ బ్రహ్మసృష్టిలోవారేకదా.. అందుచేత ఆపదం ప్రియ మైనఆస్తివంటిదే అవుతుంది.

శ్లో. పుత్రా ఏవ పితుర్హారంతి హి ధనం ప్రేమ్ణా బలాద్వాపివా. అన్నాడు కుట్టికవి. అయితే యేకొన్నివ్యక్తులలోతప్ప యింకా యేవర్ణంలో కూడా యిట్టిపుత్పంథలోకి దేకినవి కనపడవుగాని పత్రికలలోవుండే కోలాహలం లోకాన్ని భ్రమింపజేస్తుంది. శాసనమూలకంగా పోయే కులాచారాలుతప్ప తదితరాలు యింకాకొంతకాలం వుంటాయనేతోస్తుంది. కుల వృత్తులో ? అవీ వుంటాయికాని యెలాగేనా యేకొంచెమో అవి తాఱుమాఱవుతాయి. అవుతాయేమిటి ? అవనేఅయాయి. యిదివఱలోకూడా యిలాటివి కాకపోయినా మఱోమాదిరివేనా కొన్నివిప్లవాలు వచ్చేవుంటాయి. అప్పుడే భగవదవతారాలుగా భావించబడే శంకరాదులు ఆవిర్భవించి సవరించడం జరుగుతూ వచ్చింది. అలాగే యీవిప్లవంకూడా యేఅవతారపురుషునివల్లనో సవరింపబడాలి. యితరఖండాలమాట చెప్పజాలనుగాని భరతఖండం యేకాలంలోగాని కులాచారధర్మాలు లేనిదిగా కన్పడదు. అలాయెప్పుడు కనపడవలసివస్తుందో అది దానికి ప్రళయ సూచకమే. పురాణాలవల్ల యీసందర్భమే తేలుతూవుంది. వాట్లయందు నమ్మకం లేనివాళ్ళు ప్రస్తుతంజరిగే అంకచండాలమంతా దేశానికి వున్నత స్థితినికలిగించేదని భావిస్తూవున్నారు. నమ్మకకలవాళ్ళో ? అధోగతిప్రతిపాదకంగా భావిస్తూ వున్నారు. పూర్వపుయుద్ధాలు పౌరుషప్రధానాలు. యిప్పటియుద్ధాలు కేవలమూ ధనార్జనమాత్రప్రధానాలు. వాట్లల్లో విధిలేక యెక్కడా ధర్మోల్లంఘనం కనపడినా చాలావఱకు ధర్మమే కనపడేది. యిప్పటియుద్ధాలలో ఆరంభించింది మొదలు ముగించేదాకా ధర్మవిరుద్ధమే కనపడుతుంది. దీన్నిభగవంతుడేనా యెన్నాళ్ళదాకా సహిస్తాడు. చూస్తాడు. చూస్తాడు. యేదోరీతిని సవరిస్తాడు. అప్పుడే అట్టి సూచనలుకొన్ని కన

పడుతూనేవున్నాయి. "తినబోతూ రుచులెందుకు ?" "మూన్నాళ్ళముచ్చట కింతరంజస్సెందుకు ?" "స్వధర్మే నిధనం శ్రేయః" అనే సూత్రాన్ని పట్టి చరిస్తూ వీలయినంతవరకు "కులవృత్తికి సాటిరాదు గువ్వలచెన్నా" అన్నమాదిరిని చరించడమే ప్రతివారికీ శ్రేయమనుకుంటాను. ముగిస్తాను.



## భగవదంశసంభూతుడు

( 1–10–1944 సం॥ర ఆంధ్రదైలీనుండి )

మహాత్మాగాంధీజీ - యీాయన్నిగురించి అర్థడాక్సు అంతగా అభినందించేవారు కారు కొంతకాలం; వారి తాత్పర్యం యీాయన నాస్తికుఁడు అనియ్యేవే. నేనుకూడా ఆ "డాక్సు" తెగలోవాణ్ణే అవడంచేత వారంత కాకపోయినా చాలా వరకు యీాయన కృత్యాలను ఆమోదించడానికి జంకేవాణ్ణేకాని యేమాత్రమో ఈయనయందు భగవదంశవుందనే అభిప్రాయం కలవాణ్ణి. కొంచెఁది యేళ్ళకిందట రచించిన పద్యాన్ని వుదాహరిస్తే నా అభిప్రాయం గోచరిస్తుంది.

శా. గాంధీగారు మహానుభావు లయినన్ గావచ్చుఁగా కెల్లరన్
బంధుల్ గాదలపోయుఁగాక అటు సంబంధమ్ములన్ జేయుఁగా
కంధుల్ నూర్వురుకూపమందుఁ బడినట్లు (తక్కినభాగం జ్ఞాపకం
వచ్చిందికాదు) దు
ర్గంధమ్మున్ కనిపెట్టకుండుటది యజ్ఞానంబు కామేశ్వరీ.

మొత్తంమీఁద గాంధీగారి మతం పూర్తిగా నాస్తికమూకాదు, ఆస్తికమూకాదు. ఆ యీా రెండిటికీ మధ్యగావుంటుంది. అస్పృశ్యతా సందర్భాన్నిగురించి ఆయన చేసే ప్రయత్నం వేదశాస్త్ర విశ్వాసంకల గృహస్థులకు యేదో మాదిరిగా వుంటుంది. అది యిప్పటికి పూర్తిగా నెగ్గినట్లూ లేదు. నెగ్గనట్లూ లేదు. ఆవిషయం యింతతో ఆపుదాం.

రామాదులను వినియెరుగని ఖండాతరులు కూడా గాంధీజీని ప్రేమి స్తారు. ఈయన మాహాత్మ్యానికి యీవొక్క వుదాహరణమే చాలునను కుంటాను. రాముఁడు లోకానికి పరమోపకారంచేసి లోకపూజ్యుఁడైనట్లు గ్రంథాలవల్ల గోచరిస్తుంది. కాని అందులో స్వార్థం కొంతలేకపోలేదు. గాంధీగారుచేసే మహాకార్యాలలో యెంతపరిశీలించినా స్వార్థం లేశమూ కనపడదు. కేవలం పరులనిమిత్తమే ఆయీ మహాత్ముని పుట్టుక. రాముఁడు భగవదంశగా తన్నుగుఱితించకపోయినా మహాఋషులందఱూ పట్టాభిషేకానంతరంవచ్చి చేసిన ప్రసంగంలో నీవు శ్రీ మహావిష్ణువు యొక్క అవతారమని చెప్పి ఆయనచే వొప్పించినట్లే భవిష్యచ్చరిత్రకారు లున్నూ యీయన్ని వొప్పిస్తారు. జీవితకాలంలోనైతే ఆయన్ని వొప్పించ డానికి కష్టంగాని పిమ్మటనైతే పండితుల కట్టికష్టం వుండదు. శ్లో. "ఏతే సత్పురుషాః పరార్థఘటకాస్స్వార్థాన్ పరిత్యజ్యయే" అనే భర్తృహరి శ్లోక పాదానికి యింతటి చక్కని వుదాహరణం లేనేలేదంటే కాదనేవారుండరు. సామాన్యసంసారులు యీయన మార్గాన్ని అనుసరించడం దుర్ఘటం. "చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషా మమ" అని ఆదిశంకరులు, శ్రీరామానుజులు కూడా యింతకు యీవిషయంలో తక్కువ ఔదార్యాన్ని చూపినవారు కారు. వీరిని అనుయాయులైన గృహస్థులు మాత్రం అనుసరించలేకపోయారు. ప్రస్తుతం గాంధీగారి సిద్ధాంతాలవిష యంకూడా అదే స్థితిలోవుంది. కొందఱు అనుయాయులు చాలావఱకు ఆచరణలో పెడుతూవున్నవారున్నారు. కొందఱో? వస్త్రధారణమాత్రం లోనే వున్నట్టు కనపడతారు, ఆయనభావాలు చాలా ఉదారంగా వుంటాయి, అవి అనేకులకు అందుఁబాటులో వుండవు.

రామానుజులవారు మేలుకోట (తిరునారాయణపురం) లో చూపిన ఔదార్యం గమనిస్తే, అస్పృశ్యతావిషయంలో మనమతాచార్యులుకూడా ఒకమెట్టు కిందకి దిగినట్లే తోస్తుంది. ఐతే ఆకాలానికి ఆమాత్రం ఆచా రాన్ని సడలించడమే గొప్ప. యావత్తు దేవాలయమూ సంవత్సరానికి

మూడురోజులు అస్పృశ్యులకు యధేష్టంగా వదిలిపెట్టడమంటే మాటలా? యేదేనా ప్రమాదంగా తటస్థించిన అపవిత్రతకు ప్రాయశ్చిత్తాలు వుంటాయి కాని బుద్ధిపూర్వకాలకు వుండవుగదా? మతాచార్యులనేవారు కర్తుమకర్తు మన్యథాకర్తుంచ సమర్థులు కావడంచేత అట్టి అధికారాన్ని అస్పృశ్యులకు యివ్వఁగలిగారు. ఇప్పుడట్టి అధికారాన్ని మనవారు యిచ్చినా వారు సంతుష్టి పడరు. యెందుచేతంటే "నన్ను ముట్టుకోకు నామాలకాకీ" అనేమార్గం ఆలాగే నిలిచివుందికదా! అందుచేత మహాత్ముఁడు ఆమార్గాన్ని అవలంబించలేదు. భగవంతుఁడికి మీరూ బిడ్డలే కనక తండ్రిని సేవించుకోడానికి అందఱికీ సమానమైనహక్కు వుండవలసిందే అనే భావాన్ని వ్యక్తీకరించాఁడు. కర్మఠులకు యీభావం రుచించకపోదు. యేదో వొక వుపనిషత్తు (వజ్రసూచి) యీమార్గానికీ తోడ్పడుతుంది. యింకొకటిఁ వేదాలు అపౌరుషేయాలు గా నమ్మేవారికిఁ గాని అన్యులకు యేచిక్కూలేదు. మహాత్ముఁడు వేదం అనాది అనే మీమాంసకమతాన్ని విశ్వసిస్తాఁడని తోఁచదు. వర్ణాశ్రమాచారాదులు కారణాంతరంచేత నామమాత్రావశిష్టాలుగా వున్న యీరోజుల్లో శాస్త్రీయమే అయినా అస్పృశ్యత్వం వదిలితే వచ్చే మహాదోషమేమిటి; యిపుడు యుద్ధపు సర్వీసులో సర్వవర్ణాలవారు చేరుతూవున్నారు. వీరందఱికీ యిక్కడ ట్రయినింగుకాలంలో భోజనాలు కులవివక్షతతో సంబంధించి వుండడానికి వీలువుందా? మాటవరసకి కొంచెంసేపు ట్రయినింగుకాలంలో మట్టుకివుందే అనుకుందాం. పిమ్మట యుద్ధరంగంలో పనిచేసే టప్పుడేనా, సర్వం జగన్నాథంగా యేకీభవించడం తప్పదుకదా? యుద్ధానంతరం ఆ యా యువకులకు మన అర్థడాక్సు పార్టీవారు ప్రాయశ్చిత్తాలు విధిస్తే వారు ఆమోదిస్తారా? రైలెక్కి కొంత ప్రయాణం చేసినందుకు ప్రాయశ్చిత్తం చేసుకొన్న సదాచారపరులను (జమీందారులను సుమండీ) నేను యెఱుఁగుదును. క్రమంగా అవన్నీ మాటిపోయాయి. 20 యేళ్ళు వయస్సుకల పెళ్ళికూఁతురు కావాలంటే దొరికే కాలం బ్రాహ్మణులకే కనపడుతూ వుంది. యిట్టి కాలప్రవాహంలో

మహాత్ముఁడు అస్పృశ్యత్వం గమనించవలసింది కాదు అనడం తప్పుగా తోఁచదు. యిదికాక మన పురాణాలు కృతయుగం రావడానికి పూర్వరంగంగా యిట్టి కాలం రాఁబోతుందని చెపుతూనే వున్నాయి. యెవరేనా సదాచారపరులు యీ మహావిలయంలో చిక్కకుండా వుంటామంటే వారిని గాంధీగారి వుద్యమం బలవంత పెట్టదు. దేవాలయం పరమపవిత్రస్థలం కదా అంటే..........................................................................

"గర్వంబున్‌గని యొడ్లనెంచకుఁడిదే కార్యంబు గాకుండెడిన్"

యిదిన్నీకాక, చుట్టూ మాగాణి వ్యవసాయంలో మధ్యభాగంలో యే రెండెకరాలో మెరక వ్యవసాయం లాగ పూర్వాచారుల సదాచారం నిలవడమూ కష్టమే. అయితేమాత్రం గత్యంతరం లేనప్పు డేంచేసేది? దీనికి నిమిత్తమాత్రం గాంధీ వుద్యమం గాని అసలు మార్పు కాలంలోనే వుంది. దాన్ని అనుసరించి మహాత్ముల అభిప్రాయాలు ప్రసరిస్తూ వుంటాయి. అట్టి మహాత్ములు శ్లో. బుద్ధఃక్రిస్తుర్మహాత్మశ్చ । శంకరాద్యా మహర్షయః. వీరందరూ శకపురుషులు, వీరి వీరి అభిప్రాయాలకు యేవో వేదాలూ వేదతుల్యాలూ ఆధారంగా వుంటాయి. లేనిచోటనో "మీమాటలు మంత్రంబులు," అన్నమాదిరిని వారి వాక్యాలే ఆధారంగా పెట్టుకోవాలి. స్వార్థపరులుగాని వారి వాక్యాలకు వేదాలతోపాటు గౌరవం కనపడుతుంది. గాంధీ మన పూర్వాచార్యులవలె వేదశాస్త్ర వ్యాసంగం చేసినవాఁడు కాకపోయినా వాట్ల సారాంశం గ్రహింపనివాఁడు కాఁడు.

శ్లో. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
తావాంత్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్యవిజానతః. (గీతచూ)

భగవద్గీత మహాత్మునికి కంఠోపాఠం అందులో భావాలు ఆయనకు హృత్కవిలి. యిహలోకంలో యెంత గౌరవంవుందో అంత గౌరవమూ పరలోకంలోకూడా వుండితీరుతుందని నాదృఢనమ్మకం. పెద్దపెద్ద యోగీశ్వరులయందుండే మహాలక్షణాలు ఆయనయందు గోచరిస్తూన్నాయి.

శ్లో. సమశ్శత్రౌచ మిత్రేచతథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః.

శ్లో. తుల్యానిందాస్తుతిర్మౌని.... అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనోగతవ్యధః....
యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతేచయః అలమతివిస్తరేణ.

ఆయీ శ్లోకార్థమే కాదు, ఆయీ ద్వాదశాధ్యాయం యావత్తూ గాంధియందు సమన్వాయిస్తుంది. ఆయన భగవంతునికి ఆంతరంగిక భక్తుఁడు, శక్తుడు, విరక్తుఁడు, జీవన్ముక్తుఁడు.

---

# వైఖానసులా - వైష్ణవులా

( 19—5—1948 సం॥ర ఆంధ్రవీక్లీపత్రిక నుండి )

యీరెండు తెగలవారికీ యేవిధమైన సంబంధమున్నా లేకపోయినా, బొట్టునుబట్టి వీరూ వారూ వొకటేశాఖకు చెందినవారని సామాన్యులు భ్రమిస్తారు. వైష్ణవులకు రామానుజులు గురువులు. వైఖానసులకు గురుపీఠమంటూలేనేలేదు. వారుస్వయంగురువులు. విఖనస్సు అనేఋషిసూత్రాన్నిపట్టి వీరుశ్రౌతస్మార్తాదికర్మకలాపాన్ని నిర్వర్తించుకుంటారు. వైష్ణవులు స్మార్తులతోపాటు వైదికకర్మలు ఆపస్తంబాది సూత్రాలనుపట్టి నిర్వర్తించుకోవడమేగాని వైఖానసులమాదిరిగా వీరికి ప్రత్యేకమైన సూత్రమంటూలేదు. వైఖానసం రామానుజీయవైష్ణవమతంకంటె చాలాప్రాచీనం. యెంతప్రాచీనమో ? తెలిసినవారులేరు. వైష్ణవులతోపాటు వీరువిష్ణువును పూజిస్తారుగాని ఆపూజించడంలోగూడ వీరికీ వారికీ కలయికలేదు. వీరు విఖనస్సూత్రప్రకారం పూజిస్తారు- వారు పాంచరాత్రాగమాన్నిబట్టి పూజిస్తారు. వైఖానసులకు తప్తచక్రాంకనంలేదు. కానిఒకవిధమైన అంకనంవుంది. దాన్నివారు, గర్భచక్రాంకనం, అనివ్యవహరిస్తారు. వారికి శ్రీనివాస స్మృతి అనే ధర్మశాస్త్రం ప్రత్యేకించివుంది. దానిలో "అహమేవగురుస్తేషాం,

గర్భవైష్ణవ జన్మనాం" అనిభగవంతుడు శ్రీనివాసుడు చెప్పినట్లువుంది. నావిద్యార్థిదశలో ఆ గ్రంథం నేను తాళపత్రిలలో వున్నది చదివున్నాను. పైశ్లోకాన్నిపట్టిచూస్తే ఆదివైష్ణవులు వైఖానసులే అని స్పష్టపడుతుంది. గర్భవతులుగానున్నప్పుడు 7వ మాసములోనో, 9వ మాసంలోనో, తిరుమణితో ఆ యీచక్రాంకన సంస్కారం. వారిలోకర్మఠులు సమంత్రకంగా జరుపుకుంటారు. వైష్ణవులు వారికన్న జనబాహుళ్యంకలవారు.వారు గ్రామానికి వొక్కయింటివారుమాత్రమే వుంటారు. అదేనా విష్ణ్వాలయం వున్న వూళ్లోనే. అందుచేత లోకువచేసి వైష్ణవులు తప్తచక్రాంకనం వీరికి బలవంతపుబ్రాహ్మణార్థంగాచేయడం క్వాచిత్కంగా కనబడుతుంది. నీవు చక్రాంకనం కానిపద్ధతిని నీచేతితీర్థప్రసాదాలు మాకు పనికిరావని వైష్ణవులు పేచీ పెడతారు. వీరితోబాటు తిరుమణిధరించే క్షత్రియాదులు కూడ వైఖానసులకు వ్యతిరేకులైవైఖానసులకు—"రామానుజశిష్యత్వాన్ని" బలవంతంగా అంటగడతారు. అంతేనేకాని,నిన్నమొన్నపుట్టిన రామానుజులవారికి ఆయాగర్భవైష్ణవులు, వైఖానసులు, యెంతమాత్రమూశిష్యులుకారు. రామానుజులు అవతరించేనాటికి వున్నవిష్ణుస్థలాలన్నీ శ్రీవిఖనససూత్రప్రకారం అర్చింపబడేవే కాని, పాంచరాత్రాగమప్రకారంకాదు. ఆ స్థలాలన్నీ రామానుజులవారు బలవంతంగా పాంచరాత్రవిధానానికిదెచ్చి వైఖానసులను అణగద్రొక్కినట్లుకనుపడుతుంది. వొక్క తిరుపతిమాత్రం రామానుజులవారికి లొంగలేదని చెప్పుకుంటారు. అందుచేతనే శ్రీరంగం, కంచీవగైరాలతోపాటు తిరుపతి శ్రీవైష్ణవులకు దివ్యస్థలం కాకపోవలసివచ్చింది. మొత్తో! మేము రామానుజశిష్యులంకామని వైఖానసులుచెబుతూవున్నా, అదిసత్యదూరం కాకపోయినా వారికి సంఘబలంలేక ఆ శిష్యత్వం అనివార్యంగా కొందరికి మాత్రం 'తిరుమలతాతాచార్లముద్ర' సామెతగా సంఘటించింది. "తిర్మల గురుముద్ర వీపుబయి గ్రాలుభుజించి భజింప జంకినన్." (గీరతం. చూ) మహమ్మదీయుల రోజులలోనే అంతకుపూర్వంకూడ యీ మత పట్టుదలలు వుండేవేమో? అయినా యీవిషయం కాలాన్నిబట్టిచూస్తే మహమ్మదీయ

రాజ్యానికి పూర్వకాలం కాదనే తోస్తుంది. కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోవున్న పద్యంవల్ల శైవమతానికీ, వైష్ణవమతానికీ వున్నవైషమ్యం గోచరిస్తుంది—

"సంగతియె ? యోయి ? యిసుమంత టింగణావు
తత్త్వనిర్ణయవాదమ్ము తరమెనీకు ?
ఓడితేనియు "వద్దు మొట్టో" యనంగ
లింగమునుగట్టకుడుగ మెఱింగినోడువు"

దీన్నిబట్టిచూస్తే విమత చిహ్నాలు ధరించడానికి ఆనాటిప్రజలు యెంతగా యేవగించుకొనేవారో గోచరిస్తుంది. ప్రస్తుతం మనకుకావలసింది వైఖానసులు. వైష్ణవగురువు రామానుజశిష్యులుకారనిన్నీ, వారివైష్ణవం అనాదిగా వస్తూవున్నదనిన్నీ " దురభిమానగ్రహావేశధూమధూపితులు " కొందఱు ఆయీ అనాదివైష్ణవులయిన వైఖానసులకు రామానుజశిష్యత్వాన్ని అంటగట్టాలని ప్రయత్నించినారనిన్నీ, ఆ యత్నం కొంతవరకు ఫలించినా, పూర్తిగాఫలించలేదనిన్నీ, తేలుతుంది. బొట్టునుబట్టిన్నీ, దేవుణ్ణిబట్టిన్నీ, ఇదికొంతసముచితంగానే కనుపడుతుందనుకుందాం. ఈవైఖానసులపట్ల స్మార్తులుచేసే గురుత్వకల్పన మరీ అన్యాయంగాకనపడుతుంది. శంకరాచార్యులవారు షణ్మతస్థాపకులు. ఆపక్షంలో, భారతీయులు, వీరూ, వారూ, అనేవివక్షతో పనిలేకుండా (అంత్యజులువినా) అందరూ వారిగురుత్వాన్ని అంగీకరించవలసిందే — పూర్వపురాజులు వారి పీఠానికి కొన్నిఅధికారాలు (సివిల్ మేజిస్ట్రీటులకు సంబంధించినవి) యిచ్చివున్నారు. కనుకనే కుమ్మర్లువగైరాలుకూడా శంకరపీఠానికి గురుదక్షిణ యథాశక్తిగా నాచిన్నతనం నాటికి సమర్పించడంవుండేది. ఆలాబుద్ధిపూర్వకంగా సమర్పించకపోతే శంకరశిష్యులు. (శుద్ధబడుద్ధాయులు) కొంతజబర్దస్తీమీద యింట్లో వున్న కంచమూ, ముంతా యీవలపడవేయడంకూడా జరిగేది. యిటీవల ఆ మాదిరి అలజడితగ్గింది. వొకానొక ఆంక్షపత్రిక విషయములో నాచిన్ననాడు అధికారి శంకరాచార్యులకు రు 10-0-0 లు జరిమానా విధించడం

వలన క్రిమంగా తెలుగుమీరింది శిష్యవర్గం. వక్తవ్యాంశం యేమిటంటే శంకరపీఠానికి గురుదక్షిణ యిస్తావా? చస్తావా? అని బ్రాహ్మణులు పట్టుబట్టి ఆయీ వైఖానసులను బాధించడానికి ఆరంభించారు. రామానుజమతస్థుల అడగడానికి బొట్టు కొంతపోషకం. యిదేంప్రారబ్ధం - వైఖానసులు శంకరశిష్యులుకావడానికి బీజమేముంది. అయితే వొక్కయింటి వైఖానసుడు గ్రామం యావత్తూ యేకీభవిస్తే యేంచేయాలి. జీవనాన్నివొదులుకొని పోవలసిందేనా? అంతకంటే పోనీ, వొకరూపాయితో యీపీడవదులుతుందని యీ పీఠానికివచ్చి నమస్కారాది మర్యాదలుచూపకపోయినా దక్షిణయిచ్చినవాళ్ళే నూటికితొంభైమంది. కొందఱుమతపట్టుదలకలవాళ్లు మాకు యెప్పుడైనాఅయితే, రామానుజులు గురువుకావచ్చునేమో కాని మీశంకరులు గురువులుకారు. వారికీ మాకూ యేవిధమైనపోలికా లేదు. వారిది అడ్డబొట్టు; మాది నిలువుబొట్టు; వారు శివుణ్ణీ, విష్ణువునూ, యింకా గణపతి వగైరాలనీ, ముఖ్యముగా పరాశక్తి కాళికనూ పూజిస్తారు. మేము విష్ణువును తప్ప పూజించం. సూత్రిందగ్గిరనుంచిన్నీ మాదివేఱు. ఉత్తరధ్రువానికీ దక్షిణధ్రువానికీ, కలియడం యెట్లా? కనక మీరు జబర్దస్తీమీద మాకు వారిశిష్యత్వాన్ని అంటగట్టి చేసేదేమిటో? చూస్తామని భీష్మించుకు కూర్చున్నవాళ్ళూ వున్నారు. గాని యేలాగేనా యీబాపతు అర్చకులు అరుదే. అయితే బుద్ధిపూర్వకంగా కాకపోయినా వీళ్ళతో పాట్లుపడలేక దక్షిణ సమర్పించిన వైఖానసులు కొందఱుండడంచేత కొంత అలుసై యివ్వనివారిని గ్రామస్థులు మఱీ బెదరించేవారు. కొందఱికి స్వాముల వారిద్వారా ఆంక్షపత్రికలు, జారీచేయించడంకూడా వుండేది. యిది విద్యాప్రయుక్తమయిన గురుత్వంకాదు. మతప్రయుక్తం. ఆయీగురుత్వం వొకవిధంగాదు. అనేకవిధాలుగా వుంటుంది. విద్యాప్రయుక్తగురుత్వాన్ని యెవరోకాని కాదనడం వుండదు. కాని గురుశిష్యుల్లో మతభేదములున్నట్లే విద్యలో రుచిభేదములుండును. కొందఱివద్దచేసినశిష్యత్వం దాచినా దాగదు. మచ్చుచూపుతాను.

నారాయణదాసుగారి శిష్యత్వం దాస్తేదాగదు. చాలామందివిట్టివే. వైష్ణవులలో స్వయమాచార్యులవలె కొందరు స్వయంగురువులు వుంటారు. దీనికి నారాయణదాసుగారే యీకాలంలో ప్రథమోదాహరణం. యింకా యీలాంటివారు నేనెఱిగినవారు కొందఱున్నారు. అందులో వొకాయన్ని యిప్పటికి సుమారు పదేండ్లనాడు యేదోసందర్భంలో స్వయంగురుకుడుగా వుదాహరిస్తే ఆ పరమామాయికసార్వభౌముడు నామీదికి తిరగబడి యేవో కొన్ని పేళ్ళుదాహరించి వారిని తనకు ఆయావిద్యలలో గురువులని పత్రికలో వ్రాశాడు. అందులో నాపేరుగూడా వుండడంచేత నాకు ఆయన తత్త్వం బోధపడింది. నావద్ద ఆయన "గురుభ్యోనమః" అని యేమీ చదవనేలేదన్నమాట. ఆయన్ని నేను స్వయంగురుకుడుగానే నమ్ముతాను. అయితే యీమాట "ఇంటివాడు పాడిగేదె అంటే, పొరుగువాడు గొడ్డు గేదె" అన్నాడు అనే ఆక్షేపణకు గుఱికావచ్చు. అయినాసరే యథార్థం యెఱిగిన నేను నాహృదయాన్ని మార్చుకోజాలను. "గురువులేనివిద్య గ్రుడ్డి విద్య" అనే ఆక్షేపణకు పాత్రుడుగాకుండా వుండడానికి ఆయన కొందఱి పేళ్ళు వుదాహరించాడనితలపు. అది మంత్రశాస్త్రానికి సంబంధించిన సూత్రంకావచ్చును. సంగీత సాహిత్యాదులకుగాదు.

1. "ప్రేపదిరే ప్రాక్తనజన్మవిద్యాః"
2. "తదధీతే తద్వేద"
3. "సహజపాండిత్య పోతనామాత్య"

ఇత్యాదులు చాలా నావాదాన్ని బలపరుస్తాయి. ప్రస్తుతం విద్యావిషయగురుత్వంకాదు. వక్తవ్యాంశం యేవిషయంలోనూ కలయికలేని, పోలికలేని, వైఖానసులమీద శంకరాచార్య శిష్యత్వాన్ని ఆపాదించి అంతతో వూరుకోక స్మార్తులు తమతోపాటు గురుదక్షిణ వసూలుచేయడం సహించతగ్గ దోషం కాదనేది.

నేను చిన్నప్పుడు వైఖానసుల పిల్లవాడి స్నేహాన్ని పురస్కరించి కాని ఆ దేవుడుగుడిలోనే వారితోపాటు మకాంగా వారియింట వుండేవాణ్ణి.

18 యేండ్లవయస్సులోవున్నప్పుడు కొంతపాండిత్యం కుదిరినప్పుడు వారి తరపున స్వశాఖాబంధువులకు వ్యతిరేకంగా వాదించవలసివచ్చింది. మొదటి తరపున దిగ్గంతులు పండితులు వున్నారు. వారిపాదధూళి శిరస్సున ధరించ డానిక్కూడా నాకు అర్హతలేదు. కాని నావాదం న్యాయానపేతం, వారి వాదం కేవలం అన్యాయం. వైఖానసులకు సభాసత్కారం, స్మార్తులూ, వైష్ణవులూ, మాధ్వులూ, వీరు యావన్మందీ స్తనంధయులుసహా పుచ్చు కున్నాకగాని, యీలోగా జరిగే ఆచారంలేదని దిగ్గంతులవాదం. అది శుద్ధ తప్పు. త్రిమత తాంబూలాలయినపిమ్మట యిచ్చేతాంబూలాల్లోకలిపి యివ్వా లని నావాదం. నన్ను లోబఱచుకోవడానికి దిగ్గంతిపండితులు చాటుగా బిల్చి బోధించారుగాని, నేను వారి వుపదేశాన్ని ఆమోదించలేదు. కొట్టడం జరుగ లేదుగాని తిట్టడంకూడా జరిగింది. అయినా నేను నాపట్టువదలలేదు, వైఖా నసులపక్షం నెగ్గింది. వైఖానసులు నన్నుకోరడంలో త్రిమత తాంబూ లాలలో విశిష్టాద్వైతులురానిపక్షంలో వారికిచ్చేతాంబూలం తమకివ్వాలని కోరినారు, గాని అది సమంజసమైన కోరికగాదని నేను వారికినచ్చ జెప్పినాను. ఆ తాంబూలాలు త్రిమతపీఠాలకు వుద్దేశింపబడ్డవిగాని వ్యక్తు లకు వుద్దేశింపబడ్డవికావు కనకనే సభలో యెంతటి విద్యావయోవృద్ధులు వున్నా వారిని అక్షేపుంచి ఆయామతస్థులపిల్లవాడికి (పెద్దలురాకపోతే) ఆ తాంబూలం యిచ్చినపిమ్మటనే తక్కిన పెద్దలకు యివ్వడం రివాజు యింది. కొందరికి స్వశాఖాపక్షపాతం సహజంగావుంటుంది. యేంకర్మమో నాకు స్వ అన్నంతలోనే పక్షపాతంకలుగదు. మా పరమగురువులునన్ను స్వపక్షి, పరపక్ష నిర్ధూమధాముడనేవారు. నేను యీకారణాన్నిబట్టియే బంధువులకు సమ్మతంలేని వెల్నాట్లవగైరాలలోచేరి యేదో వాదించి నిష్ఠూరంపడడం పల్లెటూళ్ళపట్టుదలలు అనే నాపుస్తకంతెలుపుతుంది. నా వాశ్రితమేదో వాక శర్మగారి పక్షపాతపువాశ్రితకు భంజకంగావుందని ఆయన నన్నుచాలానికృష్టంగా తూలనాడుచున్నారు. ఆయన వాకరిని గౌరవించ డానికి వాక విషయయోగ్యుణ్ణి నిర్నిమిత్తంగా అపరాధినిచేసే యిహపర

దూరమైనవ్రాతవ్రాసివున్నారు. ఆవాక్యంవ్రాయకుండా ఆవలి పాపచరిత్ర వ్రాయవచ్చును. ప్రసక్తిగాని ఆయన ప్రసక్తిగా ఆవాక్యాన్నివ్రాశారు. యధార్థం నాకు తెలిసివుండడంచేత పత్రికలలో ప్రచురించాను. దానితో ఆయన పిన్నపెద్దతారతమ్య శూన్యమైనవ్రాతకుదిగి యేమేమో కోలాహలంచేస్తూన్నారు. నేను ఆయన దూషణోక్తులను లక్ష్యపెట్టను. ప్రత్యక్షంగా వే నెఱిగినసంగతి వ్రాశానుగాని యెవరివల్లనోవిని వ్రాయలేదు. దాన్ని ఖండించడానికి " సపాదలక్షగ్రంధం " సంపాదించి నామీదకుపంపినా నా ప్రత్యక్షప్రమాణాన్ని ఆశబ్దప్రమాణం భంగించదు. ఆయన ఆ పాపపు వ్రాతయెందుకువ్రాసిందీ నాకు తెలుసు. ఆయనకీతెలుసు. ఆవ్రాత ఆత్మవంచనవ్రాత. యిప్పుడేనా దాన్ని సవరించుకోవడం మంచిదని నాసలహా. ఆ వ్రాత యెవరినిగూర్చి వ్రాశారో ఆపురుషుడు నిషధయోగ్యుడు, సత్యవాది, అమాయకుడు, యిది విషయాంతరం. సరాజుపెళ్ళిలో గురాజు కొక పోచవంటిది. బ్రాహ్మణులలోనేకాదు,యితరవర్ణాలవారిలోనేకాదు, జనబాహుళ్యంకలజాతి స్వల్పసంఖ్యలోవుండే జాతిమీద అధికారం చెలాయించడం పూర్వకాలంలో విస్తరించి వుండేది. యిది ముఖ్యంగా వైఖానసులకీ శివార్చకులకూ బాధకం.

ఆ యీరెండుతెగలవారినీ శుభశోభనాలలో ఆహ్వానించినా తాంబూలానికి మాత్రమే. ఆశీర్వచనానికి వెలవడం లేనేలేదు. వీరితోపాటు మఱికొందరినిన్నీ, యిందుకు నా పల్లెటూళ్ళ పట్టుదలలు చూడగలరు. నూఱేళ్ళ వృద్ధుసభలోవున్నా ఆయనకి కడాకడపట తాంబూలంయివ్వడం, యెవరేనా గృహస్థు యీదురన్యాయానికి మనస్సు వొప్పుకోక యింకా స్మార్తాదులపిల్లకాయలు వొకరిద్దఱు తరవాయివుండగా ఆ వృద్ధులకు తాంబూలంయిస్తే ఆ తరువాయి పిల్లకాయలు పేచీపెట్టి సభలోనుంచి లేచిపోతారు. ఆ పిల్లలకీ యింకా ఆ పేచీపెట్టడం తెలియకపోతే వాళ్ళబంధువులలో యెవరో కలిగించుకొని ఆవుద్యమాన్ని సాగిస్తారు. పూర్వమంత లేదేమోకాని పల్లెటూళ్ళలో యీముట్టితోపు దురాచారం యింకా సాగుతూనేవుంది. వారు

బ్రాహ్మణులే అయినా, అర్చకులుగా వుండడం దోషం అని వీరితాత్పర్యం. పవిత్రమైన నౌకరీకదా! దేవతార్చన, ద్రవ్యం పుచ్చుకొనిచేసినా యితర నౌకరీపాటుచేయదా? "యెంత తగ్గిన మిరియాలున్ జొన్నల సరిగావే" అనుకుంటాను నేను. దేవతార్చనకంటె యెన్నివేలరెట్లో, నికృష్టంగా వుండే నౌకరీలు చేసేవాళ్ళకు సభాపూజ్యత వుండి వారికి లేకపోతుందా? లోకవూళ్ళో కాపులు కోమట్లు కంటె ముందుగా గౌరవిస్తేకాని బడితిబాజా చేస్తారు. వ్రాస్తే చాలావ్రాయాలి.

లోగడ వుదాహరించిన శర్మగారు నావ్యాసాలు చాలా పెద్దవిగా వుండడాన్నిగురించికూడా కొంతవిచారాన్ని ప్రచురించారు. ఆయీవిషయంలో నేనూ విచారపడుతూవుంటాను. క్లుప్తంగా వ్రాయడం నేర్చుకోడానికి ప్రయత్నిస్తానని ఆయనకు విన్నవిస్తూ వున్నాను. ఆయన దర్శనమిప్పించేయెడల ముఖాముఖిని మనవిచేయడం సుళువుగాని వ్రాయడానికే వోపికలేని వార్ధక్యములో వున్నాననికూడా మనవిచేస్తాను. నా వ్యాసాలకి తాటికాయలంత పెద్దక్షరాలు హెడ్డింగుపెట్టడం దోషమేఅయితే అదిమీరు పత్రికాప్రవర్తకులను అడగాలిగాని నన్నడగవలసి వుండదనిగూడా మనవిచేస్తాను. యింతటినుంచి యీ తాటికాయలు తమవ్యాసానికి సమర్పించవలసిందనిన్నీ, నా వ్యాసానికి ఆవగింజంత అక్షరాలుచాలు (ఆటంబాంబు చూ.) ననిన్నీ, శిఫారసుచేస్తాననిన్నీ మనవిచేస్తాను. "భవేద్యదశ్వోవా కిమిహ బహునా పాపినికలౌ, ఘటానాం నిర్మాతు స్త్రిభువన విధాతుశ్చకలహః"

"ఒకరిగౌరవమునకు వేరొకరిననను
తించువ్రాతకు ముమ్మందు దిగఁగనేల?
దానికుళ్ళు బయల్పడ లేనిపోని
తలకుఁ దగనివ్రాఁతలు వ్రాయఁ దలఁపనేల"

విషయం విషయాంతరంలోకి దూకింది. అర్చకుల విషయంలో బ్రాహ్మణులు పల్లెటూళ్ళల్లోచూపే అనాదరం సర్వదా శోచనీయం. ప్రస్తుతం

కులప్రియుక్తగౌరవం పూర్తిగా అంతరించే రోజులురావడంచేత ఆపనికి మాలిన పట్టుదలలు బొత్తిగాపనిచేయవని మనవిచేస్తూ దీనికి స్వస్తిచెపుతూ వున్నాను.



## మంత్రశక్తిగలవారు యీనాఁడూ ఉన్నారు

(15—5—1948 సం॥ర ఆంధ్రవాణి నుండి)

ఇదినాప్రత్యక్షానుభవం. మంత్రశక్తిలేదా? యోగశక్తి వున్నదా? లేదా? అనే సంధిగ్ధావస్థలోకి భరతఖండంవచ్చి చాలకాలమైనది. కాని మంత్రశక్తి చేతసాధించే అసాధ్యపుకార్యాలు యూరపువాసులు యంత్రశక్తిచేత సాధించి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నారు. మంత్రశక్తిని వుపాసించేవారికి చాలా కష్టసాధ్యంగావుండే సదాచారసమ్పత్తి వుండి (అచారహీనం నపునంతివేదాః) తీరాలి. ఆ దీక్షలోవున్నవ్యక్తి తుమ్మితేనూ దగ్గితేనూకూడా యేదోప్రాయశ్చిత్తం కొద్దిగొప్ప (క్షుదాచామేత్ చూ.) చేసుకుంటూ కర్మకలాపాన్ని నిర్వర్తించుకోవాలి.

(1) "సంజల్ర్మొక్కరు కాళ్ళునేనిగడుగర్ శౌచంబటుండంగ.........
(పాణిగృహీత)

(2) ఉ. ఈ "యినుకోలు" బళ్ళకడ నింగిలిపీసులు పీసుపాసుగాఁ
గూయఁగఁజొచ్చి ఆమలులగుడ్డలు వంకెఁ దగిల్చిరందు మొ
ట్టోయన నాలకింపరిసిరో? కలికాలముకాలె రామరా
మాయను వృద్ధురాలయిన స్మార్త వితంతువు.....(తెలుగునాఁడు)

కాలమిట్టిమార్పునుజెందివున్నప్పుడు సదాచారపరులకుఁగూడ సాధింపరాని మంత్రాలూ యోగాలూ వున్నాయని ఋజువుచేయడం కలలోవార్తగానే భావించాలి. కాని అసలుమాత్రం లేకపోలేదు. పరీక్షించే కుతూ

హాలం వున్నవారికి అట్టివారిని నేను చూపుతాను. నేను అసలు నాస్తికుఁడను కానుగాని కాలవ్యత్యయంచేత కొన్నిమహిమలు లోపించాయని వాదించేతెగలోవాణ్ణి. యేమహావ్యక్తివల్ల నాఅభిప్రాయాన్ని మార్పుకోవలసి వచ్చిందో ఆయనకు యిది వృత్తిగాదు. ఆ కారణంచేత దీనిబయలు పఱచుట (మంత్రిమౌషధం....నవగోప్యానికారయేత్) యుక్తంగాదని యెఱిఁగిన్నీ చేయుచున్నాను. నిర్వ్యాజంగా ఆయన అనుగ్రిహించవలసి వుంటుంది. నా అల్లుని మానసిక వ్యాధిని యేవో (సంఖ్యజ్ఞాపకంలేదు.) కొన్ని మినపగింజలు 7 రోజులు సమంత్రికంగా శిరస్సుమీఁదచల్లి కుదిర్చినారు. యిదిప్రత్యక్షంగా నేనుచూచినది. ఆశ్చర్యం. మాంత్రికులయందు కొన్ని డాబులూ దర్పాలూ వుండుట లోకులెఱిఁగినదే. అది దీనిని వృత్తి (జీవనోపాధి) గా పెట్టుకున్నవారికేగాని తదితరులకు అవసరంలేదని శ్రీయుతులు శ్రీదిగవల్లి శేషగిరిరావుగారు ఋజువు చేశారు. యెన్నో చిక్కులుపడితేకూడా నిశ్శేషమగునో ? కాదో ! అని సంశయింపవలసిన మానసికవ్యాధిని తెప్పపాటులో కుదిర్చి నాకు వార్ధక్యంలో శ్రిమలేకుండచేసినందుకు నేను వారికి చాలా ఋణపడియున్నాను. యిప్పుడు నావయస్సు 78 వత్సరాలు. నేటికి 40 వత్సరాలనాఁడు పుదుచ్చేరీ ఫ్రెంచిటవునుండి వొక అవధూత యానాం గ్రామానికివచ్చినాడు. అతఁడు భోజనం చేయువాఁడుకాఁడు. రోజుకి వక ఔన్సులోపు మజ్జిగ (పలుచనిది)యు అరటిపండులో సగంముక్క యింతమాత్రిమే ఆయన ఆహారం సర్వమూ. వుఫ్అంటే పడిపోవునంత చిక్కివుండేవాఁడు. యేకులంవాఁడో యెవరికీ తెలియదు. పాదుకలు,చేతికఱ్ఱ, గూడకట్టు యింతే అతనిసంసారం."రెట్టియాపట్టిచామి" అనే మంత్రాన్ని కొన్నిసార్లు పలికించి సమస్తవ్యాధులు కుదర్చడం నేను స్వయంగాచూచాను. ఆయన మాలవాఁడు అని కొందఱన్నారు. సత్యమో కాదో ఆయనగారి యందలి మహిమలువ్రాస్తే గ్రింధం చాలా పెరుగుతుంది. ఆయన్ని చూడడానికివచ్చే ప్రిజలమూలాన్ని ఆ యానాంలో పెద్ద క్షామం యేర్పడింది. ఫ్రెంచి గవర్నమెంటు కొన్నాళ్ళుచూచి ఆయన్ని

24 గంటలలో వారిసరిహద్దువిడిచి వెళ్ళవలసిందని నోటీసిచ్చారు. ఆయన యెక్కడికి వెడితే రోగులు అక్కడికే వెంటాడించారు. యీ నామునుండి తాళ్ళరేవు, అటనుండి కొవ్వూరు సమీపం గో.డి. కుమారదేవం, అక్కడనుండి విజయనగరం వెళ్ళినట్లుమాత్రం తెలుసును. ఆయన పరిస్థితి బొత్తిగా విశ్రాంతిలేక "కీచుకీచుమేవావరుంధే" దగ్గఱకి రావడంచేత యేలాగో తప్పించుకొని "బ్రతుకు జీవుఁడా" అని మాయంకావలసివచ్చింది. ప్రకృతం ఆయీ శేషగిరిరావుగారు యింతటి ప్రజ్ఞకలవారనితెలిస్తే మళ్ళారెండో "రెట్టియాపట్టిచామి" కావలసివస్తుందేమో అని నాకు భీతిలేకపోలేదుగాని, వున్ననూ పలువురికి వుపకరించే విషయంకావడంచేత ఆయన్ని ప్రోత్సహించి లోకానికి పత్రికాముఖంగా తెలుపుడుచేయవలసిందని చాలసార్లు కోరిన మీదట వారి ఆంధ్రవాణీపత్రికలో యీ వాక్యాలునాలుగూ యేవిధమైన డాబుదర్పాలుగాని లేకుండా శుద్ధఛాందసపురీతిలో ప్రచురించారు. అడ్వర్టైజుమెంటుకువుండే వన్నెచిన్నెలు లేకపోవడంచేత ఆ యీ ప్రకటన పత్రికాపాఠకులలో నూటికి వకరేనా పఠించారో? లేదో అని నాసంశయం. ఆ ప్రకటన యిది. (ఆంధ్రవాణినుండి)

## ఉన్మాదమునకు

మానసికకారణములవల్లగానీ, భూతబాధవల్లగాని వచ్చినఉన్మాదము, మతిస్థిమితము లేకపోవుట యివి మందులేకుండా యోగశక్తివల్ల కుదర్చబడును. జవాబుకు తపాలాబిళ్ళలు పంపుతూ వ్యాధివివరము వ్రాయుడు.

ఆధ్యాత్మిక గ్రంధమండలి, బెజవాడ.

(షరా) ఆ యీప్రకటన ఒకసబ్బుకు లేదా సిగరెట్లకుచేసే ప్రకటనలలో శతాంశమైనవున్నదా? ఆయనకువున్న భయం లోగఁడ సూచించేవుండడంచేత మళ్లావిస్తరించనక్కఱలేదు. మొండిగాపట్టి పల్లార్చు ఉన్మాదరోగులు సదరు శేషగిరిరావుగారివల్ల రోగ విముక్తులవుదురుగాక.

"ఏకస్స్వాదు నభుంజీత" కనుక నేనీకొంత విపులమైన ప్రకటనను చేయు చున్నాను. వాణీపత్రిక యిదిస్వవిషయమని వుపేక్షింపక కొన్ని వన్నె చిన్నెల మర్యాదలతో నలంకరించి ప్రచురించుగాక!



# దే వు డె వ రు?

(13—10—1948 సం॥ర ఆంధ్రపత్రిక వీక్లీ నుండి)

పండిత పామర సాధారణ్యేనా రాముడు దేవుడని చెప్పుకుంటారు. కాని పూర్వోత్తరసందర్భాలు తెలిసినవాళ్ళుమాత్రం రాముడు త్రేతా యుగపురుషుడు కదా! అంతకు ముందు కృతయుగంలో వుండేవాళ్ళకు దేవుడు వున్నాడా, లేడా? వుండేపక్షంలో ఆయనపేరెవరు? అని శంకి స్తారు. ఆయీ శంకలుగాని, వీట్లకు ప్రతిపక్షులు చెప్పే సమాధానాలుగాని యివి యావత్తూ "రామాండకతలెల్ల మేమెఱుంగనియవా?" మాదిరి వారికి సంబంధించినవి.

రాముడు తాను దేవుణ్ణనికాని, దేవుడు కొడుకునని కాని వాచ్యా వృత్త్యా యెక్కడా చెప్పినట్లు లేదు. ఆయీ సందర్భాలన్నీ వాల్మీకి ప్రభృతులు, లేదా వశిష్ఠాదులు చెప్పిన వాక్యాలమీద ఆధారపడి వుంటాయి: "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం" ఆయీ వాక్యం విశ్వామిత్రునివెంట రాక్షససంహారార్థం రాముణ్ణి పంపడానికి సంశయించే దశరథునితో వశిష్ఠుడు "ఫరవాలేదు పంపించండి. మనరాముడు సర్వా త్మనా సమర్థుడు. ఆయీ రహస్యం నాకు తెలుసును. నాకేకాదు, ఆయీ సభలో వున్న మఱికొందరు (యేచామి తపసిస్థితాః చూ.) తపస్వుల క్కూడా తెలిసివుంది." అని చెప్పి ప్రోత్సహించే సందర్భంలో వుంది. ఉత్తరరామాయణంలో రావణసంహారం లోనైన దుర్ఘటకార్యాలు నెఱ వేర్చిన పిమ్మట అగస్త్యాదులు రాముణ్ణి దేవుడుగా సంభావించడానికిన్నీ

శుద్ధ క్షీరకంఠుడు కాకపక్షధరుడు ఊనషోడశ వర్షుడు, అప్పటికి యేమహా కార్యం గాని చేసివుండనివాడూ అయిన రాముణ్ణి దేవుడని వ్యాఖ్యానించ డానికిన్నీ చాలా భేదం వుంటుంది. అగస్త్యాదులకు దివ్యదృష్టితో ఆవశ్య కత లేదు. అంతా ప్రత్యక్షమే కదా! వశిష్ఠాదులకో! యావత్తూ పుస్తకా పేక్షకే వదలిపెట్టాలి. ఆ వయస్సులోనల్లా రాముడికి చేతనైనది గుఱితప్ప కుండా బాణాలు వదలడంమాత్రమే అయివుంటుంది. ఆమాత్రం నేర్పు ఆకాలంలోనే కాదు, యీకాలంలోకూడా "కోయదొరల పిల్లకాయలకు సమేతూ కలిగి వుంటుంది, తావన్మాత్రానికే వశిష్ఠు డంతగా పొగడడం సంభవించదు. రాముడు మానవమాత్రుడు కాడనిన్నీ సాక్షాత్తూ శ్రీమన్నా న్నారాయణుని అవతారమే అనిన్నీ వసిష్ఠునకు జ్ఞానదృష్టిద్వారా తెలిసి వుండడం వల్లనే సంభవించి వుంటుందనీ విజ్ఞులకు గోచరించడం యుక్తి సహం. వాల్మీకి రాముణ్ణి మానవమాత్రుణ్ణిగానే చిత్రించాడు. విశ్వా మిత్రుడు అధ్యాత్మ రామాయణంలో మాత్రం రాముణ్ణి సర్వత్రా దేవుణ్ణిగా నిర్వచించడమే కనపడుతుంది. యీ రామాయణ రచననాటికి రాముడు దేవుడయి చాలాకాలమయి వుంటుంది. రాముణ్ణి దేవుణ్ణిగా తెల్పడానికే అధ్యాత్మ రామాయణం పుట్టింది.

"యద్య ద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితం" అనే గీతావాక్యాన్ని బట్టి ఆలోచిస్తే మనకు కొన్నినూర్లు దేవతలు(దేవుళ్లు)ప్రత్యక్ష మవుతారు. వారిలో రాముడు కూడా ఒకడు. నిన్నమొన్న కీ॥ శే॥ లయిన శ్రీయుతులు గాంధీగారు ఆగణంలో యిప్పటికి తుదివారు. వీరిలో శ్రీకృష్ణుడు ఒకడుగా మన పురాణఋషులు శిరసావహించి తదనుగుణమైన గాథలు పురాణ రూపమున వక్కాణించి యున్నారు. సరే! యితరులు వారివారియందు గోచరించే కొన్ని అద్భుతచర్యలనుబట్టి ఆయీ విధంగా పేర్కొందురు గాక. తన్ను గుఱించి తత్త్వం తెలియని వారంటూ వుండరు. అట్టి స్థితిలో యెవరేనా నేను దేవుణ్ణి నన్ను సేవించండి అని వక్కాణించేయెడల విజ్ఞులకు కర్తవ్యం యేమిటి?

(1) మామేకం శరణం వ్రజ. (2) అహమాదిర్హి భూతానాం— ఆయీ వాక్యద్వయమే కాదు, యీవిధమైనవి మఱికొన్ని వున్నాయి. వీట్లని విశ్వసించి శిరసా వహించవలసినదేనా? అంటేవినండి. శుష్క తర్కాలతో వాదించే వారికి తుదకు "దేవునై, గురువునై" ప్రత్యక్ష మవుతుంది గనక, మహనీయులైన ఋషులుగాని, తత్తుల్యులుగాని నిర్వ్యాజంగా "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని చెపుతూ వుంటే ఆ వాక్యాన్ని యేల విశ్వసించకూడదు? శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి మోసగించి సంపాదించే దేమున్నది? కృష్ణుని చరిత్రలో యేకొంచెమో శృంగారకళంకం వుందే అనండి. అంతమాత్రంచేత ఆయనగారికి తత్త్వజ్ఞత్వం లేదా? సర్వజ్ఞత్వం యావత్తూ మన్ను గొట్టుకు పోవలసిందేనా? ఖండాంతరీయులు, మతాంతరీయులు శిరసావహించే భగవద్గీతవంటి శ్రీకృష్ణుని జ్ఞానోపదేశాన్ని శుష్కతర్కవితండవాదానికిదిగి వమలు కుంటే యిక మనలను తరింపచేసే దేముంటుంది?

"భగవద్గీతా కించి దధీతా" అని ప్రశంసించి శిరసావహించి భాష్యాదులు విరచించిన శంకరాదుల విజ్ఞత్వం యెట్టిదో? మనం విచారించుకోవాలి. శంకరునికి శ్రీకృష్ణునియందు యెంతటి ప్రామాణ్యమూ లేకపోతే "భజ గోవిందం భజ గోవిందం భజ గోవిందం" అని వుపదేశించడం సంఘటిస్తుందా? యింకొక విశేషం మనం విచారించుకోవాలి. భగవద్గీతవంటివి శివగీత, బ్రహ్మగీత లోనైనవి యిదే తత్త్వాన్ని బోధించేవి మఱికొన్ని కనపడతాయి. ఆయా గీతాపరంపరకు పూర్వాపర విచారం చేస్తే తుట్టతుదిగీత భగవద్గీతే కాని యితరం కాదు. ఆయీ గీత భారత యుద్ధంనాడుకదా పుట్టింది. ఆపక్షంలో కలియుగారంభకాలానికి పూర్వ మందు కాదు దీనిజననం. (ప్రవిష్టం కలియుగం విద్ధి అనే శ్రీకృష్ణ వాక్యం భారతంలో చూ.) శ్రీకృష్ణుడు అప్పటికి వేదాంతము ననుసరించి పుట్టిన గీతాశాస్త్రములు యావత్తూ పరిశీలించి, వాట్లకు మాతృకాస్థానంగా పరిగణింపబడే బృహదారణ్యం లోనైన వైదికవాఙ్మయం యావత్తూ

జీర్ణింపజేసికొన్న పిమ్మటనే శ్రీకృష్ణభగవానుడు ఆయీ గీతాశాస్త్రాన్ని మనకు ప్రసాదించి వున్నాడంటే వివదించేవా రుండరు. ప్రత్యక్షంగా శ్రుతమవుతూ వున్న ఋగ్వేదాదులు అలా వుంచుదాం. యింకా ఆయీ వేదత్రయానికి తోడుగా మనభారతీయ విజ్ఞానాన్ని కాపాడుతూవున్న ఖిల సంహితలంటూ కొన్ని వున్నాయి. ద్వైతమతాచార్యుల భాష్యాలలోనూ, వాట్ల వ్యాఖ్యానాల్లోను వుదాహరించే శ్రుతులు ఖిలసంహితనుంచే. అల మతివిస్తరేణ. లోకమును వుద్ధరించే తలపుతో శ్రీకృష్ణుడు పార్థుణ్ణి నిమిత్తమాత్రుడుగా పెట్టుకొని బోధించిన గీతాశాస్త్రంలో వొక్క అక్షరం కూడా పొల్లుపోయేది లేదనే మన మతాచార్యుల తాత్పర్యం. అక్షరంకూడా వ్యర్థం కాదన్నమాట అతిశయోక్తిగా భావిస్తారేమో? అది అపచారం. మీమాంసా శాస్త్రంలో "తౌతాతికమతం" అంటూ వొక మతం వుంది. ఆమతం గురువులకు సమన్వయం కాని వొకానొక శాస్త్రపంక్తిలో వున్న "తు" అనే అవ్యయాన్ని చక్కగా సమన్వయించిన శిష్యుని తెలివితేట లకు గుఱుతుగా పుట్టిందని విజ్ఞులవల్ల వినడం. ఆయీ సందర్భాన్ని బట్టి విచారిస్తే భారతీయుల విజ్ఞానం యెంత కట్టు దిట్టంగా కాపాడబడేదీ గోచ రిస్తుంది. దేవు డెవరు? అని శీర్షిక పెట్టి ప్రధానాంశాన్ని వదిలి అన్యాన్ని వ్రాస్తున్నానేమో! లేదు. స్థూలదృష్టులు అలా భావించినా సూక్ష్మదృష్టులు యథార్థాన్ని గ్రహిస్తారు. దేవుణ్ణిగూర్చి వ్రాసేటప్పుడు తద్వస్తు ప్రతి పాదకం వేదాన్నిగూర్చి గాని, శాస్త్రాన్ని గూర్చిగాని వ్రాయడం అప్ర స్తుతం కాదు. యెవరో విజ్ఞానులు నిర్గుణోపాసకులుగా జీవయాత్ర గడిపి తరింప గలిగినా, నూటికి 99 మంది సగుణోపాసనవల్ల తరింపవలసినవారే.

"నల్లనివాడు పద్మనయనంబుల వాడు.... ... ... ... .....
. ..ఓమల్లియలార, మీపొదలమాటున లేడుగదమ్మ? చూడరే"
"నగుమొగమున్ సుమధ్యమును నల్లని మేనును........ ...
వెన్నుడిమ్మగ బొడచూపుగాక కనుమూసినయప్పుడు విచ్చినప్పుడున్"

యీ మాదిరి పద్యాలు గాని గద్యలుగాని—

" సజలజలదనీలం వల్లవీకేళిలోలం "
" శాంతాకారం జలధిశయనం పద్మనాభం"
" నూతనజలధరరుచయే గోపవధూటీ దుకూల "

ఆయీ మాదిరి శ్లోకాలు గాని భక్తులమనస్సునందు భగవంతుణ్ణి నిల్పడానికి తగ్గ ఆకారాన్ని కల్పిస్తాయి. తఱచుగా స్మరించడంవల్ల భక్తునికి ప్రాణప్రయాణసమయంలోకూడా ఆస్మృతి చలించదు. భక్తులు ముఖ్యంగా కోరేదిన్నీ అదే.

" తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్ "
" తేజః పరం స్ఫురితభూతిమయం చకాస్తు
ప్రాణప్రయాణసమయే మమ మార్గదర్శి "
" అత స్తే కామాక్షి స్ఫురతు తరసా కాలసమయే
సమాయాతే మాత ర్మమ మనసి పాదాబ్జయుగళీ "

ఇత్యాదులన్నీ సగుణోపాసకుల తరణోపాయానికి కల్పితమైన రూపకల్పనలే. వాల్మీకి రామునిచేత యెక్కడా " నేను దేవుణ్ణి, నన్ను సేవించి తరించండి " అని చెప్పించకుండానే 24 వేల గ్రంథాన్ని నిర్మించాడు. వ్యాసుడో? " అహం వైశ్వానరో భూత్వా.... " " ప్రతిజానామి న మే భక్తః ప్రణశ్యతి " ఈవిధంగా కృష్ణభగవానుని పరాత్పరత్వాన్ని శతముఖాల ఘోషింపచేస్తూ తన రచన సాగించాడు.

" యేకు లాడికినదానిమగడూ వస్తాడు" అంటూ వొక లోకోక్తి. దీని సాంప్రదాయం యేకొందరికో తెలిసివున్నా యావరేజీని అందఱికీ తెలిసివుండదు. వొక సంపన్నగృహస్థు స్వర్గతుడైన సందర్భంలో ఆయన భార్య లిద్దఱిలోనూ వొకావిడ దుఃఖిస్తూ యింటిపనులు మానుకొని దిగాలుపడి యేదో మాదిరిని వుందట! యింకొకభార్య లోపల బోలెడు దుఃఖం వున్నా దిగమింగి యేకులు వొడుక్కుంటూ వున్నదనిన్నీ, పరామర్శకు

వచ్చిన బంధువులు, యీ రెండోఆవిణ్ణి "వెఱ్ఱిదానా, యేకులు నేడే వాడ్డ కాలా ?" అని యేమోమో తాత్కాలికోక్తులతో మందలింప బోయేటప్పటికి ఆపె పైలోకోక్తితో తన పనిని సమర్థించినట్లు చెప్పుకుంటారు. ప్రస్తుతం రాముడూ పరాత్పరుడే, కృష్ణుడూ పరాత్పరుడే. దీనికి వ్యతిరేకించే భారతీయుడంటూ వుండడు. యికనల్లా రాముడు నివురు గప్పిన నిప్పువలె జీవయాత్ర సాగించాడు. కృష్ణుడో ? అలాకాక విశ్వరూపప్రదర్శనాదులు ద్వారా తన పరాత్పరత్వాన్ని ప్రకటించి వున్నాడు. ప్రకటించని రామునికి కల్గిన నష్టి గాని. ప్రకటించిన కృష్ణుడికి కల్గిన పుష్టిగానీ కనపడదు. మహర్షులు యిద్దఱినీకూడా భగవదంశసంభూతులుగా సన్మానిస్తూనే వున్నారు. త్రిమతస్థులకూ రాముడు ధ్యేయుడే కాని, అందులోనూ విశిష్టాద్వైతులకు మఱీ ధ్యేయుడు. శివపక్షపాతిగా వుండే శంకరులుకూడా రాముణ్ణి ప్రేమించడం ఆయన రచనలవల్ల గోచరిస్తుంది. (రామకర్ణామృతం చూ) ద్వైతులలో యింకో విశేషం శ్రీమహావిష్ణుతేజస్సంభూతులైన రామకృష్ణాదులకంటే కూడా ఆ రామభక్తులలో నగ్రేసరుడైన హనుమంతుని పేరంటే చెవి కోసుకుంటారు. ఏలూరు మొదలుకొని పడమటిదేశంలో సర్వత్ర ప్రతిపల్లెటూరులోనూ అవచ్ఛేదకావచ్ఛేదేనా ఆంజనేయులగుడి వుండి తీరుతుంది. తఱచు మార్గస్థులు ఆగుడిఆవరణలోనే మకాం చేస్తూ వుంటారు. "ఆలూ బిడ్డలూ లేని వాడికి ఆంజనేయుడే గతి" అంటూ వొకసామెత దీన్ని పురస్కరించుకు పుట్టిందే, నైజాంలో హనుమంతునికి సంబంధించినపేళ్ళు కలవా ళ్లెందఱో వున్నారు. అందులో తోకయ్య అనేది మాకు మఱీ క్రొత్తగా కనిపించింది. హనుమంతుణ్ణి యెక్కువ భక్తితో వుపాసించే వారు సామాన్యులలోనే కాదు; గొప్ప విద్వత్కవులలోకూడా వున్నారన్నందుకు యెంతో వెదక నక్కఱ లేదు. రసవద్విద్వత్కవితా గురువు భట్టుమూర్తి చాలడా ? అతడు తనకు కవితా ప్రాపకుడు "జగత్ప్రాణనందను" డనియే కదా వ్రాసుకున్నాడు.

"నను శ్రీరామపదారవిందభజనానందున్ జగత్ప్రాణనం
దనకారుణ్య కటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యఃకృతగ్రంథకల్పను"....

(మిగిలినది పుస్తకంలో చూడండి.) యిక్కడ కొంత చర్చించ వలసిన విషయం వుంది. భట్టుమూర్తికి శ్రీరామచంద్రమూర్తి సేవ్యుడే; ఆయనకు పరమభక్తుడుగా వుండే ఆంజనేయులున్నూ సేవ్యుడే. యిట్టి స్థితిలో కవిత్వం యీ యిద్దరిలో యెవరికటాక్షంవల్ల సంప్రాప్తమైనదో చెప్పవలసివస్తే ఆంజనేయునిపేరు చెప్పుకోవడంలోనే ఔచిత్యం కన పడుతుంది—

"భూనాయకం వా ధనదాయకం వా
భజన్ భువం వా ధన మేతి లోకే;
త ద్విఘ్ననాథం న భజామి కింతు
సహస్రశస్తం ప్రణమామి నిత్యమ్."

అని యొకకవి చమత్కరించి వున్నాడు. దీన్నిబట్టిచూస్తే కవిత్వం కల దేవుణ్ణి సేవిస్తేనే కవికి అభీష్టసిద్ధి కలుగుతుంది కాని, యితరదేవుళ్ళను సేవిస్తే గలుగదు. శ్రీరాముడు ధీరోదాత్తనాయకుడు; ధానుష్కాగ్రగణ్యుడు. అల మతివిస్తరేణ. "వేయునేటికి నల పాండవేయుసాటి వీరు డికలేడు ప్రతి రఘువీరు డొకడు" గదా? యిందులో కవిత్వలబ్ధికి వుపకరించే దేముంది? ఆంజనేయులు కపి యయ్యు కవికూడాను. కవి అంటే కవి, గాడు అంటే - "కేవలకవయస్తు" తరగతిలో వాడు కాడు యిక నేమంటే? "విద్వత్కవయః" తరగతిలో వాడు. అంటే యేమనుకున్నారు?

"ఘటః పట" ఇతి స్ఫుటం పటు రటంతి నైయాయికాః,
పఠంతి చ హతాత్తరాం ఖఫఛటేతి పాతంజలాః"

ఆయీ తరగతిలో రచన సాగించేవాడు గాక అవసరమైనంతవఱకు వ్యాకరణాదులలో ప్రవేశం సంపాదించుకొని "వయం వకుళ మంజరీ,

గళదరీణమాధ్వీరఘురీధురీణశుభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే" అనే తరగతి రచనతో ఆనందించే వాడన్నమాట. ఆంజనేయులు శబ్దార్థా లంకారభూయిష్ఠ మైన రసవత్కవిత్వంలో అందె వేసిన కవితాధిష్ఠాన దేవత కనుకనే తదుపాసకుడు. మన భట్టుమూర్తికూడా తాదృశుడుగానే తయారైనాడు. "విత్తొకటివేస్తే, మొక్కొకటి మొలుస్తుందా?" భవతు. ప్రసక్తానుప్రసక్తంగా ఆంజనేయుల సందర్భం వచ్చింది. లోకంలో యితణ్ణి కపిగానే యెఱిగినవారు పలువురు వుంటారుగాని కవిగా యెఱిగిన వారు నూటికి వొకరేనా వుంటారో, వుండరో? కొంచెం అతనికవిత్వం రుచిచూపించి మఱీ తరవాయి అందుకుంటాను. సమస్యాపూర్తిమాదిరి—

"అయిఖలు విషమః పురాకృతానాం
భవతి హి జంతుషు కర్మణాం విపాకః;
హరశిరసి శిరాంసి యాని రేజు
శ్శివశివ తాని లుఠన్తి గృధ్రపాదైః".

"కస్త్వం వానర? రామరాజభవనే లేఖార్థసంవాహకో
యాతః కుత్ర పురాగత స్సహనుమా న్నిర్దగ్ధలంకాపురః
బద్ధో రాక్షససూను నేతి కపిభి స్సంతాడిత స్తర్జిత
స్సవ్రీడా త్తపనాభవో వనమృగః కుత్రేతి న జ్ఞాయతే"

ప్రకృత మనుసరామః. దేవు డెవరు? అనేది ప్రకృతం. అనాది కాలంనుంచీ భరతఖండపు విద్వాంసులు "ఏకో దేవః కేశవో వా శివో వా" అని బోధిస్తున్నారు. యీలా చెప్పేవారికి ఆధారం వేదం. "నమో నమోఽంబికాపతయ ఉమాపతయే పశుపతయే. నమోనమః (వేదపాద స్తవం) "ఏకో నారాయణః" (నారాయణం). ఇందులో పాశుపతులు శైవులుగా వుండి మతప్రచారం చేశారు. రెండవవారు వైష్ణవులుగా వుండి మతప్రచారం చేశారు. యీ వుభయులున్నూ భగవద్భక్తులేకాని వారికీ వీరికీ ఉత్తరధ్రువదక్షిణ ధ్రువాలకున్నంత సామీప్యం. పురాణాలలో కొన్ని

శివునికి, కొన్ని విష్ణువుకు ప్రాధాన్యాన్ని నిరూపిస్తాయి. పురాణసంఖ్యను బట్టి చూస్తే శివుడికి వోస్లెక్కువగా వస్తాయి. దీనిక్కారణం ఆయన పరాక్రమమే అని తోస్తుంది. యీ కాలంలో హిట్లరుపేరు కొన్నాళ్ళు వెలిగింది. పూర్వకాలంలో 1. హిరణ్యాక్షుడు 2. హిరణ్యకశిపుడు 3. రావణుడు. కొన్నాళ్ళు జరిగినతరవాత ఆయీ బలశాలులు వధింపబడ్డారు. వధింపబడ్డతరవాత వారిప్రతాపం చల్లారింది. రాక్షసులను వదలుకుందాం. దేవతలలోనైనా యెవరు యెక్కువ పరాక్రమం కలిగి వుంటారో వారే దేవుళ్లు. "దెబ్బకు దెయ్యం జంకుతుంది". అన్న లోకోక్తికే సర్వత్ర ప్రాధాన్యం పూర్వకాలంలోనే కాదు యీకాలంలోనూ కనపడుతూ వుంది. పురాణాలన్నీ పరిశీలిస్తే తుట్టతుదకు "కేశవోవా శివోవా" దగ్గిఱకు వచ్చి నిలుస్తుంది. దేన్నిబట్టి అంటే? పరాక్రమాన్ని బట్టే అనాలి. పరాక్రమం రజోగుణంతో వుంటుంది. ఆపద్ధతిని సత్త్వంకన్న రజోగుణమే పూజనీయం కావలసివస్తుంది. యెగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య. యీపాట్లు పడలేకే అనుకుంటాను అద్వైతులు అన్యత్ర దేవత్వాన్ని అంగీకరింపక "శివోఽహమ్" అని జపిస్తారు. యిది మహాజ్ఞానుల విషయం. సర్వసామాన్యంగా హిట్లరు దేవుడు. "అరయంగా కర్ణుడీల్గె అగ్గురిచేతన్" కనక వానితర్వాతయింకా దేవు డెవడో తేలలేదు. నేనైతే పూర్తిగా ఆస్తికుణ్ణేగాని, కాస్తసేపు నాస్తికవాదం చేసి చూస్తాను. "దేవుడూ నై, దెయ్యమూ నై" దేవుడంటూ వుండడమే వస్తే వాని వుద్యోగ మేమిటి? శిష్టరక్షణమూ, దుష్టశిక్షణమూ అనేకదా చెప్పాలి. యిప్పుడు లోకంలో జరుగుతూవున్న ఘోరకృత్యాలుచూస్తూ (నైజాం. చూ) వూరుకోవడం వల్ల తేలేదేమిటి? దేవుడు వుంటే గింటే యే వుపనిషత్తులలోనో (శ్రుతిశిరసి ప్రవివిక్తం....చూ.) అంతేకాని సర్వేసర్వత్ర లేడనే నాసిద్ధాంతం. యిది చాలా పెద్దవిషయం, త్వరలో తేలేది కాదు. నేను వొకటేమాట అడుగుతాను. గాంధివంటి నిషధయోగ్యుణ్ణి అహింసావ్రతుణ్ణి వృద్ధుణ్ణి దుర్మరణానికి గురిచేసిన దేవుడు యెక్కడో వుంటే మాత్రం

యేం ప్రయోజనం? ఆయనకి కోపం వస్తే వస్తుంది. తగినంత నిదర్శనం ప్రజలకు కనపడేదాకా దేవుడులేడు అనే ప్రచారం సాగిద్దాం. పిదప యద్భావి తద్భవత్యేవ. "పరైఃపరిభవే ప్రాప్తే, మదధీనా తవస్థితిః" యీలాటి ఘోరకృత్యాలు జరుపుతూవున్న లేదా, స్వార్థం కోసం ప్రోత్సహిస్తూవున్న వ్యక్తిని శిక్షింపజాలని దేవుడు వున్నా వొకటే, లేకపోయినా వొకటే!

---

# సహజకవిత్వం

(21-1-1939 సం॥ర కృష్ణాపత్రికనుండి)

దీన్ని గుఱించి నా అనుభవం కొంత వ్రాస్తాను. లోకంలో పాండిత్యాన్నిగూర్చి, సహజ పాండిత్యం అంటూ వ్యవహరించడం ఉందిగాని, కవిత్వాన్నిగూర్చి సహజవిశేషణం తగిల్చి వ్యవహరించడంలేదు. యెందు చేతనంటే—

శ్లో. గాంధర్వం చ కవిత్వం చ శూరత్వం దానశీలతా
అభ్యాసేన న లభ్యంతే చత్వార స్సహజా గుణాః

కనక కవిత్వ మనేటప్పటికే అది సహజమే అయి వుండవలసి వస్తుంది గనక దానికి విశేషణం వేయడం పునరుక్తిప్రాయమవుతుందనియ్యేవే.

"శ్లో. సంభవవ్యభిచారాభ్యాం స్యాద్విశేషణ మర్థవత్" అని వుండడం చేత సర్వదా సంభవంగాని సర్వదాసంభవం లేకపోవడంగాని వుండేపక్షంలో విశేషణం సమన్వయించదనిన్నీ కదాచితు సంభవమున్నూ కదాచితు అసంభవమున్నూ వున్నప్పుడే విశేషణానికి సార్థక్యమనిన్నీ శాస్త్రజ్ఞులయితే చెపుతారు. గాని యీలక్షణం శాస్త్రాలలో వుండే సూత్రాలు సమన్వయించేటప్పుడే

తప్ప కావ్యశ్లోకాలు వగైరా సమన్వయించేటప్పుడు స్వీకరిస్తే యెన్నో వ్యర్థాలు కావలసి వస్తుంది. అందుచేత ఆట్టే లోఁతులోకిపోక సామాన్యంగా మాట్లాడుకుందాం. ఆ పద్ధతిని సహజపాండిత్యమన్నట్టే సహజకవిత్వమని కూడా వ్యవహరించడం అంతగా తప్పుకా దనుకుందాం. యీమాటకు ఉదాహరణం యేలాటికవిత్వ మవుతుందంటే; యెన్నఁడూ సంస్కృతంలో శబ్దమంజరిగాని తెలుఁగులో విభక్తిచంద్రికగాని యేగురువు దగ్గిరా గురుభ్యోనమః అని అభ్యసించడం మాట అలావుండఁగా స్వయంగా చూచి చదవక పోవడమే కాక యీపుస్తకాలంటూ వున్నాయనికూడా యెఱుక్కుండానే సంస్కృతాంధ్రాలలో ధారాళంగా తప్పో వొప్పో తన అభిప్రాయాలు ఛందోబద్ధంగానున్నూ లయబద్ధంగానున్నూ వెలువరించే కవిత్వం సహజకవిత్వ మనిపించుకుంటుందని నేను అనుకుంటాను. యింతమాత్రం చేతనే దాన్ని సహజకవిత్వమనేది లేదుగాని ఆ రచనయెక్కువ హృదయంగమంగా కూడా వుండాలనే విశేషణంకూడా చేర్చడం యుక్తం కనక ఆమాటకూడా చేర్చుకుందాం. యీలాటి కవులంటూ యీకాలంలోఁగాని పూర్వకాలంలోగాని వున్నారా? అనేప్రశ్న రావచ్చును. వుండకేంగాని పూర్వకాలంలోఁ అచ్చుసాధనాలు లేకపోవడంచేత అవి పయికి రాకపోయినా వారివారి నోళ్ళద్వారా కొన్ని ప్రచారంలో లేకపోలేదు. యీకాలంలో అచ్చుకూడా ఆధారం వుందికనక తద్ద్వారాగాకూడా వాట్లకు కొంతప్రచారం వుంది. కాని నేనిప్పుడు వుదాహరించబోయే కవిత్వమ్మాదిరి ధారగాని రసంగాని వాట్లలో ఉందని చెప్పజాలను. లక్ష్యాన్ని చూపి మఱీ వ్రాయఁదగ్గ మాటలువ్రాస్తాను.

## సురటరాగం — ఏకతాళం.

మఱ్ఱాకున పవళించి నయ్యాకిదె మంగళం॥ కుఱ్ఱండై తొఱ్ఱులఁ గాచు చడవి దోతెంచు పశుబాలుర బ్రోచియు॥ మఱ్ఱాకు॥ సొఱ్ఱమీను, సూకర కమఠ నృహరి, కుఱ్ఱకిటకబాపనాకృతులఁగని॥ మఱ్ఱాకు॥ భృగు రఘు

బల రామత్రి(యురూపములఁగని బుద్ధకల్కిరూపములగని జగతి పేరరాజ దాసు నేలిన, సుగతి వీవ కావ, దేవదేవ॥ మత్స్యాకున॥

యీ గేయంలో దశావతారాలు వుటంకించఁ బడ్డాయి. తెలుఁగు పదంతో సొట్టమీను అని సమాసంయెత్తుకొని, కమఠ సూకర నృహరి అనే సంస్కృతపదాలు చేర్చఁబడ్డాయి. కాని లేశమున్నా కర్ణకఠోరంగా లేవు. పయిని కుఱ్ఱకిటకబాపనాకృతి అనే పెద్దసమాసం వామనావతార బోధకంగా ప్రయోగించఁ బడింది. అందులో సంస్కృతసంధి బాపనాకృతి అనేది శాస్త్రరీత్యా తెలుఁగుపదాలకు వాడడం విరుద్ధమైనా చెవికి లేశమూ విరుద్ధంగా కనపడడం లేదు. కిటకపదం పొట్టి అనే అర్థాన్ని యివ్వడం వ్యావహారికంలో కొన్ని ప్రాంతాల్లో కనబడుతుంది. అదికూడా వామనమూర్తికి వాడడం యెంతో హృదయంగమంగా వుంది. దీన్ని రచించిందెవరో వారి పేరు తుట్టతుది చరణంలో వుండనే వుందిగదా, యీయన సంస్కృత సమాసాలు వాడవలసివస్తే యెక్కడా పట్టపగ్గాలు వుండవు, చూడండీ!

## ధన్యాసి — ఆది

ఓం శ్రీం శ్రియఃపతే తిరుపతే శ్రీవేంకటాచలపతే॥ గరుడమందిరాంతరాలయోపరి, తరుచరాలంకార చాంపేయ స్థిరప్రతిష్ఠిత — యీచరణం యింకా చాలావుంది. కొండవీటిసీమ చాంతాడులాగ సమయానికి నాకు జ్ఞాపకంరాలేదు, యీకీర్తనంతా యిదేమాదిరిని యేకైక సమాసంతో చరణాలు పూర్తిచేయబడ్డాయి. యింకొక చరణంకూడా జ్ఞాపకమున్నంతవఱకు వుదాహరిస్తాను. "సప్తభోగిఫణ పర్వతావరణ సౌపాన" యీచరణం కూడా యింకా చాలావుంది. యతికోసం సోపాన శబ్దాన్ని సౌపానశబ్దంగా వాడినట్లు తెలుస్తోందిగదా, దాన్ని సాధించవలసివస్తే శాస్త్రజ్ఞులైతే సాధిస్తారుగాని అసలు ప్రయోగించిన కవికి యేమీతెలియదు. యేమీతెలియని ఆ పురుషుఁడికి సంస్కృతంలో యీలాంటి ధారవుండడ మేమిటి? అన్నదే యిక్కడ విచారించతగ్గదిన్నీ, కవులందఱూసహజధార కలవారే అయినా

అందులోకూడా యీ ధార మఱీసహజమని వొప్పుకో తగ్గదిన్నీ, యీయన కీ ర్తనలలో కొన్నిటిలో నాపేరు తగులుస్తూవుంటారు. దాన్నిచూచి బాగా పరిశీలించనివారు తత్కర్తృత్వాన్ని నాకు ఆపాదిస్తూ వుంటారు. స్థూలదృష్టిని చూచేవారికితప్ప యథార్థం యితరులకు గోచరిస్తూనే వుంటుంది. అట్టిదికూడా వకటి వుదాహరించి మఱీ పైకథ అందుకుంటాను.

ఆనందభైరవి — అట

ఆనందభైరవి, ఆవేశితరూప, అపర్ణాంబ కామేశ్వరీ॥ నాడెందమునను ని, త్యానందవశమున, ధ్యానముచేసినిన్, గానమున నుతింతు గాన నీ వఖిలార్థముల నిడుదానవై నాప్రాణసుఖ మవ, సానము దనుక వెనుకమును సం, తానగురుసఖుల దయనేలుము ॥ఆనం॥

చెళ్ళపిళ్ళ కుల, శేఖర వేంకట, శాస్త్రిభావుకాదరమే, జీవనమై,యెల్లవేళల కృష్ణచటికెల, నుల్లమున జపియించుచుండెడి, అల్లమరాజ పేరుశర్మను, చల్లనికృపను జూచిప్రోవుము ॥ఆనం॥

స్పష్టంగా ఆయన యింటిపేరుతోసహా యీకీర్తనలో కవిపేరు వున్నప్పటికీ, నాపేరుకూడా వుండడం చూచి కొందఱు భ్రాంతిపడడం చూచి అట్టిభ్రాంతి మఱి కొందఱుకూడా పడతారేమో నని కొంత విస్తరించవలసి వచ్చింది. యతులు పడాపడతాయి, పడాపడవు, ప్రాసలుకూడా డిటో ప్రకారమే అన్నందుకు యీ వుదాహరించినకీర్తనే కాకుండా లోగడ వుదాహరించిన కీర్తనలుకూడా తోడ్పడతాయి. యీయనికి అథమం సులక్షణసారమేనా వచ్చునేమో అంటే రాదు సరికదా, ఆ పుస్తకం పేరుకూడా తెలియదు. తరిగొండ వెంకమ్మగారు

"నాచిన్ననాఁటి ఓ, నా, మాలనైన నా
చార్యునియొద్ద నేఁ జదువలేదు,
పరఁగ ఛందమ్ములో పది పద్యములనైన,"

అంటూ వ్రాసివున్నారు. ఆవిడ యింకా యేమేనా వినయార్థం అబద్ధం ఆడితే ఆడిందేమోకాని యీయన యీపద్యం వ్రాసుకుంటే స్వభావోక్తిగా వుంటుంది. యీయన వేదంలో శ్రుతులు పుచ్చుకొని తనకు తోఁచినరీతిని హృదయంగమంగా అర్థం చెపుతూవుంటే యెంతో విన సొంపుగా వుంటుంది. ఆ శ్రుతులుకూడా యీయన చెప్పుకున్నవి కావు, యెక్కడో విన్నవే. యీయన మాట్లాడుతూ వుంటే యెంతో వ్యంగ్యంగానున్నూ, హాస్యప్రధానంగానున్నూ, శ్రవణపేయంగానూ వుంటుంది. యెవణ్ణైనా అనుకరించ వలసివస్తే క్షణంలో యీయనికి అనుకరించే సామర్థ్యం వుంది. ఆశుగా రచించడమైతే లేకపోలేదుగాని మనం రచించమన్నప్పుడుమాత్రం రచించలేఁడు. వొకప్పుడు ధార రైలులాగ పరుగిడుతుంది. నూజివీడులో శ్రీ సీతారామస్వామివారి మందిరంలో భగవన్నామకీర్తనలు పాడుతూపాడుతూ అకస్మాత్తుగాయీగేయాన్ని యీయన తన్మయమైన చిత్తంతోఆశుగా పాడివున్నారు. అప్పుడు అక్కడవున్న సభ్యులందఱూ పరమాశ్చర్యపడ్డారు. దాని శైలి తెలియడానికి యిక్కడ వుదాహరిస్తాను.

ఆనందభైరవి — ఆది

ఉయ్యేలలో రామయ్యా మాయయ్యా, నిదుర బోవయ్యా ॥ఉయ్యే॥
వెయ్యితలలు గల శయ్యపైని నిను చయ్యన నూఁపెద, నయ్యా ! రఘూద్వహ ! ॥ఉయ్యే॥.

నూజివీటి పుర రాజమండలీ, పూజలగొనుచును మాజానకితో ॥ఉయ్యే॥

గ్రంథవిస్తరభయాన్ని అన్నిచరణాలూ వుదాహరించలేదు. యీకీర్తన ఆయననోటమ్మట విన్నవాళ్ళు సంగీతప్రవేశం వున్నవాళ్ళేనాసరే లేనివాళ్ళేనాసరే రాసుకోనివాళ్లు లేరు. యీయనసంగీతధోరణికూడా కొత్తపోకడగానేవుంటుంది. అయితే కవిత్వధారలాగ గానధారమాత్రం బొత్తిగా గురువు వెఱిగందిమాత్రంకాదు. ఏ కొంచెమో స్వరాలూ గీతాలూ యెవరిదగ్గిఱో చెప్పుకోవడం జరిగింది. పైని ఆకాలంనాడు ప్రసిద్ధులుగావుండే

పాటకులు; వుప్పుమాక బ్రహ్మన్నగారు, వేదుల శంకరదాసుగారు, ఢుండీశ్వరుఁడుగారు, ముక్కామల జోగయ్యగారు, మొదలైనవారిపాటలు తఱుచుగా వినడంవల్ల యీయనకు గానాభివృద్ధి కలిగింది. ఆనాఁటిపాటకులలో ఈయనతండ్రి వేంకటకవిగారుకూడా మంచి స్థానం కలవారే కాని ఆయన యీయనబాల్యంలోనే గతించారు. అందుచేత ఆయనవల్ల యీయనకేమీ వుపకారం జరగలేదు. ఆయనగాత్రం ఆనాఁటి గాత్రాలలో పెద్ద జంఝోరాగాత్రిమని చెప్పఁగా వినడం. చెప్పేదేమిటి? గాత్రివైలక్షణ్యంలో యీనాఁడు నారాయణదాసుగారి కేలాటిస్థానం వుందో ఆనాఁడు ఆయనకున్నూ అలాటిస్థానమే వుందని ఆయన్నిగూర్చి యెఱిఁగి యింకా జీవించివున్నవారు చెపుతారు. ప్రబంధాలేవీ రచించకపోయినా ఆయన కొడుకుమాదిరిగానే పాటలూ పదాలూ రచించడమే కాక పద్యాలు రచించడంకూడా వుందఁట. కీ॥ శే॥ శ్రీ పిఠాపురప్రభువు శ్రీరావు గంగాధర రామారావు గారిని సంబోధిస్తూ వక కందపద్యశతకం ఆయన యేకప్రాసగా రచించినట్లు కుమారుఁడు చెప్పఁగా విన్నాను. ఆ శతకంలో వకటో రెండో పద్యాలు మాత్రం యీయనకు వచ్చును. దానిప్రతి లభించలేదని యీయనే చెప్పారు. ఆయన కాకినాడ జగన్నాథపురంలో వీధిలో సభ చేసి మృత్యుంజయ విలాసం పాడుతూవుంటే జనం అపారంగా నిండిపోయిందఁట. ఆ సమయంలో అప్పటి రివిన్యూ ఆఫీసరు ఆ వీధినుంచి యెక్కడికో వెళ్ళడం తటస్థించిందఁట. వీధివీధంతా క్రిక్కిఱిసి వుండడంవల్ల మార్గం కట్టుఁబడి పోవడంచేత ఆయనకు కోపం వచ్చింది. ఆపట్లాన్ని ఆ యూరపియన్ ఆఫీసరు యీయన పాడుతూవున్న స్థలానికివచ్చి కొంచెంసేపు విన్నట్టు అభినయించి చేతిలోవున్న పేబ్బెత్తంతో యీయన్ని నాలుగు దెబ్బలు ( అంత గట్టిగా కాదు సామాన్యంగానే) కొట్టి సభ చెదరగొట్టాఁడఁట. యీ సంగతి ఆ సభలో వుండి ప్రత్యక్షంగా చూచిన పెద్దలవల్ల నాచిన్నతనంలో నేను విన్నాను. నాలుగు దెబ్బలు కొట్టడానికి కారణం ఆ సమయానికి యీయన పాడుతూవున్న కీర్తనేమో —

## సావేరి - ఆట.

నారాయణ, శౌరే, మురారే ॥నారా॥

అనేది. అందులో మురారే అనేపదం నాల్గుమాట్లు ఆవృత్తి తియగు తుంది. ఆ దొరగారుకూడా "మురారి, మురారి, మురారి, మురారి" అని వూత చేసుకొని కొట్టినట్లు చెప్పఁగా విన్నాను. తరువాత ఆ దొరమీఁద యీయన వొక కీర్తన శపిస్తూ కట్టడం వగైరాలున్నూ వినివున్నాను. ఆ కీర్తనవల్ల ఆదొర గయాకొడతాడని కూడా యీయనేమో అన్నట్టున్నూ తరువాత ఆదొర మహారాజులాగ వుద్యోగంచేస్తూ జీవించి వుండడంచూచి కొందఱు "యేమండీ వేంకటకవిగారూ! మిమ్మల్ని ఆవేళ నాలుగు బెత్తపు దెబ్బలూ కొట్టినదొర బాగానే వున్నాఁడు సుమండీ!" అని డెకా యించడం తటస్థించేటప్పటికి "మనకంటికి కనపడకపోతే సరి మర్గయా అయినట్టే!" అని యీయన జవాబు చెప్పేవారనిన్నీ నాఁటి పెద్దలవల్లనే విన్నాను. ఆదొరమీఁద శాపార్థగా చెప్పినకీర్తన పల్లవిమాత్రమేతప్ప తక్కి నది ఆపెద్దలకున్నూరాదు. దాన్ని వుదాహరిస్తాను. "కూకు" గాఁడిని జంపరే" దీన్నిబట్టి చూస్తే కొమారుఁడితోపాటే తండ్రిగారుకూడా సహజ కవేగాని లాక్షణిక కవిగా వుండలేదని స్పష్టపడుతుంది. ఆయనకు కొంచెం మతిచాంచల్యం కూడా వుండేదనిన్నీ వినడం - కవిత్వం తఱచుగా లాలి పాటలూ, జోలపాటలూ వీట్లశైలిలో వుంటుంది. బావమఱఁదులమీఁదా భార్యామీఁదా మామగారిమీఁదా కోపంవచ్చి చెప్పినలాలిపాటమాదిరి గేయం వొకటి నాచిన్నతనంలో విన్నది నాకు కొంచెం జ్ఞప్తివుంది. అయుక్తంగా వుండేదే అయినా శైలీ ప్రదర్శనార్థం దాన్ని వుదాహరిస్తాను.

### గేయం

"సుందరప్పా చచ్చె సుందరి చచ్చె పెద్దముసలివాఁడూ పేరయ్య చచ్చె"

యిందులో నెంబరువన్ పెద్దబావమఱఁది, రెండు భార్య, మూఁడు మామగారు. యీలా అప్పుడప్పుడు పిచ్చికవిత్వం చెప్పినా తఱచు భగవ

త్కీర్తనలే చెప్పేవారఁట. కాని రికార్డు లేశమున్నూ లేదు. వారూ వారూ చెప్పేమాటలు ఆధారం. యీయన అత్తవారు వింజరం. ఆ వూరు వెళ్ళ డానికి యేవూరునుంచో వస్తూవస్తూ తోవలో వున్న పల్లెపాలెం గ్రామంలో రెడ్డి సంపన్న గృహస్తు కాజులూటి కేదారి అనే ఆయన యింటికి వెళ్ళి యేదో వక పద్యమో కీర్తనో కానిచ్చి "కాజులూటి కేదారీ! మా కేదా రోయి!" అని చమత్కరించే టప్పటికి ఆ సంపన్నగృహస్థు నాల్గురూపా యీలు తాంబూలంలో పెట్టియిచ్చి నమస్కరించి మర్యాదగా "యింజరానికి యిదేదారి పదండి బాబూ!" అని సాఁగనంపాడనిన్నీ చెప్పఁగా విన్నాను. యీయనికి సంబంధించినగాథలు పిండిప్రోలి లక్ష్మణకవిగారికి సంబంధిం చిన గాథలలాగే యీలాటివి మఱికొన్నైతే నేను చిన్నప్పుడు విన్నవి వున్నాయిగాని ప్రస్తుతవ్యాసం యీయన కుమారుడికి సంబంధించిందపడం చేత యింతకన్న యీయనకు చోటిస్తే

"ఒకని పెండిలిలో మరొక్కఁ డావల్లకీ
నిఱుక నుంకించు టెంతేని తప్పు"

అనే పద్యచరణాన్ని జ్ఞప్తికి తెస్తుందని సంశయించాను. యీయన అంతో యింతో శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారి శుశ్రూష చేసినట్లు వినడం, సంగీతసాహిత్యాలు రెండున్నూ సమగ్రంగావున్న స్థలంలో చేసిన శుశ్రూష కనక అది యీయనకు ఉభయప్రవేశాన్నీ కలిగించిందనుకోవాలి. కాని ఆ శుశ్రూష క్రమపరికారం చేసిందికాక యధాలాభంగా చేసినదవడంచేత తగినంత కట్టుదిట్టమైనది మాత్రం కాదని రచనవల్లగోచరిస్తుంది. దాన్ని అలావుంచుదాం.

ప్రస్తుత కథానాయకుఁడు (అల్లమరాజు పేరుశర్మగారు) యీ వేంకటకవిగారి కుమారుఁడు. నిన్న మొన్నటివఱకున్నూ యీయనభార్య సజీవురాలు. పోయేటప్పటికి నూఱూ దాటినట్టు చెప్పుకున్నారు. తండ్రిగారు కవి, గాయకుఁడు. విలక్షణమైన జంభోరా గౌళగాత్రం కలవాఁడు. యింకేం కావాలి? "కారణగుణాః కార్యే సంక్రామంతే" కనక అవన్నీ

యీాయనకున్నూ వచ్చాయి. లయజ్ఞానంలో యీాయన్ని నారాయణ దాసు గారు మెచ్చుకున్నారంటే చెప్పేదేమిటి? యీాయన స్వయంగా తయారు చేసిన సాధనసామగ్రి (అదే యీాదేశపు అరగిద్దెల ప్రమాణంలో వుంటుంది) యిదివఱలో యెవరూ వాడినట్టు లేదు. కాని సాంబమూర్తి వారి డమరుకంలోనుంచి పుట్టినట్టు యీాయన యేదో అభూతకల్పనచేసి వుపన్యాసం యిస్తారు. యేవిధమైన గురుశుశ్రూషా లేదు సరికదా, యీాయన వుపన్యసిస్తూ వుంటే షట్చాస్త్రాలూ తిరుగుతాయి వొక్కొక్కప్పుడు. అది నాకేకాదు, శ్రోతల కెందఱికో అత్యాశ్చర్యం కలిగించడం, యెన్నోసార్లు జరిగింది. శ్రీకృష్ణకర్ణామృతశ్లోకాలేమి, భక్తిరసంగానే వుండే మఱికొన్ని శ్లోకాలేమి యీాయన త్యాగరాయ కీర్తనలమాదిరి లయతో పాడుతూవుంటే యెంతో రమణీయంగా వుంటుంది. అందులో "సజలజలదనీలం వల్లవీ కేళిలోలం" అనే శ్లోకాన్ని యీాయన భైరవిరాగంలో రూపకతాళంలో పాడుతూవుంటే, అచ్చంగా "చింతయ మాకందమూలకందం" అన్న కీర్తనలాగే వుంటుంది. యింకా యెన్నో శ్లోకాలున్నూ పద్యాలున్నూ యీాయన చక్కని మట్లు వేసి పాడుతూవుంటే మిక్కిలి ఆహ్లాదకరంగా వుంటుంది. యీాయన సంభాషణ చాలాభాగం రూపాకాలంకారంతో మిళితంగా వుంటుంది. యెన్నో వస్తువులకు యీాయన స్వసంకేతికమైన పేళ్ళు పెట్టి వ్యవహరిస్తూవుంటారు. కోళ్ళకు యీాయనవాడే పేరు ఇండియన్ గడియారం, అనేది, యిలాగే యెన్నిటికో వాడుతూ వుంటారు. శబ్దాలకు యీాయన చెప్పే వ్యుత్పత్తులు చాలా విచిత్రంగా వుంటాయి. యీాయనకి శ్రీకృష్ణునియందు భక్తిమెండు. అందుచేతకాంబోలును స్వగ్రామం గొల్లప్రోలు (గొల్లలుండే వూరు) అనేదానికి, గొల్లప్పఱోలు, అని అర్థం చెప్పి, పూర్వం యశోదాదేవి శ్రీకృష్ణుణ్ణి ఱోటియందు కట్టిపెట్టిన స్థలం అదేనననిన్నీ చెప్పి ఆనందిస్తూ వుంటారు ఆ యీా అర్థాన్ని, "గొల్లప్ప రోటంగట్టెను అల్లమరాట్ లోనగట్టె" అంటూ వక పద్యంలో యిమిడ్చి వున్నారు. యీాయన చెప్పేవ్యుత్పత్తులు సరియైనవి కాకపోయినప్పటికీ

యెంతో ఆహ్లాదజనకాలుగా వుంటాయి. ఏదో మచ్చుకు వకటి రెండు చూపాను గాని యీయన యెన్నో శబ్దాలకు యీలాటివ్యుత్పత్తులు చెప్పఁగా విన్నాను. కొన్ని సందర్భాలలో యీయనకు వేదశాస్త్రాలు పూర్తిగా వచ్చునేమో అనే భ్రాంతి పండితులకుకూడా కలిగిస్తుంది యీయన ధోరణి; యీయనకు వాక్శుద్ధి మెండు. మంత్రించి విభూతియిస్తే జ్వరాలు కుదురుట వగయిరా వున్నవని ఆ గ్రామస్థులందరికీ విశ్వాసం. నాకు కూడా యీయన వొకప్పుడు యేదో తాంత్రికంగా మొలతాడులో వేరు కట్టి వున్నారు. మిడతంభొట్లు శకునమనండి యేమనండి అలా కట్టినపిమ్మట వ్యాధి తీవ్రత తగ్గింది. యీ సంగతి జరిగి యిప్పటికి నాలుగేళ్ళు దాటింది. యీయన కీర్తనలలో తఱుచుగా నా పేరు వాడుతూ వుంటారు. పైఁగా నన్ను గురువుగా వాడుకుంటూవుంటారు కూడాను. కాని యీయన నాదగ్గిఱే కాదు, యెవరిదగ్గిరా యేమిన్నీ అభ్యసించలేదు. అంతా స్వయంవ్యక్తమే. నాపేరు వాడిన కీర్తనలలో వకచిన్న కీర్తన వుటంకిస్తాను.

## ము ఖా రి — ఆ ది

అంతేరా భువిలో యెవరిపని ॥అంతేరా॥ యిల్లుమనదనుచు, వొళ్లు తనదనుచు, పీళ్ళుపరులనుచు వాళ్ళు పరులనుచు పల్ దెఱచి నగుచు చెళ్ళపిళ్ళ వేంకటకవి గురునకు చేరి వందనము చేయవివాళ్ళ పనం తేరా భువిలో.

యింకా దీనిలో మఱివకచరణం వుందికాని సమయానికి జ్ఞప్తికి రాలేదు. యీ గేయాలు ఆయన పాడేటప్పుడు వింటే తప్ప వాట్ల సొగసు బాగా బోధపడదు. ఈ బాధ ప్రతీ పదకవిత్వానికిన్నీ వున్నదే. పద్యకవిత్వానికి తాటితో దబ్బనంగా గ్రంథకర్త వెనువెంబడివి వుండనక్కఱలేదు. పదకవిత్వానికో అసలాయనగాని ఆయనవల్ల పరంపరగా విన్న శిష్యపరంపరగాని వుంటేనే తప్ప వాట్ల సారస్యం లేశమున్నూ పైకి తెలియదు. యిప్పటికి యీయన వయస్సు డెబ్భై దాటింది. అయినా ఆ యీ గేయాలు

పాడుతూంటే పడుచువాడిలాగే కనపడతాఁడు. అభినయంలో కూడ యీయనకు మంచి ప్రవేశం వుంది. దానికి కూడా శుశ్రూష లేదన్న మాటే. యీయనకు అంతో యింతో అక్షరాభ్యాసానికిన్నీ సరళిస్వర జంట స్వరాలకున్నూ గురువు నామకః వున్నాడని చెప్పక తప్పదుగాని యింక దేనికిన్నీ గురువంటూ వకఁడు వున్నట్టు లేదు అన్నది యథార్థం. సంగీతంలో పల్లవి పాడేవారు యీయన లయజ్ఞానానికి మెచ్చుకుంటారు. స్వర పోకడకున్నూ అభినందిస్తారు. యింక కవిత్వం చెప్పనే అక్కఱలేదు. యెంతో అందంగా వుంటుంది. సంస్కృతం ఆరంభించి సమాసం నడిపిస్తేనో? యేలా వుంటుందో యిదివఱలో చూపే వున్నాను. యింకా సంస్కృతపదజటిలంగా వున్నసమాసాలున్న కవిత్వం యీయనకవిత్వంలో వుంది కాని సమయానికి నాకు జ్ఞాపకం రాక వుదాహరించలేదు. మన పూర్వులయితే "గురుశుశ్రూషయా విద్యా" అని చెప్పివున్నారు గాని అక్కడక్కడ యీలాటి స్వయంభువులు చాలామంది కనపడతారు. వీరిని తప్పులుపట్టి వేధిస్తే జవాబు చెప్పి సమర్థించుకోవడంమాత్రం వీరికి చేత కాకపోవచ్చును. పోవచ్చునేమిటి? చేత కానే కాదనుకుందాం. అంత మాత్రంచేత వచ్చే లోటేమేటి? యీలాటి వారందఱున్నూ పూర్వజన్మమందు యేదో భగవదారాధన చేసినవారుగానే నాకు తోస్తారు. సహజకవిత్వానికి ప్రధమోదాహరణంగా యీలాటివారి కవిత్వాన్ని పుచ్చుకోవచ్చునని నే ననుకుంటాను. నన్నయాదులు సహజకవులు కారా? అంటూ శంకిస్తారేమో? వారు యిటీవల గురు శుశ్రూషాపూర్వకంగా చేసిన కృషి లేకపోతే యీలాటివారికిందనే జమకట్టబడేవారేమో? యిప్పు డేంచెప్పగలం? వారి కవిత్వం పుట్టింది పుట్టినట్టుగా వుండలేదు. యీలాటివారిదో పుట్టింది పుట్టినట్టే వుంది. అందుచేత అట్టి మహామహులు పెక్కుమంది వున్నా వీరిని పేర్కొనవలసి వచ్చింది. త్యాగరాయలు క్షేత్రియ్య వగయిరా పదకవులు, పండితులుకూడా అనుకోవడానికి వారిరచన కొంత వఱకు తోడ్పడుతుంది. కాని పదకవిత్వంలో తమ భాషాపాండిత్య ప్రదర్శ

నానికి యెక్కువ అవకాశం యిస్తే రసభంగానికి కారణ మవుతుందనో యేమో వారు తేటతెలుగుమాటలతోనే రచన సాగిస్తూ వచ్చారు. ప్రస్తుత మన కథానాయకుఁడు యితర గురుశుశ్రూష చేయకపోయినా తరంగాలు వగయిరా చాలా నోటికి వచ్చి వుండడంచేత వారువారు గురువులుగా పరిగణింప బడవలసివస్తుంది. పదకవిత్వం చెప్పిన కవులలో అధ్యాత్మ రామాయణ కీర్తనలు చెప్పిన కవి సాధారణుఁడు కాఁడు. సంస్కృతంలో అష్టపదులు రచించిన జయదేవు డేలాటి పండితకవిశ్రేష్ఠుఁడో యితఁ డున్నూ అలాటివాఁడే. బహుశః భట్టుమూర్తికి లాగ వీనికి సంగీతకళా రహస్యనిధిత్వం కూడా జన్మాంతరవాసనచే లభించి యీపదకవిత్వాన్ని రచించి వుంటారు. యెక్కడా ప్రచారంలో వున్నట్టు లేదుగాని భట్టు మూర్తికూడా కొంత పదకవిత్వరచన సాగించే వుంటాఁడు. యిటీవల శిష్టు కృష్ణమూర్తిగారొకరు బట్టుమూర్తివంటివా రుండేవారు. వారిపదకవిత్వం కూడా కొంత లోకంలో ప్రచారంలో వుంది.

వ్యాసం విస్తరిస్తూ వుంది. సహజకవిత్వమంటే యిప్పుడు భావ కవులు చెప్పేదిన్నీ కాదు, ఇంతకు పూర్వం ప్రాచీనపండితకవులుగాని కేవలకవులుగాని చెప్పినదీకాదు. నే నిప్పుడు యెవరినిగూర్చి కొన్ని మాటలు వ్రాశానో యీ పేర్రాజు గారివంటివారి కవిత్వమే అవుతుందేమో అని నే ననుకుంటాను. నాకు తోఁచినమాటలు నేను వ్రాశాను. యిది లోకానికి యెంతవఱకు నచ్చుతుందో ?

"ఉద్దామ ద్యుమణి ద్యుతి వ్యతిక రవ్రక్రీడ దర్కోపల
జ్వాలాజాల జటాల జాంగల తటీ నిష్కూజకోయష్టయః"

మాదిరి కవిత్వాలెన్నో వుండగా యేవో పొడిపొడి మాటలతోవున్న కవిత్వాన్ని యీయన మెచ్చుకుంటాఁడేమి అని పలువు రనవచ్చును. వారికి నేనేమిన్నీ జవాబుచెప్పలేను చెప్పనేలేను అలాటికవిత్వం నాటకంలోవుంటే యీకాలంలోనే కాదనుకుందాం, ఆకాలంలోనే అనుకుందాం పామరులు కారే అనుకుందాం, పండితులే అనుకుందాం నాటకంచూడడానికి వచ్చినవారిలో

గురుముఖతః అంతకుపూర్వం చదువుకొని బాగా వంటఁబట్టేటట్టు వల్లించు కొని వున్నవారెవరో తప్ప అర్థంచేసుకోలేరంటే? అంతా వప్పుకుంటారుగదా? అయితే గ్రంథకర్తకు యీమాత్రిం తెలియదా? అంటే? తెలుసునుకొని ఆకాలంలో తేలికశైలికంటే కఠినశైలికే యెక్కువ ప్రాముఖ్యం వుండేదో? యేమో? యేంతెలుస్తుంది? దేశకాలాలు నానావిధాలుగా మాఱుతూవుంటాయి. మురారిమహాకవి చెప్పిన సంస్కృతనాటకంమాట అలా వుంచుదాం. కాళి దాస భవభూత్యాదులు కొంత తేలికశైలిలోనే వ్రాసిననాటకాలుమాత్రిం సర్వేసర్వత్రి పేలపిండిలాగ బోధపడతాయా? దీన్నిగురించి వ్రాస్తే చాలావ్రాయాలి. యిప్పుడు తెలుఁగులో అస్మదాదులు వ్రాసిననాటకాలు కూడా అందఱికీ సులభంగా బోధపడవు. అందుకోసమని "యాదవుఁడు గోవులూ మాదవుఁడు గాయఁగా మాదవుఁడు మచ్చావతారమైనాఁడా?" అనేశైలిలోకి దిగవలసిందేనా? అంటే? జవాబేమిటి? వీట్లనిగుఱించి మఱివకప్పుడు ముచ్చటించుకుందాం, యిప్పటికి యీకృష్ణగానచటికా భాగవ తారుగారిప్రశంసనే ప్రధానంగా పుచ్చుకొని విరమిద్దాం.

"కృష్ణగానచటికా భాగవత" శబ్దంకూడా ఆయన స్వకపోలకల్పి తమే. యిందులో వున్న "చటికా" శబ్దానికి అర్థం ఆయన "చిటికే" అనే పదంతో చెపుతారు. ఆ చిటికెలు ఆయన రెండుచేతులతోటి రెండుగా పట్టుకొని అద్భుతంగా లయానుగుణంగా వాయించే వొకవిధమైన చిన్న లక్కపిడతలే. ఆయన్నిచూచి మఱికొందఱు ఆచిటికెలు వాయించడానికి ఆరంభించారు. కాని ఆపోకడ పూర్తిగా యింతవఱకు యెవ్వరికీ అలవ డింది కాదు. యీవాద్యానికి ప్రిథమాచార్యులు యీయనే, వొక్కొక్క దానికి వొక్కొక్కరు ప్రిథమప్రివర్తకులుగా వుంటారు. మహారాష్ట్రాది దేశాలల్లో తప్ప నాచిన్నతనంనాఁటికి మనదేశంలో హరికథలు చెప్పడ మంటూ వున్నట్టులేదు, అట్టికాలంలో (1) బాలాజీదాసుగారు (2) నార యణదాసుగారు. వీరిద్దఱున్నూ వుపక్రిమించారు. వీరికి మార్గదర్శక లెవరేనా వున్నారేమో కాని ఫలానా అని వ్రాయడానికి నాకు తెలియ

పోవడంచేత వ్రాయలేదు. బహుశః నారాయణదాసుగారికంటె వయస్సులో బాలాజీదాసుగారు కొంచెం గొప్ప పెద్దలనుకుంటాను. నానావిధమైన శక్తులతో మిళితమైన నారాయణదాసుగారికిన్నీ బాలాజీదాసుగారికిన్నీ పోలిక యెందులోనూ లేదుగాని భక్తిప్రధానంగానున్నూ రక్తిప్రధానంగానున్నూ హరికథచెప్పడంలో బాలాజీదాసుగారున్నూ మనదేశంలో అగ్రిగణ్యులే. యిటీవల యెందఱు హరికథలు చెప్పేవారు బయలుదేఱినా నారాయణదాసుగారినే వరవడిగా పెట్టుకొని మొదలుపెట్టారు. కాని ఆయనకు వున్నసాధన సామగ్రి అంతా కాదుసరికదా అందులో దశాంశం వున్నవాడుకూడా బయలు దేరలేదు. అన్నిశక్తులు వొకచోట కేంద్రీకరించఁబడడం కష్టసాధ్యంకదా? అయితే నాట్యంవగైరాలు మాత్రం అచ్చంగా అదేమాదిరిగా కనపరిచేవారు మాత్రం పలువురున్నారు. అంతేకాదు కొందఱు ఆయనవలెనే నిలుచుండడాన్నికూడా అభ్యసించి చూపేవారున్నారు. శ్రీ పోలవరపు జమీందారుగారొక్కరుమాత్రిం నారాయణదాసుగారికన్నా మిన్నగా హరికథ చెప్పి మెప్పించేవారు. దక్షిణాదినే యెవరో వకరు వున్నారని వారిపేరుకూడా చెపుతూ వుండేవారు. బహుశః ఆపేరు "కృష్ణభాగవతార్" అన్నదని జ్ఞాపకం. వారిని నేను దర్శించలేదుగాని మఱికొందఱి హరికథలు దాక్షిణాత్యులవి విని వున్నాను. వారెవరున్నూ మనదాసుగారివలె చెప్పతగ్గవారుగా నాకు తోఁచలేదు. స్వయంభువులైనవారికిన్నీ అనుకర్తలకున్నూ చాలా భేదం యీ విషయంలోనే కాదు ప్రితీవిషయంలోనున్నూ వుంటుందని చెప్పనక్కఱలేదు. ప్రిస్తుతం మన "కృష్ణగానచటికా" భాగవతులు యెందులోగాని పండితులు కాకపోయినా మృదుమధురపదభూయిష్ఠంగ పదకవిత్వమేకాకుండా పద్యకవిత్వంకూడా చెప్పి శ్రితిలయయుక్తంగ గానంచేసి మధ్యమధ్య సర్వజనసులభంగా వేదాంతవిషయం హాస్యరస మిళితంగా వుపన్యసిస్తూ జనరంజనం చేస్తారు. భగవంతుడు యీయన్ని యింకా నిరోగశతాయుష్మంతుణ్ణిచేసి తనభక్తపరాధీనత్వాన్ని ప్రకటించుగాక అని స్వప్తి చెపుతూన్నాను.

# కీ॥ శే॥ అల్లంరాజు పేర్రాజుగారి స్మృతి

( 24—2—1940 సం॥ర కృష్ణాపత్రికనుండి )

యీయన్నిగూర్చి కృష్ణాపత్రికలో రెండేళ్ళనాఁడు కొంతవ్రాసి యున్నాను, యీయనయేమీ చదువుకోని సహజకవి. అతిలోకికులుగావుండే (మాబంధుగులు) అల్లంరాజువారిలో యేమీ లౌకిక మన్న దోషం అంటని నిషధయోగ్యుఁడు. నేను యీయన్ని యెన్నఁడూ శిష్యుఁడని అంగీకరించ డానికి తగ్గ కారణం యేలవలేశమూ లేకపోయినా నిర్వ్యాజంగా నన్ను గురువుగా (త్రికరణశుద్ధిగా) ప్రేమించేవాఁడు. యెందుకు యీయన నన్ను అలాగు ప్రేమించేవాఁడో నాకు యీక్షణంవఱకున్నూ తెలియనే తెలియదు. యిఁక మాత్రం యేలాతెలుస్తుంది? సుమారు 73 యేండ్ల వార్ధక్యంలో వున్న యీయన కొలదిరోజులక్రిందటనే పరమ పదించారు. యీయన భక్తిభావంతో అత్యాశుగా కీర్తనలే కాదు పద్యాలే కాదు రచించడంలో అద్వితీయుఁడు. యీయన కవిత్వంలో యమకం అప్రియత్నంగావచ్చి పడుతుంది. యెక్కడా చూచికాని వినికాని యెఱగని విశేషంవొకటి యీయనవద్ద వుండేది. దాన్ని ప్రతిపాదించవలసివస్తే యేలా ప్రతిపా దించాలో నాకు వుపాయం తోఁచడం లేదు. శుద్ధ పచ్చిబూతు మాటలలో కూడా యీమహాపురుషుఁడు భగవద్భక్తిని పుట్టించే అర్థం చెప్పుకొని తనలో తాను ఆనందిస్తూ వుండేవాఁడు. "సర్వే సర్వార్థవాచకాః" అన్న శ్లోకార్థం యీయనపట్ల బాగా సమన్వయిస్తుంది. విశేషించి లేవుగాని సుమారు నూఱు కీర్తనలు యీ హాస్యపుభక్తుఁడు రచించినవి వుంటాయి. ఆ కీర్తనలు ప్రతిపదమూ భక్తిని చిమ్ముతూ స్వర్గానికి, కాదు కాదు, సాక్షాద్వైకుంఠానికే మెట్లుకడుతూవుంటాయి. యెవరి కవిత్వానికేనా వ్యాక రణం అంటూపుడితేపుడుతుందేమో కాని యీయన కవిత్వానికి పుట్టడానికి వీలులేదు. సంస్కృతాంధ్రవిభక్తులు రెండూకలిపి యీయనవలె రచన సాఁగించినకవులను నే నింతవఱకు వినలేదు. సరిగదా, చూడాలేదు.

"ఓం శ్రీం శ్రియఃపతే రఘుపతే శ్రీ వేంకటాచలపతే" వగయిరా కీర్తనలలో ఆయీ గుణవిశేషం కనపడుతుంది. యీ కీర్తనలోవున్న దీర్ఘ సమాసాలు జ్ఞప్తిలో లేక వుదాహరించలేదు. ఆ సమాసాలు యేనన్నయ్య భట్టోతప్ప ప్రయోగించే తరగతిలోవి కావు. ననయ్యభట్టుకన్నా మిన్నాగా సంస్కృత సమాసాన్ని యీయన కూరుస్తారు. అంటే లోకులు నమ్మరు. అయితే యేం చేసేది? మళ్లా అచ్చతెలుగుధోరణిలో కలం నడపవలసివస్తే యయాతిచరిత్రలో వున్నధోరణి ప్రత్యక్షం కావలసిందే. "తెల్గుకైత లీరీతి సంస్కృతంబు పచరించిన పట్టున" అంటూ ఆంధ్రకవితాపితామహుఁడు వ్రాసినవి యీయనపట్ల బాగా లగిస్తుంది. కవులు పుట్టుదురు గాని చేయఁబడరు అన్న యింగిలీషు లోకోక్తికి లక్ష్యం యీ మహానుభావుఁడే. ఆంధ్ర సంస్కృత విభక్తుల కలయిక మాదిరిగానే యీయన ఆరెండు భాషలలోనూ వుండే సంధులకుకూడా చుట్టఱికాన్ని కలిపేవారు. "ఆనందభైరవి, ఆవేశితరూప అపర్ణాంబ కామేశ్వరీ" అనే కీర్తనలో యీవిశేషం గోచరిస్తుంది. యీయన యెంత శబ్దప్రియుఁడో అంత అర్థప్రియుఁడుకూడాను మిన్నువిఱిగి మీఁద పడుతూవున్నా ఆయన ధోరణిలోనే ఆయన వుండేవాఁడు. కాని ఆచిక్కును గమనించడ మంటూ లేనేలేదు. నాతో యీయనకు సంబంధం యేర్పడి సుమారు యిఱువై యేళ్ళు అతిక్రమించాయి. విరక్తుఁడేఁకాని ఆ విరక్తిలో యెంతో హాస్యం వుండేది. సామాన్యులకు కొంచెమనిషిగా తోఁచేది. ("బాలోన్మత్తపిశాచవత్") ఆ హాస్యాన్ని విని తీరవలసిందే కాని యిక్కడ వివరించడానికి తగ్గంత భాషాజ్ఞానం నాకు లేదు యీయన విరాగాన్ని తెలుపుడు చేసే వొక చిన్న కీర్తన వుదాహరిస్తాను. "అంతేరా భువిలో యెవరిపని అంతేరా॥ యింత మర్మ మెఱుఁగలేక సతతము యెంతెంతో చింతలబడు జీవుల ॥కంతేరా॥" యిల్లు మనదనుచు వొళ్ళు తనదనుచు వాళ్ళు పరులనుచు వీళ్ళపరులనుచు పల్ దెఱచినగుచు చెళ్లపిళ్ల వెంకట కవిగురునకు చేరి వందనము చేయనివాళ్ళప ॥నంతేరా॥ యీ కీర్తన కృష్ణగానచిటికలనే పేరుతో ఆయన స్వయంగా కనిపెట్టిన

లక్కపిడతల వాద్యంతో ఆయన పాడుతూ వుంటే సభంతా లేచి ఆయనతో కలిసి నాట్యం చేసేవారన్నసంగతి పలువురు చెప్పఁగిందే. "ఉయ్యాలలో రామయ్యా! మాయయ్యా! నిదురబోవయ్యా!" అని నూజివీటిలో సీతారామలయంలో అత్యాశుధారలో పాడిన కీర్తనచరిత్రి వ్రాయవలసివస్తే చాలా వ్రాయాలి. నాకు యీయనంటే అతిభక్తి.. నేనంటే ఆయనకూ అలాగే. అన్యోన్యం గురువో విప్రాః. యీయన అన్నవస్త్రాలకు లేశమూ లోటు లేని కుటుంబంలో జన్మించారు. కాని జమా ఖర్చూ లేని సద్వ్యయం చేయడంవల్ల మధ్యకాలం నాఁటికి యీయనకు కొంత దారిద్ర్యపీడ తటస్థించింది. కాని ఆయనకు సహజంగా భగవంతుఁడు ప్రసాదించిన భగవద్భక్తి యీవజ్జీవమూ కాపాడడము అలావుండఁగా తుదిగడియలో కూడా సాయంచేసి ఒక ఉద్యోగంలోనుంచి యింకో వుద్యోగంలోకి ప్రమోషను అయిన వుద్యోగికి యే గౌరవం వుందో, అట్టి గౌరవాన్నే ప్రదర్శించి కీర్తికాయుణ్ణి చేసినట్టు విని విచారించ డానికి బదులు కొంత ఆనందాన్నే పొందవలసినవాడనైనాను. "నారుంబోసినదేవుఁ డెట్టిగతినైన న్నీరు తాఁబోయఁడే యేరీతిన్ మనకేగు గాలమని లో నేడ్వంగనేమో" అన్న మాపద్యానికి యీయన ప్రథమోదాహరణం. యిట్టికీర్తి శేషత్వాన్ని మరణపదంతో వాడడం నాకిష్టంలేదు. రాత్రిభోజనంచేసి అప్పటికి యే జబ్బూ లేకుండా వుండి పుత్రుణ్ని పిలిచి నేనీ రోజున పరమపదిస్తానని చెప్పేటప్పటికి ఎవ్వరూ నమ్మనే లేదట. అలా చెప్పిన రెండుగంటలలో ఆయన చెప్పినట్లే జరిగినదట. యీయన నివాసగ్రామం పిఠాపురం సమీపం గొల్లప్రోలు (గొల్లప్పరోలు) ఆ యీ మహానుభావుణ్ణి యేలా గౌరవించాలో అలాగే ఆ సమయంలో గౌరవించిందనివిని మిక్కిలిగా ఆనందించాను. మనపూర్వపు భక్తుల మార్గాన్ని యీయన బాగా రుజువుచేశారు (యిఁక మళ్ళా జన్మానికిరాము, మదిలోనుంచండి) భగవంతుణ్ణి గూర్చిన్ని భక్తిని గూర్చిన్నీ మనం యెన్ని వుపన్యాసాలు యిచ్చినా, యెన్ని వ్యాసాలు ప్రచురించినా యీలాటి ప్రత్యక్షనిదర్శనం చూపించిన మహాత్ముని చర్యలో అవి

సహస్రాంశమున్నా కావు. యీయన త్యాగరాజాది మహాభక్తులలో జమ కట్టఁదగ్గవారని నేను విశ్వసిస్తాను. యిట్టి మహాత్ముని రచనలను త్వరలో ప్రకటించడానికి తద్రసాన్ని గుర్తించిన "కాటూరి" వగైరాలు తగిన వాళ్లు. యీయనగారు చెప్పేశబ్దవ్యుత్పత్తులు చాలాదాగావుండేవి. "ఆశ్వాసాంత" పదానికి సొగసైన అర్థం చెప్పేవారు. శ్వాసాంతపర్యంతమూ అని చెప్పి యేమేమో తత్త్వమార్గంలో వ్యాఖ్యానం చేసేవారు. ఆవ్యాఖ్యానంలో వేదశ్రుతుల దగ్గిఅనుంచి యేవేవో దొర్లి అత్యాశ్చర్యం కలిగించేవి ఆ అర్థం యెంతో (ఈయనకు శాస్త్రజ్ఞానం లేశమేనా లేకపోయి నప్పంటికీ) శాస్త్రీయంగా వుండి నన్నాకర్షించి ఆపదాన్ని వక పద్యంలో ప్రయోగించుకోవడానికి ప్రోత్సాహం కలిగించింది.

శా. ఆశ్వాసాంతముదాఁక శ్రావ్యమగు కావ్యం బట్టులే జీవితం
బాశ్వాసాంతముదాఁక రమ్యమగుచో నాశాన్యమై భవ్యమై
శశ్వన్మంగళసంగతంబునయి "విశ్వశ్రేయ"మై యొప్పు.

అని ఆరోగ్యకామేశ్వరీస్తవంలో కాఁబోలు వాడుకున్నాను. యిందులోవున్న శ్లేషవగయిరాలు వివరించవలసివస్తే గ్రంథం చాలా పెరుఁగుతుంది. యీలాటి విశేషాలు యీయనవద్ద నేను యెన్నోకనిపెట్టి వున్నాను. యీయన కృష్ణభాగవతచిటికావాద్యరామణీయకం, సినీమాకంపెనీ డైరెక్టర్లనే ఆకర్షించింది. అట్టిస్థితిలో యితరులను ఆకర్షించడంలో ఆశ్చర్యమేముంటుంది? యీయన యెన్నాళ్ళో అక్కఱలేదు యిఁక వొకటి రెండుమాసాలు ప్రయాణం ఆఁగివుంటే సినీమాతారగా పత్రికలలో ప్రత్యక్షం అయేవాఁడే. అది భగవత్సమ్మతికాక త్వరలో నోటీసు జారీ అయిందనుకుంటాను. యీయన పదార్థ విజ్ఞానం కవిత్వంతో జీవితాన్ని నిర్వర్తించుకుంటూ వున్న నన్నే ఆకర్షించి "గ్రంథచోరులు గాని కవులుగారు" అనే అభియుక్తోక్తికి లక్ష్యంగా చేసింది. యీయన కవులలో కవి, అంటే సామాన్యమైన కవిగాఁడు. వంశపరంపరగా (తండ్రిగారు వెంకటకవిగారు) ప్రాప్తమైన కవిత్వభాగ్యం కలవాఁడు. భక్తులలో మహా

భక్తుఁడు, అంటే సామాన్యభక్తుడుగాఁడు. త్యాగరాజాదులలో జమకట్ట తగ్గవాఁడు. హాస్యగాళ్ళలో హాస్యగాఁడు అంటే యే చూరిగున్నయ్యగారు వగైరా హేమాహేమీలలో చేర్చతగ్గవాఁడు. యిమిటేషను చేయడంలో యీయనవంటివాణ్ణి నేను చూడనేలేదు. ఆకారంలో మదపుటేనుఁగే యీయనకు వున్న యావత్తుప్రజ్ఞలూ నదీనాం సాగరోగతిః అన్నట్లు భగవద్భక్తిలోకే చేరేవి. దానికి తథ్యంగా "అనాయాసేన మరణం" అనే మహాయోగం యీయనికి భగవంతుఁడు కటాక్షించి యేదో వుత్తమ పదవిలోకి "ప్రమోషన్" చేసినట్లు నేను భావిస్తూన్నాను.



## "గజం మిధ్య పలాయనం మిధ్య"

(1940 నవంబరు మోక్షసాధని నుండి)

అంటూ వొక లోకోక్తి సర్వత్రా అందఱూ వింటూవున్నదే. యిది అద్వైతమతానికి సంబంధించిన యితిహాసంలోది. అద్వైతం చెప్పే ముక్తి సర్వోత్కృష్టమే అయినా ఆయీముక్తి బ్రహ్మాదులకుకూడా అందు బాటులో వుండదు. కాబట్టి అట్టి ముక్తికోసం పండితపామరసాధారణ్యేనా ప్రయత్నించడం అందని మ్రానిపండ్లకు అఱ్ఱులుసాచడం వంటిదే అవు తుంది. అద్వైతమతంలో ప్రత్యక్షంగా కళ్ళకు కనపడుతూవున్న సూర్య చంద్రాదులున్నూ భూమిన్నీ పర్వతాలున్నూ సముద్రాలున్నూ వకటేమిటి సమస్తమున్నూ మిధ్య అనఁగా వట్టి అబద్ధం అని తేలుతుంది. యిది యథా ర్థమే అయినా లోకంచేత దీన్ని వొప్పించడం సర్వకల్ల. అందుచేతేకదా? నిక్షేపంవంటి "అద్వైతశబ్ద మయ్యది తిట్టుగా మాఱె" అని వ్రాయవలసి వచ్చింది. యెవఁడేనా "లక్కికిలిక్కి లిక్కికి లక్కిగా" మాట్లాడే వాఁడు వుంటే వాణ్ణి లోకులు అద్వైతం ముండాకొడుకు" అనడం అదంఱూయెఱిగిందే. అంతమాత్రంచేత అద్వైతం మంచిది కాదనుకో కూడదు.

"బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా" అని వాదించే పండితుఁడి మీఁదికి వొకరాజుగారు మదించిన యేనుఁగును పంపించా రనిన్నీ ఆయేనుఁగు యింకా రెండుమూడు ఫర్లాంగుల దూరంలో వుండఁగానే అంటే కంటే ముందుగానే ఆ పండితుఁడు లేచి పాఱిపోయాఁడనిన్నీ అప్పుడు రాజుగారు "యేమయ్యా! జగత్తంతా అబద్ధమన్నావుగదా? జగత్తులోనే యేకదేశమైన యేనుఁగును చూచి భయపడ్డావే" మని ధిక్కరించేటప్పటికి "అయ్యా! ఆయేనుఁగు రావడమూ అబద్ధమే. నేను పరుగెత్తడమూ అబద్ధమే. యిదంతా యీ మాయజగత్తులోదేకదా?" అని పండితుఁడు జవాబుచెప్పి రాజుగారికి వాగ్బంధం కల్పించాఁడనిన్నీ చెప్పుకుంటారు.

అద్వైతులు యీజగత్తులోనే వుండి సమస్తకార్యాలూ చేస్తూకూడా "జగన్మిథ్యా" అనడం యేలా సమన్వయిస్తుందంటే: వినండి "వ్యవహారావస్థా - పరమార్థావస్థా" అని అద్వైతులు రెండవస్థలు (వేద సమ్మతాలే) చెపుతారు. వ్యవహారావస్థలో యీజగత్తును యితరులతోపాటు అద్వైతులున్నూ వొప్పుకుంటారు. "అద్వైతం పరమార్థతః" అని పరమార్థంలో అనఁగా నిష్కృష్ట సిద్ధాంతావస్థలో గురువూ లేఁడు శిష్యుఁడూ లేఁడు; వొక పరమాత్మమాత్రమే త్రికాలాబాధ్యంగా వుంటాఁడు. "అంతా రామమయం యీజగమంతా రామమయం" అన్న రామదాసు కీర్తనకూడా యీఅర్థాన్నే బోధిస్తుంది. యిది విషయాంతరం. యీమార్గాన్ని అవలబించి ముక్తులైనవారు చాలా తక్కువగా వుంటారు. అందఱికీ అంతో యింతో అందుఁబాటులో వుండేమార్గం భక్తిమార్గం. భగవద్గీత పన్నెండో అధ్యాయం ప్రత్యేకించి యీభక్తిమార్గాన్నే బోధించింది. భాగవతం యావత్తూ దీన్నే బోధించింది. గోపికాస్త్రీల వ్యభిచారంకూడా భగవదుద్దేశకంగా (వాళ్ళాసందర్భం యెఱక్కపోయినప్పటికీ) జరిగి వుండడంచేత శృంగారభక్తిగా పరిణమించి ముక్తిప్రద మయింది. ఆయీపద మార్థాన్ని అన్యథాగా గ్రహించి దుష్కార్యాలకు సిద్ధపడతామంటారేమో? సిద్ధపడండి; మిమ్మల్ని వద్దనేవారెవరు? అనియ్యేవే వారికి జవాబు.

నారదమహర్షి మొదలైన జగదుపకారకులు, నానాయోనిసముత్పన్నులున్నూ నానాదుఃఖానుభోక్తలున్నూ అయిన జనులను చూచి దుఃఖించి "కేనోపాయేన చైతేషాం దుఃఖనాశో భవేద్ధ్రువం.....లఘూపాయేన తద్వద" అంటూ శ్రీమన్నారాయణమూర్తివారిని కోరడంలో "తేలికగా వుండే మార్గాన్ని" చెప్పమనడానికి కారణం యేమిటి? అలా కాకపోతే "సర్వే సర్వత్ర" తరించడం సంభవించదు. కనకనియ్యేవే లఘూపాయాలలో కొన్ని వుద్ఘాటిస్తాను,

(1) రామకోటివ్రాయడం, లేదా వ్రాయించడం (2) ఏకాదశ్యాది పుణ్యదినాలలో భజనలు చేయడం, (3) పుణ్యతీర్థాలు సేవించడం. (4) భగవద్భక్తులను ఆరాధించడం.... యింకా యీలాటివే పురాణ (భారత భాగవత రామాయణాది) శ్రవణం.

శ్లో. "ప్రాత ర్ద్యూతప్రసంగేన (భారత) మధ్యాహ్నే స్త్రీప్రశంసయా (రామాయణ)
రాత్రౌ చోరప్రసంగేన (భాగవత) కాలో గచ్ఛతి ధీమతామ్."

చూచుకోండి, అన్నిటికంటే నామస్మరణం బీదా సాదా అందరికీ అందుబాటుగా వుంటుంది. నారదోపనిషత్తులో—

శ్లో. హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.

ఆ యీ పదహారు నామాలూ పఠించడానికి యేవిధమైన నియమంగాని నిష్ఠగాని అవసరం లేదని స్పష్టంగా వాక్రుచ్చియున్నాఁడు, మహానుభావుఁడు నారదమహాముని. తరంగాలలో శ్రీనారాయణ తీర్థులవారుకూడా—

"రామకృష్ణ గోవిందేతి నామసంప్రయోగే
కామ మిహ స్నాతవ్యం సర్వోత్తమప్రయాగే"

అని యెత్తుకొని యేదో కొంత వక్కాణించి, ఆ కీర్తనలోనే వొక చరణంలో—

"స్నాన సంధ్యా జప హోమ తర్పణానపేక్షితే
హానివృద్ధ్యాదిరహితాఖండసుఖఫలదే "

అంటూ స్పష్టంగా వక్కాణించి వున్నారు. దీన్నిబట్టి అందరూ అపవిత్రంగానే వుండి భగవన్నామస్మరణ చేసుకోండని బోధించినట్లు తలఁపకూడదు. యిది విధివాక్యం కాదు. అగతిగతికంగా తెలుసుకో దగ్గది. శక్తినిబట్టి ఆమహాకార్యంలో ప్రవర్తించడంలో యేవిధమైన దోషమున్నూ వుండదని దీనిసారం. వొకఁడు జ్వరితుఁడై వున్నాఁడను కుందాం, వాఁడికి జ్ఞానంమట్టుకు వుండే భావిసద్గతికి భగవన్నామస్మరణ చేసుకోవలసివస్తే స్నానసంధ్యాద్యనుష్ఠానపూర్వకంగా కావాలంటే అది సాధ్య మవుతుందా ? ఆ పక్షంలో వాఁడు భగవన్నామకీర్తన అసలే మాను కోవలసి వస్తుందికదా ?

"యాఉంతే మతిస్సాగతిః" అంటూ చెప్తాయి గీతాదులు. యెవరో మహర్షులు అంతకాలమందుకూడా స్నానాదులు నెఱవేర్చుకొని యోగరీత్యా హంసలు (ప్రాణాలు) వదలడం వున్నా అది ప్రతిభక్తుఁడికీ సాధ్య మయేది కాదు. బాహ్యశరీరబలానికి చేసే కుస్తీకి యేంతకృషి చేయవలసి వుంటుందో! అంతశ్శరీరబలానిక్కూడా అంతకృషిన్నీ చేస్తేనేకాని ఆ ప్రాణాయామం సిద్ధించదు. వూరికే అన్నానేకాని అంతకుపదివేల రెట్లైనాకృషి చేస్తేకాని ఆ శక్తి లభించదన్నదే సిద్ధాంతం. దానికి తగిన గురువు దొర కాలి, ప్రతిభక్తుఁడికీ ఆయీ కారణసామాగ్రి సులభ సాధ్యం కాదు. లీలాశుకుఁ డేమన్నాఁడు.

"సంధ్యావందన ! భద్రమస్తుభవతే, భోస్నాన ! తుభ్యంనమః,
భోదేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతామ్,
యత్రక్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విష,
స్స్మారం స్మార మఘం హరామి బహునా మన్యేకిమన్యేన మే"

అన్నాఁడు. దీని ముఖ్యతాత్పర్యం యేమిటి ? స్నాన సంధ్యాది నియమాలన్నీ భగవన్నామకు లొచ్చుతాయనియ్యేవే. వొకవేళ స్నానాదికం లేకపోయినప్పటికీ కేవలభగవన్నామం చేత తరిస్తే తరిస్తాఁడేమో కాని భగవన్నామస్మరణ లేనిజ్ఞానాదులు వ్యర్థమనియ్యేవే. కీ. శే. శ్రీపరవస్తు రంగాచార్యులవారు (మహామహోపాధ్యాయులవారు) యేమన్నారా "గంధగజస్నానము మఱి" అన్నారు. నదిలో స్నానం చేసిన పిమ్మటకూడా–

> "శ్లో. అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా
> యస్స్మరే త్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః"

భవతు. యివన్నీ అశక్తులవిషయాలే కావు; కొన్ని కొన్ని సమయాలలో శక్తులకున్నూ సమన్వయిస్తాయి. యిఁక ముక్తిపదార్థాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. సాలోక్య సామీప్య సారూప్య, సాయుజ్య, ముక్తులు నాల్గిటిలో తుట్టతుదిముక్తి అద్వైతముక్తి. యిది సర్వేసర్వత్ర సాధ్యమయ్యేది కాదని లోగడ సూచించే వున్నానుగదా? తక్కిన మూఁడుముక్తులున్నూ భక్తులలో వారువారు చేసిన కృషినిబట్టి తరతమభావంగా లభ్య మవుతాయి. సాలోక్యముక్తి అంటే భగవంతుఁడు వుండే లోకంలోనే వుండడం; సామీప్యం అంటే భగవంతునికి అంతరంగభృత్యులలో చేరడం; సారూప్యం అంటే యేదో యించుమించు భేదం వున్నప్పటికీ భగవదాకారమే కలిగి వుండడం. యీమూఁడిటిలో తుట్టతుది దాన్నికూడా ద్వైతులు అంగీకరించరు. ద్వైతమతంలో యేజంతువుకు ఆజంతుజాతిలోనే వుత్తమత్వమో, వుత్తమోత్తమత్వమో రావడమే. అది వచ్చి ఆలోకంలో వుండడమూ, ఆవుండడంలోకూడా భగవత్సన్నిధానంలో వుండడమున్నూ, మనమతాలన్నీ యించుమించు ఒకటే విషయాన్ని బోధిస్తాయిగాని ఆ బోధించడంలో ద్వైతం కాస్త సుళువుగా బోధిస్తుంది. లోకంలో రాజూ మంత్రి యితరనౌకరూ యేలా వుంటారో దాన్నిబట్టి చూచుకుంటే యించుమించు సరిపోతుంది. వైదికమతాలేకావు అవైదికాలని మనం అనుకొనే క్రైస్తవాది మతాలుకూడా యించుమించు పర్యవసానంలో యీఅర్థానే బోధిస్తాయి. మిడిమిడి

జ్ఞానంతో సర్వజ్ఞత్వాన్ని నటించేవాళ్లతప్ప విశేషజ్ఞు లెవరూ ఆయీ మత స్థులు పరస్పరద్వేషాలు పెట్టుకోరు. కీ. శే. శ్రీపరవస్తు రంగాచార్యులవారు విశిష్టాద్వైతమతస్థులే అయినా యెవరు యేమతాన్ని గురించి వుపన్యసించ వలసిందని కోరతారో ఆమతాన్నిగురించి వుపన్యసించి ఆరోజున దానికే "వర్ణితానా ముత్తమవర్ణితమ్" అనే భావాన్ని ఆపాదించడం మనదేశంలో యెందఱో యెఱిఁగిన విషయమే. కనక విస్తరించేది లేదు. "నామస్మరణా దితరోపాయం నహి పశ్యామః" అని అభియుక్తులు చెవినిల్లుగట్టుకొని ఘోషిస్తూన్నారు. అట్టి నామస్మరణను విస్తరింపచేయడానికే సప్తాహాలు మొదలైనవి యేర్పడ్డాయి. అనేకజన్మార్జితమైన పుణ్యం ఫలిస్తేతప్ప భగ వంతునియందు భక్తి కుదరదు. అట్టి భగవద్భక్తి కుదరడ మంటూ వస్తే ఆ వ్యక్తికి సామ్రాజ్యాధిపత్యం కూడా గడ్డిపఱకకంటే కనిష్ఠంగా కనబడు తుంది. పూర్వకాలపు భక్తులు ప్రహ్లాదాదులుమాట ఆలా వుండఁగా యిటీవల కలికాలంలోకూడా పలువురు మహాభక్తులు వున్నట్టుమనకు వారివారి గేయాలవల్ల తెలుస్తూవుంది. జయదేవుఁడు, లీలాశుకుఁడు, నారాయణ తీర్థులు, త్యాగరాయలు. భద్రాచలం రామదాసు, నిట్టలప్రకాశం, యెడ్ల రామదాసు, యింకా యీలాటివారు చాలామంది వున్నారు. యెనిమిది మాసాలకు పూర్వం పరమపదించిన అల్లంరాజు పేరాజుగారు కూడా పూర్వభక్తకోటిలో చేర్చతగ్గవారుగా నాకు కనపడ్డారు. ఆయనకీర్తనలు భక్తిని వొలికిస్తూ వుంటాయి. "ఓం శ్రీం శ్రియఃపతే తిరుపతే శ్రీవేంకటా చలపతే" లోనైనవి చూచుకోండి. యీయన్ని ఆంధ్రదేశంలో పలువురు చూచే వున్నారు. కనక విస్తరించ నక్కఱలేదు. ముఖ్యంగా ఆయీభక్తు లకూ యితరులకూ వుండే భేదం వారివారి మృతికాలంలో తెలుస్తుంది. ఆయీ భక్తులకు వారినిర్యాణకాలం తెలియఁబడుతుఁడడమే తఱచుగా గోచరిస్తుంది. యితరులవలె వీరు ఆనిర్యాణసమయంలో శ్లేష్మాదిబాధలు పొందరు. అంతో యింతో దేహాభిమానం వీరికీ వుంటుంది. గాని యిత రుల కున్నంత వుండదు. వీరికి పరలోకానికి వెళ్ళడమంటే, యేదో వుద్యో

గంలోకి ప్రమోషను కావడంగా కనపడుతుంది. "తరలీపోతాము చాలాదయ యుంచండీ! యిఁక మరలీ జన్మాలకు రాము మదిలో నెంచండీ" అనే రామదాసుగారికీర్తన యీఅర్థాన్నే బోధిస్తుంది. నిజమైన భగవద్భక్తి అంకురించడానికి ఆరంభమైన గడియ మొదలుకొని లోఁగడ ఆశ్రయించుకొని వున్న మానవజన్మ సహజమైన దుర్గుణాలు తగ్గడానికి మొదలై ఆత్మని పవిత్రం చేస్తాయి. అట్టి భక్తి అంకురించడానికి భక్తసమాజాలు మొదలైనవి దోహదమవుతాయి. మన ఆంధ్రదేశంలో ముఖ్యంగా యీ భక్తికి దోహదమిచ్చే సంస్థలు గుంటూరు ప్రాంతంలోనే ప్రస్తుతం కనపడుతున్నాయి. వీరిని వరవడిగాఁ బెట్టుకొని సర్వేసర్వత్ర యీసమాజాలు వ్యాపించి యీ కలియుగదోషాలను నివర్తింపఁ జేస్తాయని ఆశిస్తాను. యీమూలంగా నాకుకూడా తాము చేసే పుణ్యకార్యంలో భాగాన్ని కల్పించిన శ్రీగుంటూరు సీతారామనామ సంకీర్తనమందిరసోదరులను మఱీ మఱీ అభినందిస్తూ వారి వుద్యమమున్నూ దాని అభివృద్ధికై వారు ప్రారంభింపబోయే "మోక్షసాధని" అనేపత్రికయున్నూ దినదినాభివృద్ధి నందుఁగాక యని మనః పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

శ్లో. రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః [స్వస్తి.



# తెనాలి రామలింగకవి కవిత్వం

(కథలు — గాథలు ప్రథమభాగముయొక్క 823 పేజీలో ముగింపబడిన "తెనాలి రామలింగకవి కవిత్వం" అనేవ్యాసంయొక్క తరువాయి భాగంగా యీ దిగువవ్యాసాన్ని చదువుకోవలెను.)

'విలసనశిఖాధూర్ధరములు' యీసమాసంలో ధూశ్శబ్దానికి, ధురా అనే రూపం శాస్త్రతః సమాసాంతప్రత్యయం చేసుకుంటే కావలసివుంది. కాశీ

ఖండంలో శ్రీనాథుఁడు కూడా యిదేమాదిరిని ప్రాసస్థానంలో యీలాటి ప్రయోగమే ప్రయోగించి వున్నాఁడు. సమాసాంతవిధికి అనిత్యత్వం చెప్పి దీన్ని సమర్థించాలి. శ్రీనాథుఁడంటే? అల్లాటప్పా కవులలో చేరే వాఁడుకాఁడు. తెలుఁగుకవిగా లోకంలో అతణ్ణి వాడుకుంటూవున్నాంగాని పనిపడితే సంస్కృతభాషలో—

"పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క"

అని డీకుంటాఁడు. కవితాసారస్యం తెలియక—

కల్హారైః పరికల్పితేవ లలితామాలా కవేర్భారతీ
శుష్కాణాం పరిపీడనం నసహతే.

అనే కాళిదాసోక్తిని గమనించక వెఱ్ఱిశంకలుచేసే శుష్కపండితులను—

"కామికిన్....అచ్చోట విద్వాంసుల్ రాజమహేంద్రపట్టణమునన్.... ప్రధ్వంసా భావము ప్రాగభావమనుచుం దర్కింతురు."

అని యుక్తియుక్తంగా మందలింపఁగల మహావిద్వత్కవి. మన రామలింగానికి శ్రీనాథుఁడంటే చాలా గౌరవం కనక అతని ప్రయోగాలు తఱుచు వాడుతూవుంటాఁడు. దినవెచ్చము బచ్చింట వగయిరాలు శ్రీనాథుఁడు వాడుటచేతనే యితడు వాడినాఁడని తెలివిడి. శ్రీనాథునివలెనే సంస్కృతసమాసాలు రామలింగం గుప్పిస్తాఁడుగాని ఔచిత్యం గమనించక పోవడంచేత ఆపట్ల యితఁడతనికి లోఁగుతాడు. శ్లేషలు వాడడం మానఁడు గాని అవికూడా భట్టుమూర్తి వాడినట్లు—

(1) "సీరజారాతి; నినుఁ దనసెలవుగూల"

(2) "విమలమధుర మనోహరవృత్తి వెలయువారి" (వగయిరాలుచూ.)

ఆనందజనకంగా వుండవు. యింతకూ యితఁడు పుచ్చుకున్న కథావస్తువు యేరసానికిఁగాని అనువయినది కాదు. విష్ణుభక్తిపారమ్యంతప్ప

యీకథలో కావ్యశిల్పానికి తగ్గపదార్థం లేదు. అట్టికథను మతపక్షపాతం కోసం పుచ్చుకోవలసివచ్చినట్లు తోస్తుంది. యెంతసేపు చెప్పినా నారదుఁడూ కుమారస్వామీ పార్వతీపరమేశ్వరులూ అగస్త్యుడూ లోపాముద్రా కాశీ, కైలాసము వైకుంఠమూ శ్వేతద్వీపము వీట్లను కథావస్తువులుగా పుచ్చుకొని అన్నిరసాలూ వచ్చేటట్టు చేశాఁడు, నిగమశర్మకథ సుశీలకథ యీ రెండూ యీగ్రంథానికి వన్నె తెచ్చాయి గాని యివిలేకపోతే యీపుస్తకం కేవలంగా వైష్ణవసంధ్యావందనంగా పరిణమించేది. యిప్పుడో సర్వరసాలకూ యిది ఆలవాలంగా వుండిన్నీ యేకారణంచేతనో వసుమను చరిత్రాదులతో తులదూఁగలేకపోతూ వుంది. యేదో విధంగా ప్రసక్తి కల్పించి ఆయీ గ్రంథంలో పచ్చిశృంగారాన్నికూడా అతిగూఢంగా వర్ణించివున్నాఁడు. గాని దేనికీ ప్రాధాన్యం యివ్వక ప్రకారవిధయా వర్ణించుకుపోవడంచేత యెంతో పరిశీలిస్తే తప్ప దీనియోగ్యత బయటికి రాదు. శ్రీవర్ణన వసుచరిత్రమాదిరిగానే చేసివున్నాఁడు. కాని అతని వర్ణనలోకొన్ని పద్యాలు "లోకులరసనలె, ఆకులుగా" నున్నట్లు (1) నానాసూన, (2) తనకప్పు నెఱికప్పు (3) తనరాజీవశరంబు(వగయిరాచూ) ఇతనిపద్యాలకు స్థానం లేదు, "అతివకచనాభిఘన" లోనయిన పద్యాలితనివే అయినా అవి యీకబ్బంలో కనపడవు చాటుధారబాపతేమో; చంద్రోపాలంభన, మన్మథోపాలంఁభనలు యితఁడు చేయనేలేదు. ఇతని కవిత్వంలో కవిత్వానికి జీవితమైన వ్యంగ్యం వసుచరిత్రకన్న యెక్కువగానే కనపడుతుంది. కాని మొత్తంమీఁద ప్రసాదగుణం తక్కువ. కనక గ్రంథం నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు శ్లేషమయంగావున్న వసుచరిత్రకున్నంత ప్రచారం దీనికి లేకపోవలసి వచ్చింది. దీనికి వ్యాఖ్యానం సరియైనది లేదు, సరికదా ప్రమాదముగా చేసిన అర్థాలతో కూడా నిండి వుంది. అత్యవసరమైనచోట్లు స్పృశింపనే లేదు. ఆముక్తమాల్యద పాకం కన్నా యిది కొంత బిరుసు పాకంలోనే వుంటుంది. దానిలో "ఆసిస్థానిధిగేహ సీమ" "గృహసమ్మార్జనమో" అనేపద్యాలమాదిరివి,

(1) గంగాసంగమ మిచ్చగించునె ! (2) "మాయపు బిడ్డయీనిసువు" వగయిరాలు దీనిలోనూ వున్నాయి. రెండూ వైష్ణవమతమునకు అనుకూలించే భక్తిప్రధానగ్రంథములే. అంతో యింతో శైవాన్ని నిరసించే గ్రంథాలే. కృష్ణరాయలకన్న యితఁడు లోపల శివద్వేషం లేనివాఁడుగా కనపడతాఁడు. కృతిపతిని సంతోషపెట్టడానికి వైష్ణమత ప్రపత్తిని విశదీకరించినట్లుగా తోస్తుంది. శివునివిషయం కూడా మిక్కిలిప్రపత్తితో వర్ణిస్తాడు. కాని "అథవా ప్రతిపక్షస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్" "తజ్జయాన్నాయ కోత్కర్ష వర్ణనంచ" అన్నమాదిరిగా తేల్చి తదపేక్షయా విష్ణువునకు ఆధిక్యం కలిగిస్తాడు. అంతేకాని, యెంతవెదకినా శివదూషణ కనపడదు. రాయలు కొంతచేసినట్టు స్ఫురిస్తుంది. కాని యితని రచనలో అదిన్నీ లేదు. శివద్వేషం కవికి లేదుగాని ఈగ్రంథం శైవులకు మంట పుట్టిస్తుంది. అద్వైతమతానుకూల్యంగానే వున్నట్లు వుండివుండి చివరకు సమబుద్ధివీడి ఉన్నతస్థానం విష్ణువుకు సంపాదిస్తాడు. యీ విషయంలో యితని గడుసుతనం వర్ణనీయం.

"స్కాందపురాణ.....కడుఁ గ్రొత్తగు సొమ్మొనరించి
విష్ణుసేవం దిలకించు నప్పరమవైష్ణవకోటి నలంకరింపుమా"

అని కృతిపతి వేదాద్రిశౌరి కోరిన కోరికను యితఁడు గ్రంథంలో ప్రతీ అక్షరమందూ గమనిస్తూనే యీగ్రంథాన్ని రచించాఁడు. ఆయీకథ శ్రీనాథుఁడు కాశీఖండాన్ని గ్రహించినట్లే స్కాందపురాణాన్నుంచే కవి గ్రహించాఁడు. కాని పాత్రలమట్టుకే కాని తక్కినవర్ణనాదులు స్వకపోలకల్పితాలే అని నేను తలుస్తాను. స్కాంధపురాణం దగ్గిఱపెట్టుకొని పరిశీలించి నేనీమాట వ్రాయలేదు. పూర్వకవులపక్కీ తఱచుగా నిట్టిదే యగుటచే నిట్లువ్రాశాను. పుండరీకుఁడు పరమవైష్ణవుఁడని చెప్పక తప్పదు. అట్టి పుండరీకుణ్ణి "భస్మోద్ధూళిత పాండురాంగుణ్ణి" గా వర్ణించాఁడు. యింతేకాదు. ఆయీయితిహాసాన్ని పార్వతికీ నారదునకూ స్కందునకూ వక్కాణించిన శివుణ్ణి వైష్ణవసార్వభౌముణ్ణిగా పేర్కొ

న్నాఁడుగాని, వైష్ణవచిహ్నములు ధరించినట్లు వర్ణించలేదు. (క. కావున శరణము వేడెద నావైష్ణవసార్వభౌమున్ చూ. 2 ఆ)

"శ్లో, శివం పరమభాగవతం స్మరామి" అని విశిష్టాద్వైతులు శివునకు ఆళ్వారులలో పరమోత్కృష్టస్థానం యిస్తారు; ద్వేషింపరు. కాని ఆయనకు తులసిమాలికలు గాని పద్మాక్షమాలికలుగాని ద్వాదశోర్ధ్వపుండ్రములుగాని అలంకరింపరు. విష్ణుభక్తులలో అగ్రేసరత్వభాగ్యం కలిగించినా శివునకు ఆభక్తులకుండే అలంకారా లేవీ కలిగించకపోవడం చూస్తే "సాహేబుకు సవారాజ్యం కలిగినా బీబీలకు కుట్టుకాడలే" అన్నలోకోక్తికి స్మారకంగా కనపడుతుంది. యీశంక శైవులమీఁదావుంది. శ్రీమహావిష్ణువవగైరా దేవతాసార్వభౌములు లింగధారణంవున్న శైవులుగా (గ్రంథప్రమాణంకూడా వుందే అనుకుందాం) చెపుతారు. కాని తక్కిన శైవచిహ్నా లున్నట్లు వారున్నూ చెప్పరు, ఉపపురాణాలలో వొకటయిన పారాశర్యపురాణంలో శివుఁడు పార్వతికి వైష్ణవమత సంప్రదాయములను వివరించడం కనపడుతుంది. అందులో సమాశ్రియణం (చక్రాంకితం) కూడా ప్రశంసింపఁ పడింది. ఆభాగం పరిశీలిస్తే శివుఁడు పరమవైష్ణవ సార్వభౌముఁడుగా తోఁచకమానఁడు కాని పార్వతి "దేవా ? మీరు సమాశ్రియణపరులు కాలేదేమి, అని ప్రశ్నిస్తే పరమేశ్వరుఁడు చెప్పేజవాబేలా వుండునో ? అనిపిస్తుంది. తత్తథాస్తామ్.

పుండరీకుఁడు భస్మధారిగా వున్నట్లు రామలింగంవంటి మహాకవి వర్ణించడాన్ని బట్టిచూస్తే తపస్వులు భస్మోద్ధూళితులుగానే వుండేవారేమో; (శైవవైష్ణవాది భేదం యీవిషయంలో అకించిత్కరమన్నమాట) అనిపిస్తుంది. అలాకాకపోతే స్వల్ప విషయంలో మహాకవిచక్రవర్తికి "నాకవిత్వమం దొకనికి దప్పవట్టఁ బనియుండదు" అని ఘంటాపథంగా మహాసభలలో ప్రతిజ్ఞచేసి నిర్వహించుకొన్న ప్రతిభాశాలికి అజ్ఞత్వాన్ని ఆపాదించ వలసి వస్తుంది. నిగమ శర్మనిగూర్చి వ్రాస్తూ "మీనుమీసమువంటి యొంటిజందెము" అని చెప్పడం (గృహస్థుగదా;) భ్రాంతిమూలకమని

కొందఱంటారుకాని దానికీ నేను వొప్పుకోను. అతఁడు గృహస్థే కాని విటాగ్రేసరుఁడై యావత్తు వైదికధర్మాలకూ స్వస్తిచెప్పి తిరుగుతూ వుండడంవల్ల షోకుకు భంజకమనేతాత్పర్యంతో అసలే యజ్ఞోపవీతాన్ని వర్జించినట్లు వర్ణించినా ఉచితంగానే వుండేది. ("విటునకు సత్యధర్మములు వేశ్యకు నేమము లేదుగా భువిన్." వైజయంతి చూ) అట్టిస్థితిలో ఒక జందెమేనా ద్విజత్వబోధకంగా ధరించినట్టు చెప్పడంలో తప్పులేదనే నేననుకుంటాను. రామలింగం మొట్ట మొదట శైవుఁడనుటకుఁ గల ఆధారాన్ని వ్యాసారంభంలో వుటంకించి వున్నాను. ఇటీవల వైష్ణవమతం స్వీకరించి తనవలెనే మధ్యకాలంలో వైష్ణమత స్వీకర్త విరూరి వేదాద్రి మంత్రిగారి కోరిక ననుసరించి విష్ణుపారమ్యబోధకమైన యీ మహాకావ్యాన్ని రచించాడు. లోకంలో హిందువులలో మఱికొన్ని మతాలు లేకపోలేదుగాని విప్రతిషేధ (తుల్యబలవిరోధము) ముతో తగినంత ప్రవృత్తి కలమతాలు శైవవైష్ణవమతాలే. శివునకు విష్ణువుమీఁదగాని విష్ణువుకు శివునిమీఁదఁగాని లేశమున్నూ ద్వేషమున్నట్లు పురాణాలలో కనపడదు, సరిగదా పైఁగా వీరిరువురున్నూ మిత్రులని కూడా తెలియఁబడుతుంది, ఇట్టిస్థితిలో ఆ యీభక్తులు ఆదేవుఁడే వుత్కృష్టుఁడనిన్నీ యీ దేవుఁడే వుత్కృష్టుఁడనిన్నీ చాల కాలాన్నుంచి వివాదపడడం శోచనీయమే అయినా యీ వివాదములు లౌకలూకాయలకు సంబంధించినవికాక మహామహులకు సంబంధించినవి కావడంచేత యెవరున్నూ కాదనడానికి అవకాశం కనపడదు. 18 మహాపురాణాలలో 11 కాఁబోలును శివపారమ్యానికి తోడ్పడతాయి. సంఖ్యాబలాన్నిపట్టి శివుఁడు వుత్కృష్టుఁడనేవాదాన్ని క్షణంలో శ్రీవైష్ణవపండితులు వొక్కమాటలో ఖండిస్తారు.

ఆ వొక్కమాట "తామసపురాణాలు" అన్నదే! యిప్పుడు ఆయీ వాదాలు చాలా తగ్గినాయికాని రెండుమూడు శతాబ్దాలనాఁడు యీవివాదాలు యిప్పటి ఖండాతరయుద్ధాలవలె వుండేవని తోస్తుంది. అప్పటిరాజులు హైందవులఁగుటచేత వారుకూడా పూర్తిగా యీవివాదాలలో జోక్యం

కలిగించుకొనేవారు. కృష్ణరాయల ఆముక్తమాల్యదవల్ల యీ అంశం గోచరిస్తుంది.

పాండురంగ మాహాత్మ్యంకూడా అయీవిషయాన్ని సూచిస్తుంది. కృతిపతి రాజు కాకపోయినను మంత్రికనక తత్తుల్యుఁడే. యీ వేదాద్రి మంత్రి యేరాజువద్ద మంత్రిత్వం చేశాఁడో గ్రంథపీఠికవల్ల బోధపడడం లేదు. కాని వొకపద్యంలో—

"....పెదసింగభూపాలు శత్రుజైత్రు
గొల్చి వేదాద్రి నిత్యలక్ష్మిలఁ దనర్చు"

అని వుంది కనక యీ వేదాద్రిమంత్రికి ప్రభువు పెదసింగభూపాలుఁడు; అన్నంతవఱకు తెలుస్తుంది. అభూపాలునిరాజ్య మేప్రాంతంలోదో; దానికి ప్రధాననగరం యేదో తెలుసుకోవడానికి ఆధారాలు యీ మాహాత్మ్యంలో లేవు: మంత్రిపదం ససంబంధికం కనక అది రాజుని ఆకర్షించి తీరుతుంది. పీఠికలోవున్న పద్యంవల్ల రాజుగారిపేరు మాత్రం తెలిసింది; మనకి; అయీసింగభూపాలుఁడు గారి ప్రభుత్వకాలం తెలిస్తే దాన్నిబట్టి "తాడుతోదబ్బనం" గా రామలింగం యేకాలంవాఁడో సుళువుగానే తెలిసేది. అలా తెలియడమంటూవస్తే రామలింగం కృష్ణరాయల సభలో ముక్కుతిమ్మనాదులతోపాటు వున్నాఁడా? లేదా అనే సందేహం క్షణంలో తీరుతుంది.

ఉ. అరవి వీరభద్రచరణాహతి డుల్లిన బోసినోటికి
న్నెరఁడు రామలింగకవి నేరిచెఁబో; మన ముక్కుతిమ్మన
కూరపదాహతిం దెగిన కొక్కెరిపంటికి దుప్పికొమ్ము పల్
గా రచియించినాఁడు కవి గాననిచో రవి గాంచనేర్చునే?

అనేపద్యంవల్ల రాయలసభలో రామలింగానికి చోటున్నట్టు కనపడుతుంది. యిందుమతీపరిణయంలో వుదాహరించుకొన్న కుమారధూర్జటి పద్యం చూస్తేకూడా పైసంగతి బలపడుతుంది.

"స్తుతమతియైన యంధ్రకవి ధూర్జటిపల్కులకేల కల్గెనో
అతులితమాధురీమహిమ ? నా మనుమీపెదతాత చాల స
న్నుతిఁగనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభన్ "

అన్నపద్యంలో వున్న ప్రశ్నకు జవాబు "హా ! తెలిసెన్ భువనైకమోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహార సంతతమధురాధరాధర సుధారసధారలు గ్రోలగా జుఁడీ" అని రామలింగం చెప్పినట్టే విద్వత్పరంపర యిప్పటికీ చెప్పుకుంటూ వున్నారు. యింతేకాదు. రామలింగమేమో ? ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా యేడిచాఁడు. అల్లసాని పెద్దన్న అంతంతగా యేడిచాఁడు. బట్టుబావురుమని ఏడ్చాడు; అని యేదో ప్రసక్తిలో రాయలవారి సభలో వికటప్రసంగం చేసేటప్పటికి రాయలవారు "సరే వారిమాట అలావుంచుదాం, నీవేలాయేడుస్తావో ? యేడ్చి చూపించు" అని ప్రశ్నించేటప్పటికి రామలింగం.... "భూపాలైకరాగమ్మనన్."

అని తుట్టతుదకు శ్లేష (భూపాలఅంటే; రాజు - ఆపేరుగలరాగం.) వచ్చేటట్టు చెప్పి రాయలను మెప్పించి గౌరవం పొందినట్టు చెప్పకోవడం వుంది. కాని యీవిషయం రాయలవారికి రామలింగం సమకాలీనుఁడు కాకపోయినా రామలింగం కాలంలో మరొకరు (రాజే కానక్కరలేదు.) రామలింగం చేసిన ఆక్షేపణమీఁద ప్రశ్నించినప్పుడు తన కవితాతిశయాన్ని చూపించాఁడన్ననూ సరిపోతుంది. ఆయీకాలములలో జరిగినసంగతులు యెప్పటి కప్పుడు వ్రాసి పెట్టుకుంటే కష్టంవుండదుగాని అలా పెట్టుకోక సింహావలోకనం చేసి వ్రాయవలసివస్తే యధార్థం తేలడం కష్టసాధ్యం. యీబాధలు చారిత్రకదృష్టితో విమర్శించే వారిని గాని కవిత్వపురసారసములనుగూర్చి విమర్శించేవారివి కావు కనుక మళ్లాప్రధానాంశాన్ని వుపక్రమించి వ్యాసం వుపసంహరించే మార్గం చూస్తాను. పాపపూరుషుఁ బటాపంచఁజేసి, పటాపంచశబ్దాన్ని తఱచుగా కవులు బహువచనాంతంగా వాడుతూన్నారు. కనక శంక కవకాశంవుంది. కాని వడ్లు వగయిరాశబ్దాల మాదిరిని, పంచ శబ్దం నిత్యబహువచనం కాదు. కనక శబ్దతత్వమెఱిఁగిన

రామలింగకవి ఆవిధంగా ప్రయోగించాఁడని నేననుకుంటాను. 'పాండు రంగఁడు' ఇది యీగ్రంథకర్తకు సుప్రసిద్ధనామంగా వాఁడే రామలింగఁడు వంటిది. అది కుదిరితే యిది కుదురుతుంది. ఇది కుదిరితే అది కుదురుతుంది. తథాచ. "అన్యోన్యాశ్రయ స్సంపన్నః లింగ, రంగ, శబ్దాలు. సంస్కృతమనుకొంటే, "పాండురంగుఁడు, రామలింగుఁడు, అని ఉకారవిశిష్టం కావలసి వస్తుంది. శాస్త్రమ్మాట దేవుఁడెఱుగునుగాని, ఉకారఘటిత రూపాలు సహృదయులు యేవగించుకుంటారు. రామలింగశబ్దానికి రామలింగము అనే అమహద్రూపం లోకప్రసిద్ధం. శైవులు పెట్టుకొనే పేర్లన్నీ అమహద్రూపాలుగానే (బ్రహ్మయ్యలింగం, శరభయ్యలింగం) వుంటాయి. కాని, డుజ్ప్రత్యయఘటితంగా (బ్రహ్మయ్యలింగుఁడు లేదా : లింగడు) వుండవు. యిది సర్వానుభవసిద్ధం. డుప్రత్యయం చేరిస్తే యింకో చిక్కు. వెంకఁడు, పుల్లఁడు, రాగఁడు వగయిరాశబ్దాల మాదిరిని నీచత్వ బోధకాలుగా పరిణమిస్తాయి. శ్రీ వైష్ణవులు రంగేశ్వరునియందు పరమభక్తులై యుండిన్నీ రంగఁడు అని వాడడం వుంది. దీన్ని బట్టి అది నైచ్యాన్నే కాక భక్తిని కూడా బోధిస్తుందని తెల్విడి. పదకవులు కొందఱు "రంగా? నీకిదేమంగళం కస్తూరిరంగా ? కావేటిరంగా ? నీకిదే". యీరంగా సంబోధన తెలుగనుకొనే వారికి కుదురదు. మగశబ్దానికి సంబోధన మగఁడా ? అని అవుతుంది గాని, మగా ! అనికాదు దీనితోపాటుగా అల్లుఁడు కొమరుఁడు వగయిరాలు చూచుకోండి. "మరుఁడా ? గరుడాసనుని కొమరుడా" అని మహాకవిప్రయోగం. అందుచేత రంగశబ్దం సంస్కృతమే అనుకోవాలి. ఆపద్ధతిని, రంగా ? మంగళం కుదురుతుందికాని రంగఁడు ప్రయోగం కుదరదు. (సేయ ముభయతః పాశారజ్జుః)యింకో శంక మంగళహారతి కీర్తనలో "కావేటిరంగా!" అనే సంబోధనలో కావేరీశబ్ద (కవేరస్య మునేః అపత్యం కావేరీ నామనదీ) గత రీ వర్ణమునకు ఏఱుశబ్దానికి వచ్చే ఔపవిభక్తికవికారం టి. అనేది చేరడం విచార్యం. ఇది విచారణాంతరం. తీఁగె తీస్తే డొంక కదులుతుంది. అసమగ్రమైన మనతెలుగు వ్యాకరణాలు

చేత పుచ్చుకొని యేశబ్దాలు సాధిస్తాం. "ఎద్దునెక్కినవాఁడు లింగఁడు బొల్లి గఱ్ఱిద్ద నెక్కినవాడు రంగఁడు" మన అసమగ్రవ్యాకరణాలకు జంకి ఆయన గాని, యీయనగాని దిగుతారా ? అందుచేత రామలింగకవిగారి పాండురం గఁడు పాండురంగఁడే కాని పాండురంగుఁడు యెన్నటికీ కాఁడని ఆంధ్రకవి లోకానికి నావిజ్ఞప్తి. ఈచర్చవల్ల తెలుఁగుకవిత్వానికి వ్యావహారిక ప్రసక్తితో యెట్టి చుట్టఱికం వుందో వ్యాకరణాలకు తెలుఁగుమహాకవులు యెంతవఱకు లొంగివర్తించారో యీలాటి చోట్ల లొంగితే వచ్చేచిక్కెట్టిదో కొంతేనా అవగతమవుతుందని నా ఆశయం. "తిరుమలేంద్రశ్రీ మహారాయనిన్, ఆయీ వసుచరిత్ర ప్రయోగమునందలి రాయనిన్, అనే చోటకూడాయీలాటి చర్చే వుంది. అదిన్నీ ఎగఁదీస్తే గోహత్యా దిగఁదీస్తే బ్రహ్మహత్యాగా కనప డుతుంది. లోఁగడ దీన్నిగూర్చి యేదోవ్యాసంలో చర్చించివున్నట్లు జ్ఞాపకం.

రామలింగంగాని భట్టుమూర్తిగాని ప్రాచీనులలో మఱికొందఱు గాని గ్రాంధిక భాషాకవులే గాని వ్యావహారిక భాషాకవులు కారన్నంత వఱకు నిర్వివాదాంశం. అట్టివారికి కొన్ని చోట్ల లోకవ్యవహారం అను సరించడం తప్పింది కాదని తెల్పడానికే పాండురంగఁడు అనే పదాన్ని గూర్చి యీ నాల్గుమాటలూ వ్రాయవలసి వచ్చింది. అసలు పుండ రీకుఁడనే వాఁడు భక్తుఁడు. భగవంతుఁ డతనికి ప్రత్యక్షమై ఆతని కోరికను మన్నించి ఆక్షేత్రమందు నివసించడమే కాకుండా ఆతని పేరుతో ఆయీక్షేత్రం వ్యవహరించఁబడడానికూడా వరం ప్రసాదించాడు. పుండరీక శబ్దానికి రంగ శబ్దం చేరిస్తే పుండరీకరంగ శబ్దంగా తేలు తుంది. మళ్లా పృషోదరాది గణంలో చేర్చి రీక, శబ్దానికి లోపం చెప్పడ మే కాకుండా పుండశబ్దంలో వున్న ఉకారానికి అకారదేశం కూడా చేస్తే చచ్చిచెడి చాయంగల విన్నపాలుగా పాండరంగ శబ్దం నిష్పన్న మౌతుంది. దానిలోవున్న డకారోపరిస్థమైన అకారానికి ఉకారాదేశంకూడా చేస్తే పాండు రంగమూర్తి ప్రత్యక్ష మవుతాఁడని తెల్పేడి. యిప్పటికి యీచర్చ ఆపుతాను.

రామలింగం మార్గం కొంత పరిశీలిస్తే "తృతీయః పంథాః" అన్నమాదిరిగా వుంటుంది. యితనిపేరుకూడా యిన్నిచిక్కులతో సంబంధించిందే. తత్తథాస్తాం. శివున కీయన వాడే పేళ్లు చూడండీ (1) గోకర్ణ కుండలుండు, (2) బ్రహ్మగర్భుఁడు. యీ రెంటిలో మొదటిది శివునకు రెండోది కుమారస్వామికి, వాడఁబడింది. గోశబ్దం నానార్థకం. గోనేత్రము అదే కర్ణంగా కలవి (చక్షుశ్శ్రవములు కొంతతలకిందు చేయాలి) అనఁగా పాములు కుండలాలుగా కలవాఁడు. రెండోశబ్దం కుమారస్వామికి అంతప్రసిద్ధంగా వున్నట్టు తోఁచదు. వూరికే మచ్చు చూపినానుకాని యితఁడు ప్రతిదానికీ మాఱుమూలపదాలే వాడతాఁడు, దీన్ని వివరించవలసివస్తే గ్రంథం చాలా పెరుఁగుతుంది. సంస్కృతంలో "నవసర్గేగతే మాఘే నవశబ్దో న విద్యతే" అనే గౌరవం మాఘానికి మాత్రం వుంది. ఆగౌరవాన్ని తెలుఁగుకావ్యాలలో యీ మాహాత్మ్యానికి యివ్వవచ్చు నను కుంటాను. శబ్దరత్నాకరంలోచూస్తే దీనిలో వున్న మాటలకు అర్థం కన పడదు. భారతాదులలో లేనిమాట లెన్నో యిందులో వున్నాయి. అవి దేశ్యాలో? లేక తద్భవాలో తెలుసుకోవడం చాలా కష్టసాధ్యం. "ఎత్తె మున్మన్మగుజ్జుల నెందజేని" ఈవాక్యంలో కుజ్జులన్, అనే ద్వితీయాంతానికి ఎందఱు అనే ప్రథమాంతం విశేషణంగా ప్రయోగించాఁడు. "పాఠక్రమా దర్థక్రమో బలీయాన్" అని వుండడంచేత, ఎందజేని మునిమన్మగుజ్జులను ఆనుశీల యెత్తెను, అని మార్చి తాఱుమాఱుచేసుకుంటే నిర్దుష్టంగా సమన్వయించినట్లుంటుంది; గాని వున్నదున్నట్టుగానే సమన్వయించవలసివస్తే యెబ్బెట్టుగా కనపడుతుంది. షష్ఠికి ప్రథమాంతం విశేషణమనడం ప్రసిద్ధం. (విద్యారాజీవభవుండు మారనకు కాశీఖండం చూ) క్వాచిత్కంగా ద్వితీయాంతానికి కూడా ప్రథమాంతం విశేషణం అవుతుంది. దానికి యిదే లక్ష్యం కాదు, ఇంకా యీలాటివి మహాకవుల ప్రయోగాలు వున్నాయి. కాని వాటికి తాఱుమాఱు బాధ లేదు.

తెమలు. అనేకృదంతరూపం (కనలువంటిది) రెండుచోట్ల వాడి వున్నాఁడు. టిప్పణిలో చలనమునందు (అనఁగా) ప్రవాహము నందు

అనివుంది. ధాతువు ధాతువుగానే వుండి కృదంతంగా మారింది. "సుయి దాఁటే వానికిన్" యీప్రయోగాన్ని గుప్తార్థప్రకాశిక కాఁటోలు ఆక్షేపించింది, ఇది లోకోక్తి. లోకోక్తులు గ్రాంధికంగా మార్చి వాడుకున్న కవులున్నూ వున్నారు కొందఱు వున్నవున్నట్టే వాడుకున్నారు. "లోకోక్తీనాం భవే ద్యోగో యథా వచ్ఛ్రుతిరంజనమ్" అనే కారికను (అహోబల చూ) బట్టి యథాశ్రుతంగా వాడుకోవడమే అందం, కనకనే రామలింగం దాఁటేవానికిన్ అని వాడుకున్నాఁడు గాని అది వ్యాకరణ విరుద్ధమని యెఱుఁగక కాదు. పింగళి సూరనార్యుఁడు "రోళ్ళా రోకళ్ళా పాడిన కూరములు" అని దిద్దవీలులేనిచోట ప్రయోగించినాఁడు. "హాలు విఱిగితే పెరుగగునే" అని వై జయంతీవిలాసం. లోకోక్తుల విషయంలో యెవరూ శంకించకూడదని నా మనవి. "కావుకావనుట రక్కసులమూఁకనె కాని" యీ సీసచరణంలో అచ్చు పరంగావున్నప్పుడు ప్రార్థనార్థకమువర్ణలోపం చేసి (కావనుట, కావుము + అనుట) నట్లుస్పష్టం. దీనికి సూత్రాధారంగాని ప్రామాణిక ప్రయోగాధారంగాని కనపడదు. అయితే రామలింగానికి యీ స్వల్పవిషయం తెలియదా ? తెలుసు. కాకికూఁతను అనుకరించడంకూడా ప్రస్తుతం అవసరం. "నీయెడసింహనాదవిహృతి" అని అనుపదమే వుంది. నీచేత వోడిపోయిన రాక్షసులు కావుకావుమని (కాకులవలెనని ధ్వని) అఱచుచున్నారనిన్నీ నీవో ? సింహనాదం చేయుచున్నావనిన్నీ కదా ! కవిహృదయం. కాకులపక్షంలో యీమువర్ణకలోపం బాధించదు.

"ఇవి రాజసుతులు చేయవలసినపనులు కావుకావంచుఁ గాకమ్మ లఱచె" (మాబుద్ధచరిత్ర) మాప్రయోగం ప్రార్థనార్థకంకాదు. వ్యతిరేకార్థకం. యీ ప్రస్తుతప్రయోగము పేటొకయర్థంలో ప్రార్థనార్థకం కావడం తప్పదు. అందుచేత శంకకవకాశం కలిగింది. దీనికి సమాధానం యీలాటి శ్లేషస్థలాలలో, ఈషద్వైషమ్య మవివక్షితంగా (గుఱికి బారెఁడు హెచ్చు తగ్గుగా) పోవలసిందే కాని విశేషించి వ్యాఖ్యాతలు పట్టుపట్టకూడదు. పట్టు

పట్టి దిద్దిస్తే కవిత్వపుసొగసు చెడుతుంది. (యీయనకవిత్వంలో యీలాటి శబ్దమూలకధ్వని విశేషించి వుంటుంది. కృష్ణుని బాల్యవర్ణన 3 వ. ఆ. 'కనుగట్టి గాంగేయగర్భుడాగురుమూఁత లాడించె' లోనగు పద్యాలు చూడ నగును) వసుచరిత్రలోని మసలిమానులు ముసలిమ్రాకులుగా దిద్దితే రెండవఅర్థం (తురుష్కులనేది) రాదు. కాపక్షమయితే మ్రానులు; అప్పుడూరాదు. రాఘవపాండవీయంలో "పాండురాజయశము" అన్నచోట వొకపక్షంలో జకారం దంత్యం. ఒకపక్షంలో తాలవ్యం. కొంచెం సడలించి రసికులు రసానుభవపరులౌతారు.

"కవేర్భారతీ కుష్కాణాం పరిపీడనం
నసహతే శాస్త్రిషుఖిన్నాత్మనామ్"

అన్న కాళిదాసోక్తి యీలాటి సందర్భాలకే అని సహృదయులెఱుఁగుదురు.

'తిరువారాధనము' యీపదం శ్రీవైష్ణవులు దేవతార్చనా పరంగా వాడతారు. (శ్రీశబ్దస్య తిరుశబ్దేన ద్రావిడానాం వ్యవహారః) ఇందులో తిరుఅన్నది, అఱవం. ఆరాధనం సంస్కృతం. అన్యదేశ్యాలు తెలుఁగులో చేర్చుకోవడానికి క్వాచిత్కంగా శాస్త్రజ్ఞులసమ్మతికనక, తిరుపదం తెలుఁగే అయిందనుకుందాం. మిశ్రసమాసం (కటికచీఁకటిదిండి కరములు చూ) చేస్తే— తిరు—ఆరాధనం తిరారాధనం అని (ఉకారసంధి) కావాలి. యణా దేశసంధి చేదామంటే తిరుశబ్దం సంస్కృతం కాదుకదా: కాకపోయినా కొన్నిసంజ్ఞావాచకాలలో కవులు పోయినమార్గాన్నిబట్టి సాహసించి చేస్తే రాముఁడు + అతఁడు. రాముఁద్వతఁడు కావలసివస్తుంది అని సహృదయులు శంకించరుగాని శంక కవకాశంమాత్రం లేకపోదు. యింత గందరగోళమెందుకు ? అది తిరుశబ్దం కాదు. తిరువుశబ్దమే అంటేనో ? శ్రీ వైష్ణవులు సర్వత్రా దీన్ని తిరునక్షత్రం, తిరుమణి, తిరుచూర్ణం అని వుకారవిరహితంగానే వాడుతూన్నారు. గాని యిక్కడ తప్ప వుకారసహితంగా వాడడంలేదు. అందుచేత యీప్రయోగం సాధింపఁబడదు. శ్రీవైష్ణ

వశిష్టులు ఆయీ తిరుశబ్దాన్ని హల్పరత్వమందు వువర్ణవిరహితంగానూ అచ్పరత్వమందు వుకారసహితంగానూ వాడడం మఱికొన్ని శబ్దాలవల్ల (తిరువంజనం తిరువనంతపురం వగయిరా చూ) గోచరిస్తూంది. గనక అఱవభాషా వ్యాకరణంలో యేదేనా ఆధారంవుంటే వుండవచ్చు. అట్టి ఆధారం దొరకేలోఁగా శిష్టవ్యవహారమే దీనికి గతియని నావిజ్ఞప్తి. ఆయీ తిరువారాధనతోపాటు తోమాలియఁకూడా యితఁడు వాడివున్నాఁడు. యెంతో వ్యాకరణం వుండి కాపాడఁబడుతూన్న సంస్కృతభాషలోనే అనఫా సునఫా ద్రేక్కాణ హోరలోనైన యితరభాషాపదాలు వచ్చి స్థానం యేర్పఱచుకున్నప్పుడు యేపత్రిభుత్వం (యిందులోహోరాశబ్దం సంస్కృతపదం గానే కొందఱు సమర్థించారు, అహోరాత్రశబ్దం ఆద్యంతశూన్యమై హోరగా మారిందఁట!) వచ్చినప్పుడు దానికి దాసోహంగా వర్తించే తెలుగుభాష లెక్కేమిటి?

"అన్యదేశ్యాలను నాంధ్రభాషఁ గల వౌటను.... మేము కబ్బాలను వాడుచుంటిమి" (పాణిగృ—చూ) ఒకరి యింటిపేరు నడిమింటివారు. దాన్ని సంస్కృ భాషలోకి మార్చవలసివస్తే మధ్యమందిరంవారు అనవలసివస్తుంది. అలాగే రైలుబండిని గూర్చి కవిత్వంలో వాడడానికి మనభాషలో ధూమశకట పదాన్ని సృష్టిచేశారు కొందఱుబుద్ధిమంతులు; యీబాధకన్న ఆభాషలోవాడే పదమే వాడుకుంటే బాగుంటుందని నాతలపు. (పరదేశసంచారకరణమ్మునకు రైలు చూ) 'శబరీకబరీనిబరీసవీలిమల్' యీరీతి రచనావైచిత్ర్యం యీ మహాకవి కవిత్వంలో తఱచుగా వుండడంచేతనే "పాండురంగవిభుని పదగుంభనంబు" అని కాకమానిమూర్తి యితణ్ణి గూర్చి తన పాంచాలీపరిణయంలో వుటంకించి వున్నాడు. ఆయీపద్యమునుగూర్చిన వుక్కిటిపురాణం వొకటి లోకంలో శ్రుతమవుతూవుంది. కాని ఆపురాణం విశ్వసించవలసివస్తే వసుచరిత్రకవిన్నీ యితఁడున్నూ యేకకాలీనులుగా వుండాలి. వీరు సమకాలీనులు కారని చరిత్రపరిశోధకులు చెపుతారు. కొన్ని కథలూ, పద్యాలూ యేక కాలీనులని ధ్రువపరుస్తూన్నా

యి. బాణభవభూతులు యేకకాలమందున్నట్టు కొన్ని శ్లోకాలు. "నిశ్వాసోఽపి ననిర్యాతి బాణేహృదయవర్తిని, కిం పునఃప్రకటాటోపపదబద్ధా సరస్వతీ" మొదలైనవి సాక్ష్యమిస్తాయి. కాళిదాసున్నూ భవభూతిన్నీ యేకకాలమందున్నట్లు "అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితిం" అనేశ్లోకంకంఠరవేణా చెపుతుంది. భోజకాళిదాసు లేకకాలీనులని యెన్నో యితిహాసాలు శ్లోకాలూ కనపడతాయి. విక్రమార్క-కాళిదాసులు యేకకాలం వాళ్ళని యిటీవల నిన్న మొన్న చరిత్రపరిశోధకులు చెప్పేవఱకూ యెవరూ యెఱిఁగి నట్లేలేదు. ఆఖరికి కాళిదాసు లిద్దఱంటేనే కాని కాపరం తుదనెగ్గింది కాదు. యీ మాటవల్ల రఘువంశాదులలో యెవరు దేన్ని రచించారనే ప్రశ్న బయలు దేఱింది. యేదో విధంగా పంపకం చేస్తున్నారు. ఆపంపకంమీఁద కొన్ని శంకలున్నాయి. అల మతివిస్తరేణ. చరిత్రపరిశోధకులు చేసేపని పెట్టుకుంటే వ్యాసం తేలదు. ఆగీతపద్యానికి సంబంధించిన ముత్యాల హారంవగయిరాలకు సంబంధించి వక గాథ పుక్కిటిపురాణంగానే భావిద్దాం. అలా వొప్పుకోవడమే సమంజసం. "లెక్కయెఱుంగరాదు లవలేశము" యీ "లవలేశ" ప్రయోగము ఋషులు యిటీవల మహాకవులు వాడి వున్నదే అయినను కొందఱు శంకిస్తూన్నారు. అతి స్వల్పము అనే అర్థంలో యిది లోకవ్యవహారంలో ఆబాలగోపాలంగా వాడతారు. అట్టి వ్యవహారం రావడానికి కారణం ఋష్యాదుల ప్రయోగాలే కారణమని నేననుకుంటాను; వాల్మీకం చదివితే యెన్నో వ్యావహారికాలు అనఁగా? పండితులువాడుకొనేవి (యదర్థోయం ప్రయాసః, వగయిరాలు) దానిలో కనపడతాయి. బుద్ధిమాత్రం పరిశీలకతాతాత్పర్యంకలదిగా వుండాలి. "తల్లేశ లేశలేశాంశ లేశలేశలవాంశకం" అని దేవీభాగవతం. "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్యచ" అని యేదో వుపనిషత్తు. ఆ యీప్రయోగాలముందఱ రామలింగం లవలేశ ప్రయోగం వుప్పూ వూరగాయా కూడా కాదు, కావున నచ శంకానచోత్తరం. 'అంఘ్రిమూల మధివసించి' యీ వాక్యంలోవున్న అంఘ్రిమూలము, ప్రథమావిభక్తి;

దీనికి సప్తమ్యర్థము చెప్పితీరాలి. అప్పుడు అంఘ్రిమూలమందు అధి వసించి అని అర్థం వస్తుంది. యీలాటి అర్థం చెప్పడానికి శాస్త్రాధారం వుందా ? అంటే వినండి అధివసించుఅనేది తత్సమక్రియ. అధిపూర్వక వసధాతువునుండి పుట్టింది. సంస్కృతభాషలో (ఉపాన్వధ్యాంగ్వసః) అధిపూర్వక వసధాతువు ప్రయోగించినప్పుడు ఆధారానికి కర్మత్వంవచ్చి "కర్మణి ద్వితీయా" అనే సూత్రంచేత ద్వితీయ వస్తుంది (అనుక్తమన్య తో గ్రాహ్యం) తెలుఁగులో ద్వితీయకు ప్రథమ వచ్చేచోట్లు చాలా వున్నా యి. (వన మేగెను రథమెక్కెను వగయిరా చూ) యీ అంఘ్రిమూలం వాట్లలో చేరేదే కనక ప్రథమవచ్చిందని తెల్విడి.

"తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుబెకాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్మ హెచ్చు"
(పాణీగృహీత చూ)

మాతృభాష కనక తెలుఁగు దీనిలో కవిత్వం చెప్పడం పూర్వజన్మ వాసనవల్ల యేమాత్రమో ధార కలిగితే చెప్పవచ్చు. కాని వ్యాఖ్యానం చేయడం అట్టిది కాదు. దానికి పాండిత్యంవుండి తీరాలి. కవికి శాస్త్ర జ్ఞానంకంటే కూడా అనేకరెట్లు ప్రయోగజ్ఞానమే ఆవశ్యకం. తప్పో ! పొప్పో ! తనకన్న పూర్వులు వాడినప్రయోగాన్ని చూపితే ఆక్షేపకులు మాఱుమాట చెప్పరు. కొందఱో ? ఆపూర్వకవి ప్రయోగం సరియైనది కాదని వాదిస్తారు. కాని అలావాదించడం సకృత్తు—

పూర్వకవి ప్రయోగదక్షుఁడు కవి యనఁబరఁగున్ అంటూ(యీయన ధార చాలామంచిది) వొకాయన నాచిన్నతనంలో యేవిధమైన పాండి త్యమూ లేకుండానే కవిత్వం చెప్పి మాపరమగురువులు బ్రహ్మయ్య శాస్త్రిలవారికి వినిపిస్తూ వుండేవాఁడు, కిర్లంపూడిప్రాంతంలో ఏల, అని వొక చిన్న సెలయేఱు వుంది. ఆకవి దాన్ని వర్ణిస్తూ "శుద్ధసురన్నది రుద్రరూపమై" అని ప్రయోగించేటప్పటికి నే నడిగానుగదా ! సురన్నది యేలా అవుతుందని అడిగాను. దానిమీఁద ఆయన తడుముకోకుండానే

శరన్నది అని వుందా ? లేదా ? దానిలాగే యిదీన్నీ అన్నారు. చెప్పే దేమిటంటే ? కవికి ప్రయోగజ్ఞానంవుంటే చాలవఱకు కొట్టుకుపోవచ్చు ననియ్యేవే. శరన్నదికీ, సురన్నదికీ భేదంవుంటే వుండుఁగాక. సామాన్యు లకు ఆభేదం గోచరించదుకదా; (అస్మాకూణాం తార్కికేషాం అర్థ ర్యేవ శక్తిః నతుశబ్దరి ) "కంబుబిబ్బోకావహంబును క్రముకతరు కమనీయం బును, కోమలాంశు మత్ఫలాముకుళ మోహనంబునగు కంధరాభోగంబు " ఆయీవచనములో ఆపాదమస్తకముగా స్త్రీవర్ణన వుంది. ఇతరకవుల స్త్రీవర్ణనకంటె యితనివర్ణనలో వున్నవిశేషాన్ని లోఁగడ సూచించే వున్నాను. ఒక్కొక్క అవయవానికి వున్న వుపమానపదార్థాలన్నీ యేకరు పెట్టడమే విశేషం. యితఁ డేగ్రంథాలలో చూచాఁడోకాని కొన్ని క్రొత్త వుపమానాలు వాడివున్నాఁడు. లోఁగడ గమనానికి నెమలిని వుపమిం చాఁడు. యిప్పుడో ? కంఠానికి, శంఖమూ పోకచెట్టూకాక అరఁటిపువ్వు క్రొత్తగా చేర్చుకున్నాఁడు. ఇంతే కాదు. ఉత్తరోష్ఠవర్ణనలోకూడా క్రొత్తపోకడ కనబడుతుంది. ఒకచోటేమిటి? చాలాచోట్ల యీవచనంలో క్రొత్తపోకడ లున్నాయి. యీవచనం వల్లించుకొనివుంటే కవికి అవసర మైనప్పుడు మూలధనంలాగు వుపకరిస్తుంది. స్త్రీవర్ణనలోమాత్రమే కాదు యేవర్ణనలోనూ యితఁడు క్రొత్తత్రోవలోనే లేఖినిని నడిపించాడు. వరసగా ఆపాదమస్తకంగా వసుచరిత్ర స్త్రీవర్ణన చేసింది. నైషధంలో శ్రీహర్షుఁడు అదేమార్గంగా వర్ణించాఁడు, కాళిదాసు ఆయా అవస్థలనుబట్టి వర్ణిస్తూ వచ్చాడు. యితనిమార్గం కాళిదాసు మార్గానికి దగ్గఱగానే వుంటుంది. కాని యేవర్ణన చేసినా యితనివర్ణనలు వాక్కభగవంతునికి సంబంధించినవిన్నీ సముద్రానికి సంబంధించినవి మఱికొన్నీ తప్ప చాలా భాగం కూరగాయలకు సంబంధించినవే అవడంచేత చదువరులమనస్సు వాట్లమీఁదకి అంతగా పోదు. ఆవర్ణన ప్రధానపాత్రకు సంబంధించినదిగా వుంటే యీదోషం తగిలేది కాదు. యిప్పుడో ? " సానక్రిందవన్నె దాని వన్నె " అన్నట్టుగా వుండవలసి వచ్చింది.

యితఁడు పూర్వకవుల యేర్పాటు చొప్పున యేదో ప్రసక్తి కల్పించి యించుమించు అష్టాదశవర్ణనలూ కనపరిచాఁడు, ప్రతిఆశ్వాసంలోనూ భగవంతునికి సంబంధంవుండేటట్టు చేశాఁడు. విష్ణుభక్తులందఱూ దీన్ని పఠించి కృతార్థు లవుదురుగాక అనే తాత్పర్యంతో యీగ్రంథాన్ని యితఁడు వ్రాసివున్నాఁడు గాని, ఆభాగ్యం బమ్మెరపోతరాజుగారి కొక్కరికే తెలుఁగు కవులలో పట్టిందిగాని యితరమహాకవు లెవ్వరికీ పట్టనప్పు డితనికి మాత్రం యేలా పడుతుంది? యితఁడు భగవంతునివర్ణన చాలాబాగా చేసినా యేక విన్నీ ఆ పద్యాలలో వొకటికూడా కంఠోపాఠం చేసి పారాయణ చేయు చున్నట్లులేదు. యీతనికవిత్వం చాలభాగం నారికేళపాకంగా వుండడంచేత సంస్కృతాంధ్రాలలో నిశితమైన సాహిత్యం కలవారికేకాని కొఱుకఁబడదు. వసుచరిత్ర శ్లేషమయమైనా దీనికన్న దానిప్రచారం లోకంలో యెక్కువ. ఆముక్తమాల్యదనూ దీన్నీ వొకతరగతిలో చేర్చవలసివుంటుంది. పూర్వ కాలంలోనేకాదు. యీకాలంలోనే కాదు, తేలికగా కవిత్వం చెప్పడంకంటే కఠినంగా కవిత్వం చెప్పడమే గొప్ప అనేభావం చాలామందికి వుండడం కనపడుతుంది. కాళిదాసుకవిత్వకంటె నైషధం యెక్కువ బాగుంటుందనే వారు పలువురు కలరు. మనుచరిత్రకంటె వసుచరిత్రను గూర్చిన్నీ డిటో. దీనికి వ్యతిరేకభావం కలవారు విద్వాంసులలో చాలాతక్కువ. విద్వాంసులలో యేకొలఁదిమందికో తప్ప కవితారసవేత్తృత్వ ముండదు. విద్వత్తవేఱు, రసజ్ఞతవేఱు, విజయవిలాసం రచించిన చేమకూరకవికవిత్వంలో చాలా పోకడలు యితనిని వొజ్జబంతిగా పెట్టుకొన్నట్లు పరిశీలించే వ్యాఖ్యాతలకు పొడకడతాయి.

(1) "నలి నాస న్నలినాననానవపురాణ"

(2) నలువ గురాలన్.... నలువగు రాలన్

(3) మీరందంద నరుగ నరుఁ గానరుగా ?

(విజయవిలాసం చూ)

శబ్దములమైత్రికే కాదు అర్థసందర్భంలో కూడ చేమకూర రామ లింగాన్ని అనుకరిస్తాడు.

"మొత్తో యనంగ లింగమ్ముఁగట్టు" యీవాక్యం రాయల ఆముక్తమాల్యదలో—

"ఓడితేనియు వద్దు మొత్తోయనంగ
లింగమును గట్టకుడుగ మెఱింగి నుడువు"

అనే పద్యాన్ని చూచినాఁడేమో అనే సందేహాన్ని కల్గిస్తుంది కాని, ఆకాలంలో శైవ వైష్ణవమతాలకు వుండే వాదోపవాదాలలో వారు వోడితే వీరి మతచిహ్నాలు వారు ధరించి మతంలో కలియడం, వీరు వోడితే వారి మతచిహ్నాలు ధరించి మతంలో కలియడం ఆలా కలియడానికి వొప్పుకోకపోతే బలవంతంగా ఆయాత ప్తముద్రిలు వేసి కలపడమూ వుండడంచేత పైవాక్యం లోకోక్తిగా వుండడంచేత వుభయులున్నూ లోకం వల్లనే గ్రిహించి వుంటారనుకున్నా అనుకోవచ్చు. ఉపమలూ న్యాయాలూ లోకోక్తులూ వొకరిసొత్తు గావు. కనక యింత మాత్రించేత గ్రింధ చౌర్యదోషాన్ని ఆపాదించడం సహృదయ సమ్మతం కాదు. పువ్వుల కంపులు ఆయీమాటకు పరిమళం అని అర్ధం. గ్రాంధికంగా చెప్ప డంలో చిక్కులేదు. గాని వ్యావహారికభాషలో మాత్రిం కంపు కొడుతూ వుంది. అంటే చెడువాసన (దుర్వాసన) అనే అర్థమే కాని సువాసన అనే అర్ధం రాదు. వ్యావహారికానికి వున్న బలీయస్త్వాన్ని లోఁగడ వివరించే వున్నాను. కనక విస్తరించేదిలేదు. నన్నయగారి "మఱవకనుష్ఠించు" వగై రాలతోపాటు దీన్ని గ్రాంధికంగా సమర్థించుకోవలసిందే. నన్నయగారి అనుష్ఠించు ప్రియోగం సహృదయత్వం వదులుకొని వ్యాఖ్యానిస్తే దాని వెనుకవున్న "యెఱిఁగినదానిని మఱవక" అనే వాక్యం తోడుపడి, కామ శాస్త్రంలోవున్న "పగలు దాఁజూడని పద్మగంధి" దాఁకా యీడ్చుకుపో తుంది. అల మతి విస్తరేణ. ఆయీమార్గంగా విమర్శించడం అప్రాజ్ఞలక్ష ణం అని తెల్పడానికే యీకాస్తా వ్రాశానని తెల్విడి. గ్రాంధికంకన్న వ్యావహారికానికి బలం యెక్కువ అనే అంశం కవి మఱవకూడదు. "లికుచకుచా" అనఁగా! నిమ్మపండ్లవంటి పాలిండ్లుకల వోసుశీలా?

అని అవయవార్థం ఇది పాండురంగవిఠ్ఠలుఁడు పరమభక్తురాలున్నూ పతివ్రితయున్నూ అయిన శ్రీ వైష్ణవినిగూర్చి చేసిన సంబోధన విష్ణుపదవలగ్న! తరుణి మొదలైన సంబోధనలు ఆయాఘట్టమందున్నాయి. కాని అవియింతగా శంకించ తగ్గవికావు. భారతంలో నన్నయ్యగారి 'పయోరుహాననా' అనే దానికంటేనున్నూ యెఱ్ఱనగారి "తనులతాంగి" సంబోధనకంటేనున్నూ యిది మఱికొంత పచ్చిగా వున్న మాట సత్యం. అయితే యీ మాత్రం ఆక్షేపణ రామలింగం కనిపెట్టలేని వాడనియెవరనుకుంటారు? ఆయాస్థలాలన్నీ యూఁక వుమ్మడిగా స్త్రీపరం చేసుకొని సమన్వయించుకోవలసినవే కాని అవయవార్థాలు తీసి స్తనశల్యపరీక్షకు వుపక్రమించవలసినవి కావని చాలాకాలంనాఁడు యేపాశుపతంలోనో వ్రాసే వుంటాను. ప్రసక్తి కలగడంచేత వుటంకించినందుకు సహృదయులు మన్నింతురుగాక! వాల్మీకి సుందరకాండలో ఆంజనేయులు సీతతో సంభాషించేఘట్టంలో వాడిన సంబోధనలు చూస్తే యివేవీ ఆక్షేపణీయాలుగా తోఁచనే తోఁచవు. నన్నయాదుల కందఱికీ ఆఋషి మార్గదర్శి "మధుమయఫణితీనాం మార్గదర్శీ" "భువిఁగవితాకన్యఁ బుట్టించె నెవ్వాఁడు" కొంచెకొంచెం రామలింగంకవిత్వంలో వున్న విశేషాలు యెత్తిచూపడ మయింది. పాండిత్యం తక్కువయినకొద్దీ శంక లెక్కువగా పుట్టుకువస్తాయి. 'కశ్చిత్కాంతా' అనే టప్పటికే శంకించడం తొందరపాటుపండితులవైఖరికి గుఱుతు. మొదట వున్న 'కశ్చిత్' అనంతరమే వున్న కాంతా అనేదానికి విశేషణం కావాలిగదా అపక్షంలో కాచిత్కాంతా, అని వుండాలి - కశ్చిత్కాంతా అవి ప్రయోగించడం కాళిదాసు ప్రమాదంకాదా? అని శంకించేవారి తాత్పర్యం. యెవరినేనా శంకించేటప్పుడు వారిశక్తి సామర్థ్యాలు తెలుసుకొని మఱీ శంకించుకోవాలి గాని తోచినట్లల్లా శంకించరాదు. ఈమర్యాదను అతిక్రమించి ప్రిగడరాజు నరసరాజుగారనే కవివరుఁడు వెఱ్ఱిమొఱ్ఱి శంకలు చేయడానికి మొదలు పెట్టేటప్పటికి ఆయన్ని "తెలియనివన్ని తప్పులని దిట్టతనాన" అనే పద్యం ద్వారా వారించినట్లు వ్యాసారంభంలో వ్రాశాను.

రామలింగకవి విశ్వబ్రాహ్మడా? లేక కేవలబ్రాహ్మఁడా? అనే అంశం లోఁగడ స్పృశించి విడిచాను. శుక్లయజుశ్శాఖా బ్రాహ్మణుఁడని నిశ్చయమేకాని అందులో వైదికనియోగి శాఖలు రెండూ వున్నాయి. యితఁడు "సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ" అనిమాత్రమే గద్యలో వ్రాసుకోవడంచేత ఆశుక్లయజుశ్శాఖా బ్రాహ్మణులలో రామకృష్ణకవి వైదికుఁడని తోస్తూవుంది. విశ్వబ్రాహ్మణులు తమవాఁడని చెప్పుకోవడానికి యీశుక్లయజుస్సు బాధకమవుతుంది. విశ్వబ్రాహ్మణులలో శుక్లయజుశ్శాఖవున్నదా? ఆర్వేలవారికిన్నీ వైదికులకిన్నీ యిచ్చి పుచ్చుకోవడం (పూర్వం) లేదు గాని శుక్లయజుశ్శాఖవారికి ఆయీసంబంధం వుంది. ఇఁకనల్లా జీవనార్థం వైదికులు పౌరోహిత్యాది వృత్తులు అవలంబించడమున్నూ నియోగులు కరణీకం వగయిరా వృత్తులు అవలంబించడమున్నూ ఋంతే భేదం. అమాత్యబిరుదం ఆర్వేలవారిలోవలె ప్రథమశాఖవారికి లేదని తోస్తుంది. వుండే పక్షంలో యితఁడు వ్రాసుకోకపోవడంచేత— అనే వూహ సరియైనదే కావచ్చును. యీచర్చ కాకదంతపరీక్ష వంటిదే అయినా యిప్పటి చరిత్రకారులు దీన్ని చాలా ముఖ్యమైనదాన్నిగా గణించడంచేత స్పృశించి విడిచాను. కృతిపతి యించుమించు వీరవైష్ణవుఁడు కృతికర్తకూడా యించుమించు తాదృశుఁడే అయినా కృతిపతిని దక్షజిద్విభవా లోనైనవిశేషణాలతో సంబోధించడం వల్ల యితనికి వైష్ణవమతాచార్యులకువలె గాని కొందఱు వైష్ణవపండితులకుంబలెఁ గాని శివద్వేషం లేశమూకూడా లేదని తెలుసుకోవచ్చు. పన్నిద్దాళ్ళవారే కాదు తత్తుల్యులు మఱికొందఱు మహామహులే కాదు శ్రీమహావిష్ణువును స్తుతిచేస్తూ యేదో ప్రసక్తి కల్పించి శివనింద చేస్తారు.

శ్లో. శంభో రంభోరుహముఖ? సఖాసన్ సహాంక శ్శశాంకః
కుర్వన్ సేవాం వరదవికలో వృత్తిహీన స్సువకిః
త్వత్పాదాబ్జే ప్రియమఖ; నఖచ్ఛద్మనా శ్రిత్య నిత్యం
పస్ఫుత్తోఽభూ త్సతు శతగుణం పుష్కలో నిష్కళంకః"

దీనిముఖ్యతాత్పర్యం శివుణ్ణి సేవించడం శ్రేయస్కరంకాదనిన్నీ ప్రత్యుత అపకారమనిన్నీ ఆకారణంచేత అది వర్జింపవలసిందనిన్నీ. రామలింగంరచనలో ప్రాముఖ్యం విష్ణువుకిచ్చినా శివదూషణ యెంత పరిశీలించినా కనపడదు. ఆయీ సందర్భాన్ని బట్టి చూస్తే రామలింగం "తథాఽపి భక్తి స్తరుణేందు శేఖరే" అన్న అప్పయ్య దీక్షితులవారివంటివాఁడని చెప్పడానికి సందేహంలేదు. విష్ణుపారమ్యాన్ని చెప్పే గ్రంథమయినప్పుడు తదనుగుణంగా వుండడం యెప్పుడూ తప్పదు. పురాణకర్తలైన ఋషులు కూడా యింతగడుస్తనంగా యీవిషయంలో వర్తించనే లేదేమో అనిపిస్తుంది యితనిపారమ్యసమర్థనం చూస్తేను. ఇతఁడు శివునియెడ మిక్కిలీ భక్తుఁడు ఇతఁడు వాడిన కొన్నిశబ్దాలకు శబ్దరత్నాకరం చూస్తే అర్థమైతే వ్రాసి వుందిగాని దాని అవయవార్థం సరిపడుటలేదు. ఏకకుండల అనేపదానికి బలరాముఁడు అని టిప్పణిలో వ్రాయఁబడి వుండి. అక్కడ ప్రకరణాన్నిపట్టి అది సరిగానే వున్నా అవయవార్థం ఏకం, కుండలం, యస్య అని చెప్పుకుంటే అది నేతిబీరకాయ మాదిరిగా కనపడింది శబ్దరత్నాకరానువాదం. శబ్దార్థచంద్రికను చూస్తే బలరాముఁడు కుబేరుఁడు అని అర్థద్వయం వ్రాయఁబడివుంది. యిద్దఱిలో వొకరికీ యీఅవయవార్థం సరిపోవడంలేదు. కాని ఆయీ కోశం యేసంస్కృత కోశాన్నో అనుసరించి పుట్టిందే (తత్సమపదాలు తెలుఁగులో వాడినా గతి వాట్లకు సంస్కృతనిఘంటువులేకదా) కనక అప్రమాణంమాత్రం కాదు. యేవో యీలాటివి కొన్నిపదాల అర్థమున్నూ యేవో కొన్ని పద్యాల అర్థమున్నూ నాకు గోచరించకపోయినా మునుపటివలె కాక యీసారి చదవడంలో కొంతకథానుక్రమణిక కూడా బాగా అవగత మయింది. పట్టుమని పరిశీలిస్తే కథాంశం దీనిలో చాలా తక్కువ. కాని అతుకులు చాలా వున్నాయి. స్వల్పమైనకథను పుచ్చుకొని వసుచరిత్రమాదిరిని పెంపుచేసినట్లున్నూ లేదు. వర్ణనాదులలో వాడినంత మాఱుమూలపదాలు కథతో మఱొకథకూ అతికేచోటకూడా యితఁడు వాడతాఁడు. కథలో భక్తిజ్ఞాన

వైరాగ్యాలు తప్ప యితరం లేకపోయినా సర్వరస బంధురంగా దీన్ని నిర్వహించిన యీమహాకవిని యెంత స్తుతించినా అది స్తుతి అనిపించు కోదు. తనివిన్నీతీరదు దీనికి సమగ్రమైన వ్యాఖ్యానం వుంటే బాగుండేది. ఆభాగ్యంపట్టిందికాదు. యేస్వల్పానికో అర్థం బోధించకపోతే మునిగిం దేమిటని యెవరేనా విజ్ఞులు ఆభాగం వదలి తక్కినదానికేనా వ్రాస్తే బాగుండేది. నాకు యుక్తకాలం గతించాక యీబుద్ధిపుట్టింది. వార్ధకే తీర్థయాత్ర. యితనిసమకాలీనుల గ్రంథాలలో వాడనిభాష పూర్వులున్నూ వాడనిభాష యితని కెక్కడినుండి వచ్చిందో అనిపిస్తుంది కొన్ని పదాలు చూస్తేను. సమగ్రంగా గురుముఖతః దీన్ని చదువుకుంటే తెలుఁగు విద్యార్థికి యేపుస్తకమూ తెలుఁగులో అడ్డదు. యితని శ్లేష చాలా చమ త్కారంగా వుంటుంది. మచ్చు చూపి దీన్ని ముగిస్తాను—

కారుచిచ్చను భృగురాము కారణమునఁ
బెటిలి నిర్వంశమైన భూభృత్కులంబు
క్షేత్రముల వంశవృద్ధి రాజిల్లె మఱియు
జలధరోదయవిప్ర ప్రసాదలబ్ధి

ఆయీపద్యంవల్ల ప్రధానాంశం వేసవికాలంలో దవాగ్నిచేత తగులఁబడి నశించిన వెదురుడొంకలు మళ్లా వర్షాకాలం రావడం తోడనే అంకురించి వృద్ధిపొందుతూవున్నవి అనేది. యిందులో యెంతో ధ్వన్యర్థం పురాణప్ర సిద్ధమయినది స్ఫురిస్తూ వుంది. ఆయీధ్వన్యర్థం పురాణప్రసిద్ధమయినప్ప టికీ కృతిపతి క్షత్రియవంశ్యుడైనచో కవిని ద్వేషించునేమో ? అని తోఁ చెడిని. భట్టుమూర్తి వసుచరిత్రలో శా. "మాయాశీలురుచంచలాత్ములు" అనే పద్యంలో కృతినాయకుని మనస్సునొచ్చే అంశం (మహావైభవశ్రీ యోగాంధులు) లేకపోలేదు గాని అది దీనివంటిదికాదు. యిది అంతః పురందాఁకా దేకుతూవుంది. వున్నమాటే అయిననూ రామలింగం పద్యంలో వున్న ధ్వని ధ్వనితో సరిపోలేదు. వాచ్యమే. మర్మస్పృక్కుగా కనపడు తూంది. భట్టుమూర్తి భయపడుతూ అంటఁగాల్చినట్టు కనపడుతుంది.

రామలింగం నిర్భయంగా ప్రవర్తించినట్లు పొడకడుతుంది. భట్టుమూర్తి చందోప్రిపాలం భనలోకూడా రాజును కొంత మంద లించాడు. "రాజీ వాజిల నేచుపాతకివి చంద్రా! రాజవా? నీవు....రాజౌట దోషార్థమే" అన్న పద్యం పై సంగతిని తెల్పుతుంది. యేమైనా భట్టుమూర్తిపాకంకంటె రామలింగం పాకం కొంత మోటు. యీమాట సర్వత్రా సంఘటించవల సిందే, కృష్ణరాయలపాకానికీ మనరామలింగం పాకానికీ చాలా చోట్ల పోలిక కనపడుతుంది. దాన్నిగూర్చి ప్రత్యేకించి వ్రాయాలిగాని ప్రస్తుతం చోటుచాలదు. నన్నయ్యభట్టుమాదిరి సంస్కృతసమాసగ్రథనం తెలుఁగు కవులలో అలవడినవారు లేరు పెద్దన్నగారు కొంత ఆమార్గంలో లేఖిని నడిపి నట్లు తోస్తుంది. రామలింగంకూడా నడుపుతాడు. చ. తటపుట బిల్వభూరుహా వితానలతానవ పుష్ప నిష్పత జ్జటిల మధూళిధూళిభవ సౌరభమౌర; భ్రమింపజొచ్చె" ఇది రామలింగంగారి సమాసధోరణి. "భారతభారతీశు భగభస్థి...."ఇది నన్నయభట్టుగారిది. యేవో వొకటి రెండుపద్యాలయితే యెవరేనా ప్రయత్నించి కట్టవచ్చుననుకుందాం. సమాసమంటూ మొదలె డితే భట్టుమూర్తిధార యీలాగే నడుస్తుంది. రామలింగానికీ అంతే. వసు చరిత్రలోమాత్రం "నిన్నటిమాపు మాపురమణీ రమణీయ సభావిభాగభా గున్నతరత్నపీఠి...." వగయిరా పద్యాలు లేవా? అంటారేమో? వున్నాయి. యెఱుగుదును. ఈధోరణికీ ఆధోరణికీ కొంత భేదం వుంది, అది వారి వారికి గోచరించ వలసిందేకాని యితరులు తెల్పలేరు. "కవితా చమత్కార గౌరవంబు మన నెఱుంగునుగాక యెవ్వరితరంబు" అన్నారు. మాముత్తాత నరసకవిగారు, రామలింగానికి సంస్కృతధారలో శబ్దాలంకారం అప్రయ త్నంగాపడ్డట్లు తెలుఁగులోనూ దొర్లుతుంది. "అర్థా శ్శబ్దచయా స్సదాహ మహ-మిత్యగేప్రిస్ఫురంతి" అన్నాఁడు కుట్టికవి. "తెలచిన మొలచిన కృప కుంగలఁచిన మదితోడ" యీలాటి వెన్నో తెలుఁగురచనకు వుదాహరణాలు దొరుకుతవి. యితణ్ణి వికటకవిగా జనపరంపర చెప్పుకోవడం కలదు. గ్రంథంవల్ల చూస్తే పరమభాగవతోత్తముఁడుగా కనపడతాఁడు. ఆకథలకు

తలా తోఁకా వున్నట్లులేదు. "వరబింబాధరమున్ బయోధరములున్ వక్త్రాళిలకంబుల్...." అనే పద్యానికి సంబంధించినకథ కేవల కల్పితం. ఆ పద్యానికీ యితనికీ సంబంధమే లేదు. అయితే బాల్యదశలో కొంత "కొంటెపలలోనఁ గొంటెయున్ గావలె" అనుటకు లక్ష్యంగా వుండేవాఁడేమో? అంతమాత్రంచేత లోకంలో వున్న కొంటెపనులన్నీ యితనికే అంటకట్టడం న్యాయం కాదనియ్యేవే నేననుకుంటాను. కాళిదాసుకు సంబంధం లేనివెన్నో కాళిదాసుకు అంటకట్టడంకలదు. మాకు సంబంధింపనివెన్నో సంగతులు మాకు అంటకట్టడం అనుభూతం. రామలింగం మహాభక్తుఁడు.

(షరా) ఇంకా మఱికొన్ని వ్యాసాలుఁ కథలు - గాథలు తృతీయ భాగములో చదువుకోండి.

— గద్య —

ఇది శ్రీతిరుపతివేంకటేశ్వర కవిద్వితయములో నొకరును శతావధానులును నగు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిచే రచింపబడిన కథలు - గాథలు అను వ్యాసరచనల ద్వితీయభాగము — సమాప్తము.



# * ముఖ్యమైన సవరణలు *



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 51 | 21 | పావ | పాఠ |
| 105 | 2 | మవ | మను |
| 115 | 20 | కొాచెం | కొంచెం |
| 125 | 3 | కంరి | కరిం |
| 126 | 5 | వాక్భ | వాక్పు |
| 136 | 18 | నిర్భం | నిర్బం |
| 136 | 23 | తెయ | తెలియ |
| 149 | 25 | కీర్తిస్మ | కీర్తిరశ్మ |
| 151 | 5 | రేఖ | రేక |
| 163 | 5 | కార | కారి |
| 166 | 22 | వివేకివి | వివేకివివి |
| 194 | 10 | పడ్డవి | పడ్డది |
| 210 | 17 | కోశనా | కోశవానా |
| 216 | 20 | లవడం | లనడం |
| 236 | 11 | మృత్యు | మృతు |
| 305 | 19 | స్వశ్రే | శ్వశ్రే |
| 312 | 7 | పరంగా | పరంపరగా |
| 329 | 17 | ప్రాప్రిపత్య | పాపత్య |
| 341 | 22 | కుడ | కుచ |
| 344 | 5 | అనేశ | అనేకశ |
| 347 | 26 | మెడకు | మెదడు |
| 375 | 10 | వేసి | లేసి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 394 | 25 | శ్రిశ | స్త్రీశ |
| 404 | 21 | నమ | సమ |
| 404 | 21 | వుత్వా | మత్వా |
| 428 | 7 | అనేహి | అవేహి |
| 429 | 6 | నేని | కాని |
| 440 | 8 | లసిందే | వలసిందే |
| 448 | 7 | ఏతే | పతే |
| 448 | 10 | తీన | తీవ |
| 448 | 11 | లస్య | లస్వ |
| 451 | 9 | శ్మర | శ్వర |
| 550 | 9 | పారం | పాకం |
| 575 | 19 | ఉత్పన్న | ఉత్సన్న |
| 597 | 21 | సర్గా | స్వర్గా |
| 623 | 16 | పెట్టే | పట్టే |
| 639 | 10 | ఆసీతి | ఆసీతి |
| 666 | 19 | 15 | 5 |
| 700 | 12 | పేసు | నేసు |
| 704 | 21 | అని | ఉ - ని |
| 708 | 22 | వృర్ధి | వృద్ధి |
| 809 | 13 | ర్మహచ్చ | ర్మహమ్మచ |
| 839 | 16 | వాశ్ర్యప | వాశ్యప |
| 863 | 22 | ఉపకా | ఉకా |
| 867 | | పువర్ణ | పుసర్ణ |

